ఇఁక నాంధ్రనియతియందుఁ గవిత్రయేతరులగు పెక్కురు మహాకవుల ప్రయోగంబుల ననుస రించి ప్రస్తుతము దేశ్యములట్లు కన్పట్టు నితర భాషాపదములను గొండొక గ్రహించితిని. అట్లే విశ్రమ ప్రాసంబులందు రేఫశకట రేఫసాధర్మ్యంబును గూడ నిర్విశంకంబుగ నంగీకరించితిని.

ఇఁక నాకవనంబును గూర్చి నే నేమియు వ్రాయఁజాలను. సౌరభంబున్న రసజ్ఞులే యాస్వా దించి యానందింతురు. సహృదయాః ప్రమాణం.

ఇఁకను మా గురువులును గింకవీంద్రఘటాపంచాననాది బిరుదాంచితులునగు శ్రీ కవిచక్రవర్తులు బ్రహ్మశ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రులవారు శతావధానులు పుత్త్రోవా శిష్యోవా యనువచన ప్రకారము * నాయందలి శిష్య వాత్సల్యముచే నా యీ కృతినిఁ బరిశోధించుటకుఁ గాను ముందుగఁ దమకును నాకును నిష్టదైవమగు శ్రీవర దేవతనుగూర్చి.

మ. జననీ! శైవపురాణమొక్కరుఁడను ♦ వ్యాఖ్యాతృండు దెల్గించెదా
నని నేనిప్డు బరిష్కరింపవలయున్ ♦ నీదౌ కటాక్షావలో
కనముల్ లేక ఘటించునెట్టు లిదియు ♦ త్సాహంబు శాసించి మా
టనుదక్కింపు మతండు యోగ్యుఁడనఁగన్ ♦ దక్షుండు కామేశ్వరీ!,

అని స్తుతించి గ్రంథము నంతయు సమగ్రముగాఁ బ్రత్యక్షర శోధనముగా సవిమర్శముగా దిల కించి పరిష్కరించి గ్రంథమును నిర్దుష్టంబు నొనరించి నందులకు వారి యడుగుఁ దమ్ములకనేక ప్రేమ పూర్వకాభివందనంబుల సమర్పించుకొనుచున్నాఁడను.

మఱియు నాకవనములో నాకును శ్రీ మా శాస్త్రులవారికిఁ గూడ మఱుఁగై, కొన్ని దోసఁగులు మిగిలిన మిగులవచ్చునేమో అట్టివానిని సదయులును, గుణదోషగ్రహణ పారీణులు నగు పరిశీలకులు, నాకుఁ దెల్పిన పునర్ముద్రణమందు దిద్దికొనియెదను.

ఇఁకను బ్రాఁతపులు దిద్దికొనుటయందలి పొరపాట్లచేఁ బలుచోట్లఁ బరుషసరళవ్యత్యయంబు లును, నరసున్నల తబ్బిబ్బులును, రేఫశకటరేఫ వ్యత్యాసంబులును, విసంధులు, స్వరముల తాఱు మాఱులు మున్నగునవి పొసఁగినవి. పాఠకు లవ్వానిని అంటనివత్తులు, సున్నలేగాక, అక్షరంబులను మఱియు న స ప వ థ ధ ద ఢ మున్నగు నక్షరంబులను యథోచితంబుగ దిద్దికొన వేడికోలు.

---

* నేనొకప్పుడొక గొప్ప తెవులు ముప్పున గారింపఁబడి రాజకీయవైద్యాగారమందుండినప్పుడు శ్రీ శ్రీ శాస్త్రులవారాశీర్వదింపుచు నీ పద్యమును వ్రాసిపంపిరి. అమీఁద వెంటనే యారోగ్యమును బొందితిని.

చ. పరమశివాంఘ్రిభక్తున క ♦ పారకృపారస మూర్తియైన శం
కరుఁ డొగి నాగవీరయకు ♦ గాదిలి శిష్యునకాయువున్ నిరం
తరమగు సౌఖ్యమున్ సిరియు ♦ ధన్యత మాన్యత యిచ్చి వెంకటే
శ్వరుఁ డిడునాశిషంబునకు ♦ భవ్యయశంబు ఘటించుఁగావుతన్.

చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి.
శతావధాని.

క్షీరసాగరము బిల్డింగ్స్,
గవర్నరుపేట, బెజవాడ.

29—3—44

మఱియు భ్రమచేఁ గొన్ని పద్యములందు విశ్రమప్రాసంబులు లోపించినవి. అవ్వానిని మఱి కొన్ని మిక్కిలి యవసరంబులైన యచ్చుదోసఁగులను దప్పొప్పులపట్టికలోఁ జూపుచున్నాఁడ నవ్వాని నట్టులఁ సవరించికొని చదువుకొనఁ బ్రార్థన.

ఇఁక నొకమాట. అడుగుటతోడనే పీఠికను వ్రాయుట కంగీకరించి ఛాత్రమును బంపినమీఁద దయతో నానుపూర్విగఁ గృతి నంతయుఁ జదివి సవిమర్శముగాఁ బీఠికను వ్రాసిపంపిన యుదారచరిత్రులు, విద్వత్కవివతంసులు శ్రీరాజా రంగాప్పారాయకళాశాలా ప్రధానాంధ్రోపాధ్యాయులును, కవిసమ్రాట్టులు నగు బ్రహ్మశ్రీ విశ్వనాథ సత్యనారాయణ ఎమ్. ఏ. గారికిని, శివపురాణ రచనా కాలంబునందే కొన్ని భాగంబులను విని యానందించి, పరిష్కరించి యద్దాని పరిపూర్తిమీఁదఁ దామొక పీఠికను వ్రాసియిచ్చెదమని పిదప గ్రంథముఁ బంపినంత సాకల్యంబుగఁ జదివి వాత్సల్యముతోఁ బీఠికను వ్రాసిపంపిన విద్వద్వర్యులును, మదనపల్లి థియసాఫికల్ కళాశాలాప్రధానాంధ్రోపాధ్యాయులును, వైయాకరణశిరోమణులు నగు బ్రహ్మశ్రీ తూములూరి శివరామకృష్ణశాస్త్రులవారికిని శాశ్వతము త్రికరణపూర్వకముగఁ గృతజ్ఞతాభివందనంబుల సమర్పించుకొందును. మఱియు గ్రంథముద్రణమునకై విస్తారధనము లిచ్చి యచ్చొత్తించిన శ్రీసిధుల కిత్తోధిక శ్రేయోభాగ్యంబులిచ్చుటకుఁ బరమేశ్వరునిఁ బ్రార్థించుచుఁ బాఠకమహాశయుల నిఁక శివపురాణపఠన భాగ్యపదవిం బ్రవేశపెట్టుచు నింతతో నీయుపోద్ఘాతంబును ముగించుచున్నాఁడను.

ఇట్లు

బుధజనవిధేయుఁడు,

**ముదిగొండ నాగవీరయ్య శాస్త్రి,**

సికింద్రాబాద్ (దక్కన్.)



# విషయసూచిక

—:o:—

## సృష్టిఖండము



## సతీఖండము

ద్వితీయాశ్వాసము



తృతీయాశ్వాసము

## పంచమాశ్వాసము



## ద్వితీయాశ్వాసము

## యుద్ధ ఖండము

### ప్రథమాశ్వాసము

## ఉమాఖండము – అ ౧

## విద్యేశ్వరఖండము





# తప్పొప్పుల పట్టిక.

| పేజీ | బంతి | తప్పు | ఒప్పు | పేజీ | బంతి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|---|---|---|
| ౧౦ | ౯ | యంశేజు | యంశేము | ౩౯౨ | ౨౮ | యేన | యోన |
| ౧౪ | ౨౧ | నఱుతనఱకు | నఱ్ఱునఱకు | ౪౧౭ | ౨౪ | భూపహా | భూవహా |
| ౧౫ | ౬ | యఱుతిసాచి | యఱ్ఱుసాచి | ,, | ,, | హాసరి | హారి |
| ౩౧ | ౨౫ | డ•సత్యమూర్తినగు | దు•సత్యమూర్తియగు | ౪౨౧ | ౧౩ | ణాంచితుల్లై | ణాలిప్పర్క |
| | | | | ౪౨౫ | ౨౧ | బాసెన | బాసియ |
| ౩౩ | ౧౧ | యలవి | యలవికి | ౪౨౨ | ౨౯ | దిరు | దిర్గు |
| ౩౬ | ౨౦ | మునకు | మునకును | ౪౨౬ | ౧౦ | జేరి | చేరి |
| ౪౩ | ౨౨ | తలపైన | తలపైని | ౪౪౯ | చివర | వాకొక | వాకొన |
| ౪౩ | చివరబంతి | యేలువా | యేలువాని | ౫౫౦ | ౧౨ | దిర్చుటకు | దుర్చుటకు |
| ౬౦ | ౧౭ | శివైక్యముఱ | శివైక్యమఱ | ౪౬౬ | ౨౭ | గట్టకు | గట్టుకు |
| ౬౪ | ౭౩ | రోసమున | దోసమున | ౫౧౭ | ౬ | శిలోక | శివలోక |
| ౬౪ | ౨౨ | కుమారిర్వి | కుమారిర్క | ౫౨౧ | ౮ | మహదహిత | శ్వసదహిత |
| ౭౧ | ౨౯ | మొనర్చిన | మొనర్చిరి | ౫౨౩ | ౧౭ | దలకరి | దలంకిరి |
| ౯౪ | ౧౭ | నామణి | నామది | ౫౩౦ | ౧౦ | నైన | తైన |
| ౧౨౦ | ౧౮ | రాజీభవుండు | రాజీవభవుండు | ౫౫౨ | ౨౩ | ములుతల్ప | ముపకరణ |
| ౧౩౩ | ౧౮ | శ్రీపరి | శ్రీపర. | ౫౫౩ | ౨౪ | భదద్రి | భదద్రిభదద్రి |
| ౧౪౯ | ౨౩ | ప్రకృదాటి | ప్రకృతిదాటి | ౫౯౨ | ౫ | యెదుట | యెడల |
| ౧౬౭ | ౧౬ | మునన్య | ములన్య | ౫౮౪ | ౨౬ | సంహార | సంహోర |
| ౧౬౮ | ౧౨ | మూర్చిలె | మూర్ఛిలె | ౬౦౧ | ౧౬ | గోష్టి | గోష్ఠి |
| ,, | ౨౬ | యంటి | యంటివా | ౬౧౧ | ౧౫ | తోందురము | తోందురము |
| ౧౭౬ | ౩ | సాద్వీ | సాధ్వీ | ౬౧౩ | ౭ | యల్గి | యల్కి |
| ౨౩౫ | ౯ | రాజుంతో | రాజుతో | ౬౧౮ | ౨౮ | చేసితివి•యొప్పనె! | చేసితివి • దొప్పనె! |
| ౨౫౫ | ౧౦ | నజుని | వజుని | | | | |
| ౨౫౮ | ౨౨ | యవ్వనము | యావనము | ౬౪౯ | ౯ | దైన్వతంబశ్వరము | దైన్వతము నశ్వరము |
| ౨౯౦ | ౩౦ | రత్నక | రత్న | | | | |
| ౨౭౨ | ౧౬ | తార్ష | తార్ధ | ౬౨౫ | ౧ | గాంచినను | గాంచిని |
| ౩౪౭ | ౧౮ | శివుండును | శివుండుమ | ౬౫౬ | ౧౮ | గర్మయందు | కర్మమందు |
| ౩౭౦ | ౧౦ | దనరె | దనర | ౬౫౭ | ౨౮ | సరన | సరద |
| ౩౮౪ | ౧౨ | నాతినాతి | నాతి యాతి | ౬౬౨ | ౨౨ | పరపాటి | పరిపాటి |
| ౩౮౮ | ౧ | కలుని | కలీనుని | ౬౬౫ | ౨౭ | ఆకసంబున | ఆకసంబును |
| ౩౯౨ | ౨౬ | తుష్టాష | తుష్టాష | ౬౮౭ | ౯౭ | దీంందియ. | దీంద్రియ |

| పేజీ | బంతి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౬౯౨ | ౧౯ | మేళి | మేళివ |
| ౬౯౪ | ౧౯ | యును | యనియును |
| ౬౯౭ | ౫ | మపదంబగు | మవరంబను |
| ౭౦౧ | చివర | ధృతయు | ధృతియు |
| ౭౦౩ | ౧౬ | నిర్వాది | లిర్వాది |
| ౭౦౫ | ౨౪ | ప్రసార | ప్రస్తార |
| ౭౦౭ | ౧౪ | సజ్కాశంబ | సజ్కాశంబు |
| ౭౦౮ | ౨౪ | బృంధంబు | బృధాబు |
| ౭౦౭ | ౧౭ | సర్వో | సద్యో |
| ౭౦౯ | ౨౫ | మను | మును |
| ౭౧౨ | ౩ | అంగుళ్రయం | అంగుళిత్రయం |
| ,, | ౧౦ | బునపాయం | బనపాయం |
| ,, | ౧౬ | ధవళ | ధవళ |
| ౭౧౩ | చివర | మీాజి | మీాఱు |

స వ ర ణ లు.

౭—౩ కమ్మని పూవు తేనియను
(సవరణ) కమ్మని తమ్మి తేనియను
౧౩౭—౧౨ రాజహంసకాళి
(సవరణ)కలహంసకాళి(నూపురధ్వాయి)
౧౩౭—౧౭ శరధనుశ్శూలములనె హ ♦ స్తములఁదాల్చు
(సవరణ) శరధనుశ్శూలచంద్రహా♦స ములఁదాల్చు
౫౦౫—౨౭ నీతముగా నాదుపూజ నీకు వెలియగుఁగా
(సవరణ) నీతికిదవ్వై వ్రతివిట్టినీకు వెలియగుఁగా.
౩౧౯—౩౦ కొమ్మనన్న నకొ్కమ్మ చెలికా రంబున కలరి.
(సవరణ)కొమ్మనుకొమ్మనుడులందలి చెలికా రంబునఘనుజతురోక్తి మార్దవంబునకునలరి
౭౦౬—౧౬ గంధ । లిప మురగుష్ఠ నిభ ములు ♦ లీగఘటిరెదె
(సవరణ) గంధ । మయమునంగుష్ఠ నిభముఁద్రే ♦ మమునఁ గూర్చి చేర్పు లు.
౧౮౯ పేజీ 3 బంతి ప్రారంభమునుంచి
ఉ॥ ఓకమనీయగాత్రి! కను♦మోవికచాంబు జనేత్రి! శర్వానీ। బ్రాకటరాజతాచల వి♦ భాస్వరుఁడంచును రాజమాళియం। చేకమతిఁ వరించి విహి! ♦ శుధ రాటవి కుండతండుదో। పాకరవాళి నీమదిన♦ యమ్మునయమ్మున నూహసేయుమా!
౨౬౨ పేజీ 3 బంతి ప్రారంభమునుంచి ఈ పద్యమును జదివికొనవలయును.
పద్యసంఖ్య 173
తే-గీ॥ ప్రిబలఘోరనిదాఘూర్తి ♦ బడలి సడలి। ప్రాణమాత్రావశిష్టమై♦ పరగు లతకు । శ్రావణాంబుధరంబె సం ♦ రక్షకంబు। శంకరుఁడె నాకు సౌభాగ్య♦ శంకరుండు.
౪౬౩ పేజీ ౯వబంతి ప్రారంభమునుండియీా యక్షరంబులను జేర్చుకొనవలయు. ఇందలిశివలింగమును బంచవక్త్రేశ్వరుఁ డందురు. ఈసలి కొంకింత విప్రకృష్టోత్తర ప్రదేశంబునఁ గనఖలక్షేత్రంబందు దక్షే శ్వరలింగం బీక్షణ విషయంబగు.
౬౦౦—౨౧ ఖరకరుడు చెందె నపరాద్రి గహ్వరమును.
(సవరణ) అరుణఘృణి యొందె నపరా చ ♦ లావసథము.
౬౫౭ పేజీ ౨౦బంతి పానీయ (యనునక్ష రముల పిమ్మటనీయక్షరములఁ జేర్ప వలె) సరోరాజీ విరాజితంబును నానా విధ పుష్పఫలభరితతరులతా వ్రాత సంశో భితంబుగోల నోళ దివ్యవనంబును.



కృతిపతులు

బ్ర॥ శ్రీ॥ ముదిగొండ వీరభద్రారాధ్యులు

వారి ధర్మపత్ని శ్రీలక్ష్మీదేవమ్మగారు



శ్రీ శివాభ్యాన్నమః

# శ్రీ శివపురాణము

## సృష్టిఖండము.

### ప్రథమాశ్వాసము.



విభుఁ డాత్మనేత్రసర • సీరుహపూజనొనర్చి యేమహా
దేవునిసుప్రసాదనియ • తిన్ గొనె సర్వసుపర్వచక్రర
క్షావహమైనచక్రము సు • ధాంశుఁ డిఁకెవ్వనిఁ జెంది దక్షశా
పావధినొందె నట్టి సద • యాత్ము శివున్ బరమాత్ముఁ గొల్చెదన్.

చ॥ పెనిమిటిపెందొడన్ జనవు • పెంపునఁజక్కఁగ నెక్కి యక్కునన్
దనయు గణేశు నెత్తికొని • తావలచేతఁ గుమారు నెమ్మొగం
బును దయమీఱఁ బుణ్కుచు న • మోనమయంచు వచించుమాధవా
ద్యనిమిషనాథశేఖరుల • నాదటఁ బ్రోచునుమన్ భజించెదన్. 2

క॥ సకలామరసముదయమునఁ, బ్రకటితముగఁ దొల్తపూజఁ • బడసి ప్రమథనా
యకుఁడై కడు మాతాపిత, లకు మురుపిడుదంతిముఖుఁద • లఁతు మదిఁ బ్రణతిన్. 3

ఉ॥ రుద్రమహోగ్రరోషమయ • రూపముఁ జేకొని దక్షుమూర్ధమున్
రౌద్రతరార్భటిన్ దునిమి • రాక్షసమర్దనముఖ్యులన్ భయో
న్నిద్రులఁజేసి భక్తులను • నిత్యము సాఁకెడుభద్రకాళికా
వద్రుఁడు వీరభద్రుఁడు శు • భంబిడుఁగావుత మాకు నిచ్చలున్. 4

ఉ॥ అందముచిందునిందుకల • నందికిఁ జెందిన యారుమోములన్
బొందుగ దారలిర్వుర క • పూర్వముదం బొనరించుచున్ రహిన్
గందువలాడుచున్ శిఖిని • గౌతుకమొప్పఁగ నెక్కి భక్తరా
జిం దయ సాఁకువేలుపు వ • జీరు మహారాజు మదిన్ నుతించెదన్. 5

సీ॥ మధురసౌరభచారు ♦ మకరందబంధుర, శోణాబ్జ మొకకేల ♦ సొంపుచిలుక
లలితరాగాయత్తా ♦ లాపశోభితవేణు, వల్లకి యొకచేత ♦ వన్నెదొలుక
రసవస్త్వలంకార ♦ రమ్యభావోదార, పుస్తక మొకకేలఁ ♦ బొంకమొలుక
భర్త్రుపావననామ ♦ పరమజపోజ్జ్వల, మణిమాల యొకచేత ♦ మానుగులుక.

గీ॥ సురభిసౌవర్ణపుష్కరాం ♦ తరమనోజ్ఞ, కర్ణికాసీనధాత్రము ♦ ఖమున నమరు
వాణి నిర్జితశుకపిక ♦ వాణి వాణి, గరిమనొసఁగ భజింతుఁ జా ♦ క్రమగుభక్తి.

సీ॥ షట్కాలశివలింగ ♦ సమయసమర్చాభి, రాము శ్రీవేమనా ♦ రాధ్యగురుని
నిగమాగమార్ణవ ♦ నిష్ణాతుఁబావన, భావుని వీరమ ♦ ల్లావధాని
శబ్దవిద్యాపార ♦ చతురుఁ జట్టావూరి, వంశ్య సీతారామ ♦ పండితేంద్రు
శతవధానమనీషి ♦ చంద్రమలఁగిబ్కవి, గజకేసరుల శత ♦ గ్రంథకవుల

గీ॥ మఱియు నేమానిరాజయన్ ♦ మంత్రశాస్త్ర, వక్తమున్నగునాచార్య ♦ వరులనాదు
చిత్తమున మేలిభక్తిన ♦ ర్చించి యుంచి, తోక్తులనొకండుకృతిసేయ ♦ నూహచేసి.

ఉ॥ శైవపురాణమెందును బ్రి ♦ శస్తము శర్వకథాసుధాభిధా
రావహసర్వభాగవిభ ♦ వాస్పదధామము భూరివిస్ఫుర
ద్భావరసాభిరంజకము ♦ పాఠకకోటికిఁ బూరుషార్థల
క్ష్మీవిలసన్నివాసమని ♦ చిత్తమునం దిగురొత్తువేడ్కతోన్.

చ॥ తెనుఁగొనరింపఁబూనితి సు ♦ ధీవరివరుల్ మదిఁబొంగ భారతీ
కనదురురత్నసంకలిత ♦ కాంచనకాంచికలాపకింకిణీ
ఘనతరనిస్వనంబెసఁగఁ ♦ గా వికసల్లలితారవిందసం
జనితనితాంతసౌరభల ♦ సన్మధురోక్తుల రక్తులేర్పడన్. 9

## —* కవి స్తుతి *—

గీ॥ ఘనుల వల్మీకభూ వ్యాస ♦ కాళిదాస, భాస భారవి భవభూతి ♦ బాణ భట్టి
మాఘ శ్రీహర్ష బిల్హణ ♦ మల్హణాది, సంస్కృతకవీంద్రపదసార ♦ సముల కెఱఁగి.

వ. ఆంధ్రకవులందు

ఉ॥ అంచితభక్తిఁగొల్తు విబు ♦ ధావళి కున్నతవైభవంబునన్
బొంచదమేయహర్ష జన ♦ కాక్షరచారుపదప్రదాతలౌ
కాంచనగర్భ విష్ణు శశి ♦ ఖండకిరీటులఁ బోటిసేయుచున్
మించిననన్నయాదికవి ♦ నేతల భారతధాతలన్ మదిన్. 11

క॥ సోముని భీముని నాచన, సోముని శ్రీనాథబుధుని ♦ సూరన్నను బ్రి
జామహితుఁ బెద్దనార్యునిఁ, బ్రేమమ్మునఁగొలుతు వారి ♦ పెంపుఁబొగడుచున్.12

శా॥ ఎందెందేనియు భ్రాంతిహేతుకముగా ♦ నేదేని దోసంగుండుటో
ప్పం దదక్షేంద్రులకేని యంతనెయెటుల్ ♦ పోనోవు సర్వంకషా
స్పందప్రోద్ధతభారతీరుచిరశుం ♦ భద్గుంభసంరంభముల్
మందుల్ దీనినెఱుంగఁజాల రది తే ♦ మంబౌను మా కెంతయున్.

చ॥ తిరుపతివేంకటేశకవి ♦ ధీరులు కావ్యములందు భారత
స్ఫురితపథానురోధగతి ♦ సొంపులునింపిరి నేనునట్లె యా
దరమెసఁగంగ వారిసువి ♦ ధానప్రభంగి నెఱింగి కబ్బమున్
బరఁగరచింతు దీనిపరి ♦ పాకము లోకమెఱుంగుగావుతన్.

క॥ మక్కికిమక్కిన్ గూర్చుట, చక్కనిమార్గంబుగాని ♦ చందమగుట నా
చక్కివిడనాడి నాయియా, ఫక్కిన్ బొనరింతులలిత ♦ పద్ధతిమెఱయన్.

క॥ శివలింగము రుదురాకలు, శివలింగధరుండు గురుఁడు ♦ శ్రీఫలదళముల్
శివమంత్రము బూదియు నా, కవిరళభద్రంబులొసఁగు ♦ నశ్రాంతంబున్.

—* శైవాచార్యాది సత్కృతి *—

క॥ *పన్నిద్దఱు సూర్యులు నాఁ, బన్నిద్దఱు రేవణాది ♦ పాశుపతనుసం
పన్నిధులు బుధులు వారల, కు న్నతులఁ బొనర్తునే న ♦ కుంఠితభక్తిన్.

వ. అందును

క॥ శ్రీకంఠుడనంగను వి, ద్యాకంఠుఁడు నీలకంఠు ♦ డనునామములన్
లోకోత్తరఘనపుణ్యు, శ్లోకుండగు భాష్యకార ♦ సోమునిఁ గొలుతున్.

ఉ॥ కొండఱు వ్యాససూత్రముల ♦ కున్ గనుగప్పి యపార్థకల్పనల్
బొందువడంగఁ బొత్తములఁ ♦ బూన్చిన వందురుచున్న వ్యాసమా
నిం దనుపంగ సూత్రగత ♦ నిశ్చితతత్త్వముఁదెల్పి శైవరా
జిం దనరించినట్టి గురు ♦ శేఖరుఁ గొల్చెద నీలకంఠునిన్.

---

* 17 పన్నిద్దఱు రేవణాది పాశుపత నుసంపన్నిధులు —
సిద్ధత్రయము : 1 రేవణసిద్ధుఁడు 2 మరుళసిద్ధుఁడు 3 ఏకోరామసిద్ధుఁడు.
ఆరాధ్యత్రయము : 1 ఉద్భటారాధ్యుఁడు 2 వేమారాధ్యుఁడు 3 విశ్వారాధ్యుఁడు
పండితత్రయము : 1 మల్లికార్జునపండితుఁడు 2 శ్రీపతిపండితుఁడు 3 మంచనపండితుఁడు
ఆచార్యత్రయము : 1 నీలకంఠశివాచార్యుఁడు 2 హరదత్తాచార్యుఁడు 3 భట్టభాస్కరాచార్యు
వీరలు శైవమత మూలాచార్యులు, వీరిలో 3 వ ఆచార్యుఁడు మొదలుకొని 9 వ ఆ
వఱకు దద్వంశ్యు లిప్పటివఱకు శైవమతాచార్య పురుషులై పేర్కొనఁబడుచున్నారు.

సీ॥ మధురసౌరభచారు ♦ మకరందబంధుర, శోణాబ్జ మొక కేల ♦ సొంపుచిలుక
లలితరాగాయతా ♦ లాపశోభితహేమ, వల్లకి యొక చేత ♦ వన్నెదొలుక
రసవస్త్వలంకార ♦ రమ్యభావోదార, పుస్తక మొక కేలఁ ♦ బొంకమొలుక
భక్తపావననామ ♦ పరమజపోజ్జ్వల, మణిమాల యొక చేత ♦ మానుగులుక.
గీ॥ సురభిసౌవర్ణపుష్కరాం ♦ తరమనోజ్ఞ, కర్ణికాసీనధాత్రము ♦ ఖమున నమరు
వాణి నిర్జితశుకపిక ♦ వాణి వాణి, గరిమనొసఁగ భజింతుఁ జో ♦ క్కమగుభక్తి.

సీ॥ షట్కాలశివలింగ ♦ సమయసమర్చాభి, రాము శ్రీవేమనా ♦ రాధ్యగురుని
నిగమాగమార్ణవ ♦ నిష్ణాతుఁబావన, భావుని వీరమ ♦ ల్లావధాని
శబ్దవిద్యాపార ♦ చతురుఁ జిజ్ఞావ్రారి, వంశ్యు సీతారామ ♦ పండితేంద్రు
శతవధానమనీషి ♦ చంద్రులఁగిర్కవి, గజకేసరుల శత ♦ గ్రంథకవుల
గీ॥ మఱియు నేమానిరాజయన్ ♦ మంత్రశాస్త్ర, వక్తమున్నగునాచార్య♦ వరులనాదు
చిత్తమున మేలిభక్తిన ♦ ర్చించి యుంచి, తోక్తులనొకండుకృతిసేయ ♦ నూహచేసి.

ఉ॥ శైవపురాణమెందును బ్రి ♦ శస్తము శర్వకథాసుధాభిధా
రావహసర్వభాగవిభ ♦ వాస్పదధామము భూరివిస్ఫుర
ద్భావరసాభిరంజకము ♦ పాఠకకోటికిఁ బూరుషార్థల
క్ష్మీవిలసన్నివాసమని ♦ చిత్తమునం దిగురొత్తువేడ్కతోన్.

చ॥ తెనుఁగొనరింపఁబూనితి సు ♦ ధీప్రవరుల్ మదిఁబొంగ భారతీ
కనదురురత్నసంకలిత ♦ కాంచనకాంచికలాపకింకిణీ
ఘనతరనిస్వనంబెసఁగఁ ♦ గా వికసల్లలితారవిందసం
జనితనితాంతసౌరభల ♦ సన్మధురోక్తుల రక్తులేర్పడన్. ౧౦

## —* కవి స్తుతి *—

గీ॥ ఘనుల వల్మీకభూ వ్యాస ♦ కాళిదాస, భాస భారవి భవభూతి ♦ బాణ భట్టి
మాఘ శ్రీహర్ష బిల్హణ ♦ మల్హణాది, సంస్కృతకవీంద్రపదసార ♦ సముల కెఱఁగి.

వ. ఆంధ్రకవులందు

ఉ॥ అంచితభక్తిఁగొల్తు విబు ♦ ధావళి కున్నతవై భవంబునన్
బ్రాంచదమేయహర్షజన ♦ కాక్షరచారుపదప్రదాతలౌ
కాంచనగర్భ విష్ణు శశి ♦ ఖండకిరీటులఁ బోటిసేయుచున్
మించిననన్నయాదికవి ♦ నేతల భారతధాతలన్ మదిన్. 11

క॥ సోముని భీముని నాచన, సోముని శ్రీనాథబుధుని ♦ సూరన్నను బ్రి
[illegible] వెగసాగగానిఁ, బేమమునఁగొలుతు వారి ♦ పెంపుఁబొగడుచున్. 12

శా॥ ఎందెందేనియు భ్రాంతిహేతుకముగా ♦ నేదేని దోసంగుండుటో
ప్పం దద్జ్ఞేంద్రులకేని యంతనెయెటుల్ ♦ పోనోపు సర్వంకషా
స్పందప్రోద్ధతభారతీరుచిరశుం ♦ భద్గుంభసంరంభముల్
మందుల్ దీని నెఱుంగఁజాల రది తే ♦ మంబొను మా కెంతయున్.

చ॥ తిరుపతివేంకటేశకవి ♦ ధీరులు కావ్యములందు భారత
స్ఫురితపథానురోధగతి ♦ సొంపులునింపిరి నేనునట్లె యా
దరమెసఁగంగ వారిసువి ♦ ధానపుభంగి నెఱింగి కబ్బమున్
బరఁగరచింతు దీనిపరి ♦ పాకము లోకమెఱుంగుగావుతన్.

క॥ మక్కికిమక్కిన్ గూర్చుట, చక్కనిమార్గంబుగాని ♦ చందమగుట నా
చక్కి విడనాడి నాయీ, ఫక్కిన్ బొనరింతులలిత ♦ పద్ధతి మెఱయన్.

క॥ శివలింగము రుద్రాక్షలు, శివలింగధరుండు గురుఁడు ♦ శ్రీఫలదళముల్
శివమంత్రము బూదియు నా, కవిరళభద్రంబులొసఁగు ♦ నశ్రాంతంబున్.

## —* శైవాచార్యాది సత్కృతి *—

క॥ *పన్నిద్దఱు సూర్యులు నాఁ, బన్నిద్దఱు రేవణాది ♦ పాశుపతసుసం
పన్నిధులు బుధులు వారల, కు న్నతులఁ బొనర్తునే న ♦ త్యంతితభక్తిన్.

వ. అందును

క॥ శ్రీకంఠుడనంగను వి, ద్యాకంఠుఁడు నీలకంఠు ♦ డనునామములన్
లోకోత్తరఘనపుణ్య, శ్లోకుండగు భాష్యకార ♦ సోమునిఁ గొలుతున్.

ఉ॥ కొందఱు వ్యాససూత్రముల ♦ కున్ గనుగప్పి యపార్థకల్పనల్
బొందుపడంగఁ బొత్తములఁ ♦ బూన్చిన వందురుచున్న వ్యాసమా
నిం దనుపంగ సూత్రగత ♦ నిశ్చితతత్త్వముఁదెల్పి శైవరా
జిం దనరించినట్టి గురు ♦ శేఖరుఁ గొల్చెద నీలకంఠునిన్.

---

* 17 పన్నిద్దఱు రేవణాది పాశుపత సుసంపన్నిధులు —
సిద్ధత్రయము : 1 రేవణసిద్ధుఁడు 2 మరుళసిద్ధుఁడు 3 ఏకోరామసిద్ధుఁడు.
ఆరాధ్యత్రయము : 1 ఉద్భటారాధ్యుఁడు 2 వేమారాధ్యుఁడు 3 విశ్వారాధ్యుఁడు
పండితత్రయము : 1 మల్లికార్జునపండితుఁడు 2 శ్రీపతిపండితుఁడు 3 మంచనపండితుఁడు
ఆచార్యత్రయము : 1 నీలకంఠశివాచార్యుఁడు 2 హరదత్తాచార్యుఁడు 3 భట్టభాస్కరాచార్యుఁ
వీరలు శైవమత మూలాచార్యులు. వీరిలో 3 వ ఆచార్యుఁడు మొదలుకొని 9 వ ఆ
వఱకు దద్వంశ్యు లిప్పటివఱకు శైవమతాచార్య పురుషులై పేర్కొనఁబడుచున్నారు.

సీ॥ మధురసౌరభచారు ♦ మకరందబంధుర, శోణాబ్జ మొకకేల ♦ సొంపుచిలుక
లలితరాగాయతా ♦ లాపశోభితహేమ, వల్లకి యొకచేత ♦ వన్నెదొలుక
రసవస్త్వలంకార ♦ రమ్యభావోదార, పుస్తక మొకకేలఁ ♦ బొంకమొలుక
భర్తృపావననామ ♦ పరమజపోజ్జ్వల, మణిమాల యొకచేత ♦ మానుగులుక.
గీ॥ సురభిసౌవర్ణపుష్కరాం ♦ తరమనోజ్ఞ, కర్ణికాసీనధాతృము ♦ ఖమున నమరు
వాణి నిర్జితశుకపిక ♦ వాణి వాణి, గరిమనొసఁగ భజింతుఁ జొ ♦ క్కమగుభక్తి.
సీ॥ షట్కాలశివలింగ ♦ సమయసమర్చాభి, రాము శ్రీవేమనా ♦ రాధ్యగురుని
నిగమాగమార్ణవ ♦ నిష్ణాతుఁబావన, భావుని వీరమ ♦ ల్లావధాని
శబ్దవిద్యాపార ♦ చతురుఁ జిజ్ఞాపూరి, వంశ్య సీతారామ ♦ పండితేంద్రు
శతవధానమనీషి ♦ చంద్రులఁగిజ్కవి, గజకేసరుల శత ♦ గ్రంథకవుల
గీ॥ మఱియు సేమానిరాజయన్ ♦ మంత్రశాస్త్ర, వక్తమున్నగునాచార్య ♦ వరులనాదు
చిత్తమున మేలిభక్తిన ♦ ర్చించి యంచి, తోక్తులనొకండుకృతిసేయ ♦ నూహచేసి.
ఉ॥ శైవపురాణమెందును బ్రి ♦ శస్తము శర్వకథాసుధాభిధా
రావహసర్వభాగవిభ ♦ వాస్పదధామము భూరివిస్ఫుర
ద్భావరసాభిరంజకము ♦ పాఠకకోటికిఁ బూరుషార్థల
క్ష్మీవిలసన్నివాసమని ♦ చిత్తమునం దిగురొత్తువేడ్కతోన్.
చ॥ తెనుఁగొనరింపఁబూనితి సు ♦ ధీప్రవరుల్ మదిఁబొంగ భారతీ
కనదురురత్నసంకలిత ♦ కాంచనకాంచికలాపకింకిణీ
ఘనతరనిస్స్వనంబెసఁగఁ ♦ గా వికసల్లలితారవిందసం
జనితనితాంతసౌరభల ♦ సన్మధురోక్తుల రస్తుతేర్పడన్. ౧౦

—— * కవి స్తుతి * ——

గీ॥ ఘనుల వల్మీకభూ వ్యాస ♦ కాళిదాస, భాస భారవి భవభూతి ♦ బాణ భట్టి
మాఘు శ్రీహర్ష బిల్హణ ♦ మల్హణాది, సంస్కృతకవీంద్రపదసార ♦ సముల కెఱఁగి.

వ. ఆంధ్రకవులందు

ఉ॥ అంచితభక్తిఁగొల్తు విబు ♦ ధావళి కున్నతమై భవంబునన్
బ్రాంచదమేయహర్ష జన ♦ కాక్షరచారుపదప్రదాతలౌ
కాంచనగర్భ విష్ణు శశి ♦ ఖండకిరీటులఁ బోటిసేయుచున్
మించిననన్నయాదికవి ♦ నేతల భారతధాతలన్ మదిన్. 11
క॥ సోముని భీముని నాచన, సోముని శ్రీనాథబుధుని ♦ సూరన్నను బ్రి
జ్ఞామహితుఁ బెద్దనార్యునిఁ, బ్రేమమ్మునఁగొలుతు వారి ♦ పెంపుఁబొగడుచున్.12

శా॥ ఎందెందేనియు భ్రాంతిహేతుకముగా ♦ నేదేన్ దోసంగుండుటో
ప్పం దద్ క్షేంద్రులకేని యంతనెమెటుల్ ♦ పోనోపు సర్వంకషా
స్పందప్రోద్ధతభారతీరుచిరశుం ♦ భద్గుంభసంరంభముల్
మందుల్ దీని నెఱుంగఁజాల రది క్షే ♦ మంబౌను మా కెంతయున్.

చ॥ తిరుపతివేంకటేశకవి ♦ ధీరులు కావ్యములందు భారత
స్ఫురితపథానురోధగతి ♦ సొంపులునింపిరి నేనునట్లె యా
దర మెసఁగంగ వారిసువి ♦ ధానపుభంగి నెఱింగి కబ్బమున్
బరఁగ రచింతు దీనిపరి ♦ పాకము లోకమెఱుంగుగావుతన్.

క॥ మక్కికిమక్కిన్ గూర్చుట, చక్కనిమార్గంబుగాని ♦ చందమగుట నా
చక్కివిడనాడి నాయీ, ఫక్కిన్ బొనరింతు లలిత ♦ పద్ధతి మెఱయన్.

క॥ శివలింగము రుద్రాక్షలు, శివలింగధరుండు గురుఁడు ♦ శ్రీఫలదళముల్
శివమంత్రము బూదియు నా, కవిరళభద్రంబులొసఁగు ♦ నశ్రాంతంబున్.

## —* శైవాచార్యాది సత్కృతి *—

క॥ *పన్నిద్దఱు సూర్యులు నాఁ, బన్నిద్దఱు రేవణాది ♦ పాశుపతసుసం
పన్నిధులు బుధులు వారల, కు న్నతులఁ బొనర్తు నే న ♦ కుంఠితభక్తిన్.

వ. అందును

క॥ శ్రీకంఠుడనంగను వి, ద్యాకంఠుఁడు నీలకంఠు ♦ డనునామములన్
లోకోత్తరఘనపుణ్యా, శ్లోకుండగు భాష్యకార ♦ సోముని గొలుతున్.

ఉ॥ కొందఱు వ్యాససూత్రముల ♦ కున్ గనుగప్పి యపార్థకల్పనల్
బొందువడంగఁ బొత్తములఁ ♦ బూన్చిన నందురుచున్న వ్యాసమా
నిం దనుపంగ సూత్రగత ♦ నిశ్చితతత్త్వముఁ దెల్పి శైవరా
జిం దనరించినట్టి గురు ♦ శేఖరుఁ గొల్చెద నీలకంఠునిన్.

---

17 పన్నిద్దఱు రేవణాది పాశుపత సుసంపన్నిధులు —
సిద్ధత్రియము : 1 రేవణసిద్ధుఁడు 2 మరుళసిద్ధుఁడు 3 ఏకోరామసిద్ధుఁడు.
ఆరాధ్యత్రియము : 1 ఉద్భటారాధ్యుఁడు 2 వేమారాధ్యుఁడు 3 విశ్వారాధ్యుఁడు
పండితత్రియము : 1 మల్లికార్జునపండితుఁడు 2 శ్రీపతిపండితుఁడు 3 మంచనపండితుఁడు
ఆచార్యత్రియము : 1 నీలకంఠశివాచార్యుఁడు 2 హరదత్తాచార్యుఁడు 3 భట్టభాస్కరాచార్యు
వీరలు శైవమత మూలాచార్యులు. వీరిలో 3 వ ఆచార్యుఁడు మొదలుకొని 9 వ ఆ
వఱకు దద్వంశ్యు లిప్పటివఱకు శైవమతాచార్య పురుషులై పేర్కొనఁబడుచున్నారు.

సీ॥ హరువొప్పఁ గాంచి నే ♦ కామేశువరమున, నెవఁడబ్రముగ జని ♦ యించి మించె
శ్రీనీలకంఠ దే ♦ శికపదపద్మసే, వనమున నెవ్వఁడు ♦ వాసిఁజెందె
షడ్దర్శనంబుల ♦ సారపారముఁగాంచి, యెవఁడు సిద్ధాంతంబు ♦ తెలుఁగఁజేసె
సర్వవేదార్థ ♦ విజ్ఞానంబుఁగొనితత్త్వ, మిదియంచు నెవఁడు దా ♦ నెఱుకపఱచె

గీ॥ అతఁడు శ్రీహరదత్తుఁ డా ♦ ఖ్యాతసర్వ, దేశరాజన్యగోష్ఠిని ♦ వేశకోవి
దాతిశయగేయసుయశోమ♦హామహుండు, శర్వనిభుఁడొందుఁగాతనా♦సన్నుతులను

చ॥ *అలికమునన్ గృశానుదృశ ♦ నందనిశంకరుఁ డాఱుమోములన్
వెలయనిశక్తిహస్తుఁడు ప ♦ విత్రితపంబును గోలుపోనికా
శలుఁడలగాధినందనుఁడు ♦ శాంభవభాష్యవిరాజి నాదుజో
తలఁగొను శైవపండితవి ♦ ధాతృఁడు శ్రీపతిపండితుం డిటన్. 21

గీ॥ ఘనభవకరాళపంకలం ♦ ఘనపటిష్ఠు, బ్రహ్మవిద్యాప్రబోధన ♦ ప్రౌఢుఁబావ
నమతిఁగల్యాణపూర్ణునా ♦ నందయతిని, వేమఱునుతింతునాదుహృ♦ద్వేశ్మమందు.

క॥ ఆయుర్వేదకళానిధి, యై యనురాగమున నన్ను ♦ నావిద్యను బ్ర
జ్ఞాయుతుఁజేసిన నవరా, త్రేయు ములుగురామలింగ ♦ దేశికుఁగొలుతున్. 23

చ॥ శివపురవంశసింధుభవ ♦ శీతలరశ్మి శిరీషపుష్పపే
లవహృదయుం డలంకృతిక ♦ లాలలితుండును నాకు నెయ్యుఁడున్
శివునిఁ భజింపఁ దత్పదముఁ ♦ జెందినయట్టిఁడు నైనమల్లయా
ఖ్యవిబుధవర్యు నెంచెద మ ♦ దాత్మమునందుఁ దదాత్మ మెచ్చుచున్. 24

గీ॥ మఱియు నామామ ధైర్యర♦మామహితుఁడు, శివపురాన్వయపాథోధి♦శీతభానుఁ
డాఢ్యుఁడుశివార్చనావర♦మాంతరంగుఁ,డట్టిదుర్గాహ్వయునిమది♦యందుగొలుతు.

గీ॥ ఘనుఁడు భోగేశ్వరాదిస ♦ త్కావ్యసవిత, మల్లమపలికులాబ్ధిహి ♦ మకరమూర్తి
మల్లికార్జునశాస్త్రి మా♦మకకవిత్వ, మండనావహుఁడాత్మస♦మర్చ్యుఁడెపుడు. 26

వ. మఱియును

గీ॥ తూములూర్యన్వయసుధాబ్ధి♦ సోముఁడిభ్య, సభ్యచరితుండుశాబ్దిక ♦ చంద్రుఁడస్మ
దీయకృతిరత్నమున్ సానఁ ♦ దీర్చె నట్టి, దిట్ట శివరామకృష్ణశా ♦ స్త్రిని నుతింతు.

క॥ ఇఁక నెందఱోమనీషులు, ప్రకటితకవితాకళావి ♦ రాజితు లీమా
మకకృతికి వన్నెఁగూర్చిరి, యకలంకమతిన్ నుతింతు ♦ నవ్వారిసిరిన్. 28

వ. ప్రాచీనాచారంబుకతన నస్మదీయవంశచరిత్రంబు నొక్కించుక ముచ్చటించెద.

---

*21 శ్రీపతి పండితారాధ్యులు: పూజ్యపాదులగు వీరుగూడ వైయాసిక సూత్రములకు శ్రీకర భాష్యం [illegible] విశేష శివాద్వైత భాష్యంబును రచించిరి.

## —* వంశానుక్రమణిక *—

క॥ ధరణిన్ బ్రాహ్మణశాఖల, హరువగు నారాధ్యశాఖ ♦ యలరు నొకండం
దిరవగు మావంశము భా, సురభారద్వాజగోత్ర ♦ శోభిత మగుచున్.

క॥ యాజుషశాఖాధ్యయన, భ్రాజితమై యిష్టలింగ ♦ భాస్వత్తరపూ
జాజాగరూకమై కడు, రాజిలు ననవరతమార్య ♦ రాజస్తుతమై.

వ. అందు

శా॥ శ్రీకాశీశ్వరలింగదివ్యకరుణా ♦ శ్రీభాగ్యజాతుండు లో
కైకఖ్యాతమహాతపోనియతదీ ♦ వ్యద్భవ్యతేజుండు వీ
రాకాశల్యనిరస్తకల్యధికప ♦ ద్మాస్తోము డొప్పొందె జం
బ్రాకల్పోపము డుద్భటార్యగురుమా ♦ ద్యుండు డిలామండలిన్.

సీ॥ ఏ గురుండుండె ఖం ♦ డేందుమౌళిప్రతిని, వాసమౌ ముదిగొండ ♦ పట్టణమున
ఏ సుధీశ్వరుడొందె ♦ హిమగిరిజాభయా, సౌభాగ్యసుందరీ ♦ సాధ్విపాణి
ఏ దేశికాగ్రణి ♦ యిచ్చె భోజాదిరా, జాధిరాజుల కిల ♦ నభవదీక్ష
ఏ మహాత్ముడు వాపె ♦ నీశశాపంబు భూ, తంబులైయున్న గం ♦ ధర్వతతికి

గీ॥ అట్టి నిరపాయగేయ వి ♦ ఖ్యాతపూత, వికచకమలవనామోద ♦ నికరసార
కీర్తిపూర్తివిరాజితా ♦ ఖిలదిగంత, రాశమండలు డారాధ్య ♦ రాజమౌళి.

సీ॥ భంజించె బౌద్ధాది ♦ పాషండమతములు, బ్రతివాదులెల్ల న ♦ బ్రిమ్ముజెంద
రంజించె పార్వతీ ♦ రమణమతంబు శాం, భవులెల్ల మేటిసం ♦ బరముజెంద
విరచించె హారలీల ♦ వెలయనలంకార, సంగ్రహకావ్యంబు ♦ జతురులలర
నార్జించె నిష్టలిం ♦ గార్చనాఘనయోగ, లబ్ధనిర్వాణక ♦ ల్యాణలక్ష్మి

గీ॥ భక్తులుప్పొంగ గరతల♦భ్రాజమాన, శాంభవప్రాణలింగాను ♦ సంగతాత్ము
డై యనశ్వరగౌరీశ్వ ♦ రాధివాస, భాసురంబగు కైలాస ♦ పదము జెందె.

గీ॥ అట్టియారాధ్యమకుటుని♦యన్వయమున, బుట్టిచెలువొందిరనఘులు♦భూరియశు
చంద్రశేఖరదేశిక ♦ చంద్రముఖ్యు, లవని బలువురు కలిదోష ♦ హరణచణు

వ. ఉద్భటగురుండు మొదలుచేసి వీరందఱు పెక్కుతరంబులవఱకు ముదిగొ
యందు గాపురముండుట ముదిగొండవా రనం బరంగిరి.

క॥ మును రామలింగసత్కవి, జనమాన్యుం డుద్భటార్య ♦ చరితవిరచనం
బొనరించి వీరివంగడ, మన నెట్టిదొ యెఱుగజేసె ♦ నందఱు మెచ్చన్.

వ. పదంపడి వీరివంశ్యు లతిశయాభివృద్ధిగాంచి వేఱువేఱుగ్రామంబులందు వసి
పెక్కుతరంబులు గడచుట ననోన్యజ్ఞాతిధర్మంబు బాసి పెక్కు తెగలైరి

అవ్వానిలో సుప్రసిద్ధులనేకులు పొడమి పేరుఁ బెంపున్‌గాంచినవార లందుఁ
కొందఱి నిందుఁ జేర్కొందు. 37

సీ॥ చిన్మయదీక్షాది ♦ శివమతగ్రంథక, ల్పకశాఖ శ్రీవీర ♦ భద్రగురుఁడు
షడ్దర్శనాగమ ♦ శౌండుండు కేదార, లింగపండితరాజ ♦ పుంగవుండు
నందిగామాగ్రజ ♦ స్నోందుండు వేదాగ, మాంభోధి వీరభ ♦ ద్రావధాని
కొండవీడున నున్న ♦ కుసుమకోమలకావ్య, కమనీయవీరభ ♦ గవతధాత

గీ॥ పాణినీయాగమాంత వి ♦ భాసితోడు, బాదరాయణఘనకలా ♦ భరితమహిత
పాండితీస్ఫూర్తి రచితశై ♦ వప్రబంధ, రంగదుఱుకీర్తి శ్రీనాగ ♦ లింగశాస్త్రి. 38

సీ॥ ఎవ్వానిశుభనామ ♦ మేప్రొద్దు నుడివిన, జనులఘంబాపసం ♦ చయము నొలఁగు
ఎవ్వానిచారిత్ర ♦ మేశైవమండలి, కెల్లయాదర్శమై ♦ మెసక మెసఁగు
ఎవ్వానిదాతృత్వ ♦ మెల్ల దేశములందు, విఖ్యాతిఁగాంచి శా ♦ వించెఁ దనివి
ఎవ్వానిసద్బోధ ♦ లెంతకాలంబేని, విసుగుఁగాంచకయె శా ♦ వించు భక్తి

గీ॥ ఎవఁడు చేసిన పాట్యాలి ♦ కేష్టలింగ, పూజఁగావించెఁ బరులకుఁ ♦ బులకితతుల
నట్టిశ్రీశంకరారాధ్యుఁ ♦ డార్యబోధ్యుఁ, డనుపమానయశస్కుఁడై ♦ యవని వెలసె

వ. ఇఁక గుంటూరుమండలినుండిచేరి నిజాము దేశమందు నల్లగొండజిల్లాలోని నారా
యణపురంబందుఁ గాపురంబున్న మా తెగయందు

సీ॥ సిద్ధసంవత్సర ♦ శివమంత్రమూర్తి శ్రీ, మంత్రమూర్తియె పితా ♦ మహుఁడు నాకు
*నిరతాన్నదానాభి ♦ నిరతుండు వీరభ, ద్రగురుండు తండ్రి స ♦ త్యవ్రతుండు
అమలగుణాఢ్యలై ♦ యలరినయట్టి శ్రీ, శరభమ్మనాగమల్ ♦ సవతితల్లు
లకలంకచారిత్ర ♦ హరితగోత్రోద్భవ, యైనలక్ష్మమ మామ ♦ కీనజనని

గీ॥ సవతితల్లికుమారుఁడు ♦ శరభమూర్తి, యన్న శరభమ్మలాతని ♦ యనుజలిర్వు
రక్కలై నాకు వెలసిరి ♦ యమలమతులు, నాగవీరేశ్వరుండని ♦ నాదుపేరు. 41

చ॥ సిరుఁగరహించు సైన్యపుర ♦ సీమ వసించెద నద్రిజామహే
శ్వరకరుణాప్రసాదిత వి ♦ భాసిత సత్కవితాయుతుండ భా
స్వరవిభవేష్టలింగగత ♦ భక్త్యతిమాత్రపవిత్రగాత్రుఁడన్
గురుజనపూజనోత్సుకుఁడఁ ♦ గుత్సితలోకపరాఙ్ముఖాత్ముఁడన్. 42

గీ॥ తగరచించితి మును సుభ ♦ ద్రావివాహ, నాటకంబును శ్రీశైల నాథ ♦ దేవి
భ్రామరీశక్తి పేరిటఁ ♦ బద్యశతక, మును సుపర్వోక్తి శివతత్త్వ ♦ బోధినియును.

* మా తండ్రిగారగు ఈ శ్రీ వీరభద్రయ్యగారిప్పటికి 70 సంవత్సరములక్రితము నివాసస్థలిని వదలి శిష్యుల యాహ్వానముచేత ఈ సికింద్రాబాదుకు గాపురము వచ్చినారు.

ఉ॥ బమ్మెరపోతనాఖ్యకవి ♦ భానుఁడు భాగవతప్రబంధమున్
గమ్మనిపూవుతేనియలఁ ♦ గ్రాలెడు మేలిమిశైలిఁదీర్చి ని
త్యమ్మగు తేజముం బడయఁ ♦ దామరసాక్షునకిచ్చె నార్యవ
ర్గమ్ము కరమ్ముకౌతుకభ ♦ రమ్మున గీతరవమ్ము సేయఁగన్. 4

ఉ॥ పింగళిసూరనార్యకవి ♦ విజ్ఞవరుండు ప్రభావతీచరి
త్రం గమనీయకల్పనల ♦ రమ్యతరోక్తులఁదీర్చి భక్తియు
క్తిం గృతినిచ్చె దండ్రికి సు ♦ ధీమణు లంచితహర్షమొంద నా
రంగమదారకీర్తికవి ♦ రాజకిరీటుఁ దలంప నింపగున్.

వ. కావున నట్లే

## —* కృతిసమర్పణము *—

గీ॥ తల్లిదండ్రులకన్న ని ♦ తరముపరము, లేదనివచించు శాస్త్రని ♦ నాదసరణి
తల్లిదండ్రుల కీప్రబం ♦ ధంబొసంగి, ధన్యతనుగాంతు నెల్లవి ♦ ధముల నేను. 4

ఉ॥ నాజనకుండు చాలఁ గవ ♦ నంబునఁ బ్రేమము జెందికావ్యమొం
డోజ గ్రహింప నెంచియును ♦ యోగములేక గతించె నిప్డు డా
యోజఁ దలంచి తల్లికిని ♦ నొప్పఁగ నాదగుతండ్రి కీకృతిన్
భ్రాజితభక్తి నిచ్చెదను ♦ భర్గుఁడు దీని ననుగ్రహించుతన్. 4

క॥ ఒకయాశ్వాసముఁదల్లికిఁ, నొకయాశ్వాసంబుఁదండ్రి ♦ కొసఁగెద నాయీ
సుకృతకృతి నిద్ది వారల, కకలంకయశంబు నొసఁగు ♦ నాకల్పముగాన్. 4

క॥ కృతిపతులఁట తలిదండ్రులు, కృతిశైవమహాపురాణ ♦ గీతంబఁట యీ
కృతిరచయితనగు నేనిటఁ, గృతకృత్యుఁడనగుట కొండు ♦ కృషి గావలెనే. 4

*క॥ ఉద్బోధకుఁ డీశ్వరుఁడఁట, సద్భావముతోడ నిద్ది ♦ సల్పుటయఁట యీ
పద్యంగము లేకయె కృతి, యద్భుతగతిఁ బూర్తినొంది ♦ యలరుటయరుదే. 5

ఉ॥ మొక్కులు మ్రొక్కి వేల్పులకు ♦ మోదముతో ననుఁగన్నయంతనే
మిక్కుటమైన రోగములు ♦ మేకొని నన్నలయింపఁ జింతతోఁ
బొక్కుచుఁ బెక్కుపాట్లుపడి ♦ పోంకముఁగూరిచి పెంచి పెండిలిన్
జక్కఁగఁజేసి పెండ్లమును ♦ సంతతినిన్ నను సాఁకుతల్లికిన్. 5

గీ॥ నన్నుఁగని పదుమూడేండ్లు ♦ నాకునిండు, దాఁక నాకిష్టవస్త్రప్ర ♦ దానమున మ
దంబుఁగూర్చుచు విద్దెలఁ ♦ దార్పఁగడఁగి, యంతఁదాశివుఁజేరిన ♦ యట్టిపితకు. 6

వ. సమర్పితంబుగా నేనాంధ్రీకరింపఁబోవు శివపురాణంబునకుఁ గథాక్రమంబు.

* పాఠాంతరము : ఉద్బోధకరుఁ డీశ్వరుఁడఁట.

అవ్వానిలో సుప్రసిద్ధు లనేకులు పొడమి పేరుఁ బెంపుఁ గాంచినవార లందుఁ
కొందఱి నిందుఁ జేర్కొందు. 37

సీ॥ చిన్మయదీక్షాది ♦ శివమతగ్రంథక, ర్తృకశాఖ శ్రీసిర ♦ భద్రగురుఁడు
షడ్దర్శనాగమ ♦ శౌండుండు కేదార, లింగపండితరాజ ♦ పుంగవుండు
నందిగామాగ్రజ ♦ న్మోందుండు వేదాగ, మాంభోధి వీరభ ♦ ద్రావధాని
కొండవీడున నున్న ♦ కుసుమకోమలకావ్య, కమనీయవీరభ ♦ గనఘాత

గీ॥ పాణినీయాగమాంత వి ♦ భాసితోరు, బాదరాయణమునకలా ♦ భరితమహిత
పాండితీస్ఫూర్తి రచితశై ♦ వప్రబంధ, రంగదుదకీర్తి శ్రీనాగ ♦ లింగశాస్త్రి. 38

సీ॥ ఎవ్వానిశుభనామ ♦ మేప్రొద్దు నుడివిన, జనులఘంబాపసం ♦ చయము వోలఁగు
ఎవ్వానిచారిత్ర ♦ మేశైవమండలి, కెల్లయాదర్శమై ♦ యొసఁగ నొసఁగు
ఎవ్వానిదాతృత్వ ♦ మెల్ల దేశములందు, విఖ్యాతిఁగాంచి తా ♦ వింతఁ జనివి
ఎవ్వానిసద్బోధ ♦ లెంతకాలంబేని, వినుగుఁగాంచకయె తా ♦ వించు భక్తి

గీ॥ ఎవఁడు చేసిన పాట్యాలి ♦ క్షేత్రలింగ, పూజఁగావించెఁ బరులకుఁ ♦ బులకతతుల
నట్టిశ్రీశంకరారాధ్యుఁ ♦ డార్యబోధ్యుఁ, డనుపమానయశస్కుఁడై ♦ యవని వెలసె

వ. ఇఁక గుంటూరుమండలినుండి చేరి నిజాము దేశమందు నల్లగొండజిల్లాలోని నారా
యణపురంబందుఁ గాపురంబున్న మాతెగయందు .

సీ॥ సిద్ధసంపత్సర ♦ శివమంత్రమూర్తి శ్రీ, మంత్రమూర్తియె పితా ♦ మహుఁడునాకు
*నిరతాన్నదానాభి ♦ నిరతుండు వీరభ, ద్రగురుండు తండ్రి స ♦ త్స్వప్రపుండు
అమలగుణాఢ్యులై ♦ యలరినయట్టి శ్రీ, శరభమ్మనాగమల్ ♦ సనఁతిత్రయ
లకలంకచారిత ♦ హారితగోత్రోద్భవ, స్త్రైనలక్ష్మమ్మ మామ ♦ కీనజనని

గీ॥ సవతితల్లికుమారుఁడు ♦ శరభమూర్తి, యన్న శరభమ్మయాతని ♦ యనుజలిద్ద
రక్కలై నాకు వెలసిరి ♦ యమలమహేశులు, నాగవీరేశ్వరుండని ♦ నాదుపేరు. 41

చ॥ సిరులరహించు సైన్యపుర ♦ సీమ వసించెద నద్రిజామహే
శ్వరకరుణాప్రసాదిత వి ♦ భాసిత సత్కవితాయుతుండ భా
స్వరవిభ వేష్టలింగగత ♦ భక్త్యతిమాత్రపవిత్రగాత్రుఁడన్
గురుజనపూజనోత్సుకుఁడఁ ♦ గుత్సితలోకపరాఙ్ముఖాత్ముఁడన్. 42

గీ॥ తగరచించితి మును సుభ ♦ ద్రావివాహ, నాటకంబును శ్రీశైల నాథ ♦ దేవి
భ్రామరీశక్తి పేరిటఁ ♦ బద్యశతక, మును సువర్ణోక్తి శివతత్త్వ ♦ బోధినియును.

* మాతండ్రిగారగు ఈ శ్రీ వీరభద్రయ్యగారిప్పటికి 70 సంవత్సరములక్రితము నివాసస్థలిని వదలి శిష్యుల యాహ్వానముచేత ఈ సికిందరాబాదుకు గాపురము వచ్చినారు.

ఉ॥ బమ్మెరపోతనాఖ్యకవి ♦ భానుఁడు భాగవతప్రబంధమున్
గమ్మనిపూవుతేనియలఁ ♦ గ్రాలెడు మేలిమిశైలిఁదీర్చి ని
త్యమ్మగు తేజముం బడయఁ ♦ దామరసాక్షునకిచ్చె నార్యవ
ర్గమ్ము కరమ్ముకౌతుకభ ♦ రమ్మున గీతరవమ్ము సేయఁగన్. 44

ఉ॥ పింగళిసూరనార్యకవి ♦ విజ్ఞవరుండు ప్రభావతీచరి
త్రం గమనీయకల్పనల ♦ రమ్యతరోక్తులఁదీర్చి భక్తియు
క్తిం గృతినిచ్చె దండ్రికి ను ♦ ధీమణు లంచితహర్షమొంద నా
రంగమదారకీర్తికవి ♦ రాజకిరీటుఁ దలంప నింపగున్.

వ. కావున నట్లె

—* కృతిసమర్పణము *—

గీ॥ తల్లిదండ్రులకన్న ని ♦ తరముపరము, లేదనివచించు శాస్త్రని ♦ నాదసరణి
తల్లిదండ్రుల కీప్రబం ♦ ధంబొసంగి, ధన్యతనుగాంతు నెల్లవి ♦ ధముల నేను. 46

ఉ॥ నాజనకుండు చాలఁ గవ ♦ నంబునఁ బ్రేమము జెందెఁ గావ్యమొం
డోజ గ్రహింప నెంచియును ♦ యోగములేక గతించె నిప్పు డా
యోజఁ దలంచి తల్లికిని ♦ నొప్పగ నాదగుతండ్రి కీకృతిన్
భ్రాజితభక్తి నిచ్చెదను ♦ భర్గుఁడు దీని ననుగ్రహించుతన్. 47

క॥ ఒకయాశ్వాసముఁదల్లికిఁ, నొకయాశ్వాసంబుఁదండ్రి ♦ కొసఁగెద నాయీ
సుకృతకృతి నిద్ది వారల, కకలంకయశంబు నొసఁగు ♦ నాకల్పముగాన్. 48

క॥ కృతిపతులఁట తలిదండ్రులు, కృతిశైవమహాపురాణ ♦ గీతంబఁట యీ
కృతిరచయితనగు నేనిటఁ, గృతకృత్యుఁడనగుట కొండు ♦ కృషి గావలెనే. 49

*క॥ ఉద్బోధకుఁ డీశ్వరుఁడఁట, సద్భావముతోడ నిద్ది ♦ సల్పుటయఁట యీ
షద్భంగము లేకయె కృతి, యద్భుతగతిఁ బూర్తినొంది ♦ యలరుటయరుదే. 50

ఉ॥ మొక్కులు మ్రొక్కి వేల్పులకు ♦ మోదముతో ననుఁగన్నయంతనే
మిక్కుటమైన రోగములు ♦ మేకొని నన్నలయింపఁ జింతతోఁ
బొక్కుచుఁ బెక్కుపాట్లుపడి ♦ పోంకముఁగూరిచి పెంచి పెండిలిన్
జక్కఁగఁజేసి పెండ్లమును ♦ సంతతినిన్ నను సాఁకుతల్లికిన్. 51

గీ॥ నన్నుఁగని పదుమూడేండ్లు ♦ నాకునిండు, దాఁక సాకిష్టవస్తుప్ర ♦ దానమున ము
దంబుఁగూర్చుచు విద్దెలఁ ♦ దార్పఁగడఁగి, యంతఁదాశివుఁజేరిన ♦ యట్టిపితకు. 52

వ. సమర్పితంబుగా నేనాంధ్రీకరింపఁబోవు శివపురాణంబునకుఁ గథాక్రమంబు.

* పాఠాంతరము : ఉద్భవకరుఁ డీశ్వరుఁడఁట.

# —* గ్రంథారంభము *—

ఉ॥ ఎల్లజగంబులన్ సలుప ♦ నెంచి విరించినిఁగాంచి ప్రజ్ఞ శో
భిల్లఁగఁజేయు వేదములఁ ♦ బేర్మి నొసంగినవాని దీప్తి సం
ధిల్ల సమస్త దేహులకు ♦ ధీస్ఫురణంబుఁ బొనర్చువాని నా
యుల్లమునందుఁ గొల్తు నుమ ♦ నొప్పినడాతొడవాని నాదటన్. 53

క॥ శ్రీశైలసన్నికృష్టను, దేశోజ్జ్వలశివపురాఖ్య ♦ దివ్యపురభవా!
ఈశార్చనాభిరతకో, టీశారాధ్యేంద్రవరదు ♦ హిత! లక్ష్మ్యంబా! 54

వ. అవధరింపుము.

క॥ నైమిశవనమున లోక, క్షేమార్థము శౌనకాద్య ♦ ఖిలమానులు చే
తోమోదమొదవ సూతుని, తో మధురాలాపచయుచ ♦ తురతరభణితిన్. 55

ఉ॥ పావనమూర్తి! నీవలనఁ ♦ బల్మఱు వింటిమి విస్ఫురత్ప్రరా
ణావగతప్రమోదభరి ♦ తాద్భుతదివ్యకథాప్రబోధలన్
భావమునందు సంతసము ♦ పర్వెడు నైనను దృప్తిఁ గా దదే
మో? విన వేడ్కయే పొడము ♦ నుత్తుల రత్తుల శక్తి యెట్టిదో! 56

కం॥ నీవలె విద్యావిభవము, నీవలెఁ జాతుర్యధుర్య ♦ నిపుణత మఱియున్
నీవలె నవరసరుచిరవ, చోవిలసితధార లెవఁడు ♦ చూఱఁగొను ధరన్. 57

గీ॥ పారమేశ్వరవిజ్ఞాన ♦ భరితమూర్తి, వఖిలకల్యాణజనకనా ♦ నాగమార్గ
వేదివి పరాశరాత్మజా ♦ విమలచిత్త, మునకు నచ్చినశిష్యుఁడ ♦ వనఘ! నీవు.

గీ॥ ఎల్లవిద్యలసారంబు ♦ నెఱిఁగినట్టి, దిట్టమైనను బరులకుఁ ♦ దెలివిగలుగ
బోధసేయకయున్నదాఁ ♦ బొందునఘము, కలిమిగలిగియు నొసఁగని ♦ కరణిఁ బోలె.

క॥ విద్యయు బోధనమును నన, వద్యాచారప్రచార ♦ వైభవము గడున్
హృద్యగతి మెఱయు నీకడఁ, జోద్యముగా నొక్కొ! యిన్ని ♦ సొంపులు గుదురన్.

## —* శౌనకాదిమునులు సూతుని శివపురాణము వినుపుమని యడుగుట *—

ఉ॥ ఏది వినన్ మనంబునకు ♦ హెచ్చగుసంతస మావహిల్లి వే
ఱేది వినంగ వేడ్క జని ♦ యింపదు ముక్తిసతీకరగ్రహం
బేది వినన్ లభించుఁ ♦ బరమేశ్వరుఁ డేది వినన్ బ్రసాద మా
పాదన సేయు నట్టిది కృ ♦ పన్ సెలవిమ్ము మహాత్మ! మాకిఁకన్. 61

ఉ॥ ఎందునుగానిచూడ జగ ♦ దీశ్వరబోధకమా చరిత్రమే
డెందమునందుఁ గుందడఁచి ♦ శీఘ్ర మోక్షవధూటిసంగమం

బందిక గానొసంగఁదగు ♦ నన్యమిఁకట్టిదిగాదు గాన మా
కిందు నవేందుభృచ్చరిత ♦ మే విన నింపగుసొంపగుఁజుమీ ! 62

కం॥ కావునను శివపురాణము, వేవేగ మాకు నిపుడు ♦ వినిపింపుము సూ
తా ! విద్వజ్జనగీతా ! నీవైదుషిదీప్తులెంతొ ♦ నేరిమి దనరన్.

వ. అనుడు నంత సూతుం డాహ్లాదంబుతో

## —* సూతుఁడు హర్షించి ప్రారంభము సేయుట *—

ఉ॥ ధన్యుఁడనైతి వంగడము ♦ తథ్య మబాధ్యయశంబునొందె సౌ
జన్యనిధానులుఁ బుధులు ♦ సారతపోనిధులైన మీరు సా
మాన్యుఁడనైన నానుడుల ♦ మచ్చికతో విని మెచ్చి క్రమ్మఱన్
మాన్యతతో వినన్ గడఁగి ♦ మంజులతరోక్తుల నిట్లుగోరుటన్. 64

ఉ॥ అందును నెల్లలోకముల ♦ కాదిమకారణుఁడై దనర్చు న
య్యిందుధరున్ భజించు నల ♦ యింపగు శైవపురాణరాజమున్
విందొనరింపుమంచు సర ♦ విన్ ననుఁగోరుట కింతయంతయం
చుందలపెట్టరానిసిరిఁ ♦ జొక్కితి నిక్కితి సాటివారిలోఁ. 65

సీ॥ శివపురాణము భువిఁ ♦ జేకుఱుదనుకనే, బ్రహ్మహత్యాదిపా ♦ పములు పొదలు
శివపురాణము భువిఁ ♦ జేకుఱుదనుకనే, కలిమహోత్పాతము ♦ లొప్పలుచుచుండు
శివపురాణము భువిఁ ♦ జేకుఱుదనుకనే, కాలకింకరులసం ♦ కటములొదవు
శివపురాణము భువిఁ ♦ జేకురుదనుకనే, శాస్త్రంబులు వివాద ♦ సరణిమించు

గీ॥ శివపురాణంబిఁకనుభువిఁ ♦ జేరుదనుక,బరమశివతత్త్వమెఱుఁగఁగాఁ ♦ బడదుపుడమి
శివపురాణమిఁకనుభువిఁ ♦ జేరుదనుక, దివ్యవిజ్ఞానమంతయుఁ ♦ దేజరిలదు. 66

గీ॥ అట్టి శైవపురాణము ♦ నవనివినిన, జదివినను దత్ఫలంబునేఁ ♦ జాటఁగలనె ?
పద్యమేనర్ధపద్యమేఁ ♦ బఠనసేయ, వినిన సర్వాఘవితతులు ♦ విడుపునొందు 67

వ. కావున నింతకన్న మేలు తెలుంగు వేఱొక్కండు లేదిఁక సత్వరం బుపక్రమించెద
వినుండన్న నవ్వారలు హర్షంబుతో. 68

## —* శౌనకాదిమునులు సూతునితో శివతత్త్వంబు తీరెఱింగింపుమనుట *—

గీ॥ ఎంతయేనియుశుశ్రూష ♦ హెచ్చుచుండెఁ, జెప్పుమిప్పుడుకృపతోడ ♦ శివునితత్త్వ
మే మెఱుంగ మగుణుఁడైన ♦ యీశ్వరుండు, గుణములెట్టులఁజెందెనో ♦ కోవిదేంద్ర,

ఉ॥ సర్గముకన్న మున్నుఁబుర ♦ శాసనుఁ డెట్టులనుండు నింకనా
సర్గపుమధ్య నెక్కరణి ♦ జక్కఁగఁగ్రీడ యొనర్చు దానియు
త్సర్గమునం దెటుల్ మరలఁ ♦ దాపసియించుఁ గృపాళు! సెప్పుమా
భర్గుఁడు లోకశంకరుఁడు ♦ పన్నుగనెట్లు ప్రసన్నుఁడయ్యెడున్. 70

చ॥ అతఁడు ప్రసన్నుఁడై జనుల ♦ కర్మిలినెట్టి ఫలంబొసంగు? నా
వితతదయాకరుండు గడు ♦ వేగిరమొంది ప్రసన్నుఁ డౌనటం
చతులితమౌ ననుగ్రహము ♦ నారయునంచును భక్తకోటులన్
వెతపడనీయఁడం చెపుడు ♦ విందుము విందుగఁ దెల్పుతత్కథన్. 71

గీ॥ బ్రహ్మ విష్ణువు రుద్రుండు ♦ పరమశివుని, యంశజులటంచు సందుఁబూ ♦ ర్ణాంశుఁడల్ల
రుద్రుఁడని వినుచుందుమా ♦ రుచిరమూర్తి, విస్ఫురితలీలలను విని ♦ పింపుమనఘ!

క॥ రుద్రావిర్భావంబును, రుద్రాణీజన్మకథ ని ♦ రూపింపు విప
శ్చిద్రాజులు మెచ్చఁగ వి, ద్వద్రమణా! నీదుకీర్తి ♦ వర్ధిలుభువిలోన్.

వ. అనిన విని సూతుండిట్లనియె.

క॥ ధన్యులు కృతకృత్యులు మీ, రన్యులవలెఁగాదు నిర్మ ♦ లాంతఃకరణుల్
మాన్యులు మురియుచు వినుతు న, నన్యాదృశమైన ప్రమథ ♦ నాథకథనొగిన్. 74

గీ॥ శివకథానైష్ఠికమనీష ♦ చెలువుమీఱ, వెలసెనేనియు జాహ్నవీ ♦ సలిలమట్లు
పూతులనొనర్చు నాండ్రను ♦ బూరుషులను, బృచ్ఛకుని వినువారిని ♦ వినుమువాని.

క॥ భవరోగౌషధ మిదివినుఁ, డవిరళమోదమున నీప్సి ♦ తార్థప్రదమీ
శివచరితము నారదమౌ, నివరేణ్యుఁడు దండ్రినడుగ ♦ నీరజభవుఁడున్. 76

సీ॥ సంతసంబలరఁగ నాత్మ ♦ జన్మునకు వ, చించె నట్టుల మదికి రు ♦ చించ మనటుల
తపసులార! భవత్సన్ని ♦ ధానమందు, శాంకరయశంబు గానంబు ♦ సల్పువాఁడ. 77

## —* కథాప్రారంభము *—

### —* నారదముని తపస్సొనరించుట *—

క॥ అని వేగమె సూతుఁడు దన, మనమునఁ బరశివచరణ స ♦ మర్చణమును న
ష్ఠొనరించి యిట్లు పలికెను, ఘనమధురమరందసూక్తి ♦ కౌశల్యమునన్. 78

ఉ॥ నారదమౌనివర్యుఁ డొక ♦ నాఁడు మహేశ్వరభక్తియోగదీ
ప్తారతుఁడై తుషారగిరి ♦ కందరరాజమునొంది సంగతి

చారుతరంగశీకరర ♦ సప్రసరప్రకరాలవాలమా
లూరరసాలసాలతరు ♦ లుంగలవంగ వనంబు నొక్కెడన్. 79

ఉ॥ కాంచి మనంబునచ్చియటఁ ♦ గాపురమొంది వియన్నదిన్ గడున్
మించిన వేడ్కఁ గ్రుంకులిడి ♦ మేలుగ లోన 'శివోహ'మంచు యో
జించుచు నుండెనంతఁ గడ ♦ చెన్ జిర మాపయి వృత్రభేది వీ
క్షించి మునీశ్వరవ్రతముఁ ♦ జేవఁదొలంగి కలంగె నెంతయున్. 80

గీ॥ సంయమి దివంబుఁ దనకై వ♦సంబుఁ జేసి, కొనఁగ మదిఁ బూనితపసుఁగై ♦ కొనియె నిట్లు
లేకయుండిన నిట్టుల ♦ లోకదీప్తిఁ, బెద్దకాలంబొనర్చునే ♦ బిట్టుతపసు. 81

క॥ నేనూరకున్న నిటులే, మానక స్వారాజ్యమూడి ♦ మహితాత్మకుఁడీ
మానీంద్రు నొందు నిందను, మానము లేదెంతయేని ♦ మదిఁ బరికింపన్. 82

ఉ॥ కావున నిష్ఠె తాపసుని ♦ గర్వమణంగఁగ నత్తపంబునేఁ
బూవిలుకాని సాయమున ♦ బూదిరొనర్చెదనంచు వేగన
బ్భావజు నాత్మలో దలఁపఁ ♦ బంచశిలీముఖుఁ డేగుదెంచి తా
దేవర! యేమిసెల్వనుడు ♦ దేవవిభుండనె నివ్విధంబుగాన్. 83

చ॥ మునివరుడైన నారదుఁడు ♦ మూర్ఖత నాకధరాధిపత్యమున్
మనమునఁ గోరి ఘోరముగ ♦ మంచుమలన్ దపియించుచుండె నీ
యనుచరరాజిఁ దోడ్కొని ర ♦ యమ్మున నమ్మునిఁ జేరి కామవే
దనకు వశున్ బొనర్చి బలి ♦ తంపు తపమ్మును వమ్మొనర్పుమా! 84

మ॥ అని పంపన్ మరుఁడంత మాధవుఁ ద్రియా ♦ మాధీశు గంధానిలున్
దన వెంటన్ గొనిపోయి మౌనివరుచి ♦ త్తంబుత్తలంబొంది స్త్రీ
జనతాసక్తముగాఁగఁ జేయఁగడఁగన్ ♦ సర్వేశ్వరానుగ్రహం
బున నమ్మౌని రవంతయేనిఁ జలనం ♦ బున్ జెందకుండుటన్. 85

చ॥ కని మదనుండు భీతిఁగొని ♦ క్రన్నన నింద్రునిఁ జేరి తద్విధం
బును నవబోధచేసి చనెఁ ♦ బొల్పగు నారదశక్తి కెంతయున్
మనమున మెచ్చె దేవపతి ♦ మౌని చిరంబు తపించి యంత సి
ద్ధిని గడియించి నానని మ ♦ దిన్ గరువంబువహించి మించుచున్. 86

—* నారదముని, త్రిమూర్తులయొద్ద కేగుట *—

క॥ కాముని జయించితిని నేఁ, గామారినిఁ బోటిసేయఁ ♦ గంటి నిజతపం
బీమాద్రి సిద్ధిఁ జెందె నిఁ, కేమని యత్తపసుమౌని ♦ హెచ్చుగకలిమిన్. 87

శా॥ కైలాసంబునకేఁగి యాత్మసుతపో ♦ గంభీరభాగ్యంబు స
ర్వాలంకారునితోడఁ జెప్పఁటకునై ♦ యచ్చోటికిం బోయి య
స్నీలగ్రీవునిఁ జేరి మ్రొక్కి మిగులన్ ♦ నీటొప్ప నాత్మోన్నతిన్
వాలాయంబుగఁ దెల్పె శంకరుఁడు "వా ♦ హ్వా" యంచు హర్షించఁగా. 88

చ॥ శివుఁడు మునీంద్రు గర్వమును ♦ జిత్తమునందు నెఱింగియున్ గడున్
బ్రవిమలమైన భక్తజన ♦ వత్సలతన్ విడనాడ కమ్ముని
ప్రవరునితోడ నిట్లనెఁ జి ♦ రంబు తపంబొనరించి సిద్ధినై
భవమును జెందితీవు ముని ♦ వర్య! కడున్ గడు సంతసించితిన్. 89

క॥ ఐన నొకమాట సెప్పెద, మానసమున నుంపు దీని ♦ మఱవకు మెప్పుడున్
మౌనీంద్రా! వైకుంఠుని, తో నుడువకు నీ తపంబు ♦ తోరపు సిద్ధిన్. 90

క॥ అనిబోధించిన విని ముని, మనమున నది లెక్కఁగొనక ♦ మఱియుఁ గమలజ
న్మునియొద్దకేఁగి యట్టులె, తన కామజయంబుఁ దెలుపఁ ♦ దద్జ్ఞుఁ డతండున్. 91

క॥ శంకరు ననుగ్రహంబునఁ, బంకజసాయకజయంబు ♦ వాటిలె మునికా
పొంక మెఱుంగక యితఁ డిటు, మంకుతనమ్మొందె వదరు ♦ మాన్పెద నిట్టుల్. 92

క॥ అనికొని నారదమునితో, ననియెఁ గుమారా! మహేశ్వ ♦ రానుగ్రహ మ
ట్లనువుగ మన్మథజయముల్, బొనరించిన దండుఁగులకుఁ ♦ బోకు మెడందన్. 93

ఉ॥ మున్నట శంకరుండు తప ♦ మున్ బొనరించుచునున్న మన్మథుం
డన్నిటలాక్షు గెల్వఁజని ♦ యంతముఁ జెందెఁ దదీయ దేవి యా
పన్నగభూషణుఁ గొలిచి ♦ భర్తననంగునిగాఁగ నొందె నా
పున్నెపుభూమి శాంకరవి ♦ భూతి జయించితి వీవు కామునిన్. 94

క॥ చను మదరిపాటుఁ జెందకు, తనుజ! యనుడు నారదుఁడు హి ♦ తవు నరయక య
వ్వనజాక్షుని చెంగటకేఁ, గిన నాతం డరసి వేడ్కఁ ♦ గీల్కొను మదితో. 95

ఉ॥ ఏమి మునీంద్ర! తెల్పె? యిపు ♦ డెచ్చటనుండి మదీయధామమున్
బ్రేమము మీఱఁ జేరితివి ♦ పెద్దయుఁ బ్రొద్దులు మంచుఁగొండలో
నేమము మీఱఁగాఁ దపసు ♦ నెగ్గఁగఁ జేసితివయ్య! నీకు దీ
టీమహి వచ్చునే పెఱబు ♦ షీంద్రులలో నొకఁడేనిఁ జూడఁగన్. 96

—* నారదుఁ డహంకరించుట *—

ఆ॥ అని బహూకరింప ♦ నమ్ముని పొగరునఁ, దనదు తపసు పెంపుఁ ♦ దమ్మివిల్తు
గెలుపు హెచ్చు మీఱఁ ♦ గేరుచుఁ జెప్పెను, హరియు వినియె మంద ♦ హాసమలర.

వ. అంతఁ బుండరీకాక్షుండు,

క॥ విని యెందఱయ్యెడ నైన శి, వుని మాయాసరణిఁ దపసి ♦ పొలుపఱియిట్టుల్
మనసిజుని నిర్జించితి, నని సారస్యోక్తులను ♦ గోయు నజ్ఞతబలిమిన్. 98

సీ॥ అనిమనంబునఁదలఁచిదిఁ♦వ్యఋషియుల్ల,మలరఁగాబల్కె మునియును♦హరుసమొంది
కంజనయనునితోనఁనెఁ ♦ గాముఁడేమి, సెయఁగలఁడు మహాత్మక! ♦ చేవమిాఱి.

క॥ అని గర్వపడి మునీంద్రుఁడు, చనిమెను దనయిచ్ఛకలిమిఁ ♦ జక్రాయుధుఁడ
మ్మునిపైఁగినిసి శివేచ్ఛన్, దనమాయను ద్రోవలోనఁ ♦ దనరఁగఁజేయన్. 100

మ॥ హరినిన్ బాసి మునీంద్రుఁ డెందొంచనఁబో ♦ నర్థంబునం దొక్కచోఁ
బురమొక్కండగుపట్టెఁ గగ్బురమయ ♦ పోత్తుంగహర్మ్యంబు సుం
దరనారీనరవర్గసేవితము నా ♦ నావస్తువిస్తారబం
ధుర మత్యద్భుతవైభవంబుముని యు ♦ ద్భూతాభిలాషాత్ముఁడై. 101

—* నారదుఁడు శ్రీమతిఁజూచి మోహించుట *—

మ॥ నగరున్ జొచ్చి నరేంద్రమందిరము నొం ♦ దన్ బోవఁగానందు భ
వ్యగుణుం డప్పురినేలు శీలనిధియన్ ♦ బ్రఖ్యాతభూనేత రూ
పగుణాలంకృతయైన శ్రీమతియనా ♦ బాలన్ స్వకీయాత్మజన్
దగురాజన్యున కీఁదలంచి పురమ ♦ త్యంతంబు నై సేసియున్. 102

ఆ॥ రాజవరులనెల్ల ♦ నోజమైఁ బిలిపించి, తగస్వయంవరము బొ ♦ సఁగఘటించి
పుత్రిహస్తమందుఁ ♦ బూదండనిడి మది, కిష్టమైనవాని ♦ కేయుమనియె. 103

ఉ॥ అత్తఱి మానియున్ జెవరి ♦ నట్టిమనంబున నందుఁజేర రా
జోత్తముఁ డాతఁ డమ్మునికి ♦ నొప్పఁగఁబాద్యము నర్ఘ్యమిచ్చి మేల్
ముత్తెపుగద్దె యెక్కనిడి ♦ పుత్రినిఁ దోడ్కొనివచ్చి మానిరాట్
సత్తము పాదపద్మములఁ ♦ జక్కఁగ మ్రొక్కఁగఁజేయ నాతఁడున్. 104

ఉ॥ కన్నెనుజూచి యచ్చెరువుఁ ♦ గాంచి మునీంద్రుఁడు మన్మథాస్త్రసం
పన్నమనంబుతో నృపతి ♦ వర్యునికిట్లనెఁ బార్థివేంద్ర! యీ
సన్నుతగాత్రి దివ్యతను ♦ జాతవలెన్ గనుపట్టుచున్న దీ
చిన్నది యెవ్వతో చెపుము ♦ చెచ్చెర ముచ్చటదీర నాకిఁకన్.

వ. అనిన నజ్జననాథుం డిట్లనియె.

చ॥ మునివర ! నాదుకూఁతురు స ♦ ముజ్జ్వలరూపనిధాన దీనికి
ప్తనువుగ భర్తఁగూర్పఁగ స్వ ♦ యంవరముం బొనఁగించినాఁడ నా
తనుజకుఁ గల్గుభాగ్యమును ♦ దద్‌జ్ఞులు మీఱ లెటింగియుండు రి నా
మనములరం వచింపుఁడు న ♦ మస్కృతులం బొనరింతు మీకొగిన్. 106

ఆ॥ అనుడు మౌనియనియె ♦ నధిప! నీకూఁతురు, కలిమిచెలువవోలె ♦ వెలయు సిరుల
విభుఁడు మరునిఁగన్న ♦ వెన్నుఁడే యనఁదగు, నట్టులమరు మీఱు ♦ హరుసమునను.

క॥ అనినొడివి నారదుండా, జనపతికడనుండి విష్ణు ♦ సన్నిధికి వెసన్
జని యాయనఘున కారా, తనయ స్వయంవరవిధంబుఁ ♦ దగఁజెప్పె వెసన్. 108

మ॥ హరి ! నామానసముం హరించె నృపక ♦ న్యారత్న మెట్లోననుం
జరితార్థుం బొనరించు మేల్‌సొబగు సం ♦ ధానింపు మాలోకసుం
దరియా నగ్గరితం బరిగ్రిహము నొం ♦ దంజాలనేనిం బొరిం
బొరిఁ బుష్పేషుశరార్చిఁ గాల్పఁబడుదుం ♦ బోనాడుదుం బ్రాణముల్. 109

గీ॥ మేల్మిబంగారుబొమ్మ య ♦ మ్మోలఁతలక్ష్మి, తోడ నెనవచ్చు నీకైనఁ ♦ దోయజాక్షి
అరమరయొనర్పకఱతయం ♦ దలరుదండ, నేయఁగావున నీరూప ♦ మిమ్మునాకు.110

గీ॥ అనుచుఁ గడువేడుటయు హరి ♦ యల్లనసగి
యనియె వెరామోటమరయనే ♦ యకట నీదు
మాటనేఁ ద్రోసివేతునే ♦ మౌనితిలక !
చనుమటులె యిచ్చితిని జక్కఁ ♦ దనపురూపు. 111

క॥ హరివచనమ్మును విని ముని, హరుసంబున నృపసుతాస్వ ♦ యంవరశాలన్
బిరబిరగఁజేరి యచ్చట, హిరణ్యపీఠిని వసించె ♦ నెంతయుఁ బేర్మిన్. 112

క॥ హరియొసఁగెన్ మునికి మనో, హరమగు తన మేలిరూపు ♦ నఱితవఱకుఁబై
హరిశిరసుం గూరిచె నిది, యరయక మునిగూరుచుండె ♦ నచట మురియుచున్.113

ఉ॥ అచ్చటివారలందఱును ♦ నమ్ముని యాకృతిఁజూచి నవ్వుచున్
బిచ్చబికారి యీతఁడిటఁ ♦ బెచ్చగుప్పూనికిఁ గూరుచున్న వాఁ
డిచ్చెలిఁ బెండ్లియాడుతమి ♦ నీ దొరలన్ విడనాడి యీతనిన్
మెచ్చి వరించునే ? యకట ♦ మీనవిలోచన యెట్టులేనియున్ 114

క॥ క్రోఁతికిఁ గొబ్బరికాయయె, యీతరుణీమణికి నాథుఁ ♦ డీతండైనన్
గోఁతిమొగము ముని యితఁ డీ, ట్లాతురపడుచుండెఁ గన్నె ♦ నాసించికడున్. 115

గీ॥ అనుచు నచ్చటివా రను ♦ కొనుచునుండి
రా జగన్మోహిని యనంగ ♦ నలరు రాచ
కొమిరె కూర్చుండియున్న భూ ♦ రమణవరుల
నొక్కొకరిఁ జూచుచుం బాయు ♦ చుండె నందు. 116

క॥ నారదమునినిఁ గని చె, న్నారెడు రూపంబు వాన ♦ రాస్యముఁగని లోఁ
గూరిమిఁజెందక తొలఁగెను, సారెకు ముని యఱుతసాచి ♦ చక్కఁగనుఁగొనన్.

## విష్ణుమూర్తి శ్రీమతినిఁ బెండ్లాడి వైకుంఠమునకుఁ దోడ్కొనిపోవుట.

క॥ అత్తఱిఁ గమలాక్షుండా, బిత్తరియెడ వేడ్కఁజెంది ♦ పేరిమి నొకరా
జోత్తముఁడై యటఁజేరుడు, నత్తలిరుంబోఁడి సూచి ♦ హారము వేసెన్. 118

ఉ॥ అంత సరోజనేత్రుఁడు ప్రి ♦ యంబున నక్కలికిం గ్రహించి బల్
సంతసమొప్పఁగాఁ దనదు ♦ సద్మముఁజేరె నరేంద్రులెల్లరున్
జింతిలి వేగవేగముగ ♦ స్వీయపురంబుల త్రోవఁబట్టిర
ట్లంతయుఁ జూచి నారదుఁడు ♦ హా! యిదియేమి యటంచుఁ గించతో. 119

ఉ॥ వారిని వీరినిం దఱిసి ♦ బాలిక నెవ్వఁడు గొంచుఁబోయె బం
గారుసరంబు నాయఱుతఁ ♦ గామిని వేయఁగఁబూనియుండె మీ
రారయఁ డెందునున్నదొ ర ♦ యంబుననంచు మునీంద్రుఁడాడ గౌ
రీరమణప్రియుల్ మఱిమ ♦ ఱిన్ మునిఁగాంచుచు నిర్వురప్పొటన్. 120

చ॥ నగుచు నిటుల్ వచించి రల ♦ నాతుక నెత్తుకపోయె విష్ణు వ
మ్మగువ నినున్ వరించునొకొ ♦ మర్కటవక్త్రుఁడ! చాలుఁజాలు నీ
మొగమును గన్నరోఁతవొడ ♦ మున్ గడుఁ జక్కఁదనాలబాలవున్
దగుదునటంచు నెట్టులు మ ♦ నంబున నెంచితొ? కొంచకింతయున్. 121

క॥ బంగరువిరిసరమును నా, రంగారుమరాళరాజ ♦ రాజగమన సా
రంగవిలోచన హరియఱు, తం గైసేసెను గ్రహించెఁ ♦ దన్వి నతండున్. 122

ఆ॥ ఇటుల వారు చెప్ప ♦ నీరసతో మౌని, వారిఁజూచి గినిసి ♦ మీరలిట్లుఁ
నన్ను వెక్కిరించి ♦ నారు గావున భువి, దనుజయోనిఁ బుట్టుఁ ♦ డని శపించె. 123

క॥ వారలు జ్ఞానధనముచే, కూరినవారౌట మదినిఁ ♦ గుందక శివే
చ్ఛారీతి నడచునని యు, న్నారదునిన్ దూఱరైరి ♦ నడచిరెచటికో. 124

## —* నారదుఁడు విష్ణుమూర్తిని శపించుట *—

ఉ॥ అంత మునీంద్రుఁ డాత్మముఖ ♦ మద్దమునన్ బరికించి విస్మయ
క్రాంతమనస్కుఁడై దనుజ♦ ఘస్మరుఁ డిట్టులొనర్చెనంచు లోఁ
జింతిలి భగ్నభగ్నమను ♦ శీఘ్రరుషాగ్ని భరంబుతో నిశా
టాంతకుఁ జేరి నిల్చి కడు ♦ నాతతరౌద్రమయోక్తి నిట్లనెన్. 125

ఉ॥ మోసమటుల్ బొనర్చితి వ ♦ మోఘవచస్కుఁడవంచు నెంచి నే
నాసను జెంది యట్లు నిను ♦ యాచనచేసినదానికిట్లు బల్
దోసమునాకమేసితివి ♦ తుంటరి! కొంటెతనంబు చెయ్వు వి
శ్వాసవిఘాతుకా! యరక ♦ సల్పిననేరము రిత్తవోవునే. 126

ఉ॥ పూనికతోడఁ గట్టికుడు ♦ పుణ్ నిను నీయఘమెంచిచూడు నా
మానసమున్ గరంచిన కు ♦ మారినిఁ జేకొని పల్వురందు నా
కీ నగుఁబాటుఁగూర్చితివి ♦ హెచ్చుగ నీవిటు స్త్రీకతంబునన్
బూనెదుగాక పెన్వగను ♦ బూనెదుగా కపహాస మిద్ధరన్. 127

క॥ మఱియున్ వానరముఖమును, సరియుని నాకిచ్చినట్టి ♦ చందమునకు వా
నరులే శరణంబౌదురు, నరుఁడవు నీవగుము వగఁద ♦ నరుదువు భువిలో. 128

సీ॥ ఇట్లుమునిశాపమిచ్చిన♦ నీశ్వరేచ్ఛ, యనుచుఁబురుషోత్తముం డెద్ద ♦ యనక కినుక
లేకయానందముననుండె ♦ వీఁక మెఱయ,శంకరునిమాయయంతన ♦ జ్జటిలుఁబాయ.

మ॥ మునివర్యుండు ప్రబోధమొంది కినుకన్ ♦ భోగీంద్రతల్పున్ శపిం
చిన దోసంబున కెంతయేని మదిని ♦ స్సీ! యంచు భీతాత్ముఁడై
వనజాతాక్షునిఁజేరి మ్రొక్కి చెడితిన్ ♦ బాపంబిటుల్ కట్టికొం
టిని సర్వామరవంద్యు శ్రీవిభుని నే ♦ నిందించి కుందించితిన్. 130

ఉ॥ ఎట్లుమహాత్మ! నిన్ను శపి ♦ యించినదోసము నాకుఁబాయు నీ
వెట్లు భరించి యుందఁగల ♦ వీ చెడుతాపసి యేవమైనయీ
తిట్లు సహింపరాని వికఁ ♦ దీండ్రపుటల్కను ముక్కముక్కయా
నట్లుగ నన్నుఁజెండఁదగు ♦ నండజకేతన! చక్రధారచేన్. 131

క॥ అప్పగిది సేయ వేనిన్, డెప్పరమగు నిరయమొంది ♦ దిక్కుఁగనక బల్
ముప్పున ముఱిగెద నిఁక నా, తిప్పలు పాయునటులే వి ♦ ధింపుము శిక్షన్. 132

చ॥ అని యనినంత శ్రీదయితుఁ ♦ డల్లన నవ్వి మునీంద్రుతోడ ని
ట్లనె మునిరాజ! యేలయిటు ♦ లాత్మ మఱింగెద వంత యీశ్వరే
చ్ఛను నడుచున్ మఱొక్కరి వ ♦ శంబగునే పనిలేనియిట్టి వే
దనఁగొన కమ్మహేశ్వరు నె ♦ దన్ దలపోయుము పాయుమజ్ఞతన్. 133

చ॥ సకలముఁ గాలచక్రమును ♦ శంకరుఁడే తిరుగంగఁజేయు నా
యముఁడతఁ డన్నియాత్మలకు ♦ నక్షరమూర్తి, కృపానువర్తి, మా
మకదయితుండు నిచ్చలు ర ♦ మాసతి యేనును దత్పదాబ్జముల్
దికమకలేక కొల్చెదము ♦ దివ్యమునీ! గుఱుతింపు మింపుగన్. 134

ఉ॥ వినవుగూడ శాంభవ మ ♦ హాద్భుత మాయకులోఁగి యెప్పుడే
ష్టైనను బ్రహ్మదేవుఁడు మ ♦ హేంద్రుఁడు మోహమునొందుచున్ వగన్
బూనుచునుండు మట్లగుటఁ ♦ బూని మఱెవ్వరు దాఁటఁజాలువా
రానియతిన్ గరంబెఱిఁగి ♦ యక్కట యెక్కసపాటు మానుమా. 135

— * విష్ణుమూర్తి నారదునకు హితోపదేశంబు చేయుట * —

ఉ॥ నీదగుహంకృతిన్ మలుపఁ ♦ నీలగళుండటు గూర్చెనీకునున్
నీదుముఖంబునన్ మరల ♦ నేర్పుగనాకును శాపసూక్తినా
పాదనచేసెఁ దాన గరు ♦ వంబు భయంబును మాను చిత్తమా
హ్లాదమునొంద నిందుధరు ♦ నన్వహమున్ భజనంబొనర్పుమా. 136

శా॥ దానన్ నీకఘముల్ తొలంగు సుచరి ♦ త్రఖ్యాతి యేపొందు వి
జ్ఞానంబబ్బును పెంపమందఁగల నా ♦ నాసంకటాంకూరముల్
లోనన్ మ్రగ్గు శుభైకమూర్తివయి యీ ♦ లోకంబులన్ మింతువీ
నీనేర్పున్ గని చేతురింక జనముల్ ♦ నిత్యంబు శర్వార్చనన్. 137

క॥ మనసున వాక్కున గాత్రం, బున శంకరుఁగొల్చునతఁడె ♦ బుధుఁడును పుణ్యాం
డును ధన్యుండును వైదికుఁ, డును జీవన్ముక్తుఁడగుఁ గ ♦ డున్ బేర్మి మెయిన్.

క॥ శివనామం బనియెడుఘన, దవహేతికి నఘవనములు ♦ దగ్ధములగు నా
శివనామతరిని గొని యీ, భవనీరధి దాఁటవలె ను ♦ పాయమున మునీ. 139

క॥ భవదవమధ్యంబునఁ జి, క్కువడి నడచుచున్ గరంబు ♦ కుందెడువారల్
శివనామ సుధారస వృ, ష్టివలనఁ దెలిపిగొని శాంతి ♦ నేమంబు భువిన్. 140

క॥ పలుజన్మంబులఁ దపసుల్, సలిపిననేగాని భక్తి ♦ శంకరునియెడన్
గలుగదు కలిగినయేని స, కలదేవులసరిగ శివునిఁ ♦ గనునట్లమరున్.। 141

సీ॥ లాఁతివేల్పులసరిగ బా ♦ లశశిధరుని, యెడఁబ్రపత్తియొనర్చిన ♦ యేని మనసు
నందుఁజాపల్యవైఖరి ♦ నొందియమరు, నేని యాభక్తివితయగు♦ నెఱుఁగుమార్య!

క॥ వినుముని! యెందునుసామ్యము, గననిదియై చపలగుణము ♦ గననిదియై వా
సినిమెఱయు శంభుభక్తి భు, విని సర్వార్థంబులొసఁగు ♦ వేడ్కలుమించన్.

క॥ నుదుటను బూదియు నఱుతన్, రుదురాకలు నాల్కలో వి ♦ రూపాక్షునిపే
రొదవినచో నవ్వాఁ డఘ, విదళనము నొనర్పఁగలఁడు ♦ విజ్ఞవతంసా. 144

క॥ బాపలసామ్ములఁదోఁచియు, బాఁపలఁగొట్టియును వేఱు ♦ పాపంబుల నా
టోపంబున సల్పియు నా, పాపంబులఁబ్రాయు శివుని ♦ భక్తిఁబడసినన్. 145

క॥ ఆపాదమస్తకము భ, స్మాపాదన మొందుమెప్పు ♦ డఖిలాంగములం
దోపిక రుదురక్కలఁగొను, శ్రీపంచాక్షరజపంబు ♦ సేయుము మానీ! 146

క॥ శివకథలఁ జెప్పుమెప్పుడు, శివకథలను వినుచునుండు ♦ శివభక్తులనుల్
శివునిన్ గొలుచుచునుండుము, శివతీర్థంబులకుఁజనుము ♦ సేమంబొనరున్. 147

ఉ॥ అందును వారణాసికిఁ బ్రి ♦ యాణమొనర్పుము దేవమౌని! ము
న్నందుగ శంకరుం డచటఁ ♦ బొంగుచు భూధరరాజకన్యతో
నందనరాజితో నమర ♦ నాయకముఖ్యులతోఁడ వాసమున్
బొందివసించు నయ్యుదియ ♦ పూర్వము సృష్టికి శిష్టతల్లజా. 148

ఉ॥ అచ్చటనుండి యెల్లయభ ♦ వాయతధామము లీక్షచేసి సొం
పెచ్చఁగ సత్యలోకమున ♦ కేగి భవద్గురు సారసోద్భవున్
హెచ్చుగఁ బూజసేసి పర ♦ మేశ్వరతత్త్వ మెఱుంగఁగోరు మా
సచ్చరితుండు శైవజన ♦ సత్తముఁ డర్సమెసంగఁ జెప్పెడున్. 149

క॥ అనిపనిచిన నతఁడునుగడు, మనమున సంతసముఁజెంది ♦ మధువైరికి వం
దనములఁబొనర్చి రయమున, ఘనపుణ్యావితానరాశిఁ ♦ గాశిన్ జేరెన్. 150

సీ॥ చేరి మిన్నేటియం దభి ♦ షేకమొంది, విశ్వనాథునిఁ దద్దేవి ♦ విఘ్నపతినిఁ
గొలిచి భైరవుఁబూజించి♦జలజనయను,మాధవునిభజియించి సం♦ బరము మెఱయ.

శా॥ శ్రీశైలేశు భజించి భ్రామరిని సం ♦ సేవించి శ్రీకాళహ
స్తీశున్ దత్సతిఁ బూజచేసి నటనా ♦ ధీశున్ దదీయప్రియన్
బ్రాశస్త్యంబుగఁ గొల్చి పాండ్యవిభు దా ♦ రాయుక్తునర్చించి రా
మేశున్ బర్వతవర్ధనిన్ బ్రియముమై ♦ నీక్షించి సేవించియున్. 152

గీ॥ ఏకసహాకారవిభుని నా♦గేశుఁద్ర్యంబ, కేశు ఘుశ్మేశు నుజ్జయి ♦ నీశుఁ బ్రణవ
నాథు శ్రీభీమశంకర♦ నాథు సోమ, నాథుఁ గేదారనాథుఁ ద♦న్నలినదృశల. 153

—* నారదుఁడు బ్రహ్మయొద్దకేఁగి శివతత్త్వంబుఁ జెప్పుమనుట *—

క॥ కొలిచి యజుఁజేరఁజని జో, తలసలిపి స్వవృత్తమెల్లఁ ♦ దాఁదెలిపి వెసన్
నేఁదలఁ దాల్చినదోరయ, క్కలిమిఁ దెలియఁగోరి భూరి ♦ కౌతుకమమరన్. 154

గీ॥ శివునితత్త్వం బెఱుఁగఁగోరి ♦ చేరినాఁడ, తండ్రి! నిన్నద్ది తెలుపుమా♦ తత్త్వవేది
వీవగుట నగుణుండైన ♦ యీశ్వరుండు, గుణతనెట్టులఁజెందెనో ♦ కోవిదేంద్ర. 155

ఉ॥ సర్గముకన్న మున్ను స్మర ♦ శాసనుఁడెట్టుల నుండు నింకఁ దా
సర్గపుమధ్య నెక్కరణిఁ ♦ జక్కఁగఁ గ్రీడయొనర్చు దానియు
త్సర్గమునం దెటుల్ మరలఁ ♦ దావసియించుఁ గృపాళు! చెప్పుమా
భర్గుఁడు లోకశంకరుఁడు ♦ పన్నుగ నెట్లు ప్రసన్నుఁడయ్యెడున్.

చ॥ అతఁడు ప్రసన్నుఁడై జనుల ♦ కర్మిలినెట్టి ఫలంబొసంగు నా
వితతదయాకరుండు కడు ♦ వేగిరమందె ప్రసన్నుఁడౌనటం
చతులితమౌ ననుగ్రహము ♦ నారయునంచును భక్తకోటులన్
వెతవడనీయడంచెపుడు ♦ విందుము విందుగఁదెల్పు తత్కథన్. 157

గీ॥ నీవు వెన్నుఁడురుద్రుఁడౌ♦నిత్యమూర్తి, యంశములటంచునందుఁ బూ♦ర్ణాంశుఁడిందు
మౌళి యని వినుచుందు మా♦మహితమూర్తి, విస్ఫురితలీలలను విని♦ పింపు మనఘ.

వ. మఱియు నానీలలోహితుని యావిర్భావంబును, రుద్రాణీజన్మోదంతంబును, సాకల్యంబుగ నెఱింగింపుమని ప్రార్థించుచుండ నంత సంతుష్టుండై విరించనుం డిట్లనియె. 159

—* బ్రహ్మదేవుఁడు నారదునకు శివతత్త్వంబు తీరెఱింగించుట *—

ఉ॥ చాలఁగ సంతసంబొదవెఁ ♦ జక్కఁగ లోకహితార్థివై యిటుల్
మేలుగ శైవతత్త్వము న ♦ మేయమెఱుంగఁగఁ గోరినాడ వా
బాలశశాంకశేఖరుని ♦ భాస్వరవృత్తము విన్ననెట్టి పా
పాలనులేనిఁ దక్కులువ ♦ మంటశ గెంటి సుఖింతు రాత్మజా. 160

శా॥ ఐనన్ బుత్త్రిక! శైవతత్త్వమును వి ♦ శ్వాద్యుండుఁ బద్మేక్షణుం
డేనున్ నిక్కమెఱుంగఁ జాలమిఁక యె ♦ ట్లేనర్కునిన్ దీపమ
ట్లేనిప్పట్ల నెఱుంగఁ జెప్పెదను వి ♦ న్మీ! నాదు వైదుష్యవి
జ్ఞానశ్రీపరిమాణ మెంతవఱ కో ♦ జ్ఞంజేసి రంజించునో. 161

చ॥ విను మఖిలప్రపంచలయ ♦ వేళఁ జరాచరవస్తుజాల మె
ల్లను లయమొందినప్పు డఖి ♦ లమ్ము తమోమయమై యనర్కమై
యనలనిశాకరగ్రహధ ♦ రాంబువియత్పవమానశూన్యమై
యనహమునై యరాత్రిమయి ♦ యప్రతిమంబగు నప్రధానమై. 162

తే॥ పంచతన్మాత్రలవియు న ♦ ప్పట్ల వెలయ, పట్టిసూదుల బెజ్జమా ♦ నట్టిగట్టి
బెట్టిదపు గుర్డ్డిచీఁకటి ♦ పెరిమయమర, నుండె సద్వస్తువొక్కండు ♦ నిండుమీఱి.

క॥ అదిమాటగు పోలికయు, ట్లాదవిన నది సదసదాఖ్య ♦ నొందును యోగుల్
సదమలచిత్తులు దీనినె, హృదయాకాశంబులోన ♦ నీక్షింత్రెపుడున్. 164

ఉ॥ వాకులుడెంద మాయెడను ♦ వైదుషిచాలక వెన్కకేగుఁజే
రేకనరాదు రూపునొక ♦ రేకయుతోఁచదు బల్పుచిక్కుటల్
చీకుటలేవు పెద్దదియుఁ ♦ జిన్నదియాటయు లేదు పొడ్గునున్
గాకయుఁ బొట్టిగాక తగుఁ ♦ గానక యేదొకవర్ణవైఖరిన్. 165

క॥ కలదని చెప్పిన యత్తొలి, పలుకు గడున్ జడియు యోగి ♦ భావసుగమమై
యలరెడు నవికారము ని, శ్చలము నిరాధారమగుచు ♦ సంయమివర్యా! 166

క॥ సత్యము జ్ఞానమనంతము, వ్యత్యయరహితంబునున్ జి ♦ దాత్మకమగుచున్
నిత్యానందమునగుచుఁ బ, రిత్యక్తోపద్రవ మల ♦ రె నొకమహాపుటన్. 167

గీ॥ అప్రమేయ మనారంభ ♦ మద్వితీయ, మాకృతివిహీన మవికార ♦ మగుచు నిర్వి
కల్పమునునిర్గుణం బాత్మ ♦ కారణంబు, నగుచు నిర్మాయమైయల ♦ రారునొకఁడు.

—* శివుఁడు సగుణుండై యేర్పడుట *—

గీ॥ విగ్రహములేక యీరీతి ♦ వెలసికొంత, కాలమైనంతఁ దనుదానె ♦ కల్పనంబు
చేసికొని యొకమూర్తియై ♦ చెలువుమిగిలె, లీలమెయిమించునేరిమి ♦ మేలుమీఱ.

వ. మఱియు నమ్మూర్తియు.

క॥ సర్వైశ్వర్యగుణంబుల, సర్వజ్ఞానమునఁ దనరి ♦ సర్వగమగుచున్
సర్వమునున్ గ్రసింపుచు, సర్వాద్యయు సర్వవంద్య ♦ సర్వదయగుచున్. 170

గీ॥ సర్వమును బొనరించుచు ♦ శాంతశుద్ధ, రూపమైశ్వర మిభ్భంగి ♦ యేపుమిగుల
నంత నంతర్థినొందెఁ జి ♦ దాత్మమైన, యప్పరబ్రహ్మమెల్లెడ ♦ సమరుసన్ని.

క॥ ప్రాచీనంబయి రూపం, బేచొప్పడనట్టి బ్రహ్మ ♦ మిటుగొనరూప
ర్వాచీనులైనవారుఁ, బ్రాచీనులు శివునిగా స్మ ♦ రణ చేసిరొగిన్. 172

వ. అంతఁ గొంతకాలంబునకు.

## — * సగుణశక్తి యేర్పడుట * —

గీ॥ ఏకమండయి తనయిచ్ఛ ♦ నెసఁగునీశ్వ
రుండు దనమూర్తినుండి యొ ♦ కొండు శక్తి
తనువు సృష్టించె నయ్యది ♦ తనను బాయ
కుండునట్టిది నీడ య ♦ ట్లొందికగను. 173

క॥ దానినె ప్రకృతినిగాఁగఁబ్ర, ధానముగా మాయఁగాఁగఁ ♦ దద్జ్ఞులనుదు ర
ద్దానినె బుద్ధికి మాతను, గానెఱుఁగుము త్రిగుణకలిత ♦ గా నెఱుఁగు మునీ!

క॥ ఆపెయె యంబిక వినుమా, యాపెయె సకలేశ్వరియును ♦ నరుదొప్పఁగ న
య్యాపెయె త్రిదేవజననియు, నాపెయెయగు మూలకార♦ణాఖ్య కుమారా!

వ. మఱియు నమ్మహేశ్వరి రూపవిశేషంబుల గుఱించి పేర్కొనుటకు శక్యంబు
గాదు. 176

సీ॥ శంఖచక్రగదాసి ♦ శరకార్ముకాభయ, వరదాష్టహస్తముల్ ♦ వాసిమీఱ
ఇందుసహస్రభా ♦ యుష్ణవిద్యుతి వొల్చు, ముఖదీధితిచ్ఛటల్ ♦ మురిపమెసఁగ
ఫుల్లారవిందవి ♦ స్ఫూర్తి మీఱెడువాలు, కనుదోయికాంతి చొ♦క్కముగనిగుడ
నవరత్నమయములౌ ♦ నగలనొప్పిదమైన, తనువెంతొ మేల్మి సం♦తసమునీన

గీ॥ తలఁపఁగ నశక్యమగు తేజ ♦ మలరుచుండ
నఖిలమున కాదిహేతువై ♦ హరువుమీఱ
నొకతెయైయుండి పెక్కురై ♦ యొప్పుపెంపు
గలిగి యమ్మాయ పొదలుమేల్ ♦ చెలువమమర. 177

గీ॥ పరమపూరుషుఁడైనయా♦భర్గుఁడపుడు, ఫాలచంద్రుఁడుముక్కంటి♦ పంచముఖుఁడు
దశభుజుండును గర్పూర♦ ధవళుఁడై శి, రమునగంగను జేతశూ♦ లమునుదాల్చె.

క॥ అట్టిశివుండును శివయును, బెట్టిదమగుపూన్కనొక్క ♦ వీఁకమరిచి యం
దిట్టలమగు ప్రేముడివొడి, గట్టి యొనర్చిరి చిరంబు ♦ కాపురమనఘా! 179

క॥ శివులకు నివాసమైతగి, శివనగరంబనఁగ బరగెఁ ♦ జేవమెయి లయం
బవుట నెఱుంగమిచే భువి, నవిముక్తంబనెడు నాహ్వ ♦ యంబును గొనియెన్.

క॥ ఆనందమూర్తులైన భ, వానీభవులకు విహార ♦ వసతల్పమై గా
ఢానందజనకమగుటది, యానందవనంబనంగ ♦ నవనిన్ వెలసెన్. 181

క॥ అచ్చోట శివుఁడు శక్తియు, నచ్చపుఁదపమునను గాట ♦ మగు యోగమునన్
హెచ్చగు విహారగరిమల, మెచ్చవసింపుచునొకప్డు ♦ మేలుగమదిలోన్. 182

శా॥ లావుల్ దేవయు నోర్పునేర్పు బలము ♦ ల్లాసంబునుత్సాహ మె
ప్పౌ వైదుష్యము చెల్మికల్మిగల నీ ♦ టౌ పుత్రుఁబుట్టించి మా
యావైరాజ్యవిభున్ బొనర్చిన భరం ♦ బెల్లన్ దలన్ దాల్చు, మా
శావిశ్రాంతియు యోగలీలలనపా ♦ యంబై ముదంబిచ్చుతన్. 183

గీ॥ అట్టులైనఁ దలఁపులను ♦ నలలు సత్వ
మనెడు రతనంబులును రజ ♦ మనెడువిద్రు
మలతయును దామసముతా మె ♦ సలులు గలిగి
లాఁచునుల్లంపుకడలి సం ♦ కోచపఱచు. 184

ఉ॥ ఆతఁడె మాయనుగ్రహము ♦ నంది సృజించుఁ జరాచరంబు ల
ల్లాతఁడె సర్వజంతుతతి ♦ నర్మిలిఁ బ్రోచుచునుండు నెవ్వఁడె
స్డాతఁడె యెల్లలోకముల ♦ కంతము గూర్పఁగలండు నిక్క మ
ట్లాతఁడె నట్టివాని నొక ♦ యీడ్యునిఁబుట్టగఁ జేయుటొప్పగున్. 185

క॥ అవ్వాని సాయమున మే, మివ్వనమున హాయిమీఱ ♦ నింపగుక్రీడల్
నివ్వటిలంగ రహించెద, మివ్వరుసగననుచు ఘనత ♦ రేచ్ఛావశతన్. 186

క॥ ఈలాగిరువురు దృఢముగ, నాలోచనసేయ నంత ♦ నా పరమశివుం
డాలోకసుందరిని నపు, డాలోకించెను సుధామ ♦ యాయతదృష్టిన్. 187

వ. అంత

## —* వి ష్ణు మూ ర్తి జ న న ము *—

క॥ వేడుకతో వారలు గని, రీ డెందునులేని యంద ♦ మింపగువానిన్
మూడు జగంబులనేలెడు, ఱేఁడిమిగ్గలవానిఁ దమ్ముఁ ♦ బోలినవానిన్. 188

సీ॥ ఇంద్రనీలముడాలు ♦ నీసడింపఁగఁజాలు, నీలంపుమై నిగ ♦ నిగలవాని
వేయిరేకులతమ్మి ♦ విరులగెల్వఁగఁ, జాలు విరివైనకనుదోయి ♦ వెలయువాని
చెనఁటుల సమయింపఁ ♦ జేవగల్గిన సాధ, నములొప్పు నాల్గు ♦ హస్తములవాని
అమృతంబుకన్నఁ దీ ♦ యఁగనొప్పుమాధురిఁ, గురిపించుసెమ్మోము♦ కొమరువాని

గీ॥ పలురకములైన రతనాల ♦ వెలసి ధగధ, గలు తనర్చు కిరీటంబు ♦ గ్రాలువాని
కౌస్తుభంబను మణియెద ♦ గలుగువాని, పసిఁడిపుట్టంబుఁగట్టిన ♦ బాలు నొకని.

ఉ॥ కాంచినతోడ బాలకుఁడు ♦ గ్రక్కునడాసి నమస్కరించి బల్
మించిన భక్తిసంపదను ♦ మేకొని యోకరుణాలవాల ! కాం
క్షించెద నీకృపాగరిమఁ ♦ జేయఁగలట్టిది చెప్పుమన్నఁ బ్రే
మించి మహేశుఁ డిట్లనియె ♦ మెచ్చుచు సారసుధామయోక్తులన్. 190

సీ॥ జగములనెల్ల నిం ♦ డఁగఁజాలు తేజంబు, వెలయుట విష్ణునా ♦ వెలసెదీవు
కమలంబులను బోలు ♦ కనులు గల్గుటఁజేసి, కమలాక్షుఁడను పేరుఁ ♦ గాంతువీవు
రాకాసిమూకలఁ ♦ బోకార్చుటన్ జేసి, దైత్యారి యనుపేరఁ ♦ దనరఁగలవు
బంగారుపుట్టముల్ ♦ పసమీఱఁజుట్టుటఁ, గాంచనాంబరుఁడను ♦ ఖ్యాతిగందు

గీ॥ వంతమొందక చెందెద ♦ వచ్యుతాఖ్యఁ, జక్కని కురుల్గలుగుటఁగే♦ శవసమాఖ్య
యెల్లజీవుల మనసుల ♦ నెల్ల రంజ, నము నొనర్చుట హరినామ ♦ మమరునీకు.

క॥ పురుషులలోఁగడు నుత్తమ, పురుషుఁడవై యొప్పుకతనఁ ♦ బురుషోత్తముఁడం
చు రహింతువు సిరిఁజేకొని, ధర శ్రీధరుఁడనెడు పేరు ♦ దాల్తువు వత్సా.

వ. మఱియు నల్లనివాఁడ వౌటఁగృష్ణుండవనియును నాలుగు భుజంబుల నొప్పుటఁ జతుర్బాహుఁడవనియును విశ్వంబునెల్ల భరించువాఁడ వౌటంజేసి విశ్వంభరుఁడవనియునుఁ బరఁగుచు నిఁకనుబలుపేరులను సార్థకంబులుగానొనర్చి ధరించెదవు.

## —✱ విష్ణుమూర్తి తపస్సు చేయుట ✱—

చ॥ ఇఁకను దపింపు మాపయిని ♦ నెల్లనొనర్తువుగాకయంచుఁ బా
యక తనయందునున్ననిగ ♦ మావళినిశ్వసితంబొనర్చి పు
త్త్రికునకొసంగి యంబికయుఁ ♦ దాను దిరోహితులైరి విష్ణుఁడా
ర్యపు శివమూర్తికిన్ బ్రణతు ♦ లల్లనఁజేసి తపించె ధీరుఁడై. 194

ఆ॥ పదియురెండువేల ♦ వత్సరములు దపం, బరుదుగానొనర్చి ♦ యబ్జనయనుఁ
డఖిలసిద్ధికరుని ♦ హరునిఁగనన్ లేక, పొగులుచుండనొక్క ♦ ప్రమోతపొలిచె.

చ॥ "మరలఁదపింపు మోపికను ♦ మానకు చాలదు నీతపంబు వే
గిరపడఁబోకు శంకరుఁ డ ♦ కిల్బిషుఁ డిష్టఫలప్రదాత ని
బ్బరమునుజెంది చేకొను మ ♦ వశ్యము సర్వవిధార్థసిద్ధులన్
హరి!" యన నాలకించి యతఁ ♦ డానుడి యంబరవాణిగానెదన్. 196

చ॥ తలఁచి కడున్ బ్రపత్తి మెయిఁ ♦ దద్దయుఁబెద్దయుఁ గాలమట్లు ని
శ్చలమగు తాపసవ్రతము ♦ సల్పుడు శంభుదయన్ సుఖాత్మమై
యలరుప్రబోధమొక్కఁ డుద ♦ యంబయితోఁచిన నచ్యుతుండు పె
ల్లలరి మహేశతత్త్వవిభ ♦ వాయతసిద్ధికి సబ్రమొందుచున్. 197

గీ॥ చిరతపంబునఁ గడునల ♦ సినతనువున
నుండి జలధార లెంతయు ♦ దండిగాను
వెలువడుచు నుండ నాతఁడా ♦ సలిలమందుఁ
బవ్వళించి నిదురఁజెందె ♦ బహుయుగములు. 198

క॥ నీరమునఁ దడవుకాలము, చేరివసించుటను జేసి ♦ చెన్నెసలారెన్
నారాయణుఁడను పేరున, నీరేజాక్షుండు కడిఁది ♦ నీటొప్పభువిన్. 199

గీ॥ నలిననయనుఁడా బ్రహ్మమున్ ♦ నారమందుఁ
బెద్దకాలంబు పవళించి ♦ నిద్దురొందె
నంత శంకరు నిచ్ఛచే ♦ నజ్జమొకఁడు
పొలిచె విష్ణుని పొక్కిటఁ ♦ బొంకముగను, 200

వ. మఱియు నారాజీవంబు

ఉ॥ అంతములేని యోజనము ♦ లౌనిడి సట్టులెమీఱు నవ్వెడ
ల్పంతములేని నాళముల ♦ హద్యగనొంది దినేంద్రకోటిభా
స్వంతము కర్ణికారసుమ ♦ భాసురమున్ సుభగంబునై కడున్
వింతగఁ దత్త్వయుక్తమయి ♦ విశ్వజనీనముగాఁదనర్చెడున్. 201

వ. అందు.

క॥ ఆలో వెలువడె నిరువది, నాలుగు తత్త్వములు ప్రణవ ♦ నాయకునిచ్ఛన్
మేలగువాని క్రమముఁ బరి, శీలనగావింపు మిపుడు ♦ చెప్పెద మౌనీ! 202

సీ॥ ప్రకృతినుంచి మహత్తు ♦ పరిఢవిల్లెను దానఁ, ద్రిగుణాఢ్యయగునహం ♦ కృతిజనించె
నాయహంకృతిచేత ♦ నైదుతన్మాత్రలు, పరఁగె నవ్వానిచేఁ ♦ బంచభూత
ములు వానిచేతను ♦ బుట్టె నింద్రియములు, పదిజ్ఞాన కర్మసం ♦ పాదకములు,
సాత్త్వికాహంకార ♦ జనితమై మనమది, పొలిచె వీనినిజెంది ♦ పొంకముగను

గీ॥ విష్ణువంతనె యెంతయు ♦ విస్మయంబుఁ, జెంది వీక్షించుచుండె నా ♦ నందమునను
పద్మమది దివ్యసౌరభ ♦ పరికరములను, నింపుచుండెను దశదిశా ♦ నివహమందు.

—* బ్రహ్మదేవుని జననము *—

ఉ॥ అందు శివుండు దక్షిణని ♦ జాంగమునుండి స్వకీయమాయచే
స్పందితుఁగా నొనర్చి వను ♦ జక్కఁగ వెల్వడఁజేసె నంత నే
బొందుగ నాల్గుమోముల వి ♦ భూతిదలిర్పఁగ శోణమూర్తియై
యెందును దల్లిదండ్రుల మ ♦ తెవ్వరిని గనకాత్మఁ గుందుచున్. 204

ఉ॥ ఎవ్వఁడ నేను? పద్మతల ♦ మెందులకొందితి నేడనుండి యి
ట్టివ్వనజంబుఁ బోవిడిచి ♦ యెచ్చటికేఁగఁగఁ జెల్లునాకుఁ? ద
ల్లెవ్వతెయో? గురుండెవఁడొ ♦ యిష్టులులేరొకో యంచు నెంచుచున్
నెవ్వగఁజెంది కుందితి ము ♦ నీ! శివమాయ నెఱుంగ కెద్దియున్. 205

ఆ॥ అంతఁ గొంతకాల ♦ మాలోచనయొనర్చి, తనకు వాసమైన ♦ తమ్మిపూవుఁ
దేఱిచూచి యపుడు ♦ దీనియాధారమే, నాకుఁ గర్తయనుచు ♦ నమ్మకమున.

చ॥ బిరబిరపద్మమున్ విడిచి ♦ బిట్టుగుపూన్కిని నాళనాళమున్
వరుసగఁ జేరిపోవ నొక ♦ వర్ష శతంబుగతించె నంతకున్
సరసిజమున్నచోటుఁ గనఁ ♦ జాలక వేసరి యంత వెన్కకున్
మరలి రయంబునన్ నలిన ♦ మార్గముఁ జేకొని ప్రాకితిన్ బయిన్. 206

—* బ్రహ్మదేవుఁడు తపస్సొనరించుట *—

ఉ॥ ప్రాకుచునుంటిఁగాని శత ♦ వత్సరకాలము పూర్వమున్న నా
ళీకపుగద్దెఁ గన్గొనఁగ ♦ లేక భ్రమించుచు డిల్లపోయితిన్
జోకగనప్పు శంకరుని ♦ చోదనతోఁ 'దప' యంచు నొక్కఁడౌ
వాకు వినన్ బడెన్ బిదప ♦ వాసిగనట్లు తపించితిన్ గడున్. 207

గీ॥ తండ్రి నిన్ గనుకూరిమిఁ ♦ దవిలి యేను
బదియు రెండేండ్లు సేయ న ♦ ప్పరమతపము
కన్పడియె నొక్కపురుషుండు ♦ గడిఁది పేర్మి
పద్మనేత్రంబులొప్పెడు ♦ బలియుఁ డపుడు. 208

ఉ॥ బంగరుపట్టుపుట్టములు ♦ బాగుగఁ గట్టినవాఁడు చేతులన్
హంగుగ శంఖచక్రగద ♦ లబ్జము నొందినవాఁడు నీలమే
ఘాంగుఁడు కోటిమన్మథుల ♦ నందమునన్నిరసించువాఁడు నా
కుంగల సందియంబులను ♦ గుందును దీర్పఁగఁ జాలువాఁడటన్. 209

వ. అంత.

చ॥ కనుఁగొని యేను నీశ్వరుని ♦ గాటపుమాయఁగలంగి గర్వినై
వనరుహనేత్రునిన్ గని యె ♦ వండవు సెప్పుమటంచు నొక్కదె
బ్బను నురమందుఁ గొట్టుటయు ♦ బల్లిదుఁడాతఁడు వేగనంత ని
ద్రను విడి కూరుచుండి నను ♦ దాఁగని యిట్లనె సంతసంబునన్. 210

## —* బ్రహ్మవిష్ణుల వివాదము *—

ఉ॥ మంచిగవచ్చినాఁడవు కు ♦ మార! శుభంబె? భయంబువీడు ప్రే
మించి యొసంగువాఁడ నీక ♦ మేలగు సర్వవిధార్థ సిద్ధులన్
గొంచక యడ్గుమన్న విని ♦ గొప్పగు రాజసబుద్ధితోడఁ బ
ల్మించిన యల్కఁజెంది యద ♦ లించి హసించి యిటుల్వచించితిన్. 211

ఉ॥ ఓయికుమార! యంచు నను ♦ నుల్కక పల్కుచునుంటివిట్లు నా
నాయనవోలె నీకుఁదగు ♦ నా యగునా పరు వబ్జసంభవున్
డాయఁగరమ్ము చూచెద ది ♦ టంబదియెంతో? సరోజనేత్ర! నే
నీయులవున్ జలంబు నిట ♦ నిల్పెద మల్పెద బాలిశోక్తులన్. 212

చ॥ అన వనజాతనేత్రుఁడు ప్రి ♦ యంబున నిట్లనె నీవు నాదునం
దనుఁడవు నాదునాభినళి ♦ నంబున నిన్ గనినాఁడ నింకనున్
వినయపు వృత్తముఁగాఁగఁజపి ♦ వేదచయంబు నొసంగవచ్చితిన్
నను గుఱితింప కిట్లు నృశ ♦ సంబులు వల్కుట నాయమానొకో. 213

క॥ అనవుడు వేదంబులనా, కనుగ్రహముసేయునిట్టు ♦ లరుదెంచితివా
నను నజు స్వాయంభువును గ, ర్తను జగములకెల్లననుచుఁ ♦ దామాడు శ్రుతుల్. 214

క॥ నేనే ప్రకృతినియంతను, నేనే సర్వప్రపంచ ♦ నిర్మాత నికన్
నేనే విశ్వాత్ముండను, నేనే నిత్యుండ విన్మ ♦ నీరజనేత్రా! 215

క॥ అనుడు విని యాతఁడును గిను, కనుగొని నామాయనిట్లు ♦ గానక కాఱుల్
నను వదరెదవది యిపుడే, కనబఁడు, వినుమైన మరలఁ ♦ గడపటినుడువుల్. 216

మ॥ పరతత్త్వంబగువాఁడ విష్ణుఁడఁ బర ♦ బ్రహ్మంబ సర్వేశుఁడన్
బరమజ్యోతిని విశ్వకారణుఁడ స ♦ ర్వవ్యాపి చిద్రూపుఁడన్
బురుషుండన్ బరమాత్మ నవ్యయుఁడ వి ♦ స్ఫూర్జత్ప్రధానంబు ధీ
నరుదొప్పన్ సృజియించినాఁడ త్రిగుణా ♦ హంకార తన్మాత్రలన్. 217

ఆ॥ వానినుండి భూత ♦ పంచకంబును నింద్రి, యములఁ బొడమఁజేసి ♦ నాఁడ నిట్టి
నన్నెఱుంగకిట్లు ♦ నర్థవాక్యంబుల, నాడెదేల పలుమ ♦ అబ్జగర్భ! 218

క॥ ఇపుడేని శరణమొందుము, విపరీతోక్తులనుమాని ♦ వేగ నిఁకను నే
నెపుడును రక్షించెద నిన్, గృపమెయి దుఃఖములనుండి ♦ గీడ్వాడనియటుల్. 219

సీ॥ అనినఁ గడునల్గి యేనప్డు ♦ హరిని గవిసి, యుద్ధమొనరించితిని గడు ♦ నుద్ధతమతి
జరిగెఁ బెక్కేండ్లనటికట్టు ♦ సంగరంబు, హరికి నాకును బ్రళయనీ ♦ రాకరమున.

## — లింగోత్పత్తి —

గీ॥ అంతలో నొక శివలింగ ♦ మనుపమంబు
ఆదిమధ్యాంతరహిత మ ♦ వ్యక్తమూర్తి
పెరుఁగుటయుఁ దఱుఁగుటలేని ♦ పేర్మినమరి
పోరుచున్నట్టి మామధ్యఁ ♦ బొలిచెఁ బెలుచ. 221

వ. మఱియు నాలింగంబు,

క॥ కాలానలశతనిభమై, జ్వాలామాలాసహస్ర ♦ చటులంబై మా
యాలమును మమ్ముఁ దెగడెడు, లీలగఁ గన్పడుడు మదిఁ దెలిసికొని మేమున్.

వ. ఈలింగంబెచ్చటనుండి యెట్లిచ్చటఁ జేరెనోయని విచారించుచున్నంత నన్నుఁ
గాంచి విష్ణుండిట్లనియె.

చ॥ ఇరువురమిట్లు సంగరము ♦ నెంతయుఁ బూన్కినొనర్చుచుండ ని
త్తఱిఁ బొడసూపె నింకనొక ♦ దారుణవస్తువు నీవు దీనిదా
శిరమును గాంచిరమ్ము పరి ♦ శీలనఁ జేసెద నేను బాదముల్
సరగున దీనినారయుట ♦ చక్కని యోజ పయోజసంభవా! 223

ఉ॥ నావుడు వాయువేగము గ ♦ నందగు దెల్లనివర్ణమున్ గడున్
జేవగలట్టి ఱెక్కలును ♦ జెందిన యందపు రాజహంసనై
నే వినువీధికేగితి న ♦ నిందితలింగశిరంబుఁ గాంచఁగా
శ్రీవిలసిల్లునాహరియుఁ ♦ జెచ్చర లింగపదంబులారయన్. 224

క॥ శతయోజనాయుతంబు ర, జతవర్ణము మేరుశైల ♦ సమవిస్తృతమున్
సితతీక్ష్ణదశనమునునై, యతిశయనదమొప్పఁ గ్రోడ ♦ మై వేగమునన్. 225

ఆ॥ పుడమిఁ ద్రవ్వికొనుచుఁ ♦ బోయె నధోభాగ,మునకు శేషకమఠ ♦ ములను దాటి
పెద్దకాలమరిగి ♦ తద్దయు నలసి పా, దములఁ గనక మరల ♦ ధాత్రిఁ జేరె. 226

వ. అట్లు నారాయణుండు శ్వేతవరాహరూపంబుఁ జెందిన యనేహంబు మొదలు
చేసి యిక్కల్పంబు శ్వేతవరాహకల్పం బనంబడియెనంత.

క॥ నేనును జిరకాలము విను, పై నొసగుచుఁ బోయిపోయి ♦ బడలియడలి య
డ్గేనియు నెగయఁగలేక ధ, రానిలయముఁ జేరితిని శి ♦ రంబుఁగనక హో. 227

సీ॥ అంత నిరువురమనోన్యన్య ♦ మరసికొని యు, శక్యమగుటయు శంభుతే ♦ జంబుఁగాఁగ
నెఱిఁగి ధ్యానమొనర్చి మ ♦ హేశుఁ, దనదు, రూపమునుజూపఁగోరితి♦మెంపి భక్తి.

—* శబ్దబ్రహ్మోత్పత్తి *—

మ॥ ఒకనాదంబు వినంగనయ్యె నపు డో ♦ మోమంచు నుచ్చైస్స్వనం
బు కడున్ దీర్ఘము స్పష్టమై యటమొదల్ ♦ పొల్పొప్పెనాద్యస్వరం
బిఁకనాపైన నుకార మాపయిని నొ ♦ ప్పింపొ మకారంబునున్
బ్రకటంబౌ తుదినాపుమోమనుచు వి ♦ భ్రాజద్గతిన్ మీఱుచున్. 229

గీ॥ ఆద్యవర్ణం బకారమా ♦ నర్కబింబ, నిభము దక్షిణమున నగ్ని♦నిభముగా ను
కార ముత్తరమునను మ ♦ కారమిందు, మండలప్రఖ్యమై నుధ్య ♦ నిండుకొనియె.

క॥ శుద్ధస్ఫటికాకారం, బిద్ధము పరమాత్మ మమల ♦ మీవ్యపరిభమున్
సిద్ధానందము దృఢ మవ, విద్ధపరిచ్ఛేదమగుచు ♦ వెలసె నటుపయిన్. 231

వ. వెఱఁగుపడి యద్దాని నారయుచుండ నంత రాఁపమౌతుండు శబ్దబ్రహ్మాత
ముండునుం బరబ్రహ్మంబును బరమేశ్వరుండునగు మహాదేవునిఁగాఁ గుఱితించె
నంత నాశబ్దంబునందు. 232

క॥ బీజము యోనియు బీజగ, రాజిల్లెడు నాత్రివర్ణ ♦ రాజములందున్
బీజమునలువ యకారము, భ్రాజిలునలయోని హరి యు ♦ వర్ణము వినుఁడీ! 233

క॥ వెలసెడు బీజిమకారం, బిలరుద్రుఁడుగాఁగ పీర ♦ లిటు క్రమముమెయిన్
విలసిలుదు రఖిలసర్గం, బలరగమోహము ననుగ్ర ♦ హంబు సలుపుచున్. 234

వ. ఈ మువ్వురకుపైనఁ ప్రధానపురుషేశ్వరుండగు మహేశ్వరుండు నాదా
త్మకమై యలరారునతండే యాత్రివిధంబులగు బీజబీజయోనులనుగ నాత్మను
విభజించి వెలయించె. అట్టిమహేశ్వరుండే యాలింగంబు. 235

గీ॥ ఆమ్మహాలింగమున బీజ ♦ మగు నకార
మాయుకారాత్మమగు యోని ♦ యందుఁ జేర్పఁ
బడి పొదలి కాంచనాండమై ♦ కరముచిరము
నీరమందుండె నెంతయు ♦ నీటుమీఱి. 236

గీ॥ వేయియేండ్ల కద్దాని ♦ విశ్వభర్త
నీటినుండి వెలువఱచి ♦ సూటి నొక్క-
ఘాతమున రెండుసేయ నొ ♦ కండు పైక
పాలమగుడు మఱొండయ్యె ♦ వసుమతిగను.

క॥ ఆయండమున విరించనుఁ, డాయతభుజుఁ డుద్భవిల్లె ♦ నతఁడె జగములన్
జేయును సర్గేశుండయి, యీయదె యోమనెడినాద ♦ మెఱుఁగుఁడు మదులన్.

గీ॥ అని యజుర్వేదము వచింప ♦ నట్టి నిజమ
టంచు ఋక్కులు సామంబు ♦ లనియెనిట్లు
తెలిసి దేవేశుఁడగు మహా ♦ దేవుఁగుఱిచి
యేము ధ్యానము నొనరింప ♦ నీశ్వరుండు. 240

## —* అక్షరమూర్తి ప్రకటనము *—

గీ॥ అక్షరాత్మకమగు రూప ♦ మప్పుడుచెంది
నగుచు మాయెట్టయెదురుగా ♦ నగుపడుడు ము
దమ్మినుమడింప మేము ని ♦ ద్దఱముఁగాంచి
నార మామూర్తి నెందుఁ గా ♦ నఁగఁదరంబె. 241

సీ॥ అల అకారము మూర్ధ ♦ మాకారములలాట, మక్షులుకుడియెడ్మ ♦ లలఇ, ఈ, లు
విలసిల్లు కుడియెడ్మ ♦ వీనులై ఉవ్వాయి, ఋవ్వాయమే కపో ♦ లద్వయంబు
వలపల దాపల ♦ వనరు నాసాపుటం, బులు ఌద్వయంబయి ♦ పొలుపుమీఱె
ఏకార మూర్ధ్వోష్ఠ ♦ మైకార మధరోష్ఠ, మో,ఔ,లు రదరాజి ♦ యొప్పెనటులె
గీ॥ ఆ యనుస్వారము విసర్గ ♦ మల్లతాలు, యుగళి దక్షిణవామబా ♦ హులు కవర్గ
మును జవర్గంబటులె పాద♦ములు టవర్గ, మును దవర్గంబుగాఁ గడు♦మురువుమీఱె.

గీ॥ ఉదరము పవర్ణమై ప్రక్క ♦ లొప్పె కుడియు
నెడమలు ఫవర్ణము బవర్ణ ♦ మింపుమీఱ
స్కంధ మలరొందెను భవర్ణ ♦ కలితమై మ
వర్ణమయ్యెను హృదయంబు ♦ వాసియమర.

క॥ యరలవశషసా లేమను, వరుసదనర సప్తధాతు ♦ వర్గంబయ్యెన్
వఱలె హకారము నాభిగ, నరుదగు ఘ్రాణము క్షకార ♦ మై యొప్పెఁగడున్.

గీ॥ ఇట్లు వర్ణాత్మకంబౌ మ ♦ హేశతనువు
నేను హరియును గని వేడ్క ♦ నివ్వటిల్లఁ
దిరుగ నంతకుఁబయిఁ జూచి ♦ తిమి వరేణ్య
మంత్రమయమైన యీశ్వరు ♦ మహితమూర్తి. 245

వ. అందు నోంకారసంభవంబును గలాపంచకసంయుతంబును శుద్ధస్ఫటికాకారం
బును, అష్టత్రింశదక్షరంబును, మేఘాకారంబును, సర్వధర్మార్థసాధకంబును,
గాయత్రీప్రభవంబును, వశ్యకారకంబును, చతుర్వింశతివర్ణాఢ్యంబును, చతు
ష్కళమును, బంచశతమును, గలాష్టకసమన్వితంబును, నత్యంతాభిచారికంబును
ద్రింశచ్ఛుభాక్షరంబును, యజుర్వేదసమాయుక్తంబును, బంచవింశచ్ఛుభాక్ష
రంబును, కలాష్టక సమన్వితంబును, సుశ్వేతంబును, శాంతికంబును, త్రయో
దశకలాయుక్తంబును, లోహితంబును, నుత్పత్తివృద్ధి సంహార కారణంబును
నేకాధికషష్టిపరిమితాక్షరంబును, నవు మంత్రంబులం బఠించితిమి. అట్లు
మృత్యుంజయ మంత్రంబును, పంచాక్షర మంత్రంబును, చింతామణీ మంత్రం
బును, దక్షిణామూర్తి మంత్రంబును, తత్త్వమసియను మహావాక్య మంత్ర
మును, గన్పట్టుడు భగవానుండగు నారాయణుం డేనును జపించితి మంత నీశానుం
డునుం ద్రియారూపుండును, బురుషుండును, బురాతనుండును, నఘోరహృద
యుండును, సుందరుండును, లలితపాదుండును, విశ్వలోకైకరుండును, బ్రహ్మాధి
పతియును, సర్గస్థితిప్రళయకారణుండును, వరదుండు నీశ్వరుండునగు మహా
దేవునింగాంచి యిష్టవచనంబులతో సన్నుతులం బొనర్చితిమి. 246

## —* శక్తి విశిష్టేశ్వర సాక్షాత్కారము *—

క॥ శివుడంత శక్తియుతుఁడై, త్రివిలోచనుఁడై విభూతి ♦ దివ్యన్ముఖుడై
వివిధాభరణతనుండై, యవిరళకృప దరిసెనంబు ♦ నపుడొసఁగె వడిన్. 247

గీ॥ అంత మేమెంతొ సంతసం ♦ బపుడు చెంది, మరల నద్దేవదేవునిఁ ♦ గరము భక్తి
నుతిఁ బొనర్చితిమంత నె♦య్యతులకరుణఁ, బ్రౌఢమైతగు నిగమన ♦ ర్వస్వమిడియె.

గీ॥ దాన విజ్ఞానగరిమ నెం♦తయును జెంది, నార మచ్యుతుఁడపుడా యు♦దారమూర్తిఁ
గాంచి కేల్జోడించి ♦ వంచితనువు, మించి వేడుకనిట్లు ల ♦ క్షించి యడిగె. 249

ఉ॥ నీమదికెట్లు సంతసము ♦ నెక్కొనఁజేయఁగఁ జాలువారమో
యేమిట నీవు మెచ్చెదొ మ ♦ హేశ్వర! నీదగు నర్చ యెట్టిదో
మే మొనరింపఁగాఁదగిన ♦ మేలిమి కృత్యమదేమొ యిత్తఱిన్
బ్రేముడి మాకుఁ దెల్పి మము ♦ బ్రీతులఁ జేసి యనుగ్రహింపవే. 250

చ॥ అనియడుగన్ మహేశ్వరుఁడు ♦ హర్షముతోడ నిటుల్వచించె భ
క్తినిఁ గొని మీరలిప్పగిదిఁ ♦ దేఁకువతో నుతి సల్పినందు కే
నును బరితోషమొందితి న ♦ నుత్తములార! శివుండనేను మీ
మనమున జంకుఁగొంకు నను ♦ మానము మాని వినుండు నానుడిన్. 251

—* శివుఁడు బ్రహ్మవిష్ణులకు లింగమును బూజింపుఁడని చెప్పుట *—

క॥ లింగంబిది పూజింపుఁడు, లింగంబే నాదుమూర్తి ♦ లీలమెయినిటన్
రంగుసెడి జగములన్నియు, భంగంబును జెందుకతనఁ ♦ బదమది యొదవెన్. 253

క॥ కూరిమి నాలింగంబును, మీఱినయనురాగమొప్ప ♦ మీరలుగొలువం
డారసి మీయిష్టంబులఁ, దీరుతు సందియము లేదు ♦ దివ్యప్రజ్ఞుల్! 253

క॥ మీకెవ్వ డిడుమలఁబెన్వఁగ, సేకూరిన నామకీన ♦ శివలింగము న
స్తోకమతి నర్చసేయుఁడు, వీఁకటి నశియించు సర్వ ♦ విధములగు వెతల్. 254

క॥ పార్థివలింగము నల్పి సు, ఖార్థులగుచుఁ బూజసేయ ♦ నభిమతముగ స
ర్వార్థముల నొసఁగువాఁడఁ గృ, తార్థులగుదు రెందు జనము ♦ లరయుండట్టుల్.

చ॥ తివిరివినుండు మీరలు మ ♦ దీయతనూజులు వామగాత్రమం
దవిరళతేజ! గంటి నిను ♦ నబ్జజు దక్షిణమూర్తిఁ గాంచితిన్
భువనములన్ రచించు విధి ♦ పుష్కరలోచన! వానిఁబ్రోవు నే
ర్పవునటు లేనునన్ బయిన ♦ నారయుచుండెద మిమ్ము నిచ్చలున్. 257

క॥ అని లింగపూజన క్రమ, మును మాకెఱిగించినంత ♦ మురిసితిమేమున్
వనజేక్షణుండు శంకరుఁ, గని మరలన్ గోరెనిట్లు ♦ ఘనమగు వేడ్కన్. 258

ఉ॥ దేవ! వరంబు మాకిడ మ ♦ దిన్ గృపఁబూనితివేని మేమునున్
బావనమైన నీకృపకుఁ ♦ బాత్రులమేని యనుగ్రహించి మా
కేవగనైనఁగాని చలి ♦ యింపని నీపదభక్తి నిమ్మికన్
నీవును మాకుఁదోడుగ జ ♦ నించి యొనర్పుమ సాయమన్నిటన్.

వ. అని యర్థించిన మహాదేవుండిట్లనియె.

ఉ॥ ఇచ్చితి నాదుభక్తిఁగడు ♦ హెచ్చుగ మీకు సురేశులార! పై
పెచ్చిక మీకు నాఁతగ భు ♦ విన్ ననుఁబుట్టుమటంచుఁగోరినా
రిచ్చ మెయిన్ జగంబులను ♦ నేన రచింతును బెంతుఁ ద్రుంతు నే
నెచ్చట నెట్టి వైకృతుల ♦ నెప్పుడుఁ జెందనివాఁడఁ జూడుఁడీ. 259

సీ॥ సచ్చిదానందరూపుఁడ♦సత్యమూర్తి, నగు పరబ్రహ్మమేను మూ ♦ డగువిధముల
బ్రహ్మ విష్ణు హరాఖ్యలఁ ♦ బరఁగి సృష్టి, రక్షణాంతము లొనరింతు ♦ నట్టులేక.

ఉ॥ ఒక్కటిగాఁగనుండిన మ ♦ హోజ్జ్వలతేజము మూఁడుమూర్తులై
చక్కఁగనంబడున్ భిద య ♦ సత్యము బంగరు నొక్కఁటయ్యు నన్
బెక్కులు సొమ్ములై తనరి ♦ భేదములేక యెసంగు వృత్తు దా
నొక్కటి పెక్కురూపములఁ ♦ నొందియుఁ జెందదు వస్తుభేదమున్. 261

—* శివుఁడు బ్రహ్మముఖంబున రుద్రుఁడనై పుట్టెదనని చెప్పుట *—

క॥ మీయాప్సితంబు నిత్తుఱెఁ, ద్రోయంగాఁజాలనిఁకను ♦ దోయజగర్భా!
నీయలికంబునఁ బొడమెదఁ, జేయుము నామకరణంబుఁ ♦ జెలఁగెడువేడ్కన్. 262

క॥ రుద్రుఁడనుపేరు చేకొని, భద్రాత్మకమూర్తినగుచుఁ ♦ బరగుదు నాయీ
చిద్రూపమునకు నతని ల, సద్రూపంబునకు లేద ♦ జా! భేదమెట్లన్. 263

గీ॥ మీరలిరువు రటుల్ నాయ ♦ మేయతేజ
మైననున్ మాయకగ్గమై ♦ యమరియుందు
రతడు ప్రకృతికి లోఁగక ♦ యలరు నాదు
పూర్ణమగు నవతారమై ♦ పొలుచుకతన. 264

ఉ॥ కావున నాకు రుద్రునకుఁ ♦ గల్పనసేయకుఁ డెందు భేదపున్
భావము లాతనిన్ గొలిచి ♦ భద్రములొందుఁ డతండు నేన నే
నావృషకేతుఁడౌ ననలమప్పులఁ ♦ జెందినఁ గూడఁదాక నీ
దావిధి నేనునున్ గుణస ♦ మాశ్రియమొందిన నొంద బంధమున్. 265

ఉ॥ నీవు రజోగుణంబున జ ♦ నింపఁగఁజేయు విధాత! లోకముల్
పావని నాదుశక్తి నిను ♦ భారతినై భజియించు నెప్డు రా
జీవదళాక్ష! సత్త్వగుణ ♦ సేవధినై భువనంబులేలు నిన్
శ్రీవనితాస్వరూపమునఁ ♦ జెందును మామకశక్తి యట్టులే. 266

గీ॥ ఇఁకను రుద్రుఁడు తామసం ♦ బెనసి సర్వ
లోకముల నంతమొందించు ♦ పిఁక మెఱసి
ఆతనిన్ జేరు నాశక్తి ♦ యతులమూర్తి
కాళికయనాఁగఁ బేర్చెఁ బరి ♦ ఖ్యాతయగుచు.

క॥ అంతస్సత్త్వుఁడు రుద్రుం, డెంతయుఁ దమమెనయు వెలికి ♦ నీవును నటులే
యంతస్తమస్కుఁడవగుచు, వింతగ సత్త్వగుణుఁడవయు ♦ వెలసెదు వెలికిన్. 268

సీ॥ అజుఁడు బహిరంతరంగము • లందు రజము, నే
ధరించునుగాని న • న్నిష్టఁగోరి
తొలిభవంబునఁ దపమొంది • కొలిచినట్టి
కతనఁ దత్కాలమునఁ బుట్టుఁ • గాంతు ననఘ!

ఉ॥ సాయమొనర్తు మీకిఁకను • సర్వవిధార్థములందు మీరునున్
బాయక నన్నుఁ గొల్వుఁడు శు • భంబగు నంబుజనేత్ర! నీకు నా
కేయెడ భేదభావమది • యెప్పుడు గల్గదు నేను నీవ నీ
వేయయి గానుపింతునిఁక • నేనును రుద్రుఁడనై జగంబునన్. 270

చ॥ నలువకు మించినట్టి యల • నాకవిరోధుల గీటడంపు ని
చ్చలు వివిధావతారములఁ • జక్కఁగ నొంది జగంబులేలు నీ
యలవి? మించినట్టి దను • జాగ్రణులన్ సమయింతు నేను నన్
దలఁపుము సంకటంబుల ని • తాంతము గాచెద రుద్రమూర్తినై. 271

క॥ నీకును నాకును భేదము, లేకున్నను నెవ్వఁడేన్ జ • లింపక మదిలో
లేకయయి భేదమెంచిన, చీఁకటి నరకంబునూతఁ • జేడ్పడెడు హరీ! 272

ఆ॥ నన్నుఁ బూజచేసి • నిన్ను నిందించిన, నిన్నుఁ బూజచేసి • నన్నుదూఱ
సందియంబులేక • శమనుని శిక్షకుఁ, బాత్రమగుదురంతు • పంతులేక. 173

క॥ మఱియుఁ ద్రిమూర్తులయెడ నే, మొఱకైనను జెడుతలంపుఁ • బూనినయెడ వాఁ
డరమరలేకయె చెడు న, చ్చెరువిందుల లేదెఱుంగు • శ్రీహరి! యెపుడున్.

—• బ్రహ్మ విష్ణ్వాదుల కాయుర్ని రూపణము •—

సీ॥ ఇఁకను మీకును నిర్జరప్రకరమునకు,
మనుజులకు నాయువును దెల్పె • దను వినుండు
కృతయుగము త్రేత ద్వాపరాం • కితము గలియు,
గంబునానొప్పు నాల్గు యు • గంబు లిలను 175

గీ॥ ఆచతుర్యుగ సాహస్ర • మైన నజున,
కగునహం బట్టిరాతిరి • యగును ముప్ప
దిట్టి దినముల కొకనెల • యెసఁగు నివియుఁ,
బదియు రెండైన నొకయేఁడు • పరిఢవిల్లు.

క॥ అట్టి శతవత్సరంబులు, బిట్టుగ నాయువగు విధికి ♦ విధియేఁడొకఁడౌ
నట్టిన నీకొకవాసర, మట్టిదినంబుల శతాబ్ద ♦ మాయువు నీకౌ. 277

ఆ॥ జలజనయన! నీదు ♦ సంవత్సరం బొకం, డగును రుద్రునకు న ♦ హం బొకండు
అట్టి వాసరముల ♦ హాయనశతమైన, రుద్రుఁడపుడు నరుని ♦ రూపు దాల్చు.

వ. మఱియు వినుండు త్రిమూర్తులకు నఖిలదేవ గంధర్వ దనుజ మనుజాది దేహు
లకుఁ బ్రతిదినంబుచ్ఛ్వాసనిశ్వాసంబు లిరువదియొక్కవేయి యాఱునూఱులు
ప్రవర్తించుచుండు నట్టి ప్రవర్తిల్లినదినంబుల మానంబుతో నగు సంవత్సర
శతంబులు వారికాయుర్దాయమగు నీక నుచ్ఛ్వాసనిశ్వాసంబు లాఱైన
నొక్క పలంబగునట్టివి యఱువదియైన నొక్కఘటియగు నాఘటికా
షష్టియైన నొకపవలునురాతిరియునగును. సామాన్యజనుల కీయుచ్ఛ్వాస
నిశ్వాసంబుల తెఱంగెఱింగి లెక్కపెట్టుట గడుదుర్లభంబు. యోగులగువారల
కయ్యది సులభంబిఁక మీరడిగినవెల్లఁ దెలిపి మీయభీష్టవరంబుల నిచ్చితి నీపిపవఁ
జెచ్చెర బ్రహ్మలలాటంబున నీలలోహిత రుద్రుఁడనై పొడసూపుదు మీరనవ
రతంబు లింగపూజనం బొనరింపుచు నా విధించినయట్లు సర్గాదుల రచించు
చుండుఁడని మహేశ్వరుం డంతర్ధానంబు నొందెనంత నవ్వార లతిభక్తితో
లింగంబు నర్చించిరది మొదలు లింగపూజనంబు ప్రసిద్ధంబై సర్వజన
సేవితంబై యొప్పె నని పద్మసంభవుఁడు నారదునకుఁ జెప్పెననుచు నంత
సూతునకు మునులిట్లనిరి. 280

గీ॥ లింగపూజాక్రమంబున ♦ లికనయనుఁడు, జలజనేత్రునకును విరిం ♦ చునకు కలరి
చెప్పెనంచాడితి రదియే ♦ చొప్పమేమె, ఱుంగఁజాలము చెప్పుమ ♦ నంగ సతఁడు.

క॥ మురిసి యటులే వచించెద, వరమతు లిఁక వినుఁడు శివుఁడు ♦ వైకుంఠునకున్
సరసిజభవునకు నుడివిన, తెఱఁగు ♦ నిజాత్మజుల కజుఁడు దెలిపె ముదమునన్. 282

ఆ॥ ఆసనత్కుమారు ♦ డస్మద్గురున కుప, మన్యునకును జెప్పె ♦ మాన్యమూర్తి
నాసతీర్థులకును ♦ నాకును మాగురుం, డాదరమునఁ దెలిపె ♦ వ్యాసమౌని. 283

గీ॥ అతులచారిత్రుఁ డుపమన్యుఁ ♦ డట్లుకృష్ణు, నకు వచించెను లింగార్చ ♦ నాక్రమంబు
మీకు నటులేను దెల్పెద ♦ మీర లెఱిఁగి, చేయుఁడు మహేశలింగార్చ ♦ సిద్ధులొనరు.

క॥ నారదముని యడుగుడు న, న్నీరజ గర్భుండుచెప్పె ♦ నేరమి విరాజ
ద్గూరిమిఁ గుమార! శివపూ, జారీతి వచింపదరమె ♦ శతసమలకునున్. 284

వ. వినను సంక్షేపంబుగాఁ జెప్పెదను వినుము.

క॥ ధర బ్రహ్మక్షత్రియ వి, ట్చరణోద్భవు లాంధ్రుమగలు ♦ శర్వసమర్చన్
నిరతులయి చేయఁజెల్లును, దరమారసి వారివారి ♦ ధర్మానుసృతిన్. 285

శా॥ ఆయుష్మంతులు వంశకర్తలును నీ ♦ డ్య పవిత్రులౌ పుత్రులన్
జాయన్ బుణ్యగుణోత్తమన్ రమణి వి ♦ జ్ఞానాఢ్యయౌ విద్య నా
త్మాయత్తంబగుమేటి భాగ్యమును దీ ♦ ర్ఘాయుస్సు నారోగ్యమున్
శ్రీయొప్పొందు మహేశపూజన మిడున్ ♦ సిద్ధంబు పుత్రోత్తమా! 286

ఆ॥ శివుని పూజ నపుడు ♦ సేయని చెనఁటికి, నాల్గువిధములౌ న ♦ నర్థములు ఘ
టిల్లు దెవులు లేమి ♦ డియు రాజశిక్షయు, వడిసిపోని ఋణము ♦ కొడుక! వినుము.

## — శివపూజావిధానము —

క॥ పొద్దు పొడుచుటకు మున్నే, నిద్దురవిడి శివుని హరిని ♦ నిజదేశికునిన్
హృద్దేశంబునఁ జేర్కొని, యద్దివిజతీర్థరాజి ♦ నాత్మఁ దలఁచియున్.

వ. అంత

సీ॥ దక్షిణాశకరిగి మలో ♦ త్సర్జనంబొ,
నరిచి మైదు తడవలు భూ ♦ సురుఁడు మృత్తఁ
బడసి పాయువుఁ గడుగఁగా ♦ వలయు గుహ్య,
మొక్క పరిశుద్ధిసేయఁగ ♦ నొప్పు నిలను.

సీ॥ క్షత్రియుఁడు నాల్గుమార్లూ రు ♦ జాతుఁడును ది
వారము జఘన్యజుఁడును ది ♦ వార మూఁడు
వారు శూద్రునివలె మట్టిఁ ♦ బడసి పాయు
వును గడుగవలయును గుహ్య ♦ మును నొకపరి. 290

క॥ ఎడమచెయి పదియుమాఱులు, కుడిచేతిని నేడుమార్లు ♦ కుడియెడమల నే
ర్పడు కరచరణముల నటుల్ ♦ గడుగవలయు నొక్కమాఱు ♦ కల్మషమువియన్

వ. అటుపిమ్మట దంతధావనమునకై ద్వాదశాంగుళ ప్రమాణంబుగా దంతకాష్ఠంబుఁ గొని తద్ధావనంబు సేయవలయును. క్షత్రియ విట్ఛూద్రులు క్రమంబుగ నంత నొక్కొక్క యంగుళ పరిమాణంబు తగ్గించి దంతయష్టిన్ గొని దంతధావనంబు సేయవలయు నిది ప్రతిపత్ షష్ఠీనవమీ పర్వంబులందును, రవివారంబులందును శ్రాద్ధదినములు మున్నగు నిషిద్ధదినములందును జేయగిట్టదు. అట్టి యనర్హదినంబులందు దంతధావనార్థంబు పదిరెండుతడవలం జలులతో గండూషంబు సేయనగు–అనంతరంబు తీర్థాదులందు సమంత్రకంబుగ స్నానమాడవలయు నటుపిమ్మట నాచమనముచేసి తడివస్త్రంబుల విడిచి ధౌతపటంబుల ధరించి యేకాంత సుస్థలంబునం గూర్చుండి సంధ్యావిధి ననుష్ఠించి మనంబు సుస్థిరంబొనర్చి పూజాగృహంబుఁజేరి స్వాసనంబులఁ గూర్చుండి న్యాసాదికంబులొనర్చి క్రమంబుగఁ బూజావిధి నారంభము సేయవలయును.

తే-గీ॥ అష్టదళపద్మము రచించి ♦ యందు ముందు
భద్రకరివస్త్రిఁ గొలిచి దా ♦ వారిపులను
దిక్పతులఁ బూజచేసి యెం ♦ తేనిఁ బీఠ
పూజనముచేసి యట లింగ ♦ మూర్తి ననిచి. 293

సీ॥ ఆచమనముచేసి ♦ హస్తంబులన్ గడ్గి, కొనియుఁ బ్రాణాయామ ♦ మును నొనర్చి
పంచవక్త్రుని దళ ♦ బాహు శుద్ధస్ఫటి, కాకారు శంకరు ♦ నాత్మఁగొలిచి
శంభుసారూప్యంబు ♦ స్మరియించి యఘమును, దహియించి తనుశుద్ధిఁ ♦ దనరఁజేసి
మూలమంత్రమ్మున ♦ నోలిఁగరన్యాస, మట్లె యంగన్యాస ♦ మమరసల్పి

గీ॥ పాద్యమున కర్ఘ్యమునకు ♦ బరగనాచ,
మనమునకుఁ బాత్ర నవకంబు ! నొనరనిల్పి
వానిపై దర్భలనుజేర్చి ♦ వరుసవారి,
తోడ నభ్యుక్షణముచేసి ♦ తోయముంచి. 295

గీ॥ షట్పాది– ప్రణవమును స్మరియించుచుఁ ♦ బాద్యపాత్ర
యందుశీరంబుఁ జందనం ♦ బమరఁజేర్చి
జాతి కంకోల కర్పూర ♦ జాతచూర్ణ
ములను వటమూలజతమాల ♦ భూజజముల
రజములను నాచమనవుఁ బా ♦ త్రిల ఘటించి
యన్నిటను జందనద్రవ్య ♦ మమరఁజేసి. 296

క॥ శ్రీనీలగళుని సన్నిధి, లో నందీశ్వరుని నిల్పి ♦ లోలుపమతి సు
ధ్యానావాహనములచే, స్నానసుగంధాది పూజ ♦ నముఁ జేయవలెన్.

వ. అనంతరంబందు శివునకుఁ బూర్వదిశయందు నణిమను, దక్షిణంబున లఘిమను, పశ్చిమంబున మహిమను, ఉత్తరంబందు గరిమను, నూర్ధ్వంబున, బ్రాప్తిని, నాగ్నేయంబునఁ బ్రాకామ్యంబును, నిరుఋతిదిశను నీశత్వంబును, వాయవ్యంబున వశిత్వంబును, నీశాన్యంబందు సర్వజ్ఞత్వంబును, కర్ణికయందు సోముని, సోమునికిఁ గ్రిందుగ సూర్యుని, సూర్యాధఃప్రదేశంబునఁ బావకునిఁ బావకునికిఁ గ్రిందుగ ధర్మాదులను, సోమునికి వెనుక గుణత్రయంబును, జతుర్దిక్కులందు నవ్యక్తాదులను, గ్రమంబునఁ గల్పన సేయవలయును. మఱియుఁ బరమేశ్వరునకు సద్యోజాత మంత్రంబున నావాహనంబుచేసి వామదేవమంత్రంబున సింహాసనోపవేశనంబును, దత్పురుషమంత్రంబున సాన్నిధ్యంబును నఘోరమంత్రంబున నిరోధంబును, నీశానమంత్రంబునఁ బాద్యాచమనార్ఘ్యంబుల నొసంగి పూజఁ గావించవలయును. ప్రత్యుపచారంబునందుఁ బ్రణవాదిగ నమోంతముఁగ నర్పించవలయును. పరమశివునిసుగంధచందనోదకంబులఁ బంచామృతంబులఁ బుష్పోదకంబుల ఫలరసంబులఁ బ్రణవముచే నభిమంత్రించి యభిషేకముచేసి శ్వేతవస్త్రంబునం దడియొత్తి, భస్మలేపనంబొనర్చి వేగిరంబుగఁ జందనం బర్పింప వలయును. అటుమీఁద సుందరంబులు నక్షతంబులగు శ్వేతతండులంబులను గుశాపామార్గ పాటలీ కర్పూరంబులను, జాది, సంపెంగ, తెల్లగన్నేరు, మల్లెపూవులను, దుమ్మిపూవుల, జమ్మిపూవులఁ గలువలఁ గ్రొత్తక్రొత్త రకంబులగు ప్రత్యగ్రసుందర సుగంధపుష్పంబులను, గోమలబిల్వదళంబుల నర్చింపవలయును, మఱియు నభిషేకంబందు జలధార సమంత్రకంబుగనే యర్పించవలయును. ఆ మంత్రంబులను గూడ నుడివెదను వినుండు. రుద్రంబును, నీలరుద్రంబును జమకంబును, శ్రీసూక్తంబును, రాత్రిసూక్తంబును, హోతారంబు, అధర్వశిరస్సు, అథర్వ * శిఖయు, శాంతియు, నరుణంబును, సామంబును, పుష్పసూక్తంబును, బురుషసూక్తంబును మృత్యుంజయమంత్రంబును, పంచాక్షరంబు మున్నగునవి.

---

* ఈ వచనంబందు స్పష్టార్థము కొన్ని పదంబులందు సంధి చేయలేదు.

వీనిఁ బఠింపుచు సహస్ర జలధారలతోఁగాని ఏకోత్తర శతధారలతోఁగాని యభిషేకము చేయవలయును. అనంతరము మరల విభూతి చందనాక్షత కుసుమ బిల్వంబుల లింగమున కర్పించవలయును. పిమ్మట ప్రణవోచ్చారణంబున ముఖవాసన లొసంగి ధూపదీప నైవేద్య తాంబూల నీరాజనంబుల సమర్పించి నానావిధధ్యానమంత్రపఠనంబుతో మంత్రపుష్పంబిడి నమస్కరించి పునరర్ఘ్యంబిచ్చి సుందరసుమంబులం బాదంబులందుజల్లి నిలిచి దోయిలి పట్టి యిట్టు శంకరునిఁ బ్రార్థించవలయును.

క॥ ఎఱిఁగియొ యెఱుఁగకయో నిన్, పరమేశ్వర! కొలిచినాఁడ ♦ భాస్వరకృప నీ
వరసి సఫలం బొనర్పుము, కరుణాకర! భక్తలోక ♦ కల్పవలాశీ ! 299

సీ॥ ఇట్లు విజ్ఞాపనయొనర్చి ♦ యీశు మౌళి, విగుల నర్పణ చేసి భూ ♦ సురులచేత
స్వస్తిమంత్రంబులను లెస్సఁ ♦ జదువఁజేసి, మార్జనముచేసి శివుని న ♦ మస్కరించి.

క॥ శివ! నీదు భక్తినొసఁగుము, శివ! నీదు ప్రపత్తి నిడు న ♦ సిగ నేజని నేస్
శివ! నీదు భక్తి నొసఁగుము, శివ! నీదు ప్రపత్తినిమ్ము ♦ చేమోడ్పులివే. 300

గీ॥ ఇట్లు శంకరుఁ బ్రార్థించి ♦ యెంతయేని, భక్తితో గళనాదంబుఁ బట్టి మ్రొక్కి
హరునివరిచారగణముల ♦ కెఱిఁగి యర్చనసమాప్తియొనర్పఁద ♦ గును ముదమున

సీ॥ ఇట్లుశివభక్తుఁడై యెవఁ ♦ డీశ్వరార్చ, నముఁబొనర్చునో యవ్వాని ♦ కమరునఖిల
సిద్ధులును సకలాభీష్ట ♦ సిద్ధులును న, తండు వక్తలలోన ను ♦ త్తమతఁదనరు.302

క॥ రోగంబును వగపును వ్యా, ద్వేగంబును గలుషములను ♦ విసమును ఋణమున్
బోగొట్టు శివసమర్చన, బాగుగఁ గళ్యాణమిచ్చి ♦ పాలించునిలన్. 303

ఆ॥ ఇట్లు చెప్పినాఁడ ♦ నీశ్వరార్చన విధ, మింక నేదివినఁగ ♦ నెంచినాఁడ
వడుగుమన్న నాతఁ ♦ డలరి యిట్లనె దేవ!, మఱియు జెప్పు శివస ♦ మర్చఁగుఱిచి

వ. అనిన వనజోద్భవుండిట్లనియె.

చ॥ వినుము కుమార! యెక్కుడు ♦ వేడుకతో సురలన్ మునీంద్రులన్
గని యిటులంటి శాశ్వతసు ♦ ఖంబును నెవ్వరు గోరువారలో
ఘనతర సిద్ధులన్ వలచు ♦ కాముకులెవ్వరో వారనెల్లనన్
వెనుకొనిరండనాన్ గదలి ♦ వేగిరమట్టులె వచ్చిరందఱున్. 306

## —* హరిబ్రహ్మాదులు శివలింగములను ధరించి పూజించుట *—

వ. అర్హతనెఱింగి శివలింగంబుల నిర్మించి దివ్యవరులకిచ్చుడునాదరంబున నవ్వానిని
శివేచ్ఛతోఁ బరిగ్రహించియుత్తమాంగంబులం దిట్లు ధరించి పూజించిరి. 313

గీ॥ ఇంద్రనీలమయంబు మ ♦ హేశలింగ,మర్థిధరియించి పూజించె ♦ నబ్జనయనుఁ
డట్టులె హిరణ్యలింగంబు♦నర్థిఁదాల్చి, పూజఁగావించె నలరి స ♦ రోజ భవుఁడు

సీ॥ పటికంబులింగంబుఁ ♦ బద్మాలయగ్రహించి, కొలిచెనిండారెడు ♦ కుతుక మొదవ
బ్రహ్మాణియును రత్న ♦ భాస్వరలింగంబుఁ బడసి యర్చించె వి ♦ స్ఫారభక్తి
పద్మరాగమయంబ ♦ భవలింగమును గొని, పూజ గావించెన ♦ ముచినిహాంత
దండధరుండు ని ♦ తాంతపీతమణీర, చిత లింగమొంది య ♦ ర్చించె నిష్ఠ
శ్యామలపులింగమర్చించె ♦ నంబువిభుడు, వజ్రలింగంబుఁగొలిచె ది ♦ వాకరుండు
కైరవామోదకరుఁడు ము♦ క్తామణీమయ, లింగమును జెంది నైష్ఠిక♦ లీల గొలిచె

క॥ వసువులు విశ్వేదేవులు, కుసిమెయి రౌప్యమయ మార ♦ కూటమయములౌ
పసినెలదాలుపులింగము, ల సమర్చనచేసిరొంది ♦ లలితాంగములన్. 316

క॥ పవడపులింగము భోగి, ప్రవరులు తామ్రకృతలింగ ♦ రాజము నాది
త్యవరులు దమ్రిలిఁకన్ బా, ర్థివలింగముఁజెంది కొల్చి ♦ రి మునిలలామా. 317

గీ॥ అర్చనాపద్ధతిని దివ్యు♦లందఱికిని, దెలిపె విష్ణుం డమరులేను ♦ దేఁకువెసఁగ
జలజనయనుని సెలవొంది ♦ సత్వరముగ, నాత్మధామములొందితి ♦ మందఱమును.

వ. ఇఁక 319

క॥ పుట్టుకలందును మనుజుని, పుట్టుక శ్రేష్ఠమవు నందుఁ ♦ బూతకులమునన్
బుట్టుట యెక్కుడు పుట్టిన, యట్టిఁడు నిజ జాతికర్మ మూరయఁగవలెన్. 320

క॥ జ్ఞానం బొదవెడువనుక న, నూనంబుగ జాతికర్మ ♦ మొనరింపవలెన్
జ్ఞానము మోక్షము నిడు నను, మానములేదించుకేని ♦ మానిప్రవరా! 321

గీ॥ కర్మయజ్ఞ సహస్రంబు♦కన్న దాప,సవ్రతం బది మేలగు ♦ సరణి మించుఁ
దాపసవ్రతమునకన్న, ధ్యానయజ్ఞ♦ముత్తమంబగు నది జ్ఞాన♦మొదవఁజేయు.

వ. ఆ ధ్యానయజ్ఞం బొనర్చినవానికి శివుండు సన్నిహితుం డగును. వానికిఁ బ్రాయశ్చిత్తమక్కఱలేదు. మఱియు నట్టివానికి సుఖదుఃఖంబులు, ధర్మాధర్మంబులు గన్పట్టవు. ఇఁకను లింగము బాహ్యమనియు నాభ్యంతరమనియు రెండువిధము లొప్పు. బాహ్యము స్థూల మాభ్యంతరంబు సూక్ష్మంబు. కర్మయజ్ఞంబొనర్చువారు బాహ్యలింగ పూజనప్రియులు. ఆధ్యాత్మికమగు లింగంబు ప్రత్యక్షంబు గానివారలకీ బాహ్యలింగంబే శరణ్యంబు. ఈ స్థూల లింగంబున వారలు సర్వోపచారంబుల నర్పింపఁజెల్లు. జ్ఞానులగువార మలంబు నవ్యయంబు నగు సూక్ష్మలింగంబు నర్చింతురు. అట్టివారికిఁ జిత్తంబందు సకలమనియు, నిష్కళమనియెడు విచారంబు గలుగదు. ఎల్లజగంబీశ్వరమయంబై కన్పట్టు విహితా విహితంబులందు విధినిషేధంబులు గూడ నవ్వారలబాధింపవు. 323

క॥ సలిలంబందలి పద్మము, సలిలంబునఁ జెదరిపోని ♦ చందమునను స్వస్థలి విడువకున్న జ్ఞానియు, బలితంబగు కర్మబంధ ♦ పటలిఁ జొరఁడిలన్.

వ. ఇఁకనిట్లు జ్ఞానసిద్ధివఱకుఁ జాతికర్మంబుల నొనర్పఁదగు నటుమీఁదనొక్క శివపూజనుమాత్ర మొనర్పందగును.

క॥ రవి యొక్కఁడైనఁ జెఱువుల, భువి బావులఁ బెక్కురట్లు♦ పొలుచునటులె శ్రీ శివుఁడొకఁడె సదసదాత్మక, మవు సర్వజగంబెఱుంగు ♦ నాత్మమున మునీ! 324

వ. ఇట్లు హృదయంబున సర్వంబు సాక్షాన్మహేశ్వరునిగ నెఱుంగుటకై ప్రతిమాద్యర్చనంబు ప్రతిపాదింపఁ బడియె.

గీ॥ చెలఁగి యుచ్చైఃపదంబును ♦ జేరఁబోవు, నట్టివానికి యూఁతయె ♦ ట్లవసరంబొ నిర్గుణజ్ఞానసిద్ధికై ♦ నియతవిగ్ర, హార్చనం బవలంబనం ♦ బై తనర్చు. 325

వ. ఇందున నెల్లవారలకు జ్ఞానసిద్ధికై స్వజాతి కర్మాచరణం బావశ్యకంబు. దేహికీశ్వరపూజనంబులేక పాతకంబు దొలంగదు. అద్ది దవులఁబాయకున్న జ్ఞానసిద్ధి యమరదు. పాపంబు దొలంగిన సర్వంబు నిర్మలంబగు. 326

క॥ మలినపటము రంగద్దిన, వెలవెలఁ బోయెడునుగాక ♦ వెలయునె చెలువై మలినతఁగడిగిన పైరం, గలరెడు నమలమతి జ్ఞాన ♦ మలరునటు సుతా. 327

గీ॥ జ్ఞాన విజ్ఞానములనెల్ల ♦ సంతరించుఁ
జలనమొందని భక్తిత ♦ ద్విలసనమున
కారణంగ సద్గురుఁడు మూల ♦ మట్టి గురున
కగును మూలంబు సత్సంగ ♦ మవనిలోన. 328

గీ॥ సాధుసాంగత్యమున నబ్బు ♦ సద్గురుండు, నతనిచే మంత్ర మద్దాన ♦ నమరుభక్తి
దాన జ్ఞానంబుసిద్ధించు ♦ జ్ఞానమదియుఁ, గూర్చు విజ్ఞాన మదిభిదఁ ♦ గూలఁజేయు.

క॥ భేదము నుఱిఁగిన దుఃఖం, బేది యతండే మహేశుఁ ♦ డెల్లవిధములం
దీదృశుఁ డపురూపంబగు, నేదేవత లేనివాని ♦ నెన్నుదురు భువిన్. 330

గీ॥ మృచ్ఛిలామయ దేవుల ♦ మేయ నీర, మయములౌ తీర్థములు జ్ఞాన ♦ మయునిఁబోల
వవ్వి తడవుగ శుద్ధిసే ♦ యంగనోపు, దరిసెనముననె సాధులం ♦ తయు ఘటింత్రు.

వ. కావున నట్లు జ్ఞానసిద్ధికై దేవతార్చనం బావశ్యకంబు, అందుఁగూడ శివలింగ
పూజనం బత్యంతావశ్యకంబు. 332

గీ॥ అఖిలలోకైకమూలమౌ ♦ హరునిఁ గొలువ
సర్వదేవులఁ గొలిచిన ♦ సరణి యమరు
జలము మూలమునం జేర్ప ♦ శాఖలెల్ల
నలరు నవి వాడ మూలమే ♦ మట్లుచెడదు. 333

వ. అనుడు నారదుండు మహాత్మా! నారాయణుఁడు సురలకందఱి కెట్లు శివపూజా
విధి నెఱింగించెనో యద్ది వక్కాణింపుమన్న శతానందుం డిట్లనియె. 334

## — * విష్ణుమూర్తి దేవతలకుఁ జెప్పిన శివలింగపూజావిధానము * —

క॥ అరుణోదయమునకును మును, ధరామరుఁడు నిదురలేచి ♦ తద్దయు భక్తిన్
శిరమున నంజలిఁజేరిచి, పరమేశ్వరు నిత్తెఱఁగున ♦ బ్రార్థించవలెన్. 335

క॥ శివ! ధర్మంబే నెఱిఁగియుఁ, బ్రవృత్తిఁ గొనకుంటి నందుఁ ♦ బ్రిజ్ఞనువిడి నే
శివ! యట్లధర్మమెఱిఁగియు, నివృత్తిఁ గననైతి నెట్లొ ♦ నేరుపు! హితవున్. 336

వ. అని యర్థించి గురుపాదుకల సంస్మరించి కాల్యావసరంబులఁ దీర్చికొని యుష
కాలంబునుబట్టి నదియందుఁ గాని గృహమందుఁ గాని నియతంబుగ స్నానం
బొనర్పవలెను. 337

గీ॥ రవిదినంబున గ్రహణ సం ♦ క్రాంతులందు
శ్రాద్ధదినమందును నుపవా ♦ సదినమందు
సకల తీర్థంబులందు నా ♦ శౌచమందు
స్నాన మది వేఁడినీళ్ళతో ♦ సల్పఁజనదు.

వ. మఱియుఁ దైలాభ్యంగనంబుఁగూడ నిట్టి వారంబులు సూచి యొనర్పఁదగును. ప్రతినిత్యంబు నభ్యంగనము సేయువారలకెప్పుడును దోసంబులేదు. అందు నావనూనెతోఁ దలంటుకొనువారల కొక్క గ్రహణంబునఁ దక్కఁ దక్కిన సమయంబులందు నిషేధంబులేదు. మజ్జనానంతరము దేవ ఋషి పితృతర్పణంబొనరించి ధౌతవస్త్రంబుఁ గట్టి శుచిప్రదేశంబున, మృగచర్మంబునఁగాని దర్భాసనాదులందుఁ గాని కూర్చుండి భస్మత్రిపుండ్రంబుల ధరించి రుద్రాక్ష ధారణం బొనర్చి నిత్యకర్మంబులను జపతపోదానంబులను సల్పి పూజాద్రవ్యంబుల నెల్ల సాన్నిధ్యమునందుఁ జేర్చుకొని గురువందనంబుచేసి సంకల్పపూర్వకంబుగఁ బరివార దేవతాయుక్తంబుగ శివునిఁ బూజించవలెను.

గీ॥ ముందుగా గణనాథునిఁ ♦ బూజచేసి, కొమరుసామిని ద్వారి ♦ కులను గొల్చి
కుంకుమసుగంధచందన♦కుసుమధూప, దీపనైవేద్యముల, నుమన్ ♦ దీర్చికొల్చి.

వ. అనంతరంబున నాచమన ప్రాణాయామంబుల సల్పి యఖండదీపారాధనం బొనర్చి పద్మాసనంబునఁ గాని భద్రోత్తానపర్యంకాసనంబులందుఁ గాని సుఖంబుగఁ గూర్చుండి యనన్యమానసుండై బాణలింగంబును గాని, సువర్ణ రజతలింగంబును గాని, పార్థివలింగంబును గాని మూలమంత్రోచ్చారణంబుతోఁ బంచముద్రలఁ జూపించి యావాహన స్థాపన సన్నిధాపన సన్నిరోధ నావకుంఠనంబుల నొనర్చి. 340

సీ॥ కప్పురంబునకన్నఁ ♦ గడు తెల్లనగువాని, నెలరేక తలపైన ♦ నెగడువాని
జడలచొళ్ళెము నెంతొ♦చక్కఁ దాల్చినవాని, వెలిబూది నుదురున ♦ వెలయువాని
నేన్గుచర్మంబు బి ♦ ట్టెలమిఁగట్టినవానిఁ, బులితోలు బుజములఁ ♦ బొలుచువాని
పెనుపాపపేరులఁ ♦ బేర్మినొందినవాని, నందియెక్కమున మి ♦ న్నందువాని

గీ॥ వెండికొండను గాపురం ♦ బుండువాని, గట్టురాచూలిఁ గట్టుకొ ♦ న్నట్టివాని
సజగవంబను పెద్దవి ♦ ల్లమరువాని, నెల్లజగముల కొడయఁడై ♦ యేలువా

క॥ దాసజనంబును గడున,ల్లాసంబున మనుచు వాని ♦ లలితకృపాశ్రీ
భాసురుని బరమశివునిన్, వాసిమెయిన్ బూజసేయ♦వలయును మౌనీ! ౩౩౩

వ. ఆసన పాద్యార్ఘ్యాచమనంబులొసంగి ససుగంధచందనోదకధారల షడంగము లతో శతరుద్రీయ చమకానువాకంబులతో నేకాదశవారము లభిషేకముచేసి శుద్ధ వస్త్రంబుతోఁ దడి యొత్తవలయును. అటుపిమ్మట నాచమనంబొసంగి వస్త్రంబుల నర్పింపవలయు నామీఁద తిలలు, యవలు, గోదుమలు, పెసలు, మినుములు, శివునికి మంత్రింబులతో నర్పించి యటుపైఁ పద్మంబులు, శంఖ పుష్పంబులు, ధుత్తూరంబులు, దుమ్మిపూవులు, మందారకుసుమంబులు, బిల్వ దళంబులు దులసీపత్రంబు లర్పింపవలయును. అన్నిటియందు బిల్వదళంబు లుత్తమోత్తమంబులు. వీని యర్పణంబున సర్వసిద్ధులు సేకూడు ననంతరము సుగంధచూర్ణముల నత్తరువుల నర్పించి గుగ్గుల్వగరు ధూపంబులు దీపంబులు నొసంగి యిట్లర్ధించుచు బునరర్ఘ్యం బీనలయును.

క॥ ఇమ్ము మహేశ్వర! రూపము, నిమ్ము గరీయమగుభోగ ♦ మిందుకిరీటా!
ఇమ్ము శివ! కీర్తిని నా,కిమ్ము హరా! ముక్తి నర్ఘ్య ♦ మిదిగొను గొలుతున్.

వ. తరువాత ననేకవిధంబులగు మధురభక్ష్యంబులతో దివ్యాన్నంబు నైవేద్యంబు చేసి యాచమనంబు సేయించి సుగంధ తాంబూలంబుల నర్పించి పంచవర్తి జ్వాలలతోఁ పాదంబులందు నాలుగు మాఱులు పొక్కిట రెండుమాఱు లొక్క తడవ మొగంబందు నేడుమాఱులు సర్వాంగములందు మొత్తము పదు నాలుగుమాఱులు దీపహారతి నటుపైఁ గర్పూరనీరాజనంబిచ్చి గురూక్త మూలమంత్రంబు జపించి వేదస్తనంబులతో మంత్రపుష్పంబు సమర్పించి ప్రద క్షిణ నమస్కారంబు లొనర్చి మఱియు నిట్లు విజ్ఞప్తి యొనర్పవలెను.

క॥ భువిఁబదము జాతినంతనె, భువియే యవలంబన మయి ♦ పోసఁగెడు నటులే
భవ! నీయెడనేఁ దప్పిన, శివ! నీవేదిక్కుగాదె ♦ శశిరకరధరా!

క॥ పరివారయుతముగా నీ, యిరవున కేగుము మహేశ! ♦ యిత్తఱిఁ గృపతో
మరల సమర్చనవేళకుఁ, దఱియుము దాసజనదుఃఖ ♦ దళనప్రవణా!

వ. ఇట్లర్చించి తిరిగియుఁ బుష్పాంజలి నర్పించి స్వహృదయంబునందు శివలింగంబును విసర్జించి తత్తీర్థంబు మూర్ధంబునందుఁ జల్లుకొని గ్రహించునది. ఇట్లు భోగ మోక్షప్రదంబు శివసమర్చన ప్రకారం బుపదేశించితి నిఁకేమి వినవలెదు

వెలింగింపుమనుడు మహాత్మా ! పుష్పపత్రార్చనంబునందు శివుం జేయుపుష్ప పత్రంబుల నేయేఫలంబు లొసంగునో యెఱింగింపుమనిన ననుకంపతో నిలింప జ్యేష్ఠుండిట్లనియె.

## —* ప్రత్యేక పుష్పపత్రార్చనాఫలనిరూపణము *—

గీ॥ పద్మములు బిల్వదళ శత ♦ పత్ర శంఖ, సుమము లొకలక్షచేతఁ బ ♦ శుపతిలింగ
మర్చనముసేయఁ బాపంబు ♦లస్తమించు, భాగ్యములుపట్టునందియుం ♦ బడగఁజనదు.

క॥ ఇరువదిపద్మములైనన్, బరఁగును బ్రస్థంబు వేయి ♦ బైల్వదళములే
నరప్రస్థము శతపత్రము, లరప్రస్థము వేయిదైన ♦ నరయు మునీంద్రా! 351

వ. పదియాఱుపలంబు లొక్కప్రస్థంబగుఁ బదిటంకంబు లొక్కపలమగు నీ పరిమాణంబెఱింగి యర్చింపనలయును. రాజ్యకామియగు వాఁడీ పద్మాది చతుష్టయంబున నొక్కటనేని పదికోట్ల లెక్కతోఁ బార్థివలింగపూజ విధి విహితంబుగ నొనర్చిన శివానుగ్రహంబున రాజ్యంబుఁ బడయు మఱియుఁ బ్రాధాన్యకామి తదర్థంబుచేతను గారాగృహబద్ధుండు లక్షయుగు వానిచే రోగగ్రస్తుండు తదర్ధంబునను గన్యాకాముకుఁడు తదీయార్థంబునను విద్యాకాముండద్దానిలో సర్ధంబునను బూజించిన నిష్టంబులఁ బడయుదురు.

సీ॥ కుశలఁ బూజించినఁ ♦ గూర్చు దీర్ఘాయుస్సు, నున్మత్తసుమపూజ ♦ యొసఁగు సుతుల
కర వెూందు యశము న ♦ గస్త్యసుమార్చన, నర్కపుష్పార్చ శౌ ♦ర్యంబొసంగు
కలువలపూజ వి ♦క్రమము సంతనసేయు, వైరులఁ గెడపు జ ♦పాసుమార్చ
గన్నేరువిరిపూజ ♦ గడఁగి రిపులఁబాపు, బంధూకపూజ రాఁ ♦ బట్టు నగల.

గీ॥ జాతిపుష్పార్చ వాహన ♦ సంపదనిడు, మల్లియలపూజ యొసఁగు రా ♦ మయగుసతిని
మొల్లపూవులయర్చన ♦ భోగమిచ్చు, నవిసెపూవుపూజ శంభుస ♦ ఖ్యంబుఁ గూర్చు.

వ. మఱియును.

గీ॥ రాజికాకుసుమార్చ య ♦ రాతిహరము, కడఁగి వావిలివిరిపూజ ♦ కలుషహరము
కొండగోగువిరులపూజ ♦ కోకలొసఁగు, దిరిసెనపుఁబూలపూజ సం ♦ బరము సేయు.

గీ॥ నువ్వుపువ్వులయర్చన ♦ జవ్వనమిడు, తుమ్మిపువ్వులపూజ మో ♦ క్షమ్మునిచ్చు
నందివర్ధనసుమపూజ ♦ యంద మొసఁగు, నలకురంటకకుసుమార్చ ♦ గలిమిఁగూర్చు

క॥ సంపెఁగ మొగలివిరులఁ జేర్చి, మింపఁడు బాలేందుమౌళి ♦ మిగులు విరులలో
నింపగు సొంపగునవి య, ర్పింపఁగఁ జెందెద రమేయ ♦ విపులఫలంబుల్. 355

క॥ దాసజనంబును గడున,ల్లాసంబున మనుచు వాని ♦ లలితకృపాశ్రీ
భాసురుని బరమశివునిన్, వాసిమెయిన్ బూజసేయ♦వలయును మౌనీ! ౩౩౩

వ. ఆసన పాద్యార్ఘ్యాచమనంబులొసంగి సనుగంధచందనోదకధారల షడంగము లతో శతరుద్రియ చమకానువాకంబులతో నేకాదశవారము లభిషేకముచేసి శుద్ధ వస్త్రంబుతోఁ దడి యొత్తవలయును. అటుపిమ్మట నాచమనంబొసంగి వస్త్రంబుల నర్పింపవలయు నామీఁద తిలలు, యవలు, గోధుమలు, పెసలు, మినుములు, శివునికి మంత్రంబులతో నర్పించి యటుపైఁ పద్మంబులు, శంఖ పుష్పంబులు, ధుత్తూరంబులు, దుమ్మిపూవులు, మందారకుసుమంబులు, బిల్వ దళంబులు దులసీపత్రంబు లర్పింపవలయును. అన్నిటియందు బిల్వదళంబు లుత్తమోత్తమంబులు. వీని యర్పణంబున సర్వసిద్ధులు సేకూడు ననంతరము సుగంధచూర్ణముల నత్తరువుల నర్పించి గుగ్గుల్వాగరు ధూపంబులు దీపంబులు నొసంగి యిట్లర్థించుచు బునరర్ఘ్యం బీవలయును.

క॥ ఇమ్ము మహేశ్వర! రూపము, నిమ్ము గరీయమగుభోగ ♦ మిందుకిరీటా!
ఇమ్ము శివ! కీరితిని నా,కిమ్ము హరా! ముక్తి నర్ఘ్య ♦ మిదిగొను గొలుతున్.

వ. తరువాత ననేకవిధంబులగు మధురభక్ష్యంబులతో దివ్యాన్నంబు నైవేద్యంబు చేసి యాచమనంబు సేయించి సుగంధ తాంబూలంబుల నర్పించి పంచవర్తి జ్వాలలతోఁ పాదంబులందు నాలుగు మాఱులు పొక్కిట రెండుమాఱు లొక్క తడవ మొగంబందు నేడుమాఱులు సర్వాంగములందు మొత్తము పదు నాలుగుమాఱులు దీపహారతి నటుపైఁ గర్పూరనీరాజనంబిచ్చి గురూక్త మూలమంత్రంబు జపించి వేదస్తవంబులతో మంత్రపుష్పంబు సమర్పించి ప్రద క్షిణ నమస్కారంబు లొనర్చి మఱియు నిట్లు విజ్ఞప్తి యొనర్పవలెను.

క॥ భువిఁబదము జాఱినంతనె, భువిపైనే యవలంబన మయి ♦ పోసఁగెడు నటులే
భవ! నీయెడనేఁ దప్పిన, శివ! నీవేదిక్కుగాదె ♦ శశిరకరధరా!

క॥ పరివారయుతముగా నీ, యిరవున కేగుము మహేశ! ♦ యిత్తఱిఁ గృపతో
మరల సమర్చనవేళకుఁ, దఱియుము దాసజనదుఃఖ ♦ దళనప్రవణా!

వ. ఇట్లర్థించి తిరిగియుఁ బుష్పాంజలి నర్పించి స్వహృదయంబునందు శివలింగంబును విసర్జించి తీర్థంబు మూర్ధంబునందుఁ జల్లుకొని గ్రహించునది. ఇట్లు భోగ మోక్షప్రదంబు శివసమర్చన ప్రకారం బుపదేశించితి నీకేమి వినవలఁతు

వెలిఁగింపుమనుడు మహాత్మా ! పుష్పపత్రార్చనంబునందు శివుం డేయేపుష్ప పత్రంబుల నేయేఫలంబు లొసంగునో యెఱింగింపుమనిన ననుకంపతో నిలింప జ్యేష్ఠుండిట్లనియె.

## —∗ ప్రత్యేక పుష్పపత్రార్చనాఫలనిరూపణము ∗—

గీ॥ పద్మములు బిల్వదళ శత ♦ పత్ర శంఖ, సుమము లొకలక్షచేతఁ బ ♦ శుపతిలింగ
మర్చనము సేయఁ బాపంబు ♦ల స్తమించు, భోగ్యములు పుట్టు సందియం♦ బడఁగ జనదు.

క॥ ఇరువదిపద్మములైనన్, బరఁగును బ్రస్థంబు వేయి ♦ బైల్వదళములే
నరప్రస్థము శతపత్రము, లరప్రస్థము వేయిద్దైన ♦ నరయ మునీంద్రా ! 351

వ. పదియాఱుపలంబు లొక్క ప్రస్థంబగుఁ బదిటంకంబు లొక్క పలమగు నీ పరిమాణంబెఱింగి యర్చింపవలయును. రాజ్యకామియగు నాతఁడీ పద్మాది చతుష్టయంబున నొక్కటనేని పదికోట్ల లెక్కతోఁ బార్థివలింగపూజ విధి విహితంబుగ నొనర్చిన శివానుగ్రహంబున రాజ్యంబుఁ బడయు మఱియుఁ బ్రాధాన్యకామి తదర్థంబుచేతను గారాగృహబద్ధుండు లక్షయగు వానిచే రోగగ్రస్తుండు తదర్థంబునను గన్యాకాముకుఁడు తదీయార్థంబునను విద్యాకాముండద్దానిలో నర్థంబునను బూజించిన నిష్టంబులఁ బడయుదురు.

సీ॥ కుశలఁ బూజించినఁ♦ గూర్చు దీర్ఘాయుస్సు, నున్మత్తసుమపూజ♦యొసఁగు సుతుల
కర మొందు యశము న♦గస్త్యసుమార్చన, నర్కపుష్పార్చ శౌ♦ర్యంబొసంగు
కలువలపూజ వి♦క్రమము సంతనసేయు, వైరులఁ గెడపు జ♦పాసుమార్చ
గన్నేరువిరిపూజ ♦ గడఁగి రిపులఁబాపు, బంధూకపూజ రాఁ♦బట్టు నగల

గీ॥ జాతిపుష్పార్చ వాహన♦సంపదనిడు, మల్లియలపూజ యొసఁగు రా♦మయగుసతిని
మొల్లపూవులయర్చన♦భోగమిచ్చు, నవిసెపూవుపూజ శంభున♦ఖ్యంబుఁగూర్చు.

వ. మఱియును.

గీ॥ రాజికాకుసుమార్చ య♦రాతిహరము, కడఁగి వావిలివిరిపూజ♦కలుషహరము
కొండగోగువిరులపూజ♦కోకలొసఁగు, దిరిసెనపుఁబూలపూజ సం♦బరము సేయు.

గీ॥ నువ్వుపువ్వులయర్చన ♦ జవ్వనమిడు, తుమ్మిపువ్వులపూజ మో♦క్షమ్మునిచ్చు
నందివర్ధనసుమపూజ ♦ యంద మొసఁగు,నలకురంటకకుసుమార్చ ♦ గలిమిఁగూర్చు

క॥ సంపెఁగ మొగలివిరులఁ బ్రే, మింపఁడు బాలేందుమౌళి ♦ మిగులు విరులలో
నింపగు సొంపగునవి య, ర్చింపఁగఁ జెందెద రమేయ ♦ విపులఫలంబుల్. 355

వ. వెండియు.

గీ॥ లక్షబిల్వార్చనంబు మహాపాతకఘ్న, కెవఁడు సేయునో యవ్వాని కీప్సితంబు
లన్ని కూర్చి ముక్తి నంత్యమున నిచ్చు, జమ్మిదళములపూజ మోక్షమ్ము సేయు.

## —* ధాన్యపూజాఫల నిరూపణము *—

వ. ఇట్లు పుష్పపత్రార్చనాఫలంబును వేఱువేఱుగ నీ కెఱింగించితి నింక ధాన్యార్చనంబులు నెఱింగించెదను వినుము. తండులారోపణచేత లక్ష్మీవృద్ధి యగును తండులంబులు తొమ్మిది ప్రస్థంబులపై రెండుపలంబులైన నొకలక్ష ప్రమాణంబగు. శివలింగంబును బూజించి సుందరవస్త్రం బొడు లింగంబుపై నునిచి పూర్వోక్తప్రమాణంబుగ లక్షాక్షతతండులంబు లర్పించి యవ్వానిపై నొక్క శ్రీఫలంబుంచి సుగంధపుష్పధూపదీపనైవేద్యంబులొసంగి పన్నిద్దఱు బ్రాహ్మణులకు భోజనంబిడి యవ్వారలకు దక్షిణ లిచ్చి యాజ్ఞికునకు శక్తి లోపంబు సేయక దక్షిణ లీవలయు నిట్లైన లక్షతండులార్చన యగును. లక్ష తిలార్చనచేత మహాపాపనాశనంబగును. తిలలు పదకొండు పలంబులైన నొక లక్ష యగు నవ్వాని తొలుతటివలెఁ బూజించి యట్లే బ్రాహ్మణులకు భోజన దక్షిణ లర్పింపవలయును. అటులొనర్చిన సమస్తాఘంబులు నశించిపోఁగలవు. లక్ష యవపూజ స్వర్గసౌఖ్యంబులిచ్చు నెనిమిది ప్రస్థంబుల పదిపలంబులు యవలైన నొకలక్షయగు నవ్వానితోఁ బూర్వోక్తవిధిఁ బూజించి బ్రాహ్మణులకు భోజనంబుఁ బెట్టి దక్షిణ లీవలయును. గోధూమార్చనంబు సంతానవృద్ధికరము, అర్ధద్రోణంబు గోధుమలు లక్షయగును. పూర్వోక్తవిధిగ సమర్పణ నొనర్చి బ్రాహ్మణులకు భోజనదక్షిణ లీవలయును. ముద్గార్చన సుఖంబుఁ గూర్చు నేడుప్రస్థంబులపైఁ బదిపలంబులు పెసలైన లక్షయగును. పూర్వోక్తవిధి నవ్వాని నర్పించి పదియొక్కరు బ్రాహ్మణుల కన్నంబుఁ బెట్టి దక్షిణ లొసంగవలయును. ప్రియంగు పూజనంబునఁ ద్రివర్గవృద్ధియగును. కొఱ్ఱలు ప్రస్థంబైన నొకలక్షయగును. వెనుకటివలెఁ బూజించి పండ్రెండుగురు బాపలకు సాపాటు గావింపఁజేసి దక్షిణ లొసఁగ వలయును. సార్షపార్చన శత్రుహింసిని. ఇరువది ప్రస్థంబులావాలైన నొకలక్షయగు వెనుకటివలె నర్పించి బ్రాహ్మణుల కన్నదానంబుచేసి దక్షిణ లొసఁగవలయును. మరియు మిరియాలతో శివలింగంబు నర్పించినఁ బరిపంథిమారణం బొనరు. ఆఢకదళార్చన సర్వసౌఖ్యఫలంబిచ్చు నిద్ది ధాన్యార్చనామాన ప్రకారం బింకఁ బుష్పమానంబులు వినుము. శంఖపుష్పంబు లొకప్రస్థంబైన లక్షయగు జాదివిరులు మొల్లపూవులు పదియు నొక్కప్రస్థంబైన లక్షయగు. రాజికాకుసుమంబు లర్ధప్రస్థంబైన లక్షయగు

నిరువది ప్రస్థంబులు మల్లెపూవులు లక్షయగు నందావర్త ప్రస్థంబు దక్కు వైన సుప్పొవుప్పులు లక్షయగు నిఁక ముప్పదియొనిమిది ప్రస్థంబులు గన్నేరు విరులైన లక్షయగు వావిలి పూవులట్టులేయగును. కొండగోగువిరులు శిరీష కుసుమంబులు మంకెనపూవులు పదిప్రస్థంబులైన నొక్కొక్కడు లక్షయగు. వీనిఁ దెలిసి లెక్కయెఱింగి పూజింపవలయును.

## —* అభిషేకఫల నిరూపణము *—

ఇఁకనభిషేకజలధారాఫలంబుల విశదీకరించెద వినుము. జ్వరప్రలాపశాంతికై పద కొండు మాఱులు శతరుద్రీయ చమకానువాకంబులతోఁ బురుషసూక్తముతో షడంగన్యాసములతో, మహామృత్యుంజయ గాయత్రీ జపములతో శివలిం గంబును సభస్మజలధారల నభిషేకింప వలయును. జ్వరప్రలాపంబులు శమించును.

క॥ ఘృతధారల నభిషేకము, సుతవృద్ధినిఁ గోరి సేయ ♦ శుభ్రాంశుధరుం
డతులకరుణాఢ్యుఁడై యిడు, సుతులను తేజోమహితుల ♦ శుభగుణయుతులన్.

వ. ఇంకను.

సీ॥ దుగ్ధాభిషేకంబు ♦ దుఃఖంబుఁ బోఁజిమ్ము, చక్కెరఁజేర్ప వి♦స్తరిలుఁ బ్రజ్ఞ
తైలసేకంబు ని♦ర్మూలించుఁ బగతుర, నత్తరు వర్షింప ♦ నమరు భోగ
మావనూనియసేక♦మరిమర్దనముచేయుఁ, దేనెతో స్నపియింప ♦ నీనుఁగల్మి
ఇక్షురసపుసేక♦మొసఁగించు మోదంబు, గంగాంబుధార మో♦క్షంబు నిచ్చు

గీ॥ నయుతమానంబుగా నిట్టు♦నభవలింగ, మర్థిమై రుద్రపాఠపా♦రాయణంబు
లమర నభిషేకమొనరించి♦యట్లు రుద్ర, సంఖ్యతో బాఁపలకుజగ్ధి♦సల్పవలయు.

వ. ఇట్లు నందిస్కందగణేశోమాసమేతంబుగశివుని విధిప్రకారంబు సమంత్రకంబుగఁ బూజించిన సకలభోగంబులు చెంది పుత్రపౌత్రాదులతో నానందంబునొంది యంతంబున మోక్షంబు నొందుదురనుడు నారదుండు మహాత్మా! సంతసం బయ్యె నిఁక సృష్టిఁగూరిచి యటుపై వృత్తాంతంబు నెఱింగింపుమనిన విధి యిట్లనియె.

## —* బ్రహ్మదేవుఁడు నారదునకు సృష్టినిఁగూర్చి చెప్పుట *—

చ॥ తరుణశశాంకశేఖరుఁడు ♦ దానటు లంతరమొంద నేను న
ప్పరమశివాజ్ఞ లోకములఁ ♦ బన్నుగ సృష్టియొనర్పఁగోరి శం

కరుని మనంబునన్ గొలువఁ ♦ గాండమునం దగుపట్టె నండమొం
డిరువదినాల్గు తత్త్వముల ♦ నింపుగనొందిన యద్ది నాకటన్. 361

గీ॥ ఆవిరాడ్రూపమును జూచి ♦ యంతసంది, యంబునేఁ జెందిదారుణం♦బైనతపముఁ
బదియు రెండేండ్లు గావింపఁ♦బద్మనయనుఁ, డాదటన్ జేరి నాదు దే♦హంబు నిమిరె.

క॥ పరమదుగు సంతసించితి, నరమరయొక్కింతలేక ♦ యబ్జభవా! స
త్వర మీక యుండుసదిలే, దరయుము సర్వంబు నిత్తు ♦ నభవుని కరుణన్. 363

గీ॥ అనిన నేనట్లె శివుఁడు స♦న్నుప్పగించె, నీకటు మహాత్మ! మ్రొక్కెద♦ వీఁక మఱియు
నీవిరాడ్రూపమగునండ♦ మీవుగనుము, జడమగుచుజ్ఞానశూన్యమై♦ యడరెనిట్లు.

క॥ దీనన్ జైతన్యంబు న, నూనకృపన్ సంతరింపు ♦ ముజ్జ్వలతేజా!
దానన్ సంతసమొందెద, నీ నిరుపమ విభవమునకు ♦ నేస్తంబునకున్. 365

క॥ అని సన్నుతింప విష్ణుం, డనంతరూపంబుఁ జెంది ♦ యండమునొందెన్
ఘనతరసహస్రశీర్షము, లును సాహస్రాక్షిపదము♦లును జెలువొందన్. 366

శా॥ అంతన్ జేతనయుక్తమై తనరి యా ♦ యండంబు పరిస్ఫీతమై
యొంతేనిర్వదినాల్గు పర్వములతో ♦ నింపొందె వైకుంఠమున్
వింతౌ పట్టణ మెల్లలోకములపై ♦ విష్ణుండు నిర్మించి య
త్యంతామోదముతోడ నుండె నట లే ♦ చావీటి కేపాటునున్. 367

ఉ॥ నేనును సత్యమక్షబడము ♦ నెక్కొని యక్కఱకంతునానతిక్ష
బూని జగంబులన్ సలుపఁ ♦ బూన్కిని జెందుదుఁ బాపసృష్టినా
నేను తమోమయంబులయి ♦ యేర్పడె సంతనె స్థావరాఖ్యలక్ష
బూనినవానిసల్పి యవి ♦ బోధములేనివటంచు నెంతయున్. 368

మ॥ హరునిన్ ధ్యానముసేయుచుండఁగనె తి♦ర్యక్స్రోతమాసర్గమొం
డిరవొప్పన్ బశుపక్షిముఖ్యగణమై ♦ యేపొందె నద్దాన సం
బరమొక్కింతయుఁ గానకున్నతఱి నూ♦ర్ధ్వస్రోతమా సృష్టి వి
స్తరిలెన్ సాత్త్వికమొప్పిరయ్యెడ సురల్ ♦ ధన్యుల్ సుఖాపాదకుల్. 369

మ॥ అదియున్ జూచి యసాధకంబె యని నే ♦ నాత్మన్ విచారింప న
ప్పదనం దే మఱియొండు సర్గమది య♦ర్వాక్స్రోతమా రాజసా
స్పదమై యొప్పెను మానిసుల్ ఘోడమి రా♦పై భూతసర్గం బొకొం
డొదవెన్ సర్గము లిట్లు లైదమరె శా♦ర్వోదారసంపత్తిచే. 370

మ॥ మొదటన్ బుట్టె మహాత్తు దాన నదియొ♦ప్పన్ సృష్టులందాద్య మా
పిదపన్ సూక్ష్మము లైదుగా బరగి మేల్ ♦ పేరొందు తన్మాత్రలన్
విదితంబయ్యె ద్వితీయసృష్టి యిక నా ♦ విఖ్యాతవైకారికం
బ్బ దగన్ మూడవసృష్టి ప్రాకృతములై ♦ పొల్పొందు నీసర్గముల్. 371

గీ॥ అంతమీదట మనమందు♦ననఘులైన, సనకముఖ్యమునులనాత్మ♦ సదృశమూర్తు
లైదుగురను సృజించి నే♦నాచరించు, సృష్టిమెడజేర్ప నవ్వార♦ లిష్టపడక. 372

క॥ పరమశివధ్యానంబున, మరగిన చిత్తములతోఁ గు♦మారులు నన్నున్
గురిగొనకవీడి యొందేఁ, జరుగెత్తిరి జ్ఞానదీప్తి ♦ భాసితులగుచున్. 373

వ॥ వీరిసృష్టి తొమ్మిదవదియగు నిక నిట్లే నీసృష్టి నవకంబందును.

ఉ॥ పీ.రి యవాంతరంబులగు ♦ భేదములెన్నిరయొ పెక్కులున్నవ
వ్యాసరి లెక్కసేయఁగల ♦ వాఁడెవఁడిందు మునీంద్ర! యప్పు నే
సూనుల యప్పరాఙ్ముఖతఁ ♦ జూచి కడున్ గడుఁ గ్రోధమూర్తినై
దీనతఁజెంది యేడ్వఁగను ♦ దెవ్వనరాలిన వశ్రుబిందువుల్. 374

క॥ జలజల కన్నీటిబొట్టుల, నొలుకంగాఁ బుడమినుండి ♦ యుగ్రవిషములౌ
చిలువలు వెలసిన వెంతయుఁ, బలురకములతోడఁ బాడమి ♦ బ్రహ్మాణ్యవరా!

## —* శ్రీ రుద్రోత్పత్తి *—

ఉ॥ వానినిఁజూచి రోసి క ష్టు ♦ వందురుచున్ హరిబోధతో శివున్
ధ్యానముసేయుచుండ. న ఘ్ను ♦ నాకరుఁడై శివుఁ డాత్మ నాసపై
మా నెనఁగన్ బొమల్ ; డుమ ♦ మాన్యపదంబవిముక్తమందు నెం
తేనియుఁ దేఁకువంబొలిచె ♦ దిక్కులు దేజరిలంగఁ జక్కఁగన్, 376

మ॥ కని నే నాశివు నీలలోహితు జగ ♦ త్కల్యాణసంధాయకున్
ఘనతేజఃపటలీవిభాసితదిశా ♦ కాండున్ శివావల్లభున్
మనమందక్కజమొంది మ్రొక్కి — పరమా ♦ మ్నాయంబులన్ బాడి సృ
ష్టినిఁ గూర్పన్ బతిమాల శర్వుఁ డు సృజిం ♦ చెన్ రుద్రసంఘంబులన్.

ఉ॥ వారలఁ గాంచి నే భువన ♦ వంద్య! జనుర్మరణామయార్తులన్
గూరనివీరి సల్పితివి ♦ కూడునె యి ట్లు మహాత్మ! యింకఁబై
నారసి జన్మదుఃఖముల ♦ నందెడు వా రి సృజింపుమన్నన
ధ్ధీరుఁడు నానుడుల్విని వి ♦ ధీ! యటు లేను సృజింప విన్మొకన్. 378

గీ॥ జన్మదుఃఖనిమగ్నులౌ ♦ జనులనెల్ల, న్ను న్నరించెద గురుఁడనై ♦ సిద్ధినొసఁగి
నీవె సృజియింపు దుఃఖంబు ♦ నెక్కునెడ పి, జలను నే నొల్లనీసృష్టి♦జలజగర్భ!

క॥ నాయానతిచే నిన్నీ, మాయ తఱుచు చుట్టఁబోదు ◆ మంచిగసృష్టిన్
జేయుచునుండుము నేనిఁక, బోయెద నాయిచ్చననుచుఁ ◆ బొందుగనంతన్.

క॥ అంతర్ధిఁజెంది వేగిర, మింతో వైకుంఠనగరి ◆ కెక్కుడుపైనన్
వింతగఁబొలిచెడు ప్రోలు న, నంతశ్రీలెసఁగసల్పి ◆ యందువసించెన్. 381

ఉ॥ నేనును బంచభూతముల ◆ నేర్పుమెయిన్ సృజియించి యంత నా
నానగసింధుపల్వలవ ◆ నప్రముఖంబులన్ గలాఘటీ
దైనవిశాయ మొప్పయుగ ◆ తండములన్ రచియించి యంతతో
నేనియుఁ దన్విఁజెందక మ ◆ హేశ్వరు ధ్యానముచేసి వాసిగన్. 382

—* దేవాది సృష్టి *—

సీ॥ కనులందు నమ్మరీ ◆ చిని హృదయమున భృ, గుని శ్రుతులందు న ◆ త్రిని శిరసున
నంగిరసునిఁ దొడ ◆ లందునిన్ జాయయుం, దాకర్దమునిఁబ్రాణ ◆ మందు దక్షు
వ్యానంబునన్ బుల ◆ హముని నపానంబు, నన్ గ్రతువును సమా ◆ నమున నవ్వ
శిష్ఠు సంకల్పము ◆ చేత ధర్ముని నుదానమునఁ బులస్త్యు మ ◆ నమున రుచిని

గీ॥ సృష్టిసాధకులనుగ సృ ◆ జించి వృద్ధిఁ, గోరి శంకరుఁ దలఁప న ◆ గ్గురుకృపాబ్ధి
యర్ధనారీశరూపంబు ◆ నర్థిఁజూపె, నేనునట్టులేయగురూప ◆ మెలమినొంది. 383

క॥ సగముతనువు యోషగఁ బెఱ, సగముతనువు బురుషుఁడుగను ◆ సారొప్పవిధం
బుగ సంతరించికొని చ, క్కఁగ మరల సృజించినాఁడ ◆ గౌశల్యమునన్.

గీ॥ ఘనుఁడు స్వాయంభువుం డను ◆ మనువునున్ ద
పస్వినియు యోగినియునైన ◆ పద్మగంధి
యనఘ శతరూపయనునొక్క ◆ యన్నుమిన్న
జననమొందిరి డెందము ◆ త్సవముఁ జెంద. 385

క॥ వారలు పరస్పరము దమి, గూర వివాహంబు నొంది ◆ కూడి నిజములో
ద్ధారుల నిర్వురకొమరులఁ, జారుతనుల సుతలఁ గనిరి ◆ జక్కఁగముగురన్. 386

గీ॥ అగ్రియుండు ప్రియవ్రతుం ◆ డన యపీయుఁ
డల్ల యుత్తానపదుఁడన ◆ నమరి రిఁకను
నొప్పి రాకూతియన దేవ ◆ హూతియనఁ బ్ర
సూతియన నాహ్వయము లొంది ◆ సుతలు తపసి. 387

గీ॥ రుచికి నాకూతిఁ గర్దమో ◆ రుయశునకును, దేవహూతిని నర్పించి ◆ ధీరుఁడల్ల
దక్షునకునా ప్రసూతిని ◆ ధారవోసె, ఘనుఁడుస్వాయంభువుఁడనునా ◆ మనువుప్రీతి,

శా॥ ఆకూత్యంగనయందు నారుచికి య ♦ జ్ఞాఖ్యుండునుఁ దక్షిణా
ఖ్యాకస్త్రీయును బుట్టిరాపురుష స్వా ♦ యంభూతుఁడౌ తాత పు
త్రాకారంబుగ నొందె దక్షిణవివా ♦ హంబాడె నవ్వాని సు
శ్రీకుల్ పన్నిరువుర్సుతుల్ వొడమి ర ♦ ర్చిష్మంతు లవ్వారికిన్. 389

క॥ ఇఁక దేవహూతి కర్దము, లకుఁబొడమిరి పుత్రులు కపి ♦ లముఖులును బ్రసూ
తికి దక్షునకుదయించిరి, సుకన్య లిరువదినలువురు ♦ సుందరమూర్తుల్. 390

వ. అందు.

సీ॥ ధర్ముఁడుగొనెఁ ద్రియో ♦ దశకన్యకల వారి, పేరులనెఱిఁగింతు ♦ బేర్మివినుము
శ్రద్ధ లక్ష్మియు ధృతి♦ శాంతి తుష్టియుఁ బుష్టి, కీర్తి సిద్ధియు బుద్ధి♦ క్రియయు మేధ
లజ్జ వసువునా వె♦ లయువార లవ్వారి, చెలియండ్రు పదియొక్క ♦ రలఘుమతులు
ఖ్యాతియుసతియుసం♦భూతియుస్మృతియుఁబ్రీ,తియునుక్షమయుసన్న♦తియనురూప
గీ॥ ఊర్జస్వాహాస్వధలుఖ్యాతి♦ నొందెభృగుఁడు, సతినిబెండ్లాడెనాబాల♦ చంద్రధరుఁడు
చేకొనె మరీచిసంభూతి ♦స్మృతిని నంగి, రసుఁడు ప్రీతిఁబులస్త్యుండు♦ రహిఁబడసిరి.

క॥ క్రతువు పులహుండు నత్రి మ, హితతేజుండౌ వసిష్ఠ ♦ ఋషి యగ్నియునుఁ
బితలును దక్కిన యూర్వర, గుతుకమునఁ బెండ్లియాడి ♦ కొనిరి వరుసగన్.

క॥ మఱియును వీరలవలనన్, విరివిగ భువనత్రయంబు ♦ విస్తరిలెఁ జరా
చరమటు గర్మవశంబై, హరునానతి లెక్కలేని ♦ యట్లు గుమారా! 393

వ. ఇఁకను గల్పభేదంబు చొప్పున నొక్కపుడు దక్షున కఱువదిమంది కూఁతులు జనింప వారలలోఁ బదిమందిని ధర్మునకును, నిరువదియేడ్వురను జందురునకును, బదమూఁగురఁ గశ్యపునకును, నల్గురను వైనతేయునకు భృగ్వంగిరః కృశాశ్వులకు నిద్దఱ నిద్దఱనొసంగి వివాహంబొనరించె నవ్వారిచేఁ జరాచరసృష్టి యభివృద్ధిఁజెంది పొదలె నిలింపులు మును లసురులు మానిసులు వృక్షంబులుం బక్షులుఁ బన్నగంబులు మృగంబులు మున్నగువానితోఁ బాతాళంబు మొదలుకొని బ్రహ్మలోకంబువఱకు శూన్యప్రదేశంబనునదిలేక నిండారియుండె.

క॥ పరమేశ్వరి సతియనుపే, రిరవొప్పన్ దక్షసుతగ ♦ నేర్పడి శర్వున్
బరిణయమాడెను భక్తో, ద్ధరణమునకుఁ బొడమఁజేసెఁ ♦ దాశివుఁడాపెన్.

మ॥ సతియున్ శంకరుఁ జెట్టఁబట్టియు జడ ♦ స్వాంతుండు దక్షుండు దు
ర్మతియై యీశ్వరుతోఁ బగన్ గొని యధ ♦ ర్మంబౌ పథంబొందఁ ద
త్క్రతువందే తన మేనుగాల్చికొని యా ♦ త్మస్థానమొందెన్ మరు
ద్వితతుల్ గ్రమ్మరవేడ నద్రిసుతయై ♦ విశ్వేశు నొందెన్ విభున్. 396

వ. మఱియు నప్పరమేశ్వరి కసంఖ్యాతనామధేయంబులు భక్తజనభోగమోక్షకరంబులు గలవైన నందు.

గీ॥ కాళి చండిక శ్రీభద్ర♦కాళి భద్ర, జయ మృడాని భగవతి వి♦జయ జయంతి
కామచాముండసర్వమం♦గళపరాంబ, దుర్గకామద యని పిలు♦తురు విబుధులు.

గీ॥ పరమశివునాజ్ఞచే సృష్టి♦విరచనంబు
చేసితినినిట్టు లేనును♦శ్రీపతియును
రుద్రుఁడును గుణమయులము♦రుక్మమూర్తి
శివుఁడొకం డగుణుఁడు గుణ♦శ్రీఁబరఁగిన. 398

క॥ శివలోకమున రమణియగు, శివతో రమియించుచుండు♦శివుఁ డెల్లపుడున్
సువిదితుఁడతఁడె స్వతంత్రుఁడ, భవుఁడును బరమాత్ముఁడరయ♦ప్రౌఢమతిసుతా!

గీ॥ శివుని పూర్ణావతారమా♦శశిరకిరణ, ధరుఁడు రుద్రుఁడు శివుఁడనఁ♦బరఁగు నిలను
అతని వాసంబు కైలాస♦మద్రియాయె, జాండమెల్లను బాలిసిన♦నవియదెపుడు.

వ. శివుండా కైలాస పర్వతంబున, రాజరాజగు కుబేరుని పూజలనొందుచు నాతనియందు బద్ధసఖ్యుండై యుండె ననుడు నారదుండు నాళీకసంభవున కిట్లనియె.

గీ॥ ఎపుడు కైలాసమున కేగె♦నిందుధరుఁడు
ఎందుఁ బొసఁగెఁ గుబేరున♦కీశమైత్రి
ఏమియొనరించె శివుఁడందు♦నెఱుఁగఁ జెపుమ!
వినఁగఁ గూరిమి పొడమె సం♦విన్మయాత్మ! 401

వ. అని యడిగిన విధాత యిట్లనియె.

## —* కుబేరుని పూర్వజన్మ చరిత్రము *—

క॥ కాంపిల్యం బనఁబడు నొక, సంపన్నిలయమగు నగరి♦శాఖాభూమిన్
సొంపుగ వసించె భూమిని, లింపుఁడొకఁడు విద్యలన్ బ♦లీయుఁడు మిగులన్.

గీ॥ సోమపీథ్యన్వయసుధాబ్ధి♦సోమమూర్తి, యజ్ఞదీక్షితుఁ డుత్తమ♦ఖ్యాతకీర్తి
యజ్ఞదత్తాహ్వయుం డఖి♦లాంగవేద,వేది వేదాంతవక్త తా♦విభునిహితుఁడు.

క॥ ఆతని తనయుఁడు గుణనిధి, చేతోభవరుచిరమూర్తి♦చిన్నతనమునన్
బ్రీతిఁ బెరుఁగుచుండెను సం,గాతులతో నాడుకొనుచుఁ♦గలయఁదిరుగుచున్.

క॥ గర్భాష్టకమైనంతనె, నిర్భరయశుఁ డల్ల యష్ట ని♦ష్ఠామతి నా
త్మార్భకున కుపనయన మా,విర్భూతప్రీతిసల్పె♦విత్తములలరన్. 405

చ॥ కరమనురక్తిఁ దల్లి నవ♦కంబగు తీయనిరొట్టె లన్నమున్
బెరుఁగును నేయికూరలును ♦ వెన్నయు మీఁగడ పప్పు లప్పముల్
బిరబిరఁబెట్టి దుస్తులను ♦ బేర్మి నొసంగుచునుండు నిత్యమున్
జిఱుతయు ధూర్తబాలురను ♦ జేరి చరించుచునుండు నెల్లెడన్. 406

చ॥ మఱియును గొన్నినాళ్ళకు ♦ మారకుఁడాతఁడు ప్రత్యహంబుఁ జూ
దరులగువారిఁ గూడికొని ♦ తద్దయు బంగరవుంగరంబులన్
మురుగులు మున్నుగాఁగల వి ♦ భూషణముల్ వ్యయపెట్టుచుండె సం
కరకులజన్ములౌ చెలిమి ♦ కాండ్రనుగూడి మెలంగుచున్ బోరిన్. 407

క॥ వైదికగోష్ఠుల నొల్లం, డాదరమును గనఁడు దేవ ♦ తాలయముల సం
పాదించు మేటినేస్తం, బాదటఁ బాషండనటశ ♦ తావళితోడన్. 408

ఉ॥ స్నానముమానె సంధ్యలకుఁ ♦ జక్కఁగనీళ్ళొసఁగన్ మొగంబునన్
గానకపోయె బూది మడిఁ ♦ గట్టఁగరోసెను వేదపాఠమున్
మానె గురున్ సతీర్థులను ♦ మానసమందున విస్మరించె నం
తేనియు గీతవాద్యముల ♦ నెప్డుఁదవుల్కొని యుండె నింపుమై. 409

క॥ చూపులగుజ్జమునలె నతఁ, డేపుమెయిన్ బెరుఁగుచుండ ♦ నీతని తండ్రిన్
శ్రీపతినిభుఁడని యెఱిఁగి మ, హాపరితోషమున మేటి ♦ యగ్రజుఁడొకఁడున్.

క॥ తనయన్ సురూపలేఖా, వినయన్ శ్రీయజ్ఞదత్త♦విబుధుననుమతిన్
గొని తత్తనయున కొసఁగెను, ఘనమగు హరణములనిచ్చి ♦ గౌరవమెసఁగన్.

చ॥ తనయుని చెడ్డచెయ్వులను ♦ దండ్రియెఱుంగఁడు రాచగీముకున్
జని యట ధర్మశాస్త్రములు ♦ సచ్చరితంబులుఁ జెప్పు నెప్డు నం
దను చదువున్ గుఱించి వడ♦తన్ గడుఁగూర్చియు సోమిదమ్మతో
దినదిన మద్దుచుండును బ♦దిన్బదిగా నతఁ డార్తచిత్తుఁడై.

చ॥ కనపడఁడేమి పుత్రకుఁడు ♦ కన్నుల కెప్డడటన్న నాపె చె
ప్పును బలుమాఱు లా నిగమ♦పుంజములన్ మఱి శబ్దశాస్త్రసూ
త్రనిచయమున్ గడున్ జదివి ♦ తత్సహపాఠులతోడ నిప్డెడే
యనఘచరిత్ర! దేశికుని ♦ యాలయమేగఁగఁబోయె నంచనున్. 413

ఉ॥ స్నానముచేసెనే? విధిగ ♦ సంధ్యనువార్చెనే? భస్మపుండ్రముల్
మానకదాల్చెనే? సుతుఁడు ♦ మద్దునుగట్టి భుజించెనే? శివ
ధ్యానము చేసెనే? గురుని ♦ యంతికమొంది త్రయిన్ జఠించెనే?
మానిని! యన్నఁ దత్సతి స♦మస్తముఁ నక్లైయొనర్చెఁ గొడ్కనున్. 414

సీ॥ గంగాస్రవంతినిఁ ♦ గాని స్నానంబు సేయం దెన్నఁడేని కో♦ర్కుంచుఁ జెప్పఁ
గాలంబు దప్ప కే♦కాని సంధ్యోపాస్తి, నొనరింపఁ డాత్మజుం♦డని వచించు
నొక్కనాఁడును నాగ ♦ మొనరింప కే గురు,నొద్దఁ జదువుఁదన♦యుఁడనిపల్కు
కడు జ్వరంపడినఁ దానుడుగక పూజించు, శివలింగమును మన ♦ చిఱుతయనును

గీ॥ నేర్పుమెయి నిట్టులయ్యాజి ♦ నెలఁత విభుని
తోడఁబలుకుచుఁ గొమరుని ♦ దుడుకుసేఁత
లన్నియును గప్పిపుచ్చుచు ♦ నాత్మఁ గుందు
చుండు నెంతయుఁ గొమరుపై ♦ నున్న కరుణ. 415

క॥ సతి పల్కినపల్కులు సూ, నృతములుగానమ్మి కోవి ♦ దేంద్రుఁడు ప్రీతిన్
సతమలరుచుండె గృహకృ, త్యతతిన్ దీక్షయొకింత ♦ యలవడకుంటన్. 416

వ. అంతఁ దల్లియు.

గీ॥ ప్రత్యహంబును గొమరు సా ♦ పడఁగఁ జేయు
చున్న సమయంబునందు నా ♦ యన్న! నీదు
తండ్రి కడుకోపనుఁడు నీవు ♦ తగ వెఱింగి
మానుమీ చెడ్డపనులిఁక ♦ నేని యిపుడు. 417

క॥ ఇంతదనుక దాఁచితి నే, నంతయెఱిఁగెనేనిఁ దండ్రి ♦ చూఁడు! నిను ననున్
గొంతుకఁగోయును దలఁకఁడు, పంతముతో నెవ్వరడ్డ ♦ పడినఁ గుమారా!

గీ॥ బ్రాహ్మణులకెప్డు సద్విద్య♦పరమసాధు, వర్తనము సజ్జనులచెల్మి ♦ వాసిఁగూర్చు
ధనమునిచ్చును ♦ కీర్తినిఁదనరఁజేయు, నేటికో నీకు రుచియింప ♦ దీహితోక్తి.

సీ॥ వినవొకో "కిముధనై ♦ ర్విద్యానవద్యాయ, ది" యటంచుఁజెప్పును ♦ ధీజనోక్తి
అరయవా? నీవు "వి ♦ ద్యావిహీనః పశు"వని పల్కినట్టియా ♦ ర్యజనసూక్తి
తెలియవైతివొకో! మ♦దిన్ బూని, "వాగ్భూషణంభూషణ"మను గు ♦ ణజ్ఞులనుడి
ఎఱుఁగవైతొ యెపు ♦ డేని "విద్యాఖ్యమం, తర్ధనం" బనునట్టి ♦ తద్జ్ఞవచన

గీ॥ మరసి దుర్జనసంసర్గ ♦ మకట! పాసి, సాధుజనసహవాసంబు ♦ సలుపుమన్న!
వేదవిద్యల నెపుడు సే ♦ వింపుమన్న, బ్రాహ్మణాచారమును నెడఁ ♦ బాయకన్న!

క॥ వినుము సుతా! సచ్ఛ్రోత్రియు, లనఘులు దీక్షితులు సోమ ♦ యాజులు నీవం
శనిదానులైన పూర్వులు, కనవలదే వారిదైన ♦ గౌరవము మదిన్. 421

గీ॥ అందఱి నటుంచి కనుము నీ ♦ యాత్మజనకుఁ
డెట్టిఁడో? ప్రతిదినము న ♦ న్నంతయేని
నిన్నుఁగూర్చి యడుగుచుండు ♦ నిర్మలాత్ముఁ
డాయనఘునెన్ని భావింపు ♦ మాత్మయందు. 422

ఉ॥ ఆతఁడు ఖ్యాతతేజుఁడు మ ♦ హోమహులందు మహోమహుండు స
త్పూతచరిత్రుఁ డాఢ్యుఁడు వి ♦ భూషితవైధసవంశుఁ డున్న తుం
డై తగునట్టిఁడన్నిటను ♦ నట్టి గరిష్ఠున కాత్మజుండవై
నీతిఁదొఱంగి యివ్విధము ♦ నీవు చరింపఁగ మేలొకో? సుతా! 428

ఉ॥ ఎప్పుడొ గుట్టు బైటఁపడు ♦ నెన్నిదినంబులు దాఁగియుండు మా
యప్పరొ! నీదు తిప్పలిఁక ♦ నావలఁజూతము తల్లియొందుపా
ట్లప్పుడుసూడు కుక్కలకు ♦ నైనను నక్కలకైననుండవా
ముప్పుఁదలంచి భీతిలెద ♦ ముందరనున్నది పండు వాత్మజా! 424

క॥ అరసి సుతా! "పుత్రశ్శ, త్రురపండిత" యనెడు పరబు ♦ ధులవాక్యములన్
గుఱిగొనుమా! నెఱిఁగనుమా, యురియాడెడు నాదుమదికి ♦ నూఱటనిడుమా!

క॥ పదునెనిమిదేండ్లుదాఁటెన్, గద? నీకీ పడుచు గడు న ♦ కల్మష యిదియుం
బదియాఱేండ్లది లే దే, కొడవ యిఁకన్ దండ్రి భక్తిఁ ♦ గొలువుము తండ్రీ!

వ. ఇంకను నీకు.

గీ॥ మామ సద్గుణశీలర ♦ మామనోజ్ఞుఁ, డత్త సౌజన్యనిధి వారి ♦ యాత్మజులును
నమలవిద్యాధురీణులై ♦ యాఱితేఱి, రతులులిఁక నీదుమాటలు ♦ లన్నియెడల. 427

గీ॥ నేనునుం బతిపదపద్మ ♦ నిరతమతిని, శంకరుఁడుసాక్షి యిట బుతు ♦ స్నానమాడి
చూడలే దెటువంటిదు♦ష్టుని మొగంబు,పాడమితి వదెట్టు లిభ్భంగిఁ♦గొడుక!దుడుక!

చ॥ అనుదినమిట్లు పుత్రికున ♦ కాయమ బుద్ధులు చెప్పుచుండినన్
విని మదిఁ జేర్పకాతఁడు వి ♦ వేకవిహీనతఁ జేసి తొంటితె
ర్వునఁజనుచుండె వేఁటయును ♦ రోచెలి జూదము చౌర్య మాసవం
బును బిశునత్వమున్ బదరి ♦ బొంకుట సేకుటఁ దొల్ల వెన్నఁడున్. 429

చ॥ ఎదియెది మధ్యగేహమున ♦ నీక్షణగోచర మానొవేగఁ దా
నదియది సంగ్రహించుకొని ♦ యర్పణసేయును జూదగాండ్రకిం
పొదవ నొకప్డు కుందనపు ♦ టుంగరమొక్కటి తండ్రిచేతి వ్రే
లిది యెటొ దొంగిలించికొని ♦ యిచ్చె దురోదరమూఁకకొడ్డుగాన్. 430

వ. అంతనొక్కనాఁటి మధ్యందిన సమయంబునందు దైవవశంబునఁ జేసి దీక్షితుండు రాజవీధియందు.

ఉ॥ జూదరి వ్రేలినున్నతన ♦ సొంపగుకెంపులపైఁడియుంగ్రమున్
మీఁదుగ జూచిచూచి తన ♦ మేలిమి యుంగరమౌటెఱింగి కో
పోదయమూర్తియై కితవ! ♦ యుంగరమిద్దియెటుల్ లభించె బొం
కేదియులేక తెల్పు మల ♦ యించెదఁ భూపతియొద్దఁ గానిచోన్. 431

మ॥ అన నవ్వాఁడను దీక్షితుంగని మహా ♦ త్మా! జూదమంబాడి నీ
తనయుం డీయది నాకొసంగె నిది త ♦ థ్యం బీయ దేశాదికన్
వినుఁ డాతండు సువర్ణభూషణములన్ ♦ విత్తంబులన్ దెచ్చి మా
కనయం బిచ్చుచునుండు నెత్తములకై ♦ యాటోపమున్ జూపుచున్. 432

ఆ॥ రౌప్య కాంస్య తామ్ర ♦ రచితభాజనముల, నారకూటకృత ఘ ♦ టాళి మేలి
సేలువులను మంచి ♦ చీనాంబరంబులన్, దెచ్చి యమ్ముచుండు ♦ నెత్తములకు,

క॥ నాకొక్కని కేకాఁ డా, పోకిరి యోటువడి సభిక ♦ ముఖ్యులచేతన్
జీకొట్లు కట్లువడి తన, కోకలనున్ బ్రతిదినంబుఁ ♦ గోల్పడుచుండున్. 434

క॥ అనునంత యాజి విభ్రాంతినిఁగొని లజ్జయునుఁ గినుక ♦ దీఱని వగయున్
బెనఁగొని మనమునలంపఁగఁ, దనయిలు చేరంగఁబోయి ♦ తాపముగదురన్.

గీ॥ దీక్షితాయని! యిటురావె ♦ తేఁగదే! మ,దీయమా నుంగరము రత్న ♦ దీపితమును
బర్వమందిచ్చె నిద్దానిఁ ♦ బ్రభుఁడు నాకు, నీవు చేకొంటి వద్దాని ♦ నేర్పుఁజూపి. 436

చ॥ అన విని యాపె వేగమె మ ♦ హాత్మ! మడిన్ ధరియింపుఁ డన్న కాం
తునుగొని పెక్కురర్థులదె ♦ సావిడినిండి పరుండియున్న వా
రనఘులు మేదినీవిబుధు ♦ లంగుళిభూషణ మేను బెట్టిలో
ననువగు దంతపుం బరణి ♦ యందుఁ దిరంబుగనుంచి దాఁచితిన్. 437

క॥ సాపడినంతనె వేగమె, యాపేటికఁ దెఱచి యిత్తు ♦ నధిప! యనుడు నా
నే! పరమసత్యభాషిణి, యో పాతివ్రత్యకుశల! ♦ యోసిపురంధ్రీ! 438

ఉ॥ ఎక్కడఁబోయె నీతనయుఁ ♦ డెక్కడఁబోయినఁ బోవుఁగాక నా
కక్కలుషాత్మతోడ నిఁక ♦ నక్కఱ యొక్కఁడు లేదు సేలువుల్
రొక్కములున్ నగలు రజత ♦ రుక్మమయంబులు భాజనంబు లీ
వెక్కడ దాఁచితో యిటకు ♦ నిప్పుడు దెమ్మిఁక రమ్ము చూచెదన్. 439

చ॥ కొడుకును భ్రష్టుఁజేసితివి ♦ కూయుచునుంటివి దబ్బఱల్ గడున్
గడుఁ బరిపూతమౌ యశము ♦ గంగనుగల్పితి వర్థమంతయున్
దుడిచి గృహంబు శుద్ధముగ ♦ దుర్మతి! జేసితి వింకమీఁదటన్
గుడుపుము నీదు కర్మమని ♦ కోపము తాపముమీఱ యజ్వయున్. 440

గీ॥ స్నానమొనరించి చక్కఁగ ♦ సంధ్యవార్చి
యగ్నిహోత్రాది కృత్యంబు ♦ లాచరించి
యతిథు లందఱితోఁగూడ ♦ నారగించి
యలుక దీరఁగ నొకనాఁటి ♦ యహమునందు, 441

క॥ ఒకశ్రోత్రియుఁడౌ ద్విజుక, న్యకనున్ బెండ్లాడి యంత ♦ నక్కన్నియతో
సుకముగ గృహస్థధర్మో, త్సుకుఁడై చెలువొందుచుండెఁ ♦ జూపఱు మెచ్చన్.

వ. అంత గుణనిధియును.

మ॥ తనవృత్తం బఖిలంబు తండ్రివినుటన్ ♦ దానప్డు యోజించి గే
మును జేరన్ జనమాని దవ్వేసఁగు భూ ♦ ముల్ చేరఁగాఁబోయి యం
దును నన్నంబును గానకాఁకటఁ గడున్ ♦ దుఃఖింపుచున్ సొక్కుచున్
దనతల్లిన్ స్మరియింపుచున్ బొగలుచున్ ♦ దాపాతిరేకంబునన్. 443

ఉ॥ ఎచ్చటికేగువాఁడ నిఁక ♦ నేమియొనర్పుదు సుంతవిద్యయేన్
మచ్చికనేర్వనైతిని స ♦ మస్తమునర్థము ధారవోసితిన్
హెచ్చుగ ద్యూతశాల కిపు ♦ డేమి శరణ్యము! వంశమందు నే
మచ్చగఁదోఁచితిన్ దెరవు ♦ మాలితి నిప్పటిమాట యెట్టులో! 444

చ॥ చదువదియున్న నెవ్వఁడును ♦ జౌర్యముసేయఁగలేఁడు దాని భూ
మిదయితుఁ డొందలేఁడిఁక స ♦ మీరసఖుండును గాల్పలేఁడు నే
మదమున నట్టివిద్యకు న ♦ మస్కృతిఁ జేసితిఁ జిన్ననాఁట ని
య్యదనున దిక్కెవండిచట ♦ నాఁకటమాడుచు నుంటినక్కటా! 445

గీ॥ తల్లియున్న దెయిందు ని♦ త్యం బుమన్ను, లందు నేయియుఁ బెరుగును♦నన్నమును బ్రి
యంబు మీఱఁగ నిడియెడు ♦ నట్టితల్లి, తొల్లి చెప్పిన నీతుల ♦ నొల్లనైతి. 446

క॥ అనివనరుచు దీనతనొక, యనోకహపు ఛాయనుండి ♦ యరయుచునుండన్
ఘనుఁడగు మాహేశ్వరుఁడొక, డనఘుఁడు పక్వాన్నపాణి ♦ యై వేగమునన్.

గీ॥ తనదువారెల్ల వెనుకొని ♦ తరలిరా శి
వాలయంబున కరిగి యం ♦ దభవలింగ
మర్చనముసేయుచుండె భ ♦ క్త్యతిశయమున
నాఁడు శివరాత్రి యగుట న ♦ నశనుఁడగుచు. 448

క॥ ఆపక్వాన్నసుగంధము, లేపుమెయిన్ నాల్గుదెసల ♦ నెంతయుఁ బ్రాఁకన్
బాఁపండారసి దఱిసి వ, సాపడఁగా నెంచె నాప్రి ♦ సాదమును దమిన్. 449

గీ॥ శివునిఁబూజించి వీరు ని ♦ శీథమందుఁ, గునుకుదురు శివనైవేద్య ♦ మనువుమీఱ
నపుడు గొనిపోయి యద్దాని ♦ ననల నారఁ, గింతునని యెంతయేనియు ♦ సంతసించి.

క॥ శివపూజకులను గనుచును, శివునికిఁ గట్టెదురుగా న ♦ సించి వెలపలన్
శివపూజఁ జూచుచుండెను, శివమంత్రంబులను వినుచుఁ ♦ జింతాచ్యుతుఁడై.

గీ॥ సముచితార్చన మిబ్బంగి ♦ సలిపి యాట, పాటలను నాగమ స్వస్తి ♦ పాఠములను
జక్కనొనరించి రాతిరి ♦ సగముదాఁట, క్షణము కనుమూసిరనికిరి ♦ జనములెల్ల.

మత్తకోకిల. అంత బ్రాహ్మణుఁ డెంతయేనియు ♦ నార్తుఁడై శివమందిరా
భ్యంతరంబును జేరి దీవియ ♦ యారుచుండుటఁ గాంచి చే
లాంతమించుక చించి వర్తి ర ♦ యంబొనర్చి వెలుంగఁగా
సంతరించి ప్రసాదభాండముఁ ♦ జక్కఁ జేకొని పొంగుచున్. 453

గీ॥ సౌరభములాని యావలఁ ♦ జని యథేచ్ఛ, నారగించుదునని బోవ ♦ డాసనొంది
దాఁటుచుండఁగఁ గాలివే ♦ ల్దాఁకె నొకని, కాతఁడంతనె తెలివొంది ♦ యదరుఁ గదిరి.

కం॥ ముచ్చుడె! ముచ్చుడె! యనుచును, హెచ్చుగ నతఁ డఱచుచుండ ♦ నెల్లరు గనులన్
విచ్చి తెలివొందిరంతనె, వచ్చి నగరరక్షకప్ర ♦ వరులు గడువడిన్. 455

గీ॥ పాణిఁ బక్వాన్నపాత్రంబుఁ ♦ బట్టువిడక, ప్రాణభీతినిఁ బరువెత్తు ♦ నగరికులునిఁ
గదిసి బాణంబులేసి య ♦ క్కసునఁ జంపి, రకట! దినకుండె సుంతయే ♦ నన్నమతఁడు.

ఉ॥ కాలుని దూతలెంతయును ♦ గౌతుకమొప్పఁగ దన్నిషుతై
శూలము లుగ్రపాశములు ♦ సొంపు దలిర్పఁగఁ జేరి రంతనే
కాలహరానుజీవులును ♦ గ్రక్కున నెక్కొని వారి దవ్వులన్
దోలఁగ వారలక్కజము ♦ దోఁపఁగ నిల్లనియడ్డిరింపుమై. 457

మ॥ కులధర్మంబును బాసి వీఁడెపు డస ♦ ద్గోష్ఠిం బ్రవర్తించుచున్
దలినిన్ దండ్రినిఁ గ్రుళ్ళఁ జేసె మఱియున్ ♦ స్నానంబు సంధ్యావిధిన్
గలలోనైనఁ దలంపకుండె నెటులీ ♦ కష్టాత్మకున్ ముట్టె మీ
రలు శర్వుం దగఁ జేర్తు రిష్టె శివని ♦ ర్మాల్యంబిటన్ మ్రిచ్చిలెన్. 458

కం॥ శివనిర్మాల్యము దొంగిలి, యవినీతిభుజింప నెంచు ♦ నతఁడును మఱియున్
శివనిర్మాల్యము దాఁటెడు, నవివేకియు ముట్టఁదగని ♦ యఘులండ్రు బుధుల్.

గీ॥ చెప్పఁడెంతేని యింక వీఁడు ♦ చేసియున్న, నావగింజంత పుణ్యమే ♦ మైననున్న
వినియెదము సర్వధర్మైక ♦ విదురులీర, లున్నతాత్మకు లిందేమి ♦ యడుకుమాకు.

కం॥ అనినంతనె శివకింకరు, లనిర్దిష్టుల స్థూలమతుల ♦ కందునొకో శ
ర్వుని ధర్మసూక్ష్మములు తగ, వినిచెద మింక వాని నిందు ♦ వినుఁడీ మీరల్.

మ॥ శివగర్భాలయమందు దివ్వె మిగులన్ ♦ జిన్నాచుఁ గన్పట్ట న
ష్టవలోకించి పటంబుఁ జించి నడి న ♦ త్యాకారమున్ గూర్చి తా
దివియన్ వెల్గఁగఁ జేసెఁ జూచెను మహా ♦ దేవార్చఁ బస్తుండెఁ బ
ర్వవిశేషంబున నాలకించె శివమం ♦ త్రంబుల్ జడుండైనన్. 462

ఆ॥ కలదె యింతకన్న ♦ ఘనమైన పుణ్యంబు, కాలదూతలార! ♦ కదలుఁడింక
నిపుడె వీనిఁ జేర్తు ♦ మేణాంకధరు కొల్వు, సందియంబులేదు ♦ సత్వరమున.

గీ॥ కొంతకాలంబు శివుచెంత ♦ సంతసమున, నుండి కాళింగనృపతియై ♦ యుద్భవించు
నంతఁదిరుగ మహాభక్తి ♦ నంది శివునిఁ, గొలిచి శంకరునెయ్యంబుఁ ♦ గూర్మిఁ జెందు.

క॥ అని వారలు వేగమె వా, నిని శివలోకంబుఁ జేర్చి ♦ నీలగళుని చెం
తనునిచి రాతండందు శి, వను శివునిన్ గొలుచుచుండి ♦ పడసె సుఖంబుల్.

వ. యామ్యకింకరులును రయంబున సంయమినీపురంబుఁ జెంది సమవర్తిం జేరి యవ్విధం బంతయు నెఱింగించుటయు నతండును సర్వంబారసి యది యట్టులేయని యవ్వారల కిట్లనియె. 466

సీ॥ భసితత్రిపుండ్రముల్ ♦ ఫాలభాగములందుఁ, జెలువొందుచున్నట్టి ♦ చేవకాండ్రు
రుద్రాక్షపూసల ♦ నుతఁదాల్చి నిష్ఠమైఁ, బరఁగుచునున్నట్టి ♦ భవ్యమతులు
పంచాక్షరీ జప ♦ పరులై కరంబు సం, బరమొందుచున్న భా ♦ స్వచ్ఛరిత్రు
లభవమూర్తినిఁ బర ♦ మాహ్లాదమున నిచ్చ, లర్చించుచున్నపు ♦ ణ్యాగ్రగణ్యు
గీ॥ లెవ్వరేనియు నొక్కమా ♦ ఱేని జీవ, నార్థమై కాని మఱియొక ♦ యన్యమైన
హేతువునఁగాని మిషతోడ ♦ నేని శివునిఁగొలుచువారెల్ల బూజ్యులు ♦ దెలియుఁడీరు

## —* గుణనిధి కళింగరాజపుత్రుఁడై పుట్టుట *—

వ. అట్టివారినిఁ జూచి దవ్వులనుండియే జోతలుచేసి తొలంగిరావలయు నిందేమఱకుండుఁడని స్వగణంబుల కానతియొసంగెనిఁక శివసన్నిధినున్న యాజ్ఞదత్తియు శివాజ్ఞాప్రకారంబు గళింగాధిపతియగు నరిందముఁడను రాజవర్యునకుఁ దనయుండై జనియించి దముండను పేరంబరంగుచుఁ బూర్వపుణ్యవాసనావశంబున బాల్యంబునుండియే శివభక్తిఁ జెంది శివధర్మంబు లొనర్పుచుఁ గ్రమంబునఁ బట్టభద్రుండయ్యె నంతమీఁద. 469

క॥ గ్రామాధికారులను నా, భూమీశుఁడు పిల్వనంపి ♦ పురహరువిలస
ద్ధామంబులందు దివియల, నేమంబునఁ బెట్టఁ జేయ ♦ నియమించెనొగిన్.

వ. మఱియును.

మ॥ ఎవరేనిన్ బరమేశు కోవెలలయం ♦ దింపొప్ప దీపంపు టు
త్సవముల్ సల్పకయున్న వారి తలలన్ ♦ జండాసి ఖండింతు బం
ధువులేనిన్ మఱి నెయ్యురేనియును నిం ♦ దున్ జూడ నప్పాటి నా
దు విధానం బిదియంచుఁ జాటుఁడిఁక మ ♦ ద్భూభాగమందెల్లెడన్. 470

క॥ అని యేర్పఱచియుఁ దానును, ఘనముగ శివునెదుర దీప ♦ కాండంబుల లె
క్కొనరింపరానియట్టుల, నునుచుచుఁ గడుభక్తిఁ గొలుచు ♦ చుండెను నిచ్చల్.

గీ॥ ఇట్లు శివుదేవళములలో ♦ నెన్నియేని, దీపముల నుత్సవంబుగఁ ♦ దీర్పఁజేసి
బహువిధములగు భోగము♦ల్వడసి కొంత, కాలమునకల్ల పార్థివ♦కాయమువిడి. 472

క॥ అలకాపురి కీశ్వరుఁడై, యల కాలహరునకు మిత్రుఁ♦డై సిరులొందెన్
అలకాపురుషుండగువాఁ, డలకాలగళాల యాత్ర ♦ యవు సుకృతమునన్. 473

—— * గుణనిధి కుబేరుండై శివునకుఁ జెలికాఁడగుట * ——

వ. అదియు నానుపూర్విగ నెఱింగింతు వినుము.

గీ॥ పద్మకల్పంబునందు మ ♦ త్స్వాంతజాతుఁ
డౌ పులస్త్యుని కాత్మజుం ♦ డయ్యె విశ్ర
వస్సు, తత్పుత్రుఁడై పుణ్య ♦ వైభవుండు
వైశ్రవణుఁడేలె లంకయన్ ♦ బట్టణమును. 474

చ॥ అతఁడును మేఘవాహన స ♦ మాహ్వయకల్పమునందుఁ గాశికన్
హితమతిఁ జిత్ప్రకాశికను ♦ నింపునఁజేరి శివప్రతిష్ఠ సం
చితవిభవంబునన్ సలిపి ♦ శ్రీగళలింగమునందుఁ జూడ్కి సం
తతమలరంగఁ గూరిచి ని ♦ తాంతతపంబొనరించె మించుగన్. 475

వ. మఱియు నాతనియందు.

గీ॥ విలసితతపోగ్నిశిఖము వి ♦ వేకదీప, మధికతరభక్తిసుస్నేహ ♦ మనిలరోధ
నిశ్చలంబు శివైక్యమున్ ♦ నిపుణపాత్రఁ, గామముఖవిఘ్నవిహానిఁ ♦ గాంచకలరె. 476

క॥ ఎమ్ములు చర్మమ్మవశి, ష్టమ్మగునట్లొడలు గడుఁగృ ♦ శతఁగొన బహుళవ
ర్షమ్ములు సలిపెఁ దపోవ్రత, మమ్మహితుఁడు సకలదివ్య ♦ లలరిపొగడఁగాన్.

చ॥ చిరముగఁ జూడ్కి లింగమునఁ ♦ జేర్చి తపించుచు నున్నయట్టి య
బ్బిరుదుఁ దపస్విఁజూచుతమిఁ ♦ బేరిమి విశ్వవిభుండు గౌరితో
బిరబిరఁ జేరి కోర్కెను మ ♦ భీష్టములిచ్చెద నన్న నాతఁడున్
సరగున నేత్రముల్దెఱచి ♦ శంకరు సూర్యసహస్రభాస్వరున్. 478

చ॥ కనుఁగొనఁజాల కార్తివడి ♦ కన్నలఁగన్నులుమూసి యిట్లనెన్
ఘనకరుణానిధాన! ననుఁ ♦ గానఁగవచ్చి వరంబు లిచ్చెదన్
గొనుమనియంటి వింకొకఁడు ♦ గోరను గోరెద నీపదాబ్జముల్
దనియుచుఁ గన్గొనన్ వెరవుఁ ♦ దార్కొనఁజేయుము వేగ మ్రొక్కెదన్.

మ॥ అని యర్థింపఁడు వేగ శంకరుఁడు దా ♦ నత్తాపసగ్రామణీం
ద్రుని కష్టై యనిమేషదృష్టి యిడ సం ♦ తోషించి యాతండు వే
గని కాంచెన్ రమణీమణిన్ ద్రిజగతీ ♦ కళ్యాణసంధాయినిన్
ఘనకారుణ్యనిధిన్ మహేశ్వరిని యో ♦ గశ్రీధురీణాకృతిన్. 480

చ॥ శివునిభుజంబుసోఁకఁ గడుఁ ♦ జెన్నగు నెన్నగుమోముతోడఁ జె
ల్వవు సిరినొప్పియున్న జగ ♦ దంబికనుం గని యాపె యెన్వతో
శివుని సరాసరిన్నిలిచి ♦ శ్రీ రహిమీఱుచున్న దెట్టి మే
లవు తపసొంది యుండెనొకో? ♦ యబ్జసుగంధి కరం బిటుల్ సిరిన్. 481

క॥ ఔరా? యందంపు బసం, బౌరా? శ్రీవిలసనాయు ♦ తాభ్యుదయంబౌ
రౌరా? ప్రేమాతిశయం, బౌరా! సౌభాగ్యగరిమ ♦ లరయఁగ దరమే. 482

క॥ నా తపసుకన్న నురవుగ, నీ తామరసాక్షి తపసు ♦ నెటుచేసెనొ సం
ప్రీతి నిటు గారవించెను, భూతేశ్వరుఁడని యసూయ ♦ పొడలఁగఁగనుఁడున్.

క॥ చెఱుమది నిటు సూచిన య,ప్పడ తత్పరిపాకరూప ♦ మున నాతనిదా
నెడమ కనుగ్రుడ్డు పగిలెను,గుడువక నుడియునొకొ యెందుఁ ♦ గూడని చెయ్వుల్.

వ. అంత.

ఉ॥ ఆరసి యవ్విధంబు నఖి ♦ లాంబుజజాండకరండ నేత్రియా
నా రమణీమతల్లి తన ♦ యాత్మవిభున్ గని దేవ! యెవ్వఁడీ
క్రూరుఁడు క్రూరదృష్టి ననుఁ ♦ గొంకక చూచెడు వీనిదైన యీ
నేరమి నారయన్ వలయు ♦ నెట్టననన్న మహేశుఁడాఁడటన్. 486

ఉ॥ సైరణసేయు దేవి! సుతు ♦ చాపలభావము వీఁడు పుత్రకుం
డారయు మెందుఁ గొడ్కు లన ♦ యంబు ప్రియేతరములొనర్చినన్
నేరములంచు నెంచకయె ♦ నిచ్చలు సాఁకుచునుండువారొ నీ
వారహిఁ జెంది వీనిని ద ♦ యన్ గని బ్రోవుము మేటిప్రేముడిన్. 487

క॥ అనియిటు తనగేహిని కిను, కను నుడిపి తపస్వినిఁగని ♦ కనికరముగడున్
దనుకఁగ మహేశుఁడిత్తెఱఁ, గున వరముల నొసఁగెఁ దనదు ♦ గొప్పదలిర్పన్.

సీ॥ గుహ్యకులకును జ ♦ క్కులకును గిన్నరు, లకుఁబుణ్యజనులకే ♦ లికవుగమ్మ
అక్షయతన్ దన ♦ రారుచుండెడు నవ, నిధులకు సతతంబు ♦ నేతవగుము
నీవీటిమెలతోఁట ♦ నిచ్చలునేనుందు, నెడపక నాచెల్మి ♦ నప్డుఁబడయు
మరసి ధనంబుల ♦ నఖిలజనంబున, కిచ్చువదాన్యత ♦ హెచ్చుమిగులు

గీ॥ మని వరంబుల నొసఁగి యా ♦ ర్యాపదంబు
లందుఁబడు మీఁపె సీతల్లి ♦ యాదరించు
నని యటుల సల్పఁజేసి తా ♦ నపుడు ప్రియకుఁ
గావు నీసుతునని చెప్పఁ ♦ గడఁగి యుమయు. 489

చ॥ వినుముకుమార! నీవుఁగడు ♦ విస్తరిలున్ శివభక్తి సామియి
చ్చినవరముల్ఫలించు నిఁకఁ ♦ జెష్ఠతనంబున నీవునాడు చె
ల్వొనుగని యారసంపదుటఁ ♦ బూన్కి కుబేరుఁడనన్ సమాహ్వయం
బును ధరియింతువెప్డు శుభ ♦ ముల్పెనుపొందనుగాక నీకిలన్. 490

వ. అనుచు నయ్యాదిశక్తి యిట్లు వరంబులిచ్చిన నంత ఖండేందుమౌళి దేవితో నంతర్ధానంబు నొందె నంతఁ బరమశివుని రూపాంతరంబైన నీలలోహితరుద్రుం డఖండ ప్రమథదేవభూతగణంబులతో శుభముహూర్తంబున నలకానగర బాహ్యోద్యానం బందలి కలధౌత శైలశిఖరాగ్ర హర్మ్యతలంబునఁ బ్రవేశించె ననంతరంబున నఖిలమునివరులును సిద్ధులును, మూర్తిమంతంబులగు నిగమంబులు నాగమంబులును, హరివిరించనులును దారసించి వచ్చి సర్వేశ్వరుని సేవించిరి. కుబేరుం డానందంబున నంపతి కాతిథ్యంబొసంగి యలరె. మహేశ్వరుం డయ్యెడ దివ్యజనుల నందఱ నభీష్టవరదానంబుల సంతుష్టులం జేసిన నవ్వారలందఱు శివాజ్ఞాప్రకారంబుగ స్వస్థానంబుల కరిగి రిట్లు కుబేరుండు శివానుగ్రహంబునకుం బాత్రుండయ్యె నిఁక నందు భర్గుండు బ్రహ్మచారిగ నుండ కొంతకాలంబున కాత్మశక్తి దాక్షాయణిగ జనించుటఁ జేసి యద్దేవిఁ బెండ్లాడి యాపెతో నందు యోగవిహారంబు లొనర్చెనని శతానందుం డాత్మజునకు బోధించె నీ సృష్టిప్రకార కథనంబు నెవ్వరేనిఁ జదివిన వినిన నవ్వారలు భోగమోక్షంబు లొందెదరని తెల్పిన సూతునకు శౌనకాదులు దాక్షాయణీ రుద్రుల పరిణయంబును నవ్వారి లీలలఁ నెఱింగింపు మనుటయు.

మాలినీవృత్తము. నిగమహితచరిత్రా ♦ నిత్యధర్మానుయాత్రా
సుగుణమణినిధానా ♦ సూరిగణ్యాభిధానా!
అగణితశుభకీర్తీ ♦ యచ్ఛపుణ్యాఢ్యమూర్తీ!
విగళితభవచర్యా ♦ వీరభద్రేశభార్యా! 491

గద్య.

ఇది శ్రీబుధజనవిధేయ ముదిగొండ నాగవీరేశ్వర నామధేయప్రణీతంబైన
శివపురాణంబునందలి సృష్టిఖండము సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



శ్రీ శివాభ్యాన్నమః

# శ్రీ శివపురాణము

## సతీ ఖండము.

### ప్రథమాశ్వాసము.



విశ్వేశ్వరలింగా
ర్చావిలసితసుప్రసాద ♦ జాతోద్భటనం
శ్యా! వీరభద్రదేశిక
పావనసుయశోభిరామ ♦ భవ్యచరిత్రా!

వ. అవధరింపు మక్కథకుండు శౌనకాది మహామునీంద్రుల కిట్లనియె

—•నారదుఁడు బ్రహ్మను సతీదేవీ చరిత్రింబుఁ జెప్పుమనుట•—

ఉ॥ నారదుఁ డప్డు సంతసము ♦ నాఁటినచేతముతోడ భారతీ
ధారునితో నిటుల్ పలికె ♦ దక్షున కెట్లుజనించె శక్తియ
న్నీరజలోచనన్ దమిని ♦ నెక్కొని రుద్రుఁ డెటుల్వరించె న
ద్ధీరునితోఁ బగన్ గొని వి ♦ ధీ! మఖమేల యొనర్చె దక్షుఁడున్. 2

గీ॥ అంబయేటికి మరల దే ♦ హాంతరంబు, నొందవలసెనొ యది యర ♦ విందగర్భ!
సర్వమును నాకెఱింగింపు ♦ సంతసమున, నీవుసరివచ్చుగురు నెందు ♦ నేనెఱుంగ 3

క॥ అని యడుగుడు రాజీవజుఁ, డనురాగముదోఁప నిట్టు ♦ లనియెను మౌనీం
ద్రున కాత్మజ! యెఱిగింతును, మనములరఁగఁ బరమశివుని ♦ మహితచరిత్రన్. 4

ఉ॥ మున్ను మరీచి ముఖ్యులగు ♦ పుత్రులఁ బుట్టఁగఁ జేయ నంత సం
పన్నమనోజ్ఞరేఖయగు ♦ బాలిక సాయపుసంధ్యనాఁగడున్
జెన్నగుకన్నె యొక్కతె వ ♦ శీకృతతాపసచిత్త వోల్చె నా
యన్నులమిన్నఁగాంచి ముదఁ ♦ మందఁగఁ జాలని వారలుందురే ? 5

ఉ॥ అమ్మదిరాక్షిఁ బోలినదొ ♦ యారిని నాకమునందు మర్త్యలో
కమ్మున నాగలోకమున ♦ గాని గనుంగొన రెవ్వరెప్డు చో
క్కమ్మగు మేల్మిబంగరపు ♦ కాంతులఁ బంతము మీఱు మీఱు చె
ల్వమ్మగు మేనిసౌరు మురి ♦ పంపువిలాసరసప్రసారముల్ 6

## —* సంధ్యనుజూచి బ్రహ్మయుఁ దత్పుత్రులును మోహించుట *—

వ. అంత

ఉ॥ దానిని నేను నాసుతులుఁ ♦ దప్పక చెప్పలువాల్చ కెంతయున్
బూనికఁ జూచుచున్నతఱిఁ ♦ బుష్పశరుండట దోఁచి మమ్ము నెం
తేనియు మోహవాగురలఁ ♦ దీరిచి త్రోయుడుఁ దెర్వమాలి యు
మ్మీనవిలోచనన్ గవయు ♦ మేము దలంచుచు నుంటి మార్తిమై. 7

చ॥ అదియును మన్మథార్తిఁగొని ♦ యక్కట! యందఱ మమ్మఁ జూచుచున్
ముదముదలిర్పఁగాఁ గడిఁది ♦ మోహనహాసవిలాసభావముల్
పొదలఁగఁ జేయుచున్ దనదు ♦ పొంకపుమేని మెఱుంగురంగు లిం
పొదవఁగఁ గానుపింపఁగఁ బ ♦ యోరుహనేత్రి యటన్ మెలంగుడున్, 8

చ॥ మతియనునట్టి భావమును ♦ జూడక ధర్మువుఁ జూఱఁబుచ్చినేఁ
గుతుకముమీఱ నక్కలికిఁ ♦ గూడఁగడాయుచు నున్నఁజూచి స
న్నుతమతి ధర్ముఁడున్ నిజ ♦ తనూజుఁడొకండు వశాత్మకుండు నిం
దితమగు నాదు మోహమును ♦ ద్రిప్పఁగఁ నీశుఁ దలంచె నాత్మలోన్. 9

క॥ హరుఁ డంతనె వేగిరమున, దఱిసి నన్ ధర్ముఁ డక్కు ♦ తనుజాతుల
నందఱనున్ గని నగి లజ్జను, నెఱిగింపుచు నిట్టులనియె ♦ నేనముదోఁపన్. 10

ఉ॥ అద్దిర బ్రహ్మ! యెట్లు చప ♦ లాత్ముఁడవై కనుఁగొన కెంతయున్
ముద్దుకుమారిన్ గవయు ♦ బుద్ధినొనర్చితివోయి నీసుతుల్
హద్దుదొలంగి రోసమున ♦ కాత్మసహోదరిఁ గూడ నెంచినా
రెద్దెస నేని యిట్టికత ♦ లెప్డు వినంబడెనే! జగంబునన్ 11

క॥ తలి కూఁతు రన్న పెండ్లము, చెలియలు నప్పయును నెప్పు ♦ క్షేమార్థులచే
కలుషమతిఁ జూడఁదగదని, యిల వాకొనుచుండు రెందుఁ ♦ గృతమతు లరరే,

ఉ॥ ఎక్కడకేగె వేదము లిఁ ♦ కెక్కడఁ దాఁగెను ధర్మశాస్త్రముల్
మక్కువకూఁతుఁ గూడుటది ♦ మంచిదె? కొంచు విరించి! యన్న వే
చక్కఁగ మళ్ళి సిగ్గుఁగొని ♦ చాలఁగఁజింత యొనర్చుచుండఁగా
నుక్కఱఁ జెమ్మట ల్వొడమ ♦ నుద్భవమొందిరి పెక్కురాత్మజుల్. 13

## —* బ్రహ్మ మున్నగువారల కగ్నిష్వాత్తాదులు పుట్టుట *—

వ. అందగ్నిష్వాత్తాదులగువా రఱువదినాల్గువేలును, నెనుబదియాఱువేలు బర్హిషదు
లనువారును బితృగణంబులై యేర్పడిరి వారందఱును

క॥ కాటుకరేక వితమ్మున, నీటుగ రంగొప్ప వికచ ♦ నీరజనేత్రల్
మేటియతుల్ సంసరణము, దాఁటినవా రధికపుణ్య ♦ తనులు మహాత్ముల్. 14

గీ॥ మత్సుతుండైన దక్షుఘ ♦ ర్మసలిలమున
సద్గుణనిధాన తన్వంగి ♦ చారుదశన
కలదు లేదను నడుమొప్పు ♦ కలికిమిన్న
కుందనపు బొమ్మయన నొక్క ♦ కొమ్మ పొడమె. 15

వ. మఱియు సర్వాంగసుందరి యగు నమ్మగువ

క॥ పున్నమచందురుఁబోలిన, చిన్నారిమొగమునఁ జెలఁగు ♦ చిఱునగవున మేల్
వెన్నెలలఁ గ్రుమ్మరింపుచు, సన్నుతమై యున్న రతిగ ♦ సాటిరి యసురుల్. 16

వ. మఱియును నాయాత్మజులందు మరీచిప్రముఖులగు నాల్గురుదక్కఁ దక్కినవార
లకు రేతఃపాతంబగుడు నద్దానఁ గ్రతునకు సోమవులును వశిష్ఠునకుఁ గాలీను
లును బులస్త్యున కాజ్యపులును నంగిరసునకు హవిష్మంతులును జన్మించిరి.
ఇప్పుడుపులంద అగ్నిష్వాత్తాదులతోఁ గలసి పితృగణంబులై కవ్యభోజనులై
యుండి రివ్వారల జన్మంబునకు సంధ్య హేతువగుట నది పితృమాతయనఁ బరఁగె
ననంతరంబు మహేశ్వరుండు మమ్మునందఱను మన్నించి ధర్ముని ననుగ్రహించి
యంతర్ధానంబు నొందె నంత నేనును లజ్జాక్రాంతుండనై యట్టి మోహజనకుం
డగు కాము నుద్దేశించి బిట్టలుకతో. 17

గీ॥ ఓరి మన్మథ! మున్మిట్ల ♦ నుచితమైన, మోహవహ్నిఁబడఁ ద్రోచి ♦ మొక్కలమున
నుడుకఁజేసితి నమ్మహే ♦ శుఁడు హసించె, నీవు నుఱిఁగెద వాశివు ♦ నేత్రవహ్ని. 18

క॥ అని శపియించిన మదనుఁడు, విని ఝల్లునఁ జెదరి బెదరి ♦ వేగముగ విరిం
చినిఁ గని యేమిది దేవర!, నను సెపియించితి వకార ♦ ణమ్ముగ నిట్టుల్. 19

మ॥ ననుఁబుట్టించినయప్డు మజ్జనకుఁడౌ ♦ నారాయణుం డీవునుఁ
ననుఁ ద్రైలోక్యవిమోహనక్రియను సం ♦ ధానింపుమంచుఁ బురా
తనులౌముప్పదమూర్తు లీరలు మొదల్ ♦ తథ్యంబు సర్వామరుల్
మునులుం దైత్యులు మర్త్యులుం ఘనులు స ♦ మ్మోహాస్త్రం లం చాడరే. 20

క॥ అదిమొఱఁగి నేను నిత్తఱి, నొదవించితి మీకు వికృతి ♦ నున్నతమతి! త
ప్పిదమేమిట నాయది నను, సదమదమొనరింప నిట్లు ♦ శాపంబిడఁగాఁ.

క॥ అని యడిగిన ద్రుహిణుం డి, ట్లనియెను సుతయందు నాకు ♦ ననుజపయిని మ
త్తనయులకును దమిఁ గూర్పఁగ, జనునే యనుచితపుఁగృతి వి ♦ చారము వలదే.

చ॥ గొనకొని యాండ్రికిన్ మగల ♦ కున్ దమి గూరుపఁగా నిన్ను నిరో
జన మొనరించినామని య ♦ సాధుపదమ్మున మమ్ముఁ ద్రోయఁగా
ననువొకొ! హైనన్ గినుక ♦ యంతరమొందెను శాప మింతతో
నెనయదు పెద్దకాలమున ♦ నెప్పుడొ యట్లొనరించు నిన్నిఁకన్. 23

ఉ॥ అట్టులె చెల్లియున్ మరల ♦ నాభవు పెండిలి నమ్మహాత్ముచేఁ
బుట్టుక నొందఁగాఁ గలవు ♦ పొమ్మిఁక యందురకంచుఁ జెప్పి నేఁ
జట్టన నంతరంబెనయఁ ♦ జక్కఁగ దక్షుఁడు తత్సుతన్ రతిన్
నెట్టన మీనకేతునకు ♦ నేరిమి నిచ్చి యొనర్చెఁ బెండిలిన్. 24

వ. అంత మన్మథుండును రతిన్ గొని చని స్వావసథంబును జేరి యందు నిచ్చలును రూపరేఖాలావణ్యపుణ్యమూర్తి యగు రతితో నలరుచు.

సీ॥ కొమ్మకన్బొమ్మల ♦ కుదిరికఁ గన్గొని, విల్లుపై వెగటొంది ♦ విఱిచెఁ బొదవి
సుందరికీఁగంటి ♦ చూపుల చొక్కులఁ, గని నిజాస్త్రముల తె♦క్కగొనకుండె
నిండుచందురు మించు♦నెలఁత మొగముఁ జూచి, జాబిల్లితోఁ జెల్మి♦ సలుపఁదడసె
తమ్మిమొగ్గల మీఱు♦తరుణి చన్గవఁగాంచి, తమ్ములపై నవా ♦ దరముసూపె
గీ॥ బలిసిబిగిమీఱియున్న న♦ భ్భామ చన్నుఁ, గవపయిని వ్రేలుముత్యాల ♦ కంఠహార
మరసి తననారి నిస్సార♦మనుచు రోసె, భువనమోహనుఁడై నయా♦పుష్పశరుఁడు.

వ. రతియును

ఉ॥ చక్కనివారలందుఁ గడుఁ ♦ జక్కనివాఁడగు కమ్మవిల్తొరన్
జక్కఁగఁ బెండ్లియాడి కడు ♦ సంతసమొప్పఁగఁ దోడినీడ నా
నెక్కుడు వేడ్కఁ గన్గొనుచు ♦ నింపులు సొంపులు మీఱఁగొంతునిన్
మక్కువఁ గొల్చుచుండెను ర ♦ మాసతి విష్ణునియట్లు చెల్వమై. 27

క॥ సౌదామనీ వలాహకు, లాదివిమత్పదవి నెట్టు ♦ లలరుదురో యం
దా దక్షజామదను లా, మోదంబున వెలసి రింతొ ♦ పొగడఁగ జగముల్.

గీ॥ ఏనును మదాత్మజులును మ ♦ హేశ్వరుండు, నచ్చోటును విడి చనినంత♦సద్దియెల్ల
నరసి సాయంపుసంధ్య యి♦ట్లని మనమునఁ, జింతయొనరించె నెంతయుఁ♦జిన్నవోయి.

ఉ॥ అక్కట నేను పుట్టిన య ♦ నంతరకాలమునందె యెక్కడౌ
చక్కఁదనంపు నాయొడలి ♦ చందముఁ గన్గొని తండ్రి యన్నలున్
మిక్కుటమైన మోహమున ♦ మీఱుచు మారుని బారికెంతయున్
జిక్కి ననున్ దమిన్గవయఁ ♦ జేరఁగ నెంచిరి పాపకర్ములై. 30

ఉ॥ నేనును గామవిద్ధనయి ♦ నిందితబుద్ధిఁ బథంబుఁ దప్పి యీ
ప్పైనిజహీనభావలలి ♦ తాయతదృష్టిఁ దనర్చి చూచితిన్
మానసమందు వారలస ♦ మాగమకేళికి నీయకొంటి నెం
దేనియు నిట్టిచెడ్డతల ♦ పెంచఁదలంతురె యెవ్వరేనియున్. 31

ఉ॥ ఇంతకు వారలన్ నను ర ♦ హిన్ గరఁగించిన యించువింటిజో
దెంతయు దోసకారి యతఁ ♦ డే పఱ శాపమునొందె మేలు నే
నింతటి పాపశీలనయి ♦ యెట్టులనీతనువున్ భరింతుఁగా
వింతునిఁకన్ మహాతపము ♦ విచ్చిచనంగ మహాఘపుంజముల్. 32

చ॥ చెడుగునుగాదె యిమ్మెయినిఁ ♦ జెందఁగఁ జూచితిఁ దండ్రి నన్నలన్
విడువఁగనొప్పు దీనిఁ దగ ♦ వేల్చెదఁ జండహుతాశనార్చియం
దొడిసి తపించెదన్ దురిత ♦ మూడిసురుంగ వెలుంగు కీర్తిఁ రాఁ
బడసెదఁ గామమద్ది యిఁక ♦ బాలురకొందని యట్లొనర్చెదన్. 33

క॥ అని వేగఁ జంద్రభాగా, ధునియొప్పెడు చంద్రభాగ ♦ దుర్గమగిరికిన్
జని యట నెలవొంది కడున్, ఘనతపమొనరింప నియతిఁ ♦ గాంచఁగనుండెన్. 34

వ. అయ్యవసరంబున.

—* బ్రహ్మ సంధ్యయొద్దకు వశిష్ఠునిఁబంపుట *—

ఉ॥ కూతుఁరు తాపసవ్రతముఁ ♦ గోరియొనర్పఁగ నున్నదామె య
చ్చోఁత యెఱింగి యేనును వ ♦ శిష్ఠుని పుత్త్రునుజన్ముఁ జూచి నీ
వీతఱి చంద్రభాగగిరి ♦ నేపునఁ జేరి యటన్ దపింపఁగా
నాతురయైన సంధ్యకుఁ బ్రి ♦ యంబున మాంత్రికదీక్ష నిమ్మఁకన్. 35

చ॥ ఎఱుఁగదు చిన్నబాల మన ♦ మెంతయుఁ గంతునకోడి దానిపైఁ
గరమనురక్తిఁ జెందుటది ♦ గాంచి జుగుప్సగ నెంచి యిట్టులన్
దిరమగుపూన్కితోఁ దపసు ♦ దీర్పఁగఁబూనెను గాననీవు స
త్వరమటఁజేరి యాయమకు ♦ భర్గునిమంత్రముఁ జెప్పు సిద్ధిగాన్. 36

క॥ నీవీవేసముతోఁడుతఁ, బోవలదు కుమార! మాఱి ♦ పోవలె నది యి
ట్టీ వరిగినఁ దొలివృత్తము, భావంబునఁ దలఁచి వెఱచి ♦ వఱఁచు దవులకున్. 37

క॥ అని పనిచిన నతఁ డట్టులఁ, జని కనియెను జంద్రభాగ ♦ శైలాగ్రమునం
దొనరిన లోహితతీర్థము, ముని ముంగలఁ దపసొనర్పఁ ♦ బూనిన సంధ్యన్.

గీ॥ తీరమొందిన సంధ్యచేఁ ♦ దేజరిల్లె, లోహితహ్రద మంభోజి ♦ నీ హితంబు
కరముచక్కఁలగుంపుతోఁ ♦ గ్రాలునభము, పొడుచుచందురు చేఁగాంతిఁ ♦ బొదలినట్లు.

గీ॥ గాదకొనుచుఁ జంద్రభాగ యు ♦ క్కొండ యపర
భాగమును భేదమొనరించి ♦ వేగమొప్ప
దక్షిణాంబుధిఁ జేరఁగఁ ♦ దరలుచుండు
దర్శనీయమై యాస్థలి ♦ దనరు ధరను. 40

చ॥ కనుఁగొని సంధ్య కిట్లనియె ♦ కంజదళేక్షణ! యేటికిట్లు ని
ర్జనవనమొంది యుంటి విటఁ ♦ జక్కఁగ నేమియొనర్పఁ బూనితో
జనకుఁ డెవండొ చెప్పు మిఁకఁ ♦ జందురుఁ గుందఁగఁజేయునీమొగం
బున నెదియో విచారము ద ♦ వుల్కొని యున్నటు గానుపించెడున్. 41

గీ॥ అనిన నమ్మునివరుని మ ♦ హాత్మునిస జ్వ, లించునజ్ఞాతవేదుని ♦ లీలఁ గ్రాలు
వాని నొడలు ధరించిన♦ బ్రహ్మచర్య, వ్రతమునా నొప్పువాని న ♦ వ్వడఁతి గాంచి.

ఉ॥ ఆదట మ్రొక్కి యిట్లనె మ ♦ హాత్మ! యెఱుంగఁగలేవె నీవిఁకన్
నాదు మనోరథంబును ఘ ♦ నంబుగ నిందుఁ దపంబుసేయ నా
హ్లాదమునొంది యిగ్గిరివ ♦ రాగ్రముఁజేరితి సంధ్యయందు ప్ర
న్నాదిమమూర్తియా నలువ ♦ కాత్మతనూజను జిత్తగింపుమా! 43

క॥ ఎఱుఁగను మంత్రము తంత్రం, బెఱుఁగను తాపసవిధాన ♦ మెఱుఁగ నొకింతే
మఱుఁగుచునుంటిని నందుల, గురుకరుణానిధి! యొసంగు ♦ ముపదేశ మిఁకన్.

## —* వశిష్ఠుఁడు సంధ్యకు మంత్రోపదేశంబు చేయుట *—

క॥ అనినవిని యవ్వశిష్ఠుం, డొనరఁగ నవ్వనితకప్పు ♦ డుపదేశంబి
ట్లొనరించె విధివిధిగఁ బా, వనమగుశివదీక్షనొసఁగి ♦ వాత్సల్యమునన్. 45

క॥ పరమమగు గొప్ప తేజము, పరమంబగు గొప్పతపము ♦ పరముఁడునగునా
పరమారాధ్యుఁడు శంభుఁడు, దిరముగ నెదనుండునట్లు♦దిద్దికొను మదిన్. 46

వ. ఇట్లు మనంబును శివైకతానంబొనర్చి నాయుపదేశించు మంత్రంబున మహేశ్వ
రునిఁ గొలువుము నీకు సకలసిద్ధులొనఁగూడునని "ఓం నమశ్శంకరాయ ఓం"
అనుమంత్రంబు నుపదేశించి మఱియు నిట్లు బోధించెను. 47

గీ॥ మౌనమునఁ దీర్థమాడుము ♦ మౌనముననె
చేయుము శివార్చనను నెప్డు ♦ చిగురుఁబోఁడి!
పర్ణజలభక్షణమునఁ ద ♦ పంబునిట్లు
సల్పిన నభీష్టసిద్ధియౌ ♦ సత్యమిద్ది. 48

గీ॥ ఇట్లు నిచ్చలుమదిలో మ♦ హేశునిల్పి, కొలువు సందియమొందక♦ ఫలములొందు
దని వసిష్ఠమహర్షి సం ♦ ధ్యాలతాంగి, కెఱుకపడఁ జెప్పియంతర్ధి♦ నెలమినొందె. 49

క॥ శివదీక్షనొంది సంధ్యా, కువలయలోచన కరంబు ♦ కూరిమితోడన్
శివమంత్రంబు జపించుచు, నవధానముతోడ సలిపె ♦ సంచితతపమున్. 50

## —* శివుఁడు సంధ్యకు సాక్షాత్కరించుట *—

క॥ పదిరెండువేలయేం డ్లట, ముదమునఁ దపియింప నంత ♦ ముగ్ధేందుధరుం
డెదఁ గనికరించి ప్రేమా, స్పదుఁడై పొడసూప నంత ♦ సంధ్య రయమునన్.

ఆ॥ ప్రభుఁ బ్రసన్నవదను ♦ భర్గునిఁ గనుఁగొని, భయము భక్తి గదురఁ ♦ బ్రియముతో ను
తింపవలను గనక ♦ దీనయై కనులను, మొగిచి నిలువఁజూచి ♦ నగశయనుఁడు.

క॥ దివ్యజ్ఞానంబును నీఁక, దివ్యవిలోచనములొసఁగఁ ♦ దెలివొంది కడున్
దివ్యోక్తులతో నిట్టుల, దివ్యవరున్ హరుని గడు ను ♦ తించెఁ బ్రణతయై. 53

క॥ స్థూలము సూక్ష్మంబనఁబడు, నేలాటి విధంబుగాక ♦ నెఱుఁగుటకుఁ గడున్
వీలమరక జ్ఞానంబున, నే లభియింపఁబడువాని ♦ నే సేవింతున్. 54

క॥ శాంతము నిర్మలమును న, త్యంతము జ్ఞానైకగమ్య ♦ మవికారమ్మౌన్
ధ్వాంతపథేతరలలిత మ, నంతం బాత్మప్రకాశ ♦ మగు శివుఁ గొల్తున్. 55

క॥ ఎవ్వని రూపంబులు నభ, మివ్వసుమతి సలిల మగ్ని ♦ యిప్పవమానుం
డవ్వైవస్వతుఁ డాదిశ, లవ్విశ్వాకారుఁ గొలుతు ♦ నహరహము రహిన్. 56

ఆ॥ ఇలఁ బ్రధానపురుషు ♦ లెవ్వానిపనికినై, బయలు వెడలి రెంతొ ♦ ప్రౌఢివనర
నట్టి శంకరునకు ♦ నవ్యక్తమూర్తికి, వందనమునొనర్తు ♦ వాసిమీఱ. 57

క॥ కమలజరూపంబున స, ర్గము హరిరూపమునఁ బెంపు ♦ ఖండపరశురూ
పమున లయం బొనరించు ప, రమశివు భజియించెదన్ గ ♦ రము భక్తిమెయిన్.

క॥ నీవే పరమాత్మవు శివ, నీవే చిద్విద్యవెందు ♦ నిరుపమభావా!
నీవే బ్రహ్మవు దేవా, నీవే సద్వస్తువవు ద ♦ నిందితవిభవా! 59

క॥ ఎవనికిఁ దొలినడిమియునున్, జివరయుఁ గాన్పింప వెందుఁ ♦ జెలఁగుజగములీ
యవి యెవనివలన వెలునడు, నవాఙ్మనసగమ్యు నామ ♦ హాత్మ్యుఁ గొలిచెదన్.

క॥ కారణములకెల్లను మేల్, కారణమై సర్వలోక ♦ కళ్యాణకరుం
డై రహిమీఱు పరాత్పరు, సారమయుఁ బూతపూతు ♦ సన్నుతుఁ గొలుతున్.

ఆ॥ నిర్గుణుండవైన ♦ నీగుణవైభవ, మాఁడుదాన నేమి ♦ యరయఁగలను
ఇంద్రుఁడేని మఱియు ♦ పేంద్రుఁడేనెవ్వాని, రూపమారయుటకు ♦ నోపరెపుడు. 62

క॥ మ్రొక్కెద నీకు మహేశ్వర! మ్రొక్కెద గీర్వాణవంద్య! ♦ మ్రొక్కెద శంభూ
మ్రొక్కెదఁ దపోమయా! యిఁక, దిక్కై ననుఁ బ్రోవుమయ్య ♦ దీనశరణ్యా!

గీ॥ ఇట్లు నుతిచేసినట్టియా ♦ యిందువదన, పలుకుఁబాలించి భక్తవ ♦ త్సలుఁడు మంచు
చేతఁ జెమరినతమ్మిపూ ♦ రీతినలరు, ఫాలఁజిసెమ్మోముఁగన్గొని ♦ పలికెనిట్లు. 64

## —♦ శివుఁడు సంధ్యకు వరంబులిచ్చుట ♦—

చ॥ మురిసితినమ్మ నీదుతప ♦ మున్గని నీవొనరించినట్టి యీ
నిరుపమసంస్తవంబునకు ♦ నేరిమికిన్ గడుసంతసించితిన్
వరముల నిత్తుఁ జేకొను మ ♦ వశ్యము నీదగుకోర్కు లెవ్వియో
వరుసఁ దెల్పు మన్నియును ♦ వైళమొసంగెదఁ బైదలీ! యిఁకన్. 65

వ. ఇట్లు పలికిన మహేశ్వరుని వచనంబులకు సంతుష్టయై యచ్చేడియ జగ
త్ప్రభునకుఁ బౌనఃపున్యంబుగాఁ బ్రణమిల్లి యిట్లువిన్నవించె.

చ॥ వరమునుజెందఁగాఁదగిన ♦ వారికి నేఁ దగియున్నఁ బూర్వపున్
దురితముఁబాసి శుద్ధనయి ♦ తోఁచిన నాతపమీవు మెచ్చినన్
వరద! యొసంగు మిప్పుడమిఁ ♦ బ్రాణులు పుట్టినయంత మన్మథా
తురతను గాంచకుండునటు ♦ దొల్తవరంబిది దేవపూజితా! 67

వ. మఱియును

ఉ॥ ఎవ్వని నేను నాథునిగ ♦ నెంచి వరించెదనో త్రిశుద్ధిగా
నవ్వరునందె నామది య ♦ హర్నిశలున్ రహియించుఁగాక తా
నవ్విభుఁడున్ ననున్గడుఁ బ్రి ♦ యమ్మునఁ జేకొనియుండుఁగాక యొం
డెవ్వఁడు నన్నుఁగామమతి ♦ నీక్షయొనర్చినఁ గ్లీబుఁడౌ ధరన్. 68

వ. ఇమ్మూఁడు వరంబులు నాకిమ్మనుడు నమ్మహేశ్వరుఁడు తథాస్తని మఱియు
నిట్లనియె. 69

సీ॥ కొమ్మ! యిఁకనేమి మదిని సం ♦ కోచపడకు
పాపమంతయునున్ "బటా ♦ పంచ"లయ్యె
గడిఁదితపసిట్లుచేయుట ♦ గల్గుటన్ మ
దీయమానసరుజ యది ♦ దీఱిపోయె. 70

వ. ఇఁకను

సీ॥ పుడమిఁబుట్టెడు వారికిఁ ♦ బొసఁగుచుండు
బాల్యకౌమారయౌవన ♦ వార్ధకములు
నాల్గుదశ లందునున్ యౌవ ♦ నంబునందు
బొడముకామంబు దృఢమిది ♦ పూవుఁబోఁడి! 71

క॥ లోకోత్తరసతివై కడు, వీఁకన్ దనరెదవు నీదు ♦ విభుఁడును సుతప
శ్శ్లోకుఁడును సుందరుఁడును న, నేకామరకల్పజీవి ♦ నిరుపముఁ డౌనరుణా. 72

గీ॥ వేఱొకఁడు నిన్నుఁగా మెచ్చ ♦ వీక్షచేసె
నేని యప్పుడె పేడినై ♦ యేవ మొందు
కోరినట్టి వరంబులఁ ♦ గొఱఁత లేక
యిచ్చితిని హెచ్చుమీఱఁ బూ ♦ ర్ణేందువదన! 73

వ. మఱియు నీఁకు నీ తలంపెఱింగియుండుటఁ జేసి యిట్లు చెప్పుచున్నాఁడ నీ వింతకుమున్ను దేహంబగ్నియందు హుతంబు సేయ నెంచితివి గావున నందులకీ గిరిప్రాంతంబునఁ జంద్రభాగాతీరంబునందే మేధాతిథియను ఋషి మునులతోఁ గూడి పదిరెండేండ్లు నియతిగల యాగంబొనరించుచున్నాఁడు గావున నీ వచ్చటికేగి వారియనుగ్రహంబున నెవ్వారికంటఁబడక యుత్తరజన్మంబున నీకుఁ బతిగాఁదగువాని మనమందుఁదలంచి యగ్నిప్రవేశంబుసేయు మంతమీఁద నా ప్రసాదంబున నమ్మేధాతిథికిఁ గూఁతురవై జన్మించి యందే తపంబు చేసి యభీష్ట వరలాభంబు నొందెదవని పరమేశ్వరుం డంతర్హితుండయ్యె నయ్యువిదయు నట్లువేగఁజని దనమనంబునఁ దనకు మంత్రోపదేశంబొనర్చి నట్టివాని వసిష్ఠ మునిని నాథునిఁగాఁదలఁచి శివానుగ్రహంబున నెవ్వారికిఁ బొడకట్టక మేధాతిథి యజ్ఞాగ్నియందుఁ బ్రవేశించినంత వేగిరంబున సప్తజిహ్వుండును బురోడాశ మయంబగు నాయంబుజగంధి శరీరంబు దహియించి సూర్యమండలంబుఁ జేర్ప రవియును నద్దేహంబును విభజించి యూర్ధ్వభాగంబును దేవప్రీతికరంబగు నుషస్సంధ్యగాను, శేషభాగంబును బితృప్రీతికరంబగు సాయంసంధ్యగాను నెల యించె నీఁకఁ బరమేశ్వరానుగ్రహంబున నద్దేవిప్రాణంబులు దివ్యదేహంబు నొంది మేధాతిథి యజ్ఞావసానమందు జాతవేదవేదియందు బంగారుతీవియఁబోలి పొడసూపిన నాతండు మురిసి యందుకొని యభిషేకంబుఁ జేసి వస్త్రాదుల నలంక రించి యరుంధతి యని నామకరణంబుఁజేసి సంతసంబునఁ బెంచుచుండె నంత నామెయు నైదవయేడు వచ్చినయంతనె

## —* అరుంధతీ వశిష్ఠుల వివాహము *—

గీ॥ చంద్రభాగాతటమ్మునఁ ♦ జటులతపముఁ, జేయుటయుఁ దల్లిదండ్రులు ♦ చెలువ నపుడు
బ్రహ్మసుతుఁడై తపంబుల ♦ వాసిఁబడసి, తనరు శిష్టున కావశి ♦ ష్ఠునకు నొసగి.

క॥ పాణిగ్రహణ మొనర్చిన, యేణాంకకలాధరుం డు ♦ పేంద్రుండును న
వ్వాణీశుఁడు మున్నగు గీ, ర్వాణులు పరిణయమునన్ గ ♦ రంబు మురియఁగన్,

గీ॥ ఆ త్రిమూర్తుల కరధార ♦ నపుడు వెడలె, శిప్రమున్నగు నదులేడు ♦ శివజలములు
సతుల తలమానికం బరుం ♦ ధతి వశిష్ఠు, తోడ నెంతయు నలరె సం ♦ తోసమునను.

క॥ వారిరువుర కుదయించిరి, భూరితపోనిధులు ♦ శక్తి మున్నగుపుత్రుల్
వీరల సచ్చరితము నె, వ్వారలు చదివినను వినినఁ ♦ బడయుదురు సిరుల్. 78

## —♦ శివునకు మోహంబుఁగూర్పుమని బ్రహ్మ మన్మథుని బంపుట ♦—

చ॥ నలువ యొకానొకప్డు తన ♦ నందనులందఱిఁ జూచి పల్కెన
వ్యలీకవిలోచనుం డభవుఁ ♦ డక్కట సంధ్యను జూచి యేను మీ
రలు వలపొంది యుత్తలపు ♦ రాపును గాంచుట కీసడించి బి
ట్టలఁతితనంబొనర్చినగె ♦ నాత్మఁగలంచెడు నద్ది పుత్రకుల్. 79

ఉ॥ ఎట్టులనైనఁ గామమది ♦ యేర్పడఁ జేయవలెన్ బినాకికి
ప్పట్టుల నాతఁడున్ వికృతి ♦ నంది యలందురె నేని యుల్ల మి
క్కట్టును బాయు నంతదను ♦ కన్నను బాయదు గొందలంబిఁకన్
గుట్టుగనట్లు గూరుచుట ♦ కున్ జతనంబు నొనర్పఁగాఁదగున్. 80

మ॥ అని దక్షాదిములౌ కుమారులకు నా ♦ త్మావస్థ తాఁ జెప్పి యం
తనె నాళీకశరున్ దలంప నతఁడున్ ♦ దారాసహాయంబుగాఁ
దనుఁజేరన్గని ధాత యుద్ధతనితో ♦ ధానుష్కమూర్ధన్య! నీ
కెనయౌ ధన్వి యొకండునున్ గలఁడొకో ♦ యీరేడులోకంబులన్. 81

ఉ॥ నీవటుసంధ్యపై మరులు ♦ నెక్కొనఁ జేయుట నేను నాసుతుల్
భావమునందుఁ దానిపయిఁ ♦ బాళినిఁ జెందినమాత్రకే శివుం
డేవముఁజెంది యందఱ ని ♦ సీ! యని చుల్కనచేసి నవ్వె నే
నావిధి బన్నమొంది యెటు ♦ లాత్మ ధరింతు సహింతు నైచ్యమున్. 32

క॥ మమ్మేటుల నీదుపుష్పశ, రమ్ములఁ గారింపఁజేసి ♦ రమణిపయిని ను
ల్లమ్మును దలకొనఁజేసితొ, యమ్మాయి నగ్గిరిశుమదికి ♦ నందింపు తమిన్.

క॥ అందనుకఁ గందుపాయదు, కొందలమునఁ గుందు మనము ♦ గోవిందసుతా!
యిందెటులైనను నీవు మ, దిం దేఁకువఁజేసి వెతను ♦ దీర్పుము మారున్. 84

గీ॥ ఇఁకను సోదర! "పితృసమో ♦ జ్యేష్ఠ" యనుచు
విబుధులాడెడు పల్కును ♦ విందువెపుడు
నాదుపనుపును బొనరించి ♦ నన్నుఁదేర్చు
టెంతయును నీకు విధియగు ♦ నింత యేల. 85

క॥ అనుడు హరినందనుఁడు విని, తనమనమునఁగొంకియును వి ♦ ధాతృనకపుడి
ట్లనె నొనరించెద నీపను, పునునైన నొకండు విను వి ♦ భూ ! పేర్మి మెయిన్. 86

క॥ నాకస్త్రము చెలువ యదియు, లేకట్టుల శివునిమదికి ♦ నెసఁగింతుఁదమిన్
జోకగుపొలఁతుక జూపుము, పీఁకన్ జని చేతు విశ్వ ♦ విభునకుఁబాళిన్. 87

గీ॥ అనిన నళినజుఁ డప్డు చిం ♦ తాకులాత్ముఁ
డై కటా ! యెవ్వతెను బంపి ♦ యభవుఁగరఁగఁ
జేయనగునంచు మదిని యో ♦ జించుచుండ
నంత నిశ్వాసమునఁ జైత్రుఁ ♦ డపుడు పొడమె. 88

క॥ ఆతఁడు సంధ్యార్కనిభుం, డాతతపీనాంసుఁ డంబు ♦ జాక్షుఁడు కామ
ప్రీతికరుఁడు మోహనుఁడై, చేతస్సంతోషమొదవఁ ♦ జేయుడు నంతన్. 89

క॥ కమ్మని మలయానిలమది, కమ్మకొనెన్ మ్రాకులెల్లఁ ♦ గడుఁ బూచియు డెం
దమ్మునను రహిని గూర్పఁగ, బమ్మయుఁ బరికించి యనియెఁ ♦ బంచశరునితో.

ఉ॥ అగ్గికి గాడ్పుపోలె విను ♦ మంబుజబాణ ! వసంతుఁడీతఁడున్
నిగ్గగు మిత్రుఁడై తనరి ♦ నీకు సహాయముసేయు నింకఁ దా
నగ్గలికన్ బొనర్పఁగల ♦ దన్నవ తెమ్మెర మాటలేటికిన్
నెగ్గుదు నిప్డు వేచనుము ♦ నీలగళాశ్రియదివ్యభూమికిన్. 91

వ. ఇంకను

గీ॥ నిన్ను వెన్నాడియీరతి ♦ నెగడుచుండుఁ, గాన మీదంపతులరహిఁ ♦ గాంచి శివుని
మనసు చెదరిన నొకనాతి ♦ మరఁగఁదలఁచు, నప్పుడేను సృజింతున ♦ ర్హాయగుసతిని.

వ. అని యనుప వల్లెయని యరవిందబాణుం డాతనిసెలవొంది రతితో వసంతమంద
మారుతులన్ గూడి హరు నన్వేషించుచుఁ జని యందు. 93

గీ॥ పూవుటంపరజోదు శం ♦ భునికిఁగట్టె, దురుగ మల్లెలమొల్లలఁ ♦ గురువకముల
సంపెఁగలనింపుగదురఁబు ♦ ష్పింపఁజేసి, జుమ్ముజుమ్మను తేంట్లగా ♦ నమ్ముఁగూర్చె.

క॥ క్రొమ్మావుల నిమ్మలఁజె, ల్వమ్ముగఁ జిగిరింపఁజేసి ♦ లలితదళగ్రా
సమ్మునఁ గోయిలగమి నొ, క్కమ్మడిఁ బంచమముఁ బాడఁ ♦ గూరిచె రహిమై! 95

క॥ గెలపండినయనఁటుల జొ, బ్బిలుపానకములఁ దనర్చు ♦ విరివగు నెలమా
వుల పండ్ల మెక్కి యుక్కసఁ, జెలఁగి వదరఁజేసె రామ ♦ చిల్కలపిండున్. 99

గీ॥ పారిజాతపువిరులఁ గ ♦ ల్వలవనంబు, లోనఁబొగడలపైఁ దావు ♦ లాని యాని
యల్లనల్లనఁజనుదెంచు ♦ పిల్లగాడ్పు, గముల శశిభూషణునియంతి ♦ కమున కనిపె.

క॥ తానును రతియు నటులకే, ళీనిరుపమహావభావ ♦ లీలాయుతులై
పూనికమై శివు గెలువన్, నానావిధ విభ్రమము లొ ♦ నర్చుచునుండెన్. 98

సీ॥ ఆ వనంబున నున్నట్టి ♦ యఖిలజంతు, జాలమది మారుక్రోవ్యాడి ♦ కోలలకుఁగ
దున్ బెగడి బీరుపోయి జో♦డులను వెదకి,కూడె నెంతయుఁగూర్ములు♦ గొనలుసాఁగ

క॥ హారుఁ డించుకేనియును మదిఁ, గరఁగక స్థిరచిత్తమునను ♦ గరువమువదనరఁ
హారువుగనుండుటఁగని వెఱ, మరుఁ డాత్మబలములతోడ ♦ మరలి దయితతోన్.

—♦ మన్మథుఁడు శివునకు మోహంబుఁ బుట్టింపలేకపోవుట ♦—

సీ॥ సత్వరముగా విరించను ♦ సముఖమునకు, నేగి ప్రణమిల్లి యిట్లనె ♦ నాగిరీశుఁ
గరఁగఁజేయుట దేవ! నా♦తరముగాదు, సిగ్గుచేటగుఁ గాదె నా♦ చెయిద మందు.

ఉ॥ నీవును నాదుతండ్రియును ♦ నిర్జరనాయకుఁ డాదిగల్గిన
ద్దేవులయట్ల కాఁదలఁచి ♦ దీనఁ గడంగితి నమ్మఁ జెందెనా
యేవపుపాట్లు భర్గునెడ ♦ నెట్టులో గండము దాఁటివచ్చితిన్
బోవిడుమయ్య నన్నిఁకను ♦ బున్నెము సర్వజగత్పితామహా! 102

క॥ నావలల కగ్గమగునోకో!, దేవాధీశానుఁ డాది ♦ దేవుం డభవుం
డోవనజోద్భవ! గడ్డిది, నీవిప్పని నెగ్గలేవు ♦ నిక్కమరయుమా! 103

క॥ గుండెలు తటతటకొట్టుకొ, నం డిల్వాడి బిక్కమొగము ♦ నన్ నుడువుమరున్
దండిగఁగని యరవిందభ, వుం డుస్సురని మదిఁ గడిఁది ♦ వొగలుచు వేగన్. 104

సీ॥ పంచశరునకు సెలవిచ్చి ♦ కించతోడఁ, బెద్దతడవు విచారించి ♦ విష్ణులోక
మేగి శ్రీధరుపదముల♦కెఱఁగి నిలువ, నలువయాకృతిఁగని మదిఁ♦ గలఁగి హరియు.

—♦ బ్రహ్మ విష్ణుమూర్తియొద్దకేగి శివునకుఁ గామోపాయం బడుగుట ♦—

ఉ॥ ఉత్తలపాటుమీఱి కడు ♦ నూర్చుచు వచ్చితివేమి ధాత! నీ
కిత్తఱి యేమి లోటాడర ♦ నేర్పడఁ జెప్పుమటన్న నాతఁడుఁ
దత్తఱమొప్పఁబల్కె నొక ♦ నాఁడల సంధ్యను బుత్రి లే నక
స్మాత్తుగఁ జూచి మోహపడ ♦ శర్వుఁడు డాసి హసించె నెంతయున్. 106

ఉ॥ అప్పటినుండి నాహృదయ ♦ మాతని కిట్టులె యొక్క చెల్వపై
దెప్పరమైన మోహమును ♦ దీగలువాఱఁగఁ జేయఁజెల్లునం
చప్పవువింటిజోదును ర ♦ యమ్మునఁ బంచిన నాతఁ డెంతయుఁ
గొప్పగ యత్నమున్ సలిపి ♦ కుందుచువచ్చెను లబ్ధిలేకయే. 107

ఉ॥ నాసుతుఁడయ్యు రుద్రుఁడటు ♦ నన్నవమానముసేయఁ జెల్లునే?
వాసియడంగె నెట్టు లల ♦ భర్గుఁడు నాసరియైనఁ గొంచెము
హ్రాసము చెందవచ్చునను ♦ భావముతోడనె యుంటి నెట్టులీ
గాసితొలంగు రుద్రునకుఁ ♦ గామము గల్గు మహాత్మ! చెప్పవే. 108

—* విష్ణుమూర్తి బ్రహ్మతో శివశక్త్యవతారంబునకై యత్నింపుమనుట *—

చ॥ అని నల చక్రపాణి నలు ♦ వా! యవివేకపథంబుఁ జెందితీ
వనఘుని లోకనాథుని మ ♦ హాత్ముని నాత్మజుఁగాఁగ నెంచి యి
ట్లనిశము గుఱ్ఱుచుంటివిఁక ♦ నామదిఁ బాయుము నీదు ప్రార్థనన్
దనయుఁడుగా జనించెను స ♦ దాశివమూర్తి జగద్ధితంబుగాన్. 109

ఉ॥ ఎవ్వని నారయంగ మన ♦ మిచ్చ్వరమున్ జనిఁబూని పెక్కునా
ళ్ళివ్వసుధన్ వియత్తలము ♦ నెంతయు మీఱుచుఁ బోవుచుం దుదిన్
గ్రొవ్వఱ నవ్వఁబొట్ల కెదఁ ♦ గొంకక వచ్చి నమస్కరించి మా
యివ్వెడఁగుం బనుల్ మది స ♦ హింపు మహేశ! యటంచు మ్రొక్కమే. 110

చ॥ మఱచితివే మహేశ్వరుని ♦ మానసమం దసమానవై భవున్
హరుని ననాదిపూరుషుని ♦ నాత్మవిహారుని స్వప్రకాశునిన్
బరమమునీంద్రవందితుని ♦ భక్తజనావనబద్ధకంకణున్
గరువము నెంది యిట్లురక ♦ కాఱులు ప్రేలఁగఁ జెల్లునే విధీ! 111

ఉ॥ ఎంతటివాఁడవీవు హరుఁ ♦ డెట్టి మహాత్ముఁడు నల్వ! నన్ను ని
న్నింతటివాండ్రఁగా సలిపె ♦ నిద్దజెనిన్ సృజియించి యీశ్వరుం
డెంతయు నీవు బాలిశత ♦ నెద్ది యెఱుంగక మోహకుండవై
పంతము నొంది యిట్లు ♦ పలుపాటులఁ జెందితి వేమి సెప్పుదున్. 112

ఉ॥ మానుము మానుమీ తెఱఁగు ♦ మంచిది కాదిఁక లోకనాథునిన్
బూని సతీసహాయునిగఁ ♦ బొందుగఁ జూడఁదలంచితేని యెం
తేని దపంబు సేయుమను ♦ మీశ్వరశక్తినిఁ గోరి దక్షునిన్
మానక యాజగన్మయి కు ♦ మారికయై జనియించు వానికిన్. 113

ఉ॥ ఆయమ యోగనిద్ర పద ♦ మాత్మవిహారిణి శంభుశక్తి తా
నాయభవున్ మహేశ్వరుని ♦ నర్థి మెయిన్ దపమొంది మెచ్చఁగాఁ
జేయును శంభుచిత్తమును ♦ జెమ్మగిలంగ నొనర్చు నెంతయున్
వేయినుడుల్ పనేమి! యిఁక ♦ విశ్వవిభున్ వరియించు రూఢిగన్. 114

చ॥ చనుమిఁక సత్యలోక మనఁ ♦ జక్కనతండును బుండరీకలో
చనునకు జోతచేసి చని ♦ సద్మము చేరి పరాంబయౌ శివన్
మనమునఁ గొల్చియంతనె కు ♦ మారుని దక్షుని బిల్చి యిట్లనెన్
ఘనతపమొంది శాంకరినిఁ ♦ గాంచిన భక్తి భజింపు మీవిఁకన్. 115

సీ॥ భక్తవత్సల పరమాత్మ ♦ శక్తి వేగ, నిన్నుఁ గరుణించి కూఁతురై ♦ నీకుఁ బౌతము
నాపె శంకరుఁ బెండ్లాడి ♦ యఖిలలోక, రక్షణం బొనరించును ♦ రాణమీఱి. 116

## —♦ దక్షుండు మహేశ్వరినిగూర్చి తపస్సొనరించుట ♦—

క॥ అని యిట్లుపదేశించి న, లిన గర్భుండనుప నట్లు ♦ లిప్సఁగాని దు
ర్గను నఖిలాజాండేశ్వరి, ననువుగఁ గొల్చుచుఁ దపించె ♦ నాతఁడు నిష్ఠన్. 117

గీ॥ పవనజగ్ధియై మూఁడువే ♦ ల్వత్సరంబు
లుగ్రతప మొనరించు డు ♦ దగ్రకరుణ
మెఱయ సాక్షాత్కరించె శం ♦ కరపురంధ్రి
దక్షుఁడును గడుముదమునన్ ♦ దనిసి చూచె. 118

సీ॥ సింగంబునెక్కి వా ♦ సిగఁబొల్చుదాని మే, ఘంబనా కృష్ణగా ♦ త్రంబుదాని
సందమా నగుమోము ♦ నలరారుదాని ర, క్తాక్తలోచనయుగం ♦ బమరుదాని
వరదాభయాబ్జాసి ♦ ధరకరంబులదాని, నిడివైనమేల్గప్పు ♦ నెఱులదాని
నొక్కపెట్టునఁగాంతు ♦ లొప్ప గుప్పెడుదాని, మదికి నానందం బ ♦ మర్చుదాని

గీ॥ సంబికను బరికించి సా ♦ ష్టాంగమెఱఁగి, మ్రొక్కి భయభక్తులమరు మే ♦ ల్పుక్కిదసర
నిట్లుసంస్తవమొనరించె ♦ నెంతయేని, నమ్రుఁడై దోయిలిని వద ♦ నమునఁ జేర్చి. 119

క॥ జగదంబికా! మహేశ్వరి!, జగదీశ్వరి! సత్కృపావి ♦ శాలా! నా కి
మ్ముగ నీ దరిసెన మిచ్చితి, వగణితకల్యాణగుణగ ♦ ణా! జోతలివే. 120

క॥ కరుణింపుము శివరూపిణి!, కరుణింపుము భక్తవరద! ♦ కరుణింపు ముమా!
కరుణింపుము భగవతి! నను, గరుణింపు మనాదిమూర్తి! ♦ కరుణింపు శివా!

## —♦ వరదేవత దక్షునకు వరంబిచ్చుట ♦—

గీ॥ ఇట్లుదక్షుఁడుస్తుతియింప ♦ నీశ్వరియుఁద, దీయమానీప్సితంబును ♦ దెలిసియునిటు
లడిగెమెచ్చితి నీతపం ♦ బడుగు నీయ,భీష్టమిచ్చెద నిక్కచ్చి ♦ తమ్మదియేని. 122

వ. అనిన దక్షుం డిట్లనియె.

చ॥ వరమున కేను నర్హమగు ♦ వాఁడనయేని భవాని! యీశ్వరే
శ్వరుఁడు విరించిపుత్రుఁడయి ♦ వాసిగ రుద్రుఁడనాఁగ బేరితోఁ
దిరముగఁ దాపసవ్రతముఁ ♦ దీర్చుచునుండెను; నీవదేల యీ
వఱకు భువిన్ జనింపవిఁక ♦ భర్గుఁడు లాఁతిసతిన్ వరించునే! 123

ఉ॥ పుట్టుము నాదుపుత్రివయి ♦ భూరితపోమయి! తాపమొంది చే
పట్టుము సర్వశంకరుని ♦ బాగుగ నందఱకున్ ముదంబు రాఁ
బట్టుము సర్వనిర్జరుల ♦ బాధ లడంగి సురుంగఁ బాప్రులన్
నెట్టు మపూర్వలీలలను ♦ నేరిమిఁ గూరుపు మంబరో! యికన్. 124

క॥ అని దక్షుఁడు గోరుడు న, ల్లనఁగి మనమందు శశిక ♦ లా భూషణునిన్
మననంబుచేసి దక్షుని, కనియెను భువనైకమాత ♦ యస్మితము చింతన్. 125

మ॥ అవునట్లే శివుఁడెప్డు లాఁతియగునన్ ♦ హర్షించి తానొందఁగా
రవికోటిప్రభు జన్మజన్మమున నే ♦ రంజించి సేవించెదన్
ధవుఁడాతండిఁక దాసినై దయితనై ♦ దైవాఱుదున్ బద్మసం
భవపుత్రా! యిఁకమీఁద నీదు సుతనై ♦ ప్రాదుర్భవింతున్ జుమీ. 126

క॥ కావింతుఁగడిఁది తపమును, సేవింతుఁ గిశోరచంద్ర ♦ శేఖరపదముల్
రావింతు నీకుఁ గీరితి, నీవింతటి తపముసేయ ♦ నెనయుజనించెన్. 127

ఉ॥ వినుము నొక్కబాసగల ♦ దయ్యది చెప్పెద నాలకింపు! నా
పైన ననాదరంబెపుడు ♦ పాయక నీమదియందుఁ జేసినో
నేనది వేగనారసి జ ♦ నిన్ విరమింపఁగఁ జేయుదాన వే
ఱొనొక జన్మమొందఁగల ♦ నారయుమీ మదియందు దూషికన్.

క॥ చనుమిఁకఁ దానక పేర్మిం, బునకు భవద్దేవిగర్భ ♦ మునఁ బుట్టెద నం
చని యంతర్ధానము చెం, దెను దక్షుండంతఁ దనదు ♦ దీమముఁ జేరెన్. 129

—* దక్షుఁడు వీరిణిన్ బెండ్లాడి మిథునసృష్టి యొనర్చుట *—

వ. అంత నతండు

ఉ॥ మానససృష్టి పెంపగుట ♦ మాని యెదోవిధమొప్పనుండ న
ద్దానివితంబు దక్షుఁడు వి ♦ ధాతకుఁదెల్పె నతండు మైథునం
బూనియొనర్ప వృద్ధియగు ♦ నుగ్మలి వీరణపుత్రి వీరిణిన్
మానక పెండ్లియాడి యల ♦ మానినితో నొనరింపు సర్గమున్. 130

క॥ అని యుపదేశింప నతం, డును వీరిణిఁ బెండ్లిఁగొని త ♦ నూజులఁ బదివే
లను హర్యశ్వాహ్వయులను, గని తపసానరించి సృష్టిఁ ♦ గావింపుఁడనెన్. 131

ఉ॥ వారలు దక్షవాక్యపరి ♦ పాలనబద్ధమనస్కులై కడున్
గూరిమి గంగ సంద్రమునఁ ♦ గూడెడుచోటికిఁ జేరి యందు వి
స్తారతపంబు సల్పుచు ని ♦ తాంతము సృష్టినొనర్ప నుండుడున్
నారద! నీవు వారలను ♦ నచ్చికమీఱఁగఁ జేరి కూరిమిన్. 132

క॥ వైరాగ్యము బోధించితి, వారసి యవ్వారు మోక్ష ♦ మర్థించి పితన్
జేరక చని రెందేనియు, నా రాజీవజతనూజుఁ ♦ డరసియు నంతన్. 133

క॥ మది వగచి మరల సృష్టిన్, బొదలిచి సబలాశ్వులనెడు ♦ పుత్రసహస్రం
బొదవింపఁజేసి వారల, కదియొవిధం బనఁజెప్పె ♦ యనిపెఁ దపసుకై. 134

సీ॥ చేరివారలు స్వర్ణదీ ♦ సింధుసంగ, మానసనిని సట నారాయ ♦ ణాఖ్యసరసి
యందు జలమాడి తపముసే♦యంగ నప్పుడు, నీవు వారికి విజ్ఞాన ♦ నియతిఁ గఱప.

క॥ వారును దొలివారివలెన్, మీఱి జనక శాసనంబు ♦ మెలఁగునతోడన్
బారమహంసవ్రతమునఁ, జేరిరి మోక్షైకహర్మ్య ♦ శిఖరాగ్రంబున్. 136

సీ॥ దక్షుఁడునుగొన్ని నాళ్ళకుఁ ♦ దనయులెల్లఁ, గలహభోజను బోధక♦గ్గమయి ముక్తిఁ
జెందుటారసి పెన్వగఁ ♦ జెందియుండి, పేరటల్కతో శాపంబుఁ ♦ బెట్టె మునికి. 137

ఉ॥ ఓరి దురాత్మ! నాసుతుల ♦ నొక్కనినైనను దక్కకుండఁగా
నేరిమి వారలంపఱికి ♦ నేర్పితివౌర! యతీంద్రచర్య న
వ్వారలు ముగ్ధులై యకట! ♦ పాసిరి నన్నిఁకఁ బాపలాత్మతన్
వీఱేఁడివోలె నెప్పుడు భ ♦ విన్దిరుగాడెదుగాక నీవిటుల్. 138

ఆ॥ అణఁగిమణఁగియుండ ♦ కౌరివేరము లేక, చుట్టపక్కము నెడు ♦ పొరిది లేక
క్రిందుమీఁదుఁగనక ♦ మ్రిందించితివి సంతుఁ, బోరునీకుఁదీర్పు ♦ పోట్లమంట. 139

ఆ॥ ఇల ఋణత్రయంబు ♦ నెవ్వఁడుదీర్పక, శైశవంబునందె ♦ సన్న్యసించు
నట్టివానికెప్పు డమరవి ♦ హాపరంబు, లాత్మపదమునొంద ♦ కార్తిఁజెందు. 140

ఆ॥ ఎట్టులున్న నీకు ♦ నేమిర! పిలిచియుఁ, దలఁచి యెఱుఁగ నిన్నుఁ ♦ గలహకారి!
కొడుకులేనినిన్నుఁ ♦ గోరిరా! యెఱుకకై, యుడుము కేటికోరి? ♦ యనూరివార్త.

సీ॥ అనుచు నిను మఁని శపియించి ♦ యంతనాడు
తనయుఁ డాండ్రను సృష్టింపఁ ♦ దలచి పెక్కు
కన్యకల వీరిణీదేవి ♦ గర్భమందుఁ
బుట్టఁగాఁజేసి కశ్యప ♦ ముఖులకిచ్చి. 142

వ. అనంతరంబు

చ॥ మును శివ కూఁతురై తనకుఁ ♦ బుట్టెడునట్లు వరంబొసంగెఁ గా
వునఁ జతురాననాత్మజుఁడు ♦ పుణ్యతపోమయి నామహేశ్వరిన్
మనమునఁ దల్చ నాపెయు స ♦ మగ్రకళల్దనరంగ దక్షు నె
మ్మనమునఁ జేరె నాతఁడును ♦ మానిని వీరిణిఁ జేర్చెఁ దేజమున్. 143

ఉ॥ వీరిణియున్ బరాంబిక య ♦ భీక్ష్ణతరోజముఁ దాల్చి రాజిలెన్
శ్రీరమణాదినిర్జరులు ♦ చిన్మయి దక్షవధూదరంబునన్
జేరుట యంతనారసి భ ♦ జించిరి ధ్యానశతమ్ములొప్ప న
వ్వారిజగర్భజుండు మదిఁ ♦ బండువునొందుచునుండె దండిగన్. 144

## —✽ దాక్షాయణీ జననము ✽—

మ॥ శుభతారాగ్రహలగ్నవేళ దురిత ♦ క్షోభంబుగా వీరిణీ
విభుచిత్తమ్ము ప్రమోదమొంది యరలన్ ♦ విశ్వైకవంద్యాత్మ సా
రభముల్ గుప్పజనించె వీరిణి సుగ ♦ ర్భంబందు బృందారకుల్
శుభనిక్వాణములన్ బొనర్చిరి కడున్ ♦ సొంపొప్పఁ బూవృష్టియున్. 145

గీ॥ అపుడు దక్షుఁడు జగదంబ ♦ నరసి మ్రొక్కి
దోయిలొగ్గుచు నిట్లుసం ♦ తోసమునను
బలికె మ్రొక్కెద జగదంబ! ♦ పరమశక్తి!
కరుణ సల్పు మహాదేవి! ♦ కలుషహంత్రి! 146

ఆ॥ ఏమెచేత ధాత ♦ యీజగన్నిర్మాణ, కృతిని యుక్తుఁడగుచు ♦ సతమొనర్చు
నట్టిభువనధాత్రి ♦ వగుమహేశ్వరి! నిన్నుఁ, గొలుచువాఁడఁగూర్మి ♦ కొనలుసాగ.

ఆ॥ ఏకెచేతఁ జక్రి ♦ యీరేడుజగముల, నేలఁగా నియోగ ♦ లీలనొంది
యట్లె సలుపుచుండె ♦ నట్టిజగద్ధాత్రి, నమ్మహేశ్వరిని న ♦ నాదిఁ గొలుతు. 148

ఆ॥ ఏమెచేత రుద్రుఁ ♦ డీజగత్సంహృతి, క్రియ నియుక్తుఁడగుచు ♦ రయముమీఱ
సలుపుచుండె నట్టి ♦ సర్వజగన్మయి, నమ్మి కొలుతు నేన ♦ నారతంబు. 146

గీ॥ దక్షుఁడిట్టుల స్తుతియింపఁ ♦ జాఁబరాంబ, దక్షుఁగని యిట్లుపల్కెను ♦ దారచరిత
నీకువరమిచ్చినట్టుల ♦ నే జనించి, తిని గ్రహింపు తపోమయ ♦ దీప్తులమర. 150

వ. అనిపలికి యాత్మమాయా విశేషంబునఁ జిఱుత బాలికయై రోదనంబుఁ జేసిన జనయిత్రి మున్నగు శుద్ధాంత వధూజనంబులెల్ల బాలనుజూచి హరుసంబునఁ బొంగిపొరలిరి. దక్షుండును గులాచారప్రకారంబు బ్రాహ్మణులకు దానంబులును లాఁతులకు ధనంబులును బంచిపెట్టి యుమయనియు సతీదేవియనియు నామకరణంబుఁజేసె. నృత్తగీతవినోదంబు లొక్కయెత్తుగ నొనర్పఁబడియె నపుడు హరిబ్రహ్మాదులు దారసించి పరమేశ్వరిని సేవించి చనిరంత.

క॥ దక్షప్రజాపతికి సుత, యై క్షితి జన్మంబునొంది ♦ నట్టికతమునన్
దాక్షాయణి యనునాహ్వాయ, మక్షీణతపోనిధాన ♦ మాపె ధరించెన్. 152

క॥ అల్లారుముద్దుగాఁ దమ, ఖుల్లాసముమీఱఁ బొడమి ♦ యుద్యత్కాంతుల్
జల్లెడు నిందీవరఘృణిఁ, దల్లియుఁ దండ్రియును గాంచి ♦ తనిసిరిమిగులన్. 153

క॥ సితపక్షశశికలాకృతి, నతిశయముగ దినముదినము ♦ నరుదుగఁబొదలెన్
సతి యోగవిద్యశాంకరి, యతిరుచిరమనోజ్ఞమూర్తి ♦ యగుచు ముదమునన్.

వ. అంత నొక్కనాఁ డక్కలికిమిన్న.

గీ॥ చేరివారలు స్వర్ణదీ ♦ సింధుసంగ, మాననిని సట నారాయ ♦ ణాఖ్యసరసి
యందు జలమాడి తపముసే♦యంగ నపుడు, నీవు వారికి విజ్ఞాన ♦ నియతిఁగఱప.

కం॥ వారును దొలివారివలెన్, మీఱి జనకశాసనంబు ♦ మెలఁకువతోడన్
బారమహంసవ్రతమునఁ, జేరిరి మోక్షైకహర్మ్య ♦ శిఖరాగ్రంబున్. 136

గీ॥ దక్షుఁడునుగొన్ని నాళ్ళకుఁ ♦ దనయులెల్లఁ, గలహభోజను బోధక♦గ్గమయి ముక్తిఁ
జెందుటారసి పెన్వగఁ ♦ జెందినుండి, పేరుటల్కతో శాపంబుఁ ♦ బెట్టె మునికి. 137

ఉ॥ ఓరిదురాత్మ! నాసుతుల ♦ నొక్కనినైనను దక్కకుండఁగా
నేరిమి వారలందఱికి ♦ నేర్పితివౌర! యతీంద్రచర్య న
వ్వారలు ముగ్ధులై యకట! ♦ పాసిరి నన్నిఁకఁ బాపలాత్మతన్
వీఱిఁడివోలె నెప్పుడు భ ♦ విన్ దిరుగాడెదుగాక నీవిటుల్. 138

ఆ॥ అణఁగిమణఁగియుండ ♦ కారివేరములేక, చుట్టపక్కమునెడు ♦ పారిది లేక
క్రిందుమీఁదుఁగనక ♦ మఱిందించితివి సంతుఁ, బోటునీవుఁదిర్పు ♦ పొట్టనుంట. 139

ఆ॥ ఇల ఋణత్రయంబు ♦ నెవ్వఁడుదీర్పక, శైశవంబుసంచె ♦ సన్న్యసించు
నట్టివానికెప్పు డమరవి ♦ హాపరంబు, లాత్మపదమునొంద ♦ కార్తిఁజెందు. 140

ఆ॥ ఎట్టులున్న నీకు ♦ నేమిర! పిలిచియుఁ, దలఁచి యొఱుఁగ నిన్నుఁ ♦ గలహకారి!
కొడుకులేనినిన్నుఁ ♦ గోరిరా! యొఱుకకై, యుడుము కేటికోరి? ♦ యనాగివార్త.

గీ॥ అనుచు నిను మౌని శపియించి ♦ యంతనాదు
తనయఁ డాంద్రను సృష్టింపఁ ♦ దలచి పెక్కు
కన్యకల వీరిణీదేవి ♦ గర్భమందుఁ
బుట్టఁగాఁజేసి కశ్యప ♦ ముఖులకిచ్చి. 142

వ. అనంతరంబు

చ॥ మును శివ కూఁతురై తనకుఁ ♦ బుట్టెదునన్న వరంబొసంగెఁ గా
వునఁ జతురాననాత్మజుఁడు ♦ పుణ్యతపోమయి నామహేశ్వరిన్
మనమునఁ దల్ప నాపెయు స ♦ మగ్రకళల్దనరంగ దక్షు నె
మ్మనమునఁ జేరె నాతఁడును ♦ మానిని వీరిణిఁ జేర్చెఁ దేజమున్. 143

ఉ॥ వీరిణియున్ బరాంబిక య ♦ భీక్ష్ణతరోజముఁ దాల్చి రాజిలెన్
శ్రీరమణాదినిర్జరులు ♦ చిన్మయి దక్షవధూదరంబునన్
జేరుట యంతనారసి భ ♦ జించిరి ధ్యానశతమ్ములొప్ప న
వ్వారిజగర్భజుండు నుదిఁ ♦ బండువునొందుచునుండె దండిగన్. 144

—* దాక్షాయణీ జననము *—

మ॥ శుభతారాగ్రహలగ్నవేళ దురిత ♦ క్షోభంబుగా వీరిణీ
విభుచిత్తమ్ము ప్రమోదమొంది యురలన్ ♦ విశ్వైకవంద్యాత్మ సా
రభముల్ గుప్పజనించె వీరిణి సుగ ♦ ర్భంబందు బృందారకుల్
శుభనిర్వాణములన్ బొనర్చిరి కడున్ ♦ సొంపొప్పెఁ బూవృష్టియున్. 145

సీ॥ అపుడు దక్షుఁడు జగదంబ ♦ నరసి మ్రొక్కి
దోయిలొగ్గుచు నిట్లుసం ♦ తోసమునను
బలికె మ్రొక్కెద జగదంబ! ♦ పరమశక్తి!
కరుణ సల్పు మహాదేవి! ♦ కలుషహంత్రి! 146

ఆ॥ ఏమెచేత ధాత ♦ యీజగన్నిర్మాణ, కృతిని యుక్తుఁడగుచు ♦ సతమొనర్చు
నట్టిభువనధాత్రి ♦ వగుమహేశ్వరి! నిన్నుఁ, గొలుచువాఁడఁగూర్మి ♦ కొనలుసాగ.

ఆ॥ ఏకెచేతఁ జక్రి ♦ యీరేడుజగముల, నేలఁగా నియోగ ♦ లీలనొంది
యుల్లె సలుపుచుండె ♦ నట్టిజగద్ధాత్రి, నమ్మహేశ్వరిని న ♦ నాదిఁ గొలుతు. 148

ఆ॥ ఏమెచేత రుద్రుఁ ♦ డీజగత్సంహృతి, క్రియ నియుక్తుఁడగుచు ♦ రయముమీఱ
సలుపుచుండె నట్టి ♦ సర్వజగన్మయి, నమ్మి కొలుతు నేన ♦ నారతంబు. 146

గీ॥ దక్షుఁడిట్టుల స్తుతియింపఁ ♦ దాఁబరాంబ, దక్షుఁగని యిట్లుపల్కెను ♦ దారచరిత
నీకువరమిచ్చినట్టుల ♦ నే జనించి, తిని గ్రహింపు తపోమయ ♦ దీప్తులమర. 150

వ. అనిపలికి యాత్మమాయా విశేషంబునఁ జటుత బాలికయై రోదనంబుఁ జేసిన జనయిత్రి మున్నగు శుద్ధాంత వధూజనంబులెల్ల బాలనుజూచి హరుసంబునఁ బొంగిపొరలిరి. దక్షుండును గులాచారప్రకారంబు బ్రాహ్మణులకు దానంబులును లాఁతులకు ధనంబులును బంచిపెట్టి యుమయనియు సతీదేవియనియు నామకరణంబుఁజేసె. నృత్తగీతవినోదంబు లొక్కయెత్తుగ నొనర్పఁబడియె నపుడు హరిబ్రహ్మాదులు దారసించి పరమేశ్వరిని సేవించి చనిరంత.

క॥ దక్షప్రజాపతికి సుత, యై క్షితి జన్మంబునొంది ♦ నట్టికతమునన్
దాక్షాయణి యనునాహ్వాయ, మక్షీణతపోనిధాన ♦ మాపె ధరించెన్. 152

క॥ అల్లారుముద్దుగాఁ దమ, కుల్లాసముమీఱఁ బొడమి ♦ యుద్యత్కాంతుల్
జల్లెడు నిందీవరఘృణిఁ, దల్లియుఁ దండ్రియును గాంచి ♦ తనిసిరిమిగులన్. 153

క॥ సితపక్షశశికలాకృతి, నతిశయముగ దినముదినము ♦ నరుదుగఁబొదలెన్
సతి యోగవిద్యశాంకరి, యతిరుచిరమనోజ్ఞమూర్తి ♦ యగుచు ముదమునన్.

వ. అంత నొక్కనాఁ డక్కలికిమిన్న.

ఉ॥ కుంచెయు రంగులున్ బలుకఁ ♦ గూరిమినొంది మహేశ్వరాకృతిన్
మంచిగ దిద్దివ్రాసి యస ♦ మానముదంబెసలారఁ బూజగా
వించి శివానుకంప కెద ♦ వీక్షణ సేయుచు వింతవింతగాఁ
బంచమసుస్వరం బమరఁ ♦ బాడె విపంచిక మీటుచున్ లలిన్.

## —* సతీదేవి నందావ్రతంబు సేయుట *—

వ. అంతనయ్యంబిక బాల్యంబుఁ బోవిడిచి శివపాణిగ్రహణంబుఁ గోరి నందావ్రతంబు సేయంగడంగి యాత్మజనకానుమతితో నాశ్వయుజ ప్రతిపత్తునందు నభవుని సలవణంబులగు గుడోదనంబులఁ బూజించి కార్తికచతుర్దశియందు శివునిఁ బాయసాపూపంబులనర్చించి మార్గశీర్షబహుళాష్టమియందుహరుని సతిలయవోదనంబుల నర్చించి పౌషశుద్ధ సప్తమియం దుషస్సున * కృసరాన్నంబున మహేశ్వరుఁగొల్చి రేయి జాగరణంబొనర్చి మాఘపూర్ణిమయందు నదీతీరంబున శంకరపూజనం బొనర్చె, ఫాల్గునబహుళ చతుర్దశియందు రేయి నాలుగుజాముల శైలూషంబులఁ బూజించి జాగరణంబొనర్చె, చైత్రశుద్ధ చతుర్దశియందు రేఁ బగలు శివునిఁ బలాశదమనంబులను బూజించె వైశాఖశుద్ధ తృతీయ రుద్రుని సతిలయవోదనంబుల నర్చించె. జ్యేష్ఠపూర్ణిమా రాత్రియందుత్తరేణి పుష్పంబులచే వస్త్రంబులచే శర్వునిఁబూజించి యాషాఢశుద్ధ చతుర్దశియం దుత్తరేణి విరులచేఁ గృష్ణవస్త్రంబులతో రుద్రునిఁబూజించె శ్రావణ శుద్ధాష్టమీ చతుర్దశులందు దర్భలచే యజ్ఞోపవీత వస్త్రంబులతో భర్గునిఁబూజించి భాద్ర కృష్ణత్రయోదశియందు నానావిధ పుష్పఫలములచే శంకరునిఁబూజించి జలాహారయై దర్శాంతంబుగ శివార్చనం బొనర్చుచు వత్సరంబిట్లు నందావ్రతంబు నిష్ప్రత్యూహంబుగ నొనర్చుచుండుడు.

ఉ॥ తాపసరాట్టుఁ డప్పుగిది ♦ దక్షతనూజ వ్రతంబుఁ జేయుచున్
సోమకలాధరున్ దనమ ♦ నోవిభుఁగాఁగ వరించి యుండుటన్
దా ముదమొప్ప నారసి హి ♦ తమ్ముగ శంకరుపాలికేగి యా
సోమనిభాస్య దక్షసుత ♦ చొప్పఖిలంబు వచించెఁ బ్రేముడిన్. 157

శా॥ నీకై జన్నియఁగట్టె నంట ! సురరా ♦ జ్ఞీకోటు లాదివ్యనా
రీకాక్షిన్ సతిఁ బోటికై యెదురఁగా ♦ లేరంట ! నందావ్రతం
బాకన్యామణి నిన్నుఁ గూరిచియె తా ♦ నవ్యాజభావంబునన్
లోకుల్ మెచ్చ నొనర్చు చుండెనఁట ! యా ♦ లోలాక్షి వీక్షింపుమా ! 158

---

* టిప్పణి : కృసరాన్నము - పులగము.

క॥ బాలసుమీ! హిమకరశిశు, ఫాలసుమీ! యోగలబ్ధ ♦ పరమార్థత్వా
పాలసుమీ! రచితజగ, న్మాలసుమీ! నీయుఱుతకు ♦ మణిమాలసుమీ! 159

చ॥ చనుమిఁక దక్షకన్యకని ♦ శాంతముఁ జేరి వరంబొసంగి వే
గనె కరపీడనం బమరఁ ♦ గా గ్రహియింపు మహాత్మ! భక్తరం
జనమునె యెల్ల ప్రొద్దులను ♦ సల్పుటకే యిటురూపు నొందినా
వనఘచరిత్ర! యాపె భవ ♦ దర్చనయం దభియుక్త భక్తయా. 160

గీ॥ అని హరివచింప విని శివుం♦ డాదరమున, నప్పటికిమున్నె సతివ్రతం♦బాత్మ నెఱిఁగి
యున్నకతమునహరినన్ని♦ యురుతరకరు, ణాఢ్యుఁడై సతియున్నహ♦ర్మ్యమునకరిగె.

క॥ సతియును నిట్టుల నందా, వ్రతము ననుష్ఠించి శివుని ♦ వదలక పూజో
న్నతి సప్తమిఁ బస్తుంగొని, యతినిష్ఠన్ నవమియందు ♦ నర్చనచేసెన్. 162

## ♦ సతీదేవికి శివుఁడు ప్రత్యక్షమగుట ♦

క॥ పూజావసానముననే, యాజగదీశ్వరుఁడు మంగ ♦ ళాకారుండై
యా జైవాతృకముఖ కవు, డోజన్ దరిసెనము నొసఁగె ♦ నూర్జితకరుణన్. 163

ఉ॥ అందములైతనర్చు నిఖి ♦ లావయవమ్ములవానిఁ జందురున్
గిందురు మారుఁ గేరు నొక ♦ క్రేవమీఱెడు సౌరువాని నొ
ప్పొందగు సుందరీమణుల ♦ పొందికచూడ్కుల లాగి మూఁగఁజే
యందగువాని శంకరుని ♦ నాయరవిందజపౌత్రి గన్గొనెన్. 164

చ॥ కని నునుసిగ్గునన్ జరణ ♦ కంజములన్ నుదురుంచి మ్రొక్కివే
గనె భయభక్తు లెంతయును ♦ గ్రమ్మికొనన్ వెడగాఁగ నిల్చినన్
గనుఁగొని చంద్రశేఖరుఁడు ♦ కల్కిరో! మెచ్చితి నీవ్రతంబు ని
త్తును వరమద్ది నీమదికిఁ ♦ దోఁచినయట్లు రుచించినట్టులన్. 165

గీ॥ తెలిసియుండియుఁ దెలియన♦ట్టుల విభుండు, దనదుపల్కు వినన్గోరి♦తన్ను నడుగ
మురిసి సిగ్గున మ్రాన్పడి ♦ తెఱవయున్న, చంద మెంతయుఁగని మది ♦ సంతసించి.

క॥ మరల వరమడుగుమంచును, దరుణేందుధరుండు సతినిఁ ♦ దడయక యడుగన్
గరిరాజయాన సిగ్గును, మరలిచియనె దేవ! యిమ్ము ♦ మరలనివరమున్. 167

చ॥ అనియడుగన్ శివుండు మది ♦ నారసి యింట్లనె నాకు భార్యవై
యొనరుము సుందరీ! యనుడు ♦ నుక్తినిఁ దావిని దక్షపుత్రి నె
మ్మనమున గోరినట్టులెయ ♦ మర్చిన శంకరు ప్రక్కనిల్చి యా
వననిజహావభావముల ♦ వాసిదనర్పఁగఁ జేయనెంతయున్. 168

గీ॥ తరుణ శృంగారమూర్తులై ♦ తనరియున్న
వారి నిరువురఁజూడ న ♦ భ్రంబునందు
జెలఁగు చిత్రాశకులజతల్ ♦ దెలుపుచుండి
రరుస మొనగూర్చు మదికి నా ♦ యందుబాటు. 169

సీ॥ స్ఫటికమణిమయమూర్తియా ♦ శంభుదండ, స్నిగ్ధభిన్నాంజనద్యుతి ♦ శివదలిర్ప
నిండుచందురు వెనుకొని ♦ నీటుమీఱి, యున్న ఘనరేఖవోలె నం ♦ దొప్పియుండె.

## —♦ శివుఁడు సతీదేవికి వరంబిచ్చుట ♦—

ఆ. అంత దక్షపుత్రి ♦ యంజలి జోడించి, యనియె దేవదేవ! జనకునడిగి
నన్ వివాహవిధిద ♦ నర్పఁజేకొనుమన, నింపుమీఱ వరదుఁడీయకొనియె. 171

వ. మఱియు

క॥ అనియె నొకబాసచేసెద, విను సతి! నావచనమం ద ♦ విశ్వాసము నీ
మనమున నెపుడే నొదవిన, మననిద్దఱఁ బాపనోపు ♦ మానకయదియున్. 172

క॥ ఇటులాడి కాలుసాఁగక, యెటులోపయనంబుఁ జేసి ♦ యేగెను శివుఁడం
తట దాక్షాయణి పితలను, జటులగతిన్ దఱిసిచెప్పె ♦ శంకరువరమున్. 173

వ. అనంతరంబున శివుండు సరస్వతీ సహాయంబుగఁ జతుర్ముఖున్ దలఁపుడు సతం డట్లు విచ్చేయ సతీవ్రతంబు తెఱఁగు నాపె కభీష్టవరదానంబు నొసంగుటయు దెలిపి తద్వివాహార్థంబు దక్షునుద్బోధింపఁ బంచిన నాతండలరిచని సభాసమే తుండగు దక్షునిన్ జేరి యిట్లనియె. 174

చ॥ కొమరితనిమ్ము రుద్రునకుఁ ♦ గోమలిచేసిన సద్వ్రతంబు న
ర్సము సమకూరమెచ్చియె వ ♦ రంబొసగెన్ సతిఁగాఁగొనన్ శివుం
డమరె మనంబులందు ముద ♦ మగ్గలమై సిరిమీర సర్వయ
త్నములను సల్పివేగిరము ♦ దక్ష! యొనర్పు వివాహమీనికన్. 175

క॥ అనియుపదేశించిన నలఁ, డును నోమునిపల్కు ద్రుహిణుఁ ♦ డును శుభలగ్నం
బును నేరుపఱచి శంకరుఁ, గొనితేరన్ మరలఁ గదలె ♦ గోర్వ్యాకడకున్. 176

గీ॥ చని మహేశ్వరునకు మ్రొక్కి ♦ సత్వరముగ
దరలి రమ్మనెఁ బెండ్లికై ♦ తనయనిచ్చు
నాదుతనయుండు దక్షుఁ డ ♦ నాదిపురుష!
వేగ నీజనములతోడ ♦ వెడలు మటకు. 177

క॥ అని చెప్పుట కభవుఁడు ముద, మునుజేకొని నారదు ముని ♦ ముఖ్యుఁదలఁపవే
గనె నతఁడు సేరవచ్చినఁ, జనవలెఁబెండ్లాడ దక్షు ♦ సదనంబునకున్. 178

ఉ॥ నీవు మరీచి మున్నగుము ♦ నిప్రవరోత్తములన్ సదారులన్
శ్రీవిభునిన్ రమన్ నిఖిల ♦ సిద్ధసురాసురదివ్యవర్గమున్
నావచనంబుగాఁ బిలిచి ♦ నాదుగణంబులతోడఁ బెండ్లికిన్
రావలెనన్న నాతఁడు గ ♦ రంబు ప్రమోదముఁజెంది యట్టులన్. 179

ఆ॥ ప్రభునినుడుగుకన్న ♦ పైపెచ్చుగానెల్ల, వారిఁబిలువ నెల్ల ♦ వారువచ్చి
పెండ్లిపనులనెల్లఁ ♦ బేర్మిమైనొనరించి, పయనమెటుకసేయ ♦ భర్గుఁడపుడు. 180

కం॥ అలఘుననడ్వాహముపై, లలితగతిన్ గూరుచుండి ♦ లక్షల్కోట్లా
బలములు ముందును వెనుకను, జెలఁగఁగ దక్షునిపురంబుఁ ♦ జేరెరయమునన్.

## —* సతీశివవివాహము *—

ఉ॥ దక్షుఁడుచేరవచ్చి ప్రమ ♦ దంబున నందఱ గారవించి వి
శ్వాక్షున కమ్మహేశ్వరున ♦ కర్థిమెయిన్ వరపూజఁ జేసి తా
నక్షయభాగ్యయుక్తమగు ♦ నాత్మగృహంబును జేర్చి యందుఁ బ
ద్మాక్షిని నాత్మపుత్రికను ♦ నార్యను దెచ్చి కరంబుప్రీతితోన్. 182

గీ॥ గ్రహబలాన్వితశుభలగ్న ♦ కాలమరసి
విధివిధానముగా విశ్వ ♦ విభునకొసఁగి
హరుసమును జెందె బాలేందు ♦ ధరుఁడు దక్ష
పుత్రి పాణిగ్రహణమొంది ♦ మురిసె మిగుల. 183

గీ॥ అట్లు పరిణయమాడిన ♦ యాదిదంప
తులను గని వేల్పులెల్లరు ♦ నలరి యలరు
వృష్టిఁగూర్చిరి యచ్చర ♦ వెలఁదులాడి
పాడిరి సువాద్యములు మ్రోసెఁ ♦ బలురకముల. 184

వ. అంత శివానుమతితో విరించి యజ్ఞశాలకడకు నూత్నదంపతులఁగొని చని యగ్ని ప్రతిష్ఠం బొనరించి విధిప్రకారంబు హోమంబు నెఱవేర్చి ప్రదక్షిణంబు నొనర్పఁజేయుచున్నంతఁ బరమశివమాయచే దక్షకన్యకాచరణాబ్జంబు నిరీక్షించి పంచశరపీడితుండై చూడ్కి మరల్పలేకున్నంతఁ దత్రత్యులెల్ల రక్కజపడఁగాంచి మించుటల్కతోఁ బంచాస్యుండు విరించనుఁబొడువఁజూడుడు నెల్లరు హాహాకారంబులుచేసి యబ్జసంభవు మహాపరాధంబును మన్నింపుమని శివుని బ్రసన్నుఁ బొనర్చిరపుడు ద్రుహిణునకు రేతఃపాతంబై యందుఁ బుష్కలావర్తకద్రోణసంవర్తకము లనెడు మేఘంబు లుత్పన్నంబులై శివాజ్ఞతో వినువీథిఁ జేరియుండె నంతఁ జతుర్ముఖుండు వినీతుండై పరమేశ్వరాంఘ్రులఁబడి క్షమనువేడఁ బరమేశ్వరుండు గరుణించి ప్రసన్నుండయ్యె నంత నళినజుం

డవశేషంబును దీర్చుడునంత సతీశివులేకాసనంబునఁ గూరుచుండి రపుడు విష్ణ్వాది సకలసురలును దివ్యప్రమథ భూతగణంబు లవ్వారికిఁ బ్రణమిల్లి యానందించి రంత నమ్మఱునాఁడు దక్షునకుఁ బయనంబెఱిఁగించి మహేశ్వరుండు సతితో దేవగణంబులుగొల్వఁ గైలాసంబుఁ బ్రవేశించి యందఱకు సముచిత గౌరవంబు లొనర్చి యాహూతులనందఱ వారియాలయంబుల కనిపి నందీశ్వరుని హజారంబు వాకిటనునిచి సతీదేవితో నభ్యంతరగృహంబుఁ బ్రవేశించె నీసతీమహేశ్వర వివాహచరితంబు నెవ్వరాకర్ణించినఁ జదివిన నవ్వారి కైహికాముష్మిక ఫలంబు లొదవునని సూతుండు శౌనకాదులకుఁ జెప్పినయంత నవ్వారవ్వలికథ నెఱిఁగింపు మనుటయు సూతుండిట్లనియె. 185

—*॥ స తీ శి వ వి హా ర ము లు *—

క॥ పరమేశ్వరుండు సతితో, నురుమోదంబమర సురత ♦ మొందెను బలువ
త్సరములు నిముసములట్టులఁ, బరిశీలనసేయరాని ♦ పగిదిగనమరన్. 186

మ॥ వనపుష్పంబుల హారముల్ నిజవధూ ♦ వక్షంబునన్ వైచు భా
మిని యుద్దంబును జూచికొన్నపుడు బే ♦ ర్మిన్ డాసి తానున్ విలో
కనసేయున్ రవలొప్ప కమ్మలను వే ♦ గన్ దీయు వేవేయు నే
మినుడిన్ జెప్పినయన్ జెవిన్ దరిసియే ♦ మేలొందఁజెప్పన్ రహిన్. 187

గీ॥ సతియుతరవస్తువులఁజూచు ♦ చందమరసి, వెనుదెసనుడాసియాశ్లేష♦మునుబొనర్చ
చకితయైవ్యాకులమున వె ♦ నుకకుఁజూడ, నలఁతినవునగి ముద్దాడు ♦ నామెమోము.

గీ॥ పసిఁడితామరమొగ్గల ♦ పగిదిమెఱయు, భామచనుదోయిఁ గస్తూరి ♦ పంకములఁది
తేఁటిబ్రవ్రాలిన చెలువంపు ♦ తీరొనర్చి, చూడుమిది సుందరీ! యని ♦ చూపిముఱియు.

క॥ కలికిచనుదోయిఁ గ్రాలెడు, చెలువపు ముత్యాలదండఁ ♦ జేకొని ప్రీతిన్
గలయన్ గనినట్టులఁగని, యులరుచు నచ్చటనెచేర్చు ♦ నంతనెమరలన్. 190

గీ॥ కడఁగి కెంపులవంకీలు ♦ కడియములను
మేల్మిమొలనూలు విడదీసి ♦ మెచ్చుగులుకఁ
దానె యమరించుఁ బలుమాఱు ♦ తమినిఁ బలుర
కముల విరులనుదెచ్చి చొ ♦ క్కైము నమర్చు. 191

గీ॥ ఇప్పగిదిఁజెల్వతోఁగూడి ♦ యీశ్వరుండు, రాతిరియుఁబవలునురాగ♦రంజితుఁడయి
ఇంతినెడఁబాయకెంతయు♦ సంతసమున, నున్నఁగాముఁడుగొలుచుచు♦ నుండెవారి.

వ. కొన్నివందల సంవత్సరంబులమీఁద.

క॥ హరుఁడంత శీతశైలము, స్మరియించి బిరానవటకు ♦ సతితోఁ జని యం
దురమైన శిఖరతలమున, నిరవొప్పఁగ నుండె నొంత ♦ యేనిఁ బ్రియమునన్.

క॥ అంపలిమ్రాకులు తీవియ, లందముగఁ జిగిర్చిపూచె ♦ నలదీర్ఘికలున్
బొందామరలన్ గలువలఁ, బొందుగ వికసింపఁజేసెఁ ♦ బుష్పశరాజ్ఞన్. 194

క॥ గందపు మ్రాకులపై నర, విందమ్ములపయినిఁ గుంద ♦ బృందమ్ములపైఁ
జిందుమరందము లొందుచు, మందసమీరములు శివుల ♦ మదులలరించెన్. 195

సీ॥ సంజకెంజాయలఁ ♦ జానగు చందురుఁ, బురణించుపాలాశ ♦ పుష్పతతులు
కందర్పకేతు ల ♦ నందగు నాగకే, సరమహీజాతప్ర ♦ సవవితతులు
అలపవమానున ♦ కామోదమిడి మేల్మి, భాసిలుచున్న ల ♦ వంగలతిక
లమ్మరుబలముల ♦ కమరబోనంబిచ్చి, యలరెడు నెలమావు ♦ లందమైన
గీ॥ కొలఁకులందలి యుదకముల్ ♦ గలఁకలేక
వికచకమలోత్కరంబుల ♦ వెలసి జోతు
లను వెలుంగఁగఁజేయుచు ♦ మునుల మనము
లను దలంపఁగఁజేయుచుం ♦ డెను విరివిగ. 196

క॥ చందురుఁడు నాల్గుజాలఁ బ, సందుగ వెన్నెలలునించి ♦ సంబరమొదవన్
విందొనరింప విభావరు, లుం దద్దయు నొడికమగు చె ♦ లువుసూపెసిరిన్. 197

ఉ॥ అట్టిసుఖాఢ్యమైన సమ ♦ యమ్మున శంకరుఁ డాత్మదార నా
గట్టుపయిన్ నికుంజముల ♦ గాంగతటంబుల నేటిలంకలన్
నెట్టన మీఱి భోగముల ♦ నెక్కొని యుక్కుననొందుచుండెఁ దా
నిట్టలమైన బాళి విభుఁ ♦ డెట్టులనట్టుల నొప్పె నాపెయున్. 198

గీ॥ సతిముఖేందుసుధాపాన ♦ సమ్మదమున, రమణీయాననసౌరభ ♦ గ్రహణమునను
చెలువయందంపుఁ బేర్మికి ♦ లలితశీల, మునకు శివమదకరి గట్టుఁ ♦ బొందెసతము.
క॥ పలుకులఁ జూపుల మేల్చె, య్యూల హాస్యాలాపములను ♦ నుడురాజధరుం
డలరించుచు దాక్షాయణి, కెలన నెడన్ బాయకుండుఁ ♦ గేళీరతుఁడై. 200

## —* ప్రావృట్కాల వర్ణనము *—

వ. ఇట్లు మహేశ్వరుండు గొంతకాలం బోషధిప్రస్థంబునందు సతీదేవితో విహా
రంబు లొనర్చుచున్నంతఁ బర్జన్యకాలాగమంబగుడు నొక్కనాఁ డమ్మహాదేవి
విభున కిట్లనియె. 201

శా॥ ప్రాణేశా ! కనుగొంటివే యుడురుసీ ♦ ప్రావృడ్గతిఁ మేఘని
క్వాణంబుల్ భయదంబులై తనరె రం ♦ గత్తుంగశృంగాళిఁ బ్రి
క్వాణాటోపముతోఁ జెలంగెను మహా ♦ వర్షాంబుధారల్ జగ
త్ప్రాణంబుల్ చెలరేఁగె బిట్టెసఁగె ని ♦ ర్ఘాతప్రపాతంబులున్. 202

చ॥ రవి గనుపట్టఁడయ్యె దిన ♦ రాజి విభావరులందు యామినీ
ధవుఁ డగుపట్టఁడయ్యె నిఁక ♦ దారలుగీకలు లెక్క యేమిటన్
బవలును రాత్రి యొక్కసరి ♦ భాసిలుచున్నది గర్జదభ్రముల్
రవములలోడ మీఁదఁబడు ♦ లాగు చరించెడు మారుతాహతిన్. 203

గీ॥ గాడ్పుతోఁగూడి పెద్దవృ ♦ క్షంబు లెగిరి, నృత్తమొనరించుచున్నట్లు ♦ నెగడెఁజదల
భీరువుల చిత్తములకు బల్ ♦ భీతిసేయు, చున్నవిట్టులనరయు సం ♦ పన్న తేజ! 204

గీ॥ చాతకపతత్రులును శిఖుల్ ♦ జలదములకు, నెదురువోవుచునున్నన ♦ య్యెడదనందుఁ
గరకవృష్టిచే నవ్వానిఁ ♦ గానుపట్టు, నట్లు సల్పెడు సన్వాలా ♦ హాకసు లేచి. 205

గీ॥ ఇట్టిసమయంబునారసి ♦ యెంతయేని, పూన్కిఁగాకములు జకోర ♦ ములును నీడ
ములనుసలుపుకొనుచున్న ♦ ముగవసించె, నీవు దలఁపవదేలొకో ♦ నిలువగీము.

క॥ కనుఁగొను పలురంగులతోఁ, దనరెడు మేఘములతోడఁ ♦ దత్త్వజ్ఞా! యీ
ఘనమగుహిమవన్నగ మిట, నొనరెడు తెక్కలు గలట్టి ♦ యుదధియనఁగడున్.

ఉ॥ కావున దేవరా! మనము ♦ గ్రిచ్చఱ యిమ్మలఁ బాసి యొండు చో
టేవిధినైనఁ జేరుదము ♦ హెచ్చుగ నుల్కు జనించె నాకనన్
దా విని లోకనాయకుఁడు ♦ దద్దహసించి యిటుల్ వచించెఁ గాం
తా! వెఱపొంద నేటికి హి ♦ తంబగు వాసమొనర్తుఁ జక్కఁగన్. 208

ఉ॥ మేఘము లీనగంబునకు ♦ మేఖల దాఁటక క్రిందనుండు సభా్రి
ఘము లింక రౌప్యగిరి ♦ యంఘ్రులయందె వసించు నానువ
ర్వ్యాఘనివాసమైన కన ♦ కాద్రిని నట్టులెయుండు వీనిలో
నోఘనవేణి! నీకెచట ♦ నుండఁబ్రియంబొ వచింపు మింపుగన్. 209

వ. అందీ హిమగిరి నారయుము.

సీ॥ సిద్ధాంగనలు నాగ ♦ సీమంతినులు నెప్డు, వదలక నీకు సే ♦ వలుపొనర్తు
రద్రిరాజపురంధ్రి ♦ యమ్మేనకయు నిన్నుఁ, బ్రేమించి పూజగా ♦ వించుభక్తి
బంగారు పద్మముల్ ♦ భాసిలుమానస, సరసి మదికిఁగూర్చు ♦ సంబరంబు
పులు లెలుఁగులు సింగ ♦ ములు దపోమహిమల, కొదుగుచునందంద ♦ నోసరిల్లు

గీ॥ దివిజగంగావధూటి బల్ ♦ తేజ మొసఁగఁ, దీరుతీరులనృత్తముల్ ♦ దీర్చుచుండు
బచ్చికలయాస్తరణములిం ♦ పెచ్చఁజేయుఁ, బాయనెంతు వెకాంత! ప్రా ♦ లేయధరము.

చ॥ ఎడపక యెల్లకాల మొక ♦ టేవిధిఁ బూఁచి ఫలించుచుండు ని
య్యెడ నిఖిలద్రుమంబులును ♦ నెల్లపు డబ్జకువాలజాలమున్
బొడమఁగఁజేయు దీర్ఘికలు ♦ మోహనమంజులగానమాధురిన్
దడయక కూర్చుచుండు సత ♦ తమ్ముఁ బికప్రముఖమ్ము లిమ్ముగన్. 211

చ॥ ఇఁకను హిరణ్యశైలమున ♦ నింద్రుఁడు మున్నగునట్టిలోకనా
యకు లమరావతీప్రముఖ ♦ హర్షకరోత్తమరాజధానులన్
రకముగసల్పి యందులఁ ది ♦ రంబుగఁ గాపురమున్నవార లా
త్మకు ముదమైనఁ జెప్పు దయి ♦ తా! యట కేగుదమా? ప్రియంబుగన్. 212

ఉ॥ అందు మహేంద్రరాణి నిను ♦ నాదటఁ గాంచి ప్రియంబుసేయుఁ బ
ల్విందులు సేతురెంతయును ♦ వేల్పులచేడియ లచ్చరల్ గడున్
బొందుగ సేవఁజేయుదు ర ♦ పూర్వవినోదములన్ బొనర్చువా
రిందుముఖీ! వచింపుమిఁక ♦ నేగఁగనెంచినఁ గాంచనాద్రికిన్. 213

వ. అట్లుకాదేని.

ఆ॥ మనదు వెండికొండ ♦ కనఘాత్మ! చేరఁగఁ, దలఁచెదేనిఁ జెప్పు ♦ దరులు సాను
వులును గాంగకూల ♦ ములును జెల్వగునెందు, నెందు బ్రహ్మపుత్రి ♦ సందడించు.

ఆ॥ అనుచు దేవదేవి ♦ యభవ! యీహిమగిరి, యూర్ధ్వశిఖరమందు ♦ నుందమనుడు
వేగముగ శివుండు ♦ వెలఁదిని సందిట, నొంది యూర్ధ్వశిఖర ♦ మొందెనపుడు.

క॥ అందు వనంబులుఁ గొలఁకులు, మందసమీరములు సిద్ధ ♦ మహిళామణులున్
గందువఁగూర్చిరి మనములు, నిందుకళాధరునకును మ ♦ హేశ్వరి కెలమిన్. 216

సీ॥ కేరి విద్యాధరీకోటి ♦ కిన్నరీత, తియును నప్సరశ్శ్రేణి యెం ♦ తేనిమీఁటి
వేణువీణామృదంగ ని ♦ క్వాణగతుల, నృత్తముల సల్పుచుండిరి ♦ చిత్తసుఖము.

గీ॥ ఇట్లు నీహారగిరిఁ బర ♦ మేశ్వరుండు, రమణితోఁ బదివేల్వత్స ♦ రంబు లిష్ట
భోగములనొంది యానంద ♦ మునఁ జెలంగె, రాతిరియుఁబవలనెడు నే ♦ ర్పాటులేక.

ఉ॥ ఒక్కొకనాఁడు పద్మముఖి ♦ నొద్దికఁ జేకొని కాంచనాద్రికిన్
జక్కఁగఁ జేరి యందు మణి ♦ సానువులన్ విహరించివచ్చు వే
ఱొక్కపుడీ యిలాతలము ♦ హోన్నతదివ్యవనీతలంబులన్
మక్కువతోఁ జరించుచును ♦ మానినితో మరలున్ హిమాద్రికిన్. 219

వ. ఇట్లు దాక్షాయణీ శివులు వైహారికసుఖపారవశ్యంబున నలరుఁడు ననోన్యసంగతి
ననురాగభూజంబు నత్యంతాభివృద్ధిఁ దనర్చినంత భవాని దాంపత్యసుఖముల
నెంతేనిఁ దనిసి సంతుష్టయై యొక్కనాఁ డేకాంతంబున శంకరునకు మ్రొక్కి
భక్తితో దోయిలొగ్గి ప్రహ్వీభూతయై యిట్లు ప్రార్థించి యడిగె.

## —* శివుఁడు సతీదేవికి జ్ఞానమార్గంబు నుపదేశించుట *—

చ॥ పరమకృపాళు! నీవలన ♦ బాగుగ భోగసుఖంబులొంది యం
దరుసము నొందితిన్ మరలె ♦ నాత్మ యిఁకర్ జనుఁ డెట్లు దుఃఖ ని
స్తరణము సెందు జీవులెటు ♦ సంసరణమ్మును బాసి నిత్యమౌ
పరమపదంబుఁ గాంతురు కృ ♦ పన్ సెలవిమ్ము మహాత్మ! యీతఱిన్. 222

క॥ అని లోకోద్ధరణార్థము, వినయమ్మున నాదిశక్తి ♦ విభునడుగఁగఁ బ్రీ
తినిఁ గొని శంకరుఁడిట్టుల, ననియెను దాక్షాయణీ! ప్రి ♦ యంబుగ వినుమా!

మ॥ పరతత్త్వంబిది దేనినారసినచో ♦ బంధంబులన్ బాసి మో
క్షరమన్ జెందును జంతు వెవ్వఁడది వి ♦ జ్ఞానస్వరూపంబిఁకన్
బరుఁడన్ దాసన కారయన్ దగును స ♦ ర్వంబిద్దిబ్రహ్మంబుగాఁ
బరమార్థైకమనంబునన్ దెలియుమిా ♦ బాటన్ సరోజాననా! 223

క॥ అదిదుర్లభ మత్యంతం, బది యెఱిఁగినవాఁడు చూడ ♦ నరుదగు జగతిన్
ముదితా! భక్తియనంబడు, బదిలంబగు వస్తువొకఁడు ♦ భాసిలెడు నిలన్. 224

చ॥ పొలుపుగ భుక్తిముక్తిఫల ♦ భోగములొందఁగఁజేయు భక్తి యి
మ్ములు నది తల్లియై పరఁగుఁ ♦ బుణ్యవతీ! భువి నెల్లవారికిన్
సులభము దాని యార్జనము ♦ చోద్యము జ్ఞానముకన్న భిన్నమై
యలరును గాని భక్తి దయి ♦ వాఱనిచోఁ గనలేరు జ్ఞానమున్. 225

గీ॥ భక్త్యధీనుఁడనైయేను ♦ బరమనీచ, జనులకేనియుఁ బాపిష్ఠ ♦ జనులకేనిఁ
గైవసంబయి వారి య ♦ గారములను, జేరి కొలుచుచునుందును ♦ మేరమిాఱి.

వ. ఆభక్తి సగుణ నిర్గుణ భేదంబుల ద్వివిధంబై యలరు, నందు మొదటిది నైధి యనియు స్వాభావికి యనియు ద్వివిధంబయ్యె నా రెండును నైష్ఠికి, యనైష్ఠికి, యన భేదంబుల నొప్పి ప్రత్యేకంబు ద్వివిధంబులయ్యె, నందు నైష్ఠికి మరల యాఱువిధంబులయ్యె; అనైష్ఠికి యేకరూపయ్యె; ఈయవి, విహితావిహిత భేదంబులతో మఱియు ననేకవిధంబులయ్యె, వాని స్వరూపంబు మఱొకమాఱు దెల్పెద నిపుడు ప్రసిద్ధంబులగు నా రెండు భక్తులకుఁ దొమ్మిది యంగంబులను బుధులు లెక్కపెట్టి రవ్వానిని వాని స్వరూపంబును దేటపఱతు వినుమని యిట్లనియె.

గీ॥ శ్రవణమును గీర్తనంబును ♦ స్మరణ సేవ
నములునున్ దాస్యమును నర్చ ♦ నయును వంద
నమును సఖ్యంబు స్వాత్మార్ప ♦ ణమును ననెడు
నవవిధాంగము లొంది త ♦ నర్చుభక్తి. 226

వ. ఇఁకను వీనిస్వరూపంబు దెలియఁజేయుదు నారయుము.

సీ॥ నాదులీలాకథ ♦ లాదట వినుచుహ, ర్షము నొందుటయె శ్రవ ♦ ణమనఁబడును
హృదయాంబరమునను ♦ హృద్యలీలలను ద్రా, ర్కొనిపాడుటద్దికీ ♦ ర్తనమనఁబడు
నను జగన్మయునిగా ♦ నమ్మినిర్భయమతి, స్మరియించుచుండుటే ♦ స్మరణమగును
అరుణోదయాదిగ ♦ నహము రేయియు పేక్ష, చెన్నొందఁగొలుచుటే ♦ సేవనంబు

గీ॥ హృదయపీయూష రసమది ♦ యుబికి పాఱఁ
బ్రియముఁ జెందుటే దాస్యమన్ ♦ జేసఁగాంచు
రహియమర షోడశోపచా ♦ రములు దనర
నన్నుఁబూజించుటయె యర్చ ♦ నంబు వినుము. 230

క॥ మనువును జపించుచును మది, ననువుగధ్యానము సలుపుచు ♦ నష్టాంగము లు
ర్విని జేర్చి మ్రొక్కుటే వం, దనమని చెప్పుదురు పరమ ♦ తత్త్వజ్ఞమునుల్.

గీ॥ కడఁగికష్టసుఖములలె♦ క్కఁగొనకెప్డు, నమ్మికొలుచుటె సఖ్యమ♦ నాఁగఁజెలఁగుఁ
దనువు నెంతయుఁ బేర్మిమైఁ♦ దనకుఁగాక, నాకువిడుచుటెయాత్మార్ప♦ ణంబు చెలువ!

వ. ఈచుని తొమ్మిదియు భక్త్యంగంబులై భుక్తిముక్తి ప్రదంబులై నా కతి ప్రియంబులై యలరారుచుండు నిఁకను బిల్వాశ్రియాదికంబులగు నుపాంగంబులును బెక్కులుగల వవ్వాని నీవ యారయఁ గలవిట్లు సాంగోపాంగమగు భక్తి తెఱంగునీ కెఱింగించితి.

గీ॥ ఇద్ది వైరాగ్యమాత్మక ♦ యిద్దిముక్తి, దాత్రి సర్వఫలోత్పత్తి ♦ దాయిని యగు
నీకుఁబోటి యొనర్చబల్ ♦ నీటుమెఱయు, నామదిఁగరంచు పెక్కేల ♦ నలినవదన!

గీ॥ భక్తి జ్ఞానంబు విరతినాఁ♦ బరఁగుత్రిపుటి, యందు జ్ఞానవైరాగ్యము ♦ లమరుటరిది
భక్తినొందుట సులువగు ♦ భక్తియొసఁగ, సర్వమీడేఱు నాదు న♦ శ్యతఁబొనర్చు.

వ. మఱియు భక్తినశ్యుండనై యేను.

శా. పాపాత్ముండగు పఙ్క్తికంఠునకు బల్ ♦ భాగ్యంబులర్పించితిన్
బాపన్ వేఁపఁగఁజూచి దండధరునిన్ ♦ బ్రాణంబులన్ బాపితిన్
సాపాటున్ బొనరించితిన్ గరళమున్ ♦ జంకింతయున్ జెందకే
యీ పాట్లన్నియు భక్తినిన్ వలచియే ♦ యింద్వర్ధ బింబాలికా! 235

ఉ॥ కావున దేవి! నే మిగులఁ ♦ గాంక్ష యొనర్చెద భక్తియోగమున్
శ్రీవిలసిల్ల భక్తులను ♦ జేరెద నెల్లపుడన్న దేవియున్
భావమునందు భక్తియె ఘ ♦ నంబని మెచ్చి ప్రమోదమొందె నిం
కేవియొ ధర్మమర్మము ల ♦ నేకముల్గినఁ జెప్పె నీశుఁడున్. 236

వ. అహరహం బిట్లు లోకహితార్థినియై యమ్మహేశ్వరి మహేశ్వరుని నానాశాస్త్ర సంకేతవిషయంబులను వర్ణాశ్రమాచార నిబంధనంబులను స్త్రీపురుష ధర్మంబులను జ్యోతిశ్శకున సాముద్రిక వైద్యేతిహాసక్రమంబుల సద్గీ సదుత్తరంబు లొంది యానందమొందుచుండె ననుడు సూతునకు శౌనకాదు లవ్వలి కథ నెఱింగింపుమనుటయు సూతుం డిట్లనియె.

## —• ప్రయాగలో దేవమునులు యజ్ఞము నొనర్చుట •—

చ॥ అతులమునీంద్రులెల్లరు ప్ర • యాగను జేరి మహామఖంబొకం
డతనువిభూతిసల్పుచు మ • హామహులందఱిఁ గోరి పిల్వఁగాఁ
గుతుకముతోడ నందు నొనఁ • గూడిరి సర్వసుపర్వులున్ ఋషుల్
క్రతువది పెద్దకాలము వి • రాజిలె నెల్లరు మెచ్చ నచ్చటన్. 238

గీ॥ అందు బ్రాహ్మీసమేతుఁడై • యబ్జభవుఁడు
భృగువు భగుఁడును బూష ము • న్నగు గరిష్ఠు
లుండిరి మహేశుఁడును వచ్చి • యుండె నంత
దక్షుఁ డొకనాఁడు విచ్చేసె • దర్పమెసఁగ. 289

క॥ వచ్చిన దక్షునిఁ గనుఁగొని, యచ్చటివారెల్ల లేచి • యాహ్లాదముతో
హెచ్చగు గనకాసనమిడి, మెచ్చునటుల్ మ్రొక్కి కొలువ • మెలుగనతఁడున్.

ఆ॥ వారి గారవించి • వారిజసంభవుఁ, జేరి మ్రొక్కి గద్దెఁ • జేరి కూరు
చుండి శివునిఁగని యు • తండు దన్నుఁ జేరి, మ్రొక్క లేదటంచు • నుక్కుమిగిలి.

క॥ మునులను వేల్పులఁగనుఁగొని, యనియె భవుండితఁడు మామ•కాత్మజఁ గొని నా
కనువుగ శిష్యుండై నను, నొనరింపఁడు గౌరవంబు • నొక్కింతేనిన్.

ఆ॥ అశుచి లుప్తకర్ముఁ • డతిభిన్నసేతువు, మాని యీతఁడిట్టి • వానికే న
నష్టుఁడై నవాని • శామ్నాయవిద్యను, బలెనొసంగినాఁడఁ • బట్టి నట్లు. 243

సీ॥ ఘోరంబులగు ప్రేత • వారంబులనుగూడి, సంచరించుచునుండు • సంతసమున
నిలువాకిలియునని • యెంచక నిచ్చలు, కాపురంబుండును • గాటియందు
ఉన్మత్తునిన్ బోలి • యొడలెఱుంగక యెప్డు, నగ్నుఁడై హాసియించు • నానఁదక్కి
తామసజనులకుఁ • దావిభుండై కడు, కూరిమితోనేలు • కొనును వారి

గీ॥ పేరశివుఁడని యశివుడై • నెలయు నిట్టి
నష్టశౌచున కెఱుఁగక • నలినసూతి
చోదనన్ జేసి యెద్దియుఁ • జూడకట్టు
సాధ్వియగు కూఁతునొసఁగితిఁ • జదురుఁదప్పి. 244

—* దక్షుఁడు శివుని శపించుట *—

క॥ అనియిట్లుపలికి వేగమె, కనుఁగవయం దగ్నులొదవఁ ♦ గనుఁగొనియభవున్
బెనుకినుకతోడ నుదకం, బును ముట్టి శపించె నిట్లు ♦ భూతేశ్వరునిన్.

క॥ ఇతఁడిఁకను సర్వయజ్ఞ, ప్రతతుల భాగంబులేక ♦ వందురును బహి
ష్కృతుఁడగు సురలను మునులకు, నతీతుఁడగు నితని కేటి ♦ కాహవ్యంబుల్.

గీ॥ ధాత మున్నగువారు వ ♦ ల్దనుచు నుడువు, చున్న నిట్టులఁ గొంకక ♦ యుద్ధతమతి
నై శపించిన దక్షున ♦ కలిగి నంది, కేశుఁ డిట్లని ప్రతిశాప ♦ మిచ్చె వేగ. 247

—* నందికేశ్వరుఁడు దక్షునకుఁ బ్రతిశాపం బిచ్చుట *—

ఉ॥ ఓరి! దురాత్మ! దక్ష! విను ♦ మోరి! మహేశ్వరు యజ్ఞకోటికిన్
దూరముసేయ నీతరమె? ♦ దుర్మతి! శర్మము దక్కి నీవిటుల్
గారులుపేలి నేమియగుఁ ♦ గాపురుషాగ్రణి! బస్తమాళివై
తీరెదుగాక వేగ నిఁకఁ ♦ దీఁపుర మెల్ల నడంగుఁ గావుతన్. 248

చ॥ ఎవనిఁ దలంచినంత నక ♦ లేజ్యలు పూర్ణతనొంది మించు నిం
కెవని నుతించినన్ జనుల ♦ కెల్ల నమంగళముల్ దొలంగి మే
లవు; నెవనిన్ భజింతురొ గమ ♦ లాక్షుఁడు నీ గురుఁడైన ధాత నా
యవికృతు నాదిదేవు నక ♦ టా శపియించితె! యజ్ఞబాహ్యుఁగా.

క॥ అని తన్ను శపించిన నం, దినిఁగని దక్షుండు మిగులఁ ♦ దీంద్రపుటలుకన్
గొని యిట్టుల మరల నెపిం, చెను ముందున్ వెనుకఁ గనక ♦ చేవదలిర్పన్.

ఉ॥ మీరలు రుద్రభక్తులయి ♦ మీఱి యిటుల్ చెలరేగుచున్న వా
రిరిఁక వేదబాహ్యులయి ♦ యెల్లరు వేదపథంబు వైదికా
చారముఁ బాసి బూదిని భృ ♦ శమ్ముగఁ బూసి చరింత్రుగాక బ్రం
దారకులున్ మునుల్ దగుప ♦ ధమ్మునఁ జేరకయుందురొ గావుతన్. 251

వ. అని దక్షుండు శపించినయంత భృగ్వాదు లలరుచున్నన్ గాంచి నందికేశుండు
మరల నవ్వారికిట్లు ప్రతిశాపంబిచ్చె. 252

—* నందికేశ్వరుఁడు భృగ్వాదిమునులకు శాపం బిచ్చుట *—

గీ॥ ఎవరుశివునకువిముఖులై ♦ యేవమనక, యిట్టితుచ్ఛోక్తులకుముదం ♦ బెనయువారో
యట్టివారలు వేదత ♦ త్త్వార్థమునకు, బాహ్యులగుదురుగాక యె ♦ ప్పట్లనేని. 253

క॥ మఱియును గామాత్మకులై, దరిద్రులయి యాచకులయి ♦ ధర్మచ్యుతులై
వెఱవక యభక్ష్యములఁదిను, దురు శూద్రులయాజకులగు ♦ దురు నగజగముల్.

వ. అని శాపం బిచ్చినంత శివుండుడిపి దక్షశాపంబున కావంత యలుగక నందికే శున కిట్లనియె. 256

ఆ॥ తగునె బ్రహ్మాకులుల ♦ దండింప శాపోక్తి, నేమియయ్యె శాప ♦ మీగి కిపుడుఁ
బరులకోసరముగ ♦ బావిదూఁకుట మేలె?, తెలియునసెడివాఁడె ♦ తెలియలేఁడు.

వ. అని యిట్లు నందికేశుని కందుఁబాపి సత్వరంబుగఁ బరిజనంబులతోఁ బరమేశ్వరుండు కైలాసంబున కేగెనంత దక్షుండు గుపితుండై భృగ్వాదులను దోడ్కొని కనఖలక్షేత్రంబుఁ జేరి యందు శివవిహీనంబుగ వాజపేయమఖం బొసరించి యట్టులే బృహస్పతిసవనంబుఁ జేయదెంచి సకలామరులను బరమమునుల సంపఱఁ బిలిచి యజ్ఞారంభంబు సేయుడు—

## —* ద క్ష య జ్ఞ ము *—

ఆ॥ కదలివచ్చె నటకు ♦ గంజసేతుఁ డజుండు, దేవనాథుఁడాది ♦ దిక్పతులును
వారిగేహినులును ♦ వసుగణంబును ద్వాద, శాస్కులును గ్రహంబు ♦ లలరివేగ.

వ. మఱియు నీకను విశ్వేదేవతులును మరుత్తులును బితృగణంబు లప్సరోజనంబులు గంధర్వ సిద్ధ విద్యాధర కిన్నర యక్షోరగ పతంగ ముఖ్యులును గశ్యపాగస్త్య వామదేవాత్రి భృగుభగమరీచి, నారద పరాశర గర్గ భార్గవాది పరమమునీంద్రులరుదెంచి రవ్వారి కంపఱకు దక్షుఁ డర్హసత్కారంబు లొనరించి విశ్వకర్మ విరచితామలగేహంబులు సమర్పించి యందుంచిన వారంద ఱట్లుండుడు సవనంబునందు భృగ్వాదులు ఋత్విజులుగను బుండరీకాక్షుం డధిష్ఠాతగను బద్మజుండు ద్రయీవిధిదర్శకుఁడుగాను సర్వదిక్పాలులు సాయుధులై రక్షకభటులుగను ద్వారపాలకులుగను నియమింపఁ బడిరింకను యజ్ఞంబు సురూపంబై యజ్ఞశాలఁ జేరియుండె నగ్నియు నిజరూపంబున హవిర్గ్రహణంబునకు సిద్ధంబై యుండెనిట్లెనుబదియెనిమిదివేలు ఋత్విగ్గణంబులును, నఱువదినాలుగువేలు ధాతృగణంబులును నట్లే యధ్వర్యుహోతృగణంబులును దీక్షితులై యుండిరంత దక్షుండు దారతో రచితకౌతుకమంగళాచారుండై దీక్షితుండై యజ్ఞశాలఁ జేరియుండె నంద ఱాత్మకార్యపరతంత్రులై యుండిరా సభయందుఁ గపాలి యనర్హుఁడనియు నాతనిఁజేరుట సతియు ననర్హయనియుఁ బిలువని కతమ్మున సతీమహేశ్వరులు దక్కఁదక్కిన నిఖిలామర దివ్యముని జనంబులు, బ్రహ్మర్షులు, రాజర్షులు, మున్నగువారెల్ల సదారంబుగ సపరివారంబుగ విచ్చేయుటఁజేసి సభ యెంతయు సందడి మిగిలియుండుట నందు శైవాగ్రగణ్యుండగు దధీచి, మహేశ్వరీ మహేశ్వరుల పొలకువఁ గాంచక యులికిపడి దక్షునకిట్లనియె.

ఉ॥ అందఱుఁ జేరినారిచటి ◆ కయ్యలు నమ్మలు రాకయుండిరా
యిందుకలాధరుండు శివ ◆ డేలొకొ పిల్వఁగలేదొ వారి నిం
దించఱు చేరియున్న సభ ◆ యెంతయు దేవుఁడు లేని జాతర
ట్లుందగియుండె నీకిదియు ◆ లోపముగాఁ గనుపట్టదే? మదిన్. 260

ఆ॥ ఎవనిచేత శుభము ◆ లేర్పడఁబోవుక, భక్తజనుల నొందఁ బరమశివుఁడ
తండు చేరకుండెఁ ◆ దగుకతంబెద్దియో, సవము నెగ్గఁగలదె? ◆ శివుఁడులేక.

ఆ॥ వినుమమంగళములు ◆ విఘ్నముల్ రాకాసు, లెవనిఁ దప్పులఁ జూచి ◆ యవియు వేగ
నట్టి పరమశివుని ◆ సభవుని నెడచేసి, తేల? దక్ష! యెఱిఁగి ◆ యెఱిఁగియిట్లు.

వ. ఇప్పటికేనియు

చ॥ పసుపు విధాతనేనియును ◆ బద్మదళాక్షునినేని వేగఁగూఁ
తును బరమేశ్వరున్ నడిగఁ ◆ దోడ్కొనిరమ్మని దక్ష! యట్లుమై
నను భవదీయ యజ్ఞము జ ◆ నస్తుతమై సిరిఁబొల్చు సిద్ధినిన్
గాను నిఁకనీవు శ్రైష్ఠ్యమును ◆ గొందువు సర్వసుపర్వులందునున్. 263

వ. అనిన విని కినిసి దక్షుండు ముని కిట్లనియె

చ॥ ముని! వినుమా! కపాలి గడు ◆ భూతగణంబులఁ బ్రేతవర్గమున్
బెనఁగొని యస్థిసంచయము ◆ పేరిమిఁ జేకొని కాడులందు నె
ప్పును దిరుగాడుచుండు నిఁకఁ ◆ బుత్రియు నాతని చెట్టఁబట్టుటన్
మనమున వీరసర్పులని ◆ మానితి యాగమునందుఁ బిల్వఁగా. 264

చ॥ అనవిని యెల్లరున్ వినియు ◆ నడ్డము సెప్పక యున్నఁ జూచియు
మ్మునికులచంద్రుఁ డేవమును ◆ బొంది మఖంబిది బన్నమొందు నిం
దునఁ దగువారలెల్లరును ◆ దుఃఖముఁ జెందుదు రీవ్రిభుండునున్
ఘనమగు నాపదన్ బొరయుఁ ◆ గాక! యటంచు శపించి వ్రేల్మిడిన్. 265

గీ॥ తనదు శిష్యులతోఁగూడఁ ◆ దరలె మఖముఁ
బాసి యాతనితోఁ బాటు ◆ వామదేవ
మునియు ఘటసంభవుఁడు గౌత ◆ ముఁడు శిలాదుఁ
డును గదలిపోయి రెంతయుఁ ◆ గినుకఁగదిరి. 266

చ॥ చనిన మునీంద్రులన్ గనియు ◆ సంతసమున్ గొని దక్షుఁడిట్లు ప
ల్కెను ముదమయ్యె వీరిటుల ◆ లేచి ప్రయాణము సేయుటెందు శ
ర్వాని మతమొందినట్టి శఠ ◆ బుద్ధు లసిద్ధులు చేరరాదిఁకన్
మునులు! సుపర్వవల్లభులు! ◆ పూర్తి యొనర్పుఁడు నామజన్నమున్. 267

వ. అనుడునంత భావ్యర్థవశంబునఁ గేశవుండును బుత్రస్నేహంబునఁ బద్మజుండును బ్రహ్మాండాధిపతియగుటన్ జేసి బుగులున నెల్ల దివ్యర్షి జనంబులును మిన్నకుండి జన్నంబున కారంభముచేసి యొనర్పుచుండి రంత రాజతాద్రియందు సవితానంబగు ధారాగృహంబున సఖులతో సంతసంబుననున్న మహేశ్వరి యాకసంబున విమానంబులతో దక్షాధ్వరంబున కరుగుచున్న వేల్పులఁగాంచి సఖియగు విజయంబంచి తన్ముఖంబున సర్వం బెఱింగి మనంబునం దిట్లాందోళనం బొనర్చె.

— * సతీదేవి దక్షయజ్ఞమునకుఁ బోవుటకు శివుని సెలవడుగుట * —

చ॥ జనకుఁడు మేటిజన్నమును ♦ సల్పెడునంట ! మదంబయేని న
యన్యఘుఁడు నేని నన్ బిలువ ♦ రక్కట ! యక్కతమేమొ యెట్టులై
నను నటకేగకుండిన మ ♦ నంబు దిరంబగునే ? మదాత్మనా
థుని కెఱిఁగించి యాజ్ఞఁగొని ♦ తొందరగా నట కేగఁగావలెన్.

క॥ అనికొని యిట్లు శివుండుం, డిన యాస్థానమునఁ జేరి ♦ నిలిచి ప్రణతయౌ
టను ననఘుఁడుగని సతితో, నన నేటికివచ్చి తిందు ♦ సరవిందముఖీ !

చ॥ హరుఁడిటు లడ్గఁగా సతియు ♦ నంజలిచేసి వచించె జీవితే
శ్వర ! విను నాదు తండ్రి యొక ♦ జన్నము సేయుచునుండెనంట ! ని
ర్జరులు మునుల్ ఘనుల్ నిఖిల ♦ చారణసిద్ధపతంగనాగకి
న్నరు లరుదెంచినార లఁట ! ♦ నామఱ యారెడు నందుఁ బోవఁగా. 271

ఆ॥ పిలువఁడాయె నేమి ♦ తలఁచెనో ? నాతండ్రి, మఱచెనొక్కొ ! మనల ♦ మానసమున
నగునె ? మఱచుటెందు ♦ నల్లునిఁగూఁతును, గతమదేమొయింత ♦ గాదెయరయ.

సీ॥ రహి "ననాహూతోధ్వ ♦ రంగచ్ఛ" యనుసూరి, సూక్తికి మదిలోనఁ ♦ జోటొసంగి
అఱువదేడులుదాఁట ♦ నస్తొబి త్తనుచొప్ప, ముదిమి దక్షుని తెఱం ♦ గెదమరల్చి
పాయక నినుగొల్చు ♦ పడఁతిని భక్తనౌ, నాకూర్మిఁదీర్ప మ ♦ నంబుఁబూని
ఆఁడది పుట్టింటి ♦ కాసజెందుననాఁ బ్ర, జలు పల్కునుడి మదిఁ ♦ జాలఁదడవి

గీ॥ పయన మొనరింపు దేవేశ ! ♦ రయము మీఱ
నన్నుఁ దోడ్కొని ప్రమథ జ ♦ నంబుతోడ
రాఁదలఁపవేని ననుబంపు ♦ మాదరమునఁ
బోయివచ్చెద నీపాద ♦ ములకు మ్రొక్కి. 273

క॥ చని యందుల కేటికి మన, లను బిల్వఁగ మానెనో త ♦ లంపెఱిఁగెద వే
గనె మఱలివచ్చెదను నా, కనుజ్ఞయిడిపంపు చూతు ♦ నాయుత్సవమున్ 274

క॥ అని సర్వేశ్వరి యడిగిన, విని శివుఁడా దక్షసవన ♦ వృత్తంబెల్లన్
మనమందెఱింగి యనె నీ, జనకుఁడు నన్ జిన్నసేయ ♦ జన్నముఁబూనెన్. 275

ఉ॥ కూళయతండు నాపయినిఁ ♦ గ్రోధమునొంది దురుక్తులాడి యీ
వేళకు జన్మమంచునొక ♦ పేరిడి నన్ వెలివెట్టి సభ్యెడున్
హాళిగ నందుఁబోవ స్మృతి ♦ కన్నను నెక్కుడు దుఃఖమాఁ జుమీ
యాలిరో ! మానుమీ పయన ♦ మాత్మహితంబుగ నెంచి యిత్తతిన్. 276

క॥ ఇటు లనినను జనుటకు లం, పటమై యున్నట్టి తనదు ♦ పణఁతిన్ గని మీఁ
దట రానున్న యనర్థము, పటుమతి నెఱిఁగియును నటకుఁ ♦ బంపఁగనిచ్చున్ 277

## —* సతీదేవి దక్షయజ్ఞమునకుఁ బోవుట *—

గీ॥ వృషమునపై నెక్కి యఱువది ♦ వేల గణము
గొలువ దేవేరి ! యటకేగు ♦ గొంకకనుడుఁ
గడుముదం బొంది కైసేసి ♦ వడిగ నెద్దు
నెక్కెఁ జామరములు ఛత్రి ♦ మేయఁజెలులు. 278

క॥ ఒకచెలియ గోరువంకను, నొకచెలి విరికందుకంబు ♦ నొకచెలి యద్దం
బొకచెలి వికసితపద్మం, బొకచెలి తాంబూలపేటి ♦ నొంది చనిరొగిన్.

వ. కదలి యంతంత నొదవెడు దుశ్శకునంబులకు మదిన్ గొంకుచు సతీదేవి యతి త్వరితంబునఁ గనఖలక్షేత్రంబుఁజెంది యందు దక్షుయజ్ఞ ప్రాకారంబుగవను ముందఱ వృషంబుడిగ్గి బలంబులనెల్ల నందయునిచి కతిపయ పరివారంబుతో యజ్ఞశాలం దఱియుడు నంత వీరిణి యాత్మజాతన్గని యాదరంబున నెదుర్కొని పీఠంబు నొసంగుటయు నక్కచెల్లెండ్రును నట్లే యాదరంబుఁ జూపుటయుఁ దండ్రియగు దక్షుండుమాత్రము దన్నుఁగాంచియు ననాదరంబున మిన్నకుండుటయు వేల్పు లెల్లరును దక్షానుమతితోఁ దన్నుఁ జూచియుఁజూడనట్లు స్వవిహిత హవిర్భాగములందుకొనుచుండుటయు, నాత్మవిభుండగు మహాదేవున కందు హవిర్భాగంబు శూన్యంబుఁజేయుటయుఁ గాంచి తల్లి యొసంగిన పీఠంబుఁ దాఁకక మహాదేవి రుష్టయై క్రోధాగ్నిఁ గాల్చునదియుఁబోలె దక్షునీక్షించి యిట్లనియె. 280

మ॥ జనకా ! యేల మహేశ్వరున్ బిలువవే ♦ చందంబు జన్మంబొన
ర్చను బూన్కిన్ దొరకొంటి వీజగము లే ♦ భద్రాత్మచే శుద్ధిఁగాం
చునొ యయ్యాదిమదేవు నస్యులవలెన్ ♦ జూడన్ వివేకంబె య
ఘ్నునుఁడిచ్చోటికి రాకయున్నఁ జెడు యా ♦ గంబిద్ది నేఁజెప్పితిన్. 281

క॥ యజ్ఞవిదగ్రేసరుఁడున్, యజ్ఞాంగుఁడు యజ్ఞతనుఁడు ♦ యజ్ఞకరుఁడునున్
యజ్ఞేశ్వరుఁడగు నీశ్వరు, యజ్ఞమునకుఁబిలువకున్న ♦ యజ్ఞంబగునే ? 282

ఉ॥ ఈ హరి నీ పితామహుని ♦ నీ పురుహూతుని నీ మునీంద్రులన్
మోహముతోడఁ బిల్చి యల ♦ భూతపతిన్ విడనాడితీవు నీ
రా హరుచేతనే పదవు ♦ లంది యిటుల్ దొరలైరి యద్ది నీ
వూహ నెఱుంగకిప్పగిది ♦ నుత్పథమొందితి వజ్ఞశేముషీ! 283

## —* సతీదేవి విష్ణ్వాదిదేవతల నుపాలంభించుట *—

వ. ఇట్టులడిగి నిలింపులన్ జూచి యిట్లనియె.

చ॥ దనుజ హరీ! సరోజభవ! ♦ శక్ర! హుతాశనముఖ్యులార! స
న్మునికులవర్యులార! శశి ♦ భూషణుఁ డబ్జభవాండభాండపా
వనుఁ డతులుండు రానియెడ ♦ వాసిగ మీరలుచేరి హవ్యముల్
గొనుచు వసించినా రిటులఁ ♦ గొంకును జంకును మాని యాత్మలన్. 284

ఉ॥ ఓయి రమేశ! నిన్ను నిటు ♦ లుద్భవమొందఁగఁజేసి మేటి యా
మ్నాయములిచ్చి దైత్యజన ♦ మారణసాధనమైన చక్రమున్
శ్రీయలరంగ నిచ్చియు న ♦ శేషజగత్సముదాయనాథుఁగాఁ
జేయఁగ లేదె? విస్మృతినిఁ ♦ జెందఁగ మందమనీష! యొప్పునే. 285

చ॥ నలినజ! నిన్నుఁబుట్టఁగ నొ ♦ నర్చి శ్రుతిప్రకరంబొసంగి యీ
విలసిత లోకరాజి నొద ♦ వింపఁగఁ జేసెడు సృష్టిచాతురిన్
బలమునొసంగి సర్వసుర ♦ వందితుఁజేసె దయాళు నాశివున్
దలఁపఁగఁజెల్లదే యిటుల ♦ దర్పము సర్పమువోలెఁ జెందదే? 286

గీ॥ చెలఁగి నీ యైదవశిరంబుఁ ♦ జిదిమివైచి
మదముఁబోకడఁ బెట్టిన ♦ మానసమున
నదియు నేనియు దలఁపవే ♦ మచ్చరియము
పంకజోద్భవ! యిమ్మాడ్కిఁ ♦ బాటఁదొలఁగి. 287

ఆ॥ అమరనాథ! యేల ♦ యతిగర్వితుండవై, నిక్కి దడిచిపడకు ♦ నీదుహస్త
మశనితోడ స్తంభ ♦ మందించు టెఱుఁగవే, మరలఁగుడుతు వార్త ♦ బిరబిరనిట.

క॥ అనియెడు కూఁతును గని పెను, కినుకన్ గొని యిట్టులనె నొ ♦ గిన్ దక్షుఁడు మా
నిని! నిన్నెవ్వరు పిలిచిరి ♦ చనునే? యిటు పిలుపులేని ♦ సవనముఁజేరన్ 289

ఉ॥ పాప్మోఁక నూరకుండు మటుఁ ♦ బోవకయుండిన నీదు నాథు జ
న్మమ్మున కేను బిల్వ నుగు ♦ ణమ్మొకఁ డేనియు లేదు ప్రేతభూ
తమ్ములతోడ నేస్తము స ♦ తమ్మొనరించు మనొల్కియుందు ని
త్యమ్ముగనుండుఁ గశ్మలుఁడు ♦ దైవతగోష్ఠికిఁ బాఁపితిన్ జుమీ!

సీ॥ అరయ కిదియెల్ల నా వివా ♦ హోత్సవమును
నిన్నాసంగతి విధిఁబట్టి ♦ నేప్పుమాలి
అరసి యిఁక నక్కవిడుము దా ♦ యమును గొనుము
నీవుమాత్రము దాకొయ ♦ నే! రయమున. 291

## — * సతీదేవి దక్షునిఁ దెగడుట * —

వ. అనిన విని మహేశ్వరి దురాత్ముఁడగు నాత్మజనకుని ప్రలాపంబుల కత్యంతంబు గసలి మనంబున నీశ్వరోక్తిం దలఁచి యం దవిశ్వాసం బొనర్చిన తనదు ననుచితంబును వరప్రదాన సమయంబునందు శంకరుఁడు దనకుఁజేసిన సమయంబును నారసి పశ్చాత్తాపంబుఁజెంది మనంబునం దిట్లాందోళనం బొనర్చె

ఉ॥ ఎట్టులఁ బోవుదానవిఁక ♦ నే విభునొద్దకుఁ జిక్కువచ్చె న
న్నెట్టుల నేలు సర్వజగ ♦ దీశ్వరుఁ డిందలి వృత్తమడ్గ నే
నెట్టుల నీ దురాత్ము తెఱఁ ♦ గేర్పడఁ జెప్పుదు ముప్పుమూఁడె ని
క్కట్టునఁ గూలితిన్ విభుఁడు ♦ గాదన మానఁగ లేకపోయితిన్. 293

వ. అని తండ్రి నుద్దేశించి

గీ॥ జనక! శంకరు నిందచే♦సినయఘంబుఁ, గుడుతువిఁక సందియములేదు ♦ గొప్పదుఃఖ
మొందుదువు పరమందును ♦ నొందఁగలవు, ఘోరమగునారకాగ్ని సం♦కోచపడక.

గీ॥ అఖిలదేహులకెపుడు ప్రి♦యాత్ముఁడైన, యభవున కనహితులును బ్రి♦యాప్రియులును
లేరు; నిర్వైర శర్వుఁడె ♦ లియకయిట్లు, నీవ యెడచేసి తెవ్వారు♦నేరరిట్లు. 295

చ॥ పరుల గుణంబులన్ జడులు ♦ నల్కుచునుంద్రు దోసంగులంచు నే
ర్పరులు గుణంబులన్ బడసి ♦ పాటియొనర్పరు దోషబృందముల్
బరము లిఁకెప్డు దోసములఁ ♦ బ్రౌఢిగుణంబులుగా నొనర్తు రి
ప్పురసున నీ వనార్యమతి ♦ భర్గునియం దఘమెంచినా విటుల్. 296

గీ॥ ఉత్తమజనాంఘ్రిరజమున ♦ నూడ్పఁబడిన
తెలివిగల కుణపాత్మవా ♦ దులు జగమున
నుత్తముల నీసుమైదూఱు ♦ చుందు రెందు
నదియె మంగళమై తన ♦ రారుఁగాక. 297

క॥ శివయను నక్కరములు రెం, డవియించును దలఁచువారి ♦ యఘపుంజములన్
శివునిఁ బవిత్రయశస్కుని, శివేతరుఁడ వీవు దెగడఁ ♦ జిత్రంబగునే? 29

ఆ॥ ఎవని పాదపద్మ ♦ మేవేళ బ్రహ్మాద,సాసవాద్యు లర్థి ♦ దాసి హృన్మి
ళింవముల నికాము ♦ మొందుదురో తృప్తి, యట్టి విశ్వగురున ♦ కలిగితీవు. 29

ఉ॥ ఈ హరి నీ పితామహుని ♦ నీ పురుహూతుని నీ మునీంద్రులన్
మోహముతోడఁ బిల్చి యల ♦ భూతపతిన్ విడనాడితీవు నీ
రా హుతచేతనే పదవు ♦ లంది యిటుల్ దొరలైరి యద్ది నీ
వూహ నెఱుంగకిప్పగిది ♦ నుత్పథమొందితి వజ్ఞశేముషీ ! 283

## —* సతీదేవి విష్ణ్వాదిదేవతల నుపాలంభించుట *—

వ. ఇట్టులడిగి నిలింపులన్ జూచి యిట్లనియె.

చ॥ చనునె హరీ ! సరోజభవ ! ♦ శక్ర ! హుతాశనముఖ్యులార ! స
న్మునికులవర్యులార ! శశి ♦ భూషణుఁ డబ్జభవాండభాండపా
వనుఁ డతులుండు కానియెడ ♦ వాసిగ మీరలుచేరి హవ్యముల్
గొనుచు వసించినారిటులఁ ♦ గొంకును జంకును మాని యాత్మలన్. 284

ఉ॥ ఓయి రమేశ ! నిన్ను నిటు ♦ లున్నతమొందఁగఁజేసి మేటి యా
మ్నాయములిచ్చి దైత్యజన ♦ మారణసాధనమైన చక్రమున్
శ్రీయలరంగ నిచ్చియు న ♦ శేషజగత్సముదాయనాథుఁగాఁ
జేయఁగలేడె ? విస్మృతినిఁ ♦ జెందఁగ మందమనీష ! యొప్పునే. 285

చ॥ నలినజ ! నిన్నుఁబుట్టఁగ నొ ♦ నర్చి శ్రుతిప్రకరంబొసంగి యీ
విలసిత లోకరాజి నొద ♦ వింపఁగఁ జేసెడు సృష్టిచాతురిన్
బలమునొసంగి సర్వసుర ♦ వందితుఁజేసె దయాళు నాశివున్
దలఁపఁగఁజెల్లదే యిటుల ♦ దర్పము సర్పమువోలెఁ జెందెదే ? 286

గీ॥ చెలఁగి నీ యైదవశిరంబుఁ ♦ జిదిమివైచి
మదముఁబోకడఁ బెట్టిన ♦ మానసమున
నదియు నేనియు దలఁపవే ♦ మచ్చరియము
పంకజోద్భవ ! యిమ్మాడ్కి ♦ బాటఁదొలఁగి. 287

ఆ॥ అమరనాథ ! యేల ♦ యతిగర్వితుండవై, నిక్కి దడిచిపడకు ♦ నీదుహస్త
మశనితోడ స్తంభ ♦ మందించు టెఱుఁగవే, మరలఁగుడుతు వార్తి ♦ బిరబిరనిట.

క॥ అనియెడు కూఁతును గని పెను, కినుకన్ గొని యిట్టులనె నొ ♦ గిన్ దక్షుఁడు మా
నిని ! నిన్నెవ్వరు పిలిచిరి ♦ చనునే ? యిటు పిలుపులేని ♦ సవనముఁజేరన్ 289

ఉ॥ పొమ్మిఁక నూరకుండు మటుఁ ♦ బోవకయుండిన నీదు నాథు జ
న్మమ్మునకేను బిల్వ నుగు ♦ ణమ్మొకఁడేనియు లేదు ప్రేతభూ
తమ్ములతోడ నేస్తము స ♦ తమ్మొనరించుచు నొల్కియుండు ని
త్యమ్ముగనుండుఁ గశ్మలుఁడు ♦ దైవతగోష్ఠికిఁ బాపితిన్ జుమీ !

గీ॥ అరయ కిదియెల్ల నా విరూ ♦ పాక్షునకును
నిన్నొసంగితి విధిఁబట్టి ♦ నేర్పుమాలి
అరసి యింక నల్కవిడుము దా ♦ యమును గొనుము
నీవుమాత్రిము దాక్షాయ ♦ ణీ! రయమున. 291

## — * సతీదేవి దక్షునిఁ దెగడుట *—

వ. అనిన విని మహేశ్వరి దురాత్ముఁడగు నాత్మజనకుని ప్రలాపంబుల కత్యంతంబు గనలి మనంబున నీశ్వరోక్తిందలఁచి యం దవిశ్వాసం బొనర్చిన తనదు ననుచితంబును వరప్రదాన సమయంబునందు శంకరుఁడు దనకుఁజేసిన సమయంబును నారసి పశ్చాత్తాపంబుఁజెంది మనంబునం దిట్లాందోళనం బొనర్చె

ఉ॥ ఎట్టులఁ బోవుదానిక ♦ నే విభునొద్దకుఁ జిక్కవచ్చె న
న్నెట్టుల నేలు సర్వజగ ♦ దీశ్వరుఁ డిందలి వృత్తమడ్గ నే
నెట్టుల నీ దురాత్ము తెఱఁ ♦ గెర్పడఁ జెప్పుదు ముప్పమూఁడె ని
క్కట్టునఁ గూలితిన్ విభుఁడు ♦ గాపన మానఁగ లేకపోయితిన్. 292

వ. అని తండ్రి నుద్దేశించి

గీ॥ జనక! శంకరు నిందచే♦సినయఘంబుఁ, గుడుతువింక సందియములేదు ♦ గొప్పదుఃఖ
మొందెదవు పరమందును ♦ నొందఁగలవు, ఘోరమగునారకాగ్ని సం♦కోచపడక.

గీ॥ అఖిలదేవులకెపుడు ప్రి♦యాత్ముఁడైన, యభవునకనధికులును బ్రి♦యాప్రియులును
లేరు; నిర్వైరు శర్వుఁడె ♦ లియకయిట్లు, నీవ యెడచేసి తెవ్వారు♦నేరరిట్లు. 295

చ॥ పరుల గుణంబులన్ జడులు ♦ వల్కుచునుందురు దోసంగులంచు నే
ర్పరులు గుణంబులన్ బడసి ♦ పాటిరియొనర్పరు దోషబృందముల్
బరము లిఁకెప్ప దోసములఁ ♦ బ్రీతిగుణంబులుగా నొనర్తు రి
ప్పరసున నీ వనార్యమతి ♦ భర్గునియం దఘమెంచినా విటుల్. 296

గీ॥ ఉత్తమజనాంఘ్రిరజమున ♦ నూడ్పఁబడిన
తెలివిగల కుణపాత్మవా ♦ దులు జగమున
నుత్తముల నీసుమైదూఱు ♦ చుందు రెందు
నదియె మంగళమై తన ♦ రారుఁగాక. 297

క॥ శివయను నక్కరములు రెం, డవియించును దలఁచువారి ♦ యఘపుంజములన్
శివునిఁ బవిత్రియశస్కుని, శివేతరుఁడ వీవు దెగడఁ ♦ జిత్రంబగునే? 298

ఆ॥ ఎవని పాదపద్మ ♦ మేవేళ బ్రహ్మర,సాసవాప్తులర్థి ♦ డాసి వ్యాప్తి
శింపముల నిశామ ♦ మొందుదురో తృప్తి, యట్టి విశ్వగురున ♦ కలిగితీవు. 299

చ॥ విను మఖముఖ్యులై యలరు ♦ వేలుపులెల్లరు నొల్కిమిట్టలోఁ
బసకలు బూదినిక్కగొనియు ♦ భూతగణంబులతోఁ జరించు శ
ర్వుని పదపాంసులేశమును ♦ బూని ధరింతురు మౌళులందు నీ
వనినయటుల్ దలంప రశి ♦ వాత్మునిఁగాఁగ శివుండ్ శివేతరా ! 300

ఆ॥ విను ప్రవృత్తమని ని ♦ వృత్తమనియుఁ గర్మ, మఖిలవేదవితతి ♦ నన్యగతి వి
భాగమొందియుండె♦రాగవైరాగ్యల, క్షణములొప్పమీఱఁ♦ గ్రమము మెఱయ.

ఆ॥ ఒక్కకర్తయందు ♦ యుగపదాచరణంబు, కర్మయుగమునకు ని ♦ కామవైర
మెట్టికర్మమేని♦యొసఁగదు బ్రహ్మమం, దెఱుఁగు హృదయమందు♦ నివ్విధంబు.

ఉ॥ ఆయణిమాదులౌ పదవు ♦ లస్ఫుటకారణముల్ మహాత్మహృ
ద్ధేయము లస్మదీయములు ♦ కిల్బిషి ! నీకొనగూడవెప్ప నిన్
డాయును యజ్ఞగేహములఁ ♦ దద్విహితోదనతృప్తులై కడున్
బాయక ధూమవర్త్మలగు ♦ వారలు మెచ్చు పదంబు లారయన్. 303

ఉ॥ ఎవ్వఁడు శంకరున్ దెగడు ♦ నెవ్వఁడు తత్పరివాదవాదమున్
గ్రొవ్వివినున్ సమానముగఁ ♦ గూలుదురిద్దఱు నారకాంధునన్
జివ్వన శబ్దదూషకుని ♦ జిహ్వ నుగోయఁగఁజెల్లుఁ జాలఁడేన్
నెవ్వగఁ జానఁజెల్లు నటు ♦ నీల్లనిచో నెడఁబాయఁగాఁదగున్.

ఉ॥ కావుననే త్వదీయమును ♦ గశ్మలమై తగు నాదు దేహమున్
బోవిడుదానఁ జాలునిఁకఁ ♦ బుణ్యుని నిందయొనర్చినట్టి నీ
యేవపు చెష్టచుట్టఱిక ♦ మింపునుగావుత బ్రహ్మణబ్రువా !
తావకమూర్తిజాతతను ♦ దాహముఁజేతు సుఖంతు నాపయిన్. 305

క॥ నను దాక్షాయణి యనినా, మనోవిభుఁడు పిలువ నాదు ♦ మనమింకనొచ్చున్
జనములు మెచ్చఁగ నీతను, వును గుణపమునట్టుఁబాసి♦పొందెద శుభముల్.

## —* సతీదేవి దేవతలను శపించుట *—

క॥ సురలు మునులీరు వినుఁడిఁక, యరయక యనుచితపుఁగర్మ ♦ మామోదమునన్
జరుపుచునుంటిరి జడులై, హరుదండమునొంది దుఃఖ ♦ మందుదురు వెసన్. 307

ఆ॥ ఇట్లు పల్కికినిసి ♦ యీశ్వరి యుత్తరా, భిముఖ మొప్పనట్లు ♦ పృథ్విఁగూరు
చుండి మౌనమొంది ♦ యుదక మాచమనంబు, చేసి కనులుమూసి♦శివునిఁదలఁచి.

క॥ దేవాదిదేవుఁడగు శివ, దేవునియంకతలమందుఁ ♦ దేజరిలునొడల్
గావల్వఁడగు దక్షునిపగ, కీవిధిఁ బాయంగనెంచి ♦ యెంతయుఁ బూన్కిన్.

గీ॥ ప్రాణము నపానమును నొక ♦ పగిది నాభి
నుంచి వెడలించి హృదయము ♦ నుంచి బుద్ధి
తో నచటనుండి కంఠంబు ♦ తో భ్రూనభోమల
మధ్యమునఁ జేర్చి యంత శాం ♦ భవి రయమున. 308

## —* సతీదేవి యోగాగ్నిచే దగ్ధమగుట *—

గీ॥ ఒడలియందు మరుద్వహ్ని ♦ హోత్రధార, ణామునఁదనరఁ జేసి శివపదా ♦ బ్జములు దక్ష-
కన్య యెద్దియుఁ గనకుండె ♦ నపుడు యోగ, వహ్నులుజ్వలించి దహించె ♦ వడిగ నొడలు.
క॥ ఆకసమునఁ బుడమియందున్, శోకగనున్నట్టి రద్ది ♦ చూచి కడున్ హా
హాకారంబులు సెలఁగఁగ, శోకంబును జెంది దక్షుఁ ♦ జూచి యని రిటుల్. 311

సీ॥ తివిరి యొక్క కలకె ♦ తెల్లవాఱునె దక్ష!, మరియుఁ బోకుము నికొం ♦ దఱు నొడివిరి
ఇల్లల్కినంతట ♦ నే పండుగౌనొకో, కనఁబోదు వని కొంద ♦ ఱనిరి మీఱి
ముందఱ నున్నది ♦ ముదుసళ్ళపండుగ, యయ్యతో నంపఱ ♦ కనిరి కొంద
ఱిది కట్టిపడుపు నీ ♦ వెందేగఁ దప్పదు, కూఁతుఁ గోడని యును ♦ గొందఱనిరి
గీ॥ జగములీ సూర్యచంద్ర న ♦ క్షత్రరాసు, లెంతవఱ కిద్ధకాంతుల ♦ నేపుమీఱు
నంతవఱ కీవు పుత్రికా ♦ హంతకుండ, వనుచు దుష్కీర్తి నొందెద ♦ వనిరి వనరి. 312
క॥ ఆ శివురాణికిఁ వెనుకొని, యా శాలను జేరినట్టి ♦ యభవానుచరుల్
శ్రీశివ సురుఁగుడు గని హా, హా శాంకరి! యనుచు దుఃఖ ♦ మంది రయమునన్.
ఆ॥ పరశు శూల ఖడ్గ ♦ ధరులై చు బిరబిర, దక్షుఁ జదుపవచ్చు ♦ తత్త్వమరసి
యజ్ఞహంతృ మారణార్థమై దక్షిణా, గ్నిని భృగుండు హావన ♦ మును బొనర్చె.
వ. దానఁ జేసి
క॥ భూరితరబలులు ఋభు లను, వారు పొడమి యుల్ముకములఁ ♦ బట్టి యురగ కే
యూరుని పారిషదులతోఁ, బోరి పఱవఁ జేసిరంతఁ ♦ బొంకము మీఱన్. 315

## —* ఆకాశవాణి దక్షుని శపించుట *—

వ. అంత నయ్యవసరంబున నభోవాణి పెద్దయెలుంగుతో నచ్చటివారెల్ల రాల
కించి యచ్చెరువొంది యదరుఁజెంద నిట్లు వక్కాణించె. 316
ఉ॥ ఓరి మదాంధ! దక్ష! విను ♦ ముగ్రనితోడ విరోధమొంది యి
ట్లాఱడి యాగమున్ గడఁగి ♦ యాత్మజ నంతముఁ జేసి తేవపుం
ధీరతనొంది యింకను ద ♦ ధీచి హితోక్తి నవాదరించితో
కారి! యఘంబుపై నఘము ♦ నార్జనఁ జేసితి విట్లు దుర్మతీ! 317

సీ॥ ఏ సతీదేవి బా ♦ లేందుశేఖర పత్ని, యఖిలలోక సముచ్చ ♦ యంబు లేలు
ఏ సతీదేవి బ్ర ♦ హ్మేంద్రచంద్రార్క ప్ర, ముఖ నిర్జరశ్రేణి ♦ పూజలొందు
ఏ సతీదేవి యో ♦ గీంద్ర మనోరాజి, బ్రహ్మవిద్యాకృతిఁ ♦ బరిఢవిల్లు
ఏ సతీదేవి భ ♦ క్తేష్టంబు లారసి, భోగమోక్షంబులఁ ♦ బూన్కి నొసఁగు
గీ॥ ఏ సతీదేవి కల్పాంత ♦ మీఁకుచేసి, సర్వసంహార మొనగించుఁ ♦ జటులశక్తి
ఆ సతీదేవి నిత్య క ♦ ల్యాణమూర్తి, నా జగన్మాత నెఱఁజేసి ♦ తౌర ద్రోహి!
గీ॥ దీని ఫలమంత యిప్పుడె సం ♦ దియము లేక, కుడుతు వింక నీ సభాస్థాన ♦ కోటితోడ
నీదు మస్తంబు దెగిపడు ♦ నేలమీఁద, సవనమిది భంగమున్ జెందు ♦ సత్వరముగ.

వ. మఱియును.

క॥ నిను జేరిన యీ దివ్యుల, కనుచిత కర్మలకు శాస్తి ♦ యగు మెండుగ వె
న్కను ముందుఁగనక పీ రీ, యనువున విందులను మెక్కి ♦ రఘసంబు మెయిన్.

వ. అని యిట్లు వచించి యూరకుండుఁడు

ఉ॥ అంత సురల్ మునుల్ మనము ♦ లందు విషాదమునున్ భయంబున
త్యంతము నొంది ముందఱ మ ♦ హాపద డాయుచునున్న యట్లుగా
నెంతయు నిశ్చయించి వన ♦ జేక్షణు సన్నిధిఁ జేరి దేవ! క
ల్పాంతమువోలెఁ దోఁచెడు ద ♦ యామతిఁ బ్రోవఁగడంగు మిందఱన్. 321

క॥ అని యర్థించిరి దక్షుం, డును జక్రాయుధున కెఱఁగి ♦ సుతిఁజేసి యసెన్
వనజాక్ష! నీదు సాయము, నసె జన్నము సేయఁగడఁగి ♦ నాఁడ పనుపుమీ.

వ. అని యభ్యర్థించె నంతమీఁద,

మత్తకోకిల. పాఱినట్టి గణంబులెల్లఁ గ ♦ పర్దిఁజేరఁగఁబోయి యా
ఘోరమంతయుఁ దెల్పి రంతనె ♦ కోపిదోత్తముఁడైన య
న్నారదర్షియు శర్వుఁజేరి ప్ర ♦ ణామముల్ పొనరించి యా
తీరునంతయుఁ బూసగుచ్చిన ♦ తీరుఁదెల్పెను రోజుచున్. 323

## —* శ్రీ వీరభద్ర జననము *—

చ॥ విని పరమాగ్రహంబుఁగొని ♦ విశ్వగురుండు కఠోరఘోరగ
ర్జన మొనరించి యొక్కజడఁ ♦ జక్కఁ దెగన్గొని పర్వతాగ్రమే
దినిపయిఁ గొట్టినంతనె య ♦ దీర్ఘతరప్రళయాభ్రఘోషముల్
దనర ధగద్ధగచ్ఛవులు ♦ దార్కొని వెల్గొనరింప నెల్లెడన్. 324

మ॥ ప్రలయార్కద్యుతియెల్ల విశ్వముపయిన్ ♦ వ్యాపింప దివ్యాయుధో
జ్జ్వలముల్ హస్తసహస్రముల్ వెలయ దీ ♦ వ్యద్భీకరామాంచత్కళా
లలితాకారుఁడు వీరభద్రుఁడు మహో ♦ ల్లాసంబునన్ బుట్టె న
క్కలనన్ బ్రోల్చెను భద్రకాళి యటులే ♦ కీర్తింప వైమానికుల్. 325

క॥ వారలతోడనె పోడమెను, భూరితర కృపాణపాణి ♦ భూతవితతులున్
ఘోరజ్వరములు తనువుల, తో రాజిల్లుచును దోషు ♦ తోడ రయమునన్.

ఆ॥ పోడమి యిట్లు వీర ♦ మూర్ధన్యుఁ డీశ్వరుఁ, జేరి సాఁగిమ్రొక్కి ♦ శిరసువంచి
ఏమిసేయవలయు ♦ నెఱిఁగింపు మిఁక నాకు, సకలభువననికర ♦ చక్రవర్తి!

సీ॥ ఇంకఁగఁ జేతునా? ♦ యీ సప్తసాగర, సలిలంబు లన్నియు ♦ జలధితూణ!
పిండియొనర్తునా? ♦ పేర్మి నీకులపర్వ, తముల మొత్తమ్ముల ♦ ధర్మనిరత!
ముక్కలుచేతునా? ♦ దిక్కరీంద్రంబుల, యకుంభతలముల ♦ ననఘచరిత!
కసవొనరింతునా? ♦ కమలజాండములెల్లఁ, గదిసి చేపట్టి గం ♦ గాజటాల!

గీ॥ చిదిమివైతునె? భాస్కర ♦ శీతకరుల, గరుడ గంధర్వ యక్షరా ♦ క్షస నిలింప
సిద్ధమునిచారణోరగ ♦ శ్రేణిఁబట్టి, హింస యొనరింతునా? బల్మి ♦ ఘూంస మెఱయ.

గీ॥ నీ కరుణ నన్ను మించిన ♦ లోకశూరుఁ, డెందు లేఁడిది నిక్కువం ♦ బిందుభూష!
ఎద్ది సెప్పిన నొనరింతు ♦ నిపుడె వేగ, సెలవొసఁగి పంపుమా దృతిఁ ♦ జేసి జనక!

వ. అనిన మహేశ్వరుం డిట్లనియె.

క॥ సవనముతో దక్షుఁ జదుప, మవినీతుని నీవు మామ ♦ కాంశప్రభవుం
డవు నీచేఁ దెగుదురిఁకన్, దివిజులు మునిజులును నేని ♦ దీవ్యచ్ఛక్తిన్. 330

క॥ అని నుడువఁగఁ బరితోషముఁ, గొని సాఁగిలిమ్రొక్కి సెలవుఁ ♦ గొని కాళితో
నను చరవర్గంబులతో, ఘనభూతప్రతతితోడఁ ♦ గదలె రయమునన్. 331

## —* శివుని సెలవుచే వీరభద్రుండు దక్షయజ్ఞంబున కరుగుట *—

వ. అంత నవ్వీరుం డయుతసింహంబులు పూన్చిన దివ్యస్యందనంబుపై నెక్కి సింహశార్దూల గజ తురంగబలీవర్దంబుల నెక్కి సాయుధులై వచ్చు మూడుకోట్లు రుద్రగణంబులతో వెడలుడు భేరీనాదంబులు శంఖనిస్వనంబులు పటహఝల్లరీకాహళమృదంగఘంటావేణువీణాడమరుఘటధ్వానంబు లొనరింపుచు పారిషదబృందంబు లనేకంబులు ముందు నడచిరి. ఇఁక గణపాలురగు శంకుకర్ణుండును, అమోఘుండును, కోకిలుండును, కాష్టాంగుష్టుండును, సుమంతకుండును, కాకపాదోదరుండును, సంతానకుండును, మహాబలుండును, మధుపింగుండును, పూర్ణభద్రుండును, చతుర్వక్త్రుండును, విరూపాక్షుండును, సంవర్తకుండును, లకులీశుండును, లోకాంతకుండును, దైత్యాంతకుండును, అశనియు, బాలకుండును, గపాలీశుండును, సందారకుండును, కుండవిష్టంభకులును, సన్నాదుండు, పిప్పిలుండును, చంద్రతాపనుఁడు, మహావేశుఁడును, కాలకాలక మహాకాలురును, అగ్నికృత్తును, అగ్నిముఖుఁడును, ఆదిత్యమూర్ధుఁడును, వికృతుఁడును, విశాఖుఁడును, సర్వాంక

కుఁడును, జ్వాలావేశుఁడును, బర్వతకుండును, క్షేత్రపాలకుండగు భైరవుండును, సుకేశీవల్లభుండగు నందీశుఁడును, సర్వసేనానియగు చండీశుండును, మహాగణేశ్వరుండగు మణిమంతుండును ననేకకోటిప్రమథభూత వీరసైన్యంబులతో ననుగమించిరి. ఇఁక భద్రకాళియు, విభుని పిఱుంద సింగంబెక్కి సాయుధయై సాయుధలగు మహాకాళీ, గౌరీ, కాత్యాయనీ, చాముండా, ముండమర్దినీ, భద్రా, వైష్ణవీ, ఈశానీ, నారసింహీనామక నవదుర్గలతో శాకినీ, ఢాకినీ, కుశ్మాండీ, పర్పటీ, చటికాజ్వర, బలంబులతోఁ జతుష్షష్టియోగినీచక్రంబుతో, నాసురీ, యక్షిణీ, మోహినీ బలంబులతో ననుగమించెనంత శివాజ్ఞంజేసి యవ్వారిపైఁ గల్పప్రసూనవర్షంబును సుగంధపవమానప్రచారం బమరి శుభశకునంబు లేపొందెనంతఁ గనఖలంబందలి దక్షాధ్వరశాలయందు దుర్నిమిత్తంబులు పెక్కు లుత్పన్నంబులగుచునుండె.

సీ॥ భానుమండలముపైఁ ♦ బరివేషములు చుట్టె, తారాగణంబులెం ♦ తయునుడుల్లె
కడఁగి వెన్వెంట ను ♦ ల్కావృష్టి చెలరేఁగె, శోణితవృష్టులె ♦ చ్చోటనుమీఱె
గొప్ప సర్పంబులు ♦ గూలి కూయుచునుండె, వృశ్చికవర్షముల్ ♦ విస్తరిల్లె
ఖరవాతముల్ మెండు ♦ గా నేచివీచె ధ, వళవృశ్చికంబులు ♦ పొలిచెఁబుడమి

గీ॥ దక్షువామాక్షియును వామ ♦ పక్షములును
బెక్కుతడవలదిరె మఱి ♦ యుక్కు మిగిలి
గృధ్రములు దక్షుతల ముట్టి ♦ కెరలుచుండె
శలభములు నిండె నధ్వర ♦ శాలనెందు. 133

వ. అంత.

చ॥ తనరెఁ బరాగ ముత్తరప ♦ థమ్మునుండి యఖండభంగి నిం
గిని బుడమిన్ నిరంతరము ♦ నీల్గొని చీఁకటిఁ బర్వజేయుచున్
వినఁబడె వీరహుంకృతుల ♦ విస్ఫుటభైరవరావధోరణుల్
మునులు సదస్యులున్ విని గు ♦ ముల్గొని కంపితచిత్తులై రటన్. 334

—* ఉత్పాతంబులకు వీరిణి మున్నగువారు భయపడుట *—

వ. అందువీరిణి మొదలగు దేవీజనంబులెల్ల నాఘోరంబులన్నియుఁ గ్రమంబుగఁ గాంచి వగచుచుఁ దమలో దక్షునిఁగూర్చి యిట్లు దలంచిరి.

ఉ॥ కూఁతును గోలుపోయెఁ బయిఁ ♦ గూలఁగ వచ్చె విపత్తు మోఱకుం
డీతఁడు కాలకాలుని మ ♦ హేశ్వరుఁ జుల్కనఁజేసి జన్మమున్
నీతిదొరంగి యిట్టు లతి ♦ నిందితభంగిఁ గడంగె నెక్కడో
పాతకమిద్ది మిన్నకయ ♦ పాయునె డాయునుగాక దోడుతోన్. 336

గీ॥ ఇట్టు లనుకొనుచున్నంత ♦ నేగుదెంచి, రకట వికటాట్టహాసంబు ♦ లత్యుదగ్ర
భీషణధ్వానములు మీఱ ♦ బృథులవీర, భూతవర్యులు దళములు ♦ ముట్టికొనఁగ.

చ॥ పొడఁగని వేల్పులున్ మునులు ♦ పొంకము దప్పి కడున్ భయంబునన్
వడఁకుచు నల్లడ ల్లనుచు ♦ వాయిడి కూయుచుఁ దత్తరిల్లుచున్
వడిఁ బరుగెత్తి పోవుచును ♦ వచ్చుచుఁ జచ్చితిమంచు నొచ్చుచున్
పడుచును లేచుచున్ మిగుల ♦ బాలిశులై విలపించి రెంతయున్. 338

వ. అయ్యవసరంబున

గీ॥ దర్పమంతయుఁ గోల్పోయి ♦ దక్షుఁడును ద
దీయ ముఖ్యానుచరులును ♦ దోయజాక్షుఁ
జేరి యభయంబు గోరుడు ♦ శ్రీదయితుఁడు
వీరభద్రుని రాక భా ♦ వించి మదిని. 339

ఉ॥ తానును జంకునొంది యల ♦ దక్షునితో ననె యాజి! నీవు దు
ర్మానముఁ జెంది యుగ్ర నన ♦ మాను మహామహు నిందఁజేసి యీ
కానని జన్మమొందితివి ♦ కల్మషమున్ వడిఁ గట్టికొంటి వి
ప్లేను గడంగినన్ విడువ ♦ దీవినిపాతము సర్వభంగులన్. 340

శా. నేనున్ ధాతయు నీతిమాలి యిటులన్ ♦ నీయాగమున్ జేరి యెం
తేనిన్ భంగముఁ జెందనుంటి మది య ♦ ట్లేయా నిఁకన్ దివ్యులున్
మానుల్ లెక్కకు వచ్చువారె దటీసెన్ ♦ మాద్యద్భటశ్రేణితోఁ
దానై రుద్రుఁడు వీరభద్రుఁ డెటులన్ ♦ దప్పింతు నీభంగముల్. 341

## —* ఇంద్రాదులు వీరభద్రునితో యుద్ధము చేయుట *—

గీ॥ అంతలోననె యజ్ఞశా ♦ లాంతరాళ
మునకుఁ జేరిన యవ్వీర ♦ జనులఁ జూచి
యింద్రుఁడును నగ్ని యముఁడు నై ♦ ఋతుఁడు వరుణ
గంధవాహు లెదుర్కొని ♦ కడఁగి రాజి. 342

క॥ చండీశుం డశని విశా, ఖుండును దైత్యాంతకుండు ♦ గోకిలుఁడు నమో
ఘుండు ననువారు వారల, దండిగ నెదిరించి తాఁకి ♦ దర్పం బెసఁగన్. 343

క॥ వాహనముల నరదంబుల, సారెకు మర్దించి వారి ♦ చటులాయుధ వి
స్తారంబుల దూరంబునఁ, జూరున్ బొనరించి మెయులఁ ♦ బొనిపిరి శరముల్.

మ॥ మఱియున్ బైఁబడి చంపఁగాఁ దలఁచి య ♦ మ్మాహేశ్వరగ్రామణుల్
దఱియన్ వచ్చుటఁ జూచి వేగముగ న ♦ ద్దంభోళిభృన్ముఖ్యులం
దఱు భీతిన్ గొని పాఱిరప్పు మునులున్ ♦ దామోదరున్ జేర న
క్కఱి వేల్పాహవమొందఁగాఁ దలఁచి చ ♦ క్రన్ నిల్వఁ జక్రింబుతోన్. 344

ఉ॥ శంభుసుతుండు చూచి మధు ♦ శాసన! యుద్ధమొనర్ప వచ్చితే
కుంభిని నిన్నుఁబోల్పఁదగు ♦ కోవిదుఁ డొక్కఁడు గానవచ్చునే?
శంభునిఁగొల్చి తద్దయును ♦ సారభుజాబల మొంది యుక్కునన్
శుంభదరీంద్రసంఘముల ♦ నుక్కఁగఁజేయవె పెక్కుమార్లలన్. 346

ఉ॥ ఎక్కడనుండి చక్రము ర ♦ మేశ్వర! చెందితి వింత విస్మయం
బెక్కడనుండి దాపరిలె ♦ నింతయుఁ గన్గొనఁగూడదే మదిన్
జక్కఁగనిల్చు నీదయిన ♦ శక్తిని జూచెద నంతయున్ గడున్
బెక్కులు వాకులేల యిఁక ♦ వీఁకఁదొడంగు మణంగు బింకముల్. 347

గీ॥ కనవె? దాక్షాయణీపాత ♦ మనఘమూర్తి!
వినవె? మునివర్యుఁడగు దధీ ♦ చుని హితోక్తి
కడఁగిచేరితె యజ్ఞభా ♦ గమును జెంద
గిట్టదే? నీకు శివునకే ♦ క్రోవనేని. 348

మ॥ అనినన్ దానవవైరి యంత విని దా ♦ నాటోపమున్ జెంద కి
ట్లనె రుద్రాత్మజ! భద్రమూర్తి! విను నా ♦ యాంతర్యము న్నను శ
ర్వునెడన్ ద్వేషినిగాను భక్తుఁడనె నే ♦ ర్పున్ దక్షు యిట్టీ మఖం
బును జేరన్ జనుదెంచుటే యఘముగాఁ ♦ బొల్చున్ విధిప్రేరణన్. 349

ఉ॥ ఈతఁడు నాకు భక్తుఁడయి ♦ హెచ్చుగ వేడుటఁ జేసి యీసనం
బీ తెఱఁగొందియుంటిని మ ♦ హేశ్వరుఁ బిల్వమి నారయంగ లే
దీతని కిప్డు బాసట వ ♦ హింపక యుండిన నాడికొందుదున్
జేతము తీరుఁ దెల్పితిని ♦ చేయుము జేవయొసంగఁగా ననిన్. 350

గీ॥ అవలఁగానున్నదగు విజ ♦ యంబునీక, యగును సందియమేమిలే ♦ దయినసన్నుఁ
గడచి దక్షునిఁజేరు ని ♦ క్కచ్చియిద్ది, దైవదూషకులకు మేలు ♦ దారసిలునె.

## — * విష్ణు వీరభద్రుల యుద్ధము * —

చ॥ అనుటయు వీరభద్రుఁడు వి ♦ యంబెదఁజెందియు నట్లె యౌనుగా
కని దనుజాంతకున్ గదసి ♦ యక్కజమొందఁగఁ బెక్కుకైదువుల్
తనువునఁ గ్రుచ్చి యున్నతన ♦ దం బొనరించె రయంబుమీఱ న
వ్వనజవిలోచనుండు శర ♦ వర్షము వీరునిపైఁ దనర్చుచున్. 352

గీ॥ పాంచజన్యంబు నూఁదిన ♦ పాతెనట్టి, వాసవుఁడు మున్నుగాఁగల ♦ వారు మరలి
వీరబలములతోఁబోర ♦ వెడలి రంత, వీరభద్రుఁడు చండీశ ♦ భైరవులును. 353

గీ॥ వీరవర్యుల గణపాల ♦ ధీరవరుల, యోగినీచక్రమునుగూడి ♦ రేఁగి సురల
నెల్లఁబసిపట్టి మర్దించు ♦ టెఱిఁగియురగ, శయనుఁడవ్వారిపై సుద ♦ ర్శనము నేసె.

చ॥ అది గని యొక్క వీరుఁడు ర ♦ యంబున లాగి గ్రసించుచుండ న
ప్పదమునఁ దోయజేక్షణుఁడు ♦ పర్వునవచ్చి గణేంద్రు వక్త్రమున్
వదలిచి చక్రముఁ గొని జ ♦ వంబున నాత్మరథంబుఁ జేరె న
య్యదిగని వేల్పులెల్లరును ♦ నాసల బాసిరి సంగరమ్ముపై. 355

ఉ॥ అంత మహాత్ముఁడైన హరి ♦ యచ్చెరువై తగు యోగవిద్యచే
నంతములేని విష్ణుల మ ♦ హాత్ముల శంఖసుదర్శనాంకులన్
వింతగ సంతరింపఁ గని ♦ వీరుఁడు రుద్రమయంబు నస్త్రముఁ
బొంతనచేసి కాల్చె నల ♦ భూరిసుదర్శనపాణు లందఱన్. 356

క॥ ఆ తరువాయినె వెన్నునిఁ, జేతి త్రిశూలంబుతోడఁ ♦ జేవఁబొడువఁగా
నాతఁడు గడునొచ్చి పడిన్, భూతలమునఁ బడియె సురలు ♦ మునులున్
[ బొగలన్. 357 *

ఆ॥ కొంతవడికి లేచి ♦ క్రోధరక్తేక్షణుఁ, డగుచు గూఢపొచ్చ ♦ యానుఁడార్చి
వీరభద్రుపైన ♦ విసరివేయఁగఁ జక్ర, మీశుసేయఁగని మ ♦ హేశసుతుఁడు.

---

* శివపురాణే సతీ ఖండే సప్తత్రింశ దధ్యాయే—శ్లో॥ అథ విష్ణుర్మహాతేజాః । చక్రముద్యమ్య మూర్ఛితః...యుయుధే భగవాంస్తేన । వీరభద్రేణ మాధవః ॥ తయోస్సమభవద్యుద్ధం । సుఘోరం రోమహర్షణం । మహావీరాధిపత్యోస్తు । నానాస్త్రధరయోర్మునే ॥ విష్ణోర్యోగ బలాత్తస్య । దేహాదేవ సుదారుణాః । శంఖ చక్ర గదాహస్తాః । అసంఖ్యాతాశ్చ జజ్ఞిరే ॥ తేచాపియుయుధుస్తేన । వీరభద్రేణ భాషితాః । విష్ణువద్బలవంతోహి । నానాయుధ ధరాగణాః॥ తాన్ సర్వానపి వీరోసౌ । నారాయణ సమప్రభాన్ । భస్మీ చకార శూలేన । జ్ఞాత్వాసంస్మృత్య । శివం ప్రభుం ॥ తతశ్చోరసితం విష్ణుం । లీలయైవరణాజిరే । జఘాన వీరభద్రోహి । త్రిశూలేన మహాబలీ ॥ తేన ఘాతేన సహసా । విహతః పురుషోత్తమః । పపాతచతథాభూమౌ । విసంజ్ఞో భూన్మునే హరిః ॥ క్రోధరక్తేక్షణ శ్శ్రీమాన్ । తత ఉత్థాయ సప్రభుః । ప్రగృహ్యచక్రముద్యమ్య । అతిష్ఠత్ పురుషర్షభః ॥ తస్యచక్రం మహారౌద్రం । కాలాదిత్య సమప్రభం ॥ వ్యష్టం భయ దధీనాత్మా । వీరభద్రశ్శివాత్మజః ॥ మునే శంభోః ప్రభావాత్తు । మాయేశస్య మహాప్రభోః । నచచాల హరేశ్చక్రం । కరస్థం స్తంభితం ధ్రువం ॥ అథ విష్ణుర్గణేశేన । వీరభద్రేణ భాషితా । అతిష్ఠత్ స్తంభితస్తేన । శృంగవా నివనిశ్చలః ॥ తతో విష్ణుస్సంస్తంభితోహి । వీరభద్రేణ నారద । యజ్ఞోపమంత్రణ వశాత్ । స్తంభ నిర్ముక్తిమాయయా ॥ శార్ఙ్గం జగ్రాహ సక్రుద్ధః । స్వధనుస్సశరం మునే । త్రిభిశ్చ ధర్షితో బాణైః । తేన శార్ఙ్గం ధనుర్హరేః ॥ వీరభద్రేణ తత్తాత । త్రిధాభూత్ తత్ క్షణాన్మునే । అథ విష్ణుర్మహావాణ్యా । బోధితస్తం మహాగణం ॥ అసహ్యవర్చసం జ్ఞాత్వా । అంతర్ధాతుం మనోదధే । విష్ణుమయిగతేచైవ । దేవాశ్చ మునిభిస్సహ । వినిర్జితా గణైస్సర్వే । ఏతే యజ్ఞోప జీవినః ॥

చ॥ శివునిఁ దలంచి చక్రమును ♦ శ్రీపుభుజంబును స్తంభమొందుప
ట్లవిహతతేజుఁ డా భుజగ ♦ హారకుమారుఁ డొనర్పనప్డు కే
శవుఁడును మంత్రివేదులగు ♦ సన్మునివర్యుల మంత్రశక్తి బా
హువును గదల్చెఁ జక్రము స ♦ ముద్ధతిఁ జెందకయుండె స్తబ్ధమై. 359

వ. అంత నద్దానిఁ గాంచి యచ్యుతుండు

గీ॥ తివిరి సశరంబు శార్ఙ్గంబుఁ ♦ ద్రిప్పి వీర
భద్రుపై వేయ నాతండు ♦ వడిఁ ద్రిశూల
ధారఁ దుత్తునియలు చేసె ♦ దాని నంత
దవులఁగని నల్వ హరిచాటుఁ ♦ దఱిసి యనియె. 360

క॥ కానున్నది యగు నిట నే, మేనియు నొనరింప లబ్ధి ♦ యొసఁగదు వీరల్
గానని తెలుఁగున వీంట్లకుఁ, బోనగునని హెచ్చరింపఁ ♦ బురుషోత్తముఁడున్.

వ. సమయోచితంబుగ విధివచనంబు తీరనుష్ఠింపనెంచి సమరావనిఁ దొలంగి సూక్ష్మరూపంబు నొంది నిజధామంబుఁ జెందెఁ బద్మజుం డట్టులె యొనర్చె నద్ది యారసియు వీరభద్రుండు శివానుమతితో నుపేక్షించె నంత.

—* వీరభద్రుఁడు యజ్ఞశిరచ్ఛేదనంబు చేయుట *—

గీ॥ యజ్ఞమును భీతినొంది మృ ♦ గాకృతిన్ వ, హించి యాకసమునఁబడఁ ♦ గెల్తుటరసి
వాఁడినారసమున శిరః ♦ పాతమొనరఁ, జేసె శ్రీవీరభద్రుండు ♦ వాసిమెఱయ.

క॥ మునియగు నంగిరసుఁ గృశా, శ్వుని ధర్ము నరిష్టనేమి ♦ సువిదితు దత్త్రీ
ఘనుఁడగు కశ్యపునిఁ బదం, బున శిరములు మెట్టి కడిమి ♦ పొలుపెడలించెన్.

గీ॥ మఱియుఁ గొందఱు మునులను ♦ మట్టగించి
రిఁకను స్వాహాదులౌ వేల్పు ♦ టిగురుఁబోండ్లు
బుగులుకొనునట్లుగాఁ గొంద ♦ ఱగిచి నగిరి
పఱచు సురలను గొందఱు ♦ పట్టుకొనిరి. 365

క॥ కొందఱు ప్రాగ్వంశంబును, గొందఱు పత్నీభవనముఁ ♦ గొదగొనికడిమిన్
గొందఱు సదస్యశాలను, గొందఱు నాగ్నీధ్రశాలఁ ♦ గూల్చిరి వేగన్. 366

ఉ॥ కొందఱు కుండమేఖలలఁ ♦ గూల్చిరి కొందఱు యజ్ఞపాత్రలన్
జిందఱ వందఱౌనటులు ♦ చేసిరి కొందఱు వహ్నులార్పిరిం
కం దుడుసైన కొందఱు ప ♦ గన్ గొని కుండములందు మూత్రమే
పొందుచుఁ జేసి రిట్టు లెదు ♦ రొక్కఁడు లేకయె మించుపూన్కినై. 367

వ. అంత వీరభద్రుండును, మణిమంతుండును, నందియుఁ, జండీశ్వరుండును యజమాన భృగు భగపూషలన్ బట్టికొని తిగిచి పదంబులచేఁ గంఠంబులను మెట్టి.

## —* భృగ్వాదిమునుల శిక్ష - వీరభద్రుఁడు దక్షునిఁ జంపుట *—

సీ॥ భృగునిమీసల నూడఁ♦బెఱికె మణిమంతుఁ, డెవఁడు సభఁ గామీస ♦ మెత్తి త్రుళ్ళి
భగుని కన్గవ నంది♦పట్టి కోసె శపించు, పక్షు నెవ్వఁడు కంటఁ ♦ దానలర్చె
పూషుపండ్లను డుల్చెఁ♦ బూన్కి చండీశ్వరుఁ, డెవఁ డీశుఁ దిట్టుట ♦ కెగసి నవ్వె
దక్షునిశిర మసి♦ధార వీరప్రభుఁ, డంత ఖండించియు ♦ నంత దాని

గీ॥ శస్త్రములఁ ద్రెంపలేక వి ♦ స్మయముఁ జెంది
సంజ్ఞపన యోగబలిమి మ ♦ స్తము ద్రెంచి
దక్షిణాగ్నిని వేసి ద ♦ గ్ధంబొనర్చె
ప్రమథవీరులు సాధువా ♦ దములొనర్ప. 369

ఆ॥ పుష్పవృష్టి గురిసెఁ ♦ బురహరు తనయుపై, వీరవితతిపైన ♦ వెల్లివిరిసి
జయజయ ధ్వనులు ప్ర ♦ శస్తి మీఱఁగ నంతఁ, జనిరి రజతగిరికి ♦ శర్వుఁజేర.

వ. సులబ్ధసంప్రాప్తవిజయులై మహామోదంబుతోఁ బరమేశ్వరునిఁజేరి మ్రొక్కి విజయంబుఁ దెల్పినఁ బరమశివుండుఁ బరితోషంబుఁజెంది వీరభద్రున్ గౌరవించి గణాధ్యక్షు నొనర్చె నంత యజ్ఞం బట్లు భగ్నంబై ఛిన్నభిన్నాంగులైన ఋత్విక్సురమునిగణంబులన్ జూచి తక్కటివారంద ఱజునిఁదోడ్కొని వైకుంఠ పురంబునకరిగి యురగశయను దరిసించి మ్రొక్కి యవ్విధంబెల్లఁ దెలిపి యనుగ్రహించి దేవమునిరక్షణం బొనర్పుమని వేఁడుడు బుండరీకలోచనుం డిట్లనియె. 371

క॥ తేజోమయుఁడగు పురుషుని, పై జనుఁ డపరాధియగుచు ♦ బ్రదుకునె యెందున్
యోజింపఁదగదె యిట్టుల, నే జడుఁడేనియును గడిఁది ♦ యింగితమెసఁగన్.

మ॥ మనమెల్లన్ బరమేశ్వరున్ మఖవిభున్ ♦ మాన్యున్ వెలింజేసి ద
క్షుని యాగంబునఁ జూఱగొంటిమి హవి ♦ స్తోమంబు లిప్డైన నా
ఘనునిన్ గారుణికాగ్రగణ్యుని జగ ♦ త్కల్యాణమూర్తిన్ రయం
బున నంఘ్రుల్గొని "క్షమ్యతా" మని కడున్ ♦ బొల్పొప్పఁ వేడన్ దగున్. 373

క॥ ఎవఁడలిగినఁ జెడు జగమా, శివుని సతీవిధురు వేగఁ ♦ జేరి క్షమింపన్
స్తవములొనరించి తద్దయు, సవనము రక్షింపవలయు ♦ సముచితమిదియా.

ఉ॥ ఈమును లీసురల్ నలువ ♦ యీవును నేనును శోకశాసనుం
డే మహనీయ వీర్యబల ♦ మిట్టిది తత్త్వమిఁకట్టి దంచు నుం
తేమి యెఱుంగఁజాలము మ ♦ హేశ్వరుఁడట్టిఁడు వేఱుత్రోవతో
ఛే మెయి మెచ్చు నవ్వైరవు ♦ నెవ్వఁడు సేయు స్వతంత్రుపై నటుల్. 375

## —* విష్ణ్వాదిసురలు కైలాసమునకుఁ బోవుట *—

గీ॥ అనియిటులు చెప్పివైకుంఠు♦డఖిలసురల, మునులఁగొని నల్వతో వేగఁ♦బురహరేష్ట
వాసమై పోల్చునట్టి కై ♦ లాసశైల, రాజమునకేఁగి భయభక్తు ♦ లోజమెఱయ.

గీ॥ జన్మయోగతపోమంత్ర ♦ సమ్యగోషధులను సిద్ధులగుచు వారి ♦ కలవియై ప
రులకుఁబోరాక దివ్యాప్స ♦ రోజనముల, సకలగంధర్వ వితతుల ♦ సంగతమయి.

## —* కైలాసగిరి వర్ణనము *—

క॥ నానాధాతువిచిత్రిత, నానామణిమయశిరోఘ ♦ నంబయి యింపై,
నానామృగతతియుతమై, నానాపాదపలతాభి ♦ నందిత మగుచున్. 378

సీ॥ ఇష్టఫలములీగి ♦ కెందు ద్విజులఁబిల్చు, గల్పద్రుమములు శా ♦ ఖాకరముల
కిన్నరయువతులు ♦ కేరిగానంబుసే, యుచుకెందుఁ దిప్పుర ♦ జయోరుగాథ
సందడించెడు సతీ ♦ స్నానపుణ్యతరోద, ధై నంద యెచ్చోట ♦ నద్భుతగతిఁ
గప్పింపుటనఁటుల ♦ కంచెలతో నెందు, నళినీపులినము లా ♦ నందమొసఁగు

గీ॥ ఘనమయూరంబు లెందుఁ గే ♦ కల నిగుడ్చు
మూర్ఛనలొనర్చు మత్తాళి ♦ పుంజమెందు
దనరు సెలయేఱు లెచట వా ♦ దముల మించు
నేన్గు లెచ్చోట గిరియాన ♦ మెలమిఁజూపు. 379

వ. అట్టి శ్రీ కైలాసపర్వతంబునందు.

సీ॥ ఎలమావులును నిమ్మ ♦ లీత చిట్టీతలు, పారిజాతములు మం ♦ దారతరులు
పొన్నలునుచు సుర ♦ పొన్నలుఁ బొగడలు, గన్నేర్లు సంపఁగుల్ ♦ గాంచనములు
రేఁగులునుచు గంగ ♦ రేఁగులునుచు గొండ, గోఁగులుఁ బనసలు ♦ గోడిసెగములు
దబ్బలునుచు నార ♦ దబ్బలున్ నారిక, డములు కర్జూరముల్ ♦ క్రముకములును

గీ॥ వెలగలిప్పలుసిరికలు ♦ వేపతరులు, మేడినేరేడుమద్దిమా ♦ రేడుగములు
తాటిమ్రాఁకులుచీఁకటి♦ తరులుమఱ్ఱి, మ్రాకులును రావిమ్రానులు♦జోకమెఱయ.

గీ॥ తియ్యమామిడి రసదాడి♦తేనెయరఁటి, తీయదానిమ్మ గజనిమ్మ♦తెగలు మఱియు
రంజి నారింజగములు పే♦రాళమైన, వెదురుకోవలును బలాశ ♦ వృక్షరాజి. 381

గీ॥ పుష్పితాశోకములు మల్లె♦పొదలు జాది, తోఁపులును బండిగురివింద♦ తోఁపు లేపు
మీఱు బంగారుతామర ♦ తీర్మలిస్మరంగు, రంగులొప్పెడు కలువలు ♦ గల సరసులు.

క॥ ఏలకితీఁగెలు తాంబూ,లీలతలు లవంగలతలు ♦ లేఁబోకలునున్
మేలిమిజాతులు పలు త, క్కోలకముల వరుసలెంతొ ♦ తోసంబిడెడున్. 383

క॥ పలురకముల ద్రాక్షల పం, దిళు లెంతయు వింతఁగొలుపు ♦ తీయనఁదగు పం
డులగుత్తులఁ దనియుచు రా, చిలుకలు విందొంది పాడ ♦ శివమంత్రింబుల్.

సీ॥ ఇభములు సింహాశ♦రభముల్ పులుల్ గదు, పులు నొక్కచోటనేస్త♦మునవసించు
అడవియేన్గుల యొరి♦పిడినొప్పు హరిచంద, సముల గాడ్పులరించు ♦ నపుడులమది
రక్తకంఠఖగస్వ♦రముల మేళముఁజెందు, షట్పదమండలీ ♦ స్వరసరణులు
కలహంస కులపతుల్ ♦ కడఁగిచెప్పను శత, రుద్రీయ పాఠముల్ ♦ సచ్యముగను

గీ॥ పచ్చతే మెట్లుగఁదనర్చు ♦ పద్మసరసు, లింపుమెయిఁ బుణ్యకాంతల♦కిచ్చుముదము
పొంకమగు వెండిబంగరు ♦ పుష్పకములు, మేలిరతనాల గద్దెల ♦ మేలుమీఱు. ౩౮౫

ఉ॥ క్రోతులు కొండముచ్చులును ♦ క్రోడములున్ బులుల్ సివంగులున్
వాతమృగంబు లెల్గులును ♦ జస్తము లాలును నెద్దులున్ మనుం
బోతులు సింగముల్ శరభ♦ముల్ హరిణంబులు పాడిగేదెలున్
బోతులు గోడిగల్ హరులుఁ ♦ బొంకపు నాభిమృగంబు లొప్పెడున్. ౩౮౬

సీ॥ రుచుల "విశ్వాధికో ♦ రుద్రోమహర్షి"యు, నుచుఁ బాడుకలహంస♦నిచయములును
రూఢి "సర్వోహ్యేష♦రుద్ర"యంచొగిగాన, మొనరించుధార్తరా♦ష్ట్రనివహములు
ఎలమి "నీశావాస్య♦ మిద" మనిబోధించు, రాజహంస మనీషి ♦ రాజచయము
లలి "శివ ఏవకే♦ వల" యనుమనువును, జపియించు మల్లికా ♦ క్షసముదాయ

గీ॥ ములును గుండలిశక్తియ ♦ మ్మలకలరసి, యాసహస్రారచక్రంబు♦ నధిగమించి
అక్షరంబైన పరమశి ♦ వార్చనొంది, యలరు చక్రాంగసంఘంబు ♦ లమరియుండె.

వ, తత్ప్రదేశమధ్యంబందు,

గీ॥ యోజనశతంబుపొడవు పా ♦ దోనముగను, విరివి దైవాఅశాఖల♦ నలసి కొండ
నెల్లఁదలుగని నీడ శో♦భిల్లఁదగి ము, ముక్షుశరణం బయినవట♦భూజమందు ౩౮౮

సీ॥ అలుకనుబాసిన ♦ యంతకుఁ బోలి సు, ఖాసీనుఁడై యున్న ♦ యట్టివాని
శాంతాత్ములై తగు ♦ సనకాది సిద్ధుల, చే సేవలను జెంది ♦ చెలఁగువాని
జక్కులకును నల ♦ రక్కసులకు దొర, యా కుబేరుని పూజ ♦ లందువాని
విద్యాతపోయోగ ♦ విభుఁడై తదీయార్థ్య, మొంది విరాజిల్లు ♦ చున్నవాని

గీ॥ తపసులకు నిష్టమగు జటా♦దండ భస్మ, చర్మముల నెలరేకను ♦ సాంధ్యగగన
రుచినలరు గాత్రమెలమిఁ దా ♦ లిచినవాని, విశ్వమంగళములను న ♦ ర్పించువాని.

## —* విష్ణ్వాదులు శివుని దరిసించి ధ్యానంబొనర్చుట *—

సీ॥ దర్భమయంబయి ♦ తనరిన బ్రుసియందు, నుపవిష్టుఁడై సిరి ♦ నున్నవాని
సజ్జనుల్వినఁగ శా♦శ్వతపు బ్రహ్మంబు నా, రదునకుఁ జెప్పుచుఁ ♦ బొదలువాని

కుడితొడఁ జేరిచి ♦ యెడమకాలిని నెన్న, మోకాలిపయిఁ జెయిన్ ♦ బూనువాని
రాణింపఁ దర్కముద్ర ♦ దనరఁ జెందినయొకచేత, నొకచేత జపమాల ♦ నొందువాని
గీ॥ బ్రహ్మనిర్వాణ సుఖమున ♦ బరఁగువాని, యోగపట్టంబుఁ గట్టి చె ♦ న్నొందువాని
మునులకెల్ల రక్షకాద్యుఁడై ♦ పొలుచువానిఁ, బరమశివు నచ్యుతాదులో ♦ సురలుగనిరి.
గీ॥ నంది సెలవొంది దగ్గఱి ♦ వందనములొ, సర్చి శిరసుల నంజలుల్ ♦ చేర్చి నిలిచి
రభవుఁ డరవిందనయనుని ♦ కజునకును బ్ర, ణతులొసర్చి యొసఁగెనాస ♦ నములసంత.
వ. నారాయణుం డిట్లనియె.
గీ॥ ఎఱుఁగుదుము నిన్ను విశ్వేశు ♦ నీ జగతికి, యోని బీజములై యొప్పు ♦ మన్న శక్తి
శివులకును గారణంబయి ♦ చెన్నుమీఱు, నా నిరంతర బ్రహ్మంబ ♦ వయ్య నీవు.
గీ॥ సరవి స్వాంశములగు శివ ♦ శక్తులందు, నూర్ణపదముల్గ క్రీడింపు ♦ చుండి జగము
బొడమఁగాఁ జేసి పోషించి ♦ యడఁతు వీవు, నిర్వికార చిదానంద ♦ నిత్యరూప!
ఉ॥ నీవె త్రయీ సురక్షణము ♦ నెట్టనఁ జేయఁగ నధ్వరంబు మున్
బావన! పుట్టచేసితివి ♦ బల్లిదనై తగు సూత్రమేర్పడన్
శ్రీ విలసిల్లు ధర్మమయ ♦ సేతువులన్ బొనరించినావు భూ
దేవులు వాని నైష్ఠిక మ ♦ తిన్ బొనరింతు ర్వ్రతంబు నొందుచున్. 394
క॥ మంగళ! మంగళ కర్ములకుం గావించెదవు స్వర్గ ♦ కూటము ముక్తిన్
బొంగఱ నిడెదవు పెఱుల క, మంగళులకు నరక మెందు ♦ మాఱదదియె శేన్.
వ. అయినను

విష్ణుమూర్తి శివునితో దక్షునిబ్రతికించి యజ్ఞమునుబూర్తిచేయింపుమనుట

మ॥ బ్రతుకన్ జేయుము దక్షు నవ్వు భగనే ♦ త్రంబుల్ బ్రసాదింపు మా
ధృతి మీసంబులొసంగుమీ భృగునకున్ ♦ దెప్పింపు దంతంబు లు
న్నతకారుణ్యమయాత్మ! పూష కీక జ ♦ న్నంబందు నీచేత శి
క్షితులౌ దివ్యులు ఋత్విజుల్ సుఖతను ♦ శ్రీలొందఁ బాలింపుమా. 396
క॥ సమయించితి వలయజ్ఞశి, రము మరల సముద్ధరింపు ♦ క్రతు వెవ్వనిచే
సమసు ఫలసిద్ధి వానికిఁ, గుముఖులు భాగంబు నీక ♦ కూలిరి యజ్వుల్. 397
క॥ ఇది గొనుము పూర్ణభాగం, బిది క్రతుశేషంబు రుద్ర! ♦ యిది నీయుదియౌ
ముదమున నీభాగంబునఁ, బొదలఁగ నొనరింపు సవన ♦ పూర్తి మహేశా!
వ. అంత విరించి యిట్లనియె.
చ॥ చెడు మదినొంది భేదగతిఁ ♦ జేడ్పడి కర్మమునందె నిచ్చలున్
సుడివడువారు లాఁతుల య ♦ శోధనముల్గని కుందువారు నా
చెడుగులు మర్మముల్ దునియఁ ♦ జేయఁగఁ గూయుదు రన్యులన్ నడిన్
వడి నిశఁ జంపరట్టి విధి ♦ వంచితులన్ ఋషుబోటి సత్త్వముల్. 399

వ. ఇంద్రుఁడిట్లనియె.

క॥ వందనము నీలకంఠున, కిందుధరున కాద్యునకు మ ♦ హీయసునకు నా
నందైకహేతువునకు న, మందకృపామయతనునకు ♦ మహాత్మునకున్.

క॥ ధాతలకెల్లర కీవె వి,ధాతవు త్రిగుణాత్ముఁడవు సు ♦ ధాకరమకుటా!
నేతలకెల్లర కీవే, నేతవు పాలింపుమిఁకను ♦ నీదు జనములన్. 401

వ. దివ్యమునిజనంబు లిట్లనిరి.

సీ॥ ఉచితరూపునకు స ♦ ద్యోజాతమూర్తికి, గదికి శూలికి ధన్వి ♦ కిదియె ప్రణతి
వామదేవునకును ♦ వామనేత్రునకును, వామమూర్తికి నిదే ♦ వందనంబు
ఘోరఘోరునకు న ♦ ఘోరమూర్తికిఁ బరే, శునకు వికటునకు ♦ జోత యిదియె
పురుషార్థదునకుఁద ♦ త్పురుషమూర్తికనాది, పురుషున కిదియె చే ♦ మోడ్పుసేఁత

గీ॥ ఇనున కీశానమూర్తికి ♦ నీశ్వరునకు, బ్రహ్మరూపునకును బర ♦ బ్రహ్మ కిష్ట
తనునకుఁ ద్రియాతనునకును ♦ దరతనునకు, భక్తిఁగావింతుమిదె యభి ♦ వాదనంబు.

వ. అంత నిలింపులఁ గాంచి బాలేందుశేఖరుం డిట్లనియె

ఉ॥ మోహముఁ జెందినట్టి యల ♦ ముగ్ధులదోసము నేఁ దలంపఁ బా
పోహనుఁజెంది త్రుళ్ళిన దు ♦ రుద్ధతమూర్తుల శిక్షఁజేసితిన్
మోహితబుద్ధి దక్షుఁ డటు ♦ పూనిన జన్నము జన్నమొందె ని
ష్ఠో హరి! యో విరించి! వినుఁ ♦ డొప్పఁగ సర్వము నిర్వహిల్లఁగన్. 403

గీ॥ అధ్వరికి బస్తమస్తకం ♦ బమరు మిత్ర, చక్షువునఁ జూచు భగుఁడు పూ ♦ ష యజమాన
దంతములచేత నమలుచుఁ ♦ దానుఁ బిష్ట,భుక్కు భృగుండ జశ్మశ్రు ♦ వులను జెందు.

—* శివానుగ్రహమున దక్షుఁడు జీవించుట *—

వ. మఱియు ఋత్విక్కు లశ్వినీదేవతల బాహువులచేతను, బూషహస్తంబులచేతను బాహుహస్తంబులఁబడసి జీవింతు రట్లొనర్పుండన్న నయ్యాదిమదేవుని నుడుల కఖిలర్షి జనంబు లలరి సాధువాదంబుల ధన్యవాదంబులనొనర్చి మ్రొక్కిరంతఁ బుండరీకాక్షుండును విరించియు బరమశివుని సవనంబునకు భక్తిమెయి నామంత్రణంబు సేయుడు, మహాదేవుండు హర్షించి నందీశ్వరాదులతో నందుఁజని యట్లొనరింపఁజేయుడు నవ్వారెల్ల హరుసంబుఁ జెంద దక్షుండు నిద్ర మేల్కాంచినట్లు లేచి కూర్చుండి ప్రబోధంబుఁ జెంది ముందఱనున్న శివున్ జూచినయంతనె శరత్కాలంబు నందలి హ్రదంబుఁబోలి యకల్మషచిత్తుండై పూర్వవైరంబు మఱచి శివస్తవంబుఁ జేయఁబూనియు మృతిఁజెందిన కూఁతుఁదలఁచి దుఃఖంబున బాష్పపూరితనయనుఁడై యెద్దియుఁ బలుకఁజాలకున్న నెట్లో హృదయంబు బిగ్గపట్టి యిట్లు మహేశ్వరుఁ బ్రస్తుతించె.

ఉ॥ పెక్కులు తిట్టినట్టి నను ♦ బిట్టుగ దండము చేసి తద్ది దా
నెక్కు డనుగ్రహంబు గనె ♦ యేర్పడ నాయెడ నెన్నఁ డీవు పెం
పెక్కఁగ బ్రహ్మబంధువుల ♦ నేనియు నన్ననసేయఁబూన రా
చక్క మహేశ! యెట్లు వ్రత ♦ చర్యలఁ బాయుదు వీవు పేర్మిమై. 406

ఉ॥ వేదము రక్షసేయుటకు ♦ నెక్కనె యెష్టా తపోవ్రతేద్ధవి
ద్యాదులఁ జెన్నుమీఱ భవ ♦ దాస్యమునన్ సృజియించి విప్రులన్
గాదిలిప్రేమ నావులను ♦ గబ్బునఁ జేకొని కాచు గొల్లఁ డ
ట్లేఁదుచునుండు వెల్లపుడు ♦ నెంతయుఁ బాములఁ బాపి యీశ్వరా! 407

చ॥ నిను బరమాత్మ నారయక ♦ నే నటు లెగ్గులు పల్కినన్ మనం
బున నవి లెక్కసేయకయె ♦ పుణ్యవిగర్హణజాతపాతకం
బునఁ బెనుగోతఁగూలు నను ♦ భూరికృపన్ బ్రతికించి తిట్టులన్
నిను గొనియాడఁ జాలుదునె ♦ నీదగు పుణ్యమె నిన్ను మెచ్చెడున్. 408

గీ॥ వరదునకు విశ్వపతి కార్త ♦ బాంధవునకు, జ్ఞాననిధి కీశ్వరునకు స ♦ నాతనునకు
సర్వదేవాధిపతికిఁ బ్ర ♦ శాంతమతికి, సర్వకారణునకు నమ ♦ స్కార మిదియె. 409

—* శివుఁడు దక్షునకు హితంబుఁ జెప్పుట *—

గీ॥ అనియిటుల వేడి మ్రొక్కిన ♦ యట్టిదక్షుఁ
గని యనుగ్రహ మొంది యి ♦ ట్లనియె దక్ష!
విను ప్రసన్నుఁడ నైతి నే ♦ వేళనేని
భక్తులకు లోఁగువాఁడ నేన్ ♦ బ్రభుఁడనైన.

వ. నన్నుఁ బూజించుభక్తు లార్తుఁడు జిజ్ఞాసు వర్థార్థియు జ్ఞానియు ననువారలైనాల్గు విధంబులుగ నన్నర్చింతు రుత్తరోత్తరు లుత్తములు లందఱియందు జ్ఞాని నాకు ప్రియతరుం డగుఁడు నారూపుగఁ దెలియుము, నేను జ్ఞానగమ్యుండను గాని తదితరంబులకు సాధ్యుండనుగాను. 411

గీ॥ వేదములచేత నీక్రతు ♦ వితతిచేత, దానములచేతఁ దపసుచే ♦ దక్ష! నన్నుఁ
బడయఁజాలరు కర్మత ♦ త్పరులుపుడమి, భక్తిచేజ్ఞానమునఁ బట్టు ♦ పడుదు నెపుడు.

వ. నీవు భక్తిజ్ఞానంబులఁబాసి కేవల కర్మతత్పరుఁడవై యిట్లు బన్నంబు నొందితి వికమీఁద జ్ఞానమార్గంబు నాశ్రయింపుము. మఱియు వేఱొండు రహస్యంబు గల దది యెఱిఁగింతువినుము. 413

క॥ నేనును బ్రహ్మయు విష్ణుఁడు, పూనిజగంబులకు హేతు ♦ భూతులమైనన్
నే నీశ్వరుఁడను సాక్షిని, నేను స్వయంభాసకుఁడను ♦ నిత్యుఁడ వినుమా. 414

సీ॥ ఆత్మ మాయను గుణమయి ♦ నంది జగముఁ
బొడమఁ జేయుచుఁ సాఁకుచుఁ ♦ బొలియఁ జేయు
చును గ్రియోచిత నామంబు ♦ లొనరఁ దాల్చు
చుండు నీక నిందు సందియం ♦ బొదవ దెపుడు. 415

గీ॥ అట్టి పరమాత్మ నయిన నా♦యందు బ్రహ్మ, విష్ణులను భూతకోటినిఁ♦బిచ్చవాండ్రు
జెలఁగి వేఱుగఁ జూతురు♦శిరసు మొకము, మున్నయినవాని వేఱుగ♦నెన్నఁ డెవఁడు.

క॥ సకలాత్ములమై నిచ్చలు, నొకరూపగు మా ముగురను ♦ నొండు తెఱఁగు నెం
చక సేవించునతండే, యకలంకంబైన శాంతి ♦ నందికొను భువిన్. 417

వ. ఇఁక నట్లుగాక,

సీ॥ వెన్ను నొల్లక నన్ గొల్చు ♦ చున్నవాఁడు
నన్నలిగి వెన్ను నిన్ గొల్చు ♦ చున్నవాఁడు
వీరలిర్వురు జముపీట ♦ వేఁగుచుండు
రంబుజహితుండు జంద్రుఁడు ♦ న్నంతవఱకు.

వ. మఱియును.

క॥ కమలజు భక్తిఁ దొరంగిన, గమలాపతి భక్తి యెపుడు ♦ గలుగదు వినుమా
కమలేశు భక్తి లేకయె, యమరదు నాయందు భక్తి ♦ యబ్జజతనయా! 419

వ. కావున నీవిఁక భేదబుద్ధిన్ బాసి జ్ఞానివై యుపాసింపు మిఁక యాగంబుఁ బూర్తి యొనరింపుమన్న దక్షుం డలరి శివు నఖిలేశ్వరుండని తలంచి సకుటుంబముగా నర్చించి యజ్ఞంబు మరల ననుసంధానించి వేల్పులకెల్లరకు భాగంబు లొసంగి పూర్ణభాగంబు మహేశ్వరునకిచ్చి తదనుగ్రహంబుఁబడసి యజ్ఞంబు సమాప్తం బొనరించె నంతఁ బరమేశ్వరుండు కైలాసంబునకరిగె. బ్రహ్మవిష్ణులును నఖిల సురమునీంద్రులు సంతసంబునఁ బరమేశ్వరయశశ్చరితంబు గానంబుసేయుచు నిజనివాసంబుల కరిగిరి. మహేశ్వరుం డిట్లు నిజస్థానంబుఁ జేరియు సతీదేవిన్ దలఁచి పలుమాఱు సతీచరితంబులు గణంబుల కెఱిఁగించుచుఁ బరమాత్మ యయ్యును బ్రాపంచికభంగి నభినయించుచు నిర్వికారుండై యుండె. పరమేశ్వరి యగు దాక్షాయణి యిట్లు పూర్వకళేబరంబుఁ బాసి దేవప్రార్థితయై దేవకార్యంబు కొఱకు మఱల హిమవద్గిరీంద్రపత్ని యగు మేనకయందు జన్మించి తపంబొంది మహేశ్వరున్ జేపట్టె నీ సతీ చరిత్రంబు నెవ్వరేనిఁ జదివిన వినిన నవ్వారు సకలసంపదలన్ బొదలుదు రనిన సూతునకు శౌనకాదులు మహాత్మా! దక్ష యజ్ఞంబం దిట్లు పుండరీకాక్షుండు శివు నరయక వచ్చి యవమతిన్ జెందుట కేమికతం బెఱుఁగఁ జెప్పుమనుడు సూతుం డిట్లనియె.

## —★ క్షుప దధీచుల కలహ వృత్తాంతము ★—

గీ॥ చ్యవనపుత్రుండు భృగువంశ ♦ సంభవుండు ద
ధీచియనుఋషి శపియింప ♦ నా చతుర్భు
జుఁడు పరాకొంది యట్లు ద ♦ క్షుని మఖమునఁ
జేరి చిన్నతనంబొందెఁ ♦ దేవమౌళి. 421

క॥ అననేటికి శపియించెను, ముని పురుషోత్తముని సకల ♦ భూతశరణ్యున్
మునివర! యెఱిఁగింపుమనా, ననఘుఁడు నుడువంగఁదొడఁగె ♦ నవ్వారికిటుల్,

క॥ క్షుపుఁడను వైష్ణవుఁడగునొక, నృపునకును దధీచిమునికి ♦ నేస్తంబురువా
విపులేశుండొకపరి వహా, నిపతినిఁగని యిట్లుతా న ♦ నియె మత్తమతిన్. 423

చ॥ ఎనిమిదిదిక్కులోలి మెయి ♦ నేలెడు వేల్పులమాత్రలొంది యే
దినిపయిఁబొల్చు భూపతి మ ♦ దిన్ దలపోయఁ ద్రివర్ణపఙ్క్తులో
ఘనతను మించునల్లతఁడె ♦ గౌరవభాజనుఁడన్న నంత న
మ్ముని విని వేదపుంబథముఁ ♦ బూనని యన్నడికల్గి యిట్లనెన్. 424

క॥ జనవినుత "బ్రాహ్మణో గురు",రను వచనముఁదలఁపు మదిని ♦ నఖిలమునకు బా
పనుఁడే గరీయుఁడును బూ, జనభాజనుఁ డిట్టి వేద ♦ సమ్మత మనుడున్. 425

చ॥ నరవరుఁడాలకించి యటు ♦ నచ్చికసేయక శ్రీమదంబునన్
బొరసిన బుద్ధి నిట్లనియె ♦ భూవిభుఁడే కడుమేటి యాతఁడే
యురవగు దైవతంబేకను ♦ నుర్వరఁజెందిన విష్ణువాతఁడే
ధర నిఁక నగ్రపూజ్యుఁడగుఁ ♦ దాపస! నీవన మానిపొమ్మికన్. 426

గీ॥ అనిన విని ముని క్రుద్ధుఁడై ♦ యాత్మగౌర
వం బరసి నెడ్మపిడికిట ♦ వసుమతీశు
నెత్తిపై మొత్తె నతఁడు గి ♦ న్కెత్తి వజ్ర
మేసి మునివరుఁ జీల్చెను ♦ దోసమనక. 427

క॥ మునివజ్రహతినిఁ దాను, ర్వినిఁ బడి కులపతిని శుక్రు ♦ వినయమ్మున వేఁ
డిన నతఁడు చేరవచ్చి ము, నిని సంజీవిని కలన్ మ♦నిచె నంతఁ గృపన్. 428

వ. వాత్సల్యంబుతోడ దధీచికి మృతసంజీవినీ విద్య నుపదేశించి, కుమారా! మృత్యుంజయుఁడగు నీశ్వరుని భజించుచు నీ మహామృత్యుంజయ మంత్రంబు నుపాసింపుము. దీన నీకు మృత్యుభయంబు దొలఁగి శ్రేయంబు చేకూరునని యిట్లు మంత్రం బుపదేశించె. 429

## —* మహామృత్యుంజయ మంత్రము *—

ధ్యానం —

శ్లో॥ హస్తాంభోజ యుగస్థ కుంభయుగలా । దుద్ధృత్యతోయం శిర
స్సించంతం కరయోర్యుగేన దధతం । స్వాంకే సకుంభౌ కరౌ
అక్షస్రఙ్మృగహస్త మంబుజగతం । మూర్ధస్థ చంద్రస్రవ
త్పీయూషార్ద్ర తనుం భజే సగిరిజం । త్ర్యక్షంచ మృత్యుంజయం,

మనుః —

శ్లో॥ త్ర్యంబకం యజామహే । త్రైలోక్య పితరం ప్రభుం । త్రిమండలస్య పితరం త్రిగుణస్య మహేశ్వరం । త్రితత్త్వస్య త్రివహ్నేశ్చ । త్రిధాభూతస్య సర్వతః । త్రిదివస్య త్రిబాహోశ్చ । త్రిధా భూతస్య సర్వతః । త్రిదేవస్య మహాదేవ । స్సుగంధిః పుష్టివర్ధనః । సర్వభూతేషు సర్వత్ర । త్రిగుణేషు కృతో యథా । ఇంద్రియేషు తథాన్యేషు । దేవేషు చ గణేషు చ । పుష్పే సుగంధవత్సూర । స్సుగంధి రమరేశ్వరః । పుష్టిశ్చ ప్రకృతేర్యస్మా । త్పురుషాద్ద్విజోత్తమ । మహదాది విశేషాంత । వికల్పస్యాపి సువ్రత । విష్ణోః పితామహస్యాపి । మునీనాంచ మహామునే । ఇంద్రియశ్చ చ దేవానాం । తస్మాద్వై పుష్టివర్ధనః । తందేవ మమృతం రుద్రం । కర్మణా తపసాపివా । స్వాధ్యాయేనచ యోగేన । ధ్యానేన చ భజంత్యముం । సత్యేనాన్యేన సూక్ష్మాయా । న్మృత్యుపాశాద్భవః స్వయం । బంధమోక్షకరో యస్మా । దుర్వారుక మివ ప్రభుః । మృతసంజీవినీమంత్రో । మమ సర్వోత్తమ స్స్మృతః॥

వ. ఈయువిధమై సర్వోత్తమంబగు మృతసంజీవినీ మహామంత్రం బీశ్వరుని బూజింపుచు నిద్దాని జపించుము. మఱియు నీయది జపంబున నభిషేకంబునను హోమంబునను నిమ్మాడ్కింటఁగూడ ఫలంబొసంగు శివసన్నిధిఁజేరి యీమంత్రంబు జపించిన వానికి మృత్యుభయంబులేదు. ఇఁకనిమ్మంత్రంబునను న్యాసాదుల నొనర్చి జపించుచు శివునిఁబూజించిన మఱియు విశేషఫలం బొందనగునని యిట్లు సక్రమం బుపదేశించి శుక్రుండు స్వస్థానంబునకరిగినంత దధీచి శివుని సంస్మరించి తపంబునకై వనంబున కరిగి యందు మహేశ్వరులఁ బూజించుచు నమ్మహామృత్యుంజయమంత్రంబు నేకనిష్ఠతో బెక్కుదినంబులు జపించినంత భక్తవత్సలుండైన శంకరుఁడు మునినారసించి వరంబడుగు మిచ్చెదననుడు దధీచిముని కరంబుమురిసి యిట్లు ప్రస్తుతించె. 430

సీ॥ కాలాయ ఘనతపో ♦ జాలాయ కంధరా, నీలాయ నిత్యాయ ♦ నిరతధర్మ
శీలాయ కరుణాల ♦ వాలాయ బ్రహ్మాండ, పాలాయ శర్వాయ ♦ పాలితముని
బాలాయ ధృతవారి ♦ చ్చేలాయ తరుణేందు, ఫాలాయ భర్గాయ ♦ ప్రౌఢతరజ
టాలాయ గళతల ♦ వ్యాలాయ దోర్దను, శూలాయ శుద్ధాయ ♦ స్థూలసూక్ష్మ

గీ॥ కారణశరీరధారిణే ♦ కర్పూరతను, ధారిణే రవిబింబవి ♦ హారిణే కృ
పాశివేఽఖిలజనతాప ♦ భంజనాళి, వే నమోస్తు నమోస్తు తే ♦ తేనమోస్తు.

సీ॥ కాలకాలాయ త్రి ♦ కాలరాణ్ముఖగణ, పాలాయ ఋషిలోలు ♦ పాయ దివ్య
గంగాతరంగిణీ ♦ రంగాయ మానజ, టామండలాయ కు ♦ ఠారశూల
బాణబాణాసన ♦ పట్టిస శక్తిగ, దాదండ చర్మాసి ♦ ధరకరాయ
కాకోదరాధిప ♦ గ్రైవేయభూషిత, కంధరాయానంద ♦ బంధురాయ

గీ॥ పరమశక్తిహృదయభర్మ ♦ పద్మకోశ, రంజనాహస్కరాయ వి ♦ రాజితేందు
శకలభాస్వరకోటీర ♦ చారుతరశి, రస్థలాయ నమోస్తు ప ♦ రాత్పరాయ.

వ. అని యిట్లు సన్నుతించి.

—* శివుఁడు దధీచిమునికి వరమునిచ్చుట *—

గీ॥ దేవ! నాకిడువజ్రాస్థి ♦ దివ్యతనువు, మఱియునమృతత్వము నదీన ♦ మతియు ననుడు
శంకరుం డట్లయగుననె ♦ సంయమికి వరంబొసఁగి పేగ నిజనివా ♦ సంబుఁజేరె.

చ॥ మునియు వరంబుఁజెంది క్షుప ♦ భూభుజుఁజేరి పదంబుచే శిరం
బును వడిమోఁదె నాతఁడును ♦ భూరితరాగ్రహమొంది వజ్రముం
ముని యురమందువేయ నది ♦ మున్పటి యట్టులఁగాక పూరిగాఁ
గనుపడ తేఁడు సూచిమది ♦ గాటపునక్కజ మొందియంతనే. 434

ఉ॥ కానకుఁ బోయి శ్రీపతినిఁ ♦ గంజదళాక్షుని భక్తవత్సలుం
బూనికతోడ నెంచి తప ♦ముం బొనరింపఁగ దేవనాథుఁ డా
మానవనాథుఁజేరి బహు ♦ మానమొసంగ నభీష్టమడ్గఁగా
నానృపుఁ డర్సమొంది కమ ♦ లాక్షున కర్మిలి మ్రొక్కి యిట్లనెన్.

గీ॥ బాఁపఁడొక్కఁడు నను దలఁ ♦ బగులఁదన్నె
వజ్రమేసిన వితయయ్యె ♦ వరద! యతఁడు
శివునిఁ బూజించి వాంఛిత ♦ సిద్ధులొందె
వానిపేరు దధీచియ ♦ య్యానిఁ గనుము.

వ. మఱియుఁ దనకును దధీచికి జరిగిన వాదంబు తెఱంగునంతయుఁ దెలిపినఁ బురు
షోత్తముఁ డవ్విధంబెల్ల నారసి దధీచియెడ ననుచితంబు లేకున్నను క్షుపునికై
తానద్దధీచినిఁ జెనకక తప్పమియును, దధీచిచేఁ దన కసద్ధంబు రానుండుటయు
నెఱింగియును భక్తవాత్సల్యంబుఁ ద్రోసివేయఁజాలక దధీచితోఁ బోరనెంచి
క్షుపున కిట్లనియె. 437

గీ॥ బ్రాహ్మణు లజయ్యు లందును ♦ బాశుపతులు
కడఁది మగ లట్టివారితోఁ ♦ దొడరనగున
సాహసిక్యంబు జలము చేఁ ♦ సంబుమీఱి
పోరితముఁదెచ్చికొంటివి ♦ భూమిజాని !

వ. ఇఁక శాంభవుల వైభవంబెఱుంగఁజేసెద వినుము.

సీ॥ అశ్రాంతపారమే ♦ శార్చాపరానంద, భరితాంతరంగులు ♦ పాశుపతులు
ఆణవాదిమలత్రి ♦ యధ్వంసకారణ, పరమదీక్షాచణుల్ ♦ పాశుపతులు
తాపత్రయాగ్నిదం ♦ దహ్యమానశరీర, బాధానివర్తకుల్ ♦ పాశుపతులు
పూర్వకర్మఫలాను ♦ భోగనానాగర్భ, వాసదూరీకరుల్ ♦ పాశుపతులు
గీ॥ సర్వవేదాంతసిద్ధాంత ♦ సారవిహిత, పథవిరాజితగమనులు ♦ పాశుపతులు
ప్రౌఢమధ్యాహ్నవిస్ఫుర ♦ ద్భానుబింబ, భాసమానప్రకాశులు ♦ పాశుపతులు.

వ. ఇఁక నిన్నుగుఱించి యిమ్మునితోఁబోరెద నవలఁ గానున్నదియగును.

క॥ అని వేగ దధీచి మునీం, ద్రుని డగ్గఱి యనరమునుగఁ దోయజనేత్రుం
గని ముని యనియెను కేశవ!, నిను నెఱుఁగుదు భక్తకార్య ♦ నిష్ణాతునిగాన్.

గీ॥ వినుము వినుము మహేశ్వరా ♦ ర్చానిరతుల, కెందు నలఁదురు టబ్బమి ♦ యెంచువాఁడ
అల్లుగా కది యొనవుచో ♦ నరసిపల్కు, కలను చేసెద నీతోడఁ గంజనయన !

## —* విష్ణు దధీచుల యుద్ధము *—

క॥ లేదలమట జెదరేమియు, లేదెందుఁ బరాజయంబు ♦ లేనే లేదో
శ్రీవయిత ! యనుడు గుపితుం, డై దానవహంత చక్ర ♦ మారసి కనఁగా.

గీ॥ అదియుఁ జలనంబుమాలిన ♦ నమ్మునీంద్రుఁ
డరసి నగి యిట్టులనె హరి! ♦ యైన మీ సు
దర్శనము నను దెగటార్పఁ ♦ దఱియ దస్త్ర
సాధనములనుగాని వేయు ♦ చలముమీఱి. 444

క॥ అని యుల్లసమాడిన య, మ్మునిపయి నందకము గదను ♦ భూర్యస్త్రములన్
వనజాక్షుఁడేసె సంక్రం, దనముఖులును దఱిసి మునిని ♦ నానాస్త్రములన్.

గీ॥ పాదవమునియల్గియొకకుశ ♦ ముష్టిఁదెచ్చి, శివుని స్మరియించివిడిచినఁ ♦ జెలఁగియద్ది
ఘనమగుత్రిశూలమై వారి ♦ కఠినసాధ, నముల నస్త్రంబులను వేగ ♦ సమయఁజేసి.

వ. సకల నిలింపులతోఁ జనార్దనుని మర్దింప నేతెంచుచుండుటఁ గాంచి.

గీ॥ అతుల మాయాన్వితుండగు ♦ నచ్యుతుండు, తన్నుఁబోలిన చక్రగ ♦ దాధరులను
నయుతమూర్తుల వెడలింప ♦ నడరివారు, తాపసునిపై కిదుముకఁగఁ ♦ దలఁకకతఁడు. 447

క॥ వారందఱి శూలమునన్, జూరన్ బొనరించి యూర్వుఁ ♦ జూచి హరియుఁ దా
మీఱిన కినుకన్ ఘోరా, కారుండై విశ్వరూప ♦ గరిమన్ జూపెన్. 448

క॥ పదునెనిమిది లోకంబులు, నదీనదోదధులతోడ ♦ నగములతోడన్
బొదలెను భగవత్తనువున, నది గని ముని శివునిఁ దలఁచి ♦ యచ్చెరు వొప్పన్.

గీ॥ హరికి నిట్లనె నిదియేమి ♦ యచ్చెరువము
కనుము నేఁ జూపెదనటంచు ♦ గరిమ మెఱయ
చ్ఛావనియుఁ దనయందు బ్ర ♦ హ్మాండ మెల్లఁ
జూప విస్మయ మొందిరి ♦ సురలు హరియు.

క॥ అంతయెగాక జనార్దను, నెంతయు దహియించుచున్న ♦ ఋషిఁ గని హరిబ
ల్వంతముతోఁ దలపడఁ గని, చింతిలి పరమేష్ఠియటకుఁ ♦ జేరి రయమునన్ *

చ॥ వలదు మహాత్మ! భక్తజన ♦ వత్సల! పద్మదళాక్ష! మానిపై
నలుకను మాను మీతఁడలి ♦ కాక్షునిభక్తుఁడు ప్రౌఢ యెంతయున్
గలుషము లేదు వీనియెడఁ ♦ గర్కశభావము డింపు వేనికిన్
జెలిమి ఘటింపు! మానియెడఁ ♦ జెల్లదు వేఱువిధంబు రూఢిగాన్. 452

వ. అని చెప్పుట యాలకించి క్షువుండు పశ్చాత్తప్తుండై తనకోసరంబిట్లు రమాకాంతుం డాఱడినొందుటకుం తేని వందురి యథార్థం బెఱింగి వచ్చి దధీచి యంఘ్రులందుఁ బడి యిట్లు ప్రార్థించె.

## —* క్షువుఁడు దధీచి నర్థించి యుద్ధంబు నుడుపుట *—

శా॥ మన్నింపన్ గదవయ్య! నాయఘములన్ ♦ మౌనీంద్రచూడామణీ!
మన్నింపన్ గదవయ్య! నా చెడుపనిన్ ♦ మాహేశ్వరగ్రామణీ!
మన్నింపన్ గదవయ్య! నామదము నా ♦ మ్నాయైకవిద్వన్మణీ!
మన్నింపన్ గదవయ్య! వేగనను స ♦ స్మర్తృత్రిచింతామణీ! 454

వ. అని యిట్లు దీనుండై యనుగ్రహం బర్థించుచున్న క్షువున కభయంబిచ్చి తన మదిని శివుని సంస్మరించి రమేశ్వరునితో నితరదేవతలన్ గాంచి యాగ్రహంబుతో.

గీ॥ తివిరి మధువైరి! నీవును ♦ దివిజులెల్ల
రుద్రకోపాగ్నిఁ బొగలుదు ♦ రు ద్రుతమందె
యని శపించి క్షువునిఁ జూచి ♦ యధిప! నృపుఁడు
పూజ్యుఁడే యైన బ్రాహ్మణుల్ ♦ పూజ్యతములు. 456

* సతీఖండే అష్టత్రింశాధ్యాయే — శ్లో॥ దదాహ విష్ణుం । దేవేశం దధీచి శ్శైవసత్తమః ॥

వ. అనిచెప్పి మునీంద్రుం డాత్మాశ్రమమున కేఁగ నంత విష్ణుఁడు చలంబు మాని సురలతో స్వలోకంబునకరిగె. క్షువుండును మనఃకాలుష్యంబును బాసి నిజగృహంబునకరిగె నీ సమరంబు పశ్చిమోత్తరంబందలి స్థానేశ్వరంబను నెడ జరుగుటన్ జేసి యద్ది పుణ్యస్థలంబయ్యె జను లిద్దానిసేవించిన శివానుగ్రహంబు నొందుదురిక్కతన విష్ణ్వాది సురలు మోహితులై దక్షాధ్వరంబునకేఁగి యట్లు భంగంబొందిరి క్షువదధీచివాద చరిత్రంబు సంక్షేపంబుగ నీకెఱింగించితి నిద్దానిఁ జదివిన వినిన జనుల కపమృత్యుపీడాపరిహారంబగు రణంబునం దెవ్వరేని దీనిఁ జదివిన మృత్యుభయంబుఁ దక్కి విజయంబుఁగాంతురని సూతుండు శౌనకాదిమునులకుఁ జెప్పుటయు. 457

క॥ మంత్రారాధ్యసుతా! శివ, మంత్రజపాత్యంత కుశల ♦ మానసహంసా!
యంత్రితసత్కార్యా! దు, స్తంత్రిజనవ్యూహవిముఖ! ♦ ధార్మికసుముఖా!

గద్య — ఇది శ్రీ బుధజన విధేయ ముదిగొండ నాగవీరేశ్వర నామధేయ ప్రణీతంబైన శివపురాణం బందలి సతీఖండంబు సర్వంబును సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ





శ్రీ శివాభ్యాన్నమః

# శ్రీ శివపురాణము

## పార్వతీ ఖండము.

### ప్రథమాశ్వాసము.



మదుమాశంకరపద
తామరసామోదభక్త ♦ తల్లజసుకథా
ప్రేమమతీ! లక్ష్మ్యంబా!
మామకజననీ! మనీషి ♦ మాన్యచరిత్రా!

వ. అవధరింపుము, శౌనకాదిమునులు సూతునిం గాంచి.

—* సూతుని శౌనకాదులు పార్వతీజన్మచరిత్రంబు జెప్పుమనుట *—

మ॥ మును దక్షాధ్వరమందు మేన్విడిన యం ♦ భోజాక్షి దాక్షాయణీ
వనితారత్నము దివ్యవర్యుల యెద ♦ భ్రిప్రార్థనన్ జేసి పా
వనుఁడౌ పర్వతరాజమౌళికిని భా ♦ స్వచ్ఛీలమేనాబ్జలో
చనకున్ బుట్టి హరున్ వరించెనని ప్ర ♦ స్తావించి తీవెంతయున్. 2

సీ॥ అరసి యేపుణ్యమున జగ♦దంబననుఁగు, సుతనుగాఁగొని రద్రిరం ♦ పతులు గిరిజ
యేమితపమొనరించి తాఁ ♦ గామవైరుని, రాణియయ్యె వచింపు పు♦ రాణసూరి!

వ. అని యడిగిన మునులకు సూతుం డలరి యిట్లనియె.

మ॥ మును రాజీభవుండు నారదున కా ♦ మోదంబుతో నిచ్చరి
త్రను బుత్రాదృతిఁజెప్పె నమ్ముని నితాం ♦ తస్నేహభావంబునన్
ఘనుఁడౌ వ్యాసమహర్షికిన్ దెలిపె నా ♦ కారుణ్యవారాశి నా
కనురాగంబునఁజెప్పె మీకిపుడు నే ♦ సద్దాని బోధించెదన్. 4

చ॥ గురునకు వందనంబిడుదు ♦ గోపతివాహను శీతశైలజన్
దిరముగ నాత్మలోఁ గొలుతు ♦ దివ్యతపోనిధులార! మీరికన్
బరమశివున్ మహేశ్వరిని ♦ భావమునన్ గుదురొప్పనిల్పి భా
సురతరధారణన్ గనుఁడ ♦ శోకనిధానకథాసుధాంజలుల్. 5

## — * కథా ప్రారంభము - హిమవద్గిరి వర్ణనము * —

ఉ॥ ఉత్తరదిక్కునందుఁ జెలు ♦ వొందు హిమాలయనామధేయదీ
వ్యత్తరపర్వతేంద్రము మ ♦ హామణిరత్ననిధాన మెల్ల సం
పత్తులకెల్ల ప్రాగపర ♦ వార్థులఁ దాఁకుచుఁ బృథ్విఁగొల్చు లో
కోత్తరమానదండమన ♦ నుజ్జ్వలకాంతుల నొప్పు గొప్పగన్. 6

సీ॥ అభ్రగంగాతరం ♦ గాళి నుయ్యేలలూఁగు, రాజహంసవతంస ♦ రాజి యెందు
హేమతామరసమా♦లామండనము సేయుఁ, గమనీయగంధర్వ ♦ గణము లెందు
బహుసుహాసవనయూ♦ప స్తంభముల లెక్క, సేయు విద్యాధర ♦ శ్రేణి యెందు
నిజబాణనిర్భిన్న ♦ గజకుంభముల ముత్తి, యము లేప భిల్లచ ♦ యంబు లెందు
గీ॥ జగములన్నియు సల్పిన♦ చంద్రవాళి, యడుగుపృథభక్తి వైభవం♦ బమరఁగొల్చి
యుష్టసిద్ధులఁగొని సుప♦ర్వాళి మరియు, నెందు నట్టి శుభాఢ్యంబు♦ హిమనగంబు.

క॥ ఘనసారాద్రి యనన్ జం, దనశైలేంద్రంబనంగ ♦ నవనీతనగం
బన రాజతపర్వతమనఁ, జను వలిగుబ్బలి లసద్వి ♦ శదవిద్యుతులన్. 8

గీ॥ స్ఫాటికశిలోచ్చయంబనఁ ♦ బరఁగఁగాని, నీరసముగాదు శర్కరా ♦ ధారుణీధ
రంబనఁగఁజెల్లుఁగాని యు♦రయఁబిపీలి,కాహృతముగాదు హిమవన్న♦గము జగమున.

మ॥ కడుధావళ్యము నొప్పు మూర్తిరమచే ♦ గంగాధునీధారలన్
వెడలన్ జిమ్ము శిరమ్ముచే మునిజనా ♦ భీష్టాశ్రయత్వమ్ముచే
నడఁగన్ బోని యనన్యసంచిత మహా ♦ ష్టైశ్వర్యసంపత్తిచేఁ
బెడమిన్ శంకరమూర్తిఁబోలు హిమవ ♦ ద్భూభృద్వరం బారయన్. 10

శా॥ నానాదివ్యసుగంధపుష్పలతలున్ ♦ నానాఫలోర్వీజముల్
నానారత్నమయంపు గోనలును గం ♦ ధర్వాప్సరస్కంధముల్
మానీంద్రాశ్రమముల్ సరిత్తతులు భి ♦ ల్లస్త్రీకనద్వేణు ని
క్వాణానాదంబులు చెన్నుమీఱు గిరికాం ♦ తారంబులం దెల్లెడన్. 11

గీ॥ అమరఁగేదారదేవుని ♦ యండఁజేరఁ, గిన్నరతఁ గింపురుషత భం ♦ గించునంచుఁ
గిన్నరులుఁ గింపురుషు లల్ల ♦ గిరినిఁజేరి, నరులు పూరుషులై యల♦రిరి యమారె!

వ. మఱియు నప్పర్వతరాజంబు,

గీ॥ పసిఁడి మొదలగు లోహాల ♦ పంటచేను
మేటి యోషధులకు నెల్ల ♦ మేల్మి పొలము
ఏనుఁగులు సింగములు వసి ♦ యించు కోన
యగుచుఁ దగు మంచుఁగొండ పు ♦ ణ్యములకండ. 13

క॥ కేదారము మోక్షౌషధి, కేదారము బదరవన మొ ♦ గిన్ శంకరు దా
మోదరుఁ గైవసముగఁ గొని, శ్రీఁదనరుచు జగములందుఁ ♦ జెలువునఁదనరెన్.

క॥ ఒకచో గంగానది యిఁక, నొకచో యమునాధునియు మ ♦ ఱొకచో నాగం
డకినిర్ఝరిణియునున్ వే,ఱొకచో నా బ్రహ్మపుత్ర ♦ యుదయించె నటన్.

గీ॥ అలకనందాస్రవంతికా ♦ భ్యర్ణమందు, నలరు రుద్రాక్షతరువనం ♦ బుల నఖండ
బిల్వమూలాశ్రయంబుఁగా♦వించి తపము, సిద్ధిఁగాంతురు మునులంద♦చిరమునంద. 16

క॥ స్థావర జంగమ రూపము, లీవిశ్వోత్తరమహాద్రి ♦ కెసఁగును దెంటన్
స్థావరమిది వేఱొకఁ డిల, దేవాకారుండు రుచిర ♦ దేహుండలరున్. 17

గీ॥ దర్శనీయుఁడు పుణ్యాత♦త్పరుఁడు మంచి, వారలకునెల్లఁ బ్రియమైన ♦ వాఁడు కేశ
వాంశుఁ డుద్దామ తేజస్వి♦ యవికృతుండు, రాణఁదనరొందుఁ బర్వత♦ రాజరాజు.

ఉ॥ ఆ నగరాజవర్యుఁడు కు ♦ లాభ్యుదయంబును ధర్మవృద్ధి నెం
తేనియు దేవతాపితృహి ♦ తేచ్ఛయు నెంచి వివాహమాడఁగాఁ
బూనుడు దేవతాగ్రణులు ♦ పొందుగ నాత్మహితప్రయోజనా
ధీనమనస్కులౌచుఁ బితృ ♦ దేవులపాలికిఁ జేరి కూరిమిన్. 19

ఉ॥ మీకును నాకవాసులకు ♦ మేదినికంతకు సౌఖ్యసంపదల్
చేకుఱఁజేయఁగాఁగడఁగి ♦ చెచ్చెర వచ్చితి మిందు నిత్యల
క్ష్మీకలితన్ భవత్సుతను ♦ మేనకకన్యను శైలరాజను
శ్లోకున కిచ్చి ధర్మవిధి ♦ చొప్పునఁ బెండ్లి యొనర్పఁ డిత్తఱిన్. 20

గీ॥ దాన సకలంబు ఫలియించుఁ ♦ గానమీరు, సంశయింపకుఁ డిబ్బంగి♦ సత్వరముగఁ
బెండ్లిఁగూర్పుఁడు సురలకుఁ♦ బ్రియముసేయు, వారలేనియు భూరివి♦చారులార! 21

క॥ అనియిటు పలుకఁగ వారలు, విని తమకూఁతులకు సంభ ♦ వించిన శాపం
బును దెలిసియు సురవర్యుల, యనుశాసన మారసియుఁ ద ♦ థాస్తనిరి తగన్.

—✻ మేనకా హిమవద్వివాహము ✻—

శా॥ అంతన్ వేగమె శైలరాజవరు నా ♦ హ్వానించి దేవప్రజం
బెంతో సంతసమొంది యుత్సవములె ♦ న్నేభంగులన్ బన్న న
త్యంతామోదముతోడ నప్పితలు గ ♦ న్యాదానమున్ జేసి శ్రీ
మంతంపుంబసఁ బెండ్లి చేసిరి మునుల్ ♦ మన్నించి దీవించఁగన్. 23

క॥ హరియును బరమేష్ఠియునున్, హరిహయుఁడును లోనుగఁగల్గు ♦ నమరు లుమన్ శం
కరు మదిలోఁ దలఁచుచు న, ప్పరిణయమునఁ జెందిరపుడు ♦ పరమ ప్రీతిన్. 24

గీ॥ దేవతలుమునులును బిత్రు♦దేవతలును, జాలఁగొనియాడి గిరిరాజు ♦ చనవు మెచ్చి
చనిరి తమగేములకు హిమా♦చలుఁడుసంత,సమున నిలుఁజేరె మేనకా♦సతినిఁగూడి.

క॥ అనిపలికిన సూతునిఁ గనుఁ, గొని మేనకజన్మకథను ♦ గొనకొని యమ్మా
నిని తోఁబుట్టుల చరితం, బును శాపవిధానమును జె ♦ ప్పుమనిరి మునుల్. 26

—* మేనక మున్నగువారికి సనకాదులశాపము *—

శా॥ సూతుండిట్లనెఁ బద్మజాత్మజుఁడు ద ♦ క్షుండన్ మునీంద్రుండు వి
ఖ్యాతుం డాతని కూఁతులర్వదుగు ర ♦ క్కంజాస్యలన్ గశ్యపా
ఖ్యాతుండాదిగ నొప్పువారి కిడి క ♦ ల్యాణంబు చేసెన్ స్వధన్
జేతోమోదముతోడ నందఁ బితరుల్ ♦ చేపట్టి రప్పట్టునన్. 27

గీ॥ వారలకునాస్వధనుబుట్టి ♦ వన్నెఁగాంచి, రాత్మజాతలు మూఁగురా ♦ యతివలందు
మేన తొలిచూలు రెండవ♦చాన ధన్య, చివరకాన్పు కలావతి ♦ చిగురుఁబోణి. 28

క॥ ఈముప్పుర యాహ్వాయములు, శ్రీమంగళదాయకములు ♦ చింతాహరముల్
ప్రేమమునఁ దలఁచువారికిఁ, గామితములనిడు నవిఘ్న ♦ కరములు ధరణిన్.

గీ॥ అట్టిముప్పురు కన్యక ♦ లమలమతులు, ఘనతరజ్ఞాననిధులు యో ♦ గినులు లోక
మాతలనఁజెల్లు వారుఁ సం♦ప్రీతినెల్ల, లోకముల సంచరింతురు♦ వీఁక మెఱయ. 30

శా॥ శ్వేతద్వీప మొకప్పుడీ ముగురు ల ♦ క్ష్మీనాథు దర్శింపఁగాఁ
బ్రీతిన్ జేరి రథాంగహస్తునకుఁ బే ♦ ర్మిన్ మ్రొక్కి మేల్ భక్కులన్
జేతోమోదముగా నుతించి తగువా ♦ సిన్ బొల్చు పీఠంబులన్
జాతామోదమునన్ వసించిరి సరో ♦ జాతాక్షుకన్నన్నలన్. 31

గీ॥ బ్రహ్మమానసపుత్రులు ♦ బ్రహ్మవేత్త, లఖిలలోకార్చితులు సన ♦ కాదిఋషులు
నలువు రపు డటకే తెంచి ♦ నళిననేత్రు, నాదరంబునఁ గాంచి సా♦ష్టాంగపడిరి. 32

క॥ వారిన్ గని యటనుండిన, వారెల్లరు గద్దియలను ♦ వదలినిలిచి నై
వారములుచేసి మ్రొక్కిరి, సారెకు భయభక్తు లాత్మ ♦ సంబాళింపన్. 33

క॥ హరియును మునితల్లజులను, బరమామోదమునఁ గాంచి ♦ బహుమణిగణభా
స్వరపీఠము లెక్కుండన, నరుదుగ నాసీనులైరి ♦ యమ్మునివరుల్. 34

గీ॥ అప్పుడటనున్న మేన ధ♦న్యయుఁగలావ, తియును దైవవిమోహిత♦లయి ఋషులను
గాంచి గద్దియలందుండి♦కదలకుండి, రకట ! చెడుకాలమునఁదెల్వి♦ యమర దెపుడు.

క॥ ఎదురుకొనక లేవక తమ, పదముల కెఱఁగక యొకింతఁ ♦ బలుకక తగు స
మ్మదపతులఁగాంచి సంయము, లెదఁ గినుకన్ గొసరి జ్ఞాను♦లే నైనఁ గడున్.

వ. అంత వారలలో సనత్కుమారుండా చపలాక్షుల నీక్షించి యిట్లు శాపంబిచ్చె.

చ॥ గరువముఁ జెంది మీరు పితృ ♦ కన్యక లైనను మానసులన్ సుమున్
బరిభవమొప్పఁ గాంచి యిటు ♦ పల్కక లేవక మ్రొక్కకుంటి రి
క్కరణి సురాంగనోచితము ♦ గాదిక నాకముఁ బాసి మీరు మూ
గురు ధరకేగి మానిసుల ♦ కున్ సతులౌదురుగాక యుగ్మలుల్! 38

గీ॥ ఎవ్వ రజ్ఞానమోహిత♦హృదయులగుచు, ననుచితము లాచరింతురో ♦ యట్టివారు
గుడుతుర కార్యఫలములఁ ♦ బుడమిలోనఁ, దప్పు జెప్పఁగ నేలాటి ♦ తద్జ్ఞులకును,

చ॥ అని శపియింపఁగా విని భ ♦ యమ్మున నప్పితృకన్య లెంతయున్
మనములఁ బొక్కుచున్ దురభి ♦ మానముఁ బాసి మునీశ్వరాంఘ్రులం
దునఁ దలలుంచి మ్రొక్కి వివ ♦ లుల్ బొనరించి మహాత్ములార! పా
వనమతులార! మాదయిన ♦ పాపముఁ బాపి యనుగ్రహింపరే! 40

క॥ "దాసులతప్పులు దండము,తో సరి"యని యరసి యపుడు♦ద్రోయక మము వి
శ్వాసమున శాపమోక్షము, చేసి కటాక్షింపుఁడీ య ♦ చింత్యవిజ్ఞుల్! 41

క॥ ఇదియుఁ బ్రమాదవశంబున, నొదవిన తప్పిదముగాని ♦ యుత్తముల మిమున్
మదమునఁ జుల్కనచేసిన, యదిగాదిక నరసి ప్రోవుఁ♦డచ్ఛచరిత్రుల్! 42

గీ॥ అనియిటుల పెక్కుభంగుల♦నంజలుల్ ఘ, టించి ప్రార్థించునబలలఁ♦ గాంచియంది
తాదరమునక్షమించి న♦యంబుగాఁ బ్రి,యంబుగ సనత్కుమారుఁడి♦ట్లనియె మరల.

## —* సనత్కుమారుఁడు మేనకాదుల ననుగ్రహించుట *—

ఉ॥ సంతసమయ్యె మానసము ♦ చక్కవడెన్ పితృకన్యలార! మీ
రెంతయు దైన్యమొంది యిటు ♦ లెంతో ప్రియంబుగ మమ్ము వేడుటన్
జింతఁదొలంగు డింక ధృతిఁ ♦ జెందుఁడు పొందుఁడు శ్రేయ మెవ్వరేన్
వంత పొసంగినప్డు కద ♦ వందురి ముందటి బాగెఱుంగుటల్. 44

వ. మీకొసంగిన శాపంబుఁగూడ శ్రేయంబై యొసంగు నద్దానిఁ దేటపఱచెద వినుండు మీ ముగ్గురలో.

మ॥ హిమశైలేంద్రుఁడు మేనకన్ జనకరా ♦ జేంద్రుండు ధన్యన్ వణి
క్ప్రమనుండౌ వృషభానుఁ డంతిమను మె♦చ్చుల్ మీఱఁ బెండ్లాడ మీ
కుమయున్ సీతయు రాధయున్ గ్రమముగా ♦ నుత్పన్నలై శర్వ న
ర్ఘ్యఘువంశ్యుండగు రాముఁ గృష్ణుని వివా♦హంబాడువా రిమ్మహిన్. 46

వ. కృత త్రేతా ద్వాపర యుగంబులందుఁ గ్రమమ్మున మీరు మూఁగురును
గూఁతులవలన మిగుల కీర్తిన్ జెంది వారి యనుగ్రహంబునఁ గైలాస వైకుంఠ
గోలోకంబులకుఁ జనువారింక మీరు లక్ష్యయ్యెదమని దీవించి కేశవుని యనుజ్ఞన్
గొని యమ్మును లంతర్ధానంబునొందిరి. పితృకన్యలును దెప్పరిల్లి విష్ణుదేవుని
వీడ్కొని తమ నెలవులకున్ బోయిరనిన సూతునకు శౌనకాదులిట్లనిరి. 47

క॥ మేనకాజన్మచరిత మ♦మ్మెలఁతపెండ్లియును దెలిసికొంటి మదిరా♦జోత్తమునకు
యఖిలజగత్సంబరూఁతురై ♦యవతరించు,టయునునీశ్వరుఁ బెండ్లాడు♦టయును జెపుమ.

ఉ॥ నావుడు సూతుఁడిట్లనె మ ♦ నఃప్రియమొప్ప నగాధిరాజు మే
నావనితన్ గ్రహించి సద ♦ నంబున కేగి మనోజభోగసౌ
ఖ్యావళిఁ దేలుచుం గడిఁది ♦ హాయనముల్ గడపెన్ నభ్రస్సకం
తీవిపులోర్మిశీతలసు ♦ దేశవిశాలసనీతలంబులన్. 49

## —* విష్ణ్వాది దేవతలు హిమవంతునివద్దకు వచ్చుట *—

గీ॥ అంత గొన్నిదినంబుల ♦ నచ్యుత ప్ర, ముఖనిఖిలలేఖు లేకమై ♦ భూధరేంద్రు
పాలికకు దేరఁగాఁగాంచి పరమభక్తి, వందనముచేసి పీఠముల్ ♦ వరుసనొసఁగి.50

గీ॥ అర్ఘ్యపాద్యంబులను జంద ♦ నాక్షతాజ్య
ములనుబూజించి కల్పక ♦ ఫలములిచ్చి
మృదుమధురవాగ్విలాసంబు ♦ మెఱయ వినయ
వినతుఁడై యిట్లుపల్కెఁ బృ ♦ థ్వీధరుండు. 51

ఉ॥ నేఁడు ఫలంబుఁ జెందె జని ♦ నేఁడు ఫలంబును జెందె నర్చయున్
నేఁడు ఫలంబుఁ జెందె సిరి ♦ నేఁడు ఫలంబును జెందె జ్ఞానముల్
నేఁడు ఫలంబుఁ జెందిరి మ ♦ నీషులు మెచ్చఁబితాళ్ళు గుంపుగాఁ
గూడి మహోత్సలీర లిట ♦ కున్ జనుదెంచుటచేత బ్రాఁతిగన్. 52

క॥ ధన్యుఁడనైతిని రాష్ట్రము, ధన్యంబయ్యెను గొలంబు ♦ ధన్యంబయ్యెన్
ధన్యతఁజెందెఁ గుటుంబము, ధన్యతఁజెందెను క్రియావి ♦ ధానంబెల్లన్. 53

క॥ తమ సేవకుఁడై తగు నీ, హిమభూధరుచేత నిప్పు ♦ డేపనియేన్ జి
త్తమునందుఁ దలఁతురేనియుఁ, బ్రమోదమిగురొత్తఁజెపుఁడు ♦ పావనచరణుల్!

క॥ అని పల్కిన హిమవంతునిఁ, గని వనజాతోదు లాత్మ ♦ కార్యమునకు సి
ద్ధిని నిశ్చయించి వేగమె, యనురాగముతోడ నిట్లు ♦ లని రాతనితోన్. 55

గీ॥ వినుముగిరిరాజ! మేము నీ♦వేశ్మమునకుఁ, గడుముదమ్మున వచ్చిన♦కారణమును
దెలియఁజెప్పెద మది నీకు♦ దివిజరాజ, కఖిలలోకంబులకుఁ గుశ ♦ లావహంబు.56

—* విష్ణ్వాదులు మేనా హిమవంతులను దపంబు సేయుమనుట *—

ఉ॥ ఆదిమశక్తి సర్వజగ ♦ దంబిక మున్న లదక్షుకూఁతురై
యాదిమదేవుఁడౌ శివున ♦ కాలయి యాలరిదక్షుఁ డీశునం
దాదరబుద్ధి మాని దుర ♦ హంకృతి నధ్వరమూన నేవపున్
వేసనఁ జెంది దేహమును ♦ వీడుట నందఱుంగు జాడయే. 57

ఉ॥ ఆ జగదంబ యాసమధి ♦ కాతతసత్కరుణావలంబ దా
నా జగదీశుఁబాసి యటు ♦ లాత్మపదంబును జెంద నీశ్వరుం
డోజముఁ దక్కి భూవలయ ♦ మొంటిగఁ గ్రుమ్మరి విస్ఫురత్తపో
యోజన సేయుచుండె నిపు ♦ డొక్కట యోగులు చుట్టి కొల్వఁగన్. 58

గీ॥ అమ్మహాదేవి గ్రమ్మఱ ♦ నవతరించి, యామహాదేవుఁ బెండ్లాడి ♦ నపుడు మరల
నందఱికి లెస్సలయ్యెడు ♦ నంతదనుక, సుఖము సమకూర బెందు వి ♦ శుద్ధకీర్తి!

ఉ॥ కావున నీవు నీ సతియు ♦ గాటపుభక్తి వహించి యమ్మహా
దేవి గుఱించి తీవ్రతర ♦ దివ్యతపం బొనరింపుఁ డింపుమై
పావనులైన మీకు గుణ ♦ వల్లభ యాజగదంబ కూఁతురై
నీవనితోదరంబున జ ♦ నించును బెంచును మేటి శ్రేయముల్. 60

క॥ ఇది విధివిహితం బిత్తఱి, నదనెఱఁగి భవద్గృహమున ♦ కటుదెంచితి మ
భ్యుదయవిధానముఁ దెల్పఁగ, నిదియదియని యనక సేయుఁ ♦ డీకమాపనుపుఁ

వ. అని చెప్పిన నప్పర్వతసార్వభౌముఁ డందులకు వల్లెయనినంత సుపర్వగ్రామణు లాతనికిఁ దత్సతియగు మేనకకున్ దపశ్చర్యాప్రకారం బుపదేశించి వారలఁ దపంబందు నియోగించి యటనుండి వెడలి మార్గమధ్యంబున నొక్క పుణ్యారణ్య ప్రదేశంబందు మహేశ్వరిన్ గూర్చి నమస్కరించి యిట్లు ధ్యానంబొనర్చిరి.

—* విష్ణ్వాదులు పరదేవతనుగూర్చి ధ్యానముసేయుట *—

మ॥ జగదంబా! యుమ! శంభులోకనిలయా! ♦ శర్వప్రియా! దుర్గ! యి
మ్మగ నీయడ్గుల మ్రొక్కి కొల్చెదము వి ♦ స్ఫూర్జత్ప్రతాపాయతా!
త్రిగుణాతీత! గుణాంచితా! శ్రుతినుతా! ♦ శ్రీశక్తి! యవ్యక్తమూ
ర్తి! గభస్తిస్ఫురితాకృతీ! బుజగతీ! ♦ దీవ్యచ్చరిత్రోన్నతీ! 63

సీ॥ కమలజాండములందుఁ ♦ గల జగజ్జీవుల, నుండి యంతకుఁదృప్తి ♦ నొసఁగుదాని
భాస్కరమండల ♦ వర్తినియగుచుఁ బ్రి, పంచప్రకాశమ్ముఁ ♦ బెంచుదాని
నిద్రయన్ జేరితో ♦ నిఖిలభూతములకు, మాయాపటంబు న ♦ మర్చుదాని
సంసారజాతవి ♦ స్తారదుఃఖాబ్ధిని, స్తారతరణినాఁగఁ ♦ దనరుదాని

గీ॥ యమనమున్నగు సర్వయో ♦ గములపాల, నమునఁజాల వలంతివై ♦ యమరుదాని
వింధ్యగిరివాసనిరతవై ♦ వెలయుదాని, బరమశివురాణిఁగొల్తు మ ♦ పారభక్తి.
ఉ॥ నీవె సమస్తవేదగత ♦ నిశ్చితతత్త్వమ వంబరో ! యిఁకన్
నీవె సమస్తదేవగణ ♦ నిత్యనియామక వమ్మరో! యిఁకన్
నీవె సమస్తలోకముల ♦ నేటుగ సాఁకెడు జాణ వంబికా !
నీవె సమస్తదుర్గతుల ♦ నెట్టనఁగొట్టెడు దిట్ట వీశ్వరీ! 65
క॥ పుష్టివినీవే సురలకుఁ, దుష్టివినీవే మునీంద్ర ♦ ధూర్వహులకుఁజి
త్తేష్టరమ వీవె పుణ్యుల, కష్టమశని వీవె దుర్జ ♦ నావళికెల్లన్. 66
గీ॥ వేదములకెల్లఁ దల్లివై ♦ విశ్వమెల్ల, వెలయు గాయత్రి వీవె సా ♦ విత్రి వీవె
ఆ సరస్వతి వీవె స ♦ ర్వాగమార్థ, సారవస్తువ వగు దీవె ♦ సత్య మిావె. 67

—* విష్ణ్వాదులకుఁ బరదేవత సాక్షాత్కరించుట *—

గీ॥ అని యిటుల్ వినుతింపుచు ♦ నంబికను గ, నంగ వాంఛించు దేవాధి ♦ నాథవరుల
కట్టెదుర నగ్గలంబైన ♦ కరుణ గదుర, నమ్మహాదేవి యపుడు ప్ర ♦ త్యక్షమయ్యె
క॥ రత్నమయంబగు రథమున, నూత్నపు మృదులాస్తరణ మ ♦ నోజ్ఞస్థలి శ్రీ
రత్నమగు రాజభూషణు, పత్ని సురోత్తముల యత్న ♦ ఫలమై యొప్పెన్.
గీ॥ కోటిసూర్యాధికంబైన ♦ గురుతరప్ర, కాశతేజః ప్రకరమునఁ ♦ గరముదృష్టి
దుర్గమంబయి రంజిల్లు ♦ దుర్గ ననుప, మాన దివ్యన్మహామాయఁ ♦ గాన లేక.
వ. పదంపడి దివిజనాయకు లమ్మహాదేవికి వినతులై నుతిశతంబు లర్పించి దర్శనం బపేక్షించియుండ. 71
సీ॥ చాపబాణాంకుశ ♦ చటులపాశారవిం, దములొప్పు నాల్గు హ ♦ స్తములతోడ
బాలేందురేఖావి ♦ భాసితంబగుచు నం, దంబుఁజెందిన కిరీ ♦ టంబుతోడ
పద్మరాగచ్ఛాయఁ ♦ బరిఢవించిన మనో, జ్ఞములైన మాల్యాంబ ♦ రములతోడ
మందహాసపు ఠీవి ♦ మానుగుల్కెడు దయా, స్పదములై తగు కటా ♦ క్షములతోడ
గీ. భవ్యకాశ్మీరగంధలే ♦ పములతోడ, ముంగురులుమూఁగు కస్తూరి ♦ బొట్టుతోడ
భువనములకెల్ల భ్రమసేయు ♦ మూర్తితోడ, శంకరార్ధాంగలక్ష్మి సా ♦ క్షాత్కరించె.
వ॥ అంత నిలింపు లత్యంతసంతోషితస్వాంతులై సాష్టాంగవందనంబు లాచరించి యంబిక నిట్లు వినుతించిరి.
మ॥ శివ ! కల్యాణి ! భవాని ! యీశ్వరి ! జగ ♦ త్సేవ్యా ! సమస్తార్తిహ్నా
ద్వ్యవసాయా ! నిగమంబు వాఙ్మనససం ♦ పత్తిన్ భవచ్ఛక్తిసం
స్తవమున్ జేయఁగఁ దక్కి కాదదియెదో ♦ శక్యంబుగాదంచు మిం
చు వెఱన్ గాంచి వచించెఁ దల్లి ! యిఁకమా ♦ నూక్తుల్ యథోక్తంబులే. 74

క॥ ఐనను నీభక్తులకే, మేని భయంబింతలేక ♦ యెట్లో భవదీ
యానూనమహిమ నెన్న భ, వానీ! దయ మెత్తువమ్మ! ♦ పరమప్రీతిన్. 75

## -* విష్ణ్వాదులు పరదేవతను మరల జన్మంబునొంది శివునిఁ బెండ్లాడుమనుట *-

ఉ॥ దక్షుని కూఁతురై మును సు ♦ ధాకరశేఖరుఁ బెండ్లియాడి బ
ల్కాక్ష మహేశ్వరున్ దెగడు ♦ కశ్మలు దక్షుని రోసి యాత్మదే
హాక్షయమున్ బొనర్చి యిటు ♦ లాత్మపదంబును జెందితీవు ఫా
లాక్షుఁడు నీవియోగమున ♦ నార్తివహించి కృశించె నెంతయున్. 76

గీ॥ తల్లి! లోఁగటి యవతార ♦ దశను దేవ, కార్యసిద్ధి నొనర్పక ♦ కడపి తీవు
మునులు వేల్పులు మేమెల్ల ♦ వసటఁగుంది, శరణుఁ జెందితిమమ్మ! నీచరణములను.

చ॥ మరల ధరన్ జనింప్ర శశి ♦ ఖండనుఁ బెండిలియాడి యాకృపా
కరుని మనం బలర్ప పద ♦ కంజములన్ భజియించు మమ్మ వి
స్తరకరుణాతిరేకమున ♦ సౌఖ్యములొందఁగఁ జేయు విస్మయా
కరమగులీలఁ గూర్పుము జ ♦ గంబులు మెచ్చ మహేశ్వరప్రియా! 78

గీ॥ అనుడు జగదేకమాతృక ♦ యాలకించి, హేతువెంచి మదిన్ హృద ♦ యేశు నీశు
భక్తితోడ స్మరించి దె ♦ ప్పరపుఁ గరుణ, నచ్యుతాదులఁగాంచి యి ♦ ట్లనుచుఁబలికె.

## —* పరదేవత దేవతలకు వరములిచ్చుట *—

ఉ॥ ఓ హరి! యో చతుర్ముఖుఁడ! ♦ యో పురుహూత! వినుండు యుష్మదీ
యేహ నెఱింగితిన్ వరము ♦ నిచ్చెద మెచ్చెద మీ ప్రపత్తులన్
మోహము నేనచేసితిని ♦ మూర్ఖుఁడు దక్షుని కట్లు నాఁడు సం
దేహములేక యిబ్భువి జ ♦ నించెద మించెద శంభురాణినై. 80

గీ॥ కలవు హేతువులిఁకఁ గొన్ని ♦ కనికరమునఁ, జెప్పెదవినుండు మున్నల ♦ శీతశైల
భర్త యాతనిసతి మేన ♦ పరమసాధ్వి, నన్ను సేవించి రథికప్ర ♦ పన్నలగుచు. 81

ఆ॥ ఇపుడుఁగూడ వార ♦ లెంతో భక్తినిఁజెంది, నన్ను సుతనుగా మ ♦ నసునఁ గోరి
తపసుఁ బూనిరింకఁ ♦ దథ్యంబుగా వారి, గర్భమందుఁ బుట్టఁ ♦ గాంచుదాన. 82

వ. మఱియును.

ఉ॥ అక్కట! నా మనోదయితుఁ ♦ డా శివుఁడెంతయు నావియుక్తిచే
వెక్కసమైన దుఃఖమున ♦ వేమఱుఁ బొక్కుచు స్రుక్కుచున్ గడున్
జిక్కి దిగంబరుండయి య ♦ శేషధరన్ దిరుగాడుచుండె నా
కక్కరుణాకరున్ దలఁప ♦ నార్తియగున్ హృదయంబు నీరగున్. 84

సీ॥ ధరియించు నాతండు ♦ తాపంబు దాఁప ఘోర, దర్వీకరముఁ బుష్ప ♦ దామమట్లు
చరియించు నాతండు ♦ సంతసంబొప్ప శ్మ, శానమ్మునందు న ♦ ద్యానమట్లు
కొలువుండు నాతండు ♦ కుతుకంబుతోడఁ గు, ధరకూటముల సౌధ ♦ తలములట్లు
నలఁదు నాతండు శాం ♦ త్యర్థంబుగా నల్ల, కాటిభస్మంబు శ్రీ ♦ గంధమట్లు

గీ॥ ఏమనుచుఁ జెప్పుదాన నా ♦ యీ వియోగ, దుఃఖభరమునఁ బొగలుదు ♦ ద్రునిచరిత్ర
మక్కటా! మిక్కుటంబగు ♦ నక్కటికము, సేయదే యెరికేని యో ♦ జింపుఁడీరు.

ఉ॥ నాదు శవంబు మూఁపున ఘ ♦ నవ్యథమోయుచుఁ గొన్ని నాళ్ళటుల్
రోదనముం బొనర్చు పతి ♦ పద్మినిఁ గాంచి రమాకళత్ర! నీ
పాదర మొప్పఁ జక్రమున ♦ నా శవగాత్రముఁ దుంచి వైచి యా
వేఁదుఱు మాన్పలేదె సర ♦ విన్ సురలెల్లరు సంతసింపఁగన్.

చ॥ "అరయక తండ్రి నాకటు ల ♦ నాదరముల్ బొనరింపఁ గుంది ని
ర్భరమగు రోసమొంది సతి ♦ ప్రాణముఁ బాసె నటుల్ పతివ్రతా
భరణమనాఁగ నింపెసఁగు ♦ భార్యను బాసి యెటుల్ భరింతు దు
ర్భరమగు దుఃఖమంచు" నిలు ♦ వాసె గణంబులఁ బాసె భర్తదాన్.

గీ॥ ధీరుఁడయ్యును మాయకు ♦ దూరుఁడయ్యు, నే వికారంబు లేని మ ♦ హేశుఁడయ్యుఁ
బూర్ణుఁడై యెప్పునయ్యాది ♦ పురుషుఁడయ్యుఁ, గాముకునిఁ బోలి పొగలె జ ♦ గంబునందు.

క॥ కాకున్న నిట్టి మోహాప్తుఁ, జీకాకుపడంగ నట్టి ♦ శివునకదేలా?
లౌకికుఁడు వోలె దిరిగె న, లౌకికుఁడై ప్రకృతికెపుడ ♦ లక్ష్యుండైనన్.

గీ॥ నా వియోగంబు మొదలు నా ♦ నావిధోప, భోగములతో నుడిగెఁ గామ ♦ భోగమతఁడు
నేన యవతారమెత్తినఁ ♦ గాని మరలఁ, బెండ్లియాడఁడు వేఱొక్క ♦ వెలఁదినెందు.

ఉ॥ కావున నింక సత్వరము ♦ గా నవతారమొనర్తు శైలప
త్నీ విమలోదరంబున జ ♦ నింతు నఘాపహులైన తాపసుల్
భావములందుఁ బొంగఁగ న ♦ పారతపం బొనరించి యమ్మహా
దేవుని రాణి నౌదుఁ గను ♦ దేఁకువ సాఁకుదు నాకవాసులన్.

ఉ॥ పొందిక మీ గృహంబులకు ♦ భూతపతిన్ శివుఁ గొల్వుఁడాదయా
మండనుఁ డెల్ల దుఃఖముల ♦ మాన్పి సుఖంబిడు నాను మేరుకో
దండుని పత్నినౌటఁ గద ♦ తద్దయు ధన్యతఁ జెంది యేను బ్ర
హ్మాండమునందు వంద్యనయి ♦ యుండఁ జెలంగఁ జూచుట దేవనాయకుల్!

గీ॥ అని యిటులఁ బల్కి జగదంబ ♦ యాదితేయ, నాయకులు చూచుచుండఁగ ♦ నత్తటిల్ల
తవలె నిజధామమొందె ద్రి ♦ దశతతియు, లంబఁ గొనియాడి తమ యిండ్ల ♦ కరిగిరెలమి.

గీ॥ మునులు సూతునితో నిట్టు♦ లనిరి దేవ, దేవి నిజధామ మొందఁగా ♦ దివ్యవరులు
తమగృహంబుల కేగ భూ♦ ధరుఁడు మేన, యెట్లు తపసొనరించిరో♦ యెఱుఁగఁజెపుము.

## — * మేనకా హిమవత్తపో వర్ణనము * —

క॥ అనవుడు సూతుండిట్లనె, మునులార! వినుండు దేవ ♦ ముఖ్యులటులు బో
ధన మొనరించి చనన్ శ్రీ, తనగేంద్రుఁడు మేనయును ని ♦ తాంతప్రేమన్.

చ॥ పరఁగఁ దపంబొనర్చి రన ♦ వద్యమహోద్యమ కామధామవి
స్ఫురదసమానమానసవి ♦ భూషితభక్తి నియుక్తులై మహే
శ్వరసహితంబుగా నుమను ♦ జైత్రసిత ప్రతిపత్తు దొల్తగా
నిరువదియేడువారము ల ♦ హీనవిధానముగా భజింపుచున్.

గీ॥ పర్వతేంద్రునిరాణి సం ♦ బరముతోడ, నిరుపమానసుసంతాన ♦ నిరత యగుచు
గాంగసైకతమున మహా♦ గౌరివిగ్ర, హమును బొనరించి పూజించు♦ నహరహంబు.

గీ॥ తదియనాఁడష్టమిని నితాం♦తప్రపత్తి, తోడఁ బస్తుండి యమ్మఱు♦ నాఁడు మోద
కాన్నముల గౌరిఁబూజించి♦ యవనిసురల, సాపడఁగఁజేసి దానముల్ ♦చాలఁజేయు.

క॥ కొన్నిదినంబులు ఫలములు, గొన్నిదినంబులును వన్య ♦ కుసుమరసంబున్
గొన్నిదినంబులు జలమును, గొన్నిదినంబులును గాలిఁ ♦ గ్రోలి తపించెన్.

## —* మేనకకుఁ బరదేవత ప్రత్యక్షమగుట *—

గీ॥ సప్తవింశతి వారముల్ ♦ జరుపనిట్లు, కడఁగి జగదేకమాత మే ♦ ల్కరుణ యెసఁగ
సంతసంబున మేనకా♦ కాంత యెదుర, నిలిచి ప్రత్యక్షమయ్యెఁగో♦ర్కులనుదీర్ప.

క॥ మెచ్చితి సాధ్వీ! నీ భా, స్వచ్చరితతపోవ్రతంబు ♦ వరమడుగు మిఁకన్
హెచ్చుగ నెట్టిదియే నే, నిచ్చెదఁ దడఁబాటులేక ♦ హిమశైలసతీ! 102

గీ॥ అంబ వాల్లభ్యమలర ని♦ట్లనుడు మేన, యంబఁగని మ్రొక్కి విజ్ఞాన♦మలమికొనఁగ
నంజలిఁబొనర్చి మధురోక్తు♦ లమరనిట్లు, ధ్యానమొనరించెఁదత్పదా ♦ ధీనయగుచు.

గీ॥ ఏమహామాయ తనయందు♦ నీజగంబుఁ, బొడమఁజేసి ధరించు వి ♦ స్ఫూర్తిగరిమ
నమ్మహాదేవి నాచండి♦ కాంబ నిప్డు, డెందమునఁగొల్చి యొనరింతు♦ వందనములు.

సీ॥ ఎల్లలోకములకు ♦ హేతువై తగుదాని, యోగనిద్రయనంగ ♦ నొప్పుదాని
భక్తులవలవంతఁ ♦ బాఱఁదోలెడుదాని, మంచిదాసుల మురి ♦ పించుదాని
తల్లులకెల్లను ♦ దల్లియై తగుదాని, నానందమున నెప్డు ♦ డలరుదాని
నిర్జరీరత్నమై ♦ నీటుమీఱెడుదానిఁ, దమ్మిపూదండలఁ ♦ దాల్చుదాని

గీ॥ సర్వకార్యార్థములను నొ ♦ సంగుదానిఁ, బ్రాణులకునెల్ల బుద్ధియై ♦ పరఁగుదాని
యతులకెల్లర కెఱుకయై♦ యమరుదాని, సిద్ధయగుదానిఁగొలుతుఁ ద్రి♦శుద్ధిగాను.

చ॥ అనలునియందు నుగ్రకల ♦ వై హరిదశ్వునియందు దాహకృ
ద్ఘనకలవై శశాంకునెడఁ ♦ గాటపుసంతస మిచ్చు కాంతివై
దనుజనిహంతయందు వివి ♦ తంబగు మాయవునై సుధాంశుమం
డను నెడఁ జిన్మయాకృతిఁ గ ♦ నంబడు దీవె గదమ్మ శాంకరీ! 105

గీ॥ ఊర్ధ్వరేతస్కులై కడు ♦ నొప్పుబుధుల, కందఱకు బ్రహ్మవిద్యవై ♦ యలరె దీవు
జగమునందలి సంసారి ♦ జనమునకును, గోర్కెవై యొప్పుచుందువు ♦ కూర్మిమీఱ.

క॥ కష్టంబేమియుఁ గాంచక, సృష్టిస్థితినాశములను ♦ జేయూద్భటకై
స్రష్టను హరిహరులను మహి, తేష్టమతిఁ గూర్చినట్టి ♦ యేలిక వీవే.

గీ॥ తల్లి! నాబోటులేడ యు ♦ ద్దామమైన, నీప్రభావంబు నెలమి వ ♦ ర్ణించు టేడ
శరణుఁ జేసెదనమ్మ! ప్ర ♦ సన్న వగుము, యిష్టవరములనిమ్ము మ ♦ హేశపత్ని!

క॥ ఇట్లు నుతించి భజించిన, గట్లేలికసానిఁ గాంచి ♦ కాళీసతి దా
నిట్లనఁ జెల్లనిదయ, యక్లేర్పడఁ గౌఁగిలించి ♦ యాదటఁ బలికెన్.

ఉ॥ కొండలఱేనిరాణి! యను ♦ గుంజెలి వమ్మరో! నాకు నీవు నే
నిండగు గారవమ్మెసఁగ ♦ నీడగుకోర్కు లొసంగవచ్చితిన్
దండిగఁగోరు మొండనక ♦ తప్పక యిచ్చెద నాకు నీకరా
కుండెడి దంచు నొక్కటియు ♦ నుండదు ముజ్జగమందు నెందునున్.

గీ॥ అమృతధారలఁజిందు దు ♦ గ్ధాంబపలుకు, సంబరంబున విని గిరి ♦ సార్వభౌమ
పత్ని దోయిలియొగ్గి యి ♦ ప్పగిదిఁబలికెఁ, దల్లి! నే వరమొందఁగాఁ ♦ దగినయెడల.

మ॥ శతపుత్రుల్ నుతిపాత్రులిప్డు తొలుతన్ ♦ జైత్రుల్ చిరంజీవులున్
మతిమంతుల్ జనియింపఁగావలె నికన్ ♦ మన్నించి నీవింపుమై
సుతవై నాకు జనింపగావలె సుర ♦ స్తోమంబు కార్యంబు నా
దృతిఁ గూర్పన్వలె వామదేవసతివై ♦ తీర్పన్వలెన్ లీలలన్.

## —* పరదేవత మేనకకుఁ గోరిన వరంబులిచ్చుట *—

గీ॥ అనుడు మేనావరంబుల ♦ నాలకించి, మందహాసమొనర్చి బా ♦ లేందుమౌళి
కాళి యిట్లనె మేనకా ♦ కాంత! నీవు, గనెదు నూర్గురుకొడుకుల ♦ గరిమమెఱయ.

ఉ॥ అందును నుత్తమోత్తముఁ డ ♦ హర్పతితేజుఁ డొకండు ముఖ్యుఁడై
ముందుగఁ బుట్టు నేనును న ♦ మోఘతరాదర మొప్ప నుద్భవం
బందెద నీదు గర్భమున ♦ నాత్మజనై యనిమేషకార్య మ
ర్థిం దగఁజేతు నీశ్వరు వ ♦ రింతు నిఃకం జను కంజలోచనా! 114

వ. అని యిట్లు వరంబిచ్చి యమ్మహాదేవి యంతర్ధానంబుఁ జెంద నమ్మేనక యద్దిశా
భాగంబునకుఁ బ్రణామమ్ములొనర్చి యత్యంత సమ్మోదమ్మునన్ దపఃక్లేశమ్ముఁ

బోఁజిమ్మి జయశబ్దమ్ము లొక్కుమ్మడిఁ గావింపుచు నాత్మేశ్వరుఁ జేరనక్కి
వరసిద్ధిన్ దెలిపిన గిరీశ్వరుండును సంతుష్టుండై యక్కోమలాంగిఁ బెక్కుభం
గులఁ గొనియాడి యక్కునఁ జేర్చి గారవించె. 115

## —* మేనకకు నూర్గురు కొడుకులు పుట్టుట * —

గీ॥ అంత గిరిరాజదంపతు ♦ లతులరతుల, సౌఖ్యమొందఁగ మేనకా ♦ సాధ్వి చూలుఁ
దాల్చి మేలైనవేళలోఁ ♦ దనయుఁగనియె, ఘనుని మైనాకనాము న ♦ గణ్యబలుని.

క॥ పదఁపడి వరమహిమంబున, నుదయించిరి సుతులు వారి ♦ కుదితార్కనిభుల్
ముదమునఁ బుత్రోత్సవ మా, యదనున నొనరించె భూధ ♦ రాధీశ్వరుఁడున్.

క॥ గిరివరు డొసఁగెను దానము, లురవుగ బ్రాహ్మణులకప్డు ♦ దొడ్డకును ధనం
బరుదొప్పనిచ్చె గౌరీ, పరమేశ్వరచరణకమల ♦ భక్తి నిగిడ్చెన్.

చ॥ హిమగిరి మేనయున్ జగద ♦ ధీశ్వరి పుట్టువుఁగోరి యాత్మచి
త్తమునఁ దలంప నాపెయును ♦ దానిడిసట్టి వరంబు నప్డు స
త్యము నొనరింపఁగాఁ గడఁగి ♦ దైవతకార్యభరంబు నెంచి పూ
ర్ణమయిన యంశతో హిమధ ♦ రాధరుచిత్తము నొందెఁ బొందుగన్.

క॥ ఆగట్టులఱేఁ డత్తఱిఁ, దా గౌరీతేజ మెలమిఁ ♦ దాల్చి మెఱయుచున్
బాగై యమరు ముహూర్తపు, భాగంబున నద్రిచేర్చె ♦ భార్యతనువునన్.

గీ॥ తనదు పెనిమిటియెడనుండి ♦ తన్నుఁ జేరి, నట్టి జగదంబతేజంబు ♦ నంది మేన
గర్భమున్ దాల్చి నిర్భర ♦ కాంతిపుంజ, రంజితాకార యగుచుఁ గ ♦ రంబు మెఱసె.

గీ॥ ఆరగింపున నరుచిమెం ♦ డయ్యె నొక్కి, లింత లేర్పడె నిదురయ ♦ లంతహెచ్చె
నగలుమూలకుఁబడియెనె ♦ మ్మొగములోధ్ర,కుసుమసమమయ్యెగట్టురా ♦ కొమ్మకప్పుడు

గీ॥ మట్టితావులఁజిమ్మున ♦ మ్మగువమోము, కమ్మనలఁజాలఁగొనుచు నే ♦ కాంతమందుఁ
దనివిఁ గొనలేకయున్న న ♦ దారహర్ష, భరముఁజెందె మహీధర ♦ ప్రవరుఁడపుడు.

క॥ దోహదముఁదీర్పఁ దలకొని, యాహిమవంతుండు మేన ♦ కాత్మస్పృహ నెం
తో హరువొప్ప నెఱింగి మ, హోహర్ష మెసంగఁ గూర్చె ♦ నపు డద్దానిన్.

గీ॥ దేవతలపాలి కల్పల ♦ తికనుబోలు, నంబికను గర్భమునఁదాల్చి ♦ యమరు సతిని
రత్నఖనిగర్భమైన యు ♦ ర్వరనుబోలెఁ, గాంచి మురిసె గిరీశ్వరా ♦ గ్రణియు నంత.

గీ॥ అభ్రితంబగు నాకస ♦ మట్లు ప్రసవ, సమయమొందిన సతికి ర ♦ క్షకులనున్ జి
కిత్సకుల నేర్పఱచి గర్భ ♦ గేహమందు, నునిచి యంబను దలఁచుచు ♦ నుండెనతఁడు.

ఉ॥ మేచకకద్మములోనఁ దమ ♦ మేలునకై పుడమిన్ జనింపఁగాఁ
బూనిన యంబికన్ మిగులఁ ♦ బొంగఁగఁజేయ సుపర్వనాయకుల్
మానులు దారసిల్లి యస ♦ మానవచస్స్వనముల్ సెలఁగఁగా
ధ్యానముచేసి రాగమని ♦ దానవిధానవధానురోధులై. 127

ఆ॥ జయము జయము దుర్గ! ♦ జయము మహేశ్వరి!
జయము జయము విజ్ఞ! ♦ జయము కాళి!
జయము సత్యనిష్ఠ! ♦ జయము సత్యవ్రత!
జయము సత్యరూప! ♦ జయము శక్తి! 130

శా॥ తల్లీ! నీవలనన్ గదా జగము లా ♦ తంకంబు లేకింతయే
నుల్లాసంబును జెంది పెంపెసఁగు నీ ♦ వొక్కింత దవ్వైందినన్
ముల్లోకంబులు దెల్విఁదప్పి చెడు మే ♦ మున్ మేటి నీసత్కృపా
వెల్లద్భాగ్యమునన్ సురక్షితులమై ♦ వేడ్గొంటి మంబా! యిటుల్. 131

క॥ పుడమి జనియించి యిఁకమా, యిడుములఁ గడతేర్పుమమ్మ! ♦ యెంతయుఁబేర్మిన్
కడు నేమగడగఁ గొని ని, న్నడపక పూజించువారి♦నెడఁగల కరుణన్.

గీ॥ మేనకాగర్భమందుఁ జే ♦ ర్చిన్ దనర్చు, నఖిలలోకాంబ నిటుఁగొని♦ యాడి వార
లెల్లఁ దమతమ నెలవుల♦ కేగిరంత, మేనకకునిండె నెలలునౌ ♦ మ్మిదియు నపుడు.

వ. పదియవమాసంబున నొక్క శుభసమయంబున. 134

## —* శ్రీ పరిదేవతావతార ఘట్టము *—

సీ॥ ఆకసంబు ప్రసన్న♦మయ్యెను సౌమ్య న, క్షత్రమాలాగ్రహ♦కలితమగుచు
గాడ్పు సుఖస్పర్శ ♦ గలిగివీచెను మేలి, కమ్మపుష్పాదులను ♦ గ్రమ్మకొనుచు
సలిలంబు దనరెఁగా ♦ సారసరోధునీ, వితతిన్ బ్రఫుల్లార ♦ విందమగుచు
వసుధయొప్పెను జన ♦ పదపట్టణారణ్య, ముల నెన్నఁదగు పండు ♦ గులనుగనుచు

గీ॥ అగ్నిహవ్యంబునొందె స♦ వ్యార్చియగుచుఁ, జందురుఁడు పండువెన్నెలఁ♦ జల్లెఁబెల్లు
పుష్పవర్షంబుగురిసె వి♦స్ఫూర్తిదిశలు, మెఱసె సజ్జనులెంతయు ♦ మురిసిరెలమి.

క॥ పాడిరి గంధర్వులు దివి, నాడిరి రంభోర్వశీము ♦ ఖాప్సరస లాగిన్
వీడిరి యలజడి వేల్పులు, వాడిరి బెగ్గడిలి వసటఁ ♦ బాపచరిష్ణుల్. 137

గీ॥ పరఁగ శ్రీచైత్ర శుద్ధ న♦వమి నిశీథ, మందు మృగశీర్ష నక్షత్ర ♦ మందు క్షీర
సాగరమునుండి యిందిర♦చాడ్పు మేన, కాతరుణి గర్భమందు శ్రీ♦కాళి పొడమె.

క॥ శివ యవతారము సేయఁగ, శివుఁ డానందించె నింగిఁ ♦ జెలఁగుచు భేరీ
రవ మొనరించిరి వేల్పులు, రవమున్ బొనరించె మేఘ ♦ రాజి యనువుగాన్.

బోఁజిమ్మి జయశబ్దమ్ము లొక్కుమ్మడిఁ గావింపుచు నాత్మేశ్వరుఁ జేరనరిగి వరసిద్ధిన్ దెలిపిన గిరీశ్వరుండును సంతుష్టుండై యశోకోమలాంగిఁ బెక్కుభంగులఁ గొనియాడి యక్కునన్ జేర్చి గారవించె. 115

## —* మేనకకు నూర్గురు కొడుకులు పుట్టుట *—

గీ॥ అంత గిరిరాజదంపతు ♦ లతులరతుల, సౌఖ్యమొందఁగ మేనకా♦ సాధ్వి చూలుఁ
దాల్చి మేలైనవేళలోఁ♦ దనయుఁగనియె, ఘనుని మైనాకనాము న♦ గణ్యబలుని.

క॥ పదఁపడి వరమహిమంబున, నుదయించిరి సుతులు వారి ♦ కుదితార్కనిభుల్
ముదమునఁ బుత్రోత్సవ మా, యదనున నొనరించె భూధ♦రాధీశ్వరుఁడున్.

క॥ గిరివరు డొసఁగెను దానము, లురవుగ బ్రాహ్మణులకప్పు ♦ డొడ్డకును ధనం
బరుదొప్పనిచ్చె గౌరీ, పరమేశ్వరచరణకమల ♦ భక్తి నిగిడ్చెన్.

చ॥ హిమగిరి మేనయున్ జగద ♦ధీశ్వరి పుట్టువుఁగోరి యాత్మచి
త్తమునఁ దలంప నాపెయును ♦ దానిడినట్టి వరంబు నప్డు స
త్యము నొనరింపఁగాఁ గడఁగి ♦ దైవతకార్యభరంబు నెంచి పూ
ర్ణమయిన యంశతో హిమధ ♦ రాధరుచిత్తము నొందెఁ బొందుగన్.

క॥ ఆగట్టులతేఁ డత్తఱిఁ, దా గౌరీతేజ మెలమిఁ ♦ దాల్చి మెఱయుచున్
బాగై యమరు ముహూర్తపు, భాగంబున నద్దిచేర్చె ♦ భార్యతనువునన్.

గీ॥ తనదు పెనిమిటియెడనుండి ♦ తన్నుఁ జేరి, నట్టి జగదంబతేజంబు ♦ నంది మేన
గర్భమున్ దాల్చి నిర్భర♦కాంతిపుంజ, రంజితాకార యగుచుఁ గ♦రంబు మెఱసె.

గీ॥ ఆరగింపున నరుచిమెం♦ డయ్యె నొక్కి, లింత లేర్పడె నిదురయ♦ లంత హెచ్చె
నగలుమూలకుఁబడియెనె♦మ్మొగములోఁ బ్ర,కసుమసమమయ్యెఁ గట్టురా♦కొమ్మకపుడు

గీ॥ మట్టితావులఁజిమ్మున♦మ్మగువమోము, కమ్మనలఁజాలఁగొనుచు నే♦కాంతమందుఁ
దనివిఁ గొనలేకయున్న ను♦దారహర్ష, భరముఁజెందె మహీధర♦ప్రవరుఁడపుడు.

క॥ దోహదముఁదీర్పఁ దలకొని, యాహిమవంతుండు మేన ♦ కాత్మస్పృహ నెం
తో హరువొప్ప నెఱింగి మ, హాహర్ష మెసంగఁ గూర్చె ♦ నవు డద్దానిన్.

గీ॥ దేవతలపాలి కల్పల♦తికనుబోలు, నంబికను గర్భమునఁదాల్చి ♦ యమరు సతిని
రత్నఖనిగర్భమైన యు♦ర్వరనుబోలెఁ, గాంచి మురిసె గిరీశ్వరా♦గ్రణియు నంత.

సీ॥ అభిప్రేతంబగు నాకస ♦ మట్లు ప్రసవ, సమయమొందిన సతికి ర ♦ క్షకులనున్ జ
కిత్సకుల నేర్పఱచి గర్భ♦గేహమందు, నునిచి యంబను దలఁచుచు♦నుండెనతఁడు.

ఉ॥ మేనకకడుపులోనఁ దమ ♦ మేలునకై పుడమిన్ జనింపఁగాఁ
బూనిన యంబికన్ మిగులఁ ♦ బొంగఁగఁజేయ సుపర్వనాయకుల్
మానులు దారసిల్లి యస ♦ మానవచస్స్తవముల్ సెలంగఁగా
ధ్యానముచేసి రాగమని ♦ దానవిధానవధానురోధులై. 127

ఆ॥ జయము జయము దుర్గ! ♦ జయము మహేశ్వరి!
జయము జయము విజ్ఞ! ♦ జయము కాళి!
జయము సత్యనిష్ఠ! ♦ జయము సత్యవ్రత!
జయము సత్యరూప! ♦ జయము శక్తి! 130

శా॥ తల్లీ! నీవలనన్ గదా జగము లా ♦ తంకంబు లేకింతయే
నుల్లాసంబును జెంది పెంపెసఁగు నీ ♦ వొక్కంత దవ్వైందినన్
ముల్లోకంబులు దెల్విఁదప్పి చెడు మే ♦ మున్ మేటి నీసత్కృపా
వేల్లద్భాగ్యమునన్ సురక్షితులమై ♦ పేర్గాంటి మంబా! యిటుల్. 131

క॥ పుడమి జనియించి యిఁకమా, యిడుములఁ గడ తేర్పుమమ్మ! ♦ యెంతయుఁ బేర్మిన్
కడు నేడుగడగఁ గాని ని, న్నడపక పూజించువారి♦యెడఁగల కరుణన్.

గీ॥ మేనకాగర్భమందుఁ జే ♦ ర్మిన్ దనర్చు, నఖిలలోకాంబ నిటుఁగాని♦ యాడి వార
లెల్లఁ దమతమ నెలవుల♦ కేఁగిరంత, మేనకకునిండె నెలలునో ♦ మ్మిదియు నపుడు.

వ. పదియవమాసంబున నొక్క శుభసమయంబున. 134

## —* శ్రీ పరిదేవతావతార ఘట్టము *—

సీ॥ ఆకసంబు ప్రసన్న♦మయ్యెను సౌమ్య న, క్షత్రమాలాగ్రహా♦కలితమగుచు
గాడ్పు సుఖస్పర్శన్ ♦ గలిగించెను మెల్లి, కమ్మపుష్పాదులను ♦ గ్రమ్ముకొనుచు
సలిలంబు దనరెఁగా ♦ సారసరోధునీ, వితతిన్ బ్రఫుల్లార ♦ విందమగుచు
వసుధయొప్పెను జన ♦ పదపట్టణారణ్య, ముల నెన్నఁదగు పండు ♦ గులనుగనుచు

గీ॥ అగ్నిహోత్రంబునొండె స♦ వ్యార్చియగుచుఁ, జందురుఁడు పండువెన్నెలఁ♦ జల్లెఁబెల్లు
పుష్పవర్షంబుగురిసె వి♦స్ఫూర్తిదిశలు, మెఱసె సజ్జనులెంతయు ♦ మురిసిరెలమి.

క॥ పాడిరి గంధర్వులు దివి, నాడిరి రంభోర్వశీము ♦ ఖాప్సరస లొగిన్
వీడిరి యలజడి వేల్పులు, వాడిరి బెగ్గడిలి వనటఁ ♦ బాపచరిత్రుల్. 137

గీ॥ పరఁగ శ్రీచైత్రశుద్ధ న♦వమి నిశీథ, మందు మృగశీర్ష నక్షత్ర ♦ మందు క్షీర
సాగరమునుండి యిందిర♦చొడ్పు మేన, కాతరుణి గర్భమందు శ్రీ♦కాళి పొడమె.

క॥ శివ యవతారము సేయఁగ, శివుఁ డానందించె నింగిఁ ♦ జెలఁగుచు భేరీ
రవ మొనరించిరి వేల్పులు, రవమున్ బొనరించె మేఘ ♦ రాజి యనువుగాన్.

ఆ॥ పుష్పవృష్టి యలరెఁ ♦ బొలుపుగాఁ గమ్మనల్, గుప్పెగాడ్పు శీత ♦ కుధరనగరి
నుండువారికెల్ల ♦ నూడె నుమ్మలకమ్మ్రు, సాటిలేనిసంత ♦ సంబెసంగె. 136

—* విష్ణ్వాదిదేవతలు పరదేవతను దఱిసి స్తుతించుట *—

క॥ అనిమిషులు గడిఁదిహర్షం, బున నట కరుదెంచి నిఖిల ♦ భువనాంబను గ
న్గొని యిట్లు నుతిఁబొనర్చిరి, కనదసమానాభిరామ ♦ ఘనతర ఫణితిన్.

ఉ॥ అంబరో! దేవకార్యమును ♦ నర్థిఘటింపఁ దలంపుచేసి జ
న్మంబును నొందినట్టి నిను ♦ నమ్మి భజించెదమమ్మ! యిప్డు పూ
ర్ణంబు నొనర్చి తీవు గిరి ♦ రాణ్మిథునోరుమనోరథంబు సి
ద్ధిం బొనరింపు వేగ మిఁక ♦ దివ్యులకార్య మవార్యమౌ కృపన్.

ఆ॥ విష్ణుముఖ్యదేవ ♦ విభులిట్లు జగదంబ, కను నుతించి మ్రొక్కి ♦ కడుముదమునఁ
దమదుధామములకుఁ ♦ దరలిరి జగదీశ్వ, రీవయున్ బొగడుచు ♦ నాదరమున.

క॥ నీలోత్పలదళకాంతులఁ, బోలినతనుకాంతి మిగులఁ ♦ బొంగిపొరలు నా
కాళిక దివ్యాకారము, శైలేశ్వరి గాంచి మించు ♦ సంతసమెసఁగన్.

చ॥ ఓపరమేశ్వరీ! త్రిభువ♦నోన్నత పూతచరిత్రి! సత్కృపా
ద్వీపవతీ! సతీ! సకల♦దేవనుతా! శివధర్మపత్ని! నీ
వీ పగిదిన్ గృపన్ సలుపు ♦ టెంతయు సంతసమమ్మ! యైన నీ
రూపముమార్చి నాసుతగ ♦ రూపము మైకొనుమమ్మ శాంకరీ!

క॥ ఇటు లాడిన మేనకనుడి, నిటలాక్షునిరాణి విని వి♦నిద్రప్రేమన్
గుటిలత యొకింతలేకయె, యిటు పల్కెసుధారసంపు♦టిమిడిక యమరన్.

ఉ॥ మేనక! మున్నునీతపసు ♦ మెచ్చి వరంబటులిచ్చి యిప్పుడ
ద్దాని ఘటించితిన్ గుఱుతు ♦ దట్టుటకై యిటు నా స్వరూపమున్
బూనితి నిప్డు దీనివిడి ♦ పుత్రికయాకృతిఁ జెందుదాన సం
తానముదంబు నొందుఁ డగ♦తల్లజమౌళియుఁ బుణ్య వీవునున్.

గీ॥ దేవతలకార్యభర మిఁకఁ ♦ దీర్చుదానఁ, బరఁగఁదరుణేందుధరుఁ జెట్ట♦పట్టుదాన
దుర్మతులరూప లడుగంటఁ♦దునుముదానఁ, బెనుచుదాన శుభంబులఁ♦బేర్మిమీకు.

క॥ నాయందు దుహితృభావము, సేయుఁడు ననుబెంచి పెండ్లి ♦ సేయుఁడు ప్రేమన్
రాయుఁడు పాపచయంబుల, వేయుఁడు నిర్వాణసౌఖ్య♦విజయధ్వజమున్.

వ. ఇట్లుచెప్పి యప్పరదేవత తత్క్షణంబున నాత్మమాయావిశేషంబున బాలికా
కృతిన్ దనరి రోదనంబుచేసిన మేనకయును దత్సంగతాళీజనంబులును ననన్య
సామాన్యంబగు నబ్బాలికాతేజంబున కక్కజంబొంది కడున్గడు సంతసంబొంది
రాసమయంబున. 146

గీ॥ పుత్త్రికాపానుపునందు వి♦స్ఫురితగతులఁ, బరఁగు బాలాతపప్రభా♦పటలి నర్ధ
రాత్రమున వెల్గు దీపముల్ ♦రహిని దక్కి, చిత్రగతదీపములఁబోలి♦ చెలఁగె నపుడు.

### —* హిమవంతుఁడు పుత్త్రీజననోత్సవము సేయుట *—

క॥ పుత్త్రీజననోదంతము, నాత్రముగా వచ్చి చెప్పి ♦ నట్టిజనుల కే
మాత్రము గొంకక శ్వేత, చ్ఛత్రము వెలిగానొసఁగె న♦చలుఁడఖిలంబున్.

గీ॥ హితులగు మహీసురులఁ బురో♦హితులఁగూడి, శైలపతి పుత్త్రికింటికి♦జని కుమారిఁ
గనియెఁ గాంతుల గృహమెల్లఁ ♦ గప్పుదాని, నల్లకలువలడాలు వె♦న్నాడుదాని.

చ॥ కని ఘనమైనసంతసము ♦ గ్రమ్ముకొనంగ నగేంద్రుఁ డాత్మజా
జననమహోత్సవంబెసఁగ ♦ సల్పె ననల్పములై నవాద్యని
స్వనములు వారసుందరుల ♦ చాతురి మీఱెడు నాటపాటలున్
గొనబుఁదనర్ప బ్రాహ్మణుల♦కున్ దగు దానములిచ్చె హెచ్చుగన్. 150

### —* నామకరణము *—

గీ॥ జాతకర్మంబులొనరించి♦శైలరాజు, మునులతో మంచిసుముహూర్త♦మునసుతకు
నామకరణంబు చేసి నా ♦ నాధనములఁ, బంచిపెట్టెను యాచక♦ప్రతతి కపుడు.

గీ॥ కాళి! కామేశ్వరీ! శివ! ♦ కామసుంద, రీ! లలిత! ఆర్య! చండిక! ♦ బాల! యనుచుఁ
బేరులను బెట్టియెంతయుఁ♦బ్రియము మెఱయఁ, బిలిచిరా బాలికనునింపు♦పెంపుగదుర

క॥ పర్వతపతియగు హిమవ, త్పర్వతమున కెలమి నిడు న ♦ పత్యంబగుటన్
బార్వతి యనుపేరును నీ. యుర్విన్ గై సేసె నాపె ♦ యుచితవిధముగాన్,

*గీ॥ అఖిలజగదంబయై సము♦దారకరుణ, జగములన్ గాచుచుండుటఁ♦జక్కనుమయ
టంచుఁ బేరునుదాల్చియా♦యవనియందుఁ, బరఁగెనెల్ల రమణులకు♦మురుపునిడుచు

క॥ నానావిధ గానంబుల, నూనగతిన్ గాయకాగ్ర ♦ ణులు సల్పిరి సు
శ్రీనిధి గిరిపతి వారికిఁ, గానక కానక చయంబుఁ ♦ గానుకలొసఁగెన్

గీ॥ అంత హిమవంతుఁ డెంతయు ♦ సంతసంబె, సంగ నుత్సవమిబ్భంగి ♦ సంతరించి
కూఁతుఁబలుమఱుఁగాంచుచుఁ♦జేతమందుఁ, బొంగెఁబెల్లిదముగ బహు♦పుత్త్రుఁడైన.

చ॥ వలిమలకూఁతు రెంతయును ♦ వార్షిక కాలమునాఁటి గంగ య
ట్టుల శరదిందుచంద్రికయ ♦ టుల్ కమనీయతరాంగియై దినం
బుల వరుసన్ గడున్ బొదలెఁ ♦ బొందుగ బంధుజనంబులెల్ల న
చ్చెలువముఁగాంచి యచ్చెరువుఁ ♦ జెంది ముదంబును జెంది రింపునన్. 157

* అవతీత్యుమా = రక్షించునట్టిది—అవ రక్షణే

క॥ పలువురు నందనులొప్పఁగ, గలవారైనను గుమారికనుఁగనుచు హిమా
చలుఁడుఁ దత్పత్నియు ని, మ్ములఁ దృప్తిఁ జెందరైరి ♦ మురియుచు నెపుడున్.

చ॥ కలిమిగ మాత్రుకలెల్ల నన ♦ కారు నెడన్ జిగిరించి పూచి తా
వుల విలసిల్లుచున్నను ద ♦ పుల్కొనుఁ జాతసుమంబునందుఁ దేఁ
టులు కులశైలవల్లభుఁడ ♦ టుల్ గొడుకుల్ గడు నెక్కుడున్న ని
చ్చలు సుతనే కనుంగొనుచు ♦ సంతసమొంది చెలంగు నెంతయున్. 159

సీ॥ సంస్కారవంతమౌ ♦ చక్కనివాక్కునఁ, దేజంబునొందిన ♦ ధీరపోల్కి
మహనీయతరకాంతి ♦ మండితంబగు శిఖ, భాస్వరంబైన దీ ♦ పంబు పగిది
విమలోదకంబున ♦ వెలయు గంగాఝరిఁ, గమనీయమైన యా ♦ కసముమాడ్కి
సరసకవీంద్రవి ♦ స్ఫురితమై తగుగోష్ఠి, జానొందినట్టి రా ♦ జన్యుఁ డట్లు

గీ॥ అఖిలజగముల కంబిక ♦ యైన యార్య
చేత నీక సర్వపర్వత ♦ శేఖరుండు
పూతుఁడును భూషితుండయి ♦ పొలుపుమీఱి
పుడమియందెల్లఁ గీర్తి వి ♦ స్ఫూర్తిఁబడసె.

## — * శ్రీ పార్వతీ బాల్యక్రీడాభివర్ణనము * —

గీ॥ ప్రబలసింహంబులను గొంతుఁ ♦ బట్టి లాగి
తెచ్చి యెక్కి వనంబెల్లఁ ♦ దిరుగుఁగాళి
గున్నయేనుఁగుఁ గొనివచ్చి ♦ కొమరుఁ డనుచు
నెత్తికొని ముద్దిడును బ్రియం ♦ బెసక మెసఁగ.

వ. మఱియు నప్పర్వతరాజకుమారి బాల్యక్రీడావినోదంబులఁ దవిలి తోడిపడుచులను
గూడికొని చదలేటి యిసుకతిన్నెలందుఁ జేరి

సీ॥ జననినే నీకనాడు ♦ సంతాన మీరని, పంట్లోగిరంబులు ♦ పంచిపెట్టు
జగములేలెడు దొర ♦ సానినే నీరలు. ప్రజలంచుఁ బరువొప్పఁ ♦ బనులుసెప్పు
కామధేనువు నేను ♦ గడమసురభులీర, టంచుఁ గోర్కులను యో ♦ జించి తీర్చు
కల్పవల్లిని నేను ♦ స్వల్పలతలు మీర, లని నిజౌన్నత్యంబు ♦ నమరఁజూపు

గీ॥ గురుగులమరించుబ్రహ్మాండ♦గోళములని, బొమ్మలనుగూర్చుహరిపద్మ♦భవులనుచును
బంతులాడును రవిహిమ ♦ భానులనుచు, శైలరాజకుమారి శై ♦ శవముగూరి.

ఉ॥ శారదవేళ హంసములు ♦ జాహ్నవిఁజేరెడునట్లు రేయి వి
స్తారరుచుల్ మహౌషధులఁ ♦ జక్కఁగఁజెందెడుమాడ్కి నద్రిజన్
జేరెఁ దమంతఁబూర్వజని ♦ సిద్ధములై తగువిద్యలెల్ల నం
భోరుహనేత్ర దా గురుల ♦ పొంతఁ బఠింపుచునుండ వింతగాన్. 164

సీ॥ తమకన్నవకు నర ♦ వృషభనుంగవయంచుఁ, గొలువఁజేరెడు ♦ మృగీకులములరరి
తమనడుమ్మకన్న సూ ♦ క్ష్మము శివనడుమంచు, సేవించిపోయి సిం ♦ హీవిసరము
తమనడలోడె భూ ♦ ధరకన్యనడకని, అంఘ్రులఁబడు రాజ ♦ హంసకాళి
తమకాలివము పోల్పఁ ♦ దగదు కాళీవేణి, కనిమయూరులు నృత్త ♦ మునభజించు
గీ॥ శుకపికంబులు పార్వతీ ♦ సురుచిరోక్తి, మాధురీ సాధురీతికి ♦ మానమింకి
కలచుటకుఁజేరి తగు నుడి ♦ కారమొందుఁ, గన్నడదుసాటి శివకు జ ♦ గమునవొకటి.
సీ॥ శివయని పిలువఁగాఁ ♦ జెలువ పల్కునుగాని, యన్యాహ్వాయంబుల ♦ కలఁతిసేయు
ఇందుశేఖరము బి ♦ ల్విలమిఁబాల్చునుగాని, తలఁదాల్పదెన్నండు ♦ తక్కునగల
కంఠీరవర్షభ గ ♦ జములనెక్కును, గాని యశ్వాదినె ♦ క్కఁదలఁపదు
భర్త్రారవిందసం ♦ భవపరాగవిభూతు, లలఁదు గాని యలంద ♦ దన్యలేప
గీ॥ ములను నిచ్చలు సామగీ ♦ తులనె గాయ
నములఁలుపుఁగాని యితరగీ ♦ తములఁ గనదు
శరధనుశ్శూలములనె హ ♦ స్తములఁ దాల్చుఁ
గాని యల్పాయుధములఁ జా ♦ కంపలఁపదు. 166

వ. మఱియును.

సీ॥ బాల విపంచికా ♦ వాదనంబొనరించుఁ, బరమేష్ఠిరాణి సం ♦ బరముఁజెంద
కాళి గాత్రమున రా ♦ గముల నాలాపించు, నిందిరహృదయంబు ♦ డిందువడఁగ
లలిత నర్తనకౌశ ♦ లంబుఁజూపించు న, వ్విద్యాధరాంగనల్ ♦ వెఱఁగుఁజెంద
శివ చిత్రము లిఖించుఁ ♦ జెలువుగా పలరాజు, రాణి ధైర్యంబు గ ♦ రంబు సడల
గీ॥ అనుపమానమనోజ్ఞ శా ♦ వ్యంబులల్లు, నల్లగురు కావ్యదేవులు ♦ డిల్ల వడఁగఁ
బరమకళ్యాణి గిరివరే ♦ శ్వరకుమారి, లీలలేమని లెక్కింపఁ ♦ బోలునెలమి.

— * నారదాగమనము * —

ఉ॥ నారదమౌని యొక్కనుడి ♦ నంబునఁ గొండలఱేని పీఁటికిన్
భూరితరప్రమోదమునఁ ♦ బోయి గిరీంద్రునిఁ దాకసించినన్
ధీరుఁడతండు మౌనిఁగని ♦ దిగ్గనలేచి నమస్కరించి దై
వాఱెడు వేడ్కఁ బీఠమిడి ♦ పాద్యము నర్ఘ్యమునిచ్చి మెచ్చుగన్. 168
గీ॥ తనదుకూఁతునురప్పించి ♦ వినయమెసఁగ, మునిపదంబులకెఱఁగించి ♦ ముఖ్యకార్య
మిదియనితలంచి వినతుఁడై ♦ యింపుగదుర, నంజలిరచించియిట్లని ♦ యడిగెఁబ్రీతి.
ఉ॥ ఓ మహనీయ దివ్యకరు ♦ ణోదధి! యో పరమేష్ఠిపుత్రక
గ్రామణి! మత్సుతాకరముఁ ♦ గాంచి గుణాగుణముల్ గ్రహించి యీ
కోమలగాత్రి యెవ్వనిక ♦ గున్ దొరసాని మఱెట్టి సౌఖ్యముల్
దా మహిఁజెందునో చెప్పుఁడు ♦ తథ్యము మీ వచనంబు ధారుణిన్. 170

గీ॥ ఇట్టులడిగిన గిరిపతి ♦ యిచ్చనెఱిఁగి, దేవముని కాళిహస్తంబుఁ ♦ దేఱిచూచి
అఖిలశుభలక్షణంబుల ♦ నరసి మురిసి, యిట్లుపల్కెను భూమిధ ♦ రేంద్రుతోడ,

శా. శైలేంద్రా! విను శారదేందుకలనా ♦ సారొంది వర్ధిల్లు నీ
బాలారత్నము నీదుకూఁతు రఖిల ♦ భ్రాజిష్ణురేఖాఢ్య గో
త్రాలంకారముసేయు నీకుఁ బతి కు ♦ ద్యత్సౌఖ్యముల్గూర్చు వా
ణీలక్ష్ముల్ పొగడంగ నొప్పు సిరి రా ♦ ణింపంగ సొంపుంగనుల్, 172

వ. వెండియు నజ్జడదారి యెలనగవుతో వాగ్విలాసంబుమెఱయ గిరివరునకిట్లనియె.

గీ॥ అద్రిరాజన్య! నీకూఁతు ♦ హస్తమందు, రేఖలెల్ల సులక్షణ ♦ రేఖలైన
నొక్కరేఖ విలక్షణం ♦ బున్నకతన, దానిఫలమెఱిఁగింతు నం ♦ తయునువినుము.

గీ॥ యోగి, నగ్నుండు, కడిఁది బై ♦ రాగి, గుణము, లేనివాఁడును దలిదంద్రి ♦ లేనివాఁడు
అశివవేషధరుం డొకఁ ♦ డనభిమాని, నీదుకూఁతును బెండ్లాడు ♦ నిజమువినుము.

వ. అనినంత

మత్తకోకిల. శాళి నారదమౌని పల్కులఁ ♦ గ్రాలుభావమెఱింగి య
క్కాలకాలుఁడె యాత్మనాథుఁడు ♦ గాఁగలండని యెంచి లోఁ
జాలసంతసమొంది చిత్తము ♦ శంకరాంఘ్రులఁ జేర్చి తా
నాలకింపుచునుండె వారిప్రి ♦ యాతురోక్తుల నెంతయున్. 175

క॥ నారదమునిపల్కుల విని, భూరివ్యసనమునఁ గుంది ♦ భూధరుఁడును మే
నారమణి యెట్టకేలకు, స్థైర్యణఁగొని యిట్టులనిరి ♦ చనవున మునితోన్. 176

చ॥ అలమటఁ జెందె డెందము మ ♦ హాత్మ! భవద్వచనం బమోఘ మీ
యలజడి కెట్టులోర్తు మక ♦ టా! పలునోములు నోఁచి కన్న యీ
లలితకుమారికిన్ బతి వి ♦ లక్షణుఁ డేర్పడ మాదు జీవితం
బులు చెడు దీని మార్పఁగల ♦ పొంకము గల్గినఁ దెల్పుఁడీ దయన్. 177

— * గిరిరాజుతో నారదుఁడు పార్వతి శివపత్నియగుననుట * —

ఉ॥ నావుడు నారదుండనె మ ♦ నః ప్రియమొప్ప నగాధిరాజ! మీ
రీవిధి కించనొందఁదగు ♦ నే? విధి వ్రైదము దిద్దఁబోలునే?
భావమునందు నేనొక యు ♦ పాయము నారసి చెప్పెదన్ వినుం
డీ వగపెల్లఁబాసి సుఖ ♦ మే సమకూరెడుభంగిగా నిఁకన్.

గీ॥ వినుఁడు శివునందు నేనన్న ♦ విధములెల్లఁ, జెల్లుఁగావున నతని కీ ♦ చెలువనిచ్చి
పెండ్లిఁగావింపుఁ డట్లైనఁ ♦ జేర్మియలరు, నెల్లదోషంబు లొక్కట ♦ నింకిపోవు.

గీ॥ ప్రభులయెడ దోసమొక్కింత ♦ వంతనిడదు, లోఁతియందదియే దుఃఖ ♦ హేతువగును
స్వర్ణదీపావకార్కుల ♦ చందమిందు, వరయుమెచ్చోటనేని య ♦ హార్యతిలక! 180

క॥ కావున నీప్రియసుత యగు, నీశివ నాశివునకొసఁగి ♦ యింపుగఁ బెండ్లిన్
గావింపుము కులములరఁగ, నీవెత యంతయును దొలఁగు ♦ నెగడుసుఖంబుల్.

చ॥ శివుఁ డఖిలేశ్వరేశ్వరుఁడు ♦ శిష్టజనావనబద్ధకంకణుం
డవికృతుఁ డప్రమేయుఁ డఖి ♦ లామరపూజితపాదపద్ముఁ డు
ద్భవనిధనంబులన్ గనని ♦ బల్లిదుఁ డిద్ధతపోధనాగ్రియై
భవుఁడు సమర్థుఁ డెందు నిఁకఁ ♦ బర్వతరాజవరేణ్య! యారయన్. 182

వ. ఇవ్విధంబునఁ జెప్పి యమ్మునిప్రవరుండు వెండియు నిండువేడుకన్ గొండల దొరతో నిశ్చితంబుగ నిట్లనియె. 183

చ॥ కులగిరిరాజ! నీయనుఁగు ♦ కూఁతురు రూఢిగ రాజమౌళినే
వలచి వివాహమాడు నిది ♦ వాస్తవమెంతయు వీరలొండొరుల్
బలితపుఁ బ్రేమబంధమునఁ ♦ బాయని తీయని చెల్మికల్మిసొం
పెలయఁగ సర్వసౌఖ్యముల ♦ నెప్డు గహింతురు గాంతు రెన్నికన్. 184

మ॥ మఱియున్ నీదుకుమారి సాధ్వియు నిలిం ♦ పగ్రామణీభామినీ
శ్వరియై యీశ్వరుఁ బ్రీతుఁ జేయుచుఁ దప ♦ శ్చర్యన్ హిరణ్యాభయై
ధర గౌరీప్రథఁ జెందుఁ గారుణికచే ♦ తస్స్ఫూర్తి రాణింప ని
ర్జరకార్యంబు ఫలింపఁ జేయు సురలా ♦ శాసించి భాసించఁగన్. 185

సీ॥ దేవదేవునిఁ జేపట్టి ♦ దేవులైన, హరివిరించిప్రముఖులచే ♦ నర్చలొంది
అఖిలభువనంబులకుఁ దాన ♦ యధికయగుచుఁ, బరఁగు నీపుత్రి నీహార ♦ పర్వతేంద్ర!

గీ॥ పరమవైరాగ్యభావవి ♦ స్ఫారహృదయుఁ, డైనరుద్రునిఁ జెందియు ♦ నార్యతనదు
మేలిగొనములకలిమి న ♦ మేయతపము, బలిమి శంకరదేహార్ధ ♦ భాగమొందు.

క॥ ఈ కన్నె నుదక్క శివుం, డేకాంతను బెండ్లియాడఁ ♦ డిది నిక్కంబి
ట్లేకాంతముగాఁ జెప్పితి, నీ కో నగరాజతిలక! ♦ నిలువు మదిన్. 188

క॥ కావున నీ కన్నియ నీ, వే వేళనుగాని యొడ్ల ♦ కిచ్చుట మదిలో
భావింపకు మీవె మహా, దేవుని సొత్తనుచు మిగులఁ ♦ దెలియు మగవరా!

గీ॥ ఇట్లు నారదమునియన ♦ హిమనగేంద్రుఁ, డిట్లనియె విన్ము మౌనివ ♦ రేంద్ర! యొక్క
మనవి శివుని గుఱించి నా ♦ వినినయట్లు, నీదు సన్నిధిఁ జెప్పికొ ♦ నియెద నిపుడు.

సీ॥ దాక్షాయణీసతి ♦ తనువుఁ బాసిననాఁట, నుండి విరాగియై ♦ యుండెననియు
సంగంబువిడిచి ని ♦ ర్జరగోచరముగాని, ఘనతపంబొనరింపఁ ♦ గడఁగెననియు
నక్షయుండై శివం ♦ బై పరబ్రహ్మమై, యలరుస్వాత్మమున నె ♦ ప్డలరు ననియు
నిర్వికారంబగు ♦ నిజరూపమున నుండి, మానసంబును దింపఁ ♦ బూనఁడనియు

గీ॥ మున్ను సతితోడ వేఱొక • కన్నె నెప్పుడు, పెండ్లియాడను నేనని • ప్రియము మెసంగ
బాసఁగావించెననియుఁ గై • లాసభర్త, కిన్నరులువచ్చిచెప్పుదు • రిన్నగమున.

క॥ అట్టిశివుండు మునీశ్వర! బిట్టుగ వేఱొక్కసతినిఁ • బెండ్లాడఁగ ని
ష్పట్టునఁ దలంచు టెట్లని, గట్టులఱేఁ డూరకున్నఁ • గని మునియనియెన్. 192

చ॥ గొనకొని దక్షుపుత్రి ప్రతి•కూలతనొందినతండ్రిమీఁదియా
సునఁ దనమూర్తిఁ బాసి త్రిద•శుల్ మొఱపెట్టిన మీఁద మీఁదునం
దనయయి పుట్టెఁ గాళికగ • దక్షజ కీమెకు లేదు భేద మీ
శునిసతియై కరంబలరుఁ • జుమ్మలుమాను ధరాధరాగ్రణీ! 193

గీ॥ తనకుమారిక పూర్వవృ•త్తంబుసర్వ, మును మునీంద్రునితో హిమ•భూధరుఁడువ
ధూసుతుల కట్టెదుటవిని • పాసె సంది, యంబునెల్లను దనహృద • యంబునందు.

గీ॥ కాళి తనపూర్వజన్మంబు • కథను నిక ది, టంబుగా నీశుఁజేపట్టు• టయునునార
దునుడి విని సిగ్గుచేత న•ధోముఖియును, సస్మితాస్యయునై యుండ•జనకుఁడంత.

చ॥ కని తనపీఠమం దుమను • గ్రిచ్చఱఁజేర్చి కవుంగలించి మో
మునఁ దనమోముఁజేర్చి శిర•మున్ వెస ముద్దిడి చెక్కులం గరం
బున జనవొప్పఁగాఁ బుణికి • పొందుగ హర్షముఁ జెందియుండ న
మ్మునిగిరిరాజుఁ దత్సతినిఁ • బూర్తిగఁ బ్రీతులఁజేయు నిట్లనున్. 196

ఉ॥ పర్వతరాజ! నీతనయ • పన్నుగఁ గొన్నిదినాలమీఁద సౌ
పర్వణబృందకల్పితస • పర్యల నొందుచు నాదిమూర్తియున్
సర్వజగత్ప్రభుండు నగు • శర్వుని యంకతలంబునెక్కి యీ
యుర్విఁదలంప రాని కను•లొందని వైభవమొందుఁ బొందుగన్. 197

గీ॥ అని ప్రియంబుగ వారల • యంతరంగ, ములను సంతోషభరమునఁ • బొంగఁజేసి
అమరమౌని యథేచ్ఛగ • నరుగుటయును, వారలంత గృహంబులో • పలికిఁజనిరి.

గీ॥ కొంత కాలంబుచనినంతఁ • గుధరవరుని, రాణి మేనక తనమనో • రమణు సన్ని
ధానమునకేగి వేగఁబా•దములకెఱఁగి, యిట్టులడిగెఁ బ్రియోక్తుల•నింపుగదుర.

—* హిమవంతునితోఁ మేనక పార్వతికిఁ బెండ్లిసేయు మనుట *—

ఉ॥ నారదుఁ డట్లు మీఁయెదుట • నాఁడు వచించిన జాడయేమొ? నే
నారయలేకయుంటిని య•థార్థము స్త్రీజనచాపలంబునన్
గూరిమిపుత్రి కిప్పు డను•కూలముగా వరుఁగూర్చి పెండ్లి వి
స్తారతరప్రమోదమున • సల్పుఁడు సల్పుఁడు నాథ! నావ్యథన్. 200

క॥ ధనమును బ్రాయము చక్కం, దనమును విద్యావివేక ♦ దాక్ష్యంబులు పా
వనమైనవంగడము గ, ల్గిన నరునకుఁ గన్నె నిడవ ♦ లెన్ సుత యలరన్. 201

ఉ॥ సుందరరూపమున్నను వ♦చోగరిమంబది సున్న యద్దియు
న్నం దనుభాగ్య మబ్బదు ఘ♦నంబది గల్గిన నీడుజోడునున్
బొందికఁ గాంచ వచ్చియును ♦ బొల్పెసలారినఁ బావనాన్వయం
బందికఁ జెంద దొక్కెడ ♦ నన్నియుఁ గూడు టలభ్య మేరికిన్. 202

వ. ఐనను

క॥ ఏలాఁటివానికైనను, బాలిక నొసఁగం దలంప ♦ వచ్చునె? తమక
న్యాలావణ్యగుణంబులఁ, బోలిక నరయంగవలదె ♦ పురుషవరేణ్యా!

చ॥ అలరుల సెజ్జయందు లలి ♦ తాంగిక దాఁ బవళించి నిద్ర నొ
త్తిలి పొరలంగఁ గెంపడరి ♦ దేహము గందెడుఁ గుందకోరకం
బుల నెపుడేని నెచ్చెలుల ♦ పోటికినై చిదుపంగఁ గల్కి వ్రే
ళులఁ గఱగట్టు నెత్తురిల ♦ లోఁ గనినామొకో యిట్టి కన్నెలన్.

గీ॥ అనుచుఁ గన్నీరు దొఱుఁగన♦గాధిరాజ, రమణి నాథునిపదముల ♦ వ్రాలియున్న
నన్నగోత్తముఁ డత్తన్వి♦నాదరమునఁ, గౌగిటన్ జేర్చి యిట్లనె♦గౌరవమున.

చ॥ వినుమిఁక దేవి! దేవముని ♦ విజ్ఞశిరోమణి చెప్పినట్టి పా
వనవచనంబు బొంకగునె? ♦ వద్దిఁక వేఱుతలంపు లింపునైఁ
దనయకు శంభుఁ గూరిచి యు ♦ దారతపం బొనరింపు మంచు బో
ధను బొనరించి పంపు నియ ♦ తంబుగ దాన శుభంబు సేకుఱున్. 206

క॥ అగుణములన్నియు శివునెడ, సుగుణములై పరఁగు వినుము ♦ సుందరి! యిఁకనా
యగణితతపోనిధానుం, డగజను బెండ్లాడుఁ దపము ♦ నర్మిలి సేయన్. 207

వ॥ అనుడు విని యాసీమంతినీలలామంబు పెనిమిటి పలుకుల కలరి కూఁతున్ దప
శ్చరణంబునకై శిక్షన్ బొనర్చు పొంటె నాపెసమీపంబునకున్ జని యనన్య
సామాన్యంబగు నాబాలిక సౌకుమార్యధుర్యతన్ గని తపోవ్రతం బుపదేశింప
నోడి కన్నీరుమున్నీరుగాఁ గార్చుచున్నఁ గాంచి యన్నగరాజకుమారి నిజజననీ
మనోగతం బెఱింగి తనుభంగి నూరడించి యిట్లనియె.

## — * పార్వతి స్వప్నవృత్తాంతము * —

శా॥ అమ్మా! స్వప్నముఁ గంటిఁ జెప్పెదను వి♦న్మా! నేఁటి ప్రత్యూషపూ
ర్వమ్మం దొక్కతపస్వి విప్రుఁ డనుకం ♦ పన్ శంకరానుగ్రహా
ర్థమ్మై నన్నుఁ దపంబుఁ జేయుమని హా ♦ ర్దంబొప్పఁగా శైవమం
త్రమ్మున్ జెప్పి చనెన్ విచిత్రమగు వృ♦త్తం బిద్ది యోజింపుమా! 209

చ॥ కలయన రాదు నిక్కవము ♦ గా శివమంత్రిముఁజెప్పిపోయెఁ దాఁ
గల యది కాదనందగదు ♦ కన్నులు మున్నగు వాని తెల్పి యే
మలరదు తల్లి! దానఁ గడు ♦ నక్కజమగా మదికంచుఁ జెప్పఁగా
వలిమలరాణి బిట్టలరి ♦ వల్లభు నల్లనఁబిల్చి పేర్మిమై. 210

గీ॥ తనయగాంచిన కలఁ గల♦తత్త్వమంతఁ, గాంతునకుఁదెల్ప నాతండు♦గరము మురిసి
తాను గాంచిన కలతీరుఁ ♦ దన వధూటి, కిట్లు చెప్పెను సంతోస ♦ మినుమడింప.

—* హిమవంతుని స్వప్నవృత్తాంతము *—

ఉ॥ నాకల నొక్క దివ్యఋషి ♦ నాథుఁడు నారదబోధితాంగకుం
డీ కుధరోపకంఠమున ♦ కింపు మెయిన్ జనుదెంచి సంయమ
శ్రీకులు మానుతెన్నఁగ గ ♦ రిష్ఠతపోవ్రతమున్ బొనర్పఁగా
పీఁకఁగడంగ నే సుతను ♦ వేగొని యా ఘనుపాలికేగితిన్. 212

గీ॥ పోయి కనుఁగొని నేనల్ల ♦ పురుషవరుని, నారదోక్తవరునిగాఁగ ♦ నమ్మి మొక్కి
సేవకై యుంచు నాకూఁతు♦సెలవొసంగు, మంచుఁ బ్రార్థింపఁగా నిషే♦ధించెనతఁడు.

గీ॥ అంత నాకూఁతునకు వారి ♦ కపుడు చాల, సాంఖ్య వేదాంతరీతుల ♦ జరిగె వాద
మప్పుడాస్వామి నెనరొంది♦యాజ్ఞనొసఁగ, నుంచితినివారికడఁగూఁతు♦మించుఁబోఁడి

ఉ॥ కూఁతురు యోగివర్యునకుఁ ♦ గూరిమి పేరిమి సేవఁజేయుచున్
జేతము సంతసంబలరఁ ♦ జేయుచునుండె నటంచు స్వప్నమున్
రాతిరి దెల్లవాఱుతతి ♦ రాణిరో! కంటిని తత్ఫలంబికన్
జాతము కొద్దికాల మిది ♦ శోభనసూచనమంచుఁ దోఁచెడున్. 215

క॥ అని యిట్లు శైలకులపతి, తన గేహినితోడఁజెప్పి ♦ తా స్వప్నఫలం
బును గనుపూనిక నుండెను, మనసున శివచింతనంబు ♦ మల్లడిగొనఁగన్.

మత్తకోకిల:– సూతుఁ డిట్లు వచింపఁగా విని ♦ చోద్యమంది మునీశ్వరుల్
సూతు సద్గుణపూతు నాదృతిఁ ♦ జూచి యిట్లని రింపుమై
భూతభర్త శివుండు రాజత♦భూధరంబున నిప్డు తాఁ
జేతమం దిరవొంది యెయ్యది ♦ సేయుచుండెనొ చెప్పఁడీ. 217

క॥ అని మునులన సూతుం డిట్లనె వినుఁ డనఘాత్ములార! ♦ యభవుఁడు దాఁ బ
త్నినిఁబాసిన యదిమొదలుగ, ఘనతర తాపానలమునఁ ♦ గ్రాఁగి వెగడునన్.

చ॥ తిరిగి ధరిత్రి నెల్లెడ న ♦ దేవరుసన్ మదులొంది జీవితే
శ్వరిని మనంబునన్ మఱవఁ ♦ జాలక తద్గుణజాల వైభవం
బరుదుగఁ గింకరోత్తముల ♦ యాత్మలు దల్లడమొందఁ జెప్పుచున్
దిరుగ నిజాద్రిఁ జేరె మది ♦ ధీరతఁజేకొని యెట్ట కేలకున్. 219

వ. అంతఁ మీఁద

చ॥ త్రిగుణములన్ దొలంగి వికృ ♦ తిఁ గొనునట్టి నిజస్వరూప మి
మ్ముగఁ గనుచున్ జిరం బిటుల ♦ భూరితరాతులితప్రమోదపూ
రగతమనస్కుఁడై కడు వి ♦ రాజిలె సన్ముని రాజులెల్లఁ జ
క్కఁగ నిత యోగమర్మములఁ ♦ గర్మతులై తనయొద్ద నేర్వఁగన్. 220

—* శివుని లలాటఘర్మజలమునుండి కుజుఁడు పుట్టుట *—

ఆ॥ అట్లు చాలకాల ♦ మరిగిన వెంబడిఁ, జిత్ర మొక్కనాఁడు ♦ శివుని నొసటి
ఘర్మవారికణము ♦ గ్రక్కునఁ బుడమిపైఁ, జింద బాలుఁ డగుచుఁ ♦ జెలువు మిగిలె.

సీ॥ ఆజానులంబిబా ♦ హా చతుష్కమువానిఁ, బద్మరాగారుణ ♦ ప్రభలవాని
నందంబుఁ జిందు మే ♦ లగు మోముగలవాని, రాణించు వెడఁదయు ♦ రంబువానిఁ
గమనీయమైనయా ♦ కారంబు గలవానిఁ, బరులకసాధ్యుఁడై ♦ పరఁగు వాని
దివ్యతేజంబులఁ ♦ దెలివిమించెడువాని, గంభీరదృష్టులఁ ♦ గాంచువాని

గీ॥ జననమును జెందియున్న త ♦ త్స్వన మెసంగ, రోదనము సేయువాని న ♦ త్యాదరమున
నెత్తికొనివచ్చియప్పు మ ♦ హేశు నెదుట, నిలిచియుండెను దా ధర ♦ ణీవధూటి. 222

గీ॥ సుతునిఁ గని తెచ్చి నిలిచిన ♦ సుందరీల, లామ తమఁ బరికించి కై ♦ లాసభర్త
మందహాసంబు చింద నా ♦ నందసాంద్ర, వచనముల నిట్లు పలికె న ♦ వ్వసుధతోడ.

చ॥ ధరణివధూటి! నీవు గడు ♦ ధన్యవు నాదు శ్రమాంబుజన్ముఁడై
యురుదున నీయెడన్ బొడమి ♦ నట్టి తనూజుని వీనిఁ బెంపు మా
దరమున నీకుమారుఁడు త్రి ♦ తాపవిహీనుఁడు సద్గుణాకరుం
డురుసుఖదాత నీకగు మ ♦ దుక్తి గ్రహించి గ్రహింపు మర్భకున్. 224

ఉ॥ భూమియు నట్లకాక యని ♦ పుత్రునిఁ దోడ్కొని పోయి పెంపఁగా
భౌముఁ డటంచుఁ బేరుఁ గొని ♦ బాలుఁడు వృద్ధినిఁ జెంది కాశికా
ధామముఁ జేరి యందు హిమ ♦ ధామశిరోమణిఁ గూర్చి నిష్ఠ ను
ద్దామతపంబుఁ జేసి మహి ♦ తంబగు శంభు ననుగ్రహంబునన్. 225

క॥ గ్రహములలో నొకబలవ, ద్గ్రహమై భార్గవుని పదము ♦ కన్నను మీఁదన్
బహుతరవిభవాస్పదమై, రహిమీఱెడు మండలమున ♦ రాజయ్యెఁ దగన్. 226

—* శివుఁడు హిమాద్రికి వచ్చి తపంబు సేయుట *—

గీ॥ జగదధీశ్వరుఁ డంతట ♦ శైలరాజ, పుత్రియై జగదీశ్వరి ♦ పుట్టుటయును
నెనిమిదేండ్ల వయస్సు వ ♦ హించుటయును, నాత్మయందు నెఱింగి యా ♦ హ్లాద మొందె.

వ. అంతఁ గొంతకాలంబు చనుడు.

శా॥ గంగాభంగతరంగరంగదురుశృం ♦ గవ్రాతశీతాచలో
త్తుంగాధిత్యకయందు జెంద మలరన్ ♦ దుర్దాంతభంగిన్ దపం
బుం గావింపఁగడంగి భృంగిరిటుఁడున్ ♦ మున్నౌ గణేంద్రాళితో
డం గాలాంతకమూర్తి చేరె గిరిరా ♦ ట్ప్రస్థంబు నాస్థోన్నతిన్. 228

ఆ॥ బ్రహ్మపురమునుండి ♦ పరమపావనియైన, గంగ యవతరించెఁ ♦ గడఁగియెచట
నటవసించి తపసు ♦ నారంభమొనరించె, మౌనులలరఁ జంద్ర ♦ మౌళియపుడు.

మ॥ నిరపాయంబయి నిర్వికారమును నై ♦ నిత్యంబునై యాశ్రయాం
తరశూన్యంబయి జ్యోతిరూపమయి య ♦ ద్వైతంబునై సంవిదా
కరమై సర్వజగన్మయంబునయి మే ♦ ల్గన్పట్టు స్వాత్మంబునం
దు రహిన్ ధారణఁజెందియుండె గణనా ♦ థుల్ గొంద ఱట్లుండఁగన్. 230

ఉ॥ నందియు భృంగి మున్నగు గ ♦ ణప్రవరుల్ మఱిగొందఱందుఁ బా
లేందుకిరీటుఁ జిత్తవిహి ♦ తేష్ట సపర్యలఁ గొల్చుచుండి రిం
కం దమ మొప్ప మానవిధి ♦ గాంచి వసించిరి కొంద ఱింకనుం
గొందఱు ద్వారదేశమునఁ ♦ గోలలఁ దాల్చి వసించిరిమ్మగన్.

## — * హిమవంతుఁడు శివుని సందర్శించుట * —

గీ॥ హిమగిరీశ్వరుఁ డంత స ♦ ర్వేశ్వరుండు, ప్రమథనాథులతోడఁ ద ♦ పంబుఁజేయ
నోషధిప్రస్థభూమిఁ దా ♦ నొందెననుచు, విని పరిజనంబుతో వచ్చి ♦ వేగిరముగ.

సీ॥ విరియఁబూసినమల్లె ♦ విరుల మొత్తమ్ముల, చంద మొప్పెడు మేని ♦ చాయవాని
గందపుంబొడికన్నఁ ♦ గరము ధావళ్యంపు, వసమీఱు భసితలే ♦ పంబువాని
నెలదేఁటిదాఁటుల ♦ చెలువుఁగలంచు నై, ల్యముమీఱు నఱుతచా ♦ యగలవానిఁ
గెందమ్మిమొగ్గల ♦ యందంపుపెంపు నై, రింపని యడుగుల ♦ సొంపువాని

గీ॥ నమరు నలమోడ్పుకనుదోయి ♦ నలరువానిఁ, ఘ్రాణనాసాగ్రదృష్టియై ♦ పరఁగువాని
నొనరఁబద్మాసనమునఁ గూ ♦ ర్చున్నవాని, నఖిలలోకేశ్వరునిఁ గాంచి ♦ హర్షమునను.

ఉ॥ సాఁగిలి మ్రొక్కి గంధసుమ ♦ సారముఁ బాద్యము నర్ఘ్యమిచ్చి ని
ష్ఠాగరిమన్ మనోజ్ఞహరి ♦ చందనపుష్పఫలార్చనంబులన్
వేగ నొనర్చి యచ్చుమగు ♦ వేడ్క భయంబును భక్తియున్ మదిన్
లోఁగఁగఁ జేయ నమ్రతను ♦ లోఁగొని యంజలిఁబూని యిట్లనెన్. 234

క॥ దేవాదిదేవ! శంకర!, నీవెకదా? సకలభువన ♦ నికరమునకు ర
క్షావహుఁడ వారయ మహా, దేవ! కపర్ది! గరిష్ఠ ♦ దివ్యకీర్తి!

సీ॥ నిర్గుణుండైనను ♦ నిత్యంబు భక్తుల, సాఁకఁగ సగుణుండౌ ♦ చతురుఁ డెవఁడు
సర్వలోకనివాస ♦ చతురుఁడైనను వెండి, కొండయందుండు నా ♦ థుం డెవండు
దేవరాజికినెల్ల ♦ దేవుండు తానయ్యు, యోగిరూపొప్పారెఁ ♦ రాగియెవఁడు
ఏకాంతులెఱుఁగని ♦ యీశ్వరుండైన భ, క్తప్రీతిఁగాంక్షించు ♦ ధన్యుఁడెవఁడు

గీ॥ త్రిగుణములకును నాప్రకృ♦తికిని నీవుఁ, దై విరాజిల్లునప్పర ♦ మాత్మ యెవఁడు
హరివిరించుల యూడిగ♦మందు నెన్నఁ, డట్టినీకు నమస్కార ♦ మాదిమూర్తి !

క॥ వాగీశరమేశులక, వ్వాగీశరమేశ్వరత్వ ♦ వైభవగరిమన్
బాగొప్ప నిడిన దాతవు, యోగీశ్వర! నీవకాదె ♦ యురుతరకరుణన్. 238

ఉ॥ నీదుచరిత్ర మెన్న రజ ♦ నీకరశేఖర! శక్యమౌనె దా
మోదరకాంచనోదరము ♦ ఖోత్తమనిర్జరపాళికెల్ల నా
మోద మెసంగ భక్తజన ♦ పుంగవకోటికిఁ జెల్లునద్ది నీ
వాదరబుద్ధి వారల ర ♦ యంబునఁ జేరుట లోకనాయకా! 239

ఉ॥ భాగ్యముగాదె నీవిటఁ గృ ♦ పానిధి! యీప్రమథాళితోడ వై
రాగ్యమతిన్ దపోవ్రతభ ♦ రంబు వహింపఁగఁ జేరుటెల్ల నన్
యోగ్యునిఁ జేసి తిప్డు కుల ♦ మున్నతిఁగాంచె వరించె నల్ల సౌ
భాగ్యరమామనోజ్ఞపరి ♦ భాసితచారుకటాక్షమాలికల్. 240

చ॥ ఇఁకను మహేశ! సేవకున ♦ కెద్దియు నేని పనిన్ ఘటించి తా
పసపరిచారకవ్రజము ♦ వంక ననున్ గొని యాదరింపు మే
నకలుషచిత్తవృత్తి ముద ♦ మంది యొనర్చెద నీదుసేవ మా
మకహితపుత్త్రబాంధవస ♦ మాజముతోడ దయామహాత్మకా! 241

గీ॥ ఇట్లు గిరిరాజు పలికిన ♦ నీశ్వరుండు, విని కనులువిచ్చి పర్వత ♦ విభుని వాని
గణమునుఁ గూడఁ దాఁ బొడఁ♦గాంచి యపుడు, మందహాసంబెసంగ ని♦మ్మాడ్కిఁ బలికె

చ॥ వినుము ధరాధరేశ్వర! ప ♦ విత్రునిగా నిను నెంచి నీదు పా
వనశిఖరప్రదేశమున ♦ బాఢతపం బొనరింప వచ్చితిన్
మునులకు నిర్జరేంద్రుల క ♦ మోఘతపస్సుల కిష్టభూమి యై
యొనరు మరున్నదీసుపవి ♦ త్రోదకపూతము నీతటంబిలన్. 242.

ఉ॥ చేయుదు నిందుఁ నేఁ దపము ♦ శీతమహీధర! కొన్నినాళ్ళు నీ
వీయెడ కిఙ్కరుల్ దిరుగ ♦ నీకుము నాదుతపోంతరాయముల్
సేయఁగనీకు మీయదియె ♦ సేవయగున్ బరమోత్తమంబుగాఁ
జేయుము తత్ప్రయత్నమిఁకఁ ♦ జేయుము నీదు గృహంబు నింబుగన్. 244

సీ॥ ఇట్లు జగదీశ్వరుండు గి♦రీశ్వరునకుఁ, జెప్ప విని గట్లతేఁడప్పు ♦ డొప్పమీఱు
చనవుతోఁ దుత నిట్లనె ♦ సంతసం బె, సంగ దేవాధినాథుని ♦ సముఖమందు. 245

క॥ ఏమని చెప్పుదు మీతోఁ, బ్రేముడి నాప్రస్థమునకు ♦ విచ్చేసి మహా
త్మా! మధురోక్తుల నిట్లనఁ, గా ముదమగ్గలముగాఁగఁ ♦ గడలుకొనె మదిన్.

ఉ॥ వెగ్గలమైన నిష్ఠఁగొని ♦ వేలుపు ల్లుగ్రతపంబుఁజేసి ని
న్నగ్గలికన్ గనన్ గడఁగ ♦ నందకయుందువు వారికట్లు నా
నిగ్గుభాగధేయమున ♦ నీవ యిటుల్ గరుణామయుండవై
దగ్గఱఁ జేరినాఁడ విటు ♦ తాపములింకె మహాత్మ! నాకికన్. 247

శా॥ నాకన్నన్ ఘనుఁడొక్కఁడీ జగములో ♦ నన్ లేఁడు లెక్కింపఁగా
నాకీడైన నరుండునున్ గలుగఁడె ♦ న్నన్ నాదు ప్రస్థంబునన్
లోకాధీశ్వర! నీవుచేరి తపమున్ ♦ యోజించుటన్ జేసి య
న్నాకాధీశునికన్న మిన్నయగుదున్ ♦ నాగేంద్రచర్మాంబరా! 248

చ॥ పరఁగఁ దపంబుఁజేయుము సు ♦ పర్వశిరోమణి! యంతరాయముల్
దొరయునె నీతపంబునకుఁ ♦ దోరపుఁగూరిమి పేర్మి నీదు నౌ
కరు గిరిరాజవర్యుఁ డొడి ♦ కమ్మగ సేవయొనర్చు నింక సు
స్థిరమతితో స్వతంత్రితను ♦ జేకొని కైకొను నాదుసేవలన్. 249

క॥ అని వినయమ్మున యమదమ, ముని తో నగరాజు ప్రియపు ♦ నుడికారముచొ
ప్పునఁబలికి తనదు గేహం, బునకేగి వచించె సర్వ ♦ మును దన ప్రియకున్.

చ॥ అనుచరవర్గమున్ బిలిచి ♦ యాతఁడనెన్ వినుఁడింకమీఁద స్వ
ర్ధుని దిగునట్టిచోటి కెవ ♦ రున్ జనఁగూడదు పోతిరేని శి
క్షను బొనరింతు వారలను ♦ ఘాతుకరీతి నిజంబు నాదుశా
సనమిదియంచుఁ బ్రస్థమునఁ ♦ జాటుఁడు నెల్ల రెఱుంగునట్లుగాన్. 251

వ. అని పనిచిన నవ్వారలు.

క॥ గంగావతరణమున కే, గంగాఁదగదెవరుఁ గొంత ♦ కాలంబిటు లా
గంగావలె తేఁడేపడఁ, గంగా శిక్షించు నాజ్ఞఁ ♦ గడచినవారిన్. 252

## —* హిమవంతుఁడు పార్వతీ పరిచర్యలఁ గొనుచుండుమని శివు నర్థించుట *—

ఆ॥ ఇట్లు సాఁటుటయును ♦ హిమవంతుఁడెంతయు, సంతసమున నీశు ♦ సన్నిధాన
మునకుఁబోయె దివ్య♦పుష్పఫలంబులఁ, గొనియుఁదనదుసుతను♦గొనియు మఱియు.

క॥ చని ధ్యానతత్పరుండగు, ననఘుని లోకాధినాథు ♦ నాదటఁగని వం
దనమొప్పఁజేసి పుష్పం, బ్లను నొసఁగి సుతననిలిపి యొ ♦ దయుని కెదురుగాన్.

ఉ॥ ఓ కరుణాపయోనిధి! మ ♦ హోన్నత పూతచరిత్ర! నీదు సే
వాకుతుకమ్ముతో నిటకు ♦ వచ్చె మహాత్మజ దీనిసేవలన్
జేకొనుమయ్య! ప్రత్యహము ♦ సేవయొనర్చు సఖీసమేతయై
తేఁకువతోడ నాయెడ వి ♦ ధించిన మేటియనుగ్రహంబునన్. 255

## —* శివుఁడు పార్వతీదేవినిఁ జూచుట *—

వ. అని యభ్యర్థించిన మహేశ్వరుండాలకించి.

సీ॥ కనివిని యెఱుఁగని ♦ ఘనతరసౌందర్య, ధుర్యయం చాత్మకుఁ ♦ దోఁచుదాని
దక్షకన్యకకన్నఁ ♦ దద్దయుఁ జక్కంద, నముగల్గి శీవుల ♦ నమరుదాని
ఘనయోగులకునైనఁ ♦ గందర్పవిక్రృతి స, ల్పంజాలినట్టి రూ ♦ పంబుదానిఁ
గానవంబంతఁ బ్రి ♦ కాశింపఁజేయు ది, వ్యంబైన కాంతిపుం ♦ జంబుదాని

గీ॥ నభినవంబైన యౌవనం ♦ బమరుదాని
నమరు కస్తూరికా ఘుమ ♦ ఘుమలదాని
నఖిల లోకంబులకు మూల ♦ మైనదానిఁ
బర్వతేంద్ర కుమారియై ♦ పరఁగుదాని.

సీ॥ కలువఱేకుల మించఁ ♦ గల కనుంగవదానిఁ, జంద్రమండలనిభా ♦ స్యంబుదాని
గండుతుమ్మెదలట్టి ♦ కఱికురుల్ గలదానిఁ, గంబునిభంబైన ♦ గళముదానిఁ
దమ్మితూడులఁబోల్పఁ ♦ దగు బుజంబులదాని, రమ్యమైతగువళి ♦ త్రియముదానిఁ
గమలకుట్మలపీన ♦ ఘనకుచంబులదానిఁ, గడుసన్నమైనన ♦ న్నడుముదాని

గీ॥ మెట్టదామరలన్ బోలి ♦ మేల్మికోమ, లంబు మీఱిన పాదయు ♦ గంబుదాని
ధ్యానులకు మోహనాస్త్రమై ♦ తనరుదాని, నమరరమణీశిరోమణి ♦ యైనదాని.

ఉ॥ చూచి తదంగసౌష్ఠవపు ♦ సొంపులు నింపు జనింప నంతతో
లోచనముల్ మొగిడ్చి యవి ♦ లోలము నుత్తమమైనయాత్మయం
దే చరియించుచున్న సక ♦ లేశ్వరుఁగాంచి గిరీశ్వరుండు సం
కోచముతోఁదగుల్గొనిన ♦ కుందున జోతయొనర్చి యిట్లనెన్.

ఉ॥ దేవ! మహానుభావ! శివ! ♦ దివ్యకృపాకర! శర్వ! శంకరా!
నీవె చరాచరంబులకు ♦ నిత్యముహర్షము నిచ్చుదాత వీ
నీ విభవంబెఱుంగుటకు ♦ నేరక వేదచయంబు శాస్త్ర మెం
తో వెరపొప్పఁ జెప్ప వలఁ ♦ తుల్ పరులెవ్వరికన్ మహేశ్వరా! 260

క॥ వినను బరమేశ్వర! యీ, దీనుని హిమవంతుఁ గనులు ♦ దెఱచి ఘనదయన్
బూని భవదీయదాసునిఁ, గా నేర్పడఁజూడుమా జ ♦ గన్నుతచరితా!

చ॥ అనుదినముఁ మహేశ్వర! మ ♦ దాత్మజతోఁ జనుదెంచి నీదు ద
ర్శన మొనరించి పోయెదఁ బ్రి ♦ సన్నమతిన్ సెలవిమ్మటన్న న
య్యనఘుని పల్కులన్ విని ర ♦ యమ్మునఁ గన్నులు విప్పి చూచి యి
ట్లనె జగదీశ్వరుం డప్పుడు ♦ ధ్యాన మొకించుక మాని మానుగన్. 262

క॥ నాయొద్దకు నీవొక్కఁడ, వే యనుదిన మేగుదెంచు ♦ మీ! నీ తనయన్
నీయింట నునిచి రమ్మటు, సేయనిచో నన్నుఁ గనుట ♦ చేకుఱదు సుమీ!

గీ॥ అని వినిశ్చితముగఁ బల్క ♦ నమ్మహేశు, నకు గిరీశ్వరుఁడిట్లనె ♦ నాథ! యేమి
కారణంబున నిందురాఁ ♦ గాదు నాదు, తనయ కది నీదు సేవకుఁ ♦ దగదొ యేమొ!

క॥ అని యడిగిన హిమవంతున, కనియెను లోకాధినాథుఁ ♦ డాహ్లాదముతో
డను లోకాచారంబులు, గనఁజేయుచు నితరయతుల ♦ గతులఁ దెలుపుచున్.

శా॥ మాయారూపిణులంచుఁ జేడియల నా ♦ మ్నాయంబు బోధించు వి
న్నా! యందున్ యువతుల్ విశేషమిఁకఁ దా ♦ మవ్వారిలో సుందరుల్
బాయన్ జేయుదు రెందుఁ జిత్తనియతిన్ ♦ బాటించి మోహోద్ధతిన్
డాయన్ జేయుదు రందుచేఁ దపము వి ♦ ఘ్నంబౌను సత్యంబుగా. 266

క॥ బిత్తరుల గుత్తపుంజను, గుత్తులనున్ జిగురుమోవిఁ ♦ గ్రొందీవెలఁబోల్
మెత్తని మేనులఁ గాంచినఁ, దత్తఱపడరొక్కొ యెట్టి ♦ తపసు లగసరా!

ఉ॥ అందును నీదుపుత్త్రి రుచి ♦ రాంగి, నవీనవయోవిలాస, పూ
ర్ణేందునిభోజ్జ్వలానన క ♦ రీంద్రవరేణ్యసమానయాన నే
నిందుఁ దపోవ్రతుండను ని ♦ రీహుఁడ యోగికులుండ నాకు నీ
నందనతోడ నేమిపని ♦ నాగకులేంద్ర! తలంచి చూడుమా! 268

ఉ॥ నీవును దాపసేంద్రుల న ♦ నేకుల నేలెడుతేఁడ వాగమాం
తావగతప్రబోధుఁడవు ♦ న్యాయ్యమెఱుంగనివాఁడవొక్కొ యీ
భావముమాను మీపగిదిఁ ♦ బల్కకుమింక నగాధిరాజ! యో
షావళి యెడ? యోగుల స ♦ మక్షము లేడ? యెడందఁ గాంచుమా! 269

గీ॥ అనుచు నిష్ఠురముగ నిస్ప్రు ♦ హంబుగాఁగఁ, బలికి విరమించియున్న య ♦ ప్పరమపురుషుఁ
గాంచి భయకంపితుండయి ♦ గట్లతేఁడు, మిన్నకుండె విశాసంబు ♦ తెన్నుదక్క.

క॥ హరుని వచనంబు విని గిరి, వరుచకితాకృతినిఁ జూచి ♦ పార్వతి దా శం
కరునకు నమస్కరించి మ, ధురభణితుల నిట్టులనెఁ జ ♦ తురతరమతితోన్.

గీ॥ దేవ! నాతండ్రి కిత్తఱి ♦ నీవు చెప్పి, నట్టి యంశంబునకు సరి ♦ యైన యుత్త
రంబు నేఁ జెప్పుదానఁ గ ♦ రంబుగనిక, రంబమర నాలకింపు హ ♦ ర్షంబుతోడ.

## —* పార్వతీ పరమేశ్వరుల సాంఖ్యవేదాంతపథవివాదము *—

ఉ॥ తాపసశక్తితోఁ దగిలి ♦ దండితపం బొనరించుచుంటి వి
తాపసశక్తితోడనె యు ♦ దారతపంబున నిచ్చగల్గె నీ
తాపసశక్తియే ప్రకృతి ♦ దా నఖిలంబు రచించుఁ బెంచు నా
టోపమణంగఁ ద్రుంచెడు న ♦ టుల్ గనుమేనొ యదీవెవండవో. 273

ఆ॥ ప్రకృతియొకటిఁ బాసి ♦ పశుపతి! లింగరూ, పమున నొప్పనీవు ♦ వసుధవంద్యుఁ
డవును బూజనీయుఁ ♦ డవును ధ్యానాస్పదుండ, వగుదువయ్య యెట్లు ♦ లరసి చెపుము!

వ. అనినంత.

క॥ పర్వతరాజసుతోక్తుల, సర్వస్వం బరసి తనదు ♦ శాసనమును దా
నిర్వాహం బొనరించుచు, శర్వుండిటువల్కె నుపరి ♦ సన్మాత్ముండై.

చ॥ పరమతపంబునన్ బ్రకృతిఁ ♦ బట్టి యడంచెద శుద్ధమూర్తినై
పరఁగెద నేను సత్యముగఁ ♦ బ్రాజ్ఞులకీ ప్రకృతిశ్రియంబు నె
ప్పరుసునఁ జెల్ల దేవికృతి ♦ పాల్పడకెందును లోకవృత్తముల్
బారయొక యుండఁ జెల్లునిది ♦ పొచ్చెముగాదు మహీధరాత్మజా! 276

క॥ అనవేగనె నగి క్రమ్మఱ, ననియెను గాళికయు శశిక ♦ లాభరణునితో
ఘనతరచరితా! నీనుడి, యును బ్రకృతివశంబుగాక ♦ యొండొకఁడగునే 277

క॥ అందీవెక్కుతమున బ్రకృ, తిందాఁటినవాఁడవైతి ♦ తెలుపు మఖిలమున్
సందియములేక బద్ధమ, గుం దానన్ గాదనంగఁ ♦ గూడునె యనఘా! 278

గీ॥ వచన మాదానగమనముల్ ♦ వదలుటయును
సుఖము నొందుట వినుటయుఁ ♦ జూచుటయును
స్పర్శ మాఘ్రాణమును రస ♦ జ్ఞతయుఁ బ్రకృతి
కృతము లివిగాదనుట యెట్లు ♦ వితథవచన! 279

గీ॥ ప్రకృదాటినవాఁడవేన్ ♦ భవ్యచరిత!, తపమదేటికి నీకిందుఁ ♦ దత్త్వమెఱిఁగి
నట్టివానికిఁ దపసున ♦ నవసరంబు, లేదు వాగ్వాదమున నేమి ♦ లేదు లబ్ధి. 280

వ. ప్రకృతిసిద్ధియం దనుమాన ప్రమాణంబు నెవ్వ రంగీకరింతురు ? నీ వప్రాకృతుండ వగుట యెట్లు? లోకమందు దేహు లెంతవఱ కింద్రియజన్యజ్ఞానానుభవంబు గలిగియుందు రంతదనుక ప్రాకృతులౌట స్పష్టంబు.

ఉ॥ మాటలు వేయునేల వినుమా ♦ యనుమానము మాని సర్వమున్
దేటయొనర్చెదన్ బ్రకృతి ♦ నేన్ బురుషుండవు నీవు సుంతయేన్
బూటక మేదిటన్ సగుణ ♦ మూర్తివి నాదయనొందు వీవు నా
కూటమిఁ బాసి సుంతయొనఁ ♦ గూర్పఁగలాడవె నిర్గుణుండవై. 282

ఆ॥ నన్నుఁ జేరికాదె♦నాథ! నీవెల్ల క, ర్మములఁ జేయుటరయ ♦ మహిని నెపుడు
అట్లుగాక ప్రకృతి♦కవ్వల నీవున్న, భయముఁ బాసి నా స♦పర్యఁ గొనుము.

ఆ॥ ఇట్లు సాంఖ్యసరణి ♦ హిమగిరికన్య దాఁ, జెప్పినట్టి నుడుల♦నొప్పు మెఱయ
విని శివుండు పలికె♦వేదాంతమతమార్గ, గామియగుచు నిటులఁ ♦ గాళితోడ.

## —* శివుఁడు పార్వతీ పరిచర్యఁ గొనుట కంగీకరించుట *—

మ॥ గిరిజా ! నీవిటు సాంఖ్యవాదినివి కాం♦క్షింపన్ నిషేధింప ని
శ్చరమౌ నట్టులె చేయు ప్రత్యహము ని♦చ్చో నాకు శుశ్రూష నేఁ
బరమేశానుఁడ నేని మాయకు దురా♦పస్థానభూతుండ నేన్
దరమే? నన్నుఁ జలింపఁజేయుటకుఁ గాం♦తాలోకచూడామణీ ! 285

గీ॥ ఇట్లు గాళికిఁ జెప్పి శై♦లేంద్రుతోడఁ, బలికె భక్తానురంజన♦పరుఁడు హరుఁడు
నీదుప్రస్థంబునన్ దపో♦నిష్ఠనుండె, దను స్వరూపంబు నానంద♦ఘనముఁగనుచు.

క॥ సెలవొసఁగు నాకుఁ దపసిట, సలుపుటకై తావకాను♦శాసనమును ని
మ్ములఁగనక తపముసేయఁగ, నలవియె యిట నేరికేని ♦ నగరాజవరా ! 

వ. అనిన విని హిమవంతుఁ డత్యంతవిధేయుండై ప్రణమిల్లి శివునకిట్లనియె. 288

గీ॥ దేవదైతేయమానుషా♦ధిష్ఠితంబు, లీ జగంబులకెల్లను ♦ నీవె యీశ్వ
రుండవైయుండ దేవ! తు♦చ్ఛుండనైన, నేనెటుల నేమి సెప్పుదు♦నిందుఁగడఁగి.

క॥ అనవిని హిమవంతునితో, ననుకంప దనర్పఁగా మ♦హాదేవుం డి
ట్లనియె గిరిరాజ ! వేశ్మం,బున కేగుండన్న మురిసి ♦ పోయిరి వారల్. 290

## —* పార్వతి చెలులతోఁ బ్రతిదినము శివునకుఁ బరిచర్య సేయుట *—

చ॥ ప్రతిదినమున్ గిరీశ్వరుఁడు ♦ పార్వతిఁ దోడ్కొనిపోయి శంకరున్
గుతుకముతోడఁ గొల్చి చను ♦ గోత్రవరేణ్యుఁడు రాకయున్న నం
చితమతితో సఖిద్వయము ♦ చేరికఁదా శివుఁజేరి భూమిభృ
త్సుత పరిచర్య సేయుఁ బ్రమ♦థుల్ శివునానతి నాఁపరాపెనన్. 291

ఉ॥ పర్వతరాజసూక్తి యెడ ♦ భర్గుఁడు గౌరవభావముంచి య
ప్పార్వతితోడ నిట్టులనె ♦ బాలిక! నీవిఁక నీసఖిద్వయిన్
హర్వుఁగఁ దోడుగాఁ గొని మ ♦ దంతికభూమికి వచ్చి భక్తిమేల్
పర్వఁగ సేవఁజేసి చను ♦ ప్రత్యహమున్ వెఱపొంద కింతయున్.

ఆ॥ ఇట్లుచెప్పి శివుఁడు ♦ హిమగిరికన్యకా, సేవ నిర్వికార ♦ చిత్తుఁడగుచుఁ
జేకొనుచు వసించె♦జిత్రమౌ విఘ్నంబు, తెరవుఁజెంది యట్టి ♦ తెరవుఁజొరఁడు.

క॥ కొండలదొర డెందంబున, నిండగు మోదంబునొంది ♦ నిలయంబునఁ దా
నుండెఁ బ్రియంబున జగదీ, శుండట స్వాత్మమును గనుచు ♦ శోభిలెమిగులన్.

ఉ॥ కాళి సఖిద్వయిన్ జతగఁ ♦ గైకొని నిత్యము చంద్రశేఖరున్
వేళకుఁజేరి తత్పదవ ♦ నేజము లభ్రధునీజలంబునన్
క్షాళనచేసి యర్ఘ్యనర ♦ సంబును గ్రోలు విశుద్ధవిస్ఫుర
చ్చేలముతోఁ దడిన్ దుడుచుఁ ♦ జెన్నుగఁ బూజలొనర్చు సద్విధిన్.

ఆ॥ మరల మరల మ్రొక్కి ♦ మానుగ నిత్యమి, బ్భంగి ధీయుఁడై త ♦ పంబుసేయు
శంకరుని భజించి ♦ శైలేంద్రకన్యక, మగుడఁజేరుఁ దండ్రి ♦ మందిరంబు. 296

వ. ఇట్లు చిరకాలంబు గడచినంత శివసన్నిధానంబందు శివునిఁజేరి.

సీ॥ ఒకనాఁడు కాళిక ♦ సఖియలతోఁ గూన, మొనరించెఁ గామవ ♦ ర్థనముగాఁగ
ఒకనాఁడు కుశసమి ♦ ద్వికచసుమంబుల, స్వయముగాఁదెచ్చి య ♦ ర్పణముచేసె.
ఒకనాఁడు పుష్పమా ♦ లికల నాశ్రమమెల్లఁ, బొంకంబుగాఁ దా న ♦ లంకరించె.
ఒకనాఁడు శివునిఁదా ♦ నొంటిమై ఱెప్పవే, యక చూచి కడువిస్మ ♦ యంబుఁజెందె

గీ॥ అంతశివుఁడును నొంటిమై ♦ నపుడు తనదు, మ్రోలనున్నట్టి యాజగ ♦ న్మోహనాంగిఁ
గనియు భూతతనువున నొ ♦ ప్పినదటంచు, దారగా గ్రహియింపఁగఁ ♦ దలఁపకుండె.

వ. మరలఁ గొన్నినాళ్ళ కమ్మహాదేవుండు.

గీ॥ సంయతేంద్రియుఁడై తన ♦ చరణసేవ, నంబె మదిఁబూనియున్నన ♦ న్నగకుఁ దండ్రి
పుత్రినారసి కడుకృపా ♦ పూర్ణమతిఁ ద, లంచె నెమ్మనమందు నీ ♦ లాగుగాను.

క॥ ఎపుడు గరువంబుఁ బోవిడి, తపమున్ సలుపంగఁదొడఁగు ♦ తన్వీమణి దా
నపు డేనును దడయక లో, లుపమతిఁ బెండ్లాడువాఁడ ♦ లోలాక్షినిటన్. 299

ఉ॥ ఇప్పగిదిన్ దలంచి జగ ♦ దీశ్వరుఁడంతనె ధ్యానయోగ మ
ల్లెప్పటియట్టులొంది మది ♦ నెట్టివిచారము నొంద కెంతయున్
దప్పక సేవఁజేయు వసు ♦ ధాధరరాజవరేణ్యకన్య దా
నెప్పుడు చూచుచుండియు న ♦ దేమొకొ చూడనియట్టులుండెడున్. 300

క॥ గిరిజ యనుదినము శివునకుఁ, బరిచర్య నొనర్చుచుండి ♦ బాగుగ నతిభా
స్వరమైన శివునిరూపం, బుజువుగఁజూచుచు మనమున ♦ నువ్విళులూరున్.

వ. అంతఁ గొంతకాలం బిట్లు చనినంతఁ దారకాసురబాధితులైన సురలు పరమేష్ఠి యనుమతంబునఁ బార్వతీ పరమేశ్వర సమ్మేళనంబునకై పచ్చవిలుతుంబుత్తెంచ నతండు పరమేశ్వరు కంటిమంటన్ గరంగుటన్ గాంచి పార్వతిగర్వంబు దొఱంగి ఘోరంబగు తపం బొనరించినంత శివుండు సంతుష్టుండై వివాహం బాడె ననిన విని సూతునకు శౌనకాదు లిట్లనిరి. 302

సీ॥ తారకాసురుఁ డెవ్వఁ డు ♦ దారబలము, వాని కెట్లులభించెఁ? ను ♦ పర్వ లెట్టు
లంతకాంతకు మీఁదికి ♦ నలరువిల్తుఁ, బంపి రెట్టుల నాతండు ♦ పయనమయ్యె.

క॥ ఎఱిఁగింపుము చక్కఁగ నిఁక, నఱుమఱ యెక్కింతలేక ♦ యనఘాత్మక! మా
యుఱవగు దగ యడఁగఁగఁ గ్రొ, చ్ఛఱ ఘనమకరందమధుర ♦ చారుతరగవీ.

వ. అనుటయు

శా॥ శ్రీరాజద్వరవర్ణినీసముదయ ♦ శ్రేణీప్రకర్షాఢ్య! వి
స్తారౌదార్యదయారసాబ్ధిహృదయా! ♦ శైలేంద్రజాశంకరా
ర్చారాజన్మధురాశయా! పతిహిత ♦ ప్రారంభసంరంభ! కా
శీరామేశ్వరముఖ్యతీర్థగమన ♦ శ్రీభోగభాగ్యోదయా! 305

గద్య. ఇది శ్రీ బుధజనవిధేయ ముదిగొండ నాగవీరేశ్వరనామధేయ
ప్రణీతంబైన శివపురాణంబందలి పార్వతీఖండంబునఁ
బ్రథమాశ్వాసము సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ





శ్రీ శివాభ్యాన్నమః

# శ్రీ శివపురాణము

## పార్వతీ ఖండము.

### ద్వితీయాశ్వాసము.



మల్లికాంబికాతను
జా! మృదుమధురప్రసంగ ♦ షట్కాలశివా
ర్చామోదమానసాబ్జ! స
భామాన్యా! యనఘ! వీర ♦ భద్రారాధ్యా!

వ. అవధరింపు మక్కథకుండు శౌనకాదిమహామునీంద్రుల కిట్లనియె. 2

—* సూతుఁడు శౌనకాదులకుఁ దారకాసురోదంతంబుఁ జెప్పుట *—

ఉ॥ సారసగర్భపౌత్రిఁ దధి ♦ శక్తి మరీచికుమారుఁ డాస్వయం
భూరుచి కశ్యపుండు పద ♦ మూఁగుర దక్షునియాత్మజాతలన్
బేరిమిఁ బెండ్లియాడ నటఁ ♦ బెద్దదియైన దితీభయమ్మున కా
భూరిబలుల్ హిరణ్యకశి ♦ పుండు హిరణ్యవిలోచనుండునున్. 3

ఆ॥ తనయులై జనించి ♦ ధాత్రియందెల్లెడ, దుఃఖకరులుగాఁగఁ ♦ దొడరనపుడు
హరి నృసింహసూక ♦ రాకారముల వారిఁ, బట్టిచంపె విబుధ♦పఙ్క్తులలర. 4

చ॥ దితియును ఘోరదుఃఖమున ♦ దీనతఁజెంది నిజాత్మనాథు సం
చితమతిఁ గొల్చి చూలుఁగొన ♦ జిష్ణుఁడెఱింగి తదీయగర్భము
ద్ధతిఁ గులిశప్రయోగమున ♦ నంతనె వ్రయ్యలు చేసినన్ మహో
న్నతమగు కాశ్యపాంశ మది ♦ నాశముగాక తనర్చె నెంతయున్.

సీ॥ నిదురఁబోవుచున్నయ♦న్నెలఁతకొక్క, నాఁడుదైవికయోగంబు ♦ నన్మరుత్తు
లనెడుపేరునఁ బెక్కురు♦తనయు లుద్భ, వించి నాకముఁజేరి సే♦వించిరింద్రు. 5

క॥ అం దింద్రునియనుమతితో, డం దిరముగ వారలుండు ♦ టనుజూచి కడున్
వందురి దితిసుందరి దిరు, గం దనవిభుఁజేరిచెప్పి ♦ కలవిధమెల్లన్. 7

గీ॥ మరలగర్భంబుఁగోరియు ♦ మ్మగువమగని, వేడఁగా నతఁడిట్లనె ♦ వెలఁది! వినుము
పదియువేలేండ్లు రాజీవ ♦ భవునిఁగూర్చి, పావనాత్మకవై చేయు ♦ పరమతపము. 8

క॥ ఆరీతి నల్పఁగా సుతుఁ, డోరమణీ! నీకుఁ బొడము ♦ నుజ్జ్వలగాత్రుం
డారూఢవిక్రముఁడు జగ, దారాధ్యచరిత్రుఁ డొకరుఁ ♦ డవుడు హితముగాన్.

## —* వజ్రాంగుని యుత్పత్తి *—

ఆ॥ ఇట్లు కఱపి పంప ♦ నిందీవరాక్షి దా, న త్తెఱంగు తపము ♦ నాచరించి
వచ్చివిభునిఁగొల్చి ♦ వరుస వేఁకటిదాల్చి, సుతునిఁగనియె నొకని ♦ సురుచిరాంగు,

క॥ అతఁడు వజ్రాంగుండని, ఖ్యాతిన్ గొనె నాహ్వయంబు ♦ సార్థకతదగన్
జేతోమోదముఁగనె దితి, యాతంకముఁజెంది కుంది ♦ రమరులు పెలుచన్. 11

వ. ఇట్లు దినదినప్రవర్థమానుండై యతండు నిజజననీశాసనంబునన్ జేసి యొక్కనాఁ
డేకరథమ్ముతో నాకమ్మునకేగి. 12

## —* వజ్రాంగుని విజయము *—

చ॥ కదిసి మహేంద్రు నాహవము ♦ ఖమ్మునఁబట్టి సురల్ గలంగఁ దో
ర్మద మెడలించి బిట్టలుక ♦ మైకొని బెట్టిదమైనశిక్షఁ బెం
పొదవఁగఁజేసి నిర్జరస ♦ మూహముతోఁ జెరపెట్టి యార్చె న
య్యదనున వాసవవ్యసన ♦ మారసి యాదితి చెందె మోదమున్, 13

గీ॥ దేవతలు చాలదీనులై ♦ తీవ్రదుఃఖ, భరముఁజెందిరి తత్సుతుల్ ♦ బహులశోక
సాగరంబున మునిఁగిరా♦చంద మెఱిఁగి, కమలజుఁడు కశ్యపునితోడఁ ♦ గదలివచ్చి.

క॥ సామోక్తుల వజ్రాంగుని,తో మానసమలరఁ బల్కి ♦ దుర్హిణుండల సు
త్రాముని దివిషచ్చక్రము, తో మగుడన్ విడువఁజేసెఁ ♦ దోరంపుదయన్. 15

వ. అంత శివభక్తాగ్రగణ్యుండును బరిశుద్ధాంతరంగుండును నిర్వికారుండును నిత్య
సంతుష్టుండును నగు వజ్రాంగుం డట్లు ధాత యనుమతిన్ బురుహూతాది
సకలాదితేయులన్ విడిచిపుచ్చి యత్తాత కిట్లనియె. 16

మ॥ పరమేష్ఠీ! విను మీ బిడౌజుఁడు మహా ♦ పాపిష్ఠుఁ డెట్లీతనిన్
గరుణన్ గాంచితి వస్మదీయజననీ ♦ గర్భస్థతేజంబుఁ దెం
పరియై వ్రయ్యలుచేసె స్వార్థపరుఁడై ♦ మాతల్లియుల్లంబు పం
దురఁజేసెన్ బలుమార్లు నద్ది గుడిపెన్ ♦ దుఃఖంబు నిక్కం బిట్టుల్. 17

మ॥ తనరాజ్యంబును నేలుఁగాక యిఁక నీ ♦ తండ్రిప్డు లోకేశ! మ
జ్జననీశాసన మొంది యివ్విధము శి ♦ క్షన్ జేసితిన్ నీవు నా
జనకుండున్ జను డెంచి యివ్విధము యా ♦ చ్ఞన్ సల్పఁ గాదందు నే
ధనలోభంబునఁ జేయలే దిటులఁ ద ♦ థ్యం బిద్ది భావింపుమా! 18

ఉ॥ ఒల్లను దారహారముల ♦ నొల్లను రత్నవిభూషణంబు లే
నొల్లను వాహనప్రకర ♦ మొల్లను రాజ్యము భోగవైభవం
బొల్లను దేవ! తత్త్వమది ♦ యొక్కటి గోరెదఁ జెప్పుమయ్య! తా
నెల్ల సమస్తదుఃఖముల ♦ నేపునఁబాపి సుఖం బొసంగునో. 19

చ॥ అదివిని పద్మజుండు హృద ♦ యంబున నూరటఁజెంది సత్త్వసం
పదరహిఁ జెందె నీతఁడిఁక ♦ భామిని వీనికి నే సృజింతు నం
చెదను దలంచి యట్టె సృజి ♦ యించి వరాంగి యనాఁగ నుగ్మలిన్
ముదమున నిచ్చి యద్దితిజ ♦ ముఖ్యుని పెండిలిచేసె వాసిగన్. 20

వ. అనంతరం బక్కాంచనగర్భుండును గశ్యపుండును దమనివాసంబుల కరిగి రిట వజ్రాంగుఁడును దామసభావంబులేక సాత్త్వికాంతఃకరణుండై యెల్లరతో నిర్వైరంబుగ సుఖంబుండె, వరాంగి వల్లభునితోడఁ గూడియుండియు సాత్త్విక భావంబు నొందక సకామయై వివిధోపచారంబులఁ బెనిమిటి నారాధించుచుండె.

సీ॥ అంతవజ్రాంగుఁ డెంతయుఁ ♦ గాంత సేయు, సేవలన్ గడుప్రీతుఁడై ♦ చెలువఁగాంచి
పలికె నాతోడఁ దెల్పు శం♦పాలతాంగి!, నీ మనోరథ మీడేర్తు♦నిక్కముగను.

మ॥ అనినన్ వేగ వరాంగి దాని మహా ♦ హ్లాదంబుతో మ్రొక్కి యి
ట్లనె దేవా! కరుణించెదేనిఁ దనయున్ ♦ బ్రాంచద్బలున్ బాకశా
సనదుఃఖప్రదు లోకజిత్వరుఁ బ్రశ ♦ స్తశ్రీయు నాకద్దునన్
జనియింపన్ బొనరింపు మట్లయిన నే ♦ సంతోషమున్ జెందెదన్. 23

క॥ అనియడుగఁ బ్రియావాక్యం, బునువిని యక్కజముఁ జెంది ♦ పురుషశ్రేష్ఠుం
డును జ్ఞానియునగు నతఁ డి, ట్లనికొనియెన్ మానసంబు ♦ నం దాకులుఁడై

ఉ॥ కోరుము నీదువాంఛితము ♦ కోమలి! నే నొడఁగూర్తు నంచుఁ ద
ద్వారయ కేనుబల్కితి వ ♦ రాంగి సురావళితో విరోధమున్
గోరినచించె నట్టులొనఁ ♦ గూర్చిన లోకము లార్తిఁజెందు నే
నేరక తెచ్చుకొంటి నని ♦ నీతుఁడనై యిటుఁబొవ హేతువున్. 25

ఉ॥ కాదని యిప్డు మీఱుటది ♦ కర్జమె దోసముగాదె యెక్కడన్
బోదు నెటుల్ పొనర్తు నెటుఁ ♦ బోయిన ధర్మవిరుద్ధమార్గ మిం
దేది హితేతరంబు హిత ♦ మెయ్యదియంచు విచారసాగరం
బీదుచుఁ గొన్నినాళ్ళిటుల ♦ నే కడపెన్ గడు భీతచిత్తుఁడై. 26

గీ॥ అంతఁ బరమేశ్వరేచ్ఛ చే♦నతఁడుదార, హితమునే చేయఁదలఁచి భూ♦యిష్ఠతపము
నజునిఁగోరి యొనర్ప న♦య్యలఘుఁడెదుర, నిలిచి నీ యీప్సితంబెద్ది ♦ తెలుపుమనిన.

శా॥ ఆవజ్రాంగుఁడు పద్మజుం గని మహా ♦హర్షంబునన్ మ్రొక్కి నా
నావేదోక్తుల సన్నుతుల్ సలిపి వా ♦ గ్నాథా! మదీయాంగనా
భావారూఢునిఁ బుత్రు నిమ్ము త్రిజగ ♦ త్ప్రఖ్యాతవిక్రాంతుఁ దే
జోవిద్యోతితదిగ్వితాను సుతప ♦ స్స్తోమాభిరామాత్మకున్. 28

గీ॥ ఇట్లుగోరిన విని పర ♦ మేష్ఠి యట్టు, లగునుగాకని పలికి ని ♦ జాత్మయందుఁ
దలఁతుఁగొని శివునెంతయుఁ♦దలఁచి కొలిచి, చనియె వేగంబుగానిజ♦సదనమునకు.

—* తారకాసురుఁడు పుట్టుట *—

ఉత్సాహవృత్తము॥ అంతఁ దా వరాంగి గర్భ ♦ మంది సంతసమున భా
స్వంతమైన తేజమొంది ♦ చాలకాలమేగ రా
త్ర్యంతమందు నర్కుఁబోలె ♦ నతిశుభంపువేళ నా
కాంత గనెఁ ద్రిలోకశూరుఁ ♦ గాఁ గుమారు నుజ్జ్వలున్. 30

వ. అయ్యవసరంబున.

సీ॥ వసుమతి వణఁకెఁ బ♦ర్వతవనంబుల తోడ, దిశలందు జ్వాలలెం ♦ తేనిఁదనరె
తోయదప్రకరంబు ♦ పూయవర్షము నించె, నుప్పెనల్ చెలరేఁగె ♦ నుదధులందు
నుడిగాడ్పు రేఁగి యె♦క్కుడురజంబులఁగుప్పె, గొప్పమానులు పెల్లు♦గూలెఁబుడమి
పరివేషములు ప్రభా ♦ కరచంద్రములఁజుట్టె, నిర్ఘాతపాతముల్ ♦ నెగడెమిగుల

గీ॥ శునకముల్ దలలెత్తి రో♦దనముచేసె, గుడ్లగూబలు నక్కలు ♦ గూసెఁ బసులు
కారణంబించుకేని లే♦కయె రయమున, వదలె మూత్రపురీషముల్ ♦ బెదరి బెదరి.

క॥ ఇటుల మహోత్పాతములు, త్కటముగ నపుడుప్పతిల్లఁ ♦ గని మూఢజనుల్
పటుతరవిప్లవమేదో, ఘటిల్లెనని మనసులందుఁ ♦ గాంచిరి కలఁతన్. 32

గీ॥ అపుడు కశ్యపసహితుఁడై ♦ యబ్జభవుఁడు
వచ్చి తారకుఁ డనుచు నా♦హ్వాయమొనర్చె
బాలునకు; బాలుఁడట మీఁద ♦ వరుసతోడఁ
గొండవలె దృఢకాయుఁడై ♦ గొప్పఁజెందె. 33

వ. అంతఁ గొంతకాలంబు చనినంత.

గీ॥ తారకాసురుఁ డపుడు శా♦త్రవజయంబుఁ, బడయఁ దపసొనరింపఁగాఁ ♦ గడఁగి తల్లి
సెలవుఁగొని మధువనభూమిఁ♦జేరి భూరి,తపముఁజేయఁగఁ దొడఁగెధా♦తను గురించి.

## —* తారకాసురతపోవర్ణనము *—

సీ॥ ఒకయంఘ్రి నిలిపి బా♦హువులంబై కెత్తి దిఁ, నేందు ర్గనుచు నూ♦ఱేండ్లుగడపి
పూనిపాదాంగుష్ఠ ♦ మున నే నిలిచి యర్కు, యినుని గన్గొనుచు నూ ♦ ఱేండ్లుగడపి
ఒకచేతనే నేల♦నొంది తాఁ దిలకింపు, లెగసి దర్పమున నూ ♦ ఱేండ్లుగడపి
ద్రుమశాఖఁ బాదద్వ♦యమున నాలంబన, మొసఁగఁ గావించి నూ ♦ ఱేండ్లుగడపి
గీ॥ ఇల ననలమధ్యమందు నూ♦ఱేండ్లుగడపి, యెలమి జలమధ్యమందు నూ♦ఱేండ్లుగడపి
యనువుగా ధృఢచిత్తుఁడై ♦యనిలభక్షు, ణంబు సేయుచు నతఁడు త♦పంబు సలిపె.

ఉ॥ ఉగ్రతపంబు నిట్లు నియ ♦ మోద్ధతిఁ జేయఁగ నప్డు వానిశీ
ర్షాగ్రమునుండి యగ్నులు ర♦యంబున వెల్వడి చుట్టి మేదురో
దగ్రతరార్చులన్ భువన♦దాహముచేయఁగడంగఁగా నిలిం
పాగ్రణులెల్లఁ జేరిరి భ♦యాతురులై పరమేష్ఠిలోకమున్. 36

చ॥ చని విధిఁగాంచి మ్రొక్కి కడు ♦ సంస్తుతులన్ బొనరించి దైత్యవ
ర్యుని ఘనతాపసవ్రతమ ♦ హోన్నతిఁ దెల్పి తదీయతాపవే
దన భువనంబు లన్నియును ♦ దగ్ధము కాఁగలవంచుఁ జెప్పి గొ
బ్బునఁ గరుణించి ప్రోవుమని ♦ ప్రోవుగఁ బల్కిరి యుల్కనన్ సురల్. 37

గీ॥ అనిన విని పద్మసంభవుం ♦ డాదరమున, దైవతారి యుదంతమం♦తయును మంత
నమునఁజింతించి వేలుపు♦గములఁ బంచి, యసుర యున్నెడ కరుదెంచి♦యనియెనిట్లు.

## —* బ్రహ్మదేవుఁడు తారకాసురునకు వరంబు లిచ్చుట *—

ఉ॥ తారక! నీతపోవ్రత ము♦దారతరం బది మెచ్చి నీకిటుల్
కోరిక లీయ వచ్చితిని ♦ కోరఁగరానివటంచు లేవు నీ
వారసి తెల్పు మీప్సితము ♦ లన్ని యొసంగెద నన్న ధాతతో
భూరిముదంబునన్ దనుజ ♦ పుంగవుఁ డప్పుడు మ్రొక్కి యిట్లనెన్. 39

తరల॥ సకలలోకవిధాత! నీవు ప్ర♦సన్నభావముఁ జెంద వే
ఱొకటి దక్కవయుండునే వర ♦ మొంద నేఁ దగియున్నచో
సకలనిర్జరరాజిఁ గెల్వఁగ ♦ శక్తి నిమ్ము పురారి క
ర్భకుఁడు గల్గినఁ జంపుఁగాక దు♦రంబునం దురుశక్తిచే. 40

వ. అనుగ్రహించి నాకీ రెండువరంబు లిమ్మని యడిగినఁ బితామహుండు తథా
స్తని యొసంగి నిజధామంబున కరిగె — తారకుండును నిజపట్టణంబగు శోణిత
పురంబుఁ బ్రవేశించి దైత్యగురుండగు భార్గవునియనుమతితో సుముహూర్తంబు
నందుఁ ద్రిలోక రాజ్యపట్టాభిషేకంబుఁ జెందె. 41

## —* తారక దిగ్విజయము *—

శా॥ అంతన్ దానవభర్త సర్వవిజయం ♦ బాసించి నాకంబు వి
క్రాంతిన్ జేరి పురందరున్ గడిఁది సం ♦ గ్రామంబునన్ గెల్చి దు
ర్దాంతస్ఫూర్తి సమస్తనిర్జరుల శౌ ♦ ర్యం బూడ్చి నిర్జించి ని
శ్చింతన్ వారలచే నుపాయనములన్ ♦ జెందెన్ మహోత్సాహుఁడై. 42

సీ॥ ఐరావతం బిచ్చె ♦ హరిహయుం డడలున, నవనిధు లొసఁగెఁ గి ♦ న్నరుల తేఁడు
వరుణుండు దివ్యాశ్వ ♦ వర్గంబు లిచ్చెను, నుచ్చైశ్శ్రవంబుఁ బొ ♦ ద్దిచ్చెఁ దలఁకి
కామధేనువు నార్ష ♦ గణము సమర్పించెఁ, దొగలవిం దమృతమి ♦ మ్మగ నొసంగె
వసుమతి యొసఁగె సు ♦ వర్ణసస్యంబుల, రత్నంబు లిచ్చె సం ♦ ద్రములరాజు

గీ॥ ఇప్పగిది నెల్ల రలుకున ♦ నిచ్చునట్టి, వస్తువాహనములఁ గొని ♦ వైభవమున
సకలలోకము లేలఁగా ♦ శలము మెఱయఁ, దారకుండు సురశ్రీవి ♦ దారకుండు.

మ॥ ఒకనాఁ డచ్యుతుఁ గెల్వఁగాఁ దలఁచి పే ♦ రుత్సాహ మొప్పంగ సై
నికవర్గంబులతో వడిఁజని ఘనా ♦ నీకంబునన్ దీవ్రసా
యకజాలంబులఁ గేశవున్ బొదువఁ బ ♦ ద్మాక్షుండు రుష్టాత్ముఁడై
ప్రకటోదగ్రకఠోరధారమగు చ ♦ క్రం బేసి యార్చెన్ గడున్.

క॥ చక్రం బట్లేసిన ని, ర్వక్రింబుగ నేగి దాన ♦ వప్రభునఱుతన్
విక్రమముదక్కి సుమహో, రక్రియఁ జెలువొందె దైత్య ♦ రాజి యలరఁగాన్.

గీ॥ అంత శ్రీకాంతుఁ డక్కజ ♦ మంది వైరి, జయము మదినెంచి తత్కాల ♦ సముచితముగఁ
దారకునకు విధేయుఁడై ♦ తగుల మెసఁగఁ, బలికి నిజపురి కనిపె ను ♦ పాయమునను.

## —* దే వ తా పీ డ న ము *—

గీ॥ తారకాసురుఁ డపుడు శా ♦ త్రవజయంబుఁ, బూర్తిగా నొంది వేల్పుల ♦ నార్తి పెట్టి
యెల్లజగములఁ దనయాజ్ఞ ♦ చెల్లునట్లు, చేసి భోగంబులను బెల్లు ♦ చెందుచుండె.

వ. అంత దేవతలందఱు పరాజితులై తారకాసురుని దాస్యంబుఁ జెంది యెల్లవేళల వానిఁ గొలుచుచుండిరి. 48

సీ॥ మారుతుం డిల్లిల్లు ♦ మార్జనం బొనరించుఁ, గలయంపిఁ జల్లును ♦ గాండభర్త
వైశ్వానరుండు మేల్ ♦ వంటకం బొనరించు, రక్షకభటుఁడై ప ♦ రంగు జముఁడు
ఆశ్వినేయులు గొల్తు ♦ రమరిక వెజ్జులై, బొక్కసంబులఁ బెంచు ♦ జక్కులదొర
తుంబురుం డొనరించుఁ ♦ దోరంపుగానంబు, నాట్య మచ్చరలు షా ♦ సర్తురరసి

గీ॥ అనుదినం బినుఁ డర్హమా ♦ నట్టులెండ, గాయు రేఱేఁడు నట్టులే ♦ కర్జమెఱిఁగి
వెన్నెలలునించు నిందు ♦ విధముఁ దెలిసి, వానగురిపించు దైతేయ ♦ వరునకదరి.

—* దేవతలు బ్రహ్మదేవునకు దమయార్తిఁ జెప్పికొనుట *—

సుగంధి॥ చాలఁగాలమిట్లుఁ సేవ ♦ సల్పి వేల్పు లెల్లరున్
జాలినొంది డీలుఁజెంది ♦ సత్యలోకమేగి యం
దోలగంబునందుఁ గాంచ ♦ నోదరున్ బ్రపన్నులై
చాలభక్తిఁ జేరి మ్రొక్కి ♦ సంస్తుతించి రెంతయున్. 50

చ॥ నలినజుఁడప్డు వారల మ ♦ నస్స్థితి నారసి గారవంపు పెం
పలరఁగ నిట్టుఁబల్కె హృద ♦ యంబుల నెవ్వగఁజెందియున్న య
ట్టుల మదిఁదోఁచెఁ దాఁచక యి♦టుల్ చెప్పుఁడయ్య నిలింపులార! మీ
యలుకఁ దొలంగఁజేయు విత ♦ మారసెదన్ జఁడి యెల్లభంగులన్. 51

గీ॥ అనిన దేవతలనిరి మ ♦ హాత్మ! నీకు, గోచరం బెట్లుగాదొకో ♦ గురుతరవ్య
థావిపన్నులమగు మాయ♦దంతమంత, యకట! తారకహేతుకం♦బై యలంప.

ఉ॥ తారకుఁడట్లు నీకడ ను ♦ దారవరంబులఁ జెంది వీరల
క్ష్మీరమణీయవైభవవి ♦ శేషవిజృంభితదివ్యశక్తి బృం
దారకబృందముం గెలిచి ♦ నాకము మున్నగుచోట్లనెల్ల ది
వ్యారుల ధీరులన్ నిలిపి♦ యార్తులఁజేయుచునుండె మమ్మిటుల్. 53

ఉ॥ ఏమనిచెప్పవారమిఁక ♦ నేనములే కలవాఁడు సేయు నా
బాములు పద్మసంభవ! సు ♦ పర్వులమెల్లర మొగ్గమాలి మా
దీమసమెల్లఁ గోలుపడి ♦ దేబెలమై కడుఁ దుచ్ఛపుం బనుల్
మే మొనరింపుచుంటిమి య♦మిత్రున కుల్కున రాతిరింబవల్. 54

చ॥ కటకట యెట్టులోర్తు మొడి ♦ కమ్మున సేవ లొనర్చుచున్న న
క్కుటిలుఁ డిఁకెద్దియేని యొక ♦ కూడనికార్యముసెప్పి గొప్ప సి
ల్గట నొడఁగూర్చు నెందయిన ♦ నందకపోవుదమన్న గుండెలే
దెటులనొనర్తు మెందుఁజరి ♦ యింతుము చెప్పుము లోకనాయకా! 55

ఉ॥ ముప్పదిమూడుకోట్లు సుర ♦ పుంగవు లర్వదికోటు లచ్చరల్
గొప్పమునీశ్వరుల్ నరులు ♦ ఘోరఫణాధరశేఖరుల్ నెఱిన్
దప్పక తారకాసురుని ♦ దాస్యముసేయుచు భీతచిత్తులై
యెప్పటికప్పుడే గడుప ♦ నెంతురు కాలము కంజసంభవా! 56

ఉ॥ లేవు ధరిత్రి జన్మములు ♦ లేవు వ్రతంబులునున్ దపంబులున్
లేవు నవగ్రహార్చనలు ♦ లేవు యథోచితదానధర్మముల్
లేవు సుఖప్రసంగములు ♦ లేవు శుభక్రియ లెందునేనియున్
లేవిటుఁ గావలుండగు ని♦లింపవిరోధి కతమ్మునన్ విభూ! 57

ఉ॥ ఇందఱు మిట్లు సర్వభువ ♦ నేశ్వర! తారకపావకార్చులన్
డింది కడున్ బొకారుచును ♦ నీదరిఁజేరితి మిప్డు డీ వుపే
క్షం దలపెట్టి చంపెదవొ ♦ క్రిన్నన జాలిఁదలంచి మన్పెదో
వందనముల్ ప్రభూ! సురల♦వైశము గట్టులఁజేర్పు మెట్టులేన్. 59

గీ॥ సకలరాక్షసలోకశి ♦ క్షాచణంబు, నిఖిల సుర ముని సజ్జన ♦ నికరరక్ష
కంబునై యొప్పువిష్ణుచ ♦ క్రంబు తార, కాసురునికంఠమునఁ బుష్ప♦హారమయ్యె.

క॥ ఆ పాపాత్ముని మంత్రులు, పాపతములు క్రొంచముఖులు ♦ పటుబాహుబలా
టోపమునఁ గూర్చునాపద, లోపఁగ వశమానె కాంచ♦నోదర! మాకున్ 60

క॥ మించిన దయామతిన్ బో, షించిన నీవే దురంత ♦ చింతాజలధిన్
ముంచిన నీవే దిక్కని, కొంచక వచ్చితిమి నెనరు♦గూర్పుము తండ్రీ! 61

గీ॥ సన్నిపాతమహావ్యాధి ♦ సంప్రకోప, మందు మందులు వమ్మగు ♦ మాడ్కి నస్మ
దీయయత్నంబులెల్లనై ♦ తేయవిభుని, యందు వితథమయ్యె నకట! యే♦మందుమనఘ.

ఉ॥ కన్నుల బాష్పముల్ దొరఁగఁ♦గా నమరోత్తములెల్ల నిట్టు లా
పన్నతఁ బొక్కుచున్ దమ వి♦పన్నతఁదెల్ప ననల్పదుఃఖసం
పన్నమనంబుతో నజుఁడు ♦ వారల గోడవుడాలకించి యా
పన్నతకంధరుండయి వి♦చారముచూపి యొకింతసేపటుల్. 63

గీ॥ వేల్పులనుజూచి మీరిట్లు♦వెఱవఁదగునె, కాలమొకరీతిగానుండఁ ♦ గలదె యెందుఁ
గడఁగిచీఁకటి గొన్నాళ్ళు♦గానుపింప, వెన్నెలవెలుంగు వెనువెంట♦వేగిరముగ.

ఉ॥ నేన యొసంగినాఁడ రజ♦నీచరనాథున కవ్వరంబు న
ద్దానవుఁడేచి మీకిటులఁ ♦ దాపముసేయుటఁ జూడఁగాఁ గడున్
మానసమెంతొ నొచ్చె నిది ♦ మంచిదె? సాధులఘోష పాటిగా
వానికిఁ జేటుదెచ్చు నిఁక ♦ వందురఁ జెందకుఁడిం డకల్మషుల్! 65

ఉ॥ వానితపంబు లోకము ల ♦ వారణరీతి దహించుచుండఁగా
నేనటులీయకొంటిఁ బర♦మేశ్వరుఁ డాత్మజుఁ గాంచునేని య
ద్దానవు నుగ్రయుద్ధమునఁ ♦ దాఁకి వధించు నతండు గాక య
వ్వాని జయింపలేరొరులు ♦ వారిజలోచనుఁడేని శర్వుఁడేన్. 66

**—* బ్రహ్మదేవుఁడు కుమారజన్మార్థమై యుపాయంబు చెప్పుట *—**

గీ॥ మున్ను దక్షాధ్వరంబున ♦ మూర్తిఁబాసి, సతి జగదంబ దా నిపు ♦ డద్రిరాజ
దారగర్భంబునన్ బుట్టి♦తనరె శివుఁడు, తపముసేయఁగ హిమగిరిం♦ద్రమును జేరె.

చ॥ శివునకు సేవఁజేయుటకు ♦ శీతగిరీశ్వరుఁ డాత్మపుత్రియౌ
శివను విధించె నాపెయును ♦ సేవయొనర్చుచునుండె నిత్యమా
భవునకుఁ బర్వతాత్మజను ♦ బన్నుగఁగూర్చినచోఁ గుమారుఁడు
ద్భవమగు దాన మీపెతలు ♦ వాయు సుఖంబొనఁగూడు రూఢిగన్. 68

ఆ॥ ఇదియె చక్కనైన♦హితమార్గ మొండిఁక, లేదు వేఱు తెరువు♦లేఖులార!
కడఁగివీరలట్టి♦కార్యంబుఁగూర్పఁగాఁ, బూనిరేనిమీకుఁ ♦ బొసఁగు శుభము. 69

గీ॥ తారకునకేను మేలట్లు ♦ దనరఁజేసి, యిప్రుడు నేఁ గీడుసలుపుట ♦ హితముగాదు
విసపుమ్రాఁకైననున్ బెంచి♦విఱుగఁగొట్టఁ, దగదు మూర్ఖునకేని యు ♦ దారులార!

ఉ॥ ఇంకను నేను దారకున ♦ కెంతయు మంచి తెఱంగుఁజెప్పి యీ
వంకర లెల్లమాని త్రిది ♦ వంబు సుపర్వులకిచ్చి భూమిపై
హంకృతి లేకయుండుమని ♦ యారసి బుద్ధులు సెప్పివచ్చెదన్
బొంకమువీఁడ మీరిఁకను ♦ బోయి రయొనర్పుఁడు తత్ప్రయత్నమున్. 71

చ॥ అని యిటు వేల్పులన్ బనిచి ♦ యాతఁడు తారకుపాలికేగి మ
న్ననలను వానిచేఁ బడసి ♦ నాకము లేఖులకిచ్చి సంతసం
బొనరఁగ శోణితాఖ్యపురి ♦ నుండి జగంబులనేలు మట్టులే
ననయము నీకు శ్రేయమగు ♦ నాయమరోత్కర మొందు నూఱటన్. 72

క॥ స్వారాజ్యంబేలుట నీ, కోరిన యదిగాదు నీవు ♦ గోరిన వరమున్
మీఱక యిచ్చితి జుట్టన, జూరఁగ నీకఁ దనివిఁగొను మ ♦ సురవర! దీనిన్.

సీ॥ ఇట్లొడంబడఁజెప్పి తా ♦ నేగె నజుఁడు, స్వర్గమా యసురేంద్రుఁడ♦ప్పటికి విడిచి
శోణితపురంబుఁజేరి య ♦ చ్చోటనుండి, సర్వలోకంబు లేలె ని ♦ ష్కంటకముగ.

—— * ఇంద్రుఁడు మన్మథుని రప్పించుట * ——

మ॥ సుర లోక్యంచుకఁ దెప్పరిల్లి సురరా ♦ జన్ జేరఁగాఁబోయి యా
దర మొప్పన్ బరమేష్ఠి సెప్పిన యుదం ♦ తంబంతయున్ జెప్పి ముం
దటి కార్యంబునకై త్వరన్ సలుప సు ♦ త్రాముండు వాచస్పతి
త్వరితాదేశమునన్ దలంచె మదిఁ గం ♦ దర్పున్ గడున్ బ్రీతితోన్. 75

చ॥ తలఁచినతోడఁ బచ్చవిల్తుఁ ♦ డాట గరంబు ముదంబుతో మధున్
బిగిఁ రథంబు నాయితమొనర్చి ♦ [illegible] రతీశ [illegible]
[illegible] గోయిలంకలును ♦ [illegible]
బలరఁగఁ దేరినెక్కి త్రిద ♦ శాలయభూమికి వచ్చె పొచ్చగన్. 76

క॥ ధార్మికనిలయంబైన సు, ధర్మకు దగఁజేరి దేవ ♦ తలతోఁ ద్రిజగ
చ్ఛర్మంబు నరయు నింద్రుని, నిర్మలమతిఁ జేరి మ్రొక్కి ♦ నిలిచి యిటులనెన్.

గీ॥ ఏల నన్ దలఁచితివి మ♦హేంద్ర! యేమి, పనిపొసంగెను నాతోడఁ ♦ బలుకు నీదు
సెలవుశిరమునఁదాల్చి నేఁ♦ జేయువాఁడ,నీదుకార్యంబుఁదడయక ♦ నిక్కముగను.

## —* ఇంద్రుఁడు మన్మథునకు దేవకార్యంబుఁ దెలుపుట *—

మ॥ అనఁ గందర్పునివాక్యమున్ విని మహా ♦ హ్లాదం బెదన్ జెంది య
ఘునుఁ బ్రీతిన్ గని నిర్జరేంద్రుఁడనియెన్ ♦ గాఁ హధ్వజా! మేలు మే
లనిశం బాప్తులకార్య మీవు నిజకా ♦ ర్యంబట్లు భావింతు వెం
దును నీయట్టి సఖుండుగల్గునె? దిశా ♦ స్తోమంబు గాలించినన్. 79

గీ॥ పుష్పసాయక! నీవు దం♦భోళియును మ, దీయ జయసాధకంబు లెం♦తేనియశని
కుంఠితంబగు నపుడెప్డు ♦ కొదవలేక, నీ వమోఘతేజస్వివై ♦ నెగడె దెపుడు. 80

ఉ॥ అక్కటనన్ రమాసుత! మ ♦ దాత్మసఖుండవు నీవు మాకటుల్
వెక్కసమైన దుఃఖ మది ♦ వేఁపుచునున్నది నీసహాయమున్
గ్రిక్కునఁజెంది యిక్కడిఁది ♦ కాఱియఁబాయవలెన్ గడంగి నీ
వెక్కువ మక్కువన్ గొని సు ♦ హృద్వ్యసనంబు హరింపఁగావలెన్. 81

శా॥ నీకన్నన్ బరుఁ డొక్కఁడిప్పనిని దా ♦ నిర్వాహమున్ జేయఁగా
లేఁడంటన్ భవదీయ విక్రమముఁ జె ♦ ల్మిన్ గోరి రావించితిన్
మా కీ యాపదయందు నేఁడుగడవై ♦ మన్పంగ నీభారమో
శ్రీకాంతాననపద్మభాస్కర! మహా ♦ శృంగారవీరాగ్రణీ! 82

శా॥ ఆపత్కాలమునందు నెచ్చెలిని ఘో ♦ రాజిన్ భటశ్రేష్ఠు రో
గాపన్నుండగునప్డు పెండ్లమును న ♦ త్యంతోపదుర్భిక్షమం
దో పేర్గొన్న వదాన్యశేఖరుని స ♦ త్యోక్తిన్ మహాసంకటా
టోపంబందుఁ బరీక్షసేయఁదగు న ♦ ట్టుల్ దల్తు రార్యోత్తముల్. 83

గీ॥ ఇప్పు డనివార్యమై మమ్ము ♦ నేఁచుచున్న, యీమహాసయంమ్ముఁ బ ♦ రీక్ష నీవుఁ
గాఁగలవుకాఁగలదు చెలి♦కాఁడ! జయము, సందియము లేదు సౌందర్య♦శౌర్యధుర్య!

గీ॥ అనిన నింద్రుని వచనంబు ♦ లాలకించి, పంచబాణుఁడు ప్రేమాను ♦ బంధపూర్వ
కముగ మొగమున లేనగ ♦ వమరనిట్టు, లనియె నత్తఱిఁ బృథ్వీధ♦రారితోడ. 85

ఉ॥ ఏల యిటుల్ వచించెద వ ♦ హీనపరాక్రమ! దీనికుత్తరం
బేల? యొనర్చుకార్య మది ♦ యే దెలుపన్ విశదంబుగాఁగ డ
చ్చీలనుగొట్టి కార్యమునఁ ♦ జేవరియుంకింతె నుఁ జూపకున్న న
వ్వాలనుమెచ్చునే? జగము ♦ వల్మలు మాటలిఁకేల నీకడన్. 86

క॥ విన నొకించుక విను నా, చేనగు కార్యంబు నీకుఁ ♦ జెప్పెదఁ బురుహూ
తా! నీవన మాశ్రమణముఁ, బూన నెనం దుగ్రతపముఁ ♦ బూనెనొ వానిన్. 87

క॥ క్షణమాత్రంబున మహిలే, క్షణాశ్త్రంబుఁ గట్టివేసి ♦ గాసి యొనర్తున్
రణరంగరిపువిదారణ, చణమగు కులిశంబదేల ♦ స్వల్పంబునకై. 88

చ॥ సురగరుడోరగప్రథిత ♦ శూరుల నేవియు సిద్ధసాధ్యకి
న్నరనరయక్షరాక్షసక ♦ నద్భుతశౌర్యులనేని శారదే
శ్వరకమలేశ్వరేశ్వరుల ♦ నైతము నాకవిలాసినీమదో
ద్ధురకుచశైలదుర్గముల ♦ దూఱఁగఁజేసెద వాసిఁగాంచెదన్. 89

క॥ సామాన్యుల లెక్కింపఁగ, నేమి ఘనతయిఁక జగత్త్రయీనాయక! యు
ద్దామమతినాకుఁ జెప్పుము, నీమనమున్ దెవ్వఁ డడలు ♦ నెక్కొనఁజేసెన్. 90

వ. అనిన సూనశరునకు సునాసీరుం డిట్లనియె.

చ॥ సరవిగఁ జెప్పెదన్ గుసుమ ♦ సాయక! విన్మదిఁ దారకాసురుం
డురుతప మొంది బ్రహ్మవర ♦ మొందె నిలింపులకెం దజేయుఁడై
గిరిశకుమారుతోడ నని ♦ గీడ్పడునట్టుగ; వానితోడ నా
హరియును నేనునున్ దివిజు ♦ లందఱు మోడితి మేమి సెప్పుదున్. 91

ఆ॥ వె॥ ఇట్లుగెలిచి మమ్ము ♦ నేవంపుపనులందుఁ, బాదుకొల్పియుట్టి ♦ పనులు గొనుచు
నస్మదీయవైభ ♦ వాతిశయంబెల్లఁ, గొల్లగొట్టి మిగుల ♦ నుల్లసిల్లె. 92

ఉ॥ అంతియెకాదు నిర్జరుల ♦ కాతఁ డనేక విధంబులన్ గడున్
వంతలఁ గూర్పుచుండు గరు ♦ వంబున వాఁడొనరించు చెట్టలిం
తింతలటంచు నాత్మ గణి ♦ యింపఁ దరంబె రతీశ! యిట్టి మా
చింతలనెల్లఁ బాపఁగల ♦ చేవగలట్టి వలంతివీవెకా! 93

ఉ॥ శంకరుఁ డిప్డు హైమగిరి ♦ సానువునందు నుదారమౌ తపం
బంకిలిలేక చేసెడు హి ♦ మాచలకన్యక శర్వుసేవకై
పొంకముమీఱ సన్నిధికిఁ ♦ బోయి యుపాసనచేయు నిచ్చలా
టంకములేక నీవిఁక న ♦ టన్ జని వారలఁగూర్పు నేర్పునన్. 94

క॥ శక్తిశివుల కట్టుల సం, యుక్తిన్ బొసఁగించితేని ♦ యురువిక్రమ సు
వ్యక్తబలుండు కుమారుఁడు, శక్తిధరుం డుద్భవిల్లి ♦ చంపు నసురునిన్. 95

ఉ॥ కావున నెల్లదివ్యులకుఁ ♦ గంటకుఁడై చరియించు తారకున్
జేవయడంచి చంపుటకుఁ ♦ జిత్తమునందుఁ దలంచి చెల్మిమై
నీ విపు డాడినట్టి నుడి ♦ నే స్మరియించి యొనర్పు మిప్పనిన్
నీ విశదోరుకీర్తు లవ ♦ నిన్ జెలువొందఁగ నెల్లకాలమున్. 96

చ॥ అనిన లతాంతచాపుఁడు భ ♦ యంపడి సంతయుఁదోఁచ కాత్మలో
వనరుచు నిట్లుపల్కె సుర ♦ వల్లభ! యంతకహంతయేడ? యా
వనరుహబాణుఁడేడ? యని ♦ పార్వతితపం బదియేడ? యందు మో
హనకలయేడ? సర్వము మ ♦ హావిపరీతవిధాన మారయన్. 97

క॥ మాటలవెంబడిఁ బల్కితి, నీటున నిటలాక్షునేని ♦ నేఁగెల్చెదనం
చోటున్ బాటున్ గాంచక, చేటున్ గొనితెచ్చుకొంటి ♦ సిద్ధం బరయన్. 98

ఉ॥ వాడిన రాలిపోవు సుమ ♦ వర్గము కాంపచయంబు హుష్షనా
నేడకొపాటు పుల్గు లోక ♦ యేవపు వారువముల్ స్వరూపమే
జాడనులేని తెమ్మెరలు ♦ చచ్చువజీవులు దోడు కుంపురే
తేఁ డబలల్ బలంబులు స ♦ రే యిఁక రుద్రునితోడఁ బోరుటల్. 99

గీ॥ కానవాపయిఁగరుణించి♦మానియీమ, హోద్యమమునిప్పు వేఱొక్క♦యూహ నెంచ
గాఁదగును నీకు దేవేంద్ర! ♦ కష్టమిద్ది, కొండనెత్తి తలన్ దాల్చు ♦ కొనఁదరంబె?

క॥ అనిపల్కిన మదనుఁ డా, ననిమిషనాథుండు మిత్ర ♦ మా! యిట్లనఁగా
ననువే? శివునకు వెఱవఁగ, ననుచితమేమున్న దిందు ♦ నరయుము మదిలోన్.

ఆ॥ పెక్కుకల్లలాడి ♦ యొక్కయిల్లును నిల్పఁ, జెల్లునండ్రు జనులు ♦ చెల్మికాఁడ!
పర్వతేంద్రసుతను ♦ బశుపతికిన్ గూర్ప, మంచిపనియె గానఁ ♦ గించపడకు.

క॥ పదునాల్గు భువనముల కీ, యదను మహావ్యసనజనక ♦ మై యున్నది దు
ర్మదుఁడగు నసురకతమ్మునఁ, బదపడి నీవలన మేలుఁ♦ బడయఁగవలయున్. 103

గీ॥ వినుముపల్వురుగడగండ్ల♦వేఁగుచున్న, యప్పుడుదాసాహ్యమొనరింప♦నర్హుఁడయ్యు
నట్లొనర్పక యుండిన ♦ నఘముఁజెందు, సాయమొనరించినన్ జెందు♦ సంపదలను.

క॥ చేసెదనని వాగ్దానముఁ, జేసితి తొలుదొల్త నిపుడు ♦ సేయకయున్నన్
వాసి చెలంగునె? నీకున్, దోసము గాదొక్కొ వాకుఁ ♦ ద్రోయఁగనాడన్. 105

క॥ నిన్నొక్కనిఁ బంపఁగ మే, మున్నెఱిగఁ దలంతుమే య ♦ మోఘవచన! నీ
వెన్నంటి వచ్చెదము నీ, కున్నత జయ మొదవునట్టు♦లొప్పఁబలుకుచున్. 106

గీ॥ అనిన విని తానుమున్నాడి♦నట్టినుడినిఁ, దలఁచి దైవేచ్ఛతో నిజా♦త్మమును దిటము
చేసి యింద్రునితో నట్టె ♦ సేయువాఁడ, నని సెలవుఁజెంది హిమగిరి♦ కరిగెమరుఁడు.

వ. అంత

ఉ॥ ఎచ్చట మిన్నువాఁక దిగి ♦ యేపుమెయిన్ బ్రవహించు మించుగా
నెచ్చట బిల్వవృక్షముల♦యింపగు గుంపులు సొంపుమీఱుఁ దా
వచ్చటఁజేసి ఘోరతప ♦ మందు విరాజిలు శర్వుఁ జేరఁగా
వచ్చె రతిన్ వసంతుఁ బరి ♦ వారమునన్ గొని మారుఁడత్తఱిన్. 108

## —* వసంతోదయ వర్ణనము *—

ఉ॥ అంత వసంతసంగతవ ♦ నాంతరభూమి నితాంతసౌరభ
భ్రాంతమిళిందబృందసుమ ♦ రాజివిరాజితమై దిగంతవి
శ్రాంతతరస్ఫురన్నదవి ♦ కర్షితఘర్షితమానిమానసో
దంతశకుంతపూర్ణమయి ♦ తద్దయు భాసిలె దృష్టికాంతమై. 109

ఉ॥ కన్నులపండువై మదికి ♦ గాటపు హర్షము నిచ్చు చందురుం
డెన్నికమీఱఁ గాయు కడు ♦ నింపగు వెన్నెలవేరిదూఱి యు
త్పన్నతిఁ గొమ్మలన్ మగల ♦ నొక్కటఁ జేర్చుచు నొప్పమీఱెఁ దా
నన్నవగాడ్పు వారల ప్రి♦యాసలఁ జాఁపుచు నుండె నెంతయున్. 110

గీ॥ అట్టితఱి వనవాటిక ♦ యందు మోఁగ్రిళ్ళు, గూడఁజిగిరించి పూచి తేఁ♦కువయెసంగఁ
జేతనములకె కాక య♦చేతనముల, రక్తిముంచెను మన్మథ♦శక్తిఁ దెలిపె. 111

ఉ॥ ఇవ్విధి నెల్ల జంతువుల ♦ కెంతయు సంతసమున్ బొనర్చుచున్
బువ్వులుకానిచేఁతలకుఁ ♦ బూన్కి నెసంగుచునున్న యామనిన్
జివ్వనఁ జూచి యీశ్వరుఁడు ♦ చిత్రము! కాలముగానికాలమం
దివ్విధ మెట్టులయ్యె నని ♦ హెచ్చుగ నచ్చెరు వొందె నాత్మలోన్. 112

చ॥ మనమున సుంతయున్ వికృతి ♦ మల్లడినొందక ధీరచిత్తుఁడై
మునుపటియట్లు గాఢతప♦మున్ బొనరింపుచు నున్న యీశ్వరున్
గని మదనుండు సారసమా♦కారశరంబును వింటఁగూర్చి ప్ర
క్కన నిలుచుండెఁ దోడగుచుఁ ♦ గొంతయు నెంతయు నింపుఁగూర్పఁగన్.

శా॥ శృంగారంబును హావభావములతో ♦ నెంతే రతిన్ మన్మథా
జ్ఞం గాటంబగుపూన్కిఁ దద్విపిన దే♦శం బింపుమైఁ జేరఁ దా
నం గంధర్వులు మీఱి కామినుల డెం♦దంబూరఁ గందర్పకే
ళిం గావింపఁ గడంగిరెంతయును బా♦ళిన్ భోగనిష్ణాతులై. 114

గీ॥ రతివసంతులతో వల♦రాజు తనదు,బలఁగములనెల్లఁదోడ్కొని♦బాణహస్తుఁ
డై విజృంభింపఁగా నెవ్వఁ♦డతనుతావ, మునకుఁ బాల్పడకుండు ని ♦ ప్పుడమియందు.

మ॥ తన విక్రాంతి యిటుల్ దనర్చినను రం♦ధ్రం బించుకేన్ భూతనా
థునియం దేర్పడకున్నఁ జూచి కుసుమా ♦ స్త్రుం డాత్మలోనన్ భయం
బును జెందెన్ దరమే లలాటతటవి ♦ స్ఫూర్జద్బృహద్భానులో
చను దీవ్రత్సతపోగభీకు హరు నొం♦చంగోరి యూంకించఁగన్. 116

## —* పార్వతి పరిచర్యకై శివునియొద్దకు వచ్చుట *—

ఉ॥ అంత నగాధిరాజసుత ♦ యాత్మసఖీద్వయితోడ నీశ్వరా
భ్యంతికభూమిఁ జేరి శివు ♦ నర్చనసేయఁగ వేఁచియుండెఁ గా
లాంతకుఁ డాక్షణంబున నె ♦ ధ్యానముమాని లతాంతసాయకుం
డంతటిరంధ్రి మారసి ప్ర♦హర్షణబాణము నొంది పొందికన్. 117

గీ॥ తనదు యత్నంబునకు దృఢా ♦ ధారమైన, కాళికాగమనంబును ♦ గాంచి మించి
యించువిలులాఁగి మదిసంత♦సించునటులఁ, బురహరుని మీఁద వేసెను♦బుష్పశరము.

ఉ॥ పార్వతియున్ మహేశ్వరునిఁ ♦ బన్నుగఁ జేరి నమస్కరించి మేల్
పర్వెడు వేడ్క మైఁ గొలిచి ♦ ప్రక్కనె నిల్చి సముల్లసద్వయో
గర్వవిలాసదీప్తిఁ జను ♦ గట్టుల నొక్కట నిక్కఁ జేయుచున్
శర్వు నెగాదిగన్ గనె మ♦నంబొకయింత చలింప నీశుఁడున్. 119

క॥ ఈకాళిక చక్కఁదన, మేకోమలికేనిఁ గల్గ ♦ దిది నిక్కంబా
నీకాంత బళిర లావ, ణ్యాకరమో మరుని మోహ♦నాస్త్రమొ యరయన్. 120

ఉ॥ తమ్మిరొ? ముద్దుమోమొ? కుచ ♦ దమ్ములజంటయొ? కన్నదోయియో?
యమ్మరువిండ్లొ? కన్బొమలొ? ♦ యభ్రములో? కురులొక్కొ? పక్వబిం
బమ్మొకొ? మోవియో? తిలసు ♦ మంబొకొ? నాసికయొక్కొ? మేటిచా
క్కమ్మగురత్నవేదికయొ? ♦ కల్కిపిఱుందొ? నఖంబొ? కానకో?

మ॥ స్వరమో? కోయిల యెల్గొ? తేనగవొకో? ♦ చాంద్రాతపంబో? రసో
ద్ధురమావీక్షణమాలయో? స్మరశర ♦ స్తోమప్రకారంబొ? సం
చరణంబో? యసకృద్ధగద్ధగలు మిం ♦ చన్ మించుక్రొమ్మించుసొం
పొ? రహిన్ గూర్చెడునిద్ది తాపసుల కేన్ ♦ బూవిల్తు చేవేటులన్.

సీ॥ ఇక్కల్కి నెమ్మోని ♦ చక్కదనం బెన్నఁ, గారాదు పెక్కేండ్లు ♦ కష్టపడిన
ఇచ్చెల్వ గట్టిన ♦ యీవల్వ లెంతయు, సింగారమొందె వా ♦ సిన్ జెలంగు
ఈభామ గైసేయ ♦ నింపగు నీపువ్వు, దామంబులొసఁగు నెం ♦ తో ముదంబు
ఈరుచిరాంగిఁ దా నే ♦ తపస్సును జేసి, కనినాఁడొ ధన్యుఁ డీ ♦ గట్టుతేఁడు

గీ॥ అందమంతయు నీ సుంద ♦ రాంగి యగుచు, నవని జన్మించెఁగాఁబోలు♦నద్దిరయ్య!
ఇది యనన్యసమాకార♦ యిదియె ధన్య, ఇదియె సర్వాంగసుందరి ♦ యిదియె రమణి.

చ॥ అని యిటు లద్రిజాసురుచి ♦ రాంగకదివ్యమనోజ్ఞరేఖలన్
మనమునఁ బెక్కుతీరులఁ జ ♦ మత్కృతిగాఁ దలపోసి యక్కజం
బునఁ గను దేవదేవుఁ గని ♦ భూధరరాజవరేణ్యకన్య ల
జ్జనుగొని దవ్వులన్ జని ని ♦ జస్ఫురదంగములన్ మొగుడ్చుచున్. 124

ఆ॥ ముక్తికాము లైన ♦ మునులు సంగముం బాసి, నీదుపదము లెంతో ♦ నిష్ఠ మెఱయ
శరణమని యుపాస్తి ♦ సల్పుచునుందురు, నిర్వికల్పభాగ్య ♦ నిపుణమూర్తి! 100

గీ॥ వరద! కన్పడునదియుం గ ♦ న్పడకయున్న, యదియు సద్వ్యయమయి యల ♦ రారు నీవె
శుద్ధమైనట్టిదియును వ ♦ స్తువులనొప్పు, నదియు నగు పైఁడి యొక్కండె ♦ యగునుగాదె.

గీ॥ భువనసృజనావనాలంబ ♦ భూరికృతుల, యందు ముఖ్యనిదానమ ♦ వగుచు నెప్డు
నాథ! తదపేక్షఁ బొదలుచు ♦ న్నావుగాని, యరయ ననపేక్షుఁడవు పర ♦ మాత్మ! నీవు.

గీ॥ ఆదివయ్యును నరయ న ♦ నాది వేస, గుణుఁడవయ్యును గనఁగ ని ♦ ర్గుణుఁడ వెందుఁ
బ్రకృతికవ్వల వెలయునా ♦ పరమపురుషుఁ, డవు పరాత్పరుఁడవు జగ ♦ ద్ధవుఁడ వనఘ.

క॥ నీదరిసేవమున గిరిశ, న్యాదారా! ధన్యజనుల ♦ మైత్రిమి కడిమిన్
నీదృఢభక్తజనమునకు, మోదం బిడువాఁడ నజునిఁ ♦ బ్రోవుము దీనున్.

వ. అనినంత వశిష్ఠాదిమును లిట్లని ప్రార్థించిరి.

ఉ॥ నీదు రజోగుణాంశమున ♦ నీరజసంభవుఁ డుద్భవిల్లెఁ దా
నీదగు సాత్త్వికాంశమున ♦ నీరజనేత్రుఁడు పుట్టె దిట్టయై
నీదు తమోగుణాంశను జ ♦ నించెను గాలమహాగ్ని రుద్రుఁడున్
నీదు తురీయతత్త్వ మిఁక ♦ నిర్మల మక్షర మద్వయం బొగిన్.

ఆ॥ వ్యక్తముగ మహత్తు ♦ పంచభూతములు త, న్మాత్ర లింద్రియములు ♦ మనమహంకృ
తియును బ్రకృతిగలసి ♦ తీడిరించు నీయందు, విశ్వమూర్తి! వేద ♦ వినుతకీర్తి!

ఉ॥ అంబుధు లేడు వల్వలు ద ♦ శాశలు భూరిభుజంబు లంతరి
క్షంబగు పొక్కిలా మిహిర ♦ చంద్రహుతాశనులున్ గనుల్ సమీ
రంబగు నాస నాకము శి ♦ రస్సు కృపీటధరంబులౌ కురుల్
భంబులునున్ గ్రహంబులు కృ ♦ పానిధి! నీకు సుమంబు లింబుగన్. 107

క॥ నీకెటుల నుతుల మోదము, చేకూరఁగఁ జేయఁగలము ♦ శివ! పరమేశా!
వాకుల కేనియు మదికే, బ్రాకటముగ నందకెందు ♦ భాసిలుదు వజా!

గీ॥ అనఘ! కడుబాలిశుండైన ♦ యజ్ఞగర్భుఁ, గనికరంబున మన్నించి ♦ కావు మెడరుఁ
బాపు నీకెదురే యెందుఁ ♦ బరమపురుష! భక్తవాత్సల్యమాత్మని ♦ ప్పాటవిడక.

వ. ఇంద్రాదిలోకపాలు రిట్లు వినుతించిరి.

గీ॥ కోటిసౌదామనీప్రభా ♦ కుశల మస్త, కోణము సుశోభనంబయి ♦ రాణఁదనరు
రూపము ధరించి లోకమం ♦ దేపుమీఱు, వెలయు నీకు నమస్కార ♦ ములివె దేవ!

క॥ పంచాస్యున కభవునకును, బంచాశత్కోటిమూర్తి ♦ భాస్వరునకు ది
వ్యాంచితవిద్యుజ్జ్వాలా, చంచద్రూపునకు నిత్య ♦ సత్యునకు నుతుల్.

క॥ విద్యాతత్త్వమయునకు న, విద్యాభంజనున కఖిల ♦ విభునకు భీమ్మ
ప్రద్యోతితాగ్నివర్ణున, కాద్యునకును శంభునకు జో ♦ హారు లివె శివా!

క॥ రుద్రునకు భక్తసముదయ, భద్రప్రదునకు నవాచ్య ♦ వైభవునకు ని
ర్నిద్రప్రబోధునకుఁ దుహి, నాద్రిసుతాహృదయపుష్క ♦ రార్కునకు నుతుల్.

వ. దేవా! అనుగ్రహింపు మనుగ్రహింపు మనుటయు.

శా॥ నాళీకాక్షునిఁ దొట్టి నిర్జరులు నా ♦ నాదివ్యమౌనీంద్రులున్
నాళీకోద్భవుఁ గావుమం చిటుల దీ ♦ నత్వంబుతో వేడఁగాఁ
గాళీనాథుఁడు గిన్కఁబోవిడి కడున్ ♦ గారుణ్యముం జెంద న
వ్వేళన్ గాంచి విరించి మ్రొక్కి నుతిఁ గా ♦ వించెన్ విధేయాత్ముఁడై.

క॥ కరుణాసాగర! శంకర!, వరదాభయహస్త! దేవ ♦ వంద్యపదాబ్జా!
కరుణించి ప్రోవుమీ నను, దురితము సైరించి వేగఁ ♦ దుహినాంశుధరా!

క॥ నీలీలేచ్ఛఁ జరాచర, జాలం బీ భువన మలరు ♦ శంకర! తాఁటన్
మేలుగఁ బసరంబులక్రియఁ, జాల నెఱింగితి మహాత్మ! ♦ క్షమియింపు మిఁకన్.

గీ॥ అనికృతాంజలియై మ్రొక్కి ♦ యజుఁడు నిలువ, శర్వుఁ డభయవరం బిచ్చె ♦ సర్వమునులు
సురలు గిరివరులందఱు ♦ కరము సంబ, రమునఁ బొగడిరి తొడరిస ♦ ర్వజ్ఞు నపుడు. 117

గీ॥ అంత ధాతృవిమర్దితం ♦ బైన వీర్య, మపుడు కణికాసహస్రమై ♦ యమర వాని
చే జనించిరి పెక్కండ్రు ♦ చెలువు మీఱ, వాలఖిల్యమునుల్ వరు ♦ వంపుఘృణుల.

వ. అవ్వారిన్ గాంచి నారదుండు శివానుమతి నిట్లనియె,

క॥ చనుఁడీరు గంధమాదన, మున కందుఁ దపంబు చేసి ♦ మునిముఖ్యులరై
యొనరుండిది విధి యన నం, తనె చనిరచ్చటికి వారు ♦ త్వరితగతులతోన్. 119

మత్తకోకిల. తోయజోద్భవుఁ డప్డు మౌనుల ♦ తోడ శర్వవివాహ మ
త్యాయతంబగు భక్తిఁ బూర్తిగ ♦ నాచరింపఁగఁ జేసి యా
రేయి యంద ధ్రువేక్షణంబు నె ♦ ఱిన్ బొనర్పఁగఁ జేసి బల్
మోయఁ జేసెను స్వస్తిపాఠము ♦ మోదమిం పెసలారఁగాన్,

క॥ పొందుగ మునులముదల నా, నందముతో శంకరుండు ♦ నగజశిరమునన్
సిందూరమిడియె దానన్, జెందెను దేజంబు మిగుల ♦ శివ మురుపొప్పన్.

గీ॥ అంతనొక పీఠిఁ బేర్మిమై ♦ నధివసించి, యున్న శివులనుగని సుర ♦ లుబ్బిరెంతొ
పరిణయమహోత్సవం బిట్లు ♦ జరుగ నెలమి, బ్రహ్మకిడెఁ బూర్ణపాత్రంబు ♦ భర్గుఁ డపుడు

క॥ గోదానము యాజ్ఞికునకు, సాదరమతి శంభుఁ డొసఁగి ♦ సకలాంచచ్ఛ్రీ
యోదాయకంబులైన మ, హాదానములొసఁగె నగ్రి ♦ జాగ్రణులకొగిన్.

క॥ వరుసగ వేర్వేఱుగ భా, స్వరరత్నంబులను రాంక ♦ వపుసాలువుల౯
దరుణేందుమౌళి విప్రుల, కిరవుగ సంభావనలను ♦ నిచ్చె బిఱబిఱ౯.

గీ॥ అపుడు వేలుపులును మును♦లన్యులును మహాప్రమోదంబునొందిజ♦యధ్వనులనొ
నర్చి రచ్చరగములు గం♦ధర్వజనము, లలితనర్తనగానముల్ ♦ సలిపిరెలమి. 125

వ. మఱియు భేరీమృదంగవేణువీణానిస్సాణకాహళ ఝల్లరీతూర్యవాద్యఘోషంబులు
మోసి మహోత్సవంబయ్యె నయ్యెడ హిమవంతుండు డాసి మహేశ్వరునకు
మ్రొక్కి హరివిరించనాదులకు వినతుండై భోజనసమయం బెఱింగించి యుండఱ
నామంత్రణంబుచేసిన నవ్వారంప జంగీకరించి సమధికాయామమై శాల్యంబును సుప్ర
భాక్తముక్తాఫలానేకాచ్ఛగుచ్ఛాంతరాళసంయోజితానుపమశేఫాలికా కుందమం
దారవకుళచంపకాశోకసుమమంజరీపుంజరంజితవితానప్రతానవిభ్రాజితంబును క్షీర
సాగరంబుబోలె సుత్పాదితమహాలక్ష్మీవైభవంబును మహేంద్రభవనంబుపోలె
సమృతరసోపపాదితానేకవిధాహారసంపన్నంబును మేఘద్వారంబుపోలె ప్రద్యోది
తద్యుమణివిద్యుజ్జ్యోతిర్విభాసితంబును గ్రహమండలప్రదేశంబువలె సమధిగత
కావ్యవాచస్పతిరాజహంససౌమ్యకుజమందమరుద్విలసితంబును మహారమణీయం
బునగు భోజనాయతనంబుఁ బ్రవేశింపుటయునందు. 126

## —* వరవర్గ భోజనములు *—

క॥ కనదురురత్నాంచితకాం, చనపీఠములందు వారిఁ ♦ జక్కఁగఁ గూర్చుం
డ నివేదించిన వారలు, ఘనమగు సంతోసమొప్పఁ♦ గా నచటఁ దగ౯.

ఆ॥ ప్రమథవర్య లొక్క ♦ బంతి భూతచయంబు, లొక్కబంతి గణము♦లొక్కబంతి
వీరభద్రముఖ్య ♦ ధీరులు నొకబంతిఁ, గూరుచుండి రెలమిఁ ♦ గొనలుసాఁగ.

క॥ నారాయణుండు బ్రహ్మయు, నారదుఁడు౯ గశ్యపుఁడు స ♦ నకముఖ్యులు బృం
దారకగురుఁడు వశిష్ఠము, ఖోరుతపోనిధులు మాను ♦ లొకబంతియెడ౯.

గీ॥ వరుస నింద్రప్రముఖలోక ♦ పాలురును న, వగ్రహంబులు నొకబంతి ♦ వాసుకిప్ర
ముఖనిఖిలపన్నగేశ్వర♦ముఖ్యు లొక్క, బంతి గంధర్వవరు లొక్క♦బంతిగాను.

వ. మెండియు వసువులు విశ్వేదేవత లాశ్వినేయులు మున్నగువా రొక్కబంతిగను
గిన్నరకింపురుషచారణవిద్యాధరాప్సరో యక్షరక్షోగరుడగంధర్వగణంబులు వేఱు
వేఱుబంతులుగను గూర్చుండి రాసమయంబున.

క॥ బంగారుపళ్ళెరంబులు, బంగరుచెంబులును బంచ ♦ పాత్రలు మఱియున్
బంగరుటుద్ధరణులునున్, బంగరుగిండ్లమరచి రటఁ ♦ బర్వతభృత్యుల్.

క॥ సురభిళధూపద్రవ్యము, లురువుగఁ దగు పాత్రలందు ♦ నునిచి సుగంధ
స్ఫురణం జేసఁగిరచిరి నగ, పరిచారకపర్యు లచట ♦ భాసురగతుల౯.

గీ॥ చామరంబులు సురటీలు♦జారుతరము, గాఁగ విద్యుద్వశముఁలఁజ ♦ క్కఁగనమర్చి
యుంచి రీరీతి సిరుల ను♦ దంచితమయి, లీలనొప్పారు భోజన ♦ శాలయందు,

క॥ పలురకముల పక్వాన్నము, లలరెడుబియ్యంపుటన్న ♦ మరుదగుశాకం
బులు సూపంబులు నప్పడ, ములు వడియంబులును నేయి ♦ పులుసులు చేరుల్,

క॥ జిడ్డుపెరు గూరుఁగాయలు, నడ్డంకి యొకింతలేక ♦ యరయుచు బంగా
రొడ్డాణంబులు మెఱయఁగ, వడ్డించిరి యువతు లపుడు ♦ వాసిగఁదోడ్తోన్. 136

క॥ మేనకయనుమతిఁ బరమే, శానుని లక్ష్మీపురోగ ♦ సాధ్వీమణు లా
ర్యానలినేక్షణతో శ, ర్వానిలయముఁ జేర్చి రప్పు ♦ డానందమునన్. 137

క॥ పరమామోదముతోడ మ, ధురహాస్యాలాపచయుచ♦తురిమ దనర్పన్
సిరిమీఱ భోజనము చే, సిరి సర్వజనంబు లప్డు ♦ శివునిఁ దలఁచుచున్.

గీ॥ పిదప నాచమనముచేసి♦పేర్మితోడఁ, బచ్చకప్రింపుతావుల ♦ హెచ్చుమీఱు
తమ్ములముఁగొనివిశ్రమా♦ర్థమ్మనంద,ఱొగిఁజనిరివారువారుము♦ న్నున్నయెడకు,

వ. అంత,

సీ॥ మణిదీపశతము ల♦మర్చికూర్చినచోట, ముత్యాలమాలికల్ ♦ పొలుచుచోట
రత్నదర్పణపంక్తి♦రాణమీరినచోట, ద్రాక్షతీఁగెలగెలల్ ♦ తనరుచోట
నానాసుగంధవి♦తానంబు గలచోటఁ, బుష్పితాశోకముల్ ♦ పొదలుచోట
మరకతమణికుట్టి♦మంబులు గలచోటఁ, గప్పురంపుటనంటు ♦ లొప్పుచోట

గీ॥ పంచభక్ష్యాన్నపాత్రి లే♦ర్పడినచోట, మేల్మికస్తూరి విడెములు ♦ మెఱయుచోట
రత్నపర్యంకమాత్మఁగ♦రంచుచోట, ననుపమైశ్వర్యధుర్యమై ♦ యలరుచోట,

క॥ తరుణేందుధరుఁడు భూభృ, ద్వరకన్యకతోడ నందు ♦ వైభవముగ భా
స్వరరత్నపీఠతలమున, హరువుగఁ గూర్చుండియుండ ♦ నాసమయమునన్.

చ॥ సురుచిరనూత్నయవ్వనము ♦ శోభిలువాని మనోజ్ఞహాససుం
దరమగుమోమువానిఁ బ్రియ ♦ దాజనమోహనుఁడైనవాని భా
స్వరలలితాంబరంబులను ♦ సొరుగఁగట్టినవాని దివ్యమే
దురమణిభూషలన్ బెడఁగు♦దోఁపఁగఁ దాల్చినవాని నీశ్వరున్.

ఆ. కాంచి శైలరాజ♦కాంతలు గడుఁ బ్రశం, సించి సంతసించి ♦ శివులకపుడు
గ్రంథిమోచనంబుఁ ♦ గావించి నవదంప, తులను జూచుచుండి ♦ రెలమికలిమి.

వ. అయ్యవసరంబున,

ఉ॥ చేరఁగవచ్చి రచ్చోటికి ♦ శ్రీసతి వాక్సతి సూర్యపత్ని బృం
దారక రాజపత్నియును ♦ ధాత్రి యరుంధతి స్వాహ రోహిణీ
నీరజగంధియుఁ దులసి ♦ నిర్జరమాత యహల్య జాహ్నవీ
వారిజనేత్ర మన్మథుని ♦ వల్లభయున్ శతరూపయున్ రహిన్.

గీ॥ వరఁగ సావిత్రి కుంభసం♦భవుని రాణి, వాసము మఱెందఱో దివ్య♦భామలును ఫ
ణీంద్రకన్యకలును సన్ము♦నీంద్రకన్య, కలును జేరిరి లెక్కింపఁ♦గానియట్లు. 145

వ. పసిండిగద్దియలం దెల్లరుఁగూర్చుండినపిమ్మట వారలలో సరస్వతి పరమేశ్వరుఁ
దిలకించి పరితోషంబుతో నిట్లనియె. 146

## —* దివ్యస్త్రీల పరిహాసోక్తులు *—

చ॥ దొరకెను జీవితేశ్వరి వి ♦ ధుప్రతిమంబగు నీప్రియాస్య మ
బ్బురముగఁగాంచి సేగివిడి ♦ భూధరజాపరిరంభపూర్వకో
ద్ధురసుఖలీలఁ బ్రొద్దులను ♦ ద్రోయుము సంతత మీపెతో నిఁకఁ
విరహముగల్గ దెన్నఁడును ♦ విశ్వజనీనముగా మహేశ్వరా!

వ॥ అంత నిందిర యిట్లనియె.

క॥ బిడెమున్ బోవిడి శివ! యీ, పడుచున్ గౌఁగిటను బడసి ♦ పాలింపుమిఁకఁ
బిడియంబేడది యేపెను, విడినఁ బ్రాణములు దవుల ♦ వెడలునొ వేగఁ.

వ. సావిత్రి యిట్లనియె.

గీ॥ ప్రియుకు మధురాన్నములు దిని ♦ పించి యంత
నీవును భుజించి వేమంచి ♦ నీట నాచ
మనము నొనరించి మృగమదం ♦ బొనరు విడెము
నొసఁగు మీశ్వర! యాదరం ♦ బెసఁగ నిపుడు.

వ. అదితి యిట్లనియె.

క॥ ఉమ యారగించినంత నెం, గమఁ గడుగుటకొఱకు వేగఁ♦గాముకవర నీ
రము నిమ్ము దంపతుల ప్రే, మ మసాధారణము గనఁగ ♦ మహి దుర్లభమా.

వ॥ ఆవెంట జాహ్నవి యిట్లనియె.

గీ॥ మేల్మిబంగారుతళుకుల♦మించు మెఱయు, శైలజాకుంతలములఁ బ్రి ♦ సాధనంబు
సేయుమీశ్వర! భర్తలు♦సేయుసదుప, చార మొనరించుఁ గామినీ♦జాతి కెలమి.

వ. చెలికారంబుతోడఁ బౌలోమి యిట్లనియె.

క॥ సతిగాత్రము మూఁపుననిడి, యతులితశోకమునఁ బుడమి ♦ యంతఁ దిరుగుచున్
వెతవడిన నీకెటుల సి, బ్బితి గల్గును గల్కినేలు ♦ పేర్మి మహేశా! 152

వ. అపిమ్మట లోపాముద్రి యిట్లనియె.

సీ॥ అలరుఁబోండ్లకు శయ్యాగృహంబులందు, భోజనావాసములయందుఁ ♦ బూజ్యపదము
గలదుగావునఁ జెపుదుమీ ♦ కల్కి పడుచు, నకువిడెంబిడి రమియింపు ♦ నాగభూష! 153

వ. అరుంధతి యిట్లనియె.

క॥ నీ కోసఁగఁ దల్లియొప్పని, యీ కన్నెను నేనుగాదె ♦ యిప్పించితి నీ
వాకతనఁ దోయపున్నడి, జేకూరఁగఁ జెప్పి ♦ రతులఁ జెందుము దేవా!

వ. అనంతరం బహాల్య యిట్లనియె.

ఆ॥ విను పురాణపురుష! ♦ వృద్ధవేసముఁ బాసి, నిత్యతరుణుఁడవయి ♦ నెగడుమీఱుత
కూఁతుకోఱకుమిగుల ♦ గోణఁగుచుండెడు మేన, నిన్నుఁ గాంచిమదిని ♦ నెమ్మిఁ గాంచు.

వ. పిదపఁదులసి యిట్లనియె.

ఆ॥ మున్ను నుమను గోనక ♦ పువ్వుటమ్ములబంటుఁ, గాల్చినట్టి నీవు ♦ గడఁగి యెటుల
నావశిష్ఠముఖుల ♦ సారుంధతీకులఁ, బంపితయ్య చెపుమ ♦ భార్యకోఱకు.

వ. స్వాహాదేవి యిట్లనియె,

క॥ స్థిరమతి మాసల్లాపము, ల రహిఁన్ వినుమిపుడు కడువి ♦ లాసం బెసఁగన్
బరిణయముల నువిదలకున్, బరఁగెడుఁ గడుగరువతనము ♦ బాలశశిధరా!

వ. మందహాసముతో రోహిణి యిట్లనియె.

గీ॥ కామశాస్త్రవిశారద! ♦ కాళికామ, మింకను దీర్పుము తడవింత ♦ యేనిలేక
కాముకుఁడవీవు కామినీ ♦ కామసాగ, రమును బారంబునొందింపు ♦ రహియెసంగ.

వ. మురిపంబుమీఱ వసుంధర యిట్లనియె.

సుగంధివృత్తము. కామపీడితాంగనాని ♦ కామభావమెంతయున్
నేమమొప్పఁగా నెఱుంగు ♦ నేర్పుకాఁడ వీవికన్
మేము చెప్పనేల చాల ♦ మేరమీఱి యిట్టులన్
సామి! నీవు జాణవెందుఁ ♦ జక్కనన్ని జూడలన్.

వ. తర్వాత శతరూప యిట్లనియె.

క॥ స్త్రీ కేమిట సంతోసము, చేకూరునొ యదియెఱింగి ♦ సేవింపు శివా!
ఆఁకట డస్సినవారికిఁ, జేకుఱు నన్నము వినాగ ♦ క్షితిఁ బెఱసుకముల్. 160

వ. చనవుమెఱయ సంజ్ఞ యిట్లనియె.

ఉత్సాహవృత్తము॥ జాలమేల యమ్మలార! ♦ పడ్రిసాన్నవర్గతాం
బూలములను బూవుసెజ్జఁ ♦ బొందుపఱచినార మీ
బాలచంద్రమౌళి కింపు ♦ బాల నప్పగించి గే
హాలకున్ బదుండు పదర ♦ కాగడంబు మానుచున్. 161

వ. వాసియమర వరుణాని యిట్లనియె.

ఆ॥ వేదింపఁబోకు ♦ వేఁగించఁబోకుమా, ముద్దరాలి నింతో ♦ బుద్ధిఁ జెప్పి
నేర్పుమీరఁ దేర్చి ♦ నెయ్యంబుఁ దియ్యంబుఁ, జెందనొందు మిందుఁ ♦ జేసెవిందు.

వ. అనినంతఁ బరమయోగీంద్రవందితుం డగు పరమేశ్వరుండు దివ్యనారీశిరోమణుల వచనంబుల కిసుమంతయేనిఁ జలింపక నిర్వికారుండై యవ్వారలకిట్లనియె.

గీ॥ నాయెదుర నిట్టినుడుల న♦నంగఁదగునె? కొమరుసం బెల్ల చాపల్య♦ గుణముదనరు
నిఖిలలోకైకకల్యాణ ♦ నిలయలార! తల్లులార! పురంధ్రిమ ♦ తల్లులార!

క॥ అనుడు శివవచనముల విని, మనముల లజ్జించి దివ్య ♦ మహిలామణు లె
ద్దినిఁ బలుక కూరకుండిరి, యనువుగఁ జిత్రగతపుత్రి ♦ కాకృతు లమరన్.

వ. ఆసమయంబున.

గీ॥ మధురభక్ష్యాన్నములను ను ♦ మాసహాయుఁ
డై మహేశుండు భుజియించి ♦ యాచమనము
చేసి మణిపీఠమున సుఖా ♦ సీనుఁ డగుచుఁ
గుతుకమున వీడియము వేసి ♦ కొనుచునుండ.

వ. తక్కిన దివ్యవనితలందఱారగించి వీడియంబులు వేయుచున్న సమయంబుఁ గాంచి యనుకూలసమయంబగుట నెఱింగి రతికాంత శంకరున్ దగ్గఱి మ్రొక్కి యిట్లు ప్రార్థించె.

—— * రతీదేవి మగని బ్రతికింపుమని శంకరుని వేఁడికొనుట * ——

చ॥ గిరిజను బెండ్లియాడి యిటుఁ ♦ గేళివిహారములోడనుంటి వ
ప్పురుసున మిమ్ముఁ గూర్చుటకె ♦ పాల్పడి నాదయితుండు నిర్జరో
త్కరముల పంపునన్ దఱియఁ ♦ గా నటు మల్పితివేల? తండ్రి! వే
గిరముగ నా మనోహరు నొ ♦ గిన్ బ్రతికించి సుఖంబుఁ గూర్పుమా! 168

ఉ॥ నీదు వివాహమం దిచట ♦ నెక్కొనినట్టి జనంబు సర్వమున్
మోదముతోడ నొప్పెడు న ♦ మోఘవచోఘన! నే నొకర్తనే
ఖేదముతోడ నుంటినిఁకఁ ♦ గేరడమున్ విడి నాఁటి నీనుడిన్
బాదుగ నాత్మలోఁ దలఁచి ♦ భర్త్రుమతిన్ నను జేయుమీశ్వరా! 169

క॥ నీవొకఁడుగాక జగముల, లో వేఱొక్కండు గలఁడె ♦ లోకేశ్వర! యీ
నావెతఁ దీర్పసమర్థుఁడు, భావించి యనుగ్రహంబుఁ ♦ బరపుము దేవా!

క॥ సకలజనోత్సవదము తా, వకముద్వాహంబు దీన ♦ వత్సం! దీనన్
బ్రకటముగ నాకుఁ గూడఁ గ, నికరంబున సుకముఁ గూర్పు ♦ నిరుపమవిభవా!

క॥ పరమేశ్వరుఁడవు సచరా, చరభువనములెల్లఁ బ్రోచు ♦ సామివి ఘనదు
ష్కరకార్యకర్తవిట నా, కిరవుగఁ బతిదానమొసఁగు ♦ మీశ! రయమునన్.

ఆ॥ అనుచు నాథ! నాథ! ♦ యనిదురపిల్లుచుఁ, జెఱఁగుముడినివిప్పి ♦ చెలువ కామ
భస్మ మీశ్వరునకుఁ ♦ బదిలంబుగానిచ్చి, వెక్కి వెక్కి యేడ్చె ♦ విభునిఁగోరి.

క॥ ఇందిరమున్నగు దేవీ, బృందం బపు డెంతయేని ♦ బెట్టిదమగునా
ర్తిం దవిలియేడ్చి శివునకు, వందనమిడి యిట్టులనిరి ♦ వారనికరుణన్.

క॥ బ్రతికింపు మరుని శంకర!, వితతదయానిధి! ప్రపన్న ♦ బృందావన! నీ
వతికారుణ్యమయుండవు, రతిసతిఘోరార్తిఁ బాపు ♦ రాజకళాపా!

## —* శివుఁడు మన్మథుని బ్రతికించుట *—

క॥ ఏకగ్రీవముగా నిటు, శ్రీకాంతాదిమలు యాచ్న ♦ సేయుడు రతిబల్
వ్యాకులతఁ దీర్ప శంకరుఁ, డాకాంక్షించెన్ మరున్ సు ♦ ధాయతదృష్టిన్.

గీ॥ పూర్వమునకన్న నెక్కుడ ♦ పూర్వమైన
రూపలావణ్యములతోడ ♦ నేపుదనరి
పొడమి కాముఁడు శివునకు ♦ మ్రొక్కి "మాంతు
మస్వశంకర! ఘనదయా ♦ మండన!" యనె.

మ॥ శరచాపంబులఁ దాల్చి దివ్యతనురా ♦ జత్కాంతు లింపొందఁగా
స్మరుఁ డారీతిని జేరఁగా రతిసతీ ♦ మాలామహారత్న మీ
శ్వరపాదంబుల వ్రాలి మేలినుతులన్ ♦ సల్పన్ గడున్ బేర్మి నా
దరమొప్పన్ రతినిన్ మరున్ గని జగ ♦ త్కారుం డుదారాత్ముఁడై. 178

ఉ॥ రాతురులందు నెప్డు రతి♦రాజ! భవత్సతి కిద్ధమూర్తివై
ప్రీతియొనర్చుచుండు మశ♦రీరుఁడవై పతులన్ బఱంతులన్
జాతురితోఁ బరస్పరము ♦ సంగతమొందఁగ జేయుచుండు మీ
రాతిరియందు నందఱకు ♦ రాణ దలిర్పఁగఁ గానుపట్టుమీ! 179

వ. ఇఁకను

క॥ మీనుతుల కెంతొ సంతస, మూని ప్రసన్నుండనైతి ♦ నొసఁగెద వరముల్
మీనధ్వజ! యెఱిగింపుము, నీ నిర్మలవాంఛితముల ♦ నెయ్యంబలరన్.

ఆ॥ అనుడుఁ బుష్పబాణుఁ ♦ డనియెను దేవ! నా, యెడఁ బ్రసన్నభావ♦మెంచితేని
నాథ! వరము మదప♦రాధక్షమ యొకండొ, కండు నీదు భక్తి♦గరిమ నొసఁగు.

వ. అనిన శివుం డామోదంబునఁ దథాస్తని మన్మథున కిట్లనియె.

ఉ॥ కామ! వచిస్తునుండెదన్ వినుమి ♦ కన్ వెలుపున్ విడనాడు మచ్యుతున్
బ్రేమముతోడఁజేరి కను ♦ వెల్పుల నుండుము పొమ్మటన్న నా
తామరసాక్షనందనుఁ డు♦దారమతిన్ శివు భక్తి మ్రొక్కియా
ధామమునుండి వేల్పులికిఁ ♦ దత్క్షణమే చనుదెంచి ప్రీతిమై.

క॥ సరసిజనాభుని చేరువ, కరిగి తదంఘ్రులకు మ్రొక్కి ♦ యాత్మోదంతం
బరుదొప్పఁజెప్ప నతఁడును, సురలెల్లరు మురిసి శివుని ♦ స్తుతియించిరటన్.

గీ॥ రతియుఁ మన్మథుఁడును మదన♦రాజబంధు, వులును దనయింటిజనముతో ♦ భూధరేంద్రుఁ
డారగించెను బరిజను ♦ లపుడు సాప, డిరి విడెంబుల నొందిరం♦దఱు ముదమున.

## —* లోకరక్షార్థమై శివుఁడు పార్వతీదేవిన్ గూడుట *—

గీ॥ అంత నిందిర మున్నగు ♦ నమరపత్న్ను, లేదొ నెపమాడి పడకింటి ♦ కెడగనేగి
రద్రితనయను గవుఁగిలి♦యందు జెంది, కామసుఖములఁ దన్పె శం♦కరుఁడు రహిని.

## —* ప్రభాత వర్ణనము *—

క॥ చిరకాలమునుండి కడున్, విరహాముతో వేగుచున్న ♦ విశ్వగురుడు బం
ధురకామగతులఁ బెనఁగ న, చిరమునఁ దెలవాఱెఁ బ్రిహార ♦ శీలన మెడగాన్

క॥ ఉర్విఘ్ఘూరుచుఁ బతికై, నెవ్వగఁ బాపికొని సుఖము ♦ నెక్కొనుతఱి లేఁ
బువ్వుంబోండ్లకు వెగటుగఁ, జివ్వునఁ దెలనయ్యె దెసలు ♦ చెలువలరారన్. 187

క॥ బిగువైన మగలకౌఁగిళు, లఁ గడున్ సొలపొందియున్న ♦ లలనలు నెట్లో
వగతో వదలిచికొని యి, మ్ముగఁ బడకగదులను బాసి ♦ పోయిరి వేగన్. 188

గీ॥ కోకదంపతులకు స్వస్తిఁ ♦ గుస్తరించి, ఘూకరాజి ఘనధ్వాంత ♦ గుహాలకనిపి
జగమునకు బోధభిక్షంబు ♦ సంతరించి, లోకబాంధవుఁడరుదెంచె ♦ వీకమెఱయ

చ॥ అరుణమరీచి యంత నుద ♦ యాచలపీఠము నెక్కి సర్వత
స్స్ఫురదసమానమంజుకర ♦ పుంజములన్ వెలయించి యూర్ధ్వని
స్సరదమలాంశుజాలముల ♦ శైలవరోన్నతశృంగపల్వలాం
తరనళినాళిఁగూడఁ బ్రియ ♦ దమ్మునఁ బూయఁగఁజేసె వాసిగన్. 190

చ॥ మునులును సిద్ధులున్ సురలు ♦ మున్నగు దివ్యవరేణ్యు లర్వియ
ద్ధుని నవగాహముల్ సలిపి ♦ తోయజమిత్రున కర్ఘ్యమిచ్చువా
రును జపయజ్ఞముల్ గడఁ ది ♦ రోహితదృష్టి యొసంగ సల్పువా
రును నిగమానువాకముల ♦ రూఢిఁ బఠించెడువారలై తొగిన్.

గీ॥ కర్మఠాగ్రేసరుల్ ద్విజా ♦ గ్రణులు వేగ, హవ్యముల జాతవేదున ♦ కమరనొసఁగి
హోమ మొనరించి రంతనా ♦ ధూమపుంజ, మాజ్యగంధంబులనుజిమ్మె ♦ నవని నెల్ల.
క॥ ఈలో మహేశ్వరుఁడు వై, తాళికసంస్తుతుల నొంది ♦ తానును శయ్యా
శాలన్ విడి కాల్యాచా, రాళిఁగడపి చనియె నిర్జ ♦ రాంతికమునకున్.

## —* శివుఁడు దేవతలకు దర్శనంబిచ్చుట *—

వ. అంతనచ్చట మహేశ్వరదర్శనం బపేక్షించి మహాభక్తితో ధ్యానంబు సేయుచున్న జనార్దనప్రముఖులు దారసించిన మహేశ్వరునిఁగాంచి పౌనఃపున్యంబుగఁ బ్రణామంబులుచేసి యిట్లు వినుతించిరి.

క॥ జయ విశ్వేశ్వర! శంకర!, జయ నిఖిలాధార! శర్వ! ♦ జయ సర్వేశా!
జయరుద్ర! మహాదేవా!, జయకాళీపతి! మహేశ! ♦ జయప్రకృతీశా!
క॥ జయనిష్కామా! నిర్గుణ!, జయలీలానిఖిలనిలయ! ♦ జయసర్వగతా!
జయకారణాతిగామీ!, జయభక్తేప్సిత వితరణ ♦ చణకరుణాఢ్యా!
క॥ జయ వాఙ్మనసవిదూరా!, జయ వాత్సల్యనిధి! నిత్య ♦ సత్యచరిత్రా!
జయ దీనబాంధవ! శివా!, జయ వికృతివిహీన! దేవ! ♦ జయ సర్వాత్మా!
క॥ అని వినుతింపుచు మ్రొక్కిన, యనిమేషాధిపుల శర్వుఁ ♦ డంచితకరుణన్
గని యిష్టగోష్ఠి సంతస,మున సంభాషించుచుండ ♦ భూధరుఁ డంతన్. 198
ఆ॥ చేరి జగ్ధివేళఁ ♦ జెచ్చెర నెఱిఁగించి, పిలుచునంత వారు ♦ ప్రియముమీఱ
వరిగి శివునితోడ ♦ నభ్యవహారంబుఁ, జెంది పీఁడెములను ♦ జెందిరంత.

మ॥ పరమేశానునితోడ మాను లమరుల్ ♦ ప్రాలేయశైలేంద్రభా
స్వరసంయోజితనూత్నమంటపమహో ♦ చ్ఛ్రీప్రకారంబులన్
బరమాశ్చర్యమెసంగఁ గన్గొని మహా♦నందంబునన్ బొంగి య
గ్గిరిరాజేంద్రుని దివ్యసూక్తితతులన్ ♦ గీర్తించి రెంతేనియున్.

## —* సాయంకాల వర్ణనము *—

ఉ॥ అంత దినాంతమై యలర ♦ నర్యమ దేవుఁ డపూర్వదిక్సతిన్
సంతసమొప్పఁ జేర నది ♦ జానుగ మానికపున్ నివాళి న
త్యంతముదంబుతో నిడిన♦నారతనంబుల దీప్తితీరనాన్
వింతగ సాంధ్యరాగరుచి ♦ విశ్వవిమోహనమౌచు భాసిలెన్.
గీ॥ గగనమనుమల్లెపాదులోన ♦ గరిమ మెఱయ, విరియఁబూసిన పుష్పప్ర♦కరమనంగఁ
దారకాబృంద మొరతేని ♦ ధాళధళ్య, మెసఁగఁ దనరారె దశదిశ ♦ లెసక మెసఁగ.

గీ॥ తనదుప్రభునివివాహమం♦దనువుగా స, మస్తజనమరుదెంచిసం♦బరముఁగాంచు
చుండిరిఁకవారికందఱ♦కుబ్బుఁగూర్పఁ, గామురువుమీఱఁజందుర♦మాయమరె.

సీ॥ స్మరునాజ్ఞ భామినీ ♦ సమితిపై జాబిల్లి, జల్లిన వశ్యాభ ♦ స్మంబనంగ
కాలపూరుషుఁడు రం♦గచ్చంద్రియంత్రంబు*, నుండి జార్చిన వరి ♦ పిండియనఁగ
చారునిశాంగనా♦జఘనస్థలిన్ వారి, జారి కట్టినచల్వ ♦ చీరయనఁగ
దర్పకాగతివేళ♦ధరణీఁజంద్రుఁడు గూర్చి, నట్టిముత్యాలమేల్ ♦ కట్టనంగ

గీ॥ సమయభక్తుండు పార్థివ ♦ శర్వలింగ, మును శశిహిరణ్యకలశంబుఁ ♦ బూని దుగ్ధ
మర్థినభిషేకమొనరించెఁ♦ననఁగ మిగుల, వెన్నెలదనర్చె జగమెల్ల ♦ వెల్లివిరియ.

గీ॥ శైలమహిళామణుల్ శివక్ ♦ జక్కఁగా న, లంకరించి శివునితో వి ♦ లాసమెసఁగ
వాసమందిరమును జేర్ప ♦ వామదేవుఁ, డార్యఁజేకొని వేడుక ♦ లనుభవించె.

ఆ॥ అంత రజని దఱుఁగ ♦ నాకసం బెఱ్ఱనై, యందగించె దీప్తి ♦ కాంశువితతి
వెల్లనయ్యె వేఁడి ♦ వేలుపుపొడసూపి, మింటికెగసెఁ దమము ♦ తంటవాసె. 201

వ. మంగళవాద్యఘోషపురస్సరంబుగ నాలోకవైతాళికప్రార్థితుండై మహేశ్వరుండు వాసాగారంబుఁబాసి ప్రాభాతికక్రియలఁదీర్చుకొని జనావాసంబుఁజేర సంతతు మున్ను సుస్నాతులై ప్రాతర్విధులఁ దీర్చుకొని కైలాసగమనకాంక్షులై పరమేశ్వరాగమనంబుఁ బ్రతీక్షించుచున్న యధోక్షజాదిదేవాధ్యక్షులు మహేశ్వరునకుమ్రొక్కి ప్రయాణంబపేక్షింపుడు మహేశ్వరుం డంగీకరించినంతఁ గులాచలేశ్వరుండు దారసించి యిట్లభ్యర్థించె.

ఆ॥ పేదవారలనక ♦ ప్రియముతోఁ గొన్నిది, నములు దేవమునిగ ♦ణములతోడ
నాదుమందిరమున ♦ నామనం బానంద, మొందనుండి చనుట ♦ యొప్పు దేవ!

వ. ఇట్లు ప్రార్థించిన మీఁదట స్వల్పదినంబులుమాత్ర ముండి పరమేశ్వరుండు సకలగీర్వాణమునిచోదితుండై యొక్కనాఁడు జిగమిషఁ బూని సప్తర్షులను హిమవంతుని పాలికిం బంచినంత.

క॥ వారలు గిరివరునకుఁ ద, ద్ద్వారకు శివయాత్రఁ దెలుప ♦ దైన్యంబున న
వ్వారలు దుస్సహచింతా, ఘోరంబున నపుడు మూర్ఛఁ ♦ బడిరి బడలుచున్.

ఆ॥ కొంతవడికిఁ దుహిన♦కుధరుండు దెలివొంది, తనదు సతినిఁ దేర్చెఁ ♦ దా గిరీంద్ర
పత్నివేగ శివుని ♦ పాదంబులకుమ్రొక్కి, యిట్లువిన్నవించె ♦ హితవు మెఱయ.

* టిప్పణి:— యంత్రము - పిండిమొదలైనవి విసరెడు శిలాయంత్రము - తిరుఁగలి.

కవిరాజవిరాజితము
పరమకృపానిధి! ♦ పాలనసేయుము ♦ పార్వతి నెంతో కృ ♦ పామతివై
యరయుచు దోషస ♦ హస్రములందును ♦ నాదటనోరుపు ♦ నందు తగన్
బరఁగభవంబు భ ♦ వంబున నీపద ♦ భక్తి నిఁగాంచిన ♦ బాల విభూ!
నిరతము స్వప్నము ♦ నెక్కొనినన్ శివ! ♦ నీశుభనామము ♦ నేమరఁగన్.

సుగంధి. మేనయిట్లు చాలజాలి ♦ మీఱఁబల్కి కూఁతు నీ
శాను కప్పగించి కుండె ♦ జాలసేపు దీనయై
తా నగేంద్రుఁ డాపెకప్డు ♦ తాల్మిఁగూర్చి యంతయా
త్రానుకూలవుం బ్రయత్న ♦ మాచరించె ధీరుఁడై. 213

గీ॥ ప్రమథభూతగణములు సు♦పర్వవరులు, మునులుమున్నగువారలు♦ మోదమొప్ప
స్వగణములతోడఁబయనంబు♦సల్పియచటి,యుపవనముఁ జేరిశివులకై ♦యుండిరందు.

ఉ॥ అల్లునియింటి కాత్మసుత ♦ నంపఁగఁ జిత్తము గట్టిచేసి పో
ద్వల్లలితాంబరంబుల న ♦ నర్ఘ్యపుసొమ్ములఁ గూఁతు నద్రిరా
ట్ఫుల్లసరోరుహాక్షి గడుఁ ♦ బొందికయొప్ప నలంకరించి భా
సిల్లఁగ నుత్సవంబొనరఁ ♦ జేసెను బంధుసతీచయంబుతో.

## —* విప్రసువాసిని పార్వతికిఁ బతివ్రతాధర్మంబు లెఱింగించుట *—

గీ॥ అంతనొక పౌరవిప్రోత్త ♦ మాంగనామ, తల్లి మేనాత్మ మెఱిఁగి భూ♦ ధరకుమారిఁ
జేరిసాధ్వీవ్రతంబిట్లు ♦ చెప్పఁదొడఁగె, మంజుతరసూక్తిమాధురీ ♦ రంజితముగ.

ఉ॥ తల్లి! పతివ్రతావ్రతవి ♦ ధానముఁ దెల్పెదనాలకింపు రం
జిల్లెడు నీవ్రతంబె శ్రుతి ♦ శీర్షములందును ధర్మసూక్తులం
దెల్లెడ నుత్తమంబనియు ♦ నిశ్చితమంబని పేరుచెందె ము
న్నెల్లకులాంగనాజనము ♦ లీవ్రతమే యొనరించి రిమ్మగన్.

*మ॥ అల సావిత్రి యరుంధతీసతియు లో ♦ పాముద్ర శాండిల్యయున్
జలజావాసయు సంజ్ఞ భారతిసతీ ♦ స్వాహానసూయాశచీ
నలినాస్యల్ శతరూప మున్నగులస ♦ న్నారీవతంసల్ హిమా
చలుఁ జేపట్టినమేన యీవ్రతము ని ♦ చ్చల్ సల్పిరా రమ్మరో!

* టిప్పణి:— ముదం రాతీతి ముద్రా-రా ఆదానే - సానభవతీత్యముద్రా - విరహే పతి శుశ్రూషా లోపే. అముద్రా-అసంతుష్టా-లోపాముద్రా- ముద్రయనఁగా సంతోషముగలది - భర్తృ విరహకాలమందుఁ బతిశుశ్రూష లేమిచేత సంతసము లేనిదగుటచే లోపాముద్ర.

గురుబాల ప్రబోధిక.

అకారప్రశ్లేషవలన విశ్రమము చేయనైనది.

క॥ వారందఱు పతివ్రత, మారాధనచేసి మిగుల ♦ నవనీస్థలిపైఁ
బేరును బెంపును గాంచిరి, శ్రీరంజిల సకలలోక ♦ సేవ్యచరిత్రలై. 219

చ॥ ఒకసతి భానుమండలికి ♦ నుచ్చతరస్థలినుండె భర్తతో
నొకసతి దాఁ ద్రిమూర్తులను ♦ నుయ్యెల బాలురఁ జేసియూపె నిం
కొకసతి వింధ్యగర్వహర ♦ యోగుని జీవితరాజ్ఞియయ్యె వే
ఱొకసతి మిత్తి గెల్చె మఱి ♦ యొక్కతె భానుని నాగె నంబికా! 220

సీ॥ విభుఁ డారగించిన ♦ పిదపఁ దత్పరిశిష్ట, మర్థి భోజనము సే ♦ యంగవలయు
మగఁడు నిద్రించిన ♦ మఱియంత నిద్రించి, మునుముందుఁ దాన మేల్ ♦ కొనఁగవలయు
పెనిమిటి గొట్టుచోఁ ♦ బెనఁగక 'విభు! దయ, సేయుమా' యనుచు యా ♦ చింపవలయు
పతి దన్నుఁ బిలిచినఁ ♦ బనులన్ని వదలి సాం, జలిబంధముగఁ జేరఁ ♦ జనఁగవలయు

గీ॥ భర్త సెప్పినపనిని సం ♦ బరముతోడ, నాక్షణమునందె పూనిసే ♦ యంగవలయుఁ
దోడరి పూజోపకరణవ ♦ స్తువులనెల్లఁ, జెప్పఁబడకయె తాన యో ♦ జింపవలయు.

ఉ॥ మండనమున్ బొనర్పకయె ♦ మానిని భర్తను జూడఁ గూడ దా
మండనమొందఁ గూడదు కు ♦ మారిరో! దండ విభుండు లేనిచో
దండిగ భర్త దిట్టినను ♦ దా మది రోసమునొందఁ గూడదో
యండజయాన! వాకిటఁ గు ♦ లాంగన నిల్వఁగఁ గూడ దెన్నఁడున్. 222

మ॥ పరగేహంబుల కేగరాదు తమత ♦ త్త్వంబించుకే నొడ్ల కె
వ్వరికిన్ దెల్పఁగరాదు నాథువిడి ది ♦ వ్యక్షేత్రతీర్థానుసం
చరణంబున్ బొనరింపఁగూడ దుపవా ♦ సంబుల్ వ్రతంబుల్ నిజే
శ్వరనిర్దేశములేక సేయఁదగ దో ♦ చంద్రార్థబింబాలికా!

క॥ తీర్థార్థినియేన్ బతిపద, తీర్థంబును గోరిలవలయుఁ ♦ దెలివ సకలస
తీర్థంబులందె వెలయు య, థార్థంబిద్దాన సంది ♦ యము లేదంబా!

క॥ తివిరి సభాస్థలులకు ను, త్సవములకుఁ మగడు లేక ♦ చనఁదగ దెవ్వడే
నవసరములేక సుంతయు, ద్రవిణంబును వెచ్చపెట్టఁ ♦ దగదు కుమారీ!

గీ॥ తెంపుతో దేవపితృతి ♦ థిజనములకు, బంధుపరిచారభిక్షుగో ♦ వ్రాతమునకు
భోజ్యములనువిభాగించి ♦ పూవుఁబోఁడి, దానుబో సేయవలయుని ♦ త్యమునువినుము,

చ॥ పెనిమిటి పేదయైనఁ గడుఁ ♦ బెల్లుగ వ్యాధితుఁడైన వృద్ధుఁడై
నను గడుఁగుద్ధుఁడై యొనరి ♦ నఁ గొనెఱుతుంటరియైన వబ్జలో
చన విడువంగఁ బోలదిఁక ♦ సర్వవిధంబుల భర్త శ్రేయమే
యనుదిన మర్థిఁగోరుచుఁ బ్ర ♦ యత్నముసేయుట యొప్పు మానినీ!

గీ॥ హాయిగాఁ గూరుచుండి యే♦దో యభీష్ట, కేళిమైనున్న విభునిఁ దా ♦ వేళఁ గనక
లేశవుంబని కోసమై ♦ లేవదీయ, వలవ దెప్పట్ల సతికిఁ బ ♦ ర్వతకుమారి! 227

గీ॥ చెఱఁగు మాసిన మూణ్ణాళ్ళు ♦ చెలువ మగని
సముఖమున కేగి చూడఁగఁ ♦ జనదు తనదు
పలుకు పతివీనులకు వినఁ ♦ బడఁగఁ బలుకఁ
జనదు ముగ్ధేందుశేఖరు♦సాధ్వి! వినుమ. 228

క॥ నాలుగవ రోజున సుమతి, కాలంబున జలకమాడి ♦ గ్రక్కున మగనిన్
బాలించి కనుటయెంతయు, మే లటుగాకున్నఁ గమల ♦ మిత్రుఁ గనఁదగున్.

సీ॥ పరగ సిందూరంబు♦పసుపు కుంకుమను శ్రీ, చందనం బగరు క♦జ్జలము లాక్ష
తమ్ములంబును గమ్మ♦తావిపూల్ దువ్వెన, యద్దంబు గంకణా ♦ లందియలును
మాంగల్యతంతువు♦మట్టె లొడ్డాణంబు, ముంగర తాటంక♦ములును రత్న
ములపేరులును ముత్య♦ముల పేరులును జడ,కుప్పెలు సవరముల్ ♦గొప్పునగలు

గీ॥ రైకలును మేలిముసుఁగులు♦రాజముఖికి, నిత్యసేవ్యంబులై యొప్పు♦నెలఁత మగని
యాయురభివృద్ధికై వీని♦హర్ష మెసఁగ, సతము దాల్పఁగవలయుఁ బ♦ర్వతకుమారి!

ఉ॥ చాకెతతోడ నెప్పుడును ♦ స్వైరిణితోడ నుదక్యతో విభున్
బైకొని పోరుసేయుచెడు ♦ భామినితో విధవావధూటితో
జోకగ సర్వమున్ దొరఁగి ♦ జోగిగఁ గ్రుమ్మఱు నాతితోడుతన్
జేకొనరాదు విన్నఁకను ♦ జెల్మి కులాంగన లీశ్వరప్రియా!

గీ॥ ఒంటిగా నెందునిలుచుండు♦టొప్పదెపుడు, నగ్నయై తీర్థమాడఁజ♦నదు వెలఁదికిఁ
గడపఁ దిరుగలి రోలు రో♦కలిని సాన, రాతి నసిపీఁటఁ గూర్చుండ♦రాదు సతికి.

ఉ॥ అచ్చికబుచ్చికొప్ప మగఁ ♦ డక్కునఁ జేరిచి వేడ్కసేయఁగా
నచ్చట ముచ్చటల్ గనుచు ♦ హాయి మెయిన్ రహియించుచుండినన్
హెచ్చుగ నిక్కఁజెంది విభు ♦ నెల్లిదమాడఁగఁ గూడ దెంతయున్
నచ్చునటుల్ మెలంగవలె ♦ నాథుని నెమ్మది కెల్లప్రొద్దులన్.

గీ॥ భోగసమయంబునన్ దక్క ♦ పొలఁతి కెపుడు
ప్రౌఢిఁ జూపింపఁదగ దాత్మ ♦ పురుషు నెదుట
భర్తకెచ్చోట మోదంబు ♦ పరిఢవిల్లు
నందె యనురక్తయై సతి ♦ యమరవలయు. 234

క॥ పెనిమిటి సంతసమున నుండినఁ జేడియ సంతసమున ♦ నెగడవలెన్ గుం
దున వందురుచుండినఁ దా, నను బరితాపంబునన్ గ♦నుట దగుఁగొషయున్.

క॥ ఆపత్సంపత్తులయం, దోషికతో నొక్కపోల్కి ♦ నుండఁగవలయున్
గాఁపురము పేదమైనను, రాపొందక ధీరయగుచు ♦ రంజిలవలయున్. 236

గీ॥ ఉప్పు నేయియుఁ దైలాదు ♦ లెప్పుడేని, శూన్యమగుడుఁ బతివ్రతా ♦ సుందరాంగి
మగనితో నవిలేవని ♦ మనసునొచ్చఁ, జేయరా దాజ్ఞమింపఁ ♦ జేయరాదు.

ఉ॥ ఉన్నతపీఠమెక్కి సతి ♦ యుండఁగ రాదిఁక దుష్టసన్నిధిన్
బన్నుగ నిల్వరాదు తన ♦ భర్తకుఁ గాతరవృత్తిబోధనం
బెన్నఁడు సేయరాదు కడు ♦ హెచ్చుగఁ బెద్దలయొద్ద భాషణం
బున్నగు సేయరాదు పుడఁ♦బోండ్లకు భూధరరాజకన్యకా!

క॥ అరవిందభవునికన్నను, సరసీరుహనయనుకన్న ♦ శర్వునికన్నన్
గరమధికుఁడు దనవిభుఁడని, కరివరనిభయాన మెఱుఁగ♦గాఁదగు మదిలో.

ఉ॥ దవ్వులనుండి వల్లభుఁడు ♦ ధామముఁ జేరినయంతనే కడున్
జివ్వనఁదోయమార్చి రుచిఁ ♦ జెన్నగునన్నముఁ గమ్మపిష్టమున్
బువ్వులఁబోలు పుట్టములఁ ♦ బొందుగనిచ్చి విహారశయ్యపై
జవ్వని చేర్చి యూరువులఁ ♦ జక్కఁగనొత్తవలెన్ మహేశ్వరీ!

క॥ మితముగనొసంగుధనముల, సుతుఁడు మితం బొసఁగుఁదండ్రి ♦ సోదరుఁడటులే
మితముగనొసంగునిఁకఁదన, పతియొక్కఁడొసంగు నమిత ♦ భాగ్యముల నుమా!

గీ॥ విభుఁడె దైవంబు సతులకు♦విభుఁడె గురుఁడు, ధర్మతీర్థవ్రతములెల్ల ♦ధవుని కొలువె
యనుచు సర్వము విడనాడి♦యలరుఁ బోఁడి, విభుని నొక్కని భక్తి సే♦వింపవలయు.

సీ॥ పెనిమిటిఁ బాసి యో♦దనము మెక్కినయోష, మేషిమైచరియించు♦మేదినిపయి
పరునిన్ మరగి మరు♦పనికిలోనైనయు, క్రోలమలి ఘూకమా ♦ కోటరమున
భర్తదన్ గొట్టిన♦బదులు గొట్టిననారి, భూరిబిడాలమై♦పొడమఁబుడమి
పతితో జగడమాడి♦ప్రత్యుక్తినిచ్చిన, పొలతుక శ్వానమై ♦ పుట్టుభువిని

గీ॥ పరునిఁగ్రీగంటఁజూచిన ♦ పడఁతి గిల్ల, కన్నులొంది జనించు జ ♦ గంబునందు
నీవునీవని నాథుని♦నీతిమాలి, డెగడెడుగయాళి మూగమై♦తగజనించు. 243

క॥ ప్రాణంబు లేనిదేహము, మానుగ నెట్లశుచియగునొ ♦ మగనివిడినయ
జ్జానన యటు లశుచిత్వముఁ, బూనుననుచుఁ జెప్పశాస్త్ర♦ములు శివురాణీ!

క॥ ఆపెజనయిత్రి ధన్యయు, నాపెగురుఁడు ధన్యుఁడీధ ♦ రావాసముపై
నాపెపతి ధన్యుఁడెంతయు, నేపె పతివ్రతయొ పుడమి ♦ నిందునిభాస్యా!

క॥ పితృమాతృవంశజులునున్, బతివంశ్యులు సాధ్విపుణ్య ♦ భాగ్యంబున స్వ
ర్గతిఁజెంది మేటిభోగము, లతులితముగనొందఁగలరు ♦ హరువిరిఁబోఁడీ! 246

గీ॥ శీలభంగం బొనర్చిన ♦ చేడె మాత్ర, పితృకులమ్ములవారిని ♦ విభునికులము
వారినిన్ బడద్రోయు న♦వారణంబు, గా నధస్థలమందు శం♦కరవధూటి!

గీ॥ ఎచ్చటెచ్చటసాధ్వియా♦నింతియడుగు, లిధరాభాగమునుస్పృశి♦యించునెలమి
నచ్చటచ్చటఁబావనం♦బైసమస్త, దోషహారణక్షమంబయి ♦ తోఁచుఁబుడమి.

చ॥ పరమపవిత్రుఁడైన యల ♦ భాస్కరుఁ డాయమృతాంశుఁ డామరు
ద్వారుఁడగు గంధవాహుఁడు న ♦ వశ్యముగాఁ దమ శుద్ధిఁగోరి యి
ద్ధరను బతివ్రతాతనువుఁ ♦ దాము స్పృశింతురు నిక్కమింక న
ట్లురువుగ నాసచేయు శుచి ♦ యున్ సలిలంబులు సాధ్వితాఁకుకై.

క॥ ప్రతిగేహమందు లలితా, కృతు లింతులు చాలఁగలరొ ♦ గిన్ వినుము పతి
వ్రతయగు నాలు మహేశ్వరు, నతులితకారుణ్యసిద్ధి ♦ నమరున్ ధరణిన్.

క॥ గంగావగాహమును జే, యంగా దేహంబు పూత ♦ మగునట్టుల న
ట్టుంగాదె సాధ్విఁగన్గొని, నం గల్మషమవియుఁబావ ♦ నమగు నఖిలముల్.

క॥ పతిదేవత యుమ యాపెకుఁ, బతియగువాఁ డీశ్వరుండు ♦ పన్నుగనీదం
పతులను గొల్చుమనీషి ని, రతమిష్టములొంది పుడమి ♦ రాజిల్లుఁగడున్.

గీ॥ నిగమముపతివ్రతానారి♦యగునుబ్రణవ, మీశ్వరుఁడుక్షమసాధ్వియా♦నిగురుబోఁడి
తపముపశుపతి సత్క్రియా♦ధరనపాంసు,ల యువిదఫలంబు శివుఁడుక♦ల్యాణమూర్తి!

వ. ఇవ్విధంబున నావిప్రాంగన పతివ్రతాధర్మంబులును దన్మాహాత్మ్యంబులు నుపదే
శించి వెండియుఁ దద్భేదంబుల నెఱింగింపఁగడంగి యిట్లనియె. ఆర్యా! వినుము పతి
వ్రతలుత్తమ మధ్యమకనిష్ఠాధమ భేదంబులనాల్గు విధంబులఁ బరంగుదురందు. 254

ఆ॥ పతినిఁ దక్క నెపుడు ♦ పరపురుషునిఁగల, నేనిఁదలఁప కన్య ♦ నీక్షణంబు
చేయనట్టి సాధ్వి ♦ చెన్నగానుత్తమ, యనఁగఁజెల్లు నవని ♦ హరుమిటారి! 255

క॥ సుతుపలెఁ దోబుట్టువలెఁ, బితవలెఁ బెఱవారిఁగనుచుఁ ♦ బెనిమిటియంద
ప్రతిమమగు భక్తి నెఱపెడు, సతి మధ్యమయనఁగఁజెల్లు ♦ శైలవరసుతా!

క॥ వ్యభిచారము కులభామిని, కభిరూపము గాదటంచు ♦ నాత్మ నెఱిఁగి తా
విభుని భజింపుచు నుండిన, యుభయాన కనిష్ఠయనుచు ♦ నేర్పడుఁబుడమిన్.

క॥ పెనిమిటిభయంబునను గుల, జనులభయంబునను బరుని ♦ సాంగత్యము స
ల్పని వధు వధమాధమయని, యనుదురు ప్రాజ్ఞలెల్ల ధాత్రి ♦ నగరాజసుతా!

వ. ఇట్లనేక ధర్మసూక్ష్మంబు లెఱింగించి.

సీ॥ ఇత్తెఱంగునఁ బతిభక్తి ♦ నెఱిఁగినదువు, మమ్మరో! సర్వవేదప్రి ♦ యంబుగాఁగ.
వఖిలజగదంబ వీవతఁ ♦ డభవుఁడీకను, నినుదలఁచి సాధ్వులౌదురు ♦ నెలఁతలిలను.

వ. నేను లోకాచార ప్రకారం బింతవట్టు సైరించితి నని యూరకున్నంతఁ బార్వతి పరమామోదంబునొందె. మేనకయు సమయోచితం బారసి ధైర్యంబు చేసి ప్రయాణసన్నాహంబుఁ గావించి పార్వతి నాలింగనంబు నొనర్చి కన్నీరు నించె. పార్వతియుఁ దల్లిన్‌గాంచి కృపావచనంబు లుచ్చరింపుచుఁ బెల్లుగ నలందురెఁ గుసుమకోమలయగు పార్వతి రోదనంబుఁగాంచి బాంధవ స్త్రీలును నాగరకాంతలును దేవపత్నులు మున్నగువారలెల్లరు చింతాదంతురాననలైరి సర్వజగత్ప్రభుండగు మహేశ్వరుఁడు నవ్వారి దుఃఖభరంబుఁజూచి తానును గంటఁదడిఁబెట్టె.

గీ॥ ఇట్టిసమయంబునందుఁదు♦హినగిరీంద్రుఁ, డాత్మజులతోడనరుదెంచి♦యార్యఁగాంచి
వెక్కసంబగుదుఃఖంబు ♦ వెలయనాపెఁ, దనదువక్షమునన్ జేర్చి♦కొని రయమున.

ఉ॥ తల్లిరో! యెట్లువోయెదవు ♦ తల్లినిఁ దండ్రిని నన్నదమ్ములన్
బెల్లుగ బంధువర్గమును ♦ వేశ్మమునున్ విడనాడి యిప్పుడి
య్యెల్లరునిన్నుఁ బాయఁగల ♦ రెట్లు కనుంగొను చిన్నవోయె నీ
యిల్లును బట్టణం బిపుడె ♦ యేనెటువైతు వచింపు మమ్మరో! 262

గీ॥ అనుచుఁ గన్నీరుదొరఁగమ♦ హావ్యసనము, తోడవందురుచున్నట్టి ♦ తుహినభూమి
ధరున కధ్యాత్మతత్త్వంబుఁ ♦ దద్జ్ఞుఁడగువు, రోధ బోధించె నాత్మని♦రూఢిదనర

ఉ॥ పార్వతి తల్లిదండ్రులకుఁ ♦ బన్నుగఁ బెద్దల కెల్లవారికిన్
గర్వములేక మ్రొక్కి కడుఁ ♦ గన్నుల నీరొలుకంగఁ జెంతలన్
సర్వపురంధ్రు లద్రివరు ♦ సాధ్వియుఁ బుత్రులుఁ దద్వధూమణుల్
పర్వతశేఖరుండును గృ ♦ పన్ విలపించిరి కించితోఁగడున్. 264

ఆ॥ విప్రులంత మరల ♦ విజ్ఞానబోధంబు, చేసి లగ్నవేళఁ ♦ జెప్పనపుడు
ధైర్యమొంది తుహిన ♦ ధరుఁడు రప్పించెఁ బ, ల్లకినిఁ గాలిమొక్క ♦ టకయివేగ.

## —* శివుఁడు పార్వతీదేవిన్ దోడ్కొని కైలాసంబున కేగుట *—

ఆ॥ పుణ్యకాంత లుమకు ♦ భూరిగా దీవెన, లిచ్చి యందలంబు ♦ నెక్కఁజేసి
రార్య మరల గురుల♦కందఱికిని మ్రొక్కి, పయనముఁ బొనర్చె♦భర్తవెంట.

క॥ రాజోపచారముల గిరి, రాజు సుతకుఁ దనరఁజేసి ♦ రాణదలిర్పన్
బూజార్హములగు వస్తువు, లోజఁ గూరిచి యొసంగి ♦ యుద్యత్ప్రేమన్.

గీ॥ తాను మేనయుఁ గొడుకులుఁ♦దత్సుతులును, నందొఱు విహారవనివఱ♦ కరుగుదెంచి
వీడుకొల్పిరి బహువిధ♦విభవమెసఁగ, శివుఁడు చేరెను రజతాద్రి♦శిఖరమునకు.

క॥ అందలి గణవరు లమితా, నందముతో నెదురువచ్చి ♦ యధికోత్సవ మొ
ప్పం దుహినగిరిసుతాశివు, లం దగఁ జేర్చిరి మనోజ్ఞ♦లలితభవనమున్.

వ. అత్తఱి మహేశ్వరుం డార్యాచిత్తంబునందలి గురుజన వియోగజన్యంబగుకుందుఁ
బాఁపంగడంగి, 270

గీ॥ పార్వతినిఁజూచి యిట్లనెఁ♦బ్రాణదయిత!, చూచితే వెండిగట్టు ల♦ద్భుతమ్ములకుఁబట్టు
తలఁపువచ్చెనె యిచ్చోటు♦తలఁపువచ్చె, నే మనవిహారగోష్ఠి ప♦ర్వేందువదన!

క॥ హెచ్చగు పచ్చలతిన్నెలు, నచ్చపు వజ్రింపుకోన ♦ లల్లవె కనుమా!
మెచ్చులు గులుకుచు నడలన్, గ్రిచ్చుఱ నిటువచ్చెఁజూడు♦కలికి! నెమళ్ళన్.

క॥ నెత్తావులఁ బుత్తెంచుచుఁ, బొత్తుఁదెలుపు పారిజాత ♦ భూజములవియే
గుత్తులు గుత్తులు పండ్లివె, యెత్తుమనుచుఁ జూపుఁగాంచు♦మెలకల్పతరుల్. 273

పరిహర్షవృత్తము } ఈవనముఁగనుమ రామా! జీవన మతిథికి భామా!
పావనము సుముని రామా, సేవనముల గుణధామా! 274

గీ॥ ఈనమేరుద్రుమసమూహ♦మెలమిఁజేరి,తొండములుసాచియూచి వే♦దండచయము
పుష్పవృష్టినిగూర్చెఁ జ♦మూరునయన! తావకాగమనమున సం♦తసముఁజెంది.

గీ॥ కర్ణికారములివె వర ♦ వర్ణనీతి
లకము! తిలకింపుము సువర్ణ ♦ మకుటధరము
లనఁగఁ జెలువొందు హరిచంద ♦ నవివహంబు
లవియె కను మీప్సితార్థస ♦ మావహములు. 276

క॥ చమరీసముదయమలరఁగ, భ్రమరీరవమల్లదే యు ♦ పశ్రుతిగాఁగన్
సమరీతినాలపించెద, రమరీబింబోష్ఠులిందు ♦ హాయిఁగవీణన్. 277

క॥ పొందమ్ములఁ గలువలఁదగి, నందఁపురాయంచగముల ♦ హాళహాళిరవళిన్
విందులకుఁ బిలుచుఁగొలఁకులు, విందుపుగాదే యొయారి! ♦ వేడుకనిచటన్, 278

క॥ రంగులరంగుల తామర, లుం గలువలు నలరు నంచ ♦ లున్ క్రౌంచములున్
రంగులరంగుల చిలుకలు, పొంగిపడెడునందుఁజూడు ♦ పుష్కరిణు లుమా! 279

క॥ అని నొడివిన విని శంభున, కనిశంబును దయితయైన ♦ యఖిలేశ్వరి యి
ట్లనె దేవ! మఱతునే న్యూ, తనమేదిట నేను గోత్రి ♦ దానినె నీకున్. 280

క॥ వినను లోకాచారముఁ, బూని నడువవలయుఁ గానఁ ♦ బుణ్యచరిత! నీ
వా నియతిఁ దలఁచి కడుదయ, తో నడుపుము కార్యమెల్లఁ ♦ దుష్టిమెసంగన్.

—* శివుఁడు దేవత లందఱికిఁ గట్నము లిచ్చి పంపుట *—

వ. అనిన మహేశ్వరుండు సుధాధారాస్వాదంబగు ప్రాణప్రియావచనంబున కమందా
నందంబునొంది యిట్లనియె. దేవీ! 282

క॥ భూషణములు శ్రుతులకుఁ బరి, పోషణములు దృఢవికాస ♦ బోధాగతికా
శ్లేషణములు సుఖసిద్ధికిఁ, దోషణములు మదికి నీ మృ ♦ దులభాషణముల్.

వ. అనుచున్నంత గణపాలురు నానావిధమధురభోజ్యపదార్థంబుల నాయితంబుచేసి వడ్డింపుడు నందఱు ప్రియంబంది భుజియించి విడెంబులనుగొని మహేశ్వరునకు నమస్కరించిరి. పరమేశ్వరుండును యథాయోగ్యంబుగ నందఱకుఁ గానకదుకూలాంబరమణిమయభూషణంబుల నుపాయనంబులిచ్చి లోకాచారంబు ననుసరించి హరివిరించులకును వసిష్ఠాదిబ్రహ్మర్షులకును వందనంబుచేసె. బ్రహ్మర్షులును బితామహాచ్యుతులును లౌకికమర్యాద ననుసరించి పార్వతీపరమేశ్వరుల కాశీర్వచనంబు లొసంగిరి. వివాహంబున కరుదెంచినవారందఱును హరివిరించనాదులతోఁ బరమేశ్వరానుజ్ఞఁ గొని తమతమ నివాసంబుల కరిగిరి. మహేశ్వరుండును గణపాలుర మందిరద్వారంబందు నియమించి తాను మహామాయయగు నార్యతో విహారమందిరంబుఁ జేరి సుఖంబుండె. ఇట్లఖిలకల్యాణకారణంబును, శోకఘ్నంబును, నాయుర్ధనవర్ధనంబును బ్రమోదకరంబును సకలజగజ్జేగీయమానంబును నగు పరమేశ్వరకల్యాణంబు మీకామోదంబునఁ జెప్పఁబడియెనని సూతుండు శౌనకాది మునీంద్రులకిట్లనియె.

—* ఫలశ్రుతి *—

క॥ ఈ సుచరిత్రం బద్భుత, మై సర్వారిష్టశమన♦మై యాయుష్యం
బై సర్వకామదంబై, భాసిల్లు యశస్యమగుచుఁ ♦ బాఠకుల కిలన్. 285

సీ॥ ఎడఁబాటులేక పెల్లడరుచుండెడిదీర్ఘ, రోగియైనమనుజుఁడా ♦ రోగ్యమొందు
జోడునేకుఱక సం ♦ క్షోభంబులోనున్న, పురుషుండు పెండ్లాడుఁ ♦ బుణ్యసతిని
సంతానమేలేక ♦ చాలఁగృశించు దం, పతులకిష్టంబుగా ♦ సుతుఁడుపొడముఁ
గుడువఁగూడును గట్టఁ ♦ గోకయులేని శు, ష్కదరిద్రుఁ డతులభా♦గ్యంబుఁ జెందు

గీ॥ ప్రబలదుఃఖాకులుండగు♦వాఁడు దుఃఖ, శాంతినిఁ గొను నపమృత్యు ♦ చకితుఁడైన
వాఁ డకాలపుమృత్యువు♦వాతఁబడక, మను నెవండీకృతినిఁ జది ♦ వినను వినను.

క॥ వినుపించు నెవఁడు నిత్యము, జనములకీ శివవివాహ ♦ చరితము శుచియై
విను నిత్య మెవఁడు శుచియై, చనఁగల రవ్వారు తుదకు ♦ శివునిపదమున్.

వ. అనిచెప్పినంత శౌనకాది మహామును లవ్వలికథను జెప్పుమనుటయు

మ॥ చరగుర్వీశ్వరపూజనాభిరతభా ♦ స్వద్దివ్యచేతోంబుజా!
హరనీహారపటీరహారశరద ♦ భ్రాదభ్రకీర్తిప్రభా!
నిరతాన్నోదకదానతోషితజనా! ♦ నిత్యప్రియాలాపనా!
యరుగానోచితవర్తనా! హరితగో ♦ త్రోద్భూత! భాస్వద్గుణా!

గద్య. ఇది శ్రీ బుధజనవిధేయ ముదిగొండ నాగవీరేశ్వరనామధేయ ప్రణీతంబైన శివపురాణంబందలి పార్వతీఖండంబునఁ బంచమాశ్వాసము సంపూర్ణము.



శ్రీ శివాభ్యాన్నమః

# శ్రీ శివపురాణము

## కుమారఖండము.

### ప్రథమాశ్వాసము.



నిగమాగమసముదిత
మానితధర్మాచరణస ♦ మాహిత హృదయా!
నానాశిష్యౌఘతమో
భానూ! శివమూర్తి! వీర ♦ భద్రారాధ్యా!

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె.

సీ॥ గిరిజఁ దోడ్కొని కైలాస ♦ గిరికి శర్వుఁ, డరుగుదెంచి సుఖంబుగ ♦ నచట నేమొ
నర్చె నాకెఱిఁగింపుము ♦ నలినసూతి!, యనుచు నారదుఁ డడుగ ని ♦ ట్లనియె నజుఁడు. 2

క॥ నారద! చెప్పెదవిను చె, న్నార దయావిభవుఁ డైన ♦ యభవుని చరితన్
దారకదనుజవధార్థము, దారకు నసమానశక్తి ♦ ధరుఁ గనుటయునున్. 3

క॥ సురలెల్లరుఁ దమనగళుల, కరుగుడుఁ జంద్రార్ధమౌళి ♦ యమరుల బాధల్
పరిహారము సేయఁగ మది, నరసి కృపావివశుఁడగుచు ♦ నంత రయమునన్. 4

చ॥ అనుపమదివ్యరత్నముల ♦ కాస్పదమై యలరారుచోటఁ జం
దనరససేకభాస్వదవ ♦ దాతమణీమయమైనచోట నూ
తనవికచప్రసూనదళ ♦ తల్పవిభాసితమైనచోటఁ బా
వనతరుమంజరీప్రకర ♦ వాలసమీరము లొప్పుచోటునన్,

క॥ భోగసుఖదోపకరణ, శ్రీగరిమ నెసంగుచోటఁ ♦ జేతోజక్రీ
డాకేతుల కర్హతరమై, రాగిల్లుచోటన్ మనోహ ♦ రంబగు చోటన్.

క॥ గిరిరాజరాజతనయను, బరమేశ్వరుఁ డతనుభోగ ♦ పారీణుండై
సురతక్రీడలఁ దేల్చెను, సరవిగ నొకవేయిదివ్య ♦ సంవత్సరముల్, 7

క॥ శివదేహస్పర్శంబున, శివుఁడు ప్రమోహంబుఁ జెందెఁ ♦ జిరకాలం బా
శివుదేహస్పర్శంబున, శివయుఁ బ్రమోహంబుఁ జెందు ♦ జిరకాలంబున్. 8

ఆ॥ చాలఁగాల మిట్లు ♦ జరుగఁగా నద్రిజా, శంకరులకు నొక్క ♦ క్షణమువోలె
నరిగె నంత దివ్య♦వరులు మేరువుఁ జేరి, గోడఁగఁదోడఁగిరవుడు ♦ గోడవయడర.

చ॥ చలనమొకించుకేన్ గనక ♦ స్వాత్మమునందు రమించు నీశ్వరుం
డిల మనకార్యసిద్ధికయి ♦ యే గిరికన్యను బెండ్లియాడి వె
గ్గలముగ నామెతో సతము ♦ కామసుఖంబులఁ జెందుచుండె వే
ల్పుల కడగండ్లఁ బాప నొక ♦ పుత్రకుఁ గాంచకపోయె నింతకున్. 10

క॥ అనియిటుల శైలకన్యా, మనసిజహరసంగతుల న ♦ మరకులతిలకుల్
వినుచుఁ దడవౌట కెంతయు, వనరుచు గుమిఁగూడి యొక్క ♦ వాసరమందున్.

## —* దేవతలు విష్ణుమూర్తికిఁ దమకష్టంబులఁ జెప్పికొనుట *—

సీ॥ అజునిఁదోడ్కొని నారాయ ♦ ణాంతికమును, జేరి వందన మొనరించి ♦ భూరిదుఃఖ
భరముచేఁ గడు పొగులుచుఁ ♦ బరగ నిట్లు, చెప్పికొని రార్తమూర్తులై ♦ శ్రీవిభునకు.

క॥ హరి! వేయిదివ్యసంవ, త్సరములనుండియును శివుఁడు ♦ శైలతనయతో
సురతక్రీడలఁ బెనఁగెడు, విరమింపఁడు మాన్పఁడకట ♦ వేల్పుల వెతలన్, 13

ఆ॥ పుండరీకనయన! ♦ పోలునే నీవును, దయను దప్పి మమ్ముఁ ♦ దలఁపకుంట
రమ్ము పోదమిపుడు ♦ రాజతగిరి కుపా, యమ్ము నరయు శివుద ♦ యన్ బడయఁగ. 14

వ. అనిన నిలింపులకు వైకుంఠుండిట్లనియె.

చ॥ అలమట మానుఁడింకఁ గరు ♦ ణాత్మకు శర్వు భజింపుఁ డిప్పుడా
యలఘుననుగ్రహంబున ర ♦ యంబుగ భద్రముగల్గు నీశ్వరున్
గొలిచెడు వారికెప్డు సమ ♦ కూరు శుభంబులు వాయు దుర్గతుల్
పొలియుదు రాయతాసలని ♦ భుల్ రిపువీరు లుదగ్రకోపనుల్. 15

గీ॥ తీవరము సేయఁదగ దిప్డు ♦ దివ్యులార!, కాలపరిపాక మొందిన ♦ కార్యమెందు
సిద్ధిఁగాంచుఁ దదన్యంబు ♦ చెడును దీని, నెఱిఁగి యోరిమిఁ గావింపుఁ ♦ డిద్ధమతులు!

వ. వెండియును.

గీ॥ శంకరుం డిప్డు సంభోగ ♦ సక్తుఁడగుచు, ననవరతము రతంబుల ♦ నలర నేఁడు
భంగమొనరింపఁజాలెడు ♦ ప్రభుఁడె పూర్ణ, వర్షసాహస్రమున రతి ♦ వదలు నిజము.

క॥ శక్తిశివుల సంయోగము, యుక్తం బది సకలవిష్ట ♦ పోత్కారసుఖముల్
వ్యక్తముగఁగూర్చు నిది సు, వ్యక్తము పరికించి పాయుఁ ♦ డాత్మవ్యథలన్.

వ. మఱియును.

క॥ స్త్రీపురుషసురతభంగవుఁ, బాపంబున కెవ్వఁడేనిఁ ♦ బాల్పడు భువినా
కాపురుషుఁ డొందు నిరయము, స్త్రీపుత్త్రులఁ గోలుపోవు ♦ సిద్ధంబు సురల్!

క॥ మున్నల దూర్వాసుం డను, సన్నుతుఁడు ఋషీశ్వరుండు ♦ శక్రుని రంభా
పన్నగవేణీరతిసం, పన్నుని విడఁదీసి కుడిచెఁ ♦ బ్రీతిఫలము వెసన్. 20

గీ॥ భార్యగడతేఱవేఱొక ♦ పడఁతిఁబెండ్లి, యాడి యొకవేయిదివ్యహా ♦ యనములకువి
యోగజనితజ్వరముఁబాసి ♦ యూరటఁగొనెఁ, బలువురిబ్బంగిగాఁ బ్రతి ♦ ఫలముఁగనిరి.

క॥ సకలమునిపేకసాధ్యం, బకలంకముగాఁగ సృష్టి ♦ కాధారం బీ
యొకటియెకద! యిద్దానికి, వికలతఁగూర్పంగఁ దగునె ♦ విబుధప్రవరుల్! 22

వ. కావున త్వరపడక మీ మీ నివాసంబుల కరుగుఁడు. సంపూర్ణ వర్ష సహస్రంబందుఁ కైలాసంబున కేగి యమ్మహాదేవుని వీర్యంబుఁ బుడమిపయిం బడఁజేయుండవుడు స్కందుఁడనఁ గుమారుండు పొడము దాన మన కభీష్టసిద్ధియగునని జనార్దనుం డుపదేశించి యంతఃపురంబున కరిగె. బ్రహ్మాదులెల్లఁ దమనివాసంబుల కేగి రంతఁ గొన్నినాళ్ళకు శక్తిశక్తిమంతుల సంతతవిహారంబునకు సశేషగజకచ్ఛపంబగు ధరాతలంబు పీడితంబై జగత్ప్రాణంబగు సమీరణంబు స్తంభింపుడుఁ ద్రిలోక జనంబు భయాక్రాంతంబై పితామహున్ జేర నతండు నారాయణున్ బురస్కరించికొని దేవతలతోఁ గైలాసంబుఁ జేరుడు నంతఁ గమలాకాంతుండు శివద్వారంబుననున్న గణపాలురకు మ్రొక్కి యిట్లనియె.

క॥ శంకరకింకరులారా!, సంకటహారులార! శర్వ ♦ సాన్నిధ్యం బా
తంకమున వనరు మాకిట, శంకింపక కూర్పుఁడయ్య ♦ సత్వరము కృపన్. 24

వ. అనిన గణాధీశ్వరు లిట్లనిరి.

క॥ హరి! వినుము సర్వలోకే, శ్వరుఁడు హరుం డిందు మమ్ము ♦ స్థాపించి మహే
శ్వరితో రిరంస నంతః, పురమున నివసించె నిపుడు ♦ పోరా దటకున్. 25

వ. అనిన విని చేయునదిలేక చింతాగ్రస్తుండై నారాయణుండు శివగణంబులకు వినతుండై మ్రొక్కి యెక్కించుక సెలవొంది దేవతలతోడఁ బ్రతీహారంబందుండియే యార్తవాక్కులతోఁ దారస్వరంబున నిట్లఖిలలోకేశ్వరు నుద్దేశించి మొఱపెట్టుకొనియె. 26

## —* విష్ణ్వాదులు కైలాసంబున మణిభవనద్వారమందుండి మొఱవెట్టుకొనుట *—

సీ॥ ఏల వందారుకల్పక! ♦ యిప్పటికిని, మాదు వెతలనుడిప్పఁగ ♦ మఱచియుంటి
వసురపీడితబృందార ♦ కాళికీవె, శరణ మేజాగుసేయక ♦ సాఁకుమీఁకను. 27

క॥ సురసిద్ధసాధ్యమనుజా, సురయక్షపతంగదంద ♦ శూకనికరభా
సురగీతపుణ్యచరితా!, సురచితసకలాబ్జజాండ! ♦ చూడుమిఁక దయన్. 28

వ. ఇట్లు బహుప్రకారంబుల వినుతిపూర్వకంబుగ దేవతలంద ఱొక్కయెలుంగున
మొఱవెట్టుకొనుటయు నెక్కుడు కోలాహలధ్వనియగు టాలించి భక్తవత్సలుం
డగు పరమేశ్వరుండెఱింగి సంభోగవిరతిన్ జేయనెంచి పార్వతీభయంబున సంకో
చించియు నట్టకేలకు సురతంబుమాని గృహద్వారంబుఁ దఱియఁ జొచ్చి బృందార
కులకు దర్శనం బొసంగి యిట్లనియె. 29

## —* శివుఁడు దేవతలమొఱవిని యోగముచే వీర్యంబు జార్చుట *—

సీ॥ ఏమివచ్చితి రిచటి కుపేంద్ర! పద్మ, సూతి! నైలింపగణముతో ♦ సుఖమె మీరు
చిన్నవోయిన మొగములు ♦ చెన్నుదఱిగి, కానిపించుచునున్నవ ♦ కృతము సెప్పుఁడు.

వ. అనిన గోవిందప్రముఖులగు బృందారకులంద ఱిందుధరపాదారవిందంబుల కానం
దంబుతో వందనంబు లొనర్చినయంత. 31

గీ॥ దూయమాన మనంబుతోఁ ♦ దోయజాక్షుఁ, డిట్టులనియె మహేశ! నీ ♦ కెఱుఁగరాని
వృత్తమున్నదె సకల హృ ♦ ద్వేశ్మవాసి, వగుచు మమ్మడుగంగ నీ ♦ కవసరంబె?

చ॥ కొమరునిఁ గాంచకుంటి విటు ♦ ఘోరపురక్కసు బారిఁ జిక్కి పా
రము గనరాని దుఃఖమున ♦ రాపిడిఁ జెందుచు నుంటి మింక శీ
ఘ్రముగఁ గుమారుఁ గాంచు మము ♦ రక్షియమున్ బొనరింపు దుర్మదో
ద్యముని వధింపు తారకునిఁ ♦ దత్పరివారము లోకరక్షకై. 33

చ॥ అనిన హరుండు చిత్తమున ♦ నక్కటికంబును జెంది యిట్లనెన్
వినుము ముకుంద! మామకపు ♦ వీర్యము మస్తకమందె యున్నదై
నను గ్రహియించువారలఁ గ ♦ నన్ దగు నిప్పుడె యోగశక్తి మో
చన మొనరింతునం చపుడు ♦ జార్చెను శుక్రము స్వర్ణవర్ణమున్. 34

చ॥ అనలుఁడు నిర్జరానుమతి ♦ నా శివవీర్యమునున్ గపోతమై
యొనరఁగ మ్రింగె నంత నను ♦ రోత్తములందఱుఁ గొంతకొంత భా
దన మొనరించి రష్ట వసు ♦ ధాధరపుత్రి విభుం డటన్ విలం
బన మొనరించు టారసి జ ♦ వంబునవచ్చి కనెన్ సురావళిన్. 35

వ. కాంచి యంత జగదంబ వారొనర్చిన యకార్యంబు నెఱింగి కుపితయై యిట్లనియె.

## —* పార్వతీదేవి దేవతలను శపించుట *—

ఉ॥ ఓరి దురాత్ములార! వినుఁ ♦ డో యమరాధములార! మీరిటుల్
నారమణున్ హరున్ గొలిచి ♦ నాదు విహారము వమ్ముచేసినా
రోరిమిఁదక్క స్వార్థపర ♦ తోన్నతి నన్నుడికింపఁజేసి యే
తీరున శ్రేయమొందెదరు? ♦ దీర్ణతరార్తిమణుంగకే ధరన్. 36

క॥ నను వంధ్యను జేసిన యఘ, మున నిప్పటినుండి మీదు ♦ పొలఁతులు చూలున్
గొనకుందురుగావుతఁ గడు, వనరుదు రెంతయును బుడమి ♦ వంధ్యాత్వమునన్.

గీ॥ ఇట్లు నిర్జరులను శపి ♦ యించి పావ, కునిఁ గనుంగొని యత్యంత ♦ కుపితయగుచు
శాపమిడె నోరి! శివవీర్య ♦ భక్షి! సర్వ, భక్షివగు దీవు భువి జుగు ♦ ప్సన్ దొరంగి.

చ॥ అని యిటు శైలకన్యక హు ♦ తాశనుతో సకలామరవ్రజం
బును శపియించి నాథుఁ గొని ♦ పోయెఁ దదీయవిహారమందిరం
బున కటమీఁద శంకరునిఁ ♦ బొందికఁగొల్చి గణేశుఁడన్ గుమా
రునిఁగని తాపమున్ విడె మ ♦ రుద్గణ మెల్లరు బాగు బాగనన్. 39

గీ॥ అక్కతను సర్వమును వేఱో ♦ కష్టచెప్ప, వాఁడ నిపుడు వినుం డిఁక ♦ బాహులేయ
జన్మచరితంబు దైతేయ ♦ సంహృతియును, దేవతలకెల్ల దుఃఖంబు ♦ తీఱుటయును.

ఉ॥ వేలుపు లంత నీశ్వరుని ♦ వీర్యము మ్రింగుటచేతఁ జాఁగఁగాఁ
గాలుచు నిల్వఁజాలక జ ♦ గద్గురు శంకరుఁ గూర్చి యెక్కుడౌ
జాలిదనర్పఁ బ్రార్థనము ♦ సల్పఁగ స్వల్పితకల్పశాఖి య
క్కాలహరుండు వాకిటికిఁ ♦ గ్రచ్చఱవచ్చి కనెన్ నిలింపులన్. 41

వ. అంత దేవత లీశ్వరున్ గాంచి యాతురులై మ్రొక్కి యిట్లనిరి,

ఉ॥ దేవ! మహానుభావ! భవ ♦ దీయ మహోజ్జ్వల వీర్యమున్ మహా
శాపశచిత్తతన్ మెసవఁ ♦ జాలదహించుచునుండె నద్ది మా
కీవిధమున్ భరింపఁ దర ♦ మెట్లు కరంబు భరంబు తండ్రి! నీ
వీ వగఁ బాపి యెట్లయిన ♦ నేలుము బాలశశాంకశేఖరా! 42

క॥ లేకున్నఁ జత్తుమిత్తఱి, లోకేశ్వర! నీవుగాక ♦ లోకంబున నీ
నాకనివాసులయలజడిఁ, బోకడఁచు ఘనుండొకండు ♦ పొసఁగునె యెందున్.

ఆ॥ అని దహింపఁబడుచు ♦ నార్తిచేఁ దహతహ, పడుచునున్న నాసు ♦ పర్వవరులఁ
గాంచి వేగనపుడు ♦ కారుణ్యమెదనెంచి, భక్తవత్సలుండు ♦ పలికె నిటుల.

క॥ ఓహరి! యోచతురానన!, యోహరిహయ! యోయమర చ ♦ యోత్తములారా!
మోహమునఁద్రినిన వీర్యము, బాహిరముగఁ గ్రక్కుఁడవని ♦ బాముదొలంగున్.

చ॥ అనుడు నిలింపు లంత వడి ♦ నా శివవీర్యముఁ గ్రొక్కి నద్ది కాం
చనమయి యంబరం బెగసె ♦ సర్వసుపర్వులు బాముఁ బాసి శ
ర్వుని వినుతించి గీములకుఁ ♦ బోయిరి పావకుఁ డొక్కఁ డప్డు శం
భుని యనుకంపఁ జేకొనక ♦ భూరితరార్తి వహించి భీతిమై. 46

ఆ॥ శివునిఁ జేరఁబోయి ♦ చేమోడ్పు రచియించి, నేరమికిని సైచు ♦ నిష్ఠఁ జూపి
దాహమార్పు దేవ! ♦ దాసుఁడఁ గానొకో, కరుణఁ బఱపుఁ మెగ్గఁ ♦ గడపు మికను.

—* అగ్నిదేవుని క్షోభం బారసి శివుఁ డుపాయము సెప్పుట* —

వ. అని యిట్లు దీనుండై యర్థించిన యగ్నిన్ గని కనికరంబుతో మహేశ్వరుండు యోజించి యిట్లనియె. 48

క॥ అనుచితగతి నాశేత, స్సును మెక్కితివట్లు వెనుకఁ ♦ జూడక యగ్నీ!
ఘనతరదాహం బిపుడి, ట్లొనఁగూడిన దైనఁ దలఁకు ♦ నుడిగి వినుమికన్. 49

వ. ఎలనగవుతో.

క॥ కొలఁది దినంబులలో ను, జ్జ్వలతరమీ వీర్య మొక్క ♦ చక్రిస్తనిని
ర్మలగర్భమొందు నాతఁడు, మలమట చను నీదుదాహ ♦ మాఱు హుతాశా! 50

ఉ॥ నావుడు మ్రొక్కి యాత్మసద ♦ నంబునకున్ జని యీశ్వరోక్తులన్
భావమునందు నిల్పికొని ♦ భామ యదెవ్వతో నాదు ప్రాణర
క్షావహమూర్తి యంచు మదిఁ ♦ జాలఁ దమిన్ దలపోయుచుండఁగా
దైవనియుక్తి సప్తముని ♦ తల్లజులొక్క యహంబునందొగిన్. 51

ఉ॥ చేడెలతోడ స్వర్ధునికిఁ ♦ జేరి ప్రియంబున నందు మజ్జనం
బాడి సమస్త దివ్యులకు ♦ హవ్యము లీగికి సప్తజిహ్వునిన్
బోడిగఁ జేర్చి యాహుతులఁ ♦ బొందుగఁ దన్ముఖమం దొసంగఁగాఁ
దోడనె యగ్ని వేల్పులకుఁ ♦ దుష్టిగ వాని నొసంగె నయ్యెడన్. 52

—* అగ్ని సప్తర్షులభార్యలఁ జూచి మోహించుట *—

ఉ॥ ఆసమయంబునందు రుచి ♦ రాంగవయస్సువిలాసహాసశో
భాసముదీప్త లామునుల ♦ భార్యలు మానుల క్రేవలన్ సము
ల్లాసవిభాసితాకృతి మె ♦ లంగ ననంగశరాతతార్తి వి
త్రాసితచిత్తుఁడై వడి స ♦ దాగతిమిత్త్రుఁడు బాళిమీఱఁగన్. 53

ఉ॥ ఎందును నేనిఁ గాంచితినె ♦ యిట్టి యపూర్వవిలాసవిస్ఫుర
త్సుందరకామినీమణులఁ ♦ జూచిన నేమిఁక భాగ్య మిట్టిప
ర్వేందునిభాస్యలన్ గలిసి ♦ యింపుజనింప రమింపకున్న నా
డెందము కుందడంగునె ఘ ♦ టిల్లునె మోహ మభంగభంగిగాన్. 54

ఉ॥ అన్నవవిల్తువిభ్రమము ♦ లాకృతులన్ ధరియించి యిట్టు లా
సన్నములయ్యెనో యనఁగఁ ♦ జక్కని సన్నని కౌను లందమా
నున్నత పీవర స్తనము ♦ లుద్ధతచారునితంబబింబముల్
కన్నులఁదన్ను ముద్దులమొ ♦ గంబులు గల్గినవార లీ సతుల్. 55

ఉ॥ ఏనిఁక వీరి కౌఁగిళుల ♦ నెవ్విధిఁ జేకొనువాఁడ నెట్టు లీ
మానిను లాత్మనాథుల స ♦ మర్థులఁ బాసి ననున్ వరింతు రె
ద్దాన మదీయమా నతను ♦ తాపము పాయు నిఁకేమొనర్తు నా
మానస మెక్కుఁ డార్తిమెయి ♦ గ్రుగ్గుచునున్నది యెక్కుతీరుగన్. 56

గీ॥ అనుచునకాంతలనుస్మరి♦ఖాగ్రములను, డాయఁగానెంచు మునులదృ♦ఢప్రదీప్త
తేజములఁ గాంచి చకితుఁడై ♦ దీనదశను, జెంది యేమి యొనర్పఁగఁ ♦ జేవదక్క.

క॥ మునివరుల హోమకృత్యం, బనువుగ నెఱవేఱ నగ్గి ♦ యాస్థలి విడి పా
వనమైనయొక్క వనతల, మును జేరి కడున్ విరాళిఁ ♦ బొగులుచు వేగన్.

వ. అందు జలంబుల మునింగి ప్రాణంబులఁ బాపికొన సమకట్టుడు నంతఁ బరమ పతి
వ్రతయును దత్పత్నియు నగు స్వాహాదేవి విభునియాశయం బెఱింగి తన యోగ
బలంబున సప్తర్షులలో నొక్కఁడగు యంగిరసుని కళత్రంబురూపంబుఁ జెందివచ్చి
పావకున కిట్లనియె. 59

* స్వాహాదేవి యార్గురు మునిభార్యలరూపంబున నగ్నిదేవునితోఁ గ్రీడించుట *

క॥ మునితల్లజుఁడగు నంగిర, సునిదారను మున్న నిన్నుఁ ♦ జూచినది మొదల్
కొని యేను నాదు చెలులును, ఘనతరమగుమన్మథాగ్నిఁ ♦ గ్రాఁగితిమి విభూ!

చ॥ చెలువుఁడ! నీపయిన్ దగిలె ♦ చిత్తము నాకును నా వయస్యలా
చెలువల కట్లు నీమదియుఁ ♦ జెన్నుగ మాయెడ బాళిఁగాంచుటన్
దెలిసి భవత్సదేశమును ♦ దెంపునఁ జేరినదాన మించుపో
కల వెరవేకిఁబోకడఁచి ♦ కామసుఖంబులఁదన్పు నన్నిఁకన్. 61

గీ॥ నన్నతనుసౌఖ్యములఁదేల్చి ♦ నాదుచెలుల, నట్లుదన్పుము భవదధీ ♦ నాత్మలగుచు
వారలున్నారిచట హవ్య♦ వాహ! నీవిఁ, కన్యమెంచినఁబ్రాణంబు ♦ లాసపడము.

వ. అనినంత

క॥ కడుఁబేద పెన్నిధానముఁ, బడసినయటు లాపెఁగాంచి ♦ పావకుఁడు మదిన్
గడుమురిసి కామకలలన్, దొడరి సుఖించెను గరంబు ♦ తుష్టి యెసంగన్. 63

వ. అనంతరంబందు స్వాహాదేవి తక్కిన యేవుర రూపంబులతో నగ్ని భట్టారకునిఁ
గలిసి సుఖించి-యవల నరుంధతీ రూపర బలపడకున్న మిన్నకుండె. పిఠిాపాలా

త్రుండును దనయందున్న మహేశ్వరవీర్యంబంతయు మునిపత్నుల రూపంబున నున్న స్వాహాదేవియందుంచి దాహంబుఁబాసె. స్వాహాదేవియును భర్తృవిముక్తంబును నతిదుస్సహంబునునగు పారమేశ్వరవీర్యంబు నిజగర్భంబందు ధరింపఁ దక్క శ్వేతాద్రి శిఖరంబున జార్చి వేదనఁ బాసె. శ్వేతాద్రియు నవ్వేఁడిమి కోడి మరుత్సాహాయ్యంబున నద్దాని వియన్నదినిఁ బడఁద్రోచె.

క॥ గంగయు దుర్భరమైన భు, జంగవిభూషణుమహాగ్ని ♦ సమధికతేజ
స్సంగమున కోర్వఁజాలక, భంగంబుల దానిఁ గాశ ♦ వనిఁ బడఁజిమ్మెన్. 65

వ. అందమ్మహాతేజంబు పెద్ద కాలంబునకుఁ బరిపాకంబగుడు.

## — * శ్రీ కుమారస్వామి జననము * —

క॥ శ్రీమార్గశీర్ష సితష, ష్ఠీమానితసమయమందు ♦ శివతనయుఁడు తే
జోమండితసర్వాశా, స్తోముఁడు జన్మించె సకల ♦ సురలుప్పొంగన్. 67

క॥ చారుమణిమాళులొప్పెడు, నాఱు మొగంబులును నాయు ♦ ధాఢ్యములగు రెం
డాఱుకరంబులు రవిశత, భారంజితగాత్రమమరి ♦ బాలుండలరెన్. 68

శా॥ శ్రీమంతుండయి సుందరుండయి జగ ♦ చ్ఛ్రేయోవహుండై సుర
స్తోమాపద్వినివర్తనక్షముఁడునై ♦ శూరావతంసుండునై
భీమాత్యుత్తమవిక్రమాస్పదుఁడునై ♦ విస్ఫూర్జితాశావ్రజం
బై మృత్యుంజయనందనుం డలరె దై ♦ త్యాత్మంబు లల్లాడఁగన్. 69

క॥ దివినుండి పుష్పవర్షము, లవిరళగతిఁ గురిసి రమరు ♦ లత్యద్భుతమై
భవమొప్పఁగ సంగీతో, త్సవముల గంధర్వవరులు ♦ సల్పిరి వేడ్కన్. 70

వ. అంత.

చ॥ జనులు మునీంద్రగేహినులు ♦ సప్తరసజ్ఞ వరించి నచ్చి యి
వ్వని సురతంబులొంది రొయిక ♦ పాపనిఁ గాంచిరనన్ మునీశ్వరుల్
మనములఁ గించనొంది యువ ♦ మానవతిన్ దమ పత్నులన్ రయం
బున విడనాడి రాసతులు ♦ పొక్కఁగ భూరివిషాదవేదనన్. 71

గీ॥ ఆత్మనాథులచేఁ బరి♦త్యక్తలైన, మునిసతులఁ గాంచి యగ్నిభా ♦ మిని వనరుచు
మునులకడకేగి నేన మీ♦బోట్లబోటి, బోటినై యలరితి నా వి♦భుసముఖమున.

వ. కావున.

క॥ అకలుషచరిత్రలగు నా, త్మకళత్రంబులను బాయఁ ♦ దగునే మీరల్
సుకృతాత్ములార! వేగఁ గి, నుకమాని కొనుండు గేహి♦నుల జనములరన్. 73

క॥ అని బ్రతిమాలిన విని తమ, మనముల నిక్కంబెఱిఁగియు ♦ మానివరులు భూ
జనుల దురుక్తుల కాత్మం, బున రోసి గ్రహింపరైరి ♦ పొలఁతుల మరలన్. 74

## —* షట్కృత్తికలు కుమారునియొద్దఁజేరి స్తన్యంబు లిచ్చుట *—

వ. అంత నా యతివలు.

గీ॥ గాంగతీరంబునన్ శర ♦ కాండమందుఁ
బొడమిన కుమారుఁ గాంచఁగఁ ♦ బుణ్యసతుల
చనుమొనలు పాలుచేపుడుఁ ♦ జక్కనపుడు
బాలునకుఁ బాల్గుడువఁ బ్రేమ ♦ భరితలగుచు. 75

గీ॥ అందఱొక వేళయందె స్త♦న్యంబొసంగ, రాఁ గుమారకుఁ డాఱు వ♦క్త్రములతోడ
నాఱుగురుకృత్తికలమదుల్ ♦ హరుసమొందఁ, బాలుఁద్రావెను లౌకిక♦లీల మెఱయ.

వ. అపుడు జగన్మంగళవిగ్రహుం డగు నక్కుమారుఁ గాంచి యవ్వార లిట్లనిరి.

ఉ॥ అన్న! కుమార! మేము కుల ♦ టాకృతి నగ్గికి నిన్నుఁగంటిమం
చు న్నెఱిమీఱి దుర్జనులు ♦ చూడక నాడిన నిందకై విభుల్
బన్నములాడి మమ్మిటులఁ ♦ బాసిరి మాకిఁక దిక్కు నీవె మ
మ్మెన్నికమీఱఁ దల్లులుగ ♦ నెంచి కృపామతిఁబ్రోవు మిమ్మగన్. 77

ఆ॥ అనుడు శంభుసూనుఁ ♦ డనియెను వారల, కనఘ లీరుతల్లు ♦ లాత్మజుండ
మానుఁడింకఁ వెతలఁ ♦ బూనుఁడు సంబరం, బంబలార! గుణక ♦ దంబలార! 79

వ. అని వగనుడిపి వారలనోదార్చి తనచెంతనుంచికొని కరంబు గారవించుచుండె.

ఉ॥ అత్తఱిఁ బద్మజుం డతిశ ♦ యమ్మగు హర్షముతోడ వచ్చి యా
చిత్తజవైరిపుత్రునకుఁ ♦ జెల్వొదలిర్పఁగ జాతకర్మముల్
హత్తినవేడ్కమై సలిపె ♦ నగ్నియు బాలునిఁ డారసించి దీ
వ్యత్తరశక్తి శక్తినిడె ♦ హర్షభరంబున మిన్నుముట్టుచున్. 81

వ. అంత హిరణ్యగర్భుం డాబాలకున కివ్విధంబుగా నామకరణం బొనర్చె. 82

సీ॥ సురలకై ముక్కంటి♦శుక్రంబుస్కందమై, యవతరించుటస్కందుఁ♦డనఁగఁబరఁగు
నగ్గిగర్భంబునం ♦ దమరి జన్మించుట, నగ్నిభవుం డను ♦ నాఖ్యమును
గంగామహానదీ ♦ గర్భజాతుండౌట, గాంగేయుఁడనెడు వి ♦ ఖ్యాతిఁజెందు
శరవణస్థలమున ♦ జననంబునొందుట, శరజన్ముఁడనియెడు ♦ సంజ్ఞఁగాంచు

గీ॥ కృత్తికలపాల్గొనుటఁగార్తి ♦ కేయనామ, మొందువారలుపలుపురై ♦ యొప్పుకతన
బాహులేయుండనుచుఁగడుఁ♦బ్రథనెసంగుఁ, బార్వతీనందనుఁడుజగ♦త్పావనుండు.

వ. మఱియును

గీ॥ దేవసైన్యంబునకునెల్లఁ ♦ జేజమెసఁగ, నాయకుండయి దేవసే ♦ నాని యగుచు
నాత్మకీనుచమూరక్ష ♦ నాథ్యుఁడై కు,మారుండనుచునొప్పె మేరుకో ♦ దండసుతుఁడు.

వ. వెండియు

క॥ ధారుణిఁ గుజనులఁ గూల్చి కు, మారుండను నామధేయ ♦ మండితుఁడై వి
స్తారముగ నెమలిపై సం, చారము సేయుచు విశాఖ ♦ సంజ్ఞన్ బడయున్. 85

వ. ఇఁకను గ్రౌంచాచలంబు భేదించి క్రౌంచదారణుం డనియును మహాసేనతో
నొప్పి మహాసేనుండనియును దారకాసురుఁ బరిమార్చి తారకజేత యనియును
నివ్విధంబుగ ననేకాహ్వయంబుల నలంకరించునని వాగీశుండు నిజనివాసంబున
కరుగుడు నంత బాలుండు దినదినప్రవర్ధమానుండై. 86

మ॥ ఒకనాఁ డాయలికాక్షునందనుఁడు లీ ♦ లోల్లాసకేళీవశా
త్మకుఁడై శ్వేతనగంబుఁ జేరి యటఁ బ్రో ♦ ద్యన్మత్తమాతంగయూ
థకరంబుల్ పెనవేయుచున్ బటుమృగేం ♦ ద్రవ్యూహదీవ్యత్సటా
ప్రకరంబుల్ గొని స్కంధమెక్కి నిబిడ ♦ ప్రౌఢోద్ధతిన్ దిర్గుచున్. 87

ఉ॥ మున్ను పురత్రయంబును స ♦ మున్నతశైఖరిఁ గాల్చి దానఁ జే
రెన్నికమీఱు చాపమట ♦ నీశ్వరుఁ డుంచుటఁజూచి యొక్కచో
నున్న తదున్నతంపువిలు ♦ నుద్దవిడిన్ గొని యెక్కువెట్టి తా
నున్నతమౌ తదద్రిమకు ♦ టోజ్జ్వలశృంగముఁ ద్రుంచె బెళ్ళునన్. 88

వ. అంతఁబోక.

## —* క్రౌంచగిరి భేదనము *—

క॥ క్రౌంచమహీధ్రము నొక్కయు, దంచత్తరతీవ్రదుర్ధ ♦ రాశుగమున భే
దించి మహాహూతాస్యైక, ప్రాంచన్నద మమరనార్చెఁ ♦ బ్రలయాభ్రగతిన్. 89

క॥ దిక్కుంభికుంభనిచయం, బుక్కఱి భేదిల్లె నుదధు ♦ లుక్కటఁగలఁగెన్
గ్రిక్కన రిక్కలు డుల్లిన, వక్కుంభిని వడఁకెఁ జకిత ♦ యగుచు రయమునన్.

వ. అంత.

గీ॥ క్రౌంచగిరిగహ్వరమునవ ♦ సించియుంచు, ఘోరరాక్షస కోటులు ♦ దారనినద
ముప్పతిల్లఁగ బాలుపైఁ ♦ గుప్పతెప్ప, లుగశరంబులఁగురిసి యా ♦ ర్వఁగ నతండు.

క॥ ధీరుఁడై వజ్రనిష్ఠుర, నారాచకఠోరధార ♦ నక్తంచరవి
స్తారనికరములఁజెచ్చెర, మారణము ఘొనర్చె ధరణి ♦ మండల మదురన్. 92

ఉ॥ అంత నిలింపు లెంతయుఁ భ ♦ యంబు రయంబును జెంది కుంది భా
స్వంతులకోటులన్ బటుని ♦ జద్యుతి మీఱఁగఁ జాలువానిఁ గా
లాంతకసూను నెమ్మనము ♦ లందు నెఱుంగఁగలేక వే మరు
త్వంతునిఁ జేరఁబోయి యిటు ♦ పల్కిరి యుల్కుచు నేకకంఠులై. 93

చ॥ విను మమరాధినాథ! యొక ♦ విక్రమధుర్యుఁడు వాలుఁ డీ జగం
బున జనియించి యంతనె య ♦ పూర్వఘనప్రథమానశౌర్యవ
ర్ధనుఁడయి సర్వసత్త్వముల ♦ దర్ప మణంపుచు నార్చుచున్నవాఁ
డనికిఁదొడంగి వానిఁ బరి ♦ మార్పుము తేర్పుము భూజనంబులన్. 94

గీ॥ క్రౌంచగిరిఁ బాయకుండు ర♦క్షఃకులంబు, నెల్లఁబొల్లానరించె బం ♦ హిష్ఠమైన
యన్నగంబును భేదించె♦నంతకన్న, మున్న శ్వేతాద్రిశిఖరంబుఁ ♦ బుడమిఁగూల్చె.

క॥ ఇక సురలచేవఁ గనఁగ న, చకితుండై వచ్చు నిటకు ♦ సరగున మున్నీ
వె కడంగి భంగపఱుపుము, ప్రకటితభుజశౌర్య మది వి♦భాసిలఁగ విభూ!

## —* కుమారస్వామి మహేంద్రుని జయించి ప్రాణదానంబు సేయుట *—

క॥ అన విని యాతండును గిం, డునుమీఁదును గనక కడిఁది ♦ దోర్మదమునఁ బా
వనిదారసించి యశనిన్, గాని యురమున వేసెఁ జండ♦కోపనుఁ డగుచున్. 97

చ॥ అశని శివాత్మజన్మహృద ♦ యంబును దాఁకిన యంత మొక్కవో
యె శివకుమారు వక్షమున ♦ నీద్యబలుండు విశాఖుఁడన్ రిపు
ప్రశమనుఁ డుద్భవించె నిరు ♦ పక్కలయందును శాఖనైగమా
ఖ్య శుచిరుచుల్ జనించి విపు ♦ లాగ్రహవిగ్రహులై రయంబునన్. 98

క॥ వారు ముగురు గుహుఁడును బృం, దారకనాథుని వధింపఁ ♦ దలఁపడ నతఁడున్
ధీరతఁగోల్పడి యడలి కు, మారున్ శరణం బడిగె స ♦ మంచితఫణితిన్. 99

ఆ॥ అంత శంభుపుత్రుఁ ♦ డతిదయామతి హరి, హాయుని తప్పిదంబు ♦ నవలఁద్రోచి
ప్రాణదానమొసఁగి ♦ పరమహర్షంబున, నరిగె గాంగతీర ♦ మతిరయమున. 100

చ॥ అచటఁ గుమారు రాకకయి ♦ యాత్రము నొందుచునున్న కృత్తికా
విచికిలగంధు లాగుహుని ♦ వేగని సంతసమొంది ధారలో
ల్కుచుఁ గుచఁచేఁపుదుగ్ధములఁ ♦ గూరిమితోఁ గుడుపారనిచ్చి మె
చ్చుచుఁ దనివార ముద్దుఁగొను♦చున్ ముదమొందుచు నుండిరెంతయున్. 101

గీ॥ ఇవ్విధము గొన్నిషుస్రంబు ♦ లేగనంత, సర్వజగదేకరాజ్ఞి తు ♦ షారశైల
రాజనందన యొకనాఁడు ♦ రాజమౌళి, తోడఁగొలువున్న వేళ సం ♦ తోసమొదవ.

చ॥ కరములుమోడ్చి స్మేరముఖ ♦ కంజముతో విభుఁగాంచి సత్కృతు
ష్కరమహిళాజనంజవవి ♦ కారనిరాకరణాఢ్యులైన భా
స్వరతరదివ్యయోగులకు ♦ నైతము దుర్లభమూర్తి యైన యీ
శ్వరు నిను భర్తగాఁగొని య ♦ పారమహోన్నతిఁ గంటి నీకృపన్. 103

చ॥ అతులతపస్సమాధినియ ♦ తాత్ముఁడవై మరునిన్ దహించి యీ
తతనిజభోగభంగుల ను♦దాత్తత నొప్పెడు నీవు నామనం
గతి రతులొందుచున్ బ్రిబల ♦ కాముకరీతిఁ జెలంగుచుండ దు
ర్మతు లమరాధముల్ రతిని ♦ మాన్పిరి స్వార్థపరాయణాత్ములై. 104

గీ॥ లోకకల్యాణకారణం♦బై కరంబు, మెఱయు నీతేజ మది నా యు ♦ దరమునందుఁ
జెందక భువిన్ బడియె నేమి♦చేసిరో ను, రలు మహాత్మ! యమోఘవీ♦ర్యంబునపుడు.

సీ॥ మోఘమైయెందుడిందదు ♦ పుత్రుఁడుదయ, మందియుండుమ తెంచేని♦ యనఘచరిత!
అరయుతర్జించి భర్జించి ♦ యమరవరుల, నాదుపుత్త్రికుఁజెప్పింపు ♦ నాథ! యిటకు.

—* శివుఁడు దేవతలను గుమారుజాడలడుగుట *—

ఉ॥ నావుడు శంకరుండమర ♦ నాథుల మానులఁ బిల్వఁజేసి తా
నీవిధమొప్పఁగా నడిగె ♦ నెల్లరునున్ వినుఁ డేను నాఁ డప
త్యావహమైన తేజమును ♦ నాదటఁజేపితి యుష్మదర్థమై
మీవశమయ్యె నయ్య దటు ♦ మీఁదటిమాట నెఱుంగఁ జెప్పుఁడీ! 107

క॥ ఎటఁబోడమె నాదునందనుఁ, డెటఁబెరుఁగుచునుండెఁదేజ ♦ మేమయ్యెను మీ
రిటులెఱిఁగింపక దాఁచినఁ, గుటిలత యడఁగంగ శిక్షఁ ♦ గూర్చెద నిపుడే. 108

గీ॥ అని కినుకదోఁప దృఢముగా♦నడుగ దివ్యు, లడలి యొండొరులంతంత♦ నరసికొనుచు
నొడయునిన్ గాంచియొక్కొక♦రుక్కుదక్కి, తడఁబడుచునిట్లుపల్కిరి ♦తథ్యముగను.

వ. అందు విష్ణుండిట్లనియె.

క॥ గురునిందసేయునట్టిఁడు, గురుదారరతంబు సల్పు ♦ కుత్సితుఁడు మృషా
కరవచనుఁడు నీశుక్రము, నిరవుగ నాచ్ఛాదపఱచు ♦ నీశ్వర! వినుమా! 110

వ. ఇంద్రాది లోకపాలకులిట్లనిరి,

గీ॥ ప్రబలపాపం బొనర్చిన♦పాతకునిచె, లిమిఁగొని నిరంతరమును బు ♦ డమిఁజరించు
వాని దారుణపాపంబుఁ♦బడయునీదు, శుక్రమునుదాఁచినట్టిఁడు♦ శూలపాణి! 111

వ. తక్కుంగల సుపర్వులిట్లనిరి.

గీ॥ పట్టుదలతోడ నెవ్వఁడు ♦ ప్రతినఁజేసి, పూర్తియొనరింపఁజాలక ♦ పోవునట్టి
వాని పాపఫలంబుఁదా♦నూను నీదు, వీర్యమును మాటుచేసిన ♦ వెడఁగువుడమి.

వ. దేవపత్ను లిట్లనిరి.

ఉ॥ ఎవ్వతె యాత్మభర్తను య ♦ థేచ్ఛగ దూషణమున్ బొనర్చెఁడా
నెవ్వతె యన్యునిన్ వలచి ♦ యిక్షుశరాసనకేళిఁ గూడు నిం
కెవ్వతె సంతు పెన్మిటియు ♦ నెవ్వరు లేకయె యేకమై మనున్
జవ్వనియద్ది తావకల♦సత్తరతేజము దాఁచె నీశ్వరా!

వ. బ్రహ్మపుత్త్రిలగు వసిష్ఠాదు లిట్లనిరి.

సీ॥ జగతి నీతేజ మెవ్వఁడా ♦ చ్ఛాదనంబు, చేసె నవ్వాఁడు రూఢిగా ♦ శివ! భవత్స
మర్హణం బొనరింప న♦నర్హుఁడగు న, నర్హుఁడగు నీదుభక్తజ ♦ నార్హణమున.

—* అగ్నిప్రముఖులు శివునకుఁ గుమారుని జాడలు చెప్పుట *—

వ. అగ్ని యిట్లనియె.

మ॥ పరమేశా! భవదీయవీర్యమును దీ ♦ వ్యద్యామినీభాస్వరో
దరమం దుంచి రయంబునన్ హృదయసం ♦ తాపంబుఁ బోనాడితిన్
భరమా నీదురితంబు సైఁచుటకు నీ ♦ పాదాంబుజాతంబులన్
గరమర్థిన్ భజియించువాఁడఁ గనుమీ ♦ కారుణ్యభావంబునన్. 115

వ. స్వాహాదేవి యిట్లనియె.

ఆ॥ భర్తృనిహితమైన ♦ భాస్వరవీర్యంబు, నేనతాల్చి యోర్వ ♦ నేర కజ్జ
నాద్రిశిఖరతలము ♦ నందు విడిచితిని, నంతమీఁద నెఱుఁగ ♦ నభవ! నేను.

వ. శ్వేతాద్రి సమీపించి యిట్లనియె.

ఉ॥ పావకదేవి జార్చిన వి ♦ భాస్వరమా భవదీయవీర్యమున్
దేవర! తాల్పఁజాలక స ♦ దేశమునన్ బ్రవహించు స్వర్ణదిన్
నే వగతో మహాబలుని ♦ నిండగుసాయముతోడఁ జిమ్మితిన్
గావుము నన్ దయామతి! న ♦ కార్య మొనర్చినవాని బాలిశున్. 117

వ. వాయుదేవుండిట్లనియె.

క॥ శైలవరుప్రార్థనంబున, జాలిన్ గొని తావకాతి ♦ శయవీర్యము గం
గాలహరిఁ జిమ్మితిని నే, నాలరినై నన్నుసయిపు ♦ మయ్య! మహాత్మా! 118

వ. స్వర్ణదియిట్లనియె.

ఆ॥ దేవ! తావకీన ♦ దేదీప్యమానాతి, దుర్ధరోరువీర్య ♦ దుర్భరోగ్ర
వేదనన్ దపించి ♦ వీచుల శరవణం, బందుఁద్రోచితిని ద ♦ యాళు! కనుము!

వ. అంత వసుమతియిట్లనియె.

గీ॥ శరవణంబందుఁ జేరిన♦చటులతేజ, మునఁగుమారుండుపొడమె షణ్ముఖుఁడుద్వాద
శకరుఁడుద్యత్సహస్రభా ♦ స్వస్మరీచి, మండలుఁడు బాలచంద్రమో♦ హాళివినుము.

వ. అనంతరంబ భాస్వంతుం డిట్లనియె.

గీ॥ శరవనిన్ బుట్టి యేడ్చుచు♦స్వచరణాంగు, ళినిఁగుడుచుచున్న లోకమో♦హానునినీదు
తనయునిన్ గాంచిచాల సం♦తసముఁ జెంది, యీశ! దివసావసానమా♦ కేఁగితిఁబయి.

వ. ఆ వెంటఁ జందురుం డిట్లనియె.

గీ॥ కృత్తికలు వచ్చి శిశుఁగాంచి♦కేరిముద్దుఁ, గొనుచు స్తన్యంబొసంగిరి♦కుతుకమొప్ప
జేయియం దేను నొకపది♦జెండుఘటిక, లవజుకుండి కనుంగొంటి♦శివ! యరయుము.

వ. రాత్రి యిట్లనియె.

క॥ తెలవాఱువఱకుఁ గృత్తిక, లలరుచు కనుగందునందు ♦ నధికప్రేమా
కులలై కాచుచునుండిరి, తెలిపితి నేఁ గన్నవిధము ♦ దివిషన్మౌళీ! 123

వ॥ సంధ్య యిట్లనియె.

గీ॥ బదరికాశ్రమభూమికి♦బాలునెత్తి, కొని చని ప్రియంబుతో వారు♦నొమరుఁబోలె
నతులవాత్సల్యమమరఁగా♦నందునీదు, కొమరుఁ బెంచుచునుండి రే♦కొదవలేక.

వ. వాసరం బిట్లనియె.

క॥ అసమాన ప్రేమమెయిన్, బిసరుహదళనేత్రి లట్లు ♦ పెంచుచునున్నా
రసమశరహర! భవత్సుతు, నసమానవిభావిరాజి♦తాద్భుతగాత్రున్. 124

వ, విధాత యిట్లనియె.

శా॥ దేవాధీశ్వర! నీదుపుత్రునకుఁ బ్రీ♦తిన్ జాతకర్మంబులన్
నే విధ్యుక్తవిధిన్ బొనర్చి మునిప♦త్నీస్తన్యపానాంచితుం
డై వర్ధిల్లుటఁ గార్తికేయుఁడను ది♦వ్యాభిఖ్యయున్ దేవసే
నావాల్లభ్యము నొందువాఁడవుట నే ♦ నాన్యాఖ్యయున్ గూర్చితిన్. 126

వ, ఇఁక నిట్లే కొన్ని యన్వర్థంబులగు నాహ్వాయంబులన్ బిలిచితి ననుడు నంతనారద
మునీంద్రుండిట్లనియె.

చ॥ వినుము మహేశ! నీసుతుఁడు ♦ విక్రమధుర్యుఁడు శ్వేతపర్వతం
బున నొక తుంగశృంగమును ♦ భూమిపయిన్ బడనేసెఁ గ్రౌంచభే
దన మొనరించె నందమరు ♦ దానవకోటులఁ జక్కడంచె ను
క్కున నెదురైన వాసవునిఁ ♦ గొంకక కింకరుఁ జేసె వాసిగన్. 128

వ. అదరుచు నింద్రుండిట్లనియె.

ఉ॥ నీసుతుఁ డంచు వేల్పులను ♦ నెట్టనసాఁకెడుదట్టుఁ డంచు నే
వాసియెఱుంగలేక పెఱ♦వారలు సెప్పిన కిల్బిషోక్తులన్
రోసముఁజెంది పోరుటకు ♦ రోజుచుఁబోయి తదాజి నాజగ
ద్భాసురతేజు చేతఁబడి ♦ ప్రాణముదానముఁ గొంటిఁదత్కృపన్. 119

చ॥ అనవిని శైలరాట్తనయ ♦ హర్షముతో నవరత్నరాసులన్
గనకమునన్ ధనంబుల న ♦ ఖండముగానొసఁగెన్ మహీసురా
గ్రణులకు వాణి యచ్యుతుని♦రాణియు రోహిణియున్ బులోమజా
ద్యనిమిషపత్నులున్ ద్రవిణ ♦ మల్లియొసంగిరి విప్రకోటికిన్. 130

వ. అంత జగత్ప్రభుండు తనయునియుదయాభ్యుదయవార్తల కానందించి యానిమేషంబున నాత్మజునిఁ దోడ్తేర వీరభద్రాద్యాత్మీయులను నందికేశ్వరమహాకాలాదిగణనాథశ్రేష్ఠుల నింకఁ బ్రమథభూతగణంబుల ననేకకోట్లను బుత్తెంచిన నవ్వారలు వేగంబున బదరీకాననంబుఁజేరి యందలి షట్కృత్తికాశ్రమంబునకుఁ బరివేషంబొనర్ప నవ్వారలుగాంచి చకితలై గుహుఁజేరి యిట్లనిరి.

గీ॥ కొడుక! లెక్కింపరానట్లు♦ఘోరసైన్య,ములుమనకుటీరమునుజుట్టెఁ♦గలయఁగాంచి
తే? మహాభయమిట్టులే♦తెంచెఁగడఁగి, యేమిసేయఁగఁగలవార♦ మిందుఁజెపుమ!

వ. అనినంతఁ గార్త్తికేయుం డవ్వారల కిట్లనియె.

చ॥ వెఱవకుఁ డమ్మలార! రణ ♦ వీరులు ధీరు లిఁకెందఱేని స
త్వరము దురంబుసేయుటకు ♦ వచ్చిరయేని యుదగ్రజాగ్రదు
ద్ధురభుజదర్ప మేర్పడఁగఁ ♦ దూల్చెదఁ బేల్చెద వాహినీతతిన్
గరము దిరంబుఁజెంది కుతు ♦ కంబున నుండుఁడు మీర లీయెడన్. 133

## —* నందికేశ్వరుఁడు కుమారునిఁ గైలాసంబునకుఁ దెచ్చుట *—

వ. ఇట్లు కుమారుండు సెప్పుచున్నంత.

గీ॥ ఇంతలో నందికేశ్వరుం ♦ డెలమికలిమిఁ, గార్త్తికేయునిఁగాంచి ద♦గ్గఱి యనువునఁ
గూరుచుండి కడుంగూర్మి ♦ గూరనిట్లు, పలికెఁబలుకులఁజక్కెర ♦ లొలుకనపుడు.

గీ॥ అన్న! విను కృత్తికామాత ♦ లాలకింపుఁ, డఖిలలోకాధినాథుఁడౌ ♦ నభవుఁడిటకుఁ
బనిచె మము మిమ్ముఁదోడ్తేరఁ♦బార్వతీకు, మార! పయనంబుసేయు ము♦దారలీల.

వ. నీవు పార్వతేయుండవుగాని కార్త్తికేయుండవు గావు.

క॥ దేవతలకార్యసిద్ధికి, నై విశ్వేశ్వరునివీర్య ♦ మార్యవినాగాఁ
దా వెలువడఁగా నంది, వావిర్భావంబుఁ జెంది ♦ తయ్య కుమారా! 136

ఉ॥ కావున నీదు తేజ మది ♦ కప్పఁగ శక్యమె యెవ్వఁడేని నిన్
జే నహియించి దాఁచఁగల ♦ చేవఁగనున్ గలహంస యానమా
భావినిఁ గూల రాజిలున ♦ పన్నుగఁ గృత్తికలేడ వారి ప
ర్ణావసథంబులందు విమ ♦ లాత్మక! నీవు వసింపు కేసగున్. 137

క॥ రాజతగిరి నిఖిలామర, రాజతతాస్థానభూమి ♦ రాజకిరీటుం
డోజఁ గొలువున్నవాఁడట, కోజననుత తేజ! కదలు ♦ ముత్సాహమునన్. 138

క॥ గొనములకును దేజములకు, ననయము పోషించు నిన్ను ♦ నరయని వారల్
వనజంబులతో నొక్కెడ, మునికినమరు కప్పలనఁగ ♦ నొప్పఁగ గాదే! 139

వ. అని చెప్పిన నందికేశ్వరునకుఁ గుమారుం డిట్లనియె.

గీ॥ అన్న! త్రైకాలికజ్ఞాని ♦ వరయుమీవు, జంతువులు కర్మమునకర్హ ♦ జన్మమొందుఁ
గృత్తికలు యోగినులునుబ్రి ♦ కృతికలలును, దీయమాతలుగామది ♦ నెంచుమింకను.

క॥ స్తన్యంబొసంగి పెంచిరి, మాన్య చరిత్రాఢ్య లీయ ♦ మాయికమూర్తుల్
ధన్యమనీషా! యిపుడొక, యన్యులవలె వీరిఁబాయ ♦ నగునే నాకున్. 141

మ॥ నగరాజేంద్రకుమారి వీరివలెనే ♦ నాతల్లి విశ్వేశుఁ డి
మ్ముగ నాతండ్రి యథార్థమాయిరువురున్ ♦ బూజార్హులే నాకు వే
ఱుగ నీకృత్తికలన్ దొరంగుటయుఁ గూ ♦ ర్పున్ దోస మార్యా! ప్రియం
బుగ నివ్వారినిఁగూడఁ దెత్తునట కి ♦ ష్టాన్నికటుల్ నచ్చినన్. 142

వ. అనినవిని నందికేశ్వరుం డత్యంతానందంబున నామోదించి యంతఁ గుమారుండు ప్రియాణోన్ముఖుండయ్యె నయ్యవసరంబునఁ బరమేశ్వరప్రేరితంబై విశ్వకర్మ నిర్మితంబును గాంచనానేకరత్నసంఘటితంబును శతచక్రంబును బార్షదశ్రేష్ఠవేష్టితంబునునగు నొక్క పుష్పకస్యందనంబు సమీపించినఁగని కృత్తికలు స్కందయానంబు యోజించి దుఃఖాక్రాంతలై యడలుచు నక్కుమారున కిట్లనిరి.

చ॥ మము విడనాడి పోయెదె కు ♦ మార! సమంజసమే? కడున్ బ్రమో
దమున నినున్ దనూజునిగఁ ♦ దద్దయు నమ్మికఁజెంది ప్రేమయు
క్తమతినిఁ బెంపుచేసితిమి ♦ తల్లుల మమ్మిటు లీవు పాయ నై
న్యముఁగొని యెంచఁజేరెదవె ♦ స్వాంతమునన్ దలపోయు మీయెడన్. 144

ఆ॥ అనుచు నక్కుమారు ♦ నాత్మవక్షములందుఁ, జేర్చికొని కరంబు ♦ చింతనొంద
స్కందుఁ డాలకించి ♦ సంతాపమణఁగ న, ధ్యాత్మసూక్తివారి ♦ నంతఁ దేర్చి. 145

క॥ ప్రమథగణం బలర శతాం, గముఁ దల్లులతోడ నెక్కి ♦ కల్యాణధ్వా
నములు సెలఁగంగ శివనగ, రముఁ జేరఁగ వెడలెఁ గ్రౌంచ ♦ రంధ్రకరుఁడొగిన్.

ఉ॥ నందియు వేత్రహస్తుఁడయి ♦ నంద మెసంగఁగఁదోడరా మదు
ద్బృందము వీరభూతగణ ♦ బృంద మమందముదంబుఁ జెందుచున్
ముందఱఁ గొల్వఁగా శివని ♦ భుండు ఘనుండగు వీరభద్రుఁడా
నందముతోడ లాలన మెు ♦ నర్ప గుహుండుచనెన్ శివాద్రికిన్. 147

శా॥ భేరీనాద ముదారభంగిఁ జెలఁగెన్ ♦ బ్రెయోధ్వనిన్ దూర్యవి
స్తారంబుల్ విలసిల్లె మేల్మిగతులన్ ♦ దార్యత్రికంబొప్పె గం
భీరాంచత్తరగుంభసంభరితవా ♦ గృందంబులన్ స్తావక
స్ఫారస్తోత్రరవంబు లింపెసఁగె భా ♦ స్వద్భంగిగా నత్తఱిన్. 148

## —* కుమారుఁడు కైలాసముఁజేరి తల్లిదండ్రులను సేవించుట *—

చ॥ కొమరుఁడు వచ్చునంచుఁ గడుఁ ♦ గూరిమితో గిరిరాజకన్య మా
ర్గములను గెంపుటాల మగ ♦ టాలను బచ్చల హెచ్చుమీఱు ము
త్యములను బూల బొలుపయి ♦ నల్లనఁ జల్లెడునట్లు ఖేచరో
త్తములను బంపగా నపుడు ♦ దండిగ వారొనరించి రట్టులన్. 149

ఆ॥ హరి విరించి ముఖసు ♦ రాధినాథులు వెండి, కొండఁ జేరినట్టి ♦ కొమరుసామిఁ
గాంచి కరముమురిసి ♦ ఘనతరోత్సాహంబు, మించి వే నమస్క ♦ రించిరంత.

క॥ తుహినేందుమౌళియును బం, ధురహర్షాతిశయభరము♦తోఁ బ్రమథులతో
బిఱబిఱఁ గోటహజారముఁ, దరియంగా వచ్చిచూచెఁ ♦ దనయుని వేడ్కన్.

క॥ శివులను జగత్కుటుంబవి, భవులను గని తేరుడిగ్గి ♦ పర్వతజాసం
భవుఁ డవిరళభక్తిఁ బదం, బ్రివనేదంబులకు మ్రొక్కెఁ ♦ గీర్తింప సురల్.

ఉ॥ శంకరుఁ డంతఁ బుత్రకునిఁ ♦ జక్కఁగ నక్కునఁగ్రుచ్చి కౌఁగిటన్
బొంకముతోడఁ జేర్చికొని ♦ మూర్ధసుగంధము లాని పూర్ణిమై
శాంకునిమీఱు నెమ్మొగము ♦ నందుఁ గడున్ గడు ముద్దులాడి య
డ్డంకి రమొకింతచెందని ద్ర ♦ ఢప్రమదోన్నతి నొందె నెంతయున్.

ఉ॥ పార్వతి పుత్రునెత్తికొని ♦ పర్వున స్తన్యము చేపునంతనే
యూర్వర పాలుఁద్రావెడు ని ♦ జార్భకు నొక్కతె ద్రావఁజేసె గం
ధర్వులు గీతముల్ మును లు ♦ దారముగా శ్రుతిఘోష సల్పఁగా
సర్వసుపర్వగేహినులు ♦ సన్మణిహారతు లిచ్చి రెచ్చుగన్. 154

సీ॥ అభవుఁడుత్సవమొప్పఁగ ♦ నాత్మసుతుని, భర్మహర్మ్యసభాలయా ♦ భ్యంతరమున
జేర్చి సింహాసనంబెక్కి ♦ స్త్రీయదక్షి, ణాంకమునఁబుత్రువహియించి♦యలరెమిగుల.

॥ రత్నకమయపీఠమున నవ, రత్నమయాభరణరాజి ♦ రాజిలఁ గాంతా
రత్నముతో శివుఁ డాత్మజ, రత్నముతో నలరె దివిజ ♦ రత్నము లలరన్. 156

చ॥ గళమునయున్న వాసుకినిఁ ♦ గంకణముగ్రొక్కిన పుష్టి సర్వముం
గళ మది పొంగులాగు నగఁ ♦ గా నొసఁగించి ప్రమోదమొందె శ్రీ
గళుఁడు మఱొక్క దివ్యమగు ♦ కాంచనపీఠమునందు బంధురో
జ్జ్వలతర తేజు నా గుహుని ♦ వైభవమొప్పఁగఁ జేర్చి వేడ్కతోఁ. 157

గీ॥ నలువతోడుత నుపనయ♦నంబునలుపఁ, జేయనాతండు గుహునకుఁ ♦ జెలఁగియజ్ఞ
సూత్రమును వేదములను గా♦యత్రిఁగుండి. నరివిదారిణివిద్యబ్ర ♦ హ్మాస్త్రమిచ్చె.

గీ॥ అంత జగదీశ్వరుండు ని♦జాత్మజునకు, శూలముఁబినాకమును బర ♦ శువును శక్తిఁ
బాశుపతదివ్యశరమును♦ బ్రహ్మవిద్య, నొసఁగి యానందమొందె న♦నుపమముగను.

—* విష్ణ్వాదులు కుమారున కుపాయనంబు లిచ్చుట *—

క॥ నవరత్నకీలితములగు, ప్రవిమలమకుటాంగదములు ♦ వనమాలయు దా
నవమారకమగు చక్రము, శివతనయున కొసఁగెఁ జక్రి ♦ చేతఃప్రీతిన్. 160

చ॥ తపనుఁడిడెన్ మనోజవర ♦ థంబు సుధాంశుఁడిడెన్ సుధాఘటం
బపరిమితార్ఘ్యరత్నముల ♦ నబ్ధి యొసంగె హిమాలయుం డిడెన్
విపులమణిప్రకాండముల ♦ విస్ఫురదుత్తమభూషణాళిఁ గాం
డపతి యొసంగె ఘోటకగ ♦ ణంబు ఘనంబుగ శంభుసూతికిన్. 161

చ॥ గరుడుఁడు వాహనార్థమొక ♦ కాంతతరమ్మగు నెమ్మి నిచ్చె న
య్యరుణుఁ డిడెన్ ధ్వజార్థ మొక ♦ యంచముఁ జెందెడు తామ్రచూడమున్
గిరిజ యిడెన్ జిరాయువును ♦ కీర్తివహంబగు వైభవంబు నిం
దిర యిడె భోగభాగ్యముల ♦ దివ్యమనోహరరత్నహారముల్. 162

క॥ శారద యొసఁగెను నిండగు, కూరిమితో విద్యలెల్లఁ ♦ గొనబుగ సుమన
స్స్త్రీరత్నము లొసఁగిరి తమ, చే రాజిలు వస్తువులును ♦ శివతనయునకున్.

వ. అంతఁ బురుహూతుండు.

చ॥ అరయక నాఁ డెదుర్కొని ర ♦ ణాంగణమం దటు వజ్రధార శం
కరసుతుఁ గొట్టినట్టి ఘన ♦ కల్మష మెట్టులఁబోయు నెట్టులీ
స్మరహరనందనుండు నను ♦ సౌమ్యమతిన్ దయఁజూచు నూరకే
మఱతురె లాఁతివారి యవ ♦ మానముఁ జెయ్వుల శూరులెవ్వరయిన్. 164

గీ॥ సామమున మున్న బతిమాలి♦శరణుఁజెంది, ప్రాణములనిల్పుకొనఁగంటి♦ పరఁగనిప్పు
డుత్తమంబగుకానుక ♦ నొసఁగిదయకుఁ, బాత్రమాటకు సమయ మే♦ర్పడియెనాకు.

వ. మణికాంచనముక్తాభరణవస్తువాహనప్రాజ్యసామ్రాజ్యాదు లన్నియు నాకుఁ బర
మేశ్వరానుగృహీతంబులే కాని యన్యంబులుగావు. దాన నవ్వాని నొసంగుట
ప్రమోదావహంబుకానేరదికను. 166

## —* ఇంద్రుఁడు దేవసేనను కుమారునకిచ్చి పెండ్లిసేయుట *—

చ॥ కలదుగదా కుమారి త్రిజ ♦ గద్గణనీయమనోజ్ఞమూర్తి పే
శలసుగుణాలవాల సుర ♦ సంస్తుతిభాజన దేవసేన యా
లలితకుమారి నీ శశిల ♦ లామకుమారున కిచ్చినన్ బ్రియం
బలవడఁ బెండ్లియాడు నను ♦ నర్మిలి నేలఁగలందు రూఢిగన్. 167

క॥ అని తలఁచి చని కుమారిని, ఘనరత్నాభరణరాజిఁ ♦ గై సేసి ముదం
బునఁ దోడ్కొనివచ్చె సభాం, గనమున కటనున్నవారు ♦ గాంచి యలరఁగా.

వ. అప్పుడు కుమారుం డక్కన్యయనన్యసామాన్యరూపరేఖావిభ్రమంబులఁ జూచి
హర్షించి యంతరంగంబునం దిట్లాలోచించె. 169

ఉ॥ ఈ రమణీలలామను మ ♦ హేంద్రుఁడు దోడ్కొనివచ్చె దీని తీ
రారయఁ గన్యగాఁ గనఁగ ♦ నయ్యె మదర్థమె తెచ్చియుండెనో
మారునిగెల్తు నట్లయిన ♦ మానినచో నిఁకఁ గార్యమెద్ది? యే
తీరుననేని దీని నిఁక ♦ దేవినిఁగాఁగొనఁగాఁ దలంచెదన్. 170

క॥ ఏయవయవంబుఁగాంచినఁ, బాయదు నాడెంద మందె ♦ భాసిల్లుఁదమిన్
డాయన్ జేయఁగఁజాలెడుఁ, గాయజునకుఁ గైవసంబుఁ ♦ గావించెననున్. 171

క॥ బింబమువాతెఱ హిమకర, బింబమునెమ్మోము భూరి ♦ విలసితమదరో
లంబముతురుము రతీశా, లంబము విరిఁబోఁణి భూత ♦ లంబం దరయన్. 172

క॥ ఖంబు నడు మతనురథచ, క్రంబు పిఱుం దలరు నా ద ♦ రంబుకుతుక శై
లంబు చనుదోయి సుమృణా, ళంబు బుజంబులు లలన్న ♦ శంబడుగులగున్. 173

మ॥ అని యిబ్భంగి సభన్ గుమారుఁ డమరేం ♦ ద్రాత్మోద్భవాసక్తిమై
ఘనమోహాన్వితిఁ గాంచుచున్నతఱి న ♦ క్కన్యామణీపాణి స్కం
దునిహస్తంబునఁజేర్చి నాకొమరితన్ ♦ దుర్గాత్మజా! నీకు భా
ర్యనుగా నిచ్చితి నర్మిలిన్ గొనుమనెన్ ♦ నాకేశ్వరుం డాదటన్. 174

శా॥ స్కందుం డప్పుడు పార్వతీశ్వరుల యా ♦ జ్ఞన్ బెండ్లియాడెన్ మహా
నందం బొప్పఁగ దేవసేనను మరు ♦ న్నాళీకపత్రేక్షణా
బృందాంచత్తరగీయమానను ఘన ♦ శ్రీభాసమానన్ లస
త్సౌందర్యోజ్జ్వలతాసమాన నిభయానన్ ♦ బూర్ణచంద్రాననన్. 175

ఆ॥ పెండ్లియాడి యెక్కె♦పీఠిఁ గూర్చుండిన, శక్రిజాగుహులను ♦ జక్కఁగాంచి
ప్రమథదేవమాని♦రాజి యత్యంతప్ర, మోదమొంది పాదలే♦నాదరమున. 176

క॥ కౌమారునకుఁ దగిన గేహిని, రమణీయతరాంగి దేవ ♦ సేనాతనయ యి
ట్లమరుటఁ గని యగజాశివు, లమితానందంబుఁ జెంది ♦ రాత్మములందున్.

మ॥ పరమోత్సాహముతో మహేశ్వరుఁడు గీ ♦ ర్వాణావళిన్ గాంచి ని
ర్భరకారుణ్యముతోడ నిట్లనె హరీ! ♦ రాజీవజన్మా! పురం
దర! దివ్యర్షివరేణ్యులార! చెప్పుఁడీ ♦ నాకిప్డు మీ యిష్టముల్
నెఱవేఱన్ వరమిత్తు నిక్క మిది సం ♦ దేహింపఁగా నెంతయున్. 178

క॥ అన విని మునులును ననిమిషు, లును మనముల నలరి యనిరి ♦ లోకావన! పా
వనచరణనలిన! మా నన, టను దీర్ప నిదే యదను గ ♦ దంగుము కరుణన్.

చ॥ కొడుకును బంపి తారకునిఁ ♦ గూల్పఁగఁ జేసి జగత్త్రయంబు పే
రుడుకును దీర్పు మిప్పుడె ద ♦ యోన్నతి నెప్పటినుండియో యిటుల్
గడపితి మింతకాల మిఁక ♦ స్కందున కాజ్ఞ యొసంగి పంపు తు
ళ్ళడలఁగఁ జేసి దైత్యు సమ ♦ యించు నితం డవలీలగా ననన్. 180

—* శివుఁడు తారకవధార్థమై కుమారుని దేవతలతోఁ బంపుట *—

సీ॥ అనిన నంత దయామయుం ♦ డగు శివుండు, దత్క్షణం బప్పగించెను ♦ దనయు నమర
వల్లభుల కప్డు వారలు ♦ పెల్లుమురిసి, గుహునిఁదోడ్కొని కైలాస ♦ భూధర మెడలి.

చ॥ ఒకయెడఁ జేరి త్వష్టను స ♦ మున్నతరీతిఁ దలంప నాతఁ డు
త్సుకుఁడయి తారసిల్ల శివ ♦ సూనునికోసము రమ్యమౌ పురం
బొకఁడు రచింపు మంచు హరి ♦ యొప్పుగఁ జెప్పిన నాతఁ డప్డు శి
ల్పకుశలభంగు లేర్పడఁగఁ ♦ బట్టణ మట్టులె కట్టె నేర్పునన్.

సీ॥ అందుఁ బ్రమథులకును నిర్జ ♦ రాగ్రణులకు, వేఱువేఱుగ భవనముల్ ♦ వెలయఁగట్టి
మధ్యమందు రచించెఁ గు ♦ మారభవన, మందు సర్వంబు రత్నమ ♦ యముగఁ జేసె.

—* దేవతలు కుమారస్వామికి బ్రహ్మాండాధిపత్యంబుఁ గట్టుట *—

గీ॥ అంత విష్ణువు రత్నసిం ♦ హాసనమున, శివకుమారునిఁ గూర్చుండఁ ♦ జేసి సర్వ
తీర్థజలసేక మొనరించి ♦ తిలక మొసఁగి, కమలజాండాధిపత్యంబుఁ ♦ గట్టినపుడు,

క॥ వరుసగ నత్తఱి హరియును, సరసీరుహసంభవుండు ♦ జంభారియునున్
సురలెల్లరు హరసుతునకుఁ, గరమర్మిలి మ్రొక్కి నుతులు ♦ గావించిరొగిన్.

శా॥ ప్రాంచద్భంగి మహోత్సవంబు నిటులన్ ♦ బన్నించి సేవించు న
య్యంచన్నిర్జరవర్యులన్ గని మహా ♦ హ్లాదైకచిత్తంబుతోఁ
గ్రౌంచారాతి యిటుల్ వచించెఁ గడు వే ♦ గన్ దారకున్ మిత్తిక
ద్రుంచన్ గాఁ గలవాఁడ మీ కభిమత ♦ శ్రీలిచ్చువాఁడన్ సురల్!

## —* ఇంద్రుఁడు దేవసేనను కుమారునకిచ్చి పెండ్లిసేయుట *—

చ॥ కలదుగదా కుమారి త్రిజ ♦ గద్గణనీయమనోజ్ఞమూర్తి పే
శలసుగుణాలవాల సుర ♦ సంస్తుతిభాజన దేవసేన యా
లలితకుమారి నీ శశిల ♦ లామకుమారున కిచ్చినన్ బ్రియం
బలవడఁ బెండ్లియాడు నను ♦ నర్మిలి నేలఁగలండు రూఢిగన్. 167

క॥ అని తలఁచి చని కుమారిని, ఘనరత్నాభరణరాజిఁ ♦ గైసేసి ముదం
బునఁ దోడ్కొనివచ్చె సభాం, గనమున కటనున్నవారు ♦ గాంచి యలరఁగా.

వ. అపుడు కుమారుం డక్కన్యయనన్యసామాన్యరూపరేఖావిభ్రమంబులఁ జూచి
హర్షించి యంతరంగంబునం దిట్లాలోచించె. 169

ఉ॥ ఈ రమణీలలామను మ ♦ హేంద్రుఁడు దోడ్కొనివచ్చె దీని తీ
రారయఁ గన్యగాఁ గనఁగ ♦ నయ్యె మదర్థమె తెచ్చియుండెనో
మారునిగెల్తు నట్లయిన ♦ మానినచో నిఁకఁ గార్యమెద్ది? యే
తీరున నేని దీని నిఁక ♦ దేవినిఁగాఁ గొనఁగాఁ దలంచెదన్. 170

క॥ ఏయవయవంబుఁగాంచినఁ, బాయదు నాడెంద మందె ♦ భాసిల్లుఁదమిన్
డాయన్ జేయఁగఁజాలెదుఁ, గాయజునకుఁ గైవసంబుఁ ♦ గావించెననున్. 171

క॥ బింబమువాతెఱ హిమకర, బింబమునెమ్మోము భూరి ♦ విలసితమదరో
లంబముతుఱుము రతీశా, లంబము విరిఁబోణి భూత ♦ లంబం దరయన్. 172

క॥ ఖంబు నడు మతనురథచ, క్రంబు పిఱుం దలరు నా ద ♦ రంబుకుతుక శై
లంబు చనుదోయి సుమ్మృణా, ళంబు బుజంబులు లలన్న ♦ శంబడుగులగున్. 173

మ॥ అని యుబ్బంగి సభన్ గుమారుఁ డమరేం ♦ ద్రాత్మోద్భవాసక్తిమై
ఘనమోహోన్నతిఁ గాంచుచున్నతఱి న ♦ క్కన్యామణీపాణి స్కం
దునిహస్తంబునఁజేర్చి నాకొమరితన్ ♦ దుర్గాత్మజా! నీకు భా
ర్యనుగా నిచ్చితి నర్మిలిన్ గొనుమనెన్ ♦ నాకేశ్వరుం డాదటన్. 174

శా॥ స్కందుం డప్పుడు పార్వతీశ్వరుల యా ♦ జ్ఞన్ బెండ్లియాడెన్ మహా
నందం బొప్పఁగ దేవసేనను మరు ♦ న్నాళీకపత్రేక్షణా
బృందాంచత్తరగీయమానను ఘన ♦ శ్రీభాసమానన్ లస
త్సౌందర్యోజ్జ్వలతాసమాన నిభయా ♦ నన్ బూర్ణచంద్రాననన్. 175

ఆ॥ పెండ్లియాడి యొక్క ♦ పీఠిఁ గూర్చుండిన, శక్రిజాగుహులను ♦ జక్కఁగాంచి
ప్రమథదేవమౌని ♦ రాజి యత్యంతప్ర, మోదమొంది పొదలె ♦ నాదరమున. 176

క॥ కొమరునకుఁ దగిన గేహిని, రమణీయతరాంగి దేవ ♦ రాజతనయ యి
ట్లమరుటఁ గని యగజాశివు, లమితానందంబుఁ జెంది ♦ రాత్మములందున్.

మ॥ పరమోత్సాహముతో మహేశ్వరుఁడు గీ ♦ ర్వాణావళిన్ గాంచి ని
ర్భరకారుణ్యముతోడ నిట్లనె హరీ! ♦ రాజీవజన్మా! పురం
దర! దివ్యర్షివరేణ్యులార! చెప్పుఁడీ ♦ నాకిప్డు మీ యిష్టముల్
నెఱవేఱన్ వరమిత్తు నిక్క మిది సం ♦ దేహింపఁబోకెంతయున్. 178

క॥ అన విని మునులును ననిమిషు, లును మనముల నలరి యనిరి ♦ లోకావన! పా
వనచరణనలిన! మా వన, టను దీర్ప నిదే యదను గ♦దంగుము కరుణన్.

చ॥ కొడుకును బంపి తారకునిఁ ♦ గూల్పఁగఁ జేసి జగత్త్రయంబు పే
రుడుకును దీర్పు మిప్పుడె ద ♦ యోన్నతి నప్పటినుండియో యిటుల్
గడపితి మింతకాల మిఁక ♦ స్కందున కాజ్ఞ యొసంగి పంపు తు
ళ్ళడలఁగఁ జేసి దైత్య సము ♦ యించు నితం డవలీలగా వెసన్. 180

—* శివుఁడు తారకవధార్థమై కుమారుని దేవతలతోఁ బంపుట *—

సీ॥ అనిన నంత దయామయుం♦ డగు శివుండు, దత్క్షణం బప్పగించెను♦ దనయు నమర
వల్లభుల కప్డు వారలు ♦ పెల్లుమురిసి, గుహునిఁ దోడ్కొని కైలాస♦ కుధర మెడలి.

చ॥ ఒకయెడఁ జేరి త్వష్టను స ♦ మున్నతరీతిఁ దలంప నాతఁ డు
త్సుకుఁడయి తారసిల్ల శివ ♦ సూనునికోసము రమ్యమౌ పురం
బొకఁడు రచింపు మంచు హరి ♦ యొప్పఁగఁ జెప్పిన నాతఁ డప్డు శి
ల్పకుశలభంగు లేర్పడఁగఁ ♦ బట్టణ మట్టులె కట్టె నేర్పునన్.

గీ॥ అందుఁ బ్రమథులకును నిర్జ♦రాగ్రణులకు, వేఱువేఱుగ భవనముల్ ♦ వెలయఁగట్టి
మధ్యమందు రచించెఁ గు♦మారభవన, మందు సర్వంబు రత్నమ♦యముగఁ జేసె.

—* దేవతలు కుమారస్వామికి బ్రహ్మాండాధిపత్యంబుఁ గట్టుట *—

గీ॥ అంత విష్ణువు రత్నసిం ♦ హాసనమున, శివకుమారునిఁ గూర్చుండఁ ♦ జేసి సర్వ
తీర్థజలసేకమొనరించి ♦ తిలకమొసఁగి, కమలజాండాధిపత్యంబుఁ ♦ గట్టినపుడు,

క॥ వరుసగ నత్తఱి హరియును, సరసీరుహసంభవుండు ♦ జంభారియునున్
సురలెల్లరు హరసుతునకుఁ, గరమర్మిలి మ్రొక్కి నుతులు ♦ గావించిరొగిన్.

శా॥ ప్రాంచద్భంగి మహోత్సవంబు నిటులన్ ♦ బన్నించి సేవించు న
య్యంచన్నిర్జరవర్యులన్ గని మహా ♦ హ్లాదైకచిత్తంబుతోఁ
గ్రౌంచారాతి యిటుల్ వచించెఁ గడువే ♦ గన్ దారకున్ మిత్తిక
ర్పించన్ గాఁ గలవాఁడ మీకభిమత ♦ శ్రీలిచ్చువాఁడన్ సురల్!

వ. అనిన విని యనిమేషులెల్ల గాత్రంబులం బొంగి యోంకారధ్వనులును జయధ్వను లొనరించిరనిన సూతునకు శౌనకాదిమును లామీఁదివృత్తాంతంబు సెలవిమ్మనుడు.

మ॥ శరభాంబాహృదయాబ్జహేళి! విలస • చ్ఛందాద్రికోటీరప
త్సరసీరుడ్భసలాయమానహృదయా! • శైవావళీపూజనో
ద్ధురదీక్షాపరతంత్ర! బంధుజనసం • దోహాళిసంతోషకృ
న్నిరతాచ్ఛాశయ! నిత్యసత్యవచనా! • నిక్షాళితాంహశ్చయా! 188

గద్య. ఇది శ్రీ బుధజనవిధేయ ముడిగొండ నాగవీరేశ్వరనామధేయ
ప్రణీతంబైన శివపురాణంబందలి కుమారఖండంబున
ప్రథమాశ్వాసము సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ





శ్రీ శివాభ్యాన్నమః

# శ్రీ శివపురాణము

## కుమారఖండము.

### ద్వితీయాశ్వాసము.



వీరభద్రగురురవి
సేవాసంఫుల్లహృత్కు ♦ శేశయ! చిరసం
భావితపశుపతిచరణా!
పావనగుణమణికదంబ ♦ వని! లక్ష్మ్యంబా!

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె.

ఉ॥ శంభుకుమారుఁ డంత దివిష ♦ ద్వరులన్ గని సత్కృపాత్తసం
రంభముతోడ నిట్లనియె ♦ రక్కసిరాయనిపాలి కొక్కనిన్
సంభృతనీతిశాస్త్రసువి ♦ చారు విశారదు దూత నంపి యి
క్కుంభినిఁ బాసి పొమ్మనుఁడు ♦ నాకపదాలయభూమిఁ జేరఁగాన్. 2

క॥ అటు లరుగక తక్కిన మ, త్పటుతరభుజశక్తి వానిఁ ♦ బరిమార్తు న్వృథం
బటుసేయుం డన నమరో, త్కటులు గడుఁ బొంగి శక్తి ♦ ధరున కని రిటుల్. 3

చ॥ వెఱవక తారకాసురుని ♦ వేశనభూమికిఁ జేరి వాని కి
త్తెఱఁగు వచింపఁగాఁ దగిన ♦ ధీరులు మాయెడ లేరు మీరలే
యఱమర లేక యొక్కని బ ♦ లాఢ్యుని నట్లనిఁ జూచి పంచి యి
ట్లెఱుఁగఁగఁ జెప్పిరమ్మనుట ♦ యొంటియు శ్రేయము శర్వనందనా! 4

—* శ్రీ కుమారస్వామి వీరబాహుని దారకునియొద్దకు సంధికై పంపుట *—

గీ॥ అనిన విని శంకరాత్మజుం ♦ డపుడు వీర, బాహుఁ డను తనయనుచర ♦ ప్రముఖు నొకనిఁ
బంపి తగురీతి నసురకు ♦ బ్రియముఁ జెప్పఁ, జెప్పిరమ్మన నాతఁడు ♦ చెలఁగి వేగ. 5

క॥ వైహాయసరథమున మహి, తోహాగతి శోణితపురి ♦ కురువేగమునన్
దా హర్మ్యంబునఁ జేరి సు, బాహుండౌ వీరబాహు ♦ భటభాస్కరుఁడున్. 6

సీ॥ బహుపుష్పఫలభార♦భాసురాశోకసం, తానపరిముఖదివ్య♦తరువనంబు
స్వర్ణారవిందబి♦సగ్రాసమత్తమ, రాళకేళీసరో♦రంజితంబు
రవిహయజయ*జాహు♦రాణపర్వతఘన, గంధసింధురయూథ♦బంధురంబు
శమనమనస్సాధ్వ♦సప్రదబహువీర, పురుషప్రకాండవి♦భూషితంబు

గీ॥ చంద్రమండలసంచర ♦ చ్చంబరీవి, లోకనవిశేషదేశికా ♦ లోకనోత్ప
లేక్షణాలంకృతోత్తుంగ♦హేమహర్మ్య, సముదయముఁ దత్పురముఁ గాంచి♦సంతసమున

క॥ తగుగతిఁ దారకు నాస్థా, లగమునకున్ జని సురారి♦లావున్ జేవన్
దగఁ గని బాగనుకొని యి, మ్మగ నాతనితోడఁ బలికెఁ ♦ బొలుపుగ నిటులన్.

చ॥ విను మసురోత్తమా! భువన♦వీరుఁడు శంభుకుమారుఁ డింద నన్
బనిచెఁ గృపాళుఁడై యతఁడు ♦ నన్నిట నీకు వచింపుమన్న వా
ర్తను వినిపించెదన్ విబుధ ♦ రాజినిఁ బట్టి వలార్చి వారివా
హానధనవస్తువర్గముల ♦ నాక్రమణం బొనరించి తేపునన్. 9

క॥ పెక్కేండ్లనుండి వారల, యుక్కడఁచి యధఃకరించి ♦ యురుతరగర్వం
బెక్కి యిటు నిక్కుచుంటివి, దక్కదు నీకింకఁ ద్రిదశ ♦ ధన మించుకయున్.

గీ॥ కట్టుబట్టలతో లేచి♦కాద్రివేయ, లోకమున కాత్మజనముతో♦వీఁకదఱిగి
యురుగు మట్లైనఁ బ్రాణంబు♦లాసఁ గాంతు, దప్పితవయేని మిత్తికి♦దారవోతు.

క॥ అని నీకు హితవు సెప్పెను, ఘనుఁ డాతం డసురరాజ! ♦ కార్యమెఱిఁగి నీ
వనుకూలముగ రసాతల, మున కరుగుట లెస్స లెస్స ♦ బుద్ధి నరయుమీ! 12

## —* తారకుఁడు సంధిని నిరసించుట *—

ఉ॥ జంకొకయింత లేక తన ♦ సన్నిధిఁ జేరి కటూక్తులాడు నే
ణాంకకిరీటపుత్రభ ♦ టాగ్రణిఁ గన్గొని తారకుం డనా
తంకమతిన్ బ్రహాసభరి ♦ తస్ఫురదాననుఁడై యుపాత్తరో
షాంకితవృత్తి నిట్లనియె ♦ నంబుధరార్భటిఁ గ్రిందుసేయుచున్. 13

శా॥ ఏమేమీ? నను మిత్తి కర్పణము సే ♦ యింపంగ నైశాని యి
ట్లామోదంబున నెంచి నిన్ బనిచెనా? ♦ యాదిత్యరక్షార్థమై
భూమిన్ బోవిడి కట్టుపుట్టములతో ♦ భోగీంద్రలోకంబు నే
నీ మాటన్ విని వేగఁ జేరవలెనా? ♦ నీకింత వాత్సల్యమా? 14

* టిప్పణి. జాహురాణము = గుఱ్ఱము

ఉ॥ కావున నీదు తేజ మది ♦ కప్పఁగశక్యమె యెవ్వఁడేని నిన్
జే వహియించి దాఁచఁగల ♦ చేవఁగనున్ గలహంస యోవహా
బావినిఁ గూల రాశులునె ♦ పన్నుగఁ గృత్తికలేడ వారి ప
ర్ణావసథంబులందు విమ ♦ లాత్మక! నీవు పసింపుచుండఁగన్. 137

క॥ రాజతగిరి నిఖిలామర, రాజతతాస్థానభూమి ♦ రాజకిరీటుం
డోజం గొలువున్నవాఁడట, కోజనసుత తేజ! కదలు ♦ ముత్సాహమునన్. 138

క॥ గొనములకును దేజములకు, ననయము పోఁవీవు నిన్ను ♦ నరయనివారల్
వనజంబులతో నొక్కెడ, ననికినమరు కప్పలనఁగ ♦ నొప్పన్ గాదే! 139

వ. అని చెప్పిన నందికేశ్వరునకుఁ గుమారుం డిట్లనియె.

గీ॥ అన్న! త్రైకాలికజ్ఞాని ♦ వరయుమీవు, జంతువులు కర్మమునకర్హ ♦ జన్మమొందుఁ
గృత్తికలు యోగినులునుబ్రి ♦ కృతికలలుమ, డీయమాతలుగామది ♦ నెంచుమికను,

క॥ స్తన్యంబొసంగి పెంచిరి, మాన్యచరిత్రాఢ్య లియ ♦ మాయికమూర్తుల్
ధన్యమనీషా! యిపుడొక, యన్యులపలె వీరిఁ బాయ ♦ నగునే నాకున్. 141

మ॥ నగరాజేంద్రకుమారి వీరివలెనే ♦ నాతల్లి విశ్వేశుఁ డి
మ్ముగ నాతండ్రి యథార్థమాయిరువురున్ ♦ బూబాప్తులే నాకు వే
ఱుగ నీకృత్తికలన్ దొరంగుటయుఁ గూ ♦ ర్చున్ దోస మార్యా! ప్రియం
బుగ నివ్వారినిఁగూడఁ దెత్తునట కి ♦ ష్టన్నీకటుల్ నచ్చినన్. 142

వ. అనినవిని నందికేశ్వరుం డత్యంతానందంబున నామోదించి నంతఁ గుమారుండు ప్రయాణోన్ముఖుండయ్యె నయ్యవసరంబునఁ బరమేశ్వరప్రేరితంబై విశ్వకర్మ నిర్మితంబును గాంచనానేకరత్నసంఘటితంబును శతచక్రంబును బార్షదశ్రేష్ఠవేష్టితంబునునగు నొక్కపుష్పకస్యందనంబు సమీపించినఁగని కృత్తికలు స్కందయానంబు రోజించి దుఃఖాక్రాంతలై యడలుచు నక్కుమారున కిట్లనిరి.

చ॥ మము విడనాడి పోయెదె కు ♦ మార! సమంజసమె? కడున్ బ్రమో
దమున నినున్ దనూజునిగఁ ♦ దద్దయు నమ్మికఁజెంది ప్రేమయు
క్తమతినిఁ బెంపుచేసితిమి ♦ తల్లుల మమ్మిటు లీవు పాయ దై
న్యముఁగొని యెందుఁజేరెదవొ ♦ స్వాంతమునన్ దలపోయు మీయెడన్. 144

ఆ॥ అనుచు నక్కుమారు ♦ నాత్మవక్షములందుఁ, జేర్చికొని కరంబు ♦ చింతనొంద
స్కందుఁ డాలకించి ♦ సంతాపమణఁగ న, ధ్యాత్మసూక్తివారి ♦ నంతఁ దేర్చె. 145

క॥ ప్రమథగణం బలర శతాం, గముఁ దల్లులతోడ నెక్కి ♦ కల్యాణధ్వా
నములు సెలఁగంగ శివనగ, రముఁ జేరఁగ వెడలెఁ గ్రౌంచ ♦ రంధ్రకరుఁడొగిన్.

ఉ॥ నందియు వేత్రహస్తుఁడయి ♦ నంద మెసంగఁగఁదోడరా మరు
ద్బృందము వీరభూతగణ ♦ బృంద మమందముదంబుఁ జెందుచున్
ముందటఁ గొల్వఁగా శివుని ♦ భుండు ఘనుండగు వీరభద్రుఁడా
నందముతోడ లాలన మొ ♦ నర్ప గుహుండుచనెన్ శివాద్రికిన్. 147

శా॥ భేరీనాద ముదారభంగిఁ జెలఁగెన్ ♦ భేరీయోధ్వనిన్ దూర్యవి
స్తారంబుల్ విలసిల్లె మేల్మిగతులన్ ♦ దార్యత్రికంబొప్పె గం
భీరాంచత్తరగుంభసంభరితవా ♦ గ్బృందంబులన్ స్తావక
స్ఫారస్తోత్రరవంబు లింపెసఁగె భా ♦ స్వద్భంగిగా నత్తఱిన్. 148

—* కుమారుఁడు కైలాసముఁజేరి తల్లిదండ్రులను సేవించుట *—

చ॥ కొమరుఁడు వచ్చునంచుఁ గడుఁ ♦ గూరిమితో గిరిరాజకన్య మా
ర్గములను గెంపుటాల మగ ♦ టాలను బచ్చల హెచ్చుమీఱు ము
త్యములను బూల బొలుపయి ♦ నల్లనఁ జల్లెడునట్లు ఖేచరో
త్తములను బంపగా నపుడు ♦ దండిగ వా రొనరించి రట్టులన్. 149

ఆ॥ హరి విరించి ముఖసు ♦ రాధినాథులు వెండి, కొండఁ జేరినట్టి ♦ కొమరుసామిఁ
గాంచి కరముమురిసి ♦ ఘనతరోత్సాహంబు, మించి వే నమస్క ♦ రించిరంత.

క॥ తరుణేందుమౌళియును బం, ధురహర్షాతిశయభరము♦తోఁ బ్రమథులతో
బిఱబిఱఁ గోటహజారముఁ, దరియంగా వచ్చిచూచెఁ ♦ దనయుని వేడ్కన్.

క॥ శివులను జగత్కుటుంబవి, భవులను గని తేరుడిగ్గి ♦ పర్వతజాసం
భవుఁ డవిరళభక్తిఁ దదం, ఘ్రివనేజంబులకు మ్రొక్కెఁ ♦ గీర్తింప సురల్.

ఉ॥ శంకరుఁ డంతఁ బుత్రకునిఁ ♦ జక్కఁగ నక్కునఁగ్రుచ్చి కౌఁగిటన్
బొంకముతోడఁ జేర్చికొని ♦ మూర్ధసుగంధము లాని పూర్ణిమా
శాంకునిమీఱు నెమ్మొగము ♦ నందుఁ గడున్గడు ముద్దులాడి య
డ్డంకి యొకింతచెందని దృ ♦ ఢప్రమదోన్నతి నొందె నెంతయున్.

ఉ॥ పార్వతి పుత్రునెత్తికొని ♦ పర్వున స్తన్యము చేపునంతనే
యార్వ్వర పాలుఁదాఁగెడు ని ♦ జార్భకు నొక్కటె దాఁపఁజేసె గం
ధర్వులు గీతముల్ మును లు ♦ దారముగా శ్రుతిఘోష సల్పఁగా
సర్వసుపర్వగేహినులు ♦ సన్మణిహారతు లిచ్చి రెచ్చుగన్. 154

గీ॥ అభవుఁడుత్సవమొప్పఁగ ♦ నాత్మసుతుని, భర్మహర్మ్యసభాలయా ♦ భ్యంతరమును
శేర్చి సింహాసనంబెక్కి ♦ స్వీయదక్షి, ణాంకమునఁబుత్రువహియించి ♦ యలరెమిగుల.

॥ రత్నకమయపీఠమున నవ, రత్నమయాభరణరాజి ♦ రాజిలఁ గాంతా
రత్నముతో శివుఁ డాత్మజ, రత్నముతో నలరె దివిజ ♦ రత్నము లలరన్. 156

చ॥ గళమున నున్న వాసుకిని ♦ గంగను నొక్కిన పుత్త్రి సర్పముం
గళమడి పొంగులాడు గనఁ ♦ గా నొసఁగించి ప్రమోదమొందె శ్రీ
గళుఁడు మఱొక్క దివ్యమణి ♦ కాంచనకీరమునందు బంధురో
జ్జ్వలతరతేజు నా గుహుని ♦ వైభవమొప్పఁగఁ జేర్చి పేర్మిమై. 157

గీ॥ నలువతోడుత నుపనయ♦ నంబు సలుపఁ, జేయనాతండు గుహునకుఁ ♦ జెలఁగి యజ్ఞ
సూత్రమును వేదములను గా♦యత్రిఁ గూడి. సకలవాణీవిద్యబ్ర ♦ హ్మాస్త్రమిచ్చె.

గీ॥ అంత జగదీశ్వరుండు ని♦జాత్మజునకు, శూలముఁ బినాకమును బర ♦ శువును శక్తిఁ
బాశుపతదివ్యశరమును♦ బ్రహ్మవిద్య, నొసఁగి యానందమొందె న♦నుపమముగను.

—* విష్ణ్వాదులు కుమారున కుపాయనంబు లిచ్చుట *—

క॥ నవరత్నకీలితములగు, ప్రవిమలమకుటాంగదములు ♦ వనమాలయు బా
వనమారకమగు చక్రము, శివతనయున కొసఁగెఁ జక్రి ♦ చేతఃప్రీతిన్. 160

చ॥ తపనుఁడొసఁగెన్ మనోజవర ♦ థంబు సుధాంశుఁడొసఁగె సుధాఘటం
బపరిమితార్ఘ్యరత్నముల ♦ నబ్ధి యొసంగె హిమాలయుం డొసఁగె
విపులమణిప్రకాండముల ♦ విస్ఫురదుత్తమభూషణాళిఁ గాం
డపతి యొసంగె ఘోటకగ ♦ ణంబు ఘనంబుగ శంభుసూతికిన్. 161

చ॥ గరుడుఁడు వాహనార్థమొక ♦ కాంతతరమ్మగు నెమ్మి నిచ్చె న
య్యరుణుఁ డొసఁగెన్ ధ్వజార్థమొక ♦ యందముఁ జెందెడు తామ్రచూడమున్
గిరిజ యొసఁగెన్ జిరాయువును ♦ కీర్తివహంబగు వైభవంబు నిం
దిర యొసఁగె భోగభాగ్యముల ♦ దివ్యమనోహరరత్నహారముల్. 162

క॥ శారద యొసఁగెను నిండగు, కూరిమితో విద్యలెల్లఁ ♦ గొనబుగ సుమన
స్త్రీరత్నము లొసఁగిరి తమ, చేరాజిలు వస్తువులను ♦ శివతనయునకున్.

వ. అంతఁ బురుహూతుండు.

చ॥ అరయక నాఁడెదుర్కొని ర ♦ ణాంగణమందటు వజ్రధార శం
కరసుతుఁ గొట్టినట్టి ఘన ♦ కల్మష మెట్టులఁ బాయునట్టులీ
స్మరహరనందనుండు నను ♦ సౌమ్యమతిన్ దయఁ జూచు నూరకే
మఱతురె లాఁతివారి యవ ♦ మానపుఁ జెయ్వుల సాధులెమ్మెయిన్. 164

గీ॥ సామమున మున్న బతిమాలి♦శరణుఁ జెంది, ప్రాణములనిల్పుకొనఁగంటి♦ పరఁగ నిప్పు
డుత్తమంబగు కానుక ♦ నొసఁగి దయకుఁ, బాత్రమగుటకు సమయమే♦ర్పడియె నాకు.

వ. మణికాంచనముక్తాభరణవస్తువాహనప్రాజ్యసామ్రాజ్యాదు లన్నియు నాకుఁ బర
మేశ్వరానుగ్రహీతంబులే కాని యన్యంబులుగావు. దాన నవ్వాని నొసంగుట
ప్రమోదావహంబు కానేర దికను. 166

## —* ఇంద్రుఁడు దేవసేనను కుమారునకిచ్చి పెండ్లిసేయుట *—

చ॥ కలదుగదా కుమారి త్రిజ ♦ గద్గణనీయమనోజ్ఞమూర్తి పే
శలసుగుణాలవాల సుర ♦ సంస్తుతిభాజన దేవసేన యా
లలితకుమారి నీ శశిల ♦ లామకుమారున కిచ్చినన్ బ్రియం
బలవడఁ బెండ్లియాడు నను ♦ నర్మిలి నేలఁగలండు రూఢిగన్. 167

క॥ అని తలఁచి చని కుమారిని, ఘనరత్నాభరణరాజిఁ ♦ గైసేసి ముదం
బునఁ దోడ్కొనివచ్చె సభాం, గనమున కటనున్నవారు ♦ గాంచి యలరఁగా.

వ. అపుడు కుమారుం డక్కన్యయనన్యసామాన్యరూపరేఖావిభ్రమంబులఁ జూచి
హర్షించి యంతరంగంబునం దిట్లాలోచించె. 169

ఉ॥ ఈ రమణీలలామను మ ♦ హేంద్రుఁడు దోడ్కొనివచ్చె దీని తీ
రారయఁ గన్యగాఁ గనఁగ ♦ నయ్యె మదర్థమె తెచ్చియుండెనో
మారుని గెల్తు నట్లయిన ♦ మానినచో నిఁకఁ గార్యమెద్ది? యే
తీరున నేని దీని నిఁక ♦ దేవినిఁగా గొనఁగాఁ దలంచెదన్. 170

క॥ ఏయవయవంబుఁ గాంచినఁ, బాయదు నా డెంద మందె ♦ భాసిల్లుఁదమిన్
డాయన్ జేయఁగఁజాలెదుఁ, గాయజునకుఁ గైవసంబుఁ ♦ గావించెననున్. 171

క॥ బింబము వాతెఱ హిమకర, బింబము నెమ్మోము భూరి ♦ విలసితమదరో
లంబము తుఱుము రతీశా, లంబము విరిఁబోణి భూత ♦ లంబం దరయన్. 172

క॥ ఖంబు నడు మతనురథచ, క్రంబు పిఱుం దలరు నా ద ♦ రంబుకుటుక శై
లంబు చనుదోయి సుమ్మృణా, శంబు బుజంబులు లలన్న ♦ శంబడుగులగున్. 173

మ॥ అని యుబ్బంగి సభన్ గుమారుఁ డమరేం ♦ ద్రాత్రోద్భవాసక్తిమై
ఘనమోహోన్నతిఁ గాంచుచున్నతఱి న ♦ క్కన్యామణీపాణి స్కం
దునిహస్తంబునఁ జేర్చి నాకొమరితన్ ♦ దుర్గాత్మజా! నీకు భా
ర్యనుగా నిచ్చితి నర్మిలిన్ గొనుమనెన్ ♦ నాకేశ్వరుం డాదటన్. 174

శా॥ స్కందుం డప్పుడు పార్వతీశ్వరుల యా ♦ జ్ఞన్ బెండ్లియాడెన్ మహా
నందం బొప్పఁగ దేవసేనను మరు ♦ న్నాళీకపత్రేక్షణా
బృందాంచత్తరగీయమానను ఘన ♦ శ్రీభాసమానన్ లస
త్సౌందర్యోజ్జ్వలతాసమాన నిభయానన్ ♦ బూర్ణచంద్రాననన్. 175

ఆ॥ పెండ్లియాడి యొక్క ♦ పెటిఁ గూర్చుండిన, శక్రిజాగుహులను ♦ జక్కఁ గాంచి
ప్రమథదేవమాని ♦ రాజి యత్యంతప్ర, మోదమొంది పొదలె ♦ నాదరమున. 176

క॥ కొమరునకుఁ దగిన గేహిని, రమణీయతరాంగి దేవ ♦ రాజతనయ యి
ట్లమరుటఁ గని యగజాశివు, లమితానందంబుఁ జెంది ♦ రాత్మములందున్.

మ॥ పరమోత్సాహముతో మహేశ్వరుఁడు సి ♦ ద్ధామరావళిన్ గాంచి ని
ర్భరకారుణ్యముతోడ నిట్లనె హరీ! ♦ రాజీవజన్మా! పురం
దర! దివ్యర్షివరేణ్యులార! చెప్పుఁడీ ♦ నాకిప్డు మీ యిష్టముల్
నెఱవేఱన్ వరమిత్తు నిక్కమిది సం ♦ దేహింపకుం డెంతయున్. 178

క॥ అన విని మునులును ననిమిషు, లును మనముల నలరి యనిరి ♦ లోకావన! పా
వనచరణనలిన! మా మన, టను దీర్ప నిదే సమయము గ♦దంగుము కరుణన్.

చ॥ కొడుకును బంపి తారకునిఁ ♦ గూల్పఁగఁ జేసి జగత్త్రయంబు పే
రుడుకును దీర్పు మిప్పుడె ద ♦ యోన్నతి నెప్పటినుండియో యిటుల్
గడపితి మింతకాల మిఁక ♦ స్కందున కాజ్ఞ యొసంగి పంపు తు
ళ్ళడలఁగఁ జేసి దైత్యు సమ ♦ యించు నితం డవలీలగా వెసన్. 180

—* శివుఁడు తారకవధార్థమై కుమారుని దేవతలతోఁ బంపుట *—

సీ॥ అనిన నంత దయామయుం♦డగు శివుండు, దత్క్షణం బప్పగించెను♦ తనయు నమర
వల్లభుల కప్డు వారలు ♦ పెల్లుమురిసి, గుహునిఁ దోడ్కొని కైలాస♦కుధర మెడలి.

చ॥ ఒకయెడఁ జేరి త్వష్టను స♦మున్నతకీర్తిఁ దలంప నాతఁ డు
త్సుకుఁడయి తారసిల్ల శివ ♦ సూనునికోసము రమ్యమౌ పురం
బొకఁడు రచింపు మంచు హరి ♦ యొప్పఁగఁ జెప్పిన నాతఁ డప్డు శి
ల్పకుశలభంగు లేర్పడఁగఁ ♦ బట్టణ మట్టులె కట్టె నేర్పునన్.

గీ॥ అందుఁ బ్రమథులకును నిర్జ♦రాగ్రణులకు, వేఱువేఱుగ భవనముల్ ♦ వెలయఁ గట్టి
మధ్యమందు రచించెఁ గు♦మారభవన, మందు సర్వంబు రత్నమ♦యముగఁ జేసె.

—* దేవతలు కుమారస్వామికి బ్రహ్మాండాధిపత్యంబుఁ గట్టుట *—

గీ॥ అంత విష్ణువు రత్నసిం ♦ హాసనమున, శివకుమారునిఁ గూర్చుండఁ ♦ జేసి సర్వ
తీర్థజలసేక మొనరించి ♦ తిలక మొసఁగి, కమలజాండాధిపత్యంబుఁ ♦ గట్టినపుడు,

క॥ వరుసగ నత్తఱి హరియును, సరసీరుహసంభవుండు ♦ జంభారియునున్
సురలెల్లరు హరసుతునకుఁ, గరమర్మిలి మ్రొక్కి నుతులు ♦ గావించిరొగిన్.

శా॥ ప్రాంచద్భంగి మహోత్సవంబు నిటులన్ ♦ బన్నించి సేవించున
య్యంచన్నిర్జరవర్యులన్ గని మహా ♦ హ్లాదైకచిత్తంబుతోఁ
గ్రౌంచారాతి యిటుల్ వచించెఁ గడువే ♦ గన్ దారకున్ మిత్తిక
ర్పించన్ గాఁ గలవాఁడ మీ కభిమత ♦ శ్రీ లిచ్చువాఁడన్ సురల్!

వ. అనిన విని యనిమేషులెల్ల రాత్మంబులం బొంగి యోగకారధ్వనులును జయధ్వను
లొనరించిరనిన సూతునకు శౌనకాదిమును లామీఁదివృత్తాంతంబు సెలవిమ్మనుడు.

మ॥ శరభాంబాహృదయాబ్జహేళీ! నిజస ♦ చ్ఛందార్థికోటీరవ
త్సరసీరుడ్భసలాయమానహృదయా! ♦ శైవాచలేభ్రాజనో
ద్ధురదీక్షాపరతంత్ర! బంధుజనసం ♦ దోహాతిసంతోషకృ
న్నిరతాచ్ఛాశయ! నిత్యసత్యవచనా! ♦ నిర్మూలితాంహశ్చయా! 188

గద్య. ఇది శ్రీ బుధజనవిధేయ ముదిగొండ నాగవీరేశ్వరనామధేయ
ప్రణీతంబైన శివపురాణంబందలి కుమారఖండంబున
ప్రథమాశ్వాసము సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ





శ్రీ శివాభ్యాన్నమః

# శ్రీ శివపురాణము

## కుమారఖండము.

### ద్వితీయాశ్వాసము.



వీరభద్రగురువర
సేవాసంప్రాప్తమహాత్మ్యా ♦ శేశయ! చిరసం
భావితపశుపతిచరణా!
పావనగుణమణికదం ♦ వని! లక్ష్మ్యాంబా!

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె.

ఉ॥ శంభుకుమారుఁ డంత దివిష ♦ ద్వరులకా గని సత్కృపార్ద్రసం
రంభముతోడ నిట్లనియె ♦ రక్కసిరాయనిపాలి కొక్కనిన్
సంభృతనీతిశాస్త్రనుని ♦ చారు విశారదు దూత నంపి యి
క్కుంభినిఁ బాసి పొమ్మనుఁడు ♦ గూఢపదాలయభూమిఁ జేరఁగాన్. 2

క॥ అటు లరుగక తక్కిన మ, త్పటుతరభుజశక్తి వానిఁ ♦ బరిమార్తు దృఢం
బటు సేయుం డన నమరో, ద్భటులు గడుఁ బొంగి శక్తి ♦ ధరున కని రిట్లన్. 3

చ॥ వెఱవక తారకాసురుని ♦ వేశనభూమికిఁ జేరి వాని కి
త్తెఱఁగు వచింపఁగాఁ దగిన ♦ ధీరులు మాయెడ లేరు మీరలే
యఱమరలేక యొక్కని బ ♦ లాఢ్యుని సద్గుణిఁ జూచి పంచి యి
ట్లెఱుఁగఁగఁ జెప్పిరమ్మనుట ♦ యెంతయు శ్రేయము శర్వనందనా! 4

— * శ్రీ కుమారస్వామి వీరబాహుఁ దారకునియొద్దకు సంధికై పంపుట * —

గీ॥ అనిన విని శంకరాత్మజుం ♦ డప్పుడు వీర, బాహుఁ డను తనయనుచర ♦ ప్రముఖు నొకనిఁ
బంపి తగురీతి నసురకు ♦ బ్రియముఁ దెల్పఁ, జెప్పిరమ్మన నాతఁడు ♦ చెలఁగి వేగ. 5

క॥ వైహాయసరథమున మహిం,తోహాగతి శోణితపురి ♦ కురువేగమునన్
దా హార్షంబునఁజేరి సు, బాహుండౌ వీరబాహు ♦ భటభాస్కరుఁడున్. 6

సీ॥ బహుపుష్పఫలభార♦భాసురాశోకసం, తానప్రముఖదివ్య♦తరువనంబు
స్వర్ణారవిందబి♦సగ్రాసమత్తమ, రాళకేళీసరో♦రంజితంబు
రవిహయజయ*జాహు♦రాణపర్వతఘన, గంధసింధురయూథ♦బంధురంబు
శమనమనస్సాధ్వ♦సప్రదబహువీర, పురుషప్రకాండవి♦భూషితంబు

గీ॥ చంద్రమండలసంచర ♦ చ్చంబరీవి, లోకనవిశేషదేశికా ♦ లోకనోత్స
లేక్షణాలంకృతోత్తుంగ♦హేచుహర్మ్య,సముదయముఁదత్పురముఁగాంచి♦సంతసమున

క॥ తగుగతిఁ దారకు నోద్దో,లగమునకున్ జని సురారి♦లావున్ జేవన్
దగఁగని బాగనుకొని యి,మ్ముగ నాతనితోడఁ బలికెఁ ♦ బొలుపుగ నిటులన్.

చ॥ విను మసురోత్తమా! భువన♦వీరుఁడు శంభుకుమారుఁ డిందు నన్
బనిచెఁ గృపాళుఁడై యతఁడు ♦ నన్నిట నీకు వచింపుమన్న వా
ర్తను వినిపించెదన్ విబుధ♦రాజినిఁబట్టి పలార్చి వారివా
హనధనవస్తువర్గముల ♦ నాక్రమణం బొనరించి తేపునన్. 9

క॥ పెక్కేండ్లనుండి వారల, యుక్కడఁచి యధఃకరించి ♦ యురుతరగర్వం
బెక్కి యిటు నిక్కుచుంటివి, దక్కదు నీకింకఁ ద్రిదశ ♦ ధన మించుకయున్.

గీ॥ కట్టుబట్టలతో లేచి♦కాద్రివేయ, లోకమున కాత్మజనముతో♦వీఁకదఱిగి
యరుగు మట్లైనఁబ్రాణంబు♦లాసఁగాంతు, దప్పితవయేని మృత్తికి♦దారవోతు.

క॥ అని నీకు హితవు సెప్పెను, ఘనుఁ డాతం డసురరాజ! ♦ కార్యమెఱిఁగి నీ
వనుకూలముగ రసాతల, మున కరుగుట లెస్స లెస్స ♦ బుద్ధి నరయుమీ! 12

## —* తారకుఁడు సంధిని నిరసించుట *—

ఉ॥ జంకొకయింత లేక తన ♦ సన్నిధిఁ జేరి కటూక్తులాడు నే
ణాంకకిరీటపుత్త్రకుభ ♦ టాగ్రిణిఁ గన్గొని తారకుం డనా
తంకమతిన్ బ్రహాసభరి ♦ తస్ఫురదాననుఁడై యుపాత్తరో
షాంకితవృత్తి నిట్లనియె ♦ నంబుధరార్భటిఁ గ్రిందుసేయుచున్. 13

శా॥ ఏమేమీ? నను మిత్తి కర్పణము సే ♦ యింపంగ నైశాని యి
ట్లామోదంబున నంచి నిన్ బనిచెనా? ♦ యాదిత్యరక్షార్థమై
భూమిన్ బోవిడి కట్టుపుట్టములతో ♦ భోగీంద్రలోకంబు నే
నీ మ్మాటన్ విని వేగఁ జేరవలెనా? ♦ నీకింత వాత్సల్యమా? 14

---

* టిప్పణి. జాహురాణము = గుఱ్ఱము

ఉ॥ ఈశున కేనిఁ దత్సుతున ♦ కేనియు మే మొనరించినట్టి దే
లేశము దోసమున్నదియె ♦ లేఖులకై యిటులెత్తివచ్చి యా
వేశముతోడఁ జంపెదను ♦ వేపెదనం చదలించినంతనే
దేశముఁబాసిపోవుటయె ♦ దేవబలమంచుఁ దలంచెనే మదిన్. 15

చ॥ సురలకు మాకుఁ గిట్టదెటుఁ ♦ జొప్పడు నెప్పుడు పోరువారికై
దురమున కీర్తిడంగుటది ♦ దూఱగు మానుఁడు మానరేని ని
బ్బిరుదమగండు తారకుఁడు ♦ భీతిలిపాఱఁడు విక్రమింప సం
గరమున కేగుదెమ్మనుము ♦ కాయజవైరితనూజు నిమ్మగన్. 16

వ. మఱియును

చ॥ వననిధులింకినన్ నభము ♦ వ్రాలిన భూమితలంబునందు నా
వనజహితుం డరాళగతిఁ ♦ బట్టిచరించిన నెన్నఁడేనిఁ దా
ననలము చల్లనైన నమ ♦ రాంతకుఁ డీశ్వరుఁడు తారకుండు శ
త్రునివెఱపొంది పాఱుటది ♦ దుర్లభమంచుఁ దలంపు సాక్షిగాన్. 17

క॥ అని యమామికతో నాదూ, తనుగని యిటుచెప్పుమనుచుఁ ♦ దారకుఁడంపన్
ఘనభుజుఁడాతఁడు వీనికిఁ, జనునే హితబోధయనుచుఁ ♦ జనియెన్ వడిగాన్. 18

ఉ॥ తారకుఁ డప్పు డుగ్ర దనుజు ♦ ధాత యొసంగిన మేల్వరంబునా
కారము నెంచి విక్రమముగఁ ♦ గ్రౌంచవిభేదనుఁ డాత్మఁబంచతా
కారణమంచెఱింగియు ని ♦ కామభుజాతతగర్వధూర్వహుం
డై రహిఁబోర నెంచి పృత ♦ నావళి సిద్ధముచేసె నుద్ధతిన్. 19

గీ॥ వీరబాహువు చని తన ♦ విభునిఁజేరి, తారకాసురుముందఱఁ ♦ దా నొడివిన
యట్టి నుడులను వానికి♦ నసురవిభుఁడు, గినిసి యాడిన తెఱఁగు వే ♦ గిరముఁదెలిపె.

చ॥ శివతనుజన్ముఁ డప్డు సుర ♦ సేనలకెల్లను నెల్లి వేగ నా
హవమున కెత్తఁగావలయు ♦ నంచు నెఱుంగఁగఁజాటఁబంచె ది
వ్యవరులు పార్వతీయునిమ ♦ హాభుజవీర్యసమాశ్రయంబునన్
బవరము సేయఁ దారకుని ♦ పట్టణమేగఁగఁబూని రున్నతిన్. 21

-* కుమారస్వామితో దేవతలు తారకాసురునిమీఁదికి యుద్ధంబునకు వెడలుట *-

గీ॥ అంత మఱునాఁటి వేకువ♦ యందు నదితి, నందనులు శైలనందనా ♦ నందనుని బు
రస్కరించి వరూథినీ♦ రాజితోడ, దండయాత్రకు వెడలిరి ♦ తారకుపయి. 22

ఉ॥ అత్తఱి శంకరానుమతి ♦ నంబరభారతి యిట్లువల్కెఁ భా
స్వత్తరవిక్రమున్ గుహుని ♦ వాసిగఁ దోడ్కొనిపొం డితండు దు
శ్చిత్తునిఁ దారకున్ గెడపి ♦ శ్రీల నొసంగఁగలండు మీకు సం
పత్తులఁజెంది యెల్లపుడు ♦ బాగుగ నుండుఁడు రింక నిర్జరుల్!

క॥ అను నభ్రవాణివచనము, విని సుర లౌత్సుక్య మొంది ♦ వీరధ్వనులన్
బొనరింపుచుఁ బెనుపెనఁకువ, దనుజునిఁ జెనకంగఁ దెగువఁ ♦ దాల్చిరి వీఁకన్.

క॥ దండడి దగఁ దా మొందిన, సందడిఁ దీర్పంగడంగి ♦ వైభవమున మి
న్నందుచు సేనలతో సుర, బృంద మసురపురముపొంత ♦ విడిసెఁ గడిమిన్మై.

క॥ గుణఘోషంబులతో భీ, షణతరవిలయాంబువాహ ♦ చటులధ్వనులౌ
రణభేరుల నరిమారణ, చణులై మ్రోగించి రపుడు ♦ సమధికలీలన్.

—* తారకుం డసురసైన్యముతో యుద్ధమునకు వచ్చుట *—

చ॥ అదివిని తారకాసురుఁ డ ♦ హంకృతిమీఱి సమస్తసైన్యముల్
పొదలఁగ వజ్రవర్మమును ♦ భూషణముల్ మణిమాలిఁదాల్చి యిం
పొదవఁగ హేమపుంఖవిశి ♦ ఖోజ్జ్వలతూణముఁ జంద్రహాసమున్
గదను శరాసనంబుఁగొని ♦ కాంచనరత్నరథాధిరూఢుఁడై. 27

క॥ వైణికులు మౌరజికులును, పైణవికులు పటహపణవ ♦ వాదిత్రులు ని
స్సాణధరమగధవంది, శ్రేణులు ఘననినదములను ♦ జేయఁగ వేడ్కన్. 28

క॥ చామరము లిరుగెలంకుల, నామోదముతోడఁగొని సు ♦ రాసులుగొలువం
గా మహితదర్పమున సే, నాముఖమునఁ బొలిచెఁ గడు ఘ♦నద్యుతి మెఱయన్.

క॥ గొడుగులు పడగలు నిగుడఁగ, నడివడి వారువము లెక్కి ♦ వరవీరభటుల్
గడిఁదిమగంటిమి వెలయఁగ, నడిచిరి తారకుని మ్రోల ♦ నయ మెసలారన్. 30

ఉ॥ పర్వతసన్నిభంబులని ♦ భంబుల సింధుతరంగమాలికా
గుర్వనపాయభూరిజవ ♦ ఘోటకబృందములన్ గరిష్ఠగం
ధర్వవహంబులై తగుర ♦ థమ్ముల నుద్ధతవీరయోధులన్
దుర్వహభార మొంది కడుఁ ♦ దూలుచునుండె ధరిత్రి యత్తఱిన్.

ఉ॥ ముగ్గర మొంది నిర్జరు ల ♦ మోఘతరార్భటి నెందుఁజేరి పో
రగ్గిపలెన్ బొనర్పఁగఁ బ్రి ♦ యంపడుచుండిరో యందు వేగఁ జే
రగ్గిపలెన్ గ్రుధాయతశి ♦ ఖాకులితాకృతియై మహోద్ధతిన్
డగ్గఱి తారకాసురుఁ డు ♦ దారుఁ డొనర్చెను సింహనాదమున్. 32

క॥ తోడనె తక్కిన జోదులు, గూడ దిగంతాంతరాళ ♦ కుంభిని యదురన్
గాఢతరగర్జనంబుల, బాఢంబుగసల్పి రపుడు ♦ ప్రౌఢిదలిర్పన్. 33

గీ॥ విబుధు లవ్వాని విని కడు ♦ వేగ ఘనర, ణాభికాంక్షను నేకప ♦ ద్యమున నెదురు
చనిరి పురుహూతుఁడద్రిజా♦తనయుఁడనడు, ధవళవారణ మెక్క ప్రా♦ర్థన మొనర్చె.

గీ॥ వివిధరత్నోజ్జ్వలంబును ♦ వితతసర్వ, సమరసాధనమగు విమా ♦ నము శివాజ్ఞ
దారసించినదానిఁగు♦మారుఁడెక్కె, యింద్రు నైరావణగజంబు♦ నెక్కమనియె

మ॥ గుహునాజ్ఞం గొని యింద్రుఁడెక్కె గజముం ♦ గోవిందుఁడెక్కెం ఖగో
ద్వహుఁ దక్కుంగల వేల్పులెక్కి రెలమిన్ ♦ దత్తస్వహాయానముల్
బహుభేరీమురజాదివాద్యరవముల్ ♦ భాసిల్లె నభ్రస్థలీ
విహరద్గుహ్యకరాజి గూర్చె సుమనో ♦ వృష్టిం గరిష్ఠంబుగన్. 36

చ॥ హరిహయుఁ డగ్రిభాగమున ♦ నాత్మబలంబులతోడఁ జేరె నా
హరియును వీరభద్రుఁడు ప్రి ♦ యంబుగ మధ్య వసించి రింక శం
కరతనయుండు మూలమునఁ ♦ గావుగ నిల్చెను బ్రక్కలందుఁ జా
మరములు దాల్చి వేల్పులు స ♦ మంజసవైఖరి వీచుచుండఁగన్. 37

వ. అంత.

గీ॥ ఉభయసేనలుపోర నొం ♦ డొండుడాఁకు
చుండఁగానప్డు సంద్రముల్ ♦ రెండుగలియు
పోల్కినగుపట్టెఁ దద్ధ్వాన ♦ మును సముద్ర
ఘోషమన నొప్పెనెంతయు ♦ గొప్పగాను.

## —* దేవాసురయుద్ధము *—

క॥ కడఁగి బలోన్మత్తులు గడు, బెడిదపుమచ్ఛరము నిగుడ ♦ భీషణగతులన్
దొడరి పరస్పరము దురం, బడరించిరి యడిదముల మ ♦ హోద్ధృతభంగిన్. 39

గీ॥ భూమియంతయుముండముల్ ♦ మొండెములును, దెగిపడినకాలుసేతులు ♦ దెగిపడినర
థములునుం గూలినట్టి గు ♦ జ్జములుఁగూలి, నట్టియేనుంగులగుపట్టె ♦ గుట్టలట్లు. 40

ఉ॥ కొందఱిబాహువుల్ పడియెఁ ♦ గొందఱి యూరువులున్ దెగన్ మఱిన్
గొందఱిపొట్టలుం బగిలెఁ ♦ గొందఱికంధర లూడె నింకనుం
గొందఱునెత్తుటేర్లొలుకఁ ♦ గూలిరి గొందఱు మ్రింది రంతయుం
గందరగోళమయ్యె క్షణ ♦ కాలములో లయకాలమట్టులన్. 41

క॥ మెఱసెడు కౌక్షేయకములు, నిరవగు బల్లెంపుగములు ♦ నీటెలు బాకుల్
విఱివైన ముద్గరంబులు, పొరిగొనుచుండెను వడిన్ జ ♦ మూతతిసెల్లన్. 42

క॥ ప్రవహించె రక్తవాహిను, లవనిన్ దొరలాడె నుత్త ♦ మాంగంబులునున్
వివిధకబంధములును దా, నవదేవాన్యోన్యకుట్ట ♦ నంబులచేతన్. 43

ఉ॥ అత్తఱి శంకరానుమతి ♦ నంబరభారతి యిట్లువల్కె భూ
స్వత్తరవిక్రియున్ గుహుని ♦ వాసిగఁ దోడ్కొనిపొం డితండు దు
శ్చిత్తునిఁ దారకున్ గడపి ♦ శ్రీల నొసంగఁగలండు మీకు సం
పత్తులఁజెంది యెల్లపుడు ♦ బాగుగ నుండుదు రింక నిర్జరుల్ !

క॥ అను నభ్రవాణివచనము, విని సుర లౌత్సుక్యమొంది ♦ వీరధ్వనులన్
బూనరింపుచుఁ బెనుపెనఁకువ, దనుజునిఁ జెనకంగఁ దెగువఁ ♦ దాల్చిరి వీఁకన్.

క॥ దందడి దగఁ దాకొందిన, వందుటఁ దీర్పంగడంగి ♦ వైభవమున మి
న్నందుచు సేనలతో సుర, బృంద మసురపురముపొంతి ♦ విడిసెఁ గడిమిన్.

క॥ గుణఘోషంబులతో భీ, షణతరవిలయాంబువాహ ♦ చటులధ్వనులౌ
రణభేరుల నరిమారణ, చణులై మ్రోగించి రపుడు ♦ సమధికలీలన్.

—— * తారకుం డసురసైన్యముతో యుద్ధమునకు వచ్చుట * ——

చ॥ అదివిని తారకాసురుఁ డ ♦ హంకృతిమీఱి సమస్తసైన్యముల్
పొదలఁగ వజ్రవర్మమును ♦ భూషణముల్ మణిమాలిఁదాల్చి యిం
పొదవఁగ హేమపుంఖవిశి ♦ ఖోజ్జ్వలతూణముఁ జంద్రహాసమున్
గదను శరాసనంబుఁగొని ♦ కాంచనరత్నరథాధిరూఢుఁడై. 27

క॥ వైణికులు పణారజికులును, సైణవికులు పటహవణవ ♦ వాదిత్రులు ని
స్సాణధరమగధనంది, శ్రేణులు ఘనవినదములను ♦ జేయఁగ వేడ్కన్. 28

క॥ చామరము లిరుగెలంకుల, నామోదముతోడఁగొని సు ♦ రారులుగొలువం
గా మహితదర్పమున సే, నాముఖమునఁ బొలిచెఁ గడు ఘ♦నద్యుతి నెఱయన్.

క॥ గొడుగులు పడగలు నిగుడఁగ, వడివడి వాహనము లెక్కి ♦ వరవీరభటుల్
గడిఁదిమగంటిమి వెలయఁగ, నడిచిరి తారకునిమ్రోల ♦ నయ మెసలారన్. 30

ఉ॥ పర్వతసన్నిభంబులని ♦ భంబుల సింధురతరంగమాలికా
గుర్వనపాయభూరిజవ ♦ ఘోటకబృందములన్ గరిష్ఠగం
ధర్వవహంబులై తగుర ♦ థమ్ముల నుద్ధతవీరయోధులన్
దుర్వహభార మొంది కడుఁ ♦ దూలుచునుండె ధరిత్రియత్తఱిన్.

ఉ॥ ముగ్గర మొంది నిర్జరు ల ♦ మోఘుతరార్భటి నొందుఁజేరి పో
రగ్గివలెన్ బొనర్పఁగఁ బ్రి ♦ యంపడుచుండిరో యందు వేగఁ బె
రగ్గివలెన్ గ్రుధాయతశి ♦ ఖాకులికాకృతియై మహోద్ధతిన్
డగ్గఱి తారకాసురుఁ డు ♦ దారుఁ డొనర్చెను సింహనాదమున్. 32

క॥ తోడనె తక్కిన జోదులు, గూడ దిగంతాంతరాళ ♦ కుంభిని యదురన్
గాఢతరగర్జనంబుల, బోధంబుగసల్పి రపుడు ♦ ప్రౌఢిదలిర్పన్. 33

సీ॥ విబుధు లవ్వాని విని కడు ♦ వేగ మునర, శాభికాంక్షను సేకవ ♦ ద్యమున నెదురు
చనిరి పురుహూతుఁడద్రిజా♦తనయుఁడనదు, ధవళవారణ మెక్కి—పా♦ర్ధన మొనర్చె.

గీ॥ వివిధరత్నోజ్జ్వలంబును ♦ వితతసర్వ, సమరసాధనమగు విమా ♦ నము శివాజ్ఞ
దారసించినదానిఁగు♦ మారుఁడెక్కె, యింద్రునై రావణగజంబు♦ నెక్కెమనియె

మ॥ గుహునాజ్ఞన్ గొని యింద్రుఁడెక్కె గజమున్ ♦ గోవిందుఁడెక్కెన్ ఖగో
ద్వహుఁ దక్కంగల వేల్పులెక్కి రెలమిన్ ♦ దత్తన్మహాయానముల్
బహు భేరీమురజాదివాద్యరవముల్ ♦ భాసిల్లె నభ్రస్థలీ
విహరద్గుహ్యకరాజి గూర్చె సుమనో ♦ వృష్టిన్ గరిష్ఠంబుగన్. 36

చ॥ హరిహయుఁ డగ్రభాగమున ♦ నాత్మబలంబులతోడఁ జేరె నా
హరియును వీరభద్రుఁడు ప్రి ♦ యంబుగ మధ్య వసించి రింక శం
కరతనయుండు మూలమునఁ ♦ గాపుగ నిల్చెను బ్రక్కలందుఁ జా
మరములు దాల్చి వేల్పులు స ♦ మంజసవైఖరి వీచుచుండఁగన్. 37

వ. అంత.

గీ॥ ఉభయసేనలుపోర నొం ♦ డొండుదాఁకు
చుండఁగానప్డు సంద్రముల్ ♦ రెండుగలియు
పోల్కినగుపట్టెఁ దద్ధ్వాన ♦ ముసు సముద్ర
ఘోషమున నొప్పె నెంతయు ♦ గొప్పగాను.

—* దేవాసురయుద్ధము *—

క॥ కడఁగి బలోన్మత్తులు గడు, బెడిదపుమచ్చరము నిగుడ ♦ భీషణగతులన్
దొడరి పరస్పరము దురం, బడరించిరి యడిదముల మ ♦ హోద్భుతభంగిన్. 39

సీ॥ భూమియంతయుముండముల్ ♦ మొండెములును, దెగిపడినకాలు సేతులు♦ దెగిపడినర
థములునుం గూలినట్టి గు ♦ ఱ్ఱములుఁగూలి, నట్టియేనుంగులగుపట్టె♦ గుట్టలట్లు. 40

ఉ॥ కొందఱిబాహువుల్ పడియెఁ ♦ గొందఱి యూరువులున్ దెగెన్ మఱిన్
గొందఱిపొట్టలున్ బగిలెఁ ♦ గొందఱికంధర లూడె నింకనున్
గొందఱునెత్తుటేర్లలోఁ ♦ గూలిరి గొందఱు మ్రింది రంతయున్
గందరగోళమయ్యె క్షణ ♦ కాలములో లయకాలమట్టులన్. 41

క॥ మెఱసెడు కౌక్షేయకములు, నిరవగు బల్లెంపుగములు ♦ నీటెలుబాకుల్
విఱివైన ముద్గరంబులు, పోరిగొనుచుండెను వడిన్ జ ♦ మూతతినెల్లన్. 42

క॥ ప్రవహించె రక్తవాహిను, లవనిన్ దొరలాడె నుత్త ♦ మాంగంబులునున్
వివిధకబంధములును దా, నవదేవానోన్యకుట్ట ♦ నంబులచేతన్. 43

సీ॥ భూతములునుఁ బిశాచముల్ ♦ ప్రేతములును
గాకులును గంకములు నులూ ♦ కములు జంబు
కములు గుంపులుగాఁ గూడి ♦ క్రవ్యభక్షు
ణంబొనర్చుచుఁ గూసెఁ బ ♦ ల్లంబరమున. 44

ఉ॥ తారకుఁ డప్డుసూచి కడు ♦ దర్పమునన్ సురలన్ బలార్పఁగాఁ
దారసిలంగఁ గాంచి విబు ♦ ధప్రభుఁడేచి యెదుర్కొనెన్ సుకహో
దాపులఁ దక్కుదైత్యకుల ♦ నెల్లజులన్ సురపాల్యులాఁగి గో
స్పారవిశేష మేర్పడఁగ ♦ జన్యముసల్పి రనల్పసైఖరిన్. 45

గీ॥ తారకునితోడ శక్రుండు ♦ దంభుతోడ, సప్తజిహ్వుండుజంభుతో ♦ జముఁడుబలుని
తోడ నాశరుఁ డతిబలు♦తోడఁ బాశ, పాణియును బెట్టిదంబగు ♦ బరవసముగ.

గీ॥ కరువలి సువీరుతోడఁ గి♦న్నరవిభుండు, శంభదైత్యునితోడ నీ♦శానమూర్తి
శుంభుతోసూర్యచంద్రులు♦కుంభకుంజ,రాసురులతోడ వనిఁబూని♦రక్కసుమెయి.

చ॥ గొదగొని స్పర్థతో నసుర ♦ కోటియు దివ్యసమూహ మిట్లు దో
ర్మదమొదవన్ బరస్పర ము ♦ మ్నపరాయణులై మహోగ్రపూ
కదనము సల్పుచుండిరి ని ♦ కామబలాఢ్యులు ధీరులెంతయున్
ముదమెదఁజెందఁ బంప లిఁక ♦ భూరిభయంబునఁ గుంది పాఱఁగన్. 48

చ॥ కడువడిఁ బోరుచున్న బల ♦ ఘస్మరుఁ గన్గొని తారకుండు గి
న్కడరి కరిన్ నిశాతవిశి ♦ ఖమ్ములఁ దూలఁగనేసి వాసవున్
బిసుగులఁ బోలి బాణముల ♦ బిట్టుగ వక్షము నాటనేయఁగా
బడలి యతండు మూర్ఛనడెఁ ♦ బాష్పములన్ విడుసన్ మరుద్వరుల్. 49

చ॥ అనలునిఁదొట్టి నిర్జరవ ♦ రాగ్రణులున్ జలమేది యుద్ధతిన్
దనుజులతోడఁ బోరితము ♦ దారుణభంగి నొనర్చి యూర్జిత
ఘ్నసతరవిక్రమోన్నతి ని ♦ తాంతము దుస్సహమాట డస్సి వే
దనఁ గొని యమ్మెసన్ దొరఁగి ♦ భావనచేసిరి భీతచిత్తులై. 50

## —* వీరభద్రుఁడు తారకునితో యుద్ధము చేయుట *—

గీ॥ వారిఁగని దైత్యవర్యు ల♦వార్యపటిమ, సింహనాదంబు లొనరించి ♦ చెలఁగనంత
వీరభద్రుఁడుగన్గొని♦వేల్పుగముల, వెఱపుఁబోకార్చి గణసేన ♦ వెలయఁజేరె.

క॥ ప్రమథగణంబులతోడుత, సమరంబున కాతఁడిట్లు ♦ చనుదేరంగా
నమరులు గ్రమ్మఱ యుత్సా, హముమీఱ రణాభికాంక్షు ♦ లై తోడరుటయున్.

చ॥ సురలఁ బిఱుందఁ జేర్చుకొని ♦ శూరవరుండగు వీరభద్రుఁ డు
ద్ధురతరరోషవేగమున ♦ దోర్బలమేర్పడ రాక్షసావళిన్
బోరిఁబోరిఁ జంపుచుఁ దదధి ♦ పుండయి ఘూర్ణిలు తారకాసురున్
బోరిగొనంగఁ ద్రిశూలమున ♦ మోఁదె సురమ్ముసఁ ఘోరభంగిగాన్. ౫౫

సీ॥ దాన నసురుండుమూర్ఛిలి♦తా రథంబు, నందొరగె నుంతకాలంబు ♦ నమరవరులు
సంతసంబొంది యార్వఁగ♦వంతఁగొని సు. రారు లొక్కింతసేపుదై♦న్యంబుఁ జెంద,

ఆ॥ భయదశూలపాశ ♦ పరశుపట్టిసములు, ఖడ్గముసలగదలు ♦ గరము మెఱయఁ
బ్రమథవీరవరులు ♦ రక్కసు లొండొరుల్, పోరి రనుపమాన ♦ భూరిశక్తి.

ఉ॥ దైత్యవరుండు దెప్పఱిలి ♦ దానవసంఘముపొంగ నాతత
స్తుత్యసపత్నవీరచయ ♦ సూదనమై తగు శక్తి వీరుపై
నత్యురువిక్రమార్భటుల ♦ నార్చుచు వైవ నతండు దాని నై
యత్యకరస్థశక్తిఁగొని ♦ యంతనె వ్రయ్యలు చేసి ధీరుఁడై. 56

సీ॥ * ఇపుడె సమయింతు నిద్దైత్యు♦హీనచరితు, ననికడంగుడు నారదుం♦డతిరయమున
వచ్చియిట్లనివాక్రుచ్చె♦ వరద! యుడుగు, మీవు షణ్ముఖుఁ డేటేఱ్చు♦ నీయసురుని.

వ. అనినంత

క॥ కోపోద్దీపితుఁడై యా, టోపంబున రక్కసున్ దు ♦ డుపుదునని యుఁదా
నోపికతోడఁ గడున్ ముని, యాపాయికమైన వచన ♦ మారసి మరలెన్. 58

సీ॥ అంత మరలఁ గడంగిన ♦ యమరవర్యు, లొక్కపెట్టు నిశాటుపై ♦ నురవడించి
యంపవెల్లినిఁ బరగింప♦నాతఁడలిగి, ప్రతిహతము చేసి యద్దాని ♦ వాసిమెఱయు.

ఉ॥ అందఱు కన్నిరూపులయి ♦ యాతతశక్తి నిశాచరేశ్వరుం
డందఱి కొక్కమాఱె విల ♦ యంబు ఘటింపఁ గడంగి బాణరా
జిం దవహేతులట్టడరఁ ♦ జేయఁగ నేయఁగ నాయమర్త్యుల
ప్డొందఁగరాని వేదనను ♦ నొంది యలందురి కుందుచున్ గడున్. 60

## —* తారక విష్ణుదేవుల యుద్ధము *—

శా॥ వైకుంఠుం డది గాంచి యొర్వక భుజా ♦ వష్టంభమేపార న
న్నాకాధీశ్వరవైరి డగ్గఱి బృహ ♦ న్నారాచధారాతతిన్
జీకాకున్ బడఁజేసి యార్చిన శునా ♦ సీరారి రూక్షాత్ముఁడై
శ్రీకాంతున్ ద్రిశిఖంబునన్ గదిసి మ ♦ ర్దించెన్ సురల్ వందురన్. 61

* వీరభద్రుఁడు తారకవధకై షణ్ముఖునకు వేగముగ బ్రోత్సహించుటకై యట్లు కడంగెను. నార దుఁడనుమానముచెంది యట్లనెను.

చ॥ సాలయుక యంతఁ జక్రి సుర ♦ సూదనుపై గద వైవ నాతఁ డ
త్యలఘురయంబునన్ సునిసి ♦ తాశుగయుగ్మముతోడ దాని వ్ర
య్యలు పొనరించి యార్చి ఘన ♦ మై భయదంబయి యొప్పుశక్తి బి
ట్టలరఁగ విష్ణుపై విసర ♦ నద్ది కఠోరముగాఁగఁ దాఁకఁగన్. 62

—* తారక విష్ణు లొకరిచే నొకరు మూర్ఛితు లౌట *—

కం॥ శోణితంబుదొరఁగ ♦ సుడివడిహరి మూర్ఛఁ, గొని సువర్ణమీఁదఁ ♦ గూలె గరుడుఁ
డాకసమున కెగసి ♦ యాహవంబున కేశ, గాఁగఁజేర్చె నంతఁ ♦ గంజనయను. 63

చ॥ మురరిపుఁ డప్డు మూర్ఛవిడి ♦ మోహరమొంది కడిందిచేవ ని
ర్జరరిపుఁ జూచి నందక ము ♦ రమ్మున నాటఁగనేయ నాతఁడ
త్యురుతరతత్ప్రహారమున ♦ నొడ్డనవ్రాలె రథంబునందు నె
త్తురు వఱదల్ తొరంగఁ గడు ♦ దుఃఖము నొంది తలంక రక్కసుల్. 64

ఉ॥ చెచ్చెర లేచి తారకుఁడు ♦ చిచ్చువితమ్మగ మండుచున్ వడిన్
బచ్చనివల్వ వేల్పు పయి ♦ బాణశతంబులఁ గుప్పె నాతఁడున్
హెచ్చగు పౌరుషంబున స ♦ హింపక నింపె సహస్ర మమ్ములన్
మెచ్చగు వీర లిర్వుర స ♦ మీకము దర్శనయోగ్యమై తగెన్. 65

సీ॥ ఔజసికవరుఁడైన దై ♦ త్యాధినాథు, విక్రమం బంతకంతకు ♦ విస్తరిల్లె
విష్ణువును వెన్కదొక్కక ♦ పక్కసముగఁ, బోరుచుండెను మగసిరి ♦ పొంకమొప్ప

వ. అంత దినాంతంబగుడు నిరుగెలంకులవార లాయోధనంబు విరమించి నిజనివాసం
బుల కరిగిరి. 67

ఉ॥ * చిత్రమగున్ బ్రదోషమునఁ ♦ జీవయొసంగఁ దమోనిశాటుఁ డీ
ధాత్రి సమస్తదేశముల ♦ దక్కని యాక్రమణంబు సేయుచున్
జైత్రుఁడు రాజు వాని బహు ♦ సత్కరంబుల గెంటివైచి స్వ
క్షాత్రముఁ జూపి చెండినయ ♦ శంబన నిండుగఁ గుప్పెఁ గౌముదిన్. 68

గీ॥ చక్రిదుఃఖావహుం డైన ♦ సత్యమగ్రి
వసువును హరించినను గురు ♦ వనితఁ జెంది
నను గువలయేందిర వరియిం ♦ చెను గలాదుఁ
గాముకులు గాంతురే యెందుఁ ♦ గల్మషముల. 69

* తమోనిశాటుఁడు = రాహుదైత్యుఁడు; రాజు చంద్రుఁడు; వాని ( రాహుదైత్యుని చీకటి యను రక్కసుని ) గెల్చెగంటు.

క॥ కావలయశ్రీరతితే, జోవినియోగమున స్రుక్కు ♦ చుఁ గలాదుండున్
వేవచ్చు వికర్తను గని, తా వేగన్ గడలిఁ బడియెఁ ♦ దలఁకుచు నంతన్.
క॥ పోరిపోరిఁ దెలవాఱఁగఁ దా, మరసభవుం డరుగుదెంచి ♦ మకరధ్వజసం
హారతనయున కెఱఁగి యిటుల్, పరమప్రశ్రియ మెసంగఁ ♦ బలికెన్ గలఁకన్.

—* బ్రహ్మదేవుఁడు తారకసంహారార్థమై కుమారస్వామినిఁ బ్రార్థించుట *—

శా॥ ఓ వందారుజనావనోద్యమనిబ ♦ ద్ధోద్యన్మహాకంకణా !
ఓ విశ్వోత్తరశౌర్యధైర్యవిభవా! ♦ యో దేవదేవోద్భవా!
నీ వాలంబును బూని దైత్యానీక ఖం ♦ డింపంగ భావింపుమా!
దేవాత్మవ్యథదీర్పఁగాఁ గడఁగుమా! ♦ దివ్యత్కృపాంభోనిధీ ! 72
శా॥ ఈవిష్ణుం డల జిష్ణుఁడున్ మఱియు వ ♦ హ్నిబ్రధ్నకాలాదులా
దేవారాతిని గెల్వఁజాల రిట సం ♦ దేహం బొకింతేని లే
దీవీ కార్యముఁ దీర్పఁబుట్టితివి సు ♦ మ్మా! లెమ్మిఁకన్ దారకా
భావంబున్ బొసఁగించి మాకుదయసౌ ♦ భాగ్యంబుఁ జేకూర్పుమా ! 73
గీ॥ అనిన శాంకరి ప్రియమంది ♦ యనికి నైయ, నీకినికి సెలవీయ న ♦ స్తోకదీప్తిఁ
బ్రమథవిబుధవరుల్ పటు ♦ భయదతూర్య, రవము లెసఁగఁగ సంగరా ♦ రంభులైరి.

—* రెండవనాఁటి యుద్ధము *—

మ॥ హయహేషల్ గరిబృంహితంబులును ఘం ♦ టారావముల్ శింజినీ
భయదధ్వానములున్ శతాంగతురగ ♦ స్ఫారోల్లసత్కింకిణీ
చయసుక్రేంకృతులున్ రథాంగజనిత ♦ స్వానంబులున్ యోధసం
చయవీరధ్వనులున్ జెలంగె దశది ♦ క్చక్రంబు దూటాడఁగన్. 75
గీ॥ అదరిసైన్యంబు లోకశేవ ♦ నవనివణఁక, మొగ్గరముఁబన్ని యార్వవి ♦ బుధసపత్నుఁ
డాత్మకీయచమూరజం ♦ బంబరంబుఁ, గప్పఁగా నరుదెంచి శం ♦ ఖంబు నొత్తె.
చ॥ గుహుఁడును బూన్కితో దనుజ ♦ కుంజరుఁ దీర్పఁగఁబూని యుల్లస
ద్బహుగణసన్నుతుల్వెలయఁ ♦ బన్నగ వ్యూహముఖంబుఁజేరఁగా
మిహిరసహస్రవిద్యుతుల ♦ మీఱినతేజమువానిఁ బ్రజ్వల
ద్దహనదృగాత్మజాతుఁ గని ♦ తారకుఁ డాత్మఁదలంకి యుల్కునన్. 77
ఉ॥ ఈతనిఁజూడఁగా జగము ♦ లెల్లను నొక్కనిమేషమాత్రలో
నాతతశక్తిఁ ద్రుంపఁగల ♦ యాజసికుండని తోఁచు నీతఁడే
ధాతవరప్రకారమిటు ♦ దారసిలెన్ నిజమాతతాయియై
యీతఱియుద్ధమందు జయ ♦ మెట్లొనఁగూడు నిలింపరాజితోన్. 78

ద॥ సొలయక యంతఁ జక్రి సుర ♦ సూదనుపైఁ గద వైవ నాతఁ డ
త్యలఘురయంబునన్ సునిసి ♦ తాశుగయుగ్మముతోడ దాని వ్ర
య్యలు పొనరించి యార్చి ఘన ♦ మైన భయదంబయి యొప్పుశక్తి బి
ట్టులరఁగ విష్ణుపై విసర ♦ నద్ది కఠోరముగాఁగఁ దాఁకఁగన్. 62

—* తారక విష్ణు లొకరిచే నొకరు మూర్ఛితు లౌట *—

ఆ॥ శోణితంబు దొరఁగ ♦ సుడివడి హరి మూర్ఛఁ, గొని సుపర్ణమీఁదఁ ♦ గూలె గరుడుఁ
డాకసమున కెగసి ♦ యాహవంబున కేఁగ, గాఁగఁ జేర్చె నంతఁ ♦ గంజనయను. 63

చ॥ మురరిపుఁ డప్డు మూర్ఛవిడి ♦ మోహరమొంది కడింది చేవ ని
ర్జరరిపుఁ జూచి నందక ము ♦ రమ్మున నాటఁగ నేయ నాతఁడ
త్యురుతరతత్ప్రహారమున ♦ నొడ్డనవ్రాలె రథంబునందు నె
త్తురు వఱదల్ తొరంగఁ గడు ♦ దుఃఖము నొంది తలంక రక్కసుల్. 64

ఉ॥ చెచ్చెర లేచి తారకుఁడు ♦ చిచ్చువితమ్ముగ మండుచున్ వడిన్
బచ్చనివల్వవేల్పు పయి ♦ బాణశతంబులఁ గుప్పె నాతఁడున్
హెచ్చగు పౌరుషంబున స ♦ హింపక నింపె సహస్ర మమ్ములన్
మెచ్చగు వీర లిర్వుర స ♦ మీకము దర్శనయోగ్యమై తగెన్. 65

సీ॥ ఔజసికవరుఁడైన దై ♦ త్యాధినాథు, విక్రమం బంతకంతకు ♦ విస్తరిల్లె
విష్ణువును వెన్కద్రొక్కక ♦ పెక్కసముగఁ, బోరుచుండెను మగసిరి ♦ పొంక మొప్ప

వ. అంత దినాంతంబగుడు నిరుగెలంకులవార లాయోధనంబు విరమించి నిజనివాసం
బుల కరిగిరి. 67

ఉ॥ * చిత్రమగున్ బ్రదోషమునఁ ♦ జేనయొసంగఁ దమోనిశాటుఁ డీ
ధాత్రి సమస్తదేశముల ♦ దక్కని యాక్రమణంబు సేయుచున్
జైత్రుఁడు రాజు వాని బహు ♦ సత్త్వకరంబుల గెంటివైచి స్వ
క్షాత్రముఁ జూపి చెండినయ ♦ శంబున నిండుగఁ గుప్పెఁ గౌముదిన్. 68

గీ॥ చక్రిదుఃఖావహుండైన ♦ సత్త్వమగ్రి
వసువును హరించినను గురు ♦ వనితఁ జెంది
నను గువలయేందిర వరియిం ♦ చెను గలాదుఁ
గాముకులు గాంతు రే యెందుఁ ♦ గల్మషముల. 69

---

* తమోనిశాటుఁడు = రాహుదైత్యుఁడు; రాజు = చంద్రుఁడు; వాని (రాహుదైత్యుని చీకటి యను రక్కసుని) గెల్చిగెంటు.

క॥ కావలయశ్రీరతి తే, జోవినియోగమున స్రుక్కు ♦ చుఁ గలాదుండున్
వేవచ్చు వికర్తను గని, తా వేగన్ గడలిఁ బడియెఁ ♦ దలఁకుచు నంతన్.

క॥ పొరిపొరిఁ దెలవాఱఁగఁ దా, మరసభవుం డరుగుదెంచి ♦ మకరధ్వజసం
హారతనయున కెఱఁగి యిటుల్, పరమప్రశ్రయము మెసంగఁ ♦ బలికెన్ గలఁకన్.

## —* బ్రహ్మదేవుఁడు తారకసంహారార్థమై కుమారస్వామినిఁ బ్రార్థించుట *—

శా॥ ఓ వందారుజనావనోద్యమనిబ ♦ ద్ధోద్యన్మహాకంకణా !
ఓ విశ్వోత్తరశౌర్యధైర్యవిభవా! ♦ యో దేవదేవోద్భవా!
నీ వాలంబును బూని దైత్యానీక ఖం ♦ డింపంగ భావింపుమా!
దేవాత్మవ్యథదీర్పఁగాఁ గడఁగుమా! ♦ దివ్యత్కృపాంభోనిధీ ! 72

శా॥ ఈవిష్ణుం డల జిష్ణుఁడున్ మఱియు వ ♦ హ్నిబ్రధ్న కాలాదులా
దేవారాతిని గెల్వఁజాల రిట సం ♦ దేహం బొకింతేని లే
దీపీ కార్యముఁ దీర్పఁబుట్టితివి సు ♦ మ్మా! లెమ్మిఁకన్ దారకా
భావంబున్ బొసఁగించి మాకుదయసా ♦ భాగ్యంబుఁ జేకూర్పుమా ! 73

గీ॥ అనిన శాంకరి ప్రియమంది ♦ యనికినై య, నీకినికి సెలవీయ న ♦ స్తోకదీప్తిఁ
బ్రమథవిబుధవరుల్ పటు ♦ భయదతూర్య, రవము లెసఁగఁగ సంగరా ♦ రంభులైరి.

## —* రెండవనాఁటి యుద్ధము *—

మ॥ హయహేషల్ గరిబృంహితంబులును ఘం ♦ టారావముల్ శింజినీ
భయదధ్వానములున్ శతాంగతురగ ♦ స్ఫారోల్లసత్కింకిణీ
చయసుక్రేంకృతులున్ రథాంగజనిత ♦ స్వానంబులున్ యోధసం
చయవీరధ్వనులున్ జెలంగె దశది ♦ క్చక్రంబు దూటాడఁగన్. 75

గీ॥ అసురసైన్యంబు లోకశేవ ♦ నవనివణఁక, మొగ్గరముఁబన్ని యార్వవి ♦ బుధసపత్నుఁ
డాత్మకీయచమూరజం ♦ బంబరంబుఁ, గప్పఁగా నరుదెంచి శం ♦ ఖంబు నొత్తె.

చ॥ గుహుఁడును బూన్కితో దనుజ ♦ కుంజరుఁ దీర్పఁగఁబూని యుల్లస
ద్బహుగణసన్నుతుల్లయఁ ♦ బన్నుగ వ్యూహముఖంబుఁ జేరఁగా
మిహిరసహస్రవిద్యుతుల ♦ మీఱిన తేజమువానిఁ బ్రజ్వల
ద్దహనదృగాత్మజాతుఁ గని ♦ తారకుఁ డాత్మఁదలంకి యుల్కనన్. 77

ఉ॥ ఈతనిఁజూడఁగా జగము ♦ లెల్లను నొక్కనిమేషమాత్రలో
నాతతశక్తిఁ ద్రుంపఁగల ♦ యోజసికుండనితోఁచు నీతఁడే
ధాతవరప్రకారమిటు ♦ దారసిలెన్ నిజమాతతాయియై
యాతఱియుద్ధమందు జయ ♦ మెట్లొనఁగూడు నిలింపరాజితోన్. 78

క॥ పరమేశ్వరుఁ డీతనిఁగని, ధరణిన్ జరితార్థుఁడయ్యెఁ ♦ దానీతండె
పరిమార్చునన్న దృఢమిది, సురలకుఁ గడుసంతసంబు ♦ చొప్పడునకటా! 79

చ॥ అని తృటికాలమిట్లు హృద ♦ యంబుననెంచి యనంతరంబె పా
యని మొనలేని విక్రమము ♦ నారసి యీసున నిప్పై యీతనిన్
జెనకెద నేమిలెక్కయని ♦ సింహరవం బొనరించి దివ్యులన్
గని యిటువల్కె గర్జిలుచుఁ ♦ గాటపునేటగు నల్కయుల్కఁగన్. 80

—* తారకుఁడు విష్ణ్వాదుల నుపాలంభించుట *—

చ॥ మగతన మింతలేక సుకు ♦ మారుఁ గుమారునిఁ దోడు తెచ్చి యి
మ్ముగ రణ మాచరింపుటకుఁ ♦ బూనితి రోరిసురాధముల్! చలం
బుగ నిటువన్నినన్ బ్రతికి ♦ పోవుదురెట్లు మదీయశక్తిచేఁ
బెగడుదురు మీరలిందఱును ♦ దెంపుననిల్వఁడు సంగరంబునన్

వ. హరిన్ బరికించి.

ఆ॥ కమలనయన! నీవు ♦ కాంతాకృతివిగాక, పగఱఁగలనఁజెనక ♦ బలముగలదె
ఎవరినెదిరినాఁడ ♦ వేనాఁడుయుద్ధంబుఁ, జేసినాఁడవీవు ♦ చెప్పుమిప్పుడు. 82

చ॥ అల మధుకైటభాసురుల ♦ నంబుధి మార్కొనలేక లేక్కసై
యలఁతితనంబనాక రొక ♦ యర్థివిధంబున దేవరించి య
ట్లొలసి వధించితీవు మఱి ♦ యొక్కపు డొక్క నెలంతవై సురా
రుల కమృతంబు నీయకయె ♦ రూపడగించితి వోర! వారలన్. 83

శా॥ ఈసంక్రిందనుఁ డొక్కపాటి యతఁడా ♦ హీనాత్ముఁ డన్యాయమా
దోసంబున్ బొనరించె జ్యేష్ఠజననీ ♦ తోషంబు శోషింప ద
చ్ఛీసంతానపుపేశికోశముల వి ♦ చ్ఛేదించె వృత్రాసురున్
మోసంబున్ బొనరించి చంపె నకటా! ♦ మూఢాశయుండై యటుల్. 84

క॥ అని ముప్పిరిగొను కినుకన్, గొని తారకుఁడాదితేయ ♦ కోటిన్ జదిపెన్
గనలేక నాకనాయకుఁ, డనుపమహేతి వజ్రధార ♦ నసురను మోఁదెన్. 85

సీ॥ దానఁ గడుడస్సి తారుండు ♦ దారవినద, మదకరనైగావలగజంబు ♦ నవనిఁగూల్చి
శక్తిచే నిందువ్రపక్షంబు ♦ జర్జరితము, సేయ సుర లాస నదలిగి ♦ జిష్ణుపైని.

—* విష్ణువు తారకునితో యుద్ధముచేసి మూర్ఛిల్లుట *—

చ॥ అదిగని చక్రి బిట్టలిగి ♦ యంతనె రాత్రిచరేంద్రమూర్తిపై
నదటునఁ జక్రముఖ్యవిసర ♦ నయ్యది ఘోరనిపాతతన్ దురా
త్ముఁడగు తారకాసురుని ♦ సంధులు వెల్వడఁజేయ నాతఁ డ
ప్పదమునసే హరిన్ గవిసి ♦ పట్టి యురంబునఁ గొట్టె శక్తిచేన్. 87

గీ॥ శక్తిహతిఁ గమలాక్షుండు ♦ చటులతరని, పీడితుండయి భువిఁబడ ♦ భీరువోయి
యమరసేనలు పాఱఁగ ♦ నంతఁజూచి, వీరభద్రుండు ఘనరోష ♦ వివశుఁడగుచు.

క॥ కరతలశూలముచేత న, సురవరుబిట్టేయ నతఁడు ♦ శూలహతి ధరన్
దొరఁగియు సరకుఁగొనక క్రి, మ్మఱలేచి ప్రచండకోప ♦ మండితుఁడగుచున్.

గీ॥ శక్తిచే వీరభద్రుని ♦ చటులపాత, మొనర నురమునఁ దాడింప ♦ నుక్కుదక్కి
భూతలంబునఁబడిమూర్ఛఁ♦బొందెవీర, భద్రుఁడెంతయుఁబ్రమథులు♦బొప్పములిడ.

ఉ॥ అంత నిమేషమాత్రమున♦నద్భుతవైఖరి లేచి వైరివీ
రాంతకమూర్తి యుజ్జ్వలత ♦ రాయుతతేజుఁడు వీరభద్రుఁ డ
త్యంతరయోద్ధతిన్ బరవు ♦ దాపహభూరివిభావిభాసితా
శాంతము భాస్కరేందుదహ♦నాత్మక ముజ్జ్వలమున్ద్రిశూలమున్. 91

క॥ బిఱబిఱగొని తారకుతల, నఱకుదునని యుద్ధవిజిఁజ♦నన్ షణ్ముఖుఁడ
త్తఱి రయమున నవ్వీరున్, దఱియంగావచ్చియాఁగి ♦ తా నిట్లనియెన్. 92

చ॥ ఉడుగుము సోదరా! యసుర ♦ నుక్కడఁగించి వధింతు నీవిటుల్
దొడరఁగ నేల వీనికయి? ♦ గొడ్డవు బాలుఁడ నేనచాలు వే
ల్పిడిఁ గనుగొంచునుండుఁ డిఁక ♦ లేఖులు నీవును వీనిపైన యీ
డుడుకుఁదనంబుఁ దీర్తుఁబరి♦తోషముఁగూర్తు నిలింపకోటికిన్. 93

గీ॥ అని కుమారుఁడు దత్క్షణ♦మందు నాత్మ, యికమతిన్ నెమ్మనంబున♦హిమగిరీంద్ర
జామహేశ్వరపదములఁ♦జక్కఁగొలిచి, తారకాసురవధను ద్రు♦తమున నెంచి. 94

క॥ భ్రమపడి యబ్జాండమద్రువఁగ, నమితపు గర్జనముచేసి ♦ యసురప్రవరే
ణ్యముఖమునుజేర్చ నప్పదము, నవర్షమొప్పంగఁ జూచి ♦ యతఁ డిట్లనియెన్.

—* తారకుఁడు కుమారుని యుద్ధంబును మానుమనుట *—

ఉ॥ బాలుఁడ వీవు దుర్మతులు ♦ బాసటగాఁ గొని తెచ్చిరిట్లు ని
న్నాలముసేయ నీకలవి ♦ యౌనొకొ యీ సురలెల్ల నా కనిన్
జాలక యోడి యూడిగము ♦ సల్పుచు నుండిరి యింతవట్టిటుల్
జాలవు నీవు చేరు మిఁక ♦ సత్వర మా రజతాద్రిభూమికిన్. 96

క॥ మీజోలికి మీస్రోలికి, మీజాడకు నెప్పుడేని ♦ మే మరుదెంచం
గా జవనం బెదఁజేయము, రాఁజనునే యెత్తి యిట్లు ♦ రాణువతోడన్. 97

వ. వచ్చినను గూడ నిప్పుడు.

గీ॥ చిఱుతపాపనిఁజంపిన ♦ సిగ్గువోడము, నెదు జంకొందెగాని లే♦పరయు వేఱు
తెలుఁగు కొఱమాలిచెడుగులీ♦సురలునిన్ను, నూఁతగాఁదెచ్చిరిచ్చటి♦కువిదల్లు.

చ॥ అనినఁగుమారుఁ డల్లనగి ♦ యాతని కిట్లనియెన్ బిభీషికల్
పనివడ విప్పుడాలమున ♦ బంటుతనంబున నిల్వ లేక నీ
తనుజగణమ్ముతోడ నిజ♦దారయుతిమ్ము రసాతలమ్ముఁగ్ర
క్కునఁ జని యందయుండు మిఁకఁ ♦ గొందల మొందక యెల్లకాలముల్. 99

క॥ మా తెరపు రాకయున్నను, నీతిఁదొరఁగి సురలకలిమి♦నీవుకొని యిటుల్
కాతరులఁజేసి వారల, ఘాతుక! వేధింపుచుండఁ ♦ గాంచుదు పెక్కుల్. 100

వ. మఱియు.

క॥ సను బాలునిగాఁగఁ దలం,చిసఁబోరిడనుగాఁ దలఁచినఁ ♦ జింతయొనగ ది
ష్టనిఁజూతుపు లావంతయుఁ, దినఁబోవుచు రుచులనడుగఁ ♦ దెఱఁగేపసిందుల్.

## —* కుమారతారకుల యుద్ధము *—

గీ॥ అనినవిని దనుజేశ్వరుం♦డాగ్రహమున, నడరి నిశితశరమ్ముల ♦ సంధించెనే
నూజుమ్మైఁబరపిన గుహుం ♦ డోజమెఱయు, వానినన్నిటి నడుమనే♦సమ్ము చేసె.

క॥ పెను బాములవలెఁ జెలఁగెడు, ఘనసాయకముల నురంబు♦గాఁడఁగ నేయం
గను కినుక తారకాసురుఁ, డనువుగ శతకాండములఁ బ్ర♦హరించె గుహుని 103

వ. అంతఁ గుమారుఁ డలఁతినవ్వెలయ.

చ॥ శిరమున ఫాలమందు గళ ♦ సీమ నురంబున బాహులందు ని
ష్ఠురతరతీవ్రబాణములఁ ♦ జొన్పి సిడంబును ద్రుంచి విల్లుఁబో
విఱిచి హయంబులన్ దునిమి ♦ వేసినఁదారకుఁ డుక్కుఁదక్కి స
త్వరముగ శక్తి నూఁతఁగొని ♦ పార్వతిపుత్త్రుసిఁ బాఁకె పీఁకతో. 104

చ॥ హరసుతుఁడున్ రయోన్నతి శ ♦ తాంగముఁ బాసి పదాతియై ద్విష
ద్ధరణకమైన శక్తిఁగొని ♦ దానవనాథు నెదిర్చి యార్చె న
ప్పురమున నొండొరుల్ చెలఁగి ♦ పోరిఁడిగ శస్త్రులఁ బోరుసల్పి రా
దురమును జూడనెంచి కడుఁ ♦ దోస పెసంగఁగ నాకసంబునన్, 105

## —* కుమార తారకుల శక్తి యుద్ధమును వైమానికులు చూచుట *—

సీ॥ గరుడగంధర్వసిద్ధకి ♦ న్నరులు సాధ్య, పరులు విద్యాధరాప్సరో ♦ వర్గములును
ఘనతరవిమానముల నెక్కి♦కాంచుచుండి, రెలమిబలతారతమ్యంబు♦లెన్నుకొనుచు

ఉ॥ తారకకార్తికేయు లతి ♦ దర్పమెసంగఁగ శక్తిహస్తులై
సారెకుఁ దీవ్రఘాతముల ♦ సల్పుచు నొండొరు లేకసీదులై
నేరిమి శూరతాగరిమ ♦ నెక్కొన నొంచుచు మించుచున్ గడున్
ఘోరముగాఁగఁ బోరిరి మ ♦ కుంఠితరీతి నొనర్చి రెంతయున్, 107

మ॥ తలపై నెన్నొసటన్ హనుద్వయిని స్కం ♦ ధంబందు బాహుద్వయిన్
గళమందున్ గయిదోయియుం దురరభా ♦ గంబందుఁ బార్శ్వద్వయం
బుల నన్యోన్యవధేచ్ఛులై పటునదం ♦ బుల్ సేయుచున్ వీఁకతో
బలవద్ఘాతములన్ బొనర్చికొని ర ♦ ప్పాటన్ మృగేంద్రాభులై. 108

క॥ పిఱుఁదివియక యొకరేనియు, బిఱబిఱ నింగి పయికెగసి ♦ బిట్టుగ శక్తి
స్ఫురదురుపాతంబుల నె, త్తురువఱదలుఁ బిశితములును ♦ దొరఁగించి రిలన్.

వ. అయ్యవసరంబున ననన్యసామాన్యవిక్రమధుర్యులగు నవ్వీరవర్యులన్ గాంచి
వైమానికతల్లజులు సాంశయికులై యిట్లు యోజించిరి. 110

ఉ॥ ఇద్దఱునున్ సమిద్ధబలు ♦ లిద్దఱు యుద్ధపటిష్ఠులైన వా
రిద్దఱు దివ్యశక్తిధరు ♦ లిద్దఱు విక్రమధుర్యులైనవా
రిద్దఱు సింహసంహనను ♦ లిద్దఱు ధీరమనీషు లిప్పుడీ
యుద్ధతిలో నెవం డని జ ♦ యించునొ తుత్రించునొ మార్తు సేపునన్. 111

వ. అని యిట్లు యోజించుచున్నంత నభోభారతి యవ్వారల కిట్టులనియె. 112

ఉ॥ ఖేచరులార! కాంచుఁడిఁకఁ ♦ గిల్బిషవర్తను దారకాసురున్
నీచుఁ గృతాపరాధు నవి ♦ నీతు మారాత్మజుఁ డీకుమారుఁ డీ
ర్ష్యాచుచునుండ శక్తిహతిఁ ♦ జొప్పడఁగించి వధించు నిప్డు సం
కోచము మానుఁ డుల్లములఁ ♦ గుందడఁగున్ భువనత్రయంబునన్. 113

ఆ॥ అనిన దివ్యులెల్ల ♦ రాత్మంబులన్ బొంగి, రంబికాతనూజుఁ ♦ డపుడుశక్తిఁ
దారకాసురేంద్రుఁ ♦ దఱిమి యురంబున, మోఁదె నశనిశతస ♦ మానహానిహతి.

క॥ దానఁగడు బడలి యసురుఁడు, దీనుండై యంతలోనఁ ♦ దేఁకువఁగొని యెం
తేనలుక నాత్మశక్తి న, నూనప్రహరణ మొనర్చె ♦ నుద్దవిడి గుహున్. 115

## —* తారకతాడితుండైన కుమారస్వామి మూర్ఛిల్లుట *—

గీ॥ స్కందుఁడద్దాన మూర్ఛిల్లి ♦ క్షణములోన
ఋషిగణస్తూయమానుఁడై ♦ యెఱుకఁజెంది
గంధసింధురవరముపైఁ ♦ గడఁగునట్టి
కొదమసింగంబనా దైత్యుఁ ♦ గొట్టె శక్తి. 116

క॥ ఇవ్విధి నిరువురువీరులు, చివ్వకు జెలరేఁగి విజయ ♦ చింతాలసులై
క్రొవ్వునఁ బోరుచునుండిరి, నివ్వెఱపాటొందె దశ్రిష్ట ♦ నికరము చదలన్. 117

క॥ పవమానుఁ డచలుఁడయ్యెను, రవి తేజుఁదొఱంగె నుర్వ ♦ రయు నానాశై
లవనగ్రామంబులతో, డ విచలితంబయ్యె నెద గ ♦ డలు కొనఁగఁగడున్. 118

గీ॥ అపుడు తుహినగిరీశ్వరుం ♦ డతిరయమునఁ, దనజనంబులతో రణ ♦ స్థలినిఁ జేరి
కందు దౌహిత్త్రుఁగని వేడ్క ♦ బొందుచుండ, నరసి షణ్ముఖుఁడతనికి ♦ బ్లనియె వేగ.

చ॥ అడలకుఁ డద్రిరాజ! హృద ♦ యంబున నెవ్వగఁ జెందఁబోకుఁ డి
ప్పుడ కడతేర్తు నిద్దనుజుఁ ♦ బూజ్యులు మీరలు గాంచఁగా నికన్
బుడమిజనంబు సంతసము ♦ బొంపిరివోవ రహించుఁగాక నా
కడిఁది భుజాబలంబు గల ♦ కాలము కీర్తి వహించుఁ గావుతన్. 120

క॥ అని మనమున గిరిజాశివు, లను భక్తిమెయిసంగఁగాఁ ద ♦ లఁచి మ్రొక్కి విరో
ధినిఁ జంపఁబూని కినుకన్, గొని ఘనశక్తిన్ నితాంత ♦ కుశలోన్నతిన్.

## —* కుమారస్వామి తారకాసురునిఁ జంపుట *—

క॥ భైరవరవ మొనరింపుచు, దారుణతరశక్తిధారఁ ♦ దారకు పోఁదన్
భూరికులశైల మట్టుల, ధారుణి యదురంగఁగూలెఁ ♦ దారకుఁడు వడిన్.

చ॥ కడునిశితప్రహారమున ♦ గాత్రము ఖండితమై నిశాటుఁ డ
య్యెడఁ బుడమిన్ బడంగ నిఁక ♦ నేమియుఁ జేయకయుండె షణ్ముఖుం
డడరి జనంబులెల్లఁగన. ♦ నాదనుజుండు లయంబుఁ జెందెఁ గీ
ర్వాడి పలలాశు లెంతయును ♦ బాఱిరి నల్గడఁ గాందిశీకులై.

లయగ్రాహి:— కొంద ఱలుకొంది ధృతిఁ ♦ జెంది సురబృందముల
నుం దురమునం జెదిరి ♦ మ్రందిరి కడంకన్
గొంద ఱదరొంది గుహు ♦ సుందరపదంబులకు
వందనముచేసి శర ♦ ణొందిరి ప్రపత్తిన్
గొంద ఱెడఁ గుందుచుఁ బి ♦ ఱుందఁ గనుఁగొనుచు బలి
మందిరముఁ జొచ్చి యట ♦ నొందిరి నివాసం
బిందుధరనందనుఁడు ♦ పొందుగ నిటుల్ జయము
నొందె ముదమందిరి ము ♦ కుందముఖలేఖుల్. 124

క॥ అంతఁగని ఖేచరులు గడు, సంతసమున గుహునిజయము ♦ శ్లాఘింపుచు న
త్యంతము గానముచేసిరి, వింతగఁగురిపించి రలరు ♦ విరులసువృష్టిన్.

## —* పార్వతీపరమేశ్వరులు రణభూమికివచ్చి కుమారునిఁ జూచి యానందించుట *—

ఉ॥ శీతమయూఖశేఖరుఁడు ♦ చెచ్చెరఁ బుత్త్రజయోత్సవోన్నతిన్
జేతమునందుఁ దా నెఱిఁగి ♦ శీతనగేంద్రకుమారితో గణ
వ్రాతముతో రణావనికి ♦ వచ్చి కుమారు నిజాంకమందు సం
ప్రీతిమెయిం గూర్చికొని ♦ ప్రీణనమున్ బొనరించె మించుగన్ 126

సీ॥ చాలఁ బ్రేముడితో హిమ♦శైలరాజ
తనయ సుతుఁ ముద్దుచేసి యం♦కమునఁ ధరించెఁ
గుహుఁడు తలిదండ్రులడుగుల♦ కపుడు బ్రియమున
శిరము సోఁకఁగ మ్రొక్కి సం♦బరము గాంచె.

క॥ హిమగిరివరుఁ డత్తఱిఁ దన, కొమరులతో బంధుమిత్ర♦ కూటముతోడన్
హిమకరకిరీటు నార్యను, గొమరునిఁ గని కౌఁగిలించి♦ కొల్లగముదమున్. 128

క॥ దేవతలందఱు శివుఁ డ,ద్దేవిన్ గొమరునిఁ గడున్ను♦తించిరి గంధ
ర్వావిసర మప్సరోగణ, మావేశముతోడఁ బాడి ♦ యాడిరి ప్రీతిన్.

వ. అంత హరిహిరణ్యగర్భాద్యఖిలగీర్వాణశిరోమణులును దేవర్షిప్రవరులు ముని ముఖ్యులు మున్నగువారెల్ల రమితామోదంబున మహోత్సవంబు సంతరించి నానావిధగీతవాదిత్రఘోషసంయుతంబుగ బ్రహ్మఘోషపురస్సరంబుగ నుమామహేశ్వరులకుఁ గుమారునకు విజయనీరాజనంబులుచేసి వినుతించి యర్చించిరి. పరమేశ్వరుం డవ్వారినందఱి నభినందించి జగదంబికను దోడ్కొని ప్రమథగణంబులతోఁ గైలాసపదంబుఁ జేరెనంత.

## —* బాణాసుర ప్రలంబాసుర సంహారము *—

క॥ బాణాసుర పీడితుఁడై, ప్రాణార్తుం డగుచుఁ బోగిలి ♦ క్రౌంచాద్రి యను
ప్రాణపరాక్రము షణ్ముఖుఁ, ద్రాణార్థముచేరి తత్ప♦దముల కొఱఁగుచున్.

ఉ॥ దేవర! నీదుయుద్ధమునఁ ♦ దేఁకువదక్కి పలాయమానుఁడై
యేవలనందొ యుండి యిపు ♦ డిప్విధి బాణదనూజుఁ డుద్ధతిన్
నా వెనువెంటఁ బోచ్చి నిధ♦నం బొనరింపఁగఁ జూచుచున్నవాఁ
డీ వెడఁగున్ వధించి నను ♦ నేలుము శంభుకుమార! కూరిమిన్. 132

వ. అని దీనుండై యర్థించినంత.

ఆ॥ తారకారి దృష్ట♦దైత్యఘ్నుఁడును శర,జాగతావనుండు ♦ నగుట నపుడు
బాణు గుఱిచివైచె♦ఁ బటుతరంబగు స్వీయ,శక్తి నదియుఁ జని ని♦శాటుఁ జదిపి.

క॥ వాని బలగముల నెటకున్, బోనీయక తఱిమిచంపి ♦ పొందికతో నా
ర్యానందనుకర మొందెను, నానాదివిజులు మునులు ఘ♦నంబుగఁ బొగడన్.

గీ॥ క్రౌంచుఁ బరికించి షణ్ముఖుం♦డంచితముగ, కరుణ దొరయంగ నిట్లనె♦ క్ష్మాధరేంద్ర!
నిరవశేషంబుగ నశించె♦నీ పగతుఁడు, బెగడుడిగి చేరఁజను సుఖం♦బుగ మనికికి.

వ. అనిన నతండు ప్రీతుండై దయాసముద్రుండగు పార్వతేయుని యనుగ్రహంబున కలరి మ్రొక్కి నిజధామంబుఁ జేరె నంతలోన. 136

క॥ కుముదుఁడను నాదిశేషుని, కొమరుండు ప్రలంబదైత్య♦కుంజరుచేఁ బ్రా
ణములు పోలిపోవకుండుట, కసరశుభానవహుసుఁ గిల్చి♦పావహు గుహునిఁక.

గీ॥ చేరి మొ్రక్కి జెబివిమఁ♦ జెప్పికొనిరి, తండ్రి! నీమూఁజఁబఁబది పా♦తాళబిలముఁ
జేరిన ప్రలంబదైత్యుండు ♦ తారకాను, చపుఁడు దలఁపరె నన్ను హిం♦సన్ బాసక్ష.

క॥ దీనజనబాంధవుఁడ వ, న్యూనసమాసింధుఁడవు మ ♦ హాగ్రాగాత్రి
ప్రాణశమనుఁడవు సంప్రతి, నిరానను శరణాస్త్ర నునప్రు♦చివా వడపి పృక్ష.

గీ॥ అనినయంత నె హరసూనుఁ♦డాత్మయందు, శిపులనుపలంది నరగున ♦ స్వీయశక్తి
నలప్రలంబాసురునిఁజంప ♦ నంపనదియు, సబలముగవానిఁ బగటఁ ద్రిప్పి♦స్కందుఁ జేరె

తరల. కుముదుఁ గన్గొని యంతఁబత్కాను ♦ గోపతిధ్వజపుత్రుఁ డా
కుమతి దైత్యుఁడు గిటకంగెను ♦ గుండడంగెను నీవు తా
సముఁ దొలంగి గృహంబుఁ జేరుము ♦ సర్వరాజకుమార! నాఁ
బ్రమదమొంది యశంబు చెందె ♦ రాన నాత్మనివాసమున్. 141

—* కుమారస్వామి శివలింగస్థాపనము సేయుట *—

క॥ రక్షోవినాసనమొనరిన, యాక్షేత్రంబందు నమ్మ ♦ హాసేనుఁడు పా
పక్షయదముల్ యనుప ము, హోక్షధ్వజలింగములను ♦ నొప్పిన భక్తిన్. 142

గీ॥ స్థాపనము సేయఁగా నెంచి♦సర్వదేవ, రాజ గోలుసఁగ మంచిమూ♦ర్తంబునందు
శైవలింగ చతుష్టయ♦స్థాపనంబు, చేసె నార్తిజ్యజనును హుసుల్♦చెందియలర.

వ. ఆలింగచతుష్టయంబందలి లింగత్రయంబునకుఁ గ్రమంబుగఁ బ్రతిజ్ఞేశ్వరుండని
యును, కపాలేశ్వరుండనియును, కుమారేశ్వరుండనియును, జయస్తంభోపకంఠ
ప్రతిష్ఠితంబగు నాల్గవలింగంబునకు జయస్తంభేశ్వరుండనియును నామధేయంబు
లర్పించి యర్చించె. హరిబ్రహ్మాది నిఖిల నిలింపప్రముఖులెల్ల యచ్చోట శివలిం
గంబులఁ బ్రతిష్ఠించి పూజించిరని సూతుండు శౌనకాదిమునుల కిట్లనియె.

మత్తకోకిల : తారకక్రధనంబు శైలను ♦ తానుమారజయంబు మీ
కారినట్లుగఁ దెల్పితిన్ గడుఁ ♦ గూర్మి నెవ్వఁడు దీని వి
స్తారభక్తిఁ బఠించినన్ విన ♦ సంతసం బరుదొందఁగా
భూరిభోగములొందు మోక్షముఁ ♦ బొందు సంతసమునందునన్.

గీ॥ అనిన శౌనకముఖ్యులి ♦ ట్లనిరి సూత! , పరమవిజ్ఞానభాగ్యసం ♦ భవవిధాత!
గుహునిలీలల నింకను ♦ గొన్ని సెప్పు, మనినఁ బౌరాణికుం డిట్లు ♦ లనియెఁ బ్రీతి.

క॥ తారకసంహారంబిటుఁ, గూరిచి జయమొందియున్న ♦ గుహునిఁ గని బృం
దారకులందొఱు మ్రొక్కి నుతి, ధారసమధురోక్తులొప్ప ♦ ధ్యానించిరిటుల్.

సీ॥ విశ్వమంగళునకు ♦ విశ్వబాంధవునకు, విశ్వభావనునకు ♦ విశ్వగతికి
తారకదైత్యహం ♦ తకునకు బాణాసు, రఘ్నునకును బ్రలం ♦ బఘ్నునకును
కల్యాణమూర్తి క ♦ కల్మషాకారున, కీశ్వరపుత్త్రున ♦ కిద్ధమతికి
దేవరక్షకునకు ♦ దేవరంజకునకు, దేవసేనానికి ♦ దివ్యకీర్తి 148

గీ॥ కఖిలలోకైకపతికి భ♦క్తాభిరతికి, నతులకరుణాసముద్రున ♦ కభయదునకు
వీరమౌళికి భంజిత ♦ విద్విషాళి, కంజలియొనర్చి మ్రొక్కెద ♦ మనవరతము.

ఉ॥ దేవ! విపత్సముద్రమునఁ ♦ దీఱనిభీతిన నంగలార్చుమ
మ్మ్యావిటు లుద్ధరించితివిఁ ♦ కేమని నిన్ గొనియాడఁజెల్లు మా
కీవె హితుండ వీశ్వరుఁడ ♦ వీవె గురుండవు నీవె తల్లి దం
డ్రీవె మహాత్మ! జోతలివె ♦ యేలుము దీనజనావనక్షమా! 149

క॥ అని మ్రొక్కి యభినుతించిన, యనిమేషాధిపులకెల్ల ♦ నభినవవరముల్
ఘనకృపనొసంగి శికనం, దనుఁ డమితానంద మపుడొ ♦ నర్చెను బ్రీతిన్. 150

గీ॥ హిమగిరీంద్రుని సర్వగి♦రీశ్వరులను, గాంచి శైలంబులెల్లను ♦ గలుమహారము
లై తపస్సంశ్రియంబులై ♦ యలరుఁగాత, దాతయగుఁగాతనాతాత ♦ తాపసులకు

వ. అనియిట్లందఱికి వరంబులొసంగి యున్నంత హరిపురోగములు పార్వతేయునకుఁ గైలాసగమనయత్నంబు నివేదించి యమ్మహాత్ముండంగీకరించినంత మహోత్సవంబుతోడఁ బ్రయాణంబుచేసి.

## —* కుమారస్వామి దేవతలతోఁ గైలాసంబున కేగుట *—

గీ॥ పుష్పకారూఢుఁడై నశం♦భుతనయునకు, హరియునుహిరణ్యగర్భుండు♦హర్షమెసఁగఁ
జామరంబులు పట్టిరి ♦ జంభభేది, పట్టె ధవళాతపత్త్రింబుఁ ♦ బరమభక్తి. 153

క॥ గంధర్వులు స్వర్వేశ్యా, గంధద్విపయానలెల్లఁ ♦ గౌతుకమెసఁగన్
బంధనముల విడి చేసిరి, బంధురగానములఁ దాండ ♦ వంబుల లలిగాన్. 154

చ॥ అమరసమూహ మిట్లు పర ♦ మాదరపూర్వసుఖోపచారముల్
సమధికలీలఁ జేయఁగ వి ♦ శాఖుఁడు లేఖులతోడ రౌప్యభూ
ధ్రము వడిఁ జేరి తల్లికినిఁ ♦ దండ్రికినిన్ బ్రణమిల్ల నప్డు వా
ర్కొమరునిఁ గ్రుచ్చి యెత్తి యుప♦గూహనముల్ బొనరించి రర్మిలిన్, 155

మ॥ దివిషద్రాజియు రాజశేఖరునిఁ ద ♦ ద్దేవిన్ వెసన్ గాంచి భ
క్తినశోద్రేకముతోఁ దదంఘ్రులఁ దలల్ ♦ గీలించి సేవించి సం
స్తవముల్ చేసిరి పెక్కుభంగుల లస ♦ త్సాహిత్యసాహిత్యవై
భవభావస్ఫురితార్థకల్పనలు దీ ♦ వ్యద్భంగి శోభిల్లఁగాన్. 156

## —* దేవతలు శివుని స్తుతించుట *—

సీ॥ తవిలి చితాభస్మ♦ధారియు శివుఁడునై, తనరు ధన్యునకు వం ♦ దనము లివియె
రూపయుక్తుఁడు విశ్వ♦రూపుఁ డరూపుఁడై, పరఁగుమాన్యున కభి ♦ వాదనమిదె
కర్తయు భర్తయు♦హర్తయై జగముల, నలరు విశ్వాత్మున ♦ కంజలులివె
స్థావరజంగమ♦సర్వాత్మయై యేని, కందని ధీరున ♦ కభినుతు లివె
గీ॥ శూలదండకృపాణహ♦స్తునకు నభయ, హస్తున కభీష్టవరదాన ♦ హస్తునకును
అభ్రగంగాజటాలున ♦ కగ్నినేత్రు, నకుఁ బ్రాసర్పదమిపుడు ప్ర ♦ ణామములివె.

క॥ నిరతము మము రక్షింపుము, పరమేశ్వర ! సర్వలోక♦పాలక ! శివ ! నీ
చరణము లేమఱకుందుము, కరుణాకూపార ! సర్వ ♦ కల్యాణకరా ! 158

సీ॥ అమరులయందు బ్ర ♦ హ్మవు రుద్రులం దేవు, నీలలోహితుఁడవు ♦ నీవు దేవ !
ఘనపర్వతములందుఁ ♦ గనకాద్రి వరయన, నక్షత్రమండలిలోనఁ ♦ జందురుఁడవు
ఋషులలోన వశిష్ఠ ♦ ఋషివి దిక్పాలుర, యందు వాసవుఁడ వీ ♦ వనఘమూర్తి !
అఖిలభూతములలో ♦ నాత్మవు సాంఖ్యమ, తములఁ బూరుషుఁడ వీ ♦ వమలతేజ!
గీ॥ అభవ ! నీ రూపకోటిస ♦ హస్రములను, రూపకోటిశతంబుల ♦ నోపి పార
మొంద నేర్తుమె? లోకపా ♦ లోద్యమా! మ, హేశ! సర్వేశ! సకలని♦వేశ!యీశ!

## —* దేవతలకు శివుఁడు వరంబు లిచ్చుట *—

గీ॥ సముద్రిక్తుఁడై యిట్లు నుతియించు ♦ నాకచరుల, సర్వదేవేశ్వరుఁడు గాంచి ♦ సంతసమున
నిట్లు పల్కె దయాళుఁడై ♦ యింపుగదురు, సజ్జనులకెందు సౌఖ్యంబు ♦ శాశ్వతంబు.
గీ॥ దుష్టులగువారిఁ బొలియింప ♦ శిష్టజనుల, రక్షణము సేయ ధర్మసం ♦ రక్షణంబు
సేయుటకుఁగాఁ బ నేనిట్లు ♦ చెన్నలరుట, దివ్యులారా ! మహాతపో ♦ భవ్యులారా !
క॥ మీకెప్పు డెప్పుడు వెతలు, చేకూరిన నన్నుఁదలఁపు♦సేయుండు మీ
రాకష్టంబులు దీర్చెద, శ్రీకరసౌఖ్యంబు లొసఁగఁ ♦ జేసెద వేగన్. 162
గీ॥ అనిన నాపరమేశుని♦యనను సౌఖ్య
మునకు సంబరమును జెంది♦ మ్రొక్కి హరియు
ఖామరులు సెలవొంది త♦ద్ధామములకుఁ
బోయి సుఖముండి రెంతయు ♦ హాయియమర. 163

వ. పార్వతీపరమేశ్వరులు దేవసేనాగుహులతోఁ గైలాసాచలంబందు సుఖంబున నున్నంత

## —* నారదుఁడు కుమారస్వామికి వల్లీసౌందర్యమును జెప్పుట *—

ఉ॥ నారదుఁ డొక్కనాఁడు శివ ♦ నందనుఁ డిష్టులతో విహారకే
ళీరతుఁడై రమించు నెడ ♦ లీలగఁ జేరి సమస్తలోకసం
చారమునందుఁ గాంచిన ప్ర ♦ శస్తతరాద్భుతవస్తువృత్తముల్
గూరిమిఁ జెప్పుచుండెఁ గడు ♦ కోర్కెమెయిన్ వినుచుండె స్కందుఁడున్. 165

ఆ॥ చాలసేపు చెప్పి ♦ జటిలుఁ డంతటఁ జెప్పె, వినుము శంభుతనయ! ♦ విన్నవింతుఁ
గంటి నొక్కచోటఁ ♦ గన్నులపండువై, మనమునలరఁ జేయు ♦ మంచితొడవు. 166

క॥ భిల్లపురి నొక్కరుఁడు శో, భిల్లుచుఁ దనరారు సిరులఁ ♦ బృథ్వీస్థలిపై
భిల్లులకెకిమీఁడై స్తం, భిల్లఁగఁ జేయును జగంబు ♦ భీషణదృష్టిన్. 167

చ॥ శివుఁడను మానితల్లజుఁడు ♦ శ్రీదయితాంశుఁ డొకండు లోచనో
త్సవనవయౌవనన్ హరిణిఁ ♦ జక్కఁగఁ గాంచి భ్రమించి స్వీయపుం
బ్రవిమల వీర్యముం విడువ ♦ బాగుగ నద్ది గ్రహించి బాలికన్
నవనళికోమలన్ గని వ ♦ నంబునఁ బాసి చనెన్ యథేచ్ఛమై, 168

ఉ॥ మానియు వీర్యపాతమున ♦ మానసమందుఁ గలంతనొంది యెం
తేనియుఁ జింతసేయుచు నె ♦ ఱేఁజనె భిల్లవతంసుఁడా స్థలిన్
మానుగఁ జేరి బాలను స ♦ మంచితబాలశశాంకఫాల న
న్యూనగభస్తిజాలఁ గని ♦ యుత్సుకుఁడై గొనిపోయె నాదృతిన్. 169

గీ॥ ఇట్లు దొడ్కొనిచని తన ♦ యింతికొసఁగఁ, బెంచె గారాబమెసఁగ న ♦ మ్మించుఁబోఁడి
యిపుడు బాల్యదశను వీడె ♦ నించుమించు, గానఁ జెంగింతు వినుమ య ♦ క్కల్కి తీరు.

గీ॥ కలికి దీనులపాలిటి ♦ కల్పవల్లి, సకలజనమోహనాతను ♦ చాపవల్లి
ఏసుకృతశక్తిధరునకో ♦ హృదయవల్లి, తన్వి యాహ్వాయమరయు సౌం ♦ దర్యవల్లి.

ఆ॥ బాలయొడలిచాయ ♦ పసకోడి యపరంజి, యప్పు చెంది స్వర్ణ ♦ మయ్యెఁ బుడమిఁ
దగినవారితోడఁ ♦ దగుఁగాక మచ్చరం, బధికులందు నొంద ♦ హానిగాదె.

సీ॥ తమ్ములో చివురుమొ ♦ త్తమ్ములో కోకన, దమ్ములో కొమ్మపా ♦ దమ్ములొక్కొ?
నిమ్ములో చక్రివా ♦ కమ్ములో భర్మఘు, టమ్ములో కల్కికు ♦ చమ్ములొక్కొ?
అమ్ములో నీలోత్ప ♦ లమ్ములో చపలమీ, నమ్ములో చెల్వనే ♦ త్రమ్ములొక్కొ?
భమ్ములో నవమౌక్తి ♦ కమ్ములో మేలికుం, దమ్ములో నవలార ♦ దమ్ములొక్కొ?
గీ॥ నమ్మకములైన నీలర ♦ త్నమ్ములో? ఘు, నమ్ములో? తుమ్మెదలో? చికు ♦ రమ్ములొక్కొ?
ఆ హిరణ్యోదరునకు శే ♦ షాహికేని, దరుణి రమణీయతను దెల్పఁ ♦ దరమె ధరణి.

క॥ కమలము కమలము శశిబిం, బము శశిబింబమె యరయన ♦ వతువచ్చునొకో
కమనీయకోమలంబగు, రమణీమణి మోముతో న ♦ రాతివిఘాతీ! 174

క॥ మంకెన మంకెన యాటన్, జంకెనసి విరిసెవరిష్ఠ ♦ జపయును విరిసెన్
సంకుమదగంధివాతెఱ, బింకపురుచికోడి క్రొంచ ♦ ఖేదన వినుమా! 175

మ॥ తరుణీకైశికకృష్ణసంపదను జెం ♦ దన్ బర్హిభోగీంద్రముల్
చిరకాలం బటవీబిలస్థలులఁ దా ♦ ల్చెన్ దాపమున్ జెందఁ గా
ర్ష్ణ్యరమన్ గాంచెను దండశూక మిఁక నా ♦ ట్యాసక్తమక్కేకి తాఁ
బొరయన్ జాలక కుండలీంద్రతతులన్ ♦ బొక్కున్ ధరామండలిన్. 176

గీ॥ * అతనువైభవమున నొప్పు ♦ నాకెనుకుచ, కటితటులఁబోలలేక య ♦ క్కసునడుము
తానవగఁబొందెనందురు ♦ ద్రిష్టలట్లు, కాదతనువైభవంబునే ♦ కాంచెనదియు. 177

గీ॥ అధిప! చందనగంధిదే ♦ హంబుసౌర, భమున కలరి ప్రచండ స ♦ ర్పములు చేరి
పాయకున్నవియే వేళఁ ♦ బణఁతియూరు, వేణియనుదంభమునఁగడు ♦ వేడ్కమీఱ.

గీ॥ తావిచైతన్యమలరుకుం ♦ దనపుబొమ్మ, స్థైర్యమవయవములుగల్గు ♦ చపల యెప్పుడు
కుందునొందక యలరారు ♦ నిందురేఖ, అరయ నఖిలజగన్మోహ ♦ నాంగి రమణి.

సీ॥ చక్రవాకస్తని ♦ సారంగలోచన, భాసురశంకరా ♦ భరణవేణి
ఆభోగకటికి ♦ రణావళికంధర, సింహేంద్రమధ్యమ ♦ శ్రీశ్రుతిపుట
పున్నాగవరయాన ♦ మోహనవీక్షణ, నళినకాంతికపోల ♦ లలితహాస
కమలామనోహారి ♦ గౌరీమనోహారి, అలసరస్వతిమనో ♦ హారి లతాంగి

గీ॥ అమృతవాహినీవ్యాహార ♦ హంసనాద, కామవర్ధని ఘనరత్న ♦ కాంతి మలయ
మారుతసుగంధి కల్యాణి ♦ ధీరమూర్తి!, షణ్ముఖప్రియయగునది ♦ చక్కనరయు.

చ॥ కమలజుఁ డొక్కనాఁడు కుతు ♦ కమ్మున సర్వసునృత్యశాస్త్రభా
గ్యములను జెప్పుచున్ దొడరి ♦ కాంతితరాంగకవల్లి క్రౌంచభి
ద్రమణియగున్ జుమీ యనియె ♦ రాజకిరీటకుమార! మేటిసా
ఖ్యము పొయిఁ బల్కినాఁడ విను ♦ హార్యగ నీకడ నింతవట్టునున్. 181

చ॥ అని యుపదేశమిచ్చి కొన్నినుడు ♦ లట్టులె పల్కి మునీశ్వరుండు చ
య్యన నగజాకుమారకుని ♦ యానతిఁ గైకొని పోయె నిందుమం
డనతనయుండు చిత్తమున ♦ నారదసూక్తుల నావటించి వ
ల్లిని సతిఁగాఁ గొనన్ బురుడు ♦ లేని తమిన్ గొనె నెంతయేనియున్. 182

* టిప్పణి :—అతనువైభవమున = 1 మన్మథవైభవమున, 2 విస్తారవైభవమున
కుచకటులఁబోలలేని నడుము తానవంబొందెనందురు (కృశతనొందినదని యందురు.)
కాని యట్లుకాదు. అదియు—అతనువైభవము నే 1 (మన్మథవైభవమునే)
2 నవిద్యతే తను (సూక్ష్మం) యస్మాత్తదతను — తస్యవైభవ మను విగ్రహమున
అతనువైభవమునే కాంచెన్ (చెందె) నని యన్వయము.

## —* నారదుఁడు భిల్లపురంబున కేగుట *—

కం॥ కొన్నిదినంబుల కాముని, సన్నుతుఁడు పుళిందపురముఁ ♦ జక్కనరిగి సం
పన్నిధి యగు భిల్లవరున్, గన్నంత నతండు మ్రొక్కి ♦ గారవ మొప్పన్. 183

గీ॥ తేనియను జారపప్పను ♦ దీఁడునిపలు, ఫలములను బూవులను దెచ్చి ♦ భక్తితోడ
నిచ్చి సేవించి నిలిచిన ♦ యెఱుకఱేనిఁ, గాంచి హర్షించి యనియె ని ♦ క్కరణి మౌని.

ఉ॥ సేమమె నీకు నీసతికిఁ ♦ జెల్వగు నీసుతయైన వల్లి కా
తామరసోద్భవుండు నిను ♦ ధన్యునిఁజేయు తలంపుతోడ నీ
శ్రీమతి నీకు బుత్త్రికను ♦ జేసెఁ బ్రియంబుగ వ్యాధనాథ! మి
మ్మామె భవాంబురాశిఁ దరి ♦ యింపఁగఁ జేయును నమ్ము నా నుడిన్. 185

గీ॥ అనినయంత నెయ్యాభిల్లుఁ ♦ డాత్మసుతను, దెచ్చి మౌనికి మ్రొక్కించి ♦ యిచ్చ మెఱయఁ
బేర్మిఁ దనతోడఁ గూర్చుండఁ ♦ బెట్టుకొని ము, నీంద్రునకు నిట్టులనియె నెం ♦ తేనిఁ బ్రీతి.

కం॥ దేవర! నాసుతకు మగం, డేవాఁ డెట్టిండగునొకొ ♦ యెఱిఁగింపుము పెం
డ్లే వేళ యగునొ మీనుడి, యా వేదము పగిది సత్య ♦ మందురు గఱువల్.

## —* నారదుఁడు వల్లికి కుమారస్వామి భర్తయగు నని చెప్పుట *—

వ. అనిన నారదమునీంద్రుం డిట్లనియె.

చ॥ శివునకు గట్టురాసుతకుఁ ♦ జెల్వగునందనుఁ డాదితేయసై
న్యవిభుఁడు తారకాసురని♦హంత ప్రలంబవిఘాతి బాణదై
త్యవధకరుండు క్రౌంచగిరి♦దారణుఁ డాఢ్యుఁడు కార్తికేయుఁ డీ
లవలిని రాణిగాఁ గొనఁగ♦లండు దృఢంబు వనేచరాగ్రణీ! 187

కం॥ పూర్వజనినుండి వీరల, కిర్వురకుఁ బరస్పరేచ్ఛ ♦ యెలరిన దాటన్
శర్వకుమారుండే యీ, పర్వేందుముఖిన్ వరించుఁ ♦ బరమప్రీతిన్. 188

వ. వివాహంబు నచిరకాలంబులోనగునని యమ్ముని యథేచ్ఛన్ జనియెనంత సౌం
దర్యవల్లియు నుల్లంబున నుల్లసిల్లి పరమేశ్వరకుమారలీలల నభినందింపుచుఁ
దత్పాణిగ్రహణంబునకై నిరీక్షించుచుండె నంత నొక్కనాఁడు. 189

కం॥ నారదముని చెప్పినటుల్, నీరజముఖి వల్లి రామ♦ణీయకతను జే
తోరాజీవంబునఁ గడు, ధారణ నొనరించి క్రౌంచ ♦ దారణుఁడు దమిన్.

కం॥ సింగారమునకు నిధియఁట!, రంగారు వనేచరాధి♦రాట్సుతయఁట! నా
కుం గేహిని యగునని చ,క్రాంగశతాంగుండు చెప్పె♦నఁట దన సుతుతోన్.

క॥ కావున నే నా వల్లిని, దేవిన్ గాఁ గొనకయున్నఁ ♦ దేజుగలదొకో?
యేవిధముగనైనను వల్లీవనజేక్షణను బెండ్లి♦లిన్ జేకొనెదన్. 192

## —* కుమారస్వామి భిల్లయువకరూపముతో వల్లిఁ జేరవచ్చుట *—

క॥ అని యొక నిషాదరాణ్ణం,దనురూపముఁ జెంది భిల్ల♦తల్లజు ఫురికిన్
జని యటఁ బ్రియంగువనిఁ గాఁ,పునొనర్చెడు వల్లిఁ గాంచి ♦ భూరిప్రీతిన్.

చ॥ స్తుతిఁ జనుకొంటి నారదుఁడు ♦ చోద్యముగా వచియించినట్టి యీ
యతులితమోహనాంగివిగ ♦ మాతఁడు సెప్పినదింతచాల దీ
సతిరుచిరాంగకంబులకు ♦ సాటియొకం డిల లేదు నిక్క మీ
క్షితిఁ బరమేష్ఠిసృష్టి కిది ♦ సేయు నపూర్వపు గర్వసంపదన్. 194

ఉ॥ ఇంచుక దవ్వులన్ నిలిచి ♦ యిట్లు మదిన్ దలపోసి యంతనే
మించుపసిండిబొమ్మ యగు ♦ మీనవిలోచన చెంతకేగి మో
హించి యిటుల్ నచించె రమ♦ణీ! నినుఁగోరి భవత్పురం బిటుల్
కొంచక యేగుదెంచితిని ♦ కోమలి! నాపయిఁ జూపు ప్రేముడిన్. 195

ఉ॥ రాజవతంసనందనుఁడ ♦ రాజముఖీ! నిను భార్యగా వచో
రాజు విధించె నారు రతి♦రాజు మదిన్ ద్వరపెట్టుచుండె నీ
రాజదుదారభావము వి♦రాజిలఁగా వరియింపు నన్ హరి
ద్రాజియు నీ వెలుంగు దిన♦రాజముఖుల్ గురుతింప నింపుగన్. 196

క॥ కలికీ! వలపులచిలుకల,కొలికీ! వలరాచవాని ♦ గొనబౌ లేఁబూ
ములికీ! చలపూనక నా, పలుకీడేర్పన్ దలంపు ♦ పద్మదళాక్షీ! 197

క॥ అనుమానింపక మచ్చికఁ, గొనుమా! నా మదిని మిగుల ♦ గుణవంతముగాఁ
గనుమా! వినుమా! నిను మా,నిని! మాన్యతఁ జేకొనెదను ♦ నిక్కంబుసుమా!

క॥ లేమావివిసలతూపుల, లేమా! మన మెదిరి గెలువ♦లేమా ర్తిఁబడన్
లే మాపురుసేలఁగ నా,లేమాతుల బొంపములఁ గ♦లియఁగన్గొనుమా!

క॥ అను కృతకభిల్లపతినుతిఁ, గని దిగ్గునలేచి బ్రమసి ♦ కౌతుకమున ని
ట్లని తన మనమున యోజిం,చెను వల్లి నితాంతవిమల♦శీలముతోడన్. 200

క॥ నారదముని చెప్పిన పోం, పారయ నీ తరుణపురుషు♦నం దొప్పెడు మేల్
కూరిమి నా మది కీతని,పై రంజిల్లెడు నితండె ♦ భర్గసుతుఁడొకో! 201

క॥ ఏమైనను నిటుఁ జెప్పెద, నామీఁదన్ దెలియవచ్చు ♦ నని వల్లియుఁ దా
నామోదంబున ననె దాక్షి,ణ్యామధురిమధురవచఃప్ర♦సాదం బమరన్. 202

గీ॥ కన్నియను దలిదండ్రులు♦గలరు భిల్ల, దంపతులు నాకు నదిగాక♦తరుణరాజ
భూషణకుమారు నాత్మవి♦భునిగఁ గోరి, యర్పణముచేసితిని హృద♦యంబతనికి.

వ. కావునఁ గరుణించి మన్నింపుఁ డనుటయు.

తరల॥ అనినయంత నె యక్కుమారకుఁ ♦ డాత్మరూపముఁ జూపి మా
నిని! యింక వరియింపుమీ నను ♦ నేస్తమొప్పఁగ నీసఖీ
వనజబాణునియుప్పుఁ దీర్చెద ♦ వాస్తవంబుగ నిప్పనా
వనజలోచన! పొంగి మ్రొక్కె న♦వార్యహార్ద వికాసయై. 205

—* భిల్లుఁడు వల్లిని గృహంబునకుఁ గొనిపోవుట *—

వ. అంత మధ్యాహ్నకాలంబగుట నప్పులిందేశ్వరుండు నిజకుమారీసందర్శనత్వరాయమాణమానసుండై పరిచారకవర్గంబులతో నచ్చటికివచ్చుటం గాంచి శక్తిధరు డొక్కసహకారకుజంబై నిలిచియుండ భిల్లుండుచేరి యద్దానికలవోక నవలోకింపక కూఁతునుపలాలించి మధురఫలంబులిచ్చి తోడ నబ్బాలికన్ దోడ్కొని నిజనివేశనంబునకుఁబోయె నంత షణ్ముఖుండు.

చ॥ తొలుతటిమాటె కన్నియను ♦ దొందరసేయఁగఁ గూడ దంచు ని
మ్ములఁ జెలిమిన్ బొనర్చి మదిఁ ♦ బొందికఁగూరిచి తన్విఁ జేకొనన్
వలయునటంచు నెంచఁగ న ♦ వాంతర మిట్లొనఁగూడె నెట్లిఁకన్
గలికినిఁ జేకొనన్ గలను ♦ గట్టిఁడిదైవము! చెట్టఁగూర్చితే! 206

సీ॥ రంగారుచనుకట్టు ♦ రాణ కుచ్చితిఁగాని, చెలినొక్కమా ఱక్కుఁ ♦ జేర్పనైతి
కెంపువాతెఱఁ జూచి ♦ యింపుఁజెందితిఁగాని, యార్తిదీరఁగఁ దేనె ♦ నానసైతి
శోభించు నగుమోము♦ సిరికిఁబొంగితిఁగాని, గోర్కెలూరఁగముద్దు♦గొనఁగనైతి
ఘనమైన జఘనంబు ♦ గరిమ మెచ్చితిఁగాని, తొడఁజేర్చి లాలింపఁ ♦ దొడరనైతి

గీ॥ ఘుమఘుమంఘుమఘుమంఘుమల్ ♦ గుప్పు సురభి
కాంగలతికను గన్గొని ♦ యాసపడితిఁ
గాని రయమున బిగ్గరఁ ♦ గౌఁగిలింప
నైతి ననభిజ్ఞహృదయుఁడ ♦ నైతి నకట! 207

ఆ॥ కొట్టుచేను నాకుఁ ♦ గొట్టుచేనయ్యె ని, ప్డేమిదలఁపఁగలుగు ♦ నేమిలాభ
మనుచు సాంధ్యవేళ♦యగునంతవఱ కటఁ, గడపి తత్పురాంతి ♦ కమునుజేరి.

క॥ ఒక పద్మాకరనికటము, చకితుండై చేరి నిలిచి ♦ సమయదిదృక్షా
త్మకుఁడై యుండుడు జైవా, త్ృకముఖవల్లియు నితాంత ♦ దీనతతోడన్. 209

## —* సౌందర్యవల్లీ విరహము *—

సీ॥ అవధూతయై పృథ్వి ♦ యంతఁ గ్రుమ్మరువేల్పు, జడదారి యేటికి ♦ చ్చటికివచ్చె?
వచ్చిన నామాట ♦ హెచ్చరించి గుహుండు, పతియగునం చేల ♦ పదరిపలికె?
పలికినప్పటికి నా ♦ భావమాయనఘుఁడై, ననురాగభర మేల ♦ యలముకొనియె?
అనురాగవతినైన ♦ నమ్మహాత్ముఁడు గని, కర మెంచి యిటకేల ♦ కదలివచ్చె?

ఆ॥ వచ్చి తన్నుఁ దెలిపి ♦ ముచ్చటించినయంత, జనకుఁడరుగుదెంచి ♦ చనవుమీఱ
మందిరంబు నన్నుఁ ♦ జెందింపు టదియేల?, పైన మేల తప్పఁ ♦ దలఁచె నిట్లు?

సీ॥ నను జేరఁదమిమీఱ ♦ మనసూర నిటుదార, సిగ్గోర విభుని తెరా ♦ జింపనైతి
తనరూపుఁ జూపిచే ♦ కొనని పియ స్నయు, న్నన మోహనాకృపఁ ♦ గాంచనైతి
లలితవిహారప్రియా ♦ లాపాతురను లజ్జే, తమలర్పఁ బ్రియుఁడంబుఁ ♦ దలఁపనైతి
తేపతేపరుకొక్క ♦ తీసిపరాకున మారు, నేలుదమన్నప ♦ ల్కులుఁగనైతి

గీ॥ మృగమదంబును మెల్లగే ♦ దఁగినిగలను, దేనెపహాకారఫలములం ♦ దిద్దియిచ్చి
వరవుహంబొనరింపఁగఁ ♦ బరఁగనైతిఁ, దప్పనులోనైతి శ్రీకెట్లు ♦ దపులఁబడితి.

క॥ తండ్రియలుఁ జెప్పఁగ రా, నుంటెదనిటఁ గొంతతడవిఁ ♦ దుగాత్రిపము
ద్దండసమయమిది రానని, యుండక వచ్చితిని విధికి ♦ నోడితినిట్టుల్.

ఆ॥ అలుకఁ జెందెనొక్కొ! ♦ యాడిపోయెనొకో! ఘ, నసున విసిగెనొక్కొ! ♦ నమ్మకంబు
బాసెనొక్కొ! మరలఁ ♦ బయనమై హటగిరి, కేగెనొక్కొ! కాంతుఁ ♦ జేమిసేతుఁ

వ. అని వితర్కించుచు.

ఉ॥ దాయనుబోలెఁ బాసితిగ ♦ దా యను పేర్కొనమాట దోఁచలే
దాయను నంటె యుండవల ♦ దాయను బూవిలుకాఁడ! నీకు వా
దాయను గన్న నేదబిసు ♦ దాయను నేరికి నిష్ట బాలిగా
దాయను నాడు భాగ్యముగ ♦ దా యను వేగుచు వెక్కసంబునన్. 214

ఉ॥ దైవమ! మేలుసేఁత తగ ♦ దాతగదాఁకొనఁజేయు! నాథు న
న్నివిటుఁ గుంవఁజేయఁదగు ♦ నే తగు నేర మదేమి చెప్పు? ఖిం
కీ వడుపొప్ప వంత నల ♦ యించిన యెంచనె రానివేసటన్
బోవిడుదానఁ బ్రేమములఁ ♦ బూనికఁబూని కరంబు చెచ్చెరన్. 215

గీ॥ అనుచు నెనలేని విరహార్తి ♦ నాత్మఁ బొగులు
చున్న యున్నులమిన్న మ ♦ హోన్నతంపు
టార్తిఁ గన్గొని నెయ్యంపు ♦ టతివ లపుడు
వగచి రెంతేనిఁదోఁచక ♦ వనటమీఱి. 216

## —* చెలిమికత్తె వల్లిఁ గొనిపోయి కొమరుసామి కప్పగించుట *—

ఆ॥ చతురమతియనాఁ బ్రియసఖి సహించిన, పణఁతియొకతె దాను ♦ పహ్వారంబు
నరసి వల్లిహృదయ ♦ మరసి యుత్పలపాళి, జెంగి యిట్టులనియెఁ ♦ బ్రియముమీఱ.

ఉ॥ చక్కెరబొమ్మ! యేల? యిటు ♦ జాలిమునుంగఁగ నేనపోయియా
చక్కనివాని నిచ్చటికిఁ ♦ జక్కఁగఁ దెచ్చెదఁ గాకయున్నచో
నక్కడి జాడగాంచి నిను ♦ నచ్చొటికే కొనిపోదు నేఁడు నీ
యక్కఱఁదీర్తు నెట్లయిన ♦ నమ్మరొ! యుమ్మలికమ్ముఁ బాయుమా! 218

క॥ నిను బెండ్లాడఁగ వచ్చిన, ఘనుఁ డప్పుడె చనఁడు దనయ ♦ గారంబున కిం
దు నెటేనిఁ బొంచియుండెడు, వనజేక్షణ! వాని వెదకి ♦ వచ్చెద వేగన్.

గీ॥ అనిపలుకు కల్కియాదర ♦ మరసివల్లి, యొక్కతామరపాకు నం ♦ దొక్కహృద్య
పద్యములిఖించి బాష్పంబు ♦ పడగనీక, గద్గదస్వరమొప్పని ♦ క్కరణిఁజదివె.

సీ॥ క్షమియింపుమనిన దో ♦ సంబేలచేసితి, వనుటకు బదులేమి ♦ యనఁగవలయు
స్వామివిహారమక ♦ సర్వంబునకునన్నాఁ, బునరుక్తిఁ బలికెదే ♦ యనుటకెటులు
ఆర్తరక్షాశాలి ♦ వారయుమందునా, అరసిరానెఱుఁగవై ♦ తనిననేమి
సైపఁజాలను జాగు ♦ చతుర! యందున వట్టి, యుదయుగఁదలఁచెదే ♦ యనుటకెట్లు

గీ॥ ఏమనిననేమితప్పనో ♦ యెఱుఁగఁజాల, నన్నియునెఱుంగుదువొ ♦ డవీ ♦ వనఘచరిత!
నీదుదయ నాదుభాగ్యంబు ♦ వాదిఁకేల, తరుణకమనీయరాజమూ ♦ ర్ధన్యతనయ!

వ. అట్లు చదువసంతసించి లేఖఁబుచ్చికొని యాప్రాతివేశిని వల్లియుల్లంబు చల్లనగు
నట్లు పలికి కార్యంబు సమకూర్చెదనని యభయంబొసంగి చని పరిసరస్థలంబుల
వెదకి యొక తమ్మికొలనుకెలనఁగూర్చుండియున్న యనూనతనతరుణసుందర
మూర్తిన్ గాంచి లక్షణంబులఁబరికించి గుహుండని నిరూపించి సంతసించి యల్ల
నల్లనడాయఁజని ప్రహ్వీభూతయై జోహారుచేసి తన్నుఁదాఁదెలిపికొని వనచరేశ్వ
రుండు ప్రియంగువనిమండి వల్లిఁ దోడ్కొనిచనినదిమొదలు వల్లిదేవి తనకై
యాయల్లకభరంబునొంది మదనుని బెదరింపులకోదరియు దిలకొనుచున్న యుదంతం
బంతయుఁ జడసుగనెఱిఁగించి యాయదనువవల్లిని గాఁచు భారము తనయదియని
మృదులోక్తి విన్నవించి యాకెపంచిన వలపులేఖనర్పించి నంతఁజదివికొని యారసి
యారసికాగ్రేసరుండుమురిసి వేవేగనాపూర్వుఁబోణిఁ దోడ్కొనిరమ్ము పొమ్మ
నిన నబ్బిల్లపల్లవాధరి వల్లిఁజేరి స్కందునివిధంబంతయు నెఱింగించి రహస్యం
బుగ నక్కన్నెమిన్నఁ దోడ్కొనివచ్చి యమ్మహాసేనునకు సమర్పించి యీ
హొన్నతీవ, నీధనంబు దీనినెల్లకాలంబెడఁజెంది దయతో నేలుకొమ్మన్న
నక్కొమ్మ చెలికారంబున కలరి యుమాసుతుం డిట్లనియె. 221

సీ॥ ఇందుముఖి! యెంతదానవే ♦ విట్లుచెప్ప, వలెనె యనభిజ్ఞుఁడనె పలు♦పలుకులేల?
ఆణిముత్యాలపేరునా♦యలుత నీదు, చెలియ సత మింక దీనికై ♦ చింతవలదు.

—* కుమారస్వామి వల్లీదేవితోఁ గ్రీడించుట *—

గీ॥ అన నిడిగొ వత్తునని ధవ♦ళాక్షిపురముఁ, జేరె నిర్వృతితోడఁ గు♦మారుఁడపుడు
వల్లి నెదఁజేర్చి తేర్చె భా♦వజసుఖముల, వికచకైరవగంధముల్ ♦ వెల్లివిసర.

వ. అంతఁ బ్రభాతంబగుటయు.

క॥ వల్లిన్ గానక యాబిడ, తల్లి గృహంబంత వెతికి ♦ దైన్యముతోఁ ద
ద్వల్లభునితోడఁ జెప్పడు, భిల్లాధ్యక్షుఁడు విపక్ష ♦ భీషణుఁడు వడిన్. 224

శా॥ ఘోరాకారుల దుర్విచారుల మహా ♦ క్రోధైకసంరంభులన్
నీరంధ్రాభ్రసమానవర్ణుల మదాం ♦ ధీభూతచేతస్కులన్
గైరాతాన్వయముఖ్యులన్ గొని వెసన్ ♦ గాలింపుచున్ వచ్చి కాం
తారంబందొకచోటఁ గాంచె లవలీ ♦ నాళీకనేత్రన్ గుహున్. 225

చ॥ కనిఘనమైన కిన్కఁగొని ♦ కాండములన్విలుఁగూర్చి యోరి! నా
తనయను మోసగించియిటు ♦ తస్కరణంబొనరించితౌర! నీ
తనువిదెకూల్తుఁజూడుమని ♦ దారుణభంగిశరమ్ము లేయఁగా
ననుచరులున్ జెలంగి వివి ♦ ధాయుధధారల మోఁదిరాతనిన్.

చ॥ ననలెసఁ దాఁకినట్లు వెస ♦ నారసముల్ వివిధాయుధంబులున్
దనువునఁదాఁక షణ్ముఖుఁడు ♦ తన్వికి ధైర్యముఁజెప్పి యాపె నె
మ్మనమును గుందకుండ నన ♦ మానమహామహిమాస్పదంబు మో
హనశర మేసి యార్చె శబ ♦ రావళిపైఁ గనుమూసిరందఱున్. 227

మ॥ ఒకయామంబున కాకిరాతకులు వ ♦ ర్యోద్రేకమున్ దక్కియు
త్సుకతన్ బోవిడి నిల్గుచున్ బొరలుచున్ ♦ సోఁగాడుచున్ లేచుచున్
వికలాకారతనున్న వారలకు మే ♦ ల్విజ్ఞాన భావంబుఁ గూ
ర్చి కటాక్షించె గుహుండు భిల్లులును సం ♦ ప్రీతాత్ములై యత్తఱిన్. 228

—* భిల్లులు వల్లిన్ గుమారునకిచ్చి పెండ్లిచేసి యంపుట *—

చ॥ గుహునిగ నాత్మలోఁ దెలిసి ♦ కొంపకుఁ జేరి నమస్కరించి వే
బహుతరరత్నరాజిఁ బరి ♦ బర్హముగానిడి వల్లిదేవి కేల్
గుహునికరంబునందునిచి ♦ కూరిమిఁబెండిలిచేసి దేవ! మా
యహితవిధానముల్ సయిపు ♦ మంచు వచించిరి మ్రొక్కితీరుగన్. 229

ఆ॥ అంతఁ బార్వతేయుఁ ♦ డవ్వారల ననుగ్ర, హించి వల్లితోడ ♦ నిమ్ముఁజేరి
దేవసేనకడకుఁ ♦ దెల్వొప్పెచనిమ్రొక్కు, మనుచు వల్లినంపె ♦ నాపె ప్రీతి. 230

క॥ చని దేవసేనకెఱఁగి ద, యనుభ్రోవుము నీదుదాసి ♦ నమ్మా! యనుడుఁ జ
య్యనసర్వమెఱిఁగియాపెయు, ననురాగమెసంగ వల్లి ♦ నక్కునఁజేర్చెన్. 231

—* పార్వతీశ్వరులు దేవసేనయు వల్లిన్‌జూచి యానందించుట *—

గీ॥ మణ్మఖుండు పురందర ♦ జాతకెలమి, వల్లి తెఱఁగెఱిఁగించి యం ♦ బాము హేశ్వ
రులకు వల్లియుఁదాఁజోత ♦ సలిపివారి, యనుమతివసించెఁబత్నీద్వ ♦ యంబుతోడ

క॥ ఈ కొమరుసామిచరితముఁ, జోకగఁజదివిన వినినను ♦ జొప్పడు శుభముల్
సేకూరువైభవంబులు, శ్రీకరవిఖ్యాతిచేరుఁ ♦ జింతలు దీఱున్. 233

వ. అనవుడు సూతునకు మునీంద్రు లిట్లనిరి.

క॥ సంబరమొందితి మిఁక హే, రంబుని చరితంబుఁజెప్పి ♦ రమ్యోక్తుల డెం
దంబందలి కొఱఁతను దీ, ర్పంబూనుము సూత! పరమ ♦ పావనచరితా! 235

వ. అనుటయు.

ఉ॥ విశ్వజనాభివంద్యపద ♦ వీపరిశోభితమూర్తి! సిద్ధమ
ల్లేశ్వరలింగపాలితమ ♦ హీతలశోభితశైవపూర్భవా!
శశ్వదుమాశివాంఘ్రిజల ♦ జభ్రమరాయితచిత్త! వీరభ
ద్రేశ్వరసాధ్వి! సద్వినుత ♦ హృద్యచరిత్ర! పవిత్రి! లక్ష్మమా! 236

గద్య. ఇది శ్రీ బుధజనవిధేయ ముదిగొండ నాగవీరేశ్వరనామధేయ
ప్రణీతంబైన శివపురాణంబందలి కుమారఖండంబున
ద్వితీయాశ్వాసము సంపూర్ణము.
శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ





శ్రీ శివాభ్యాం నమః

# శ్రీ శివపురాణము

## కుమారఖండము.

### తృతీయాశ్వాసము.



పతిపండితవంశా
కూపారసుధాంశుతర్క • కోవిదవరగో
ష్ఠీపత్యంబయబుధభా
వా! పాపాంబానుజాత • భవ్యచరిత్రా!

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె.

—* పార్వతీదేవి గణపతిని సృష్టించి ద్వారమందుంచుట *—

చ॥ ఒకదినమందు హైమవతి • యొద్ద జయావిజయల్ వినోదకే
ళికలితసుప్రసంగముల • లీలగ నిట్లని రక్క! యొక్క పాం
దికనుడి విన్ము ద్వారమున • నెక్కొను కింకరులెల్ల నీదు నా
యకపరిషత్తు లొక్కఁడును • నైనను లేఁ డిట నస్మదీయుఁడై. 2

చ॥ శివునివశంబునన్ గలుగు • చేటకులెల్లను నస్మదీయులే
శివ! యయినన్ మనంబలరి • చేరదు వారల నీయనుజ్ఞ చొ
ప్పవహితవృత్తి ద్వారతల • మం దొక దక్షుఁడుండెనేని నై
భవము గడున్ గడున్ జెలఁగు • భావమునందుఁ బ్రమోదమేర్పడున్. 3

క॥ కావున నొక్క సముగ్రుని, శ్రీవెలయ సృజించి ద్వార • సీమ నునిచినన్
సేవించునతఁడు జాగర, భావముతో నీదు సెలవు • పరమేశానీ! 4

క॥ అనుడు మనోహరమైన నుడి, కనుపడఁగా నలరి యపుడు • కాళిక యటులే
యొనరించెదనని వారల, కనె నంతటఁ గొన్ని యహములు • లరిగినమీఁదన్.

గీ॥ అఖిలజగదంబ మజ్జనం ♦ బాడుచుండ, ఖండశశిమౌళి నందిని ♦ గదిమి వేగ
లోనికేతేరఁగాఁ జూచి ♦ లోకజనని, లజ్జితాత్మయై లేచి త ♦ లంచె నిట్లు. 6

క॥ చెలులాడినవచనము గదు, ఫలాంతం బట్లునేఁత ♦ భావ్యం బొకఁడేన్
బలవంతుండు మదీయుఁడు, గలఁడేన్ ద్వారమున నిట్టి ♦ కష్టం బెటులౌ. 7

క॥ భాసితబలవిక్రము గుణ, భాసురు నొక్కని సృజించి ♦ వాకిటనుంచన్
నాసెలవు గీటుదాఁటక, దాసుండై యెపుడునాడు ♦ ద్వారముఁగాచున్. 8

గీ॥ అనితలఁచి యొక్కనాఁటియ♦హమున జలక, మాడ నుద్వర్తనముచేసి ♦ నట్టిమకిల
చేత నొకబాలు నిర్మించె ♦ నాతతబలు, సర్వలక్షణసంయుతుఁ ♦ జారుగాత్రు. 9

చ॥ అమలహిరణ్యవస్త్రముల ♦ నచ్ఛతరోన్నతరత్నభూషలన్
హిమగిరిజాత పుత్రకున ♦ కిచ్చి చిరాయువుగమ్మటంచు ను
త్తమముగ దీవెనల్ సలిపి ♦ తల్లిని నేను సుతుండవీవు ప్రే
మమున మదాజ్ఞవర్తిలు కు ♦ మారక! యంచువచింప నాతఁడున్. 10

క॥ జననీపదవనజములకు, ఘనభక్తినమస్కరించి ♦ కడునమ్రుండై
జనుఁడీతఁ డేమిసేయన్, జనుఁ జెప్పుముతల్లి! యనిన ♦ శైలజ వేగన్. 11

క॥ నాదు గృహద్వారంబున, సాదరమతినుండు మెప్పు ♦ డవధానముతో
నాదుసెలవొంద కేరిని, నీదృష్టిన్ మీఱనీకు ♦ నిపుణమనీషా! 12

చ॥ అని దృఢమైనయష్టినొకఁ ♦ డాతనికిచ్చి హిమాద్రిజాత నం
దనురుచిరంపునెమ్మొగము ♦ నన్ దనివారఁగ ముద్దులాడి య
క్కునఁగొని కౌగిలించి కడుఁ ♦ గూర్మియొసంగఁగ నిల్పె వాకిటన్
గొనబుగనాతఁ డుండె నవి ♦ కుంఠితవైఖరి యష్టిపాణియై. 13

—* గణపతి ద్వారమందు శివునడ్డగించుట *—

ఉ॥ అంతఁ ద్రిలోకమాత గృహ ♦ మందు యథేచ్ఛ జలంబులాడుచు
న్నంత శివుండు దారసిలి ♦ యాలయమేఁగఁగరా గణేశుఁడా
యంతకహంత నారయక ♦ యడ్డమువచ్చి మహాత్మ! మందిరా
భ్యంతరమందు మజ్జనము ♦ నాడుచునున్నది మాత యీతఱిన్. 13

క॥ ఆయమసెలవున్ గొనకయె, డాయఁగఁ బోరాదటకు దృ♦ఢంబిదియాటన్
వే యరుగు మరలి వెలుపలి, కీయదనున ననుడు రుద్రుఁ♦డిట్లనిపలికెన్. 15

క॥ ఎవరని మరలించెదవీ, వవినయగతి మూఢబుద్ధి! ♦ యజ్ఞానమునన్
శివుఁడ నని దాఁటుచుండఁగఁ, గవిసి గణేశుండు మోఁదె♦ఘనతరయష్టిన్. 16

వ. అంత

క॥ కినుకఁగాని శివుఁడు మహాత్ముఁడ!, నను నెఱుఁగక మోఁదితీవు ♦ నాథుఁడ నాయి
మ్మన కేసుచుండ నీ వా వల, దని రోధించెద విడెపు ♦ హుంకారమునన్. 17

క॥ అని తిరిగిపోవుచుండఁగఁ, గని గణపతి దండధారిఁ ♦ గఠినముగా బాఁ
దిన నొచ్చి శంకరుఁడు ప్రమ, థనికరమును జూచి పలికె ♦ దర్పోద్ధతుఁడై. 18

## —* శివుఁడు ప్రమథులను గణపతిపైకిఁ బంపుట *—

చ॥ ఎవ్వఁడొ వీఁడు మూర్ఖుఁ డొక ♦ యించుక జ్ఞానము లేక ద్వారమం
దివ్విధిఁ గ్రొవ్వునన్ నిలిచి ♦ యెంతయు మీఱుచునున్నవాఁడు మీర్
చివ్వున నారయుం డనుచుఁ ♦ జెప్పి శివుండు బహిస్స్థలంబునన్
దవ్వున నిల్చియుండెఁ బ్రమ ♦ థప్రవరుల్ గడుఁ గ్రోధమూర్తులై. 19

ఉ॥ బాలునిఁ జేరి యిట్లనిరి ♦ బాలక! యెవ్వఁడ? వేల యిట్టు లీ
యాలయభూమిఁ జేరితి? వ ♦ హంకృతి మృత్యువశంబుఁ జెందకే
శైలము దూరమేగు మన ♦ వారలఁ గాంచి హసించి బాలకుం
డేల ప్రలాపముల్ ? మరలుఁ ♦ డెవ్వఁడనైన నను నేమి మీకిఁకన్. 20

క॥ మీరెవ్వ? రేటికి చటికిఁ, జేరితిరి? చనుం డనంగ ♦ శివకింకరు లెం
తే రహిఁ హాస్యము సేయుచు, ధీరత నిట్లనిరి గణప♦తికి వేగమునన్. 21

చ॥ శివునకు ద్వారపాలురము ♦ చెచ్చెర నిన్నిటనుండి యంపగా
శివుని యనుజ్ఞచే నిటకుఁ ♦ జేరితి మీ విఁక వీఁకఁ బాసి పో
మ్మవితథమైనపల్కిది క♦టా! యిటు ప్రాణముఁ గోలుపోకు శాం
భవులు మదాంధచిత్తులను ♦ బాలన సేయరు విస్మ రూఢిగన్. 22

క॥ ఇరవుగ నాథుఁడు నిజమం, దిరమున కరుదేర నీకు ♦ దీండ్రమ దేలా!
మరలుము బిరాన మానిన, సరిపడదిఁకఁ జేటుమూడుఁ ♦ సత్వరమరయన్. 23

వ. అనిన గణేశుండిట్లనియె.

ఉ॥ నాథుఁడుగాని సర్వునకు ♦ నాథుఁడుగాని మహాత్ముఁడో జగ
న్నాథుఁడుగాని యీ యుమకు ♦ నాథుఁడుగా నిపు డిమ్ముఁ జేర సం
రోధము సేయువాఁడ నన ♦ రోధముఁ జేరఁగ వేళగాదు పొం
డో ధిషణాఢ్యులార! చన ♦ కుండిన నిందఱుఁ జత్తురిత్తఱిన్. 24

ఆ॥ చేటు మూఁడుననుట ♦ సిద్ధమెవ్వరికేని, యిపుడు నాకొ మీకొ ♦ యెఱుఁగవచ్చు
ననుచుఁ గదలకున్న ♦ నా ప్రమథేంద్రులఁ, బట్టి కొట్టి గట్టి ♦ దిట్టయగుచు.

ఉ॥ అంతట వార లొక్కమొగి ♦ వా గణనాథునిపై కిరాతకం
టంతములేని విక్రమము ♦ సందుచు నందఱు కన్నిహూవులై
యంతకమూర్తిపోలె భయ ♦ దార్భటులన్ బొనరింపుచున్ వడిన్
దంతులపైఁ జెలంగు సము ♦ దారహరీంద్రముపోలె లీలమై. 26

క॥ కొందఱి మోకాళ్ళను మఱి, కొందఱి పిక్కలను మఱియుఁ ♦ గొందఱి తొడలన్
గొందఱి నడుముల నిఁకనుఁ, గొందఱి మూఁపులును విఱుగఁ ♦ గొట్టెన్ యష్టిన్.

—* శివుఁడు చండీశ్వరాదులను యుద్ధమునకుఁ బంపుట *—

వ. అంతఁ బ్రమథు లాతని విక్రమంబున కోహటించివచ్చి యీశ్వరుని కాయుదంతంబంతయు నెఱింగించిన నమ్మహేశ్వరుండు క్రుద్ధుఁడై యవ్వారల కిట్లనియె.

ఉ॥ క్లీబులుపోలె వచ్చితిరి ♦ కీడ్పడి సిబ్బితిలేక యింద ఱి
ట్లాబిరు డెవ్వఁడో యరయ ♦ రైతిరి వాఁ డిట కేలవచ్చెనో
జాబులు కొట్టుచుందురు క ♦ డంకయు లావడిలేక యూరకే
దేబెలు మీరు పొండిఁకను ♦ ధీరత లేదు రవంతయేనియున్. 28

క॥ చండీశ్వరునిన్ బేర్గల, దండిమగలఁ బ్రమథభూత ♦ ధౌరేయుల ను
ద్దండులఁ దోడ్కొని యచటికిఁ, బొండావలికనుపుఁ డిఁకను ♦ బొంగఱ వానిన్.

వ. అనుడు నందికేశుండు మున్నగువారు చండీశ్వరాదులన్ దోడ్కొని గణపతిన్ దారసించి యిట్లనిరి.

క॥ చనెదవ? లేదా? యీ యద, నున మిత్తినిఁ జేరెదవు క ♦ నుంగొను మిఁక నీ
ఘనత యది సాఁగిరాదన, విని యతఁడు మదిన్ దలంచె ♦ వేగపడ కిటుల్.

గీ॥ తనసెలవులేక యొరులను ♦ ద్వారభూమి, మీఱనీకుమనియెఁదల్లి ♦ మేరమీఱి
వీర లీరీతి దాడికి ♦ నెడలుచుండి, రకట! కర్తవ్యమెద్దియో ♦ యరయఁజాల. 33

—* ద్వారమందలి యలుకుడును విజయ పార్వతిదేవికిఁ జెప్పుట *—

వ. అని తలంచుచున్నసమయంబునందు ద్వారదేశంబందలి కోలాహలంబాలించి గిరిజాప్రియసఖియగు విజయ యరుదెంచి యచ్చటి వృత్తాంతంబంతయు నరసి మురిసి మహేశ్వరికడకేగి యవ్విశేషంబ శేషంబుగ నెఱింగించి యిట్లనియె.

గీ॥ శంకరుండు తద్గణంబులు ♦ శంక లేక, మన గణాధీశుఁ బొదువఁగఁ ♦ దనరి రిట్లు
భవదవసరంబుఁ జూడక ♦ పాడిఁదప్పి, హఠముతో వారు చేరు టెం ♦ తనుచితంబు.

క॥ మనగణపతి యొక్కనినై, నను జొరనీయండు శివగ ♦ ణము లెంతయు రం
తోనరఁగ హుంకృతిసేయుచు, ననికిఁ దొడరుచున్నవార ♦ లరయు మిఁక శివా!

గీ॥ ఎల్లవిధముల గణపతిన్ ♦ డిల్లపఱచి, భవనమొందుదు రిఁక శివ ♦ ప్రమథవరులు
అదియు మన కెంతయును జాగు ♦ ప్పానహంబు, అగసిన ర్తింపుమిందుఁ బ ♦ ద్మాయతాక్షి!

చ॥ శివుఁడును జావలాత్మ్యుఁడయి ♦ చీటికిమాటికి నిమ్ముఁ జేరు నీ
యవసర వేళఁ గన్గొనఁ డ♦హంకృతిఁ జూపుచునుండు నిప్డు డీ
యవినయ మేల? బాలకుని ♦ నల్లరిపెట్టుట యేటి కల్పమా
వ్యవధికి నోర్వలేఁడొకో! భ♦వాదృశు లీయది మెత్తురే శివా! 38

చ॥ అనిన గిరీంద్రపుత్త్రి హృద♦యంబునఁ బంతముఁబట్టి భర్త యు
ష్ఠానరచినట్టి పట్టుదల ♦ యున్ బ్రమథేంద్రుల దొమ్మి మోటును
ర్ఘనము నెఱింగి సఖ్యభిమ ♦ తంబును నారసి కాఁగలట్టిదా
నని యనిపెన్ జెలిన్ నిజగ ♦ ణాగ్రణి చెంగటికిన్ రయంబునన్. 39

ఉ॥ ఆపెయుఁ బోయి యిట్లనియె ♦ నా గణమూర్తికి మేలు చేసితీ
వీ పురుషుల్ నినున్ జెనక ♦ నెంతురె యెంతటివారు వీరి యా
టోపము సాఁగినచ్చునె యి ♦ టుల్ జయధుర్యుఁడవైన నీకడన్
రూపఱి పోదు రిద్ది యను♦రూపము నీకుఁ గుమారచంద్రమా! 40

గీ॥ అనుడు గణపతి యానంద♦మతిశయిల్లఁ, బొంగి తలపాగఁదీర్చితో♦డంగి యనికి
సంకమాస్ఫాలన మొనర్చి ♦ యభవగణముఁ, బిలిచి యిట్లనె బీరంబు ♦ పెంపు వెలయ.

మ॥ గిరిజాసూనుఁడ నేను మీర లహినా♦శ్వేకయూర యోభాగ్యుల్
దరమైనన్ ననుగెల్చి పోం డవలకున్ ♦ దర్పంబు లేకున్న నీ
శ్వరుఁ జేరన్ జనుఁ డిద్ది నిశ్చయము ద్వా♦స్థస్థ శ్రేష్ఠులారా! మహే
శ్వరి దౌవారికుఁ జేసెఁ జిరలు శివా♦జ్ఞాపాలకుల్ బల్లిదుల్. 42

మ॥ పలుజన్యంబుల నారితేఱినఘనుల్ ♦ ప్రౌఢాత్మకుల్ పెక్కురీ
రలు నే నొక్కఁడ బాలకుండ సమ♦రంభాసభిజ్ఞుండ నీ
కలహంబందిక నాకు లోపడవినన్ ♦ గా దేర కట్టాయతి మీ
వలనన్ బాటిల మీకు శంకరుస కం♦బా దేవికిన్ జేతులున్. 43

క॥ అది తెలిసికొని దిటంబుగఁ, గదనమునకు దిగుఁడు సమర♦కౌశలు లని పెం
పొదవఁగఁ జెప్పిన లజ్జా, స్పదులై వారిరువురకుఁ ♦ జని యని రిట్టుల్. 44

గీ॥ అంబికాపుత్త్రుఁడఁట దేవ! ♦ యనుపమాన, బలుఁడు బాలుఁడు పెచ్చుగఁ♦బ్రబలియున్న
వాఁడు ఘోరాజి నోర్వఁగ ♦ వలయుఁ గాని, వాని వలఁతుల దీర్పఁగ ♦ వశము కాదు.

క॥ అని తెగఁజెప్పిన విని శివుఁ, డును మదిలోఁ జించి నిజమి♦టులె యన్యముగా
దు నగేంద్రతనయ చేసిన, పని యిది యిపు డేమి సేయ ♦ వలయునో యరయన్.

గీ॥ వినయమును జూపినట్లైన ♦ వెలఁది కీశుఁ, డోడెనని యాడుదురు లోకు ♦ లొక్కవరుస
నాయెడల నిగ్రహము సేయఁ ♦ నాతి కగును, యగును గాక ఫలంబొందు ♦ నగజ నిజము.

క॥ కానున్నది కాఁగల దిఁక, సేనలతో మీరలెల్లఁ ♦ జేరి యనీకం
బే నడుపుఁ డరయుచుండెదఁ, బై సేనన వారలెల్ల ♦ బలిసిన చేవన్ 48

గీ॥ ప్రమథభూతగణములోని ♦ బల్లిదులగు, జోదులను దోడుకొనియుమా ♦ సూను వీర
భద్రునిన్ గూడుకొని కడు ♦ నడిగ రాణి, వాసమున్ గాచు నగ్గణ ♦ వరుని జేరి.

చ॥ తడవిఁక నేల బాలకు ను ♦ వారతఁ బట్టుఁడు కొట్టుఁ డిప్పుడీ
తఁడు పొనరించు నేదియొ యు ♦ దారవదాగ్రణి యంచు హెచ్చుగా
దుడుకుఁదనంబు మీఱఁ గడు ♦ తొందరతోఁ జెలరేఁగి యార్చుచున్
బుడుతనిపై వడిన్ బడిరి ♦ భూరికృపాణగదా ప్రహస్తులై. 50

## —* ప్రమథ గణపతుల యుద్ధము *—

చ॥ అతఁడును సింహపోతమటు ♦ లద్భుతకేళిఁ దొడంగి నింగి ను
ద్ధతగతిఁ జేరి ఘోరతర ♦ దండహతిన్ బ్రమథోగ్రసైన్యసం
హతుల నదల్చుచున్ జదిపె ♦ నఘనవిక్రముఁ దేఱిచూడనేన్
మతిసారదమ్యొ నెవ్వారికి ♦ మాన్పఁడుచుండిరి యొక్కతీరుగన్. 51

వ. మఱియు నగ్గణాధీశ్వరుండు

క॥ కొందఱి పొట్టల మఱియును, గొందఱి చెట్టలను మఱియుఁ ♦ గొందఱి తలలన్
గొందఱి యక్కుల నీఁకనున్, గొందఱి ముక్కులను బగుల ♦ గొట్టెన్ యష్టిన్.

క॥ కొందఱు మడిసిరి మఱియుం, గొందఱు ప్రాణాంత్యదశను ♦ గొనియుండిరిఁకన్
గొందఱు నురునై నుఱిఁగిరి, కొందఱు భిన్నాంగులగుచుఁ ♦ గూలిరి పెలుచన్.

ఆ॥ ప్రబలదండధారఁ ♦ బ్రమథభూతగణంబు, నోలి నేలఁ బెట్టి ♦ కాలఁజమురు
చున్నఁ దెరలిమరలి ♦ యువ్వెత్తుగా వెఱ, చఱచి యొక్కకేవ్రఁ ♦ బఱచుచుండ.

క॥ చని షణ్ముఖుండు వారలఁ, గని యొక బాలకున కెదురు ♦ గా నిబ్బంగిన్
బెనుకూటముతోఁ జేరియు, వెనుకొని పాఱెదరె యదరి ♦ పీఱిఁడులారా! 55

ఉ॥ చావరె యెల్లకాలమిటు ♦ శాశ్వతమే యొడలిట్లు పాఱినన్
బోవదె తేజమున్ యశముఁ ♦ బుణ్యము సర్వము భీరులార! మే
ల్గానల దేపమండిఁకను ♦ గావఁగ వచ్చెద నేను ధీరసం
భావితవృత్తిఁ గైకొనుఁడు ♦ భద్రము లొందుఁడు రండు పూన్కినై. 56

సీ॥ అనుచు వారల మరలించి ♦ యద్రిజాతు, మారుఁ డత్తఱి గణనాథుఁ ♦ దారసించి
విక్రమోన్నతిఁ గన్గొని ♦ వేడ్కఁ జెంది, డెందమం దెంతయేని నా ♦ నందమొంది,

ఉ॥ ఈతనిఁ జూడఁ దోఁచు మది ♦ కెంతయు మచ్చికఁగ్రుచ్చి కౌఁగిటన్
బ్రీతిగఁజేర్చ సన్నిహిత ♦ బాంధవవర్యులకన్న మిన్నయై
యీతఁడు గానుపించు నిఁక ♦ నెట్టుల నీతనితోడఁ బోరుదున్
జేతము చెమ్మగిల్లె నిఁకఁ ♦ జేసెడిదే మిపు డాతెఱంబునన్. 58

గీ॥ కోకనదతుల్యమై మేల్మిఁ ♦ గొమరుమీఱు, నీని మేనున బాణముల్ ♦ విడుచుటెట్లు
లేకయుండిన నీలఁడ ♦ లోకశక్తి, నిపుడు నన్నేచు నేమొకో ♦ యేప్రసూవి. 59

క॥ ఇల "శాంత్యాభీరు" వనెదు, పలుకన్ దలఁపంగ యుద్ధ ♦ పద్ధతియె కడున్
జెలువుగఁదోఁచెడునైనను, బలికెద నిటు లితనితోడఁ ♦ బ్రాఁకీదలిర్పన్. 60

—* కుమారస్వామి గణపతిని దారసించి సంభాషించుట *—

ఉ॥ ఓ గణనాథవర్య! విను ♦ మో ఘనవిక్రమధుర్య! యిట్టు లీ
నీ గణసైన్యమున్ జదుప ♦ నేరిమియానోహో! చూఁడు వచ్చితిన్
నే గరిమంబు శోభిలఁగ ♦ నీవిఁక నన్నిట డాయు మగ్గిలో
బాగుగ నగ్గి తేజరిలు ♦ పల్మఱు చూపఱు లుగ్గడింపఁగన్. 61

గీ॥ అనినవిని గణనాయకుం ♦ డంబికాత, నూజుఁగన్గొని తత్సూక్తి ♦ కోజ మెచ్చి
దురముచాలించి స్కందును ♦ దురునుగాంచి, యిట్లుతలపోసె జిత్తమం ♦ దింపుగదుర.

గీ॥ తోడఁబుట్టువవలెనాకు ♦ దోఁచెనీతఁ, డితనిన్ గసఁ గౌఁగిట ♦ నెనయుపొంగె
యుపతపించు మనస్సది ♦ యుల్లసుకట, పోరుమానెదనిఁకవీని ♦ పొందుఁగోరి.

వ. అనితలఁచి మహాసేనువచనంబులకుఁ బ్రీతుండై యొక్కింతమిన్నకున్న నత్తఱి గణసైనికులు కుమారాసలంబనంబుస నేచి పండతో పురపరశుకృపాణపాణులై యొక్కవంకఁ గుమారుండదల్చి మరలించుచున్నను, మరలక గణనాథున్ బొదువఁబోవుచున్న నతండు మరల వారల గొంటుదసమ్ముసకుఁగినిసి యంటరాక యంబరంబునకెగసి ప్రళయమార్తాండుని పగిది దుర్నిరీక్షుండై.

చ॥ కసిమెసఁగన్ సుపర్ణుఁ డుర ♦ గమ్ముల బిట్టరఁజీల్చినట్లు వె
క్కసమగు నేత్రలన్ గవిసి ♦ కాలను జేతను దండధారనున్
గసపొనరింపుచుండె గణ ♦ కాండము నయ్యెడ షణ్ముఖుండు సం
తసమెసఁగంగఁగాంచుచు న ♦ దారతమైఁ బొగడెన్ గణాధిపున్. 65

చ॥ ఎరగలిచిచ్చు పెచ్చడరి ♦ యెంతయుఁ గానన భూజరాజి ను
ద్ధురగతిఁగాల్చు కేవఁ గడు ♦ దోర్బలధుర్యుఁడితండు సేనలన్
జెరమిడి కూల్చుచుండె బెడి ♦ దంబగు దండహతిన్ రయంబునన్
[illegible]తఁడితఁ డవి ♦ కుంఠితవిక్రముఁ డెల్లభంగులన్. 66

క॥ ఉఱక తరవాయిఁగాని యిం, దఱి నిర్విధి మ్రిందఁజేయు ♦ దతు నితని ని
త్తఱిఁ దఱిసి యెదుర నేనియుఁ, బొఱిఁగొను నితఁడెల్లఁ బ్రమథ ♦ భూతగణములన్.

## — * విష్ణ్వాదిదేవతలు శివసహాయార్థమై యుద్ధమునకు వచ్చుట * —

వ॥ అని శక్తిఁ గాని సమరంబునకుఁ దొడరుచున్నంత నత్తఱి నారదప్రబోధితులై హరిహిరణ్యగర్భాద్యఖిలగీర్వాణశిరోమణు లాత్మసైన్యంబులతో మహేశ్వర సహాయార్థంబై వచ్చి తదీయాంఘ్రిపద్మంబుల కెఱఁగి నిలిచిన పరమేశ్వరుండందుఁ బితామహున కిట్లనియె. 68

ఉ॥ ఒక్కఁడు దుండగీఁడు శివ ♦ లోద్భవ! మద్గృహతోరణంబునం
దుక్కునఁ జేరె యుద్ధపడి ♦ యుద్భట భూతగణాధినాథులన్
జక్కడఁగించుచుండె భుజ ♦ సార మపార మదేమి చెప్పుదున్
గ్రక్కున వానిఁ జేరి యెడి ♦ కమ్మునఁ దెప్పఁగఁ బూను మీవికన్. 69

ఆ॥ అనుడు "దేవ! యట్ల ♦ యని పితామహుఁడు ద్వా, స్థలినిఁ జేరి ప్రమథ ♦ జమునఁ జూచి
తఱియఁ బోవుచుండ ♦ దండంబునన్ మోఁది, దాడిఁ బెరికి యీడ్చి ♦ ధాత్రిఁ ద్రోసె.

క॥ దివిషత్సైన్యంబులునున్, సవసవగాఁ జేయుచున్న ♦ జాడఁగని జయా
సువఘాటి యుమకు ద్వార, స్థవిశేషము లెల్లఁ దెలుప ♦ శైలజ యంతన్. 71

గీ॥ కొమరునకు యుద్ధమొనరింపఁ ♦ ఘోరఖడ్గ
మొకఁడు గద యొకఁడు బంపి యు ♦ త్కృత్కటాగ్ర
హం బినుమడింప శక్తిద్వ ♦ యంబు సృష్టి
చేసి యంపెను సుతునకు ♦ బాసటగను. 72

వ. అట్టి శక్తిద్వయంబునం దొక్కటి యంజనాద్రిసంకాశయై విశాలంబగు ముఖగహ్వరంబు విప్పి ప్రమథదేవసైన్యంబుల మ్రింగుచుండె మఱియొకటి విద్యుత్పింగాకృతియై బహుహస్తసమన్వితయై భయంకరయై యాదితేయప్రయుక్తాయుధంబులనెల్ల గ్రహించి వాని మరల దివిజులపైఁ బడవేయుచుండె నంత గణేశ్వరుండు సంతుష్టుండై మాతృప్రేషితంబులగు గదాకౌక్షేయకంబులఁ గాని పరమానందంబునఁ బ్రమథామర వాహినుల నాపోశనంబుఁ గొనుచుండె నయ్యవసరంబునఁ బ్రమథామరవర్యులెల్ల రాత్మంబులందు.

క॥ పోరఁగలే మీతనితోఁ, ధీరుండితఁ డొకఁడె గలఁచి ♦ తీరున్ మమ్మున్
బారావారము నెల్లను, గారింపదె మందరం బొ ♦ కఁడు పూర్వమునన్. 74

క॥ ఎండైనఁ బోదమనినన్, సందగుపడ దితని యెదురఁ ♦ జావే శరణం
బిండనుచు వందురుచు మృతిఁ, జెందిరి గణనాథుని గదఁ ♦ చే నొక్కమొగిన్. 75

ఉ॥ ఈతనిఁ జూడఁ దోఁచు మది ♦ కెంతయు మచ్చికఁ గ్రుచ్చి కౌఁగిటన్
బ్రీతిగఁ జేర్ప సన్నిహిత ♦ బాంధవవర్యులకన్న మిన్నయై
యీతఁడు గానుపించు నిఁక ♦ నెట్టుల నీతనితోడఁ బోరుదున్
జేతము చెమ్మగిల్లె నిఁకఁ ♦ జేసెడి దే మిపు డాతురంబునన్. 58

గీ॥ కోకనదతుల్యమై మేల్మిఁ ♦ గొమరుమీఱు, వీనిమేనున బాణముల్ ♦ విడుచుటెట్లు
లేకయుండిన నీతఁడ ♦ లోకశక్తి, నిపుడు నన్నేమనేమొకో ♦ యెప్రసూవి. 59

క॥ ఇల "శాంత్యాభీయ" వనెదు, పలుకన్ దలఁపంగ యుద్ధ ♦ పద్ధతియె కడున్
జెలువుగఁ దోఁచెడునైనను, బలికెద నిటు లితనితోడఁ ♦ బ్రీతిదలిర్పన్. 60

—* కుమారస్వామి గణపతినిఁ దారసించి సంభాషించుట *—

ఉ॥ ఓ గణనాథవర్య! విను ♦ మో ఘనవిక్రమధుర్య! యిట్టు లీ
నీ గణసైన్యమున్ జదుప ♦ నేరమియౌనొకో! చూఁడు వచ్చితిన్
నే గరిమంబు శోభిలఁగ ♦ నీవిఁక నన్నిట డాయు మగ్గిలో
బాగుగ నగ్గి తేజరిలు ♦ పల్కులు చూపటు లుగ్గడింపఁగన్. 61

గీ॥ అనినవిని గణనాయకుం ♦ డంబికాత, నూజుఁగన్గొని తత్సూక్తి ♦ కోజ మెచ్చి
దురముచాలించి స్కందును ♦ దురునుగాంచి, యిట్లుతలపోసె జిత్తమం ♦ దింపుగదుర.

గీ॥ తోడఁబుట్టువవలెనాకు ♦ దోఁచెనీతఁ, డీతనిన్ గనఁ గౌఁగిట ♦ నెనయుపొంగె
యుపతపించుచున్నది ♦ యుల్లమకట, పోరుమానెదనిఁకవీని ♦ పొందుఁగోరి.

వ. అనితలఁచి మహాసేనువచనంబులకుఁ బ్రీతుండై యొక్కింతమిన్నకున్న నత్తఱి గణసైనికులు కుమారావలంబనంబున నేచి దండతోమరపరశుకృపాణపాణులై యొక్కవంకఁ గుమారుండదల్చి మరలించుచున్నను, మరలక గణనాథున్ బొదువఁబోవుచున్న నతండు మరల వారల గొంటువనమ్మునకుఁగినిసి యంతరాళ యంబరంబునకెగసి ప్రళయమార్తాండుని పగిది దుర్నిరీక్షుండై.

చ॥ కసిమెసఁగన్ సుపర్ణుఁ డుర ♦ గమ్ముల బిట్టరఁజీల్చినట్టు వె
క్కసమగు నేడ్తెఱన్ గవిసి ♦ కాలను జేతను దండధారనున్
గసవొనరింపుచుండె గణ ♦ కాండము నయ్యెడ మ్ముఖుండు సం
తసమెసఁగంగఁగాంచుచు ను ♦ దారతమైఁ బొగడెన్ గణాధిపున్. 65

చ॥ ఎరగలిచిచ్చు పెచ్చడరి ♦ యెంతయుఁ గాననభూజరాజి ను
ద్ధురగతిఁగాల్చుకేవఁ గడు ♦ దోర్బలధుర్యుఁడితండు సేనలన్
దొరమిడి కాల్చుచుండె వెడి ♦ దంబగు దండహతిన్ రయంబునన్
[illegible] డవి ♦ కుంఠితవిక్రముఁ డెల్లభంగులన్. 66

క॥ ఊఱక తెరవాయిఁగొని యిం, దఱి నిర్విధి మ్రిందఁజేయు ♦ దక్షు నితని ని
త్తఱిఁ దఱిసి యెదుర నేనియుఁ, జొఱఁగొను నితఁడెల్లఁ బ్రమథ♦భూతగణములన్,

## — * విష్ణ్వాదిదేవతలు శివసహాయార్థమై యుద్ధమునకు వచ్చుట * —

వ॥ అని శక్తిఁగొని సమరంబునకుఁ దొడరుచున్నంత నత్తఱి నారదప్రబోధితులై హరిహిరణ్యగర్భాద్యఖిలగీర్వాణశిరోమణు లాత్మసైన్యంబులతో మహేశ్వర సహాయార్థంబై వచ్చి తదీయాంఘ్రిపద్మంబుల కెఱఁగి నిలిచిన పరమేశ్వరుండందుఁ బితామహున కిట్లనియె. 68

ఉ॥ ఒక్కఁడు దండగీఁడు శివ ♦ లోద్భవ! మద్గృహతోరణంబునం
దుక్కునఁ జేరి యుద్ధపడి ♦ యుద్భట భూతగణాధినాథులన్
జక్కడఁగించుచుండె భుజ ♦ సార మపార మదేమి చెప్పుదున్
గ్రక్కున వానిఁ జేరి యొడి ♦ కమ్మునఁ దేర్పఁగఁ బూను మీవికన్. 69

ఆ॥ అనుడు దేవ! యట్లె♦యని పితామహుఁడు ద్వా, స్థలినిఁ జేరి ప్రమథ♦ సమనుఁ జూచి
తఱియఁ బోవుచుండ ♦ దండంబునన్ మోఁది, దాడిఁ బెరికి యీడ్చి ♦ ధాత్రిఁ ద్రోసె.

క॥ దివిషత్సైన్యంబులునున్, సవసవగాఁ జేరుచున్న ♦ జాడఁగని జయా
సువఘాటి యుమకు ద్వార, స్థవిశేషము లెల్లఁ దెలుప ♦ శైలజ యంతన్. 71

సీ॥ కొమరునకు యుద్ధమొనరింపఁ ♦ ఘోరఖడ్గ
మొకఁడు గద యొండు బంపి య ♦ త్యుత్కటాగ్ర
హం బినుమడింప శక్తిద్వ ♦ యంబు సృష్టి
చేసి యంపెను సుతునకు ♦ బాసటగను. 72

వ. అట్టి శక్తిద్వయంబునం దొక్కటి యంజనాద్రిసంకాశమై విశాలంబగు ముఖగహ్వరంబువిప్పి ప్రమథదేవసైన్యంబుల మ్రింగుచుండె మఱియొకటి విద్యుత్పింగాకృతియై బహుహస్తసమన్వితయై భయంకరయై యాదితేయప్రయుక్తాయుధంబులనెల్ల గ్రహించి వాని మరల దివిజులపైఁ బడవేయుచుండె నంత గణేశ్వరుండు సంతుష్టుండై మాతృప్రేషితంబులగు గదాకౌక్షేయకంబులఁగొని పరమానందంబునఁ బ్రమథామర వాహినుల నాపోశనంబుఁగొనుచుండె నయ్యవసరంబునఁ బ్రమథామరవర్యులెల్ల రాత్మంబులందు.

క॥ పోరఁగలే మీతనితో, ధీరుండితఁ డొకఁడె గలఁచి ♦ తీరున్ మమ్మున్
బారావారము నెల్లను, గారింపదె మందరం బొ♦కఁడు పూర్వమునన్. 74

క॥ ఎందైనఁ బోదమనినన్, సందగుపడ దితని యెదురఁ ♦ జావే శరణం
బిందనుచు వందురుచు మృతిఁ, జెందిరి గణనాథుని గద♦చే నొక్కమొగిన్. 75

గీ॥ అచ్చరలు పుష్పచందన ♦ హస్తలగుచుఁ
జడలనిలిచిరి సంగ్రామ ♦ జయమరయుచు
మునులు గంధర్వులును మహా ♦ మోదమొందవఁ
జూచుచుండిరి కలను బల్ ♦ చోద్యమెసఁగ.

వ. ఇట్లు ప్రళయకాలాభీలంబై యున్న యయ్యుద్ధంబునం దించుకడవ్వులనున్న సైనిక ప్రవరులు గణేశ్వరుని మహాహవప్రకారంబును షణ్ముఖవీరభద్రుల యాదాసీన్యంబునుగాంచి గణనాథాగ్ని కింధనంబులుగాఁ జాలక ప్రాణాతురులై పాఱఁజేరి యుపస్థితంబంతయుఁ దెలుప నత్తఱి నారదర్షి సమీపించి మహాదేవున కిట్లనియె.

గీ॥ దేవ! నీలీలగాదె యీ♦తీరు సకల, మఖిలభూతప్రమథగణా ♦ హంకృతిన్ హ
రించుపొంకె రచించితి ♦ వెంచియిట్లు, కావుమిఁకఁ బ్రమథాసుర ♦ గణము నెల్ల.

## —* శివుఁడు విష్ణ్వాదులతో యుద్ధమునకు వచ్చుట *—

వ. అనిచెప్పి చన నంత రుద్రుండమర్షితుండై నారాయణప్రముఖ నిఖిలామరమూల బలంబును బ్రమథమూలబలంబునుగొని యాలంబునకు నడిచినంత వారందఱు గణపాలుఁ జుట్టుముట్టి వివిధాయుధపరంపరలఁ బొదువ నతండాభీలుండై నిప్పులురులు కన్నులతో నేరికిఁజూడరాని తేజంబుతో సంకటుల బెగడుఁబుట్టింపుచుఁ గృపాణ గదాదండధారల బలంబులనెల్లఁ బీనుఁగు పెంటలఁజేసి నారాయణుఁ గదిసి.

ఉ॥ ఉరమున నొక్కపెట్టు గద ♦ నుద్ధతినైచిన నాతఁ డల్గి వి
స్ఫురితశరంబులన్ బొదివి ♦ భూరిపదంబునఁ బేర్చి యార్చినన్
మరల గణేశుఁ డుగ్రుఁడయి ♦ మండుచుఁ జండగదాగ్రధారతో
సరసిజనాభు గుండెఁ బెలు ♦ చన్ బగిలించె సురల్ జలింపఁగన్. 80

వ. అంత ఖిన్నుండు విషణ్ణుండై పాఱఁజేరి యిట్లనియె 81

చ॥ బిరుదుమగండు పోరు గడు ♦ బెట్టిద మీతనితోడ నత్యసం
గరమున గెల్వఁజాల మిది ♦ కార్యముగా దిఁకఁ గుట్రఁబన్ని యే
తెఱఁగుననైనఁ జంపవలె ♦ దేవ! యనంగ ననంగవైరి య
చ్చెరువునుజెంది యిట్లనియె ♦ శ్రీపతి కేపుఁదనర్పఁజేయుచున్. 82

మ॥ వినుమానంబగుఁగాదె యొక్క శిశు వీ ♦ బృందారకశ్రేణి ని
ల్లెసకంబొప్ప నెదిర్చి తూల్చెఁ బ్రమథా ♦ హీనప్రతాపాగ్ని నీ
రస మొప్పన్ బొలియించెఁ దాపకమహా ♦ విస్ఫారవీర్యంబు నీ
రసమున్ జేసి కలంచె నేన యిఁకఁ గ ♦ ర్జంబొప్ప నిర్జించెదన్. 83

వ. అనిన విని శార్ఙ్గపాణి లజ్జితుండై

క॥ శైలాటంబునఁ దక్కఁగ, బాలుని గెలువంగఁ దరమె ♦ భర్గ! యనుచు న
న్నాళీకాక్షుఁడు శక్తుల, నోలిం బొసఁగించి మరల ♦ నుద్ధతిఁ గవిసెన్. 84

చ॥ గణపతి యంతఁ గేశవునిఁ ♦ గ్రమ్మన ఘోరగదాప్రయుక్తభీ
షణతరపాతమొప్ప భుజ ♦ సంధుల మోఁదిన వైరివీరమా
రణచణమైన చక్రమున ♦ రాక్షసమర్దనుఁ డగ్గదన్ మహా
రణనమెసంగఁ ద్రుంచె నమ ♦ రప్రకరంబు కరంబు పొంగఁగన్. 85

గీ॥ గణవరుండల్లి యగ్గదా ♦ ఖండములను, దిరుగ విష్ణునిపై వేయ ♦ గరుడుఁడొడిసి
పెక్కుతునియలఁ జేసి పే ♦ రుక్కుమెఱసె, సర్పకుండంత నాగ్రహ ♦ నిర్భరుఁడయి.

చ॥ ఎగసి కరస్థయష్టిహతి ♦ నేడ్తెఱఁ బత్త్రిరథేంద్రుమూర్ధమున్
బగిలిచి కైటభాంతకుని ♦ ఫాలము వ్రయ్యలుసేయ నాతఁ డె
చ్చుగ మెయి నొచ్చి నేలఁబడఁ ♦ జూచి పినాకధరుండు శూల మె
త్తుగ గణభర్త యష్టిహతి ♦ దాని ధరన్ బడవేసె నుద్ధతిన్. 87

ఉ॥ అంతట నంతకాంతకుఁ డ ♦ హంకృతిమీఱఁ బినాకమెత్త ర
వ్వంతయు వంతలేక యచ ♦ లాధిపనందనకూర్మిపట్టి బ
ల్వింతగ దానిఁ గూడఁ బడ ♦ వేసి భువిన్ బరమేశు మోఁదె దు
ర్దాంతతరోరుదండహతి; ♦ దాన హరుండు కరంబు రుష్టుఁడై. 88

—* శివుఁడు త్రిశూలముచే గణపతి తలనఱుకుట *—

క॥ అమితోద్ధతిఁ గదిసి త్రిశూ, లముచే గణనాథుశిరము ♦ లాఘవముగ ఛే
దము చేసి యార్చె జయఘో, షము చేసిరి ప్రమథదేవ ♦ సత్తములంతన్. 89

క॥ తప్పెటలు మృదంగంబులు, డప్పులు కాహళములును ఘ ♦ టంబులు ఘంటల్
గొప్పగ వాద్యము చేసిరి, యప్పరమేశ్వరుని రణజ ♦ యాశంసముగాన్. 90

గీ॥ శివుఁడు కోపంబుడిగి బాలు ♦ శిరముఁ జూచి
వగచె నెంతయు దుఃఖైక ♦ వశ్యుఁడగుచు
వీరభద్రుఁడు గుహుఁడును ♦ విష్ణు వజుఁడు
గూడ నాత్మములందు బల్ ♦ కుందిరపుడు.

—* నారదుఁడు పార్వతికి గణపతిమరణంబుఁ జెప్పుట *—

గీ॥ నారదుండపు డంబికన్ ♦ జేరి మ్రొక్కి, సర్వమెఱిఁగించి యిట్లనె ♦ జనని! యిపుడు
పట్టువిడువక మెందేని ♦ నిట్టిఘోర, చరితములఁ గనినామె యి ♦ జ్జగమునందు.

వ. అని చెప్పి యంతర్ధానంబుఁ జెందె నంత నమ్మహాదేవి. 93

గీ॥ తగునెయిటు దుర్ణయముసేయ ♦ ధర్ముఁడు ప్రమథ
వరులు సురలును గూడియు ♦ వ్యాజస నిష్ఠ
జేమిసేయఁగఁదగు నెట ♦ కేనలయు
ననుచు మనమున వనరి హి ♦ మాద్రితనయ. 94

మ॥ తగునే సోదరతుల్యులై యలమనా ♦ దామోదరుం డివ్విధిన్
జగతిన్ నామకుమారకుల్ జదువఁగా ♦ బల్ పన్నికన్ బన్నిమూఁ
కగ జేజేలఁ బురస్కరించికొని దు♦ష్కార్యం బిటుల్ సల్పు టి
మ్మగ నీ పాపఫలంబులన్ గుడువరే ♦ పొంగార కంగారునన్. 95

వ. అని తత్క్షణంబున

గీ॥ వేలుపులనెల్ల వేవేగ ♦ వెతకి చంపుఁ, డనుచుఁ బుట్టించె శక్తుల ♦ నాక్షణంబు
నమితసంఖ్యగ నవ్వార♦ లాయుధములఁ, గొనిచనిరి ద్వారభూమికి ♦ ఘోరరీతి.

వ. అంత.

క॥ జయ మేలని యగ్గించె వి, జయ లగ్గొనరించితనియె ♦ సకలాళిజనుల్
జయశబ్దము లొనరింపుచు, నయముగఁ గొండాడి రద్రి♦నందన ఘనతన్. 97

చ॥ శివుఁ డటఁ దానొనర్చిన య ♦ చేష్టకుఁ జాలఁగఁ జింతచేసి యు
ద్భవమగుచున్న దుఃఖమును ♦ బాఱఁగఁదోలి గిరీంద్రకన్యకా
భవనముఁ జేరఁబోవకయె ♦ పన్నుగఁజేరె సభాలయంబు నా
దివిజులు గ్రమ్మరన్ బయలు ♦ దేఱుచునుండఁగ నొక్కపాటునన్. 98

గీ॥ ఖంజ కాళి కరాళి బ♦గళయు ఛిన్న, మస్తయు విలంబమస్త ధూ♦మవతి సిద్ధ
విద్య మాతంగియును దార♦విద్య కుబ్జ, ఆమహావిద్య మున్నగు♦నాహ్వాయముల.

గీ॥ వెలయు శక్తులు వేనవేల్ ♦ వింటికెగసి, క్రోధఘూర్ణితమూర్తులై ♦ ఘోరరీతి
నగ్నిదరికొనిమండెడు ♦ నట్టులేచి, సకలదిక్కుల నరయుచు ♦ సత్వరమున.

చ॥ నఱకుఁడు త్రుంచుఁ డక్షపడి ♦ నాకచరాధములందు నొక్కనిన్
బఱవఁగనీయకుండుఁ డిటఁ ♦ బట్టిపలార్పుఁడటంచు శక్తులే
డ్తెఱ నలుమూలలన్ గవిసి ♦ తేఁకువ మూఁకలఁ జుట్టుముట్టఁగా
మఱుకువనొంది నాకచర ♦ మండలి యొండెడఁ గాంచ కార్తులై. 101

చ॥ ఒదుగుటకైన లేదు తెరు ♦ వొండెడ వీరలనోటఁ గూలనే
యదనుఘటిల్లె నిష్ఠ ప్రళ ♦ యంబగు కైవడిఁదోఁచె నెట్టులీ
యది గడవంగ నేర్తుమని ♦ యార్తిఁ గుంది పురందరాదులున్
బెదరుచు నాల్గుమూలలకు ♦ వీఱిఁడులై పరుగెత్తి రత్తఱిన్. 102

క॥ ఎచ్చోటకేఁగి కనుగొనఁ, నచ్చోట నాశక్తులడరి ♦ యాస్యకుహరముల్
విచ్చి సురావళినెల్లను, విచ్చలవిడి మ్రింగుచుండ ♦ వెఱపొందికడున్. 103

క॥ మొత్తోయని యేడ్చె వారలు, కుత్తుల నికఁ జూడ మనుచు ♦ గొణఁగెడు వారల్
దుత్తునఁ జెవ రేడుచువారలు, మిత్తింబల్లంబుఁ గనక ♦ మిడికెడువారల్. 104

సీ॥ బ్రతుకఁగావలెనని ♦ పరుగెత్తి కనక గ, భీలున గంగలోఁ ♦ గూలువారు
కూలినవారలఁ ♦ గూడచూడక యుల్లె, వారిపైఁబడి యుండె ♦ చేరువారు
చీల్పుకు మ్రింగకో ♦ శివశక్తియని తమ, లోఁ దామె మ్రొక్కుచు ♦ లోఁగువారు
వచ్చెరా పెనుమిత్తి ♦ చచ్చితిమంచని, వెల్లకిలఁబడి ♦ దొల్లువారు

గీ॥ బలులనిత్తుము కొలుతుమే ♦ పాపలకును, మీదుపేర్లనే పిలుతుమీ ♦ మీదతల్లు
లనుచు శక్తులచేఁ జిక్కి ♦ యఱచువారు, నైరి యాతుణమందు ది ♦ వ్యజనులంత.

—* విష్ణ్వాదులు మునులను బార్వతీదేవియొద్ద కనుపుట *—

చ॥ గొదగాని శక్తులిట్టు లతి ♦ కోపనలై ప్రమథామరావళిన్
గదిసి యుదీర్ణభంగి సుర ♦ గంగనొనర్చుచు నార్చుచున్ గడున్
మదమున వీరనృత్తము ల ♦ మర్చుచుఁ గేరుచు సంహృతిక్రియా
స్పదలయి మీఱుటన్ గని య ♦ జప్రముఖామరవర్యు లేకమై. 106

గీ॥ తలరి యంబిక చేసె నీ ♦ దండనంబు, మనకు నెల్లర కిద్దాని ♦ మాన్పఁదరమె?
ఆ జగన్మాత కెవ్వఁడీ ♦ యలుకదీరు, నంతవట్టిటు సంక్షోభ ♦ మమరియుండు. 107

చ॥ అనియుఁ బరాంబఁ జేరుటకు ♦ నాత్మమునం దగు దీములేక తా
ర్మునులను నారదున్ బిలిచి ♦ భూధరరాజసుతాగ్రిహంబుఁ దీ
ర్పను బనుపంగ వారలు గ ♦ రంబు భయంబును భక్తిగ్రాల న
జ్జననినిఁ జేరి మ్రొక్కి యిటు ♦ సాంత్వనమొప్పఁగఁ బల్కి రిమ్ముగన్. 108

చ॥ శివ! జగదంబ! చండిక! వి ♦ చిత్రకళామయమూర్తి! దివ్యవై
భవ! శుభకీర్తి! శక్తి! శివ ♦ భామిని! నీవ జగత్ప్రసూతివై
యవనసమర్థవయ్యుఁ బ్రిల ♦ యావహవైదువు తల్లి! శాంతిఁగొ
న్మ! వికలమయ్యె సర్వజగ ♦ మున్ బ్రతికింపు! ఘృణాస్వరూపిణీ! 109

గీ॥ ఇట్లు నుతియించి మ్రొక్కిన ♦ యీశురాజ్ఞి
దివ్యమునులను గనియు నె ♦ ద్దియును బలుక
కున్న నంబనుగని జోహా ♦ రొసఁగి మరల
నంజలులఁ జేసి యిట్లని ♦ రపుడు మునులు. 100

క॥ క్షమియింపుము పరమేశ్వరి!, క్షమియింపుము సకలలోక ♦ జననీ! యిఁక నే
రములన్ దావకసంతా, నమొకద! యీ జగమఖిలము ♦ నశివ యంబన్.

క॥ ఇంచుక కనికరమున న, న్నించి యిటుల్ మునులతోఁ న ♦ నియె నాదు సుతుం
డంచితముగ జీవితుఁడై, మించిన తేజంబు మెఱయ ♦ మెలఁగెడు నేనిన్. 111

క॥ వానిని మీ రెల్లరు స, న్మానముతోఁ గొలుచు నెడల ♦ మాన్యద నీ మీ
దీనత యని నుడువఁగ న, మ్మానులలరి చెప్పిరా య ♦ మరవర్యులకున్. 112

గీ॥ వారలును సంతసించి య ♦ వ్వామదేవ్వ, కడఁకుఁ జని యద్విధ బెల్ల ♦ నుడివి మ్రొక్కి
దయను గోరిన నాతఁ డు ♦ దారబుద్ధి, తోడ నిట్లని పల్కె సం ♦ తోసమొదవ. 113

గీ॥ చనుఁ డుదగ్దిశఁ గూరిచి ♦ చక్కనెందుఁ, దొలుత నేజంతు వగుపడుఁ ♦ దొడఁ దాని
శిరసుఁ దెగ వేసి యిక్కళే ♦ బరము నందుఁ, గూర్చుఁ డద్దానఁ గూర్మిలు ♦ గొనలు సాఁగు.

క॥ అని సెలవొసఁగఁగ నింద్రా, ద్యనిమేషులు బాలువిగ్ర ♦ హంబుఁ దెచ్చి రయం
బున నీటఁ గడిగి యర్చన, మును జేసి నిశాంతహర్ష ♦ పూర్ణాత్మకులై. 115

ఆ॥ ఉత్తరాశకై య ♦ హోద్యమంబున నేఁగఁ, గరటి యేకదంత ♦ కంబొకండు
గానుపట్ట మస్త ♦ కంబు ఛేదించి య, చ్చటికిఁ దెచ్చి కూర్చి ♦ శంభుఁ జూచి 116

—* శివుఁడు గణపతిని జీవింపఁజేయుట *—

ఉ॥ దేవ! జగంబులెల్ల భవ ♦ దీయమహాజము చేతఁ బుట్టి సు
శ్రీవిలసిల్లుఁగాదె యిటు ♦ చెల్వగు తావక తేజమిందు సం
భావితరీతిఁ జేర్చి యిఁక ♦ బాలుని జీవితుఁ జేయుమన్న భ
ద్రావహమూర్తి తత్తనువు ♦ నందమృతాంచితవృష్టి నించుడున్. 117

గీ॥ అంత నిద్దుర మేల్కాంచి ♦ నట్లు బాలుఁ, డలఁత యొక్కింత లేకయె ♦ హాయి యలర
జీవితుండయి కూర్చుండెఁ ♦ జెలఁగి దివిజ, వరులు మునులును సంతోష ♦ భరితులైరి.

——* పార్వతీదేవి శక్తుల నుడల్పుట *——

క॥ గిరిజాదేవికి బాలుని, సరగున జూపింప నాపె ♦ సంతోసమునన్
గరమలరి సురలఁ బ్రముఖులఁ, గరుణాలోకనములొప్పఁ ♦ గాంచెఁ బ్రియమునన్.

చ॥ కడువడి సంతసంబెసఁగఁ ♦ గా సుతు నక్కునఁ జేర్చి మోము ము
ద్దిడి రుచిరాంబరంబులను ♦ నిద్ధమణీమయభూషణంబులన్
దొడఁగుగ నిచ్చి దీవెనలఁ ♦ జేసి నొసంగెఁ దదాజ్ఞతోడ ము
న్నడరిన శక్తులెల్లఁ దద ♦ యాస్పదలోచుఁ దొలంగి గన్నవిన్. 120

మ॥ సురలక్షీశ్వరుఁ దోడితెచ్చి సుతునిన్ ♦ జూపించి రంతన్ మహే
శ్వరి యానందితచిత్తయై సుతు నిజే ♦ శాంకమందుంచె నా
పరమేశుండును దచ్చిరంబుపయి ది ♦ వ్యత్వానుబంధంబునన్
[illegible] ♦ [illegible]నే సారఁగన్. 121

## —* శివుఁడు గణపతికి బ్రహ్మదేవునితో నుపనయనము సేయించుట *—

సీ॥ వీఁడు ప్రథమగణేశుఁడై ♦ నెఱయునని తెల్పి, శూలము నొసంగి బ్రహ్మను ♦ జూడ నతఁడు
శివుని చిత్త మెఱిఁగి వే ♦ దవిహితోక్తిఁ, గార్యముగ నుపనయనంబు ♦ గావించెఁ గూర్మి.

వ. నిఖిలామ్నాయచయంబుతో గాయత్రి నిచ్చి కుండికయు నక్షమాలయు నొసంగఁ బరమేశ్వరియు నమూల్యరత్నాభరణంబులతో సశరచాపగదాఖడ్గంబుల నొసంగి గారవించె దామోదరుండు నామోదంబున నిత్యసౌరభ్యవిభాసితంబగు వనమాలయుఁ జక్రంబు నొసంగి మన్నించె నంత సకలామరప్రముఖవర్గం బెల్ల నగ్గణాధీశున్ గాంచి నమస్కరించి యనేకరత్నోపదలర్పించి యర్చించిరంత గణేశుండు సంతుష్టుండై నిజజనకాంఘ్రిపద్మంబులకుఁ బ్రణమిల్లి హరివిరించనులకును నారదాదిదివ్యమునులకును వందనం బిడిన వారందఱానందితులై పెల్లుగ నాశీర్వదించి ప్రేమింపిరంత శివుండు పుత్త్రున్ జూచి. 123

సీ॥ బాలకుఁడ వయ్యు నీవిట్లు ♦ ప్రౌఢవిక్ర, మంబు నెఱపితి శక్తితో ♦ మదుఁడ వౌట
నిఁక జిరంజీవి వౌచు గ ♦ ణేశుఁడవయి, సుఖములొందుము నిచ్చలు ♦ సుభగమూర్తి!

## —* శివుఁడు గణపతి కగ్రపూజ్యత నొసంగుట *—

వ. మఱియును

ఉ॥ నేనును విష్ణు వీశలును ♦ నెట్టన లోకమునందు సర్వస
న్మానము తోడఁ బూజలను ♦ మానుగఁ గొందుమె యట్లె నీవునున్
శ్రీ నెఱయంగ సర్వసుర ♦ సిద్ధనిశాచరమానుషోరగా
ళీనియతార్చనంబులను ♦ లీలగ నొందు మనిందితోన్నతిన్. 125

వ. అందుఁగూడ.

క॥ మాకన్నను దక్కిన సుర, లోకంబునకన్న నీవు ♦ లోకమున మొదల్
చేకొనెదుగాక పూజల, శ్రీకరగుణసాంద్ర! సర్వ ♦ సిద్ధగణేంద్రా! 126

క॥ విను మఖిలకార్యముల నా, దిని నిను బూజించి జనులు ♦ దృఢతఁ గ్రియాసి
ద్ధినిఁ గానెదరు విఘ్నంబులఁ, గనకుండెద రెపుడు దేవ ♦ గణపతి! జగతిన్.

## —* శివుఁడు గణపతివ్రతంబుఁ జెప్పుట *—

సీ॥ భాద్రశుద్ధచతుర్థి ను ♦ ద్భవముఁ జెంది, నాఁడవగుట నాదివసంబు ♦ నన్ వ్రతార్చ
నంబు నేమంబుగాఁగ నొ ♦ నర్తు రెల్ల, వారు వారికి మేలు సే ♦ కూరఁగలదు.

సీ॥ సింధురాస్యుఁడ వౌటచే ♦ సిందురమునఁ, బూజితుఁడవయి మిక్కిలి ♦ పొంగుఁగాంతు
వల్లెదూర్వాఙ్కురార్చల ♦ నధికమైన, హర్షమొందెద వార్యాము ♦ ఖాబ్జహేళి!

క॥ ప్రతివత్సరమున భవదప, చితి నిత్తిథియందు భక్తిఁ ♦ జేయఁగవలయున్
బ్రతిజనుఁడును జేయనిచో, నెతఁడు సన్యాఁడు విఘ్న ♦ వేధతుఁడగుచున్.

ఆ॥ ఈ చతుర్థినుండి ♦ యేఁడాదిగఁ జ కిట్లు, నీ సమర్చనంబు ♦ నిత్యమును నొ
నర్చు టిది వ్రతంబు ♦ నగజాకుమారక!, సర్వసిద్ధిదంబు ♦ శర్మకరము. 131

వ. అద్దాని విధానం బెఱింగింతు వినుము.

ఆ॥ భాద్రసితచతుర్థిఁ ♦ బ్రాతరారంభకా, లమున వేగ మజ్జ ♦ నము నొనర్చి
నిత్యకర్మములను ♦ నెఱవేర్చి విజ్ఞులౌ, బ్రాహ్మణులను బిల్వ ♦ వలయు భక్తి.

క॥ మృత్తికతో నేనియు ధా, స్వత్తరధాతువులనేనిఁ ♦ బవడములో నేన్
జిత్తాకర్షకముగ గణ, సత్తమ! నీ విగ్రహంబు ♦ సలుపఁగవలయున్. 133

ఆ॥ మంటపం బమర్చి ♦ మంచిగ నీవిగ్ర, హముఁ బ్రతిష్ఠచేసి ♦ యర్చనంబు
సల్పవలయు షోడ ♦ శప్రకారోపచా, రముల మంత్రపూర్వ ♦ కముగ విధిగ. 134

సీ॥ మల్లె మొల్లయు బొండు ♦ మల్లె సంపఁగి జాజి, విరజాది నాగకే ♦ సరము కొండ
గోఁగుమోదుగు రేల ♦ గోరంట సురపొన్న, పొన్నమంకెన తుమ్మి ♦ పొగడగడిమ
మొగలిమున్నగువాని ♦ పూలఁబొందమ్ములఁ, జెందొవపోవుల ♦ శ్రీతులసియు
మాఱేడు జమ్మి య ♦ మ్మాచి విష్ణుక్రాంత, యుమ్మెత్తదానిమ్మ ♦ యుత్తరేణి

గీ॥ రేగు జిల్లేడు వావుడు ♦ రేల దేవ, దారి వావిలి రావి గ ♦ న్నేరు మద్ది
మావిదాసానిగలిజేరు ♦ మరువము మొద, లగుతరులపత్రిఁబూజసే ♦ యంగవలయు.

వ. మఱియు నీక దూర్వాఙ్కురార్చనంబందు వితస్తిమాత్రప్రమాణంబులుగను త్ర్యంగంబులుగను మూలవర్జితంబులుగనుండుదూర్వాఙ్కురంబుల నూటయొక్కటిఁగానిఁ బక్షాంతరంబందు నిరువదియొక్కటిఁగాని యర్పించి పూజింపవలయును.

గీ॥ చెలఁగియిరువదియొకకుడు ♦ములనరఁటి, పండ్లుటెంకాయలునుజాము ♦ పండ్లువెలగ
పండ్లు చెఱకులు నేరేడు ♦ పండ్లు దాక్ష, పండ్లునైవేద్యమిడవలె ♦ భక్తి మెఱయ.

వ. అనంతరంబందు,

గీ॥ భక్ష్యభోజ్యాదియుతముగఁ ♦ బరిణవ ముచ్చ, రింపుచు మహానివేదనం ♦ బింపుమీర
చింపవలెనంతి బ్రాహ్మణ ♦ శ్రేణితోడ, నాప్రసాదంబు భుజియింప ♦ వసుజగమున.

వ॥ ఇట్లొకవత్సరంబు పూజించి వ్రతంబుసల్పి యవ్వల నుద్యాపనంబుసేయవలయు నద్దాని విధంబెఱింగించెద,

—* గణపతి వ్రతోద్యాపన విధానము *—

సీ॥ ఈ ఫాల్గు వత్సువాతఁ దో ♦ యంబులాడి, మంటపంబునఁ గలశంబ ♦ మర్చి స్వర్ణ
ఘటితవరోభవదీయువి ♦ గ్రహమువస్త్ర, యుగ్మమునమంచిపూజించు ♦ టొప్పునంత.

గీ॥ స్థండిలముఁ గూర్చియం దష్ట ♦ దళమునందు, నగ్నిని బ్రతిష్ఠచేసి వే ♦ దాభిహిత వి
ధానముగ హవనముచేసి ♦ ద్వాదశాగ్ని, జన్మలకును సువాసినీ ♦ జనములకును.

గీ॥ వటుయుగమునకుఁ దనివిగ ♦ భక్ష్యభోజ, నమును దాంబూలదక్షిణల్ ♦ గ్రమముగానొ
సంగి శే వేగి యమ్మఱు ♦ సటి యహంబు, నందు నుద్యాపనంబు సే ♦ యంగవలయు

వ. అటుపిమ్మట నాకలశంబును సవస్త్రయుగ్మంబైన సౌవర్ణప్రతిమను దక్షిణతో నాచార్యునకొసంగి యాశీర్వచనంబుఁ బడయవలయు నీయది యుద్యాపనవిధానం బిత్తెఱం గెవ్వ రాచరింతు రట్టివారు విఘ్నలేశంబేనిఁ గాంచక సర్వసిద్ధులన్ జెంది యఖిలసుఖంబులఁ దనియుదు రిది సత్యం బెల్లవర్ణంబులవారలు స్త్రీలు పురుషుల్ వ్రతంబాచరించి వాంఛితార్థంబు లొందుదురుఁ గాకయని నంతఁ దత్రత్యదేవముని వరులెల్లరుఁ బ్రత్యయ మొప్పార నమ్మహావ్రతం బీశ్వరసాన్నిధ్యంబున నెరపి గణనాథు ననేకసువస్తువిస్తారంబుల నర్చించి కృతార్థులగుదు నమ్మహోత్సవం బెల్ల నీక్షించి యమ్మహాదేవరాజ్ఞి యత్యంతానందంబునఁ బొదలె నయ్యవసరంబున దేవదుందుభిధ్వానంబు లేపు మిగిలి సెలఁగె గంధర్వాప్సరోగీత నృత్తంబులు బహుభంగుల వెలసెఁ బుష్పవర్షంబులు గురిసె నంత నారాయణప్రముఖాఖిల గీర్వాణశిరోమణులును మునులును దమపరిజనములతోఁ బరమేశ్వరానుమతి స్వస్థానంబుల కరిగిరి మహేశ్వరుండును సంతుష్టయగు మహేశ్వరిన్ గౌరవించి లోకరక్షార్థ మఖిలసౌఖ్యంబులఁ జెందుచుండెనని సూతుండు శౌనకాదిమునులన్ గాంచియిట్లనియె.

క॥ ఈవిఘ్నేశానజనుశ్రి, పావనచరితంబుఁ గూర్మిఁ ♦ బఠియింప వినం
గా వఱలున్ సిద్ధులు నా, నావిభవోన్నతులతో జ ♦ నంబులకు భువిన్. 144

క॥ అనవిని మునివరు లపు డిం, కను శుశ్రూషులయి యని ర ♦ కలుషచరిత! నీ
కనదమృతరసమయోక్తుల, వినిపింపుము మాఁదికథను ♦ వేడుక నిటులే.

వ. అని యడిగిన సూతుండిట్లనియె.

చ॥ గిరివరకన్యకాశివు లొ ♦ గిన్ సుతయుగ్మముతోడ సంబరం
బురువుగ నొందుచున్ గరము ♦ నున్నతి నుండిరి తారకారిసిం
ధురముఖులున్ బరస్పరము ♦ తోసము నివ్వటిలంగఁ బ్రేముడిన్
వఱలుచు నుండి రెంతయు సు ♦ పర్వవరుల్ దముఁ గాంచి మెచ్చఁగన్. 146

క॥ సర్వగణేశ్వరపట్టము, శర్వుం డార్యయును స్వాత్మ ♦ జన్మలయిన నా
యిర్వురలో నొకనికిఁ గడు, హర్షుగఁ గట్టన్ దలంప ♦ నంత రయమునన్.

క॥ శరజన్ముఁడు దనకనియున్, గరివదనుఁడు దనకె యనియు ♦ గాఢస్పర్ధా ॥గీ
ధురులై తలిదండ్రుల వే, సరఁ జేయఁగ వచ్చి యొక్క ♦ చక్కటివారల్.

గీ॥ కొడుకులను బిల్చియనినిట్లు ♦ గొంకులేక, యెవఁడు మీయిద్దఱందు భూ♦ యిష్ఠశక్తి
భూప్రదక్షిణ మొనరించి ♦ మొదట నిటకుఁ, జేరు వానికే పట్టంబు ♦ చెందఁగలదు.

కం॥ ఇది మే మొనరించిన ప, న్నిదమీయది మీర లెవరు ♦ నెఱవేర్చిన న
య్యది వాని కిడెదమనఁ జే, ర్మ్మదమునఁ గదలెను గుహుండు♦పుడమిం దిరుగఁగాన్.

వ. అంత నవ్విధం బారసి హేరంబుండు లంబోదరుండౌటకు మిగులఁ జింతించి.

చ॥ ఉటమటఁ జెంది కుంది తన ♦ కయ్యది దుర్లభమంచు నమ్మదో
త్కటముఖుఁ డప్డు సేయునది ♦ గాంచక యొక్క యుపాయ మెంచి యూ
రటఁ గొని తల్లిదండ్రులఁ ద్వ ♦ రన్ దరిసించి కడున్ బ్రపత్తిలం
పటుఁడయి మ్రొక్కి యిట్లనియె ♦ మంజుతరోక్తుల యుక్తి పెంపునన్. 152

శా॥ తల్లీ! తండ్రి! భవత్పదాబ్జముల ను ♦ ద్యద్భక్తిఁ బూజింప నే
నుల్లంబందుఁ దలంచినాఁడఁ గరుణన్ ♦ యోజించి యుద్దాని నా
కుల్లాసం బిడుఁడంచు నాజ్ఞఁగొని ర ♦ త్నోన్నాత్మపీఠిక విరా
జిల్లన్ వారలఁ జేర్చి కొల్చి ప్రణతి ♦ స్థేమాభిరామాకృతిన్. 153

గీ॥ వెరవునఁ బ్రదక్షిణంబుల ♦ నిరువదొక్క
మాఱు లొనరించి మ్రొక్కి యి ♦ మ్మాడ్కిఁ బల్కె
గట్టిఁ డీక మీరు నాకు సా ♦ కతము మెఱయ
సకలగణనాథపట్టంబు ♦ సత్వరముగ. 154

మ॥ అనినన్ వారలు నీవె ముందు సకలా ♦ హార్యాటవీతీర్థప
ల్త్తనదీస్ఫూర్త్తిత భూస్థలిన్ దిరిగి రాఁ♦దథ్యంబుగా నీకె యు
ఘ్ఘనపట్టంబు నొసంగువార మన న ♦ గ్గంధేభవక్త్రుండు పా
వనమౌ నాకృతి సల్పినాఁడ నసకృ♦ద్వారంబు లంబాపితల్! 155

ఆ॥ అనిన నింపయుండి ♦ యవని నెట్టులఁ జుట్టి, వచ్చినాఁడవనిన ♦ వక్రతుండుఁ
డనియె యుష్మదంఘ్రి♦వనరుహార్చనమును, దమప్రదక్షిణములఁ ♦ దలఁపుఁ డాత్మ.

చ॥ ఇరువదియొక్కమాఱు తమ ♦ కిప్డు ప్రదక్షిణ వందనంబులన్
సరవిగ సల్పి భూభ్రమణ ♦ సత్ఫల మిర్వదియొక్కమాఱు నే
వెరవునఁ గొంటి శాస్త్రములు ♦ వేదము లిక్కరణిన్ వచింపఁగా
నరయరె యేటికి త్తెఱఁగు ♦ నాలము సేయ జగత్కుటుంబకుల్! 157

గీ॥ తల్లిదండ్రుల సన్నిధి ♦ నుల్లసిలుచు, వేఱుభూముల కేగుట ♦ వెఱ్ఱిగాదె?
ఘెరవిడి కుమారుఁ డిప్పట్ల♦పెరిమెయు మరె, నాకు మీకృప నిట్లు ను ♦ శ్లోకులార!

సీ॥ తల్లిదండ్రుల పదో♦దకముఁ బోలంగలే, దాకాశగంగా మ♦హాజలంబు
మాతాపితలతో స♦మానతఁ గనజాల, రఖిల గీర్వాణమా♦హాగ్రిమణులు
జననీజనకుల పూ♦జనముతో సరిఁబోల, దేదేవపూజనం♦బేనిఁ బుడమి
పూర్వపుణ్యములేక ♦ పొసఁగునే యెవ్వారి, కవ్వారి పూజనం♦బక్తిలేక

గీ॥ తమను నేఁజెప్పవాఁడనే ♦ తథ్యమరసి, సరళమతి యుష్మదుక్తిసా♦ర్థకము నెంచి
సేయుఁ డీక గణమూర్ధాభి♦షిక్తుఁగాఁగ, జాగుసేయక నను గృపా♦జలధులార!

—* పార్వతీపరమేశ్వరులు గజాననునకు గణేశపట్టంబుఁ గట్టుట *—

వ. అనినంత.

క॥ సూటియగు సామజాస్యుని, మాటలను దదీయబుద్ధి ♦ మత్కృతిని మదిన్
బాటించి పార్వతీశివు, లాటంకము లేక పూని ♦ రట్లాచరింపన్. 160

తే॥ నగరుఁ గై సేయఁబంచి గ♦ణములఁ బిల్వఁ
బంచి యాక్షణమందు ని♦బ్బరపు పూన్కి
గంధసింధురవదనునిఁ ♦ గరుణతోఁ గ
నత్కనకపీఠి నుంచి గా♦నములు సెలఁగ. 161

వ. దివ్యగంగాకృపీటంబుల నభిషేకించి దుకూలపరిధానోత్తరీయంబులఁ గట్టనిచ్చి నవ
రత్నఖచితాష్టాపదకిరీటకుండలోర్మికల ముక్తాహారంబుల వివిధమణిభూషణంబుల
నొసంగి యఖిలగణాధినాథపట్టంబుఁగట్టి రాసమయంబున సర్వామరులును బ్రమథ
భూతగణంబులు హేరంబు దోరంబుమీఱ ననేకవిధంబులఁ బూజించి కొలిచిరంత
షడాస్యుండు వేగంబున నిలామండలం బెల్లఁదిరిగి రోజుచువచ్చి తల్లిదండ్రుల
కెఱిఁగించినఁ గొండ్రించారి కవ్వార లట జరిగిన వృత్తాంతంబంతయుఁ దెలిపిన నతండు
బమ్మెరపోయి యఖిలక్షోణీప్రదక్షిణాయాసక్షోభితుండై నను బిశ్వారిబుద్ధివైశద్యం
బున కలరి తితీక్షన్ గొని మిన్నకున్నంతఁ గొన్నిదినంబులమీఁదట.

—* విశ్వరూపుఁడు తనకూఁతుల నిర్వురను గణపతికిచ్చి పెండ్లిసేయుట *—

గీ॥ విశ్వరూపప్రజాపతి ♦ విఘ్ననాయ, కునకుఁ దనసుతల నొసంగఁ ♦ గూర్మితోడ
వచ్చి శివునర్థిఁగోరుడు ♦ వామదేవుఁ, డనుమతింపఁగ నాతఁ డా♦హ్లాదమొంది.

చ॥ హిమగిరిజాశివానుమతి ♦ నీశ్వ్యఁడతండు మహోత్సవంబుఁ బె
ల్లమరిచి సిద్ధి బుద్ధియను ♦ నాత్మజలన్ గణభర్తకిచ్చి యు
క్తముగ వివాహమున్ సలిపెఁ ♦ గాంచనగర్భునిదొట్టిమేటులౌ
నమరులు మౌనులున్ ఋషులు ♦ హర్షమునొంది చెలంగి రెంతయున్. 164

చ॥ తళుకు మెఱుంగు చూపులును ♦ దద్దయుముద్దులుగుల్కు నెన్నడల్
బెళుకుహొరంగు బంగరపు ♦ బింకపు గుబ్బకవల్ గడున్ గడుఁ
బలుకికిఁ దోఁచు నెన్నడుము ♦ లొప్పెడు నొప్పులకుప్పలౌ సతుల్
బలితపుబాళిఁ గొల్వఁ గణ ♦ పాలకుఁ డొందెఁ గడింది సౌఖ్యముల్. 165

—* గణపతి కిద్దఱు భార్యలం దిద్దఱు పుత్రులు జన్మించుట *—

గీ॥ కొంతకాలంబు జరుగ నా ♦ కోమలాంగు, లందు సిద్ధికి క్షేమాఖ్యుఁ ♦ డల్ల బుద్ధి
కమర లాభాఖ్యుఁ డాత్మజు ♦ లవతరించి, మించి రంచితవైభవా ♦ మేయులగుచు.

వ. అటమీఁదఁ బార్వతీపరమేశ్వరులు వధూద్వయంబులతోడ నొప్పు పుత్రద్వయంబుతోడను పౌత్రులతోడను నిరతిశయనిత్యానందంబునఁ బొదలుచుండి రిచ్చరిత్రం బఖిల పాపఘ్నంబు భోగమోక్షప్రదం బిద్దాని నాదరంబునఁ జదివిన వినినవారలందు.

—* ఫలశ్రుతి *—

సీ॥ విద్యార్థియగువాఁడు ♦ విద్యనుజెందు ద్ర, వ్యార్థియానతఁడు ద్ర ♦ వ్యంబుఁజెందుఁ
గన్యార్థియగువాఁడు ♦ కన్యను బెండ్లాడుఁ, బుత్రార్థియగువాఁడు ♦ పుత్త్రులఁగను
భోగార్థియగువాఁడు ♦ భోగములన్ జెందు, మోక్షార్థియగువాఁడు ♦ ముక్తినొందు
రాజ్యార్థియగువాఁడు ♦ రాజ్యమార్జించు య, శోర్థియానాతఁడు ♦ యశముఁబడయు
గీ॥ రుగ్ణుఁడై కుందునట్టిఁడా ♦ రోగ్యమొందు, ఋణభరాక్రాంతుఁ డొందును ♦ ఋణవిముక్తి
గొప్ప యిక్కట్టులందు గ ♦ న్గొలుపడెడు, వాఁడు నిర్వృతిఁ జెందును ♦ వాస్తవంబు.

వ. అనిచెప్పిన సూతునకు శౌనకాదిమునులు మహాత్మా! యింకను బార్వతీశ్వరుల లీల వేఱొక్కఁ డెఱింగింపుమనుటయు నతం డిట్లనియె.

క॥ శుంభద్భుజవిక్రమసం, రంభులు జంభారిముఖసు ♦ రభయంకరులా
శుంభనిశుంభాసురులు వి, జృంభించి జగంబులేఁచ ♦ సేగిఁగొని సురల్. 170

—* బ్రహ్మదేవుఁడు శుంభనిశుంభ వధకై శివునియొద్దకు వచ్చుట *—

గీ॥ ధా[illegible]గి యవ్వారి ♦ దౌష్ట్యమెల్ల, నుతువ నాతఁడు గనలి య ♦ నన్యసమైన
[illegible]మారసి ♦ వామదేవు, వలని కేతెంచి వారి కా ♦ వర ముఁదెలిపి.

ఉ॥ వీరల కేను మున్ను పృథి ♦ వీధ్రసుతాప్త! వరం బొసంగితిన్
బూరుషులేరు వారలను ♦ బొంకమణంపఁగఁజాలనట్లుగా
సారసగంధి పూ[illegible]సంగతిఁ జెందని జోటి వారలన్
[illegible]రణమ[illegible] ♦ మంటయదమ్యో జగత్త్రయంబునన్. 172

చ॥ ఇలఁగల పైదలులొసలుపు ♦ జెంతయు దుర్లభ మిట్టికార్య మీ
లలిత భవత్పురంధ్రియె ల ♦ లత్కృతధామతి యొక్క కన్యయై
చెలఁగి వధింపఁగావలయుఁ ♦ జెచ్చెర ఘోరని శాచవర్గ్యయిన్
ఛలమెదియేనిఁ బన్ని త్రిపుర ♦ శత్రుప్రియమున్ బొనరింపు మీశ్వరా! 173

—— * శివుఁడు పార్వతీదేవినిఁ గాళియనిన నామెగినిసి నిష్ఠురోక్తులాడుట * ——

గీ॥ అనుచుఁబ్రార్థించినట్టి స్వ ♦ యంభుమూర్తి, కవ్వరంబిచ్చి పంపి ని ♦ జాత్మమందు
వెరవునరయుచు నొకనాఁటి ♦ వేళఁగాళి, యనిహాసించెనునిందించి ♦ నట్టు లుమను.

ఉ॥ ఆనుడి విన్నతోడనె య♦గాత్మజ పెగ్గలమైన యల్కొదన్
బూని మహేశు రోషభర ♦ పూరితదృష్టులఁజూచి యిట్లనెన్
గానవె నాఁటనుండి ననుఁ ♦ గాళిగ నీకిటుఁ బ్రీతిలేనిచో
మానక యిన్నినాళ్ళిటుల ♦ ప్రాణ్పడనేల కలాపభూషణా! 175

ఉ॥ కూరిమిలేని నాదురతిఁ ♦ గోరుదువీవెటు లిక్కతానసే
మారునిఁగాల్చిపోయి తను ♦ మానముసేయక నేనె ముగ్ధనై
చేరితిఁ బట్టఁబట్టి యిటు ♦ చెల్వగు నేచెలియేని దానమై
పూరుషుఁగోరి చేరు నది ♦ పొందు నవజ్ఞ దృఢంబుగా ధరన్. 176

చ॥ మగనికిఁ బ్రీతిలేని యల ♦ మానిని జవ్వనమేనిఁ జెల్వమే
నగు పనిఁగాయు వెన్నె లటు ♦ లక్కట! యెట్టిసుఖంబులేనియున్
మగువల కింపొసర్పదిఁక ♦ మంచిగఁ గాంతుఁడు గారవించకే
వెగటుఁగొనంగ నిక్కముగ ♦ వెక్కసమా తను పొంది చూడఁగన్. 177

గీ॥ కానఁబాసెద వేగనీ ♦ కాలవర్ణ, తనువు వేరొకఁడేనియుఁ ♦ దనువుఁదాల్తుఁ
దాల్పకుండిన నేమని♦తల్లడిలుచుఁ, బొన్నువిడియవ్వలకునేగి ♦ పద్మగంధి. 178

ఆ॥ వెక్కివెక్కి యేడ్చి ♦ విభునకిట్లను దేవ!, సెలవుచేయు తపముఁ ♦ జేయుదాన
ననుచు గద్గదస్వ♦రాంచితమై వేడు, కొనఁగఁజూచి విశ్వ♦గురుఁడు పెఱచి.

ఉ॥ కెందలిరాకుఁబోఁడి! యిటు ♦ కేళిగ నాడిన నా నుడిన్ మనం
బందుఁ దలంచి యల్గెదవె? ♦ యందముఁ జందమునందు నీకు నే
సుందరి యీడుకాఁగలుగుఁ ♦ జూడఁగఁ దప్పెదియేని నాదు వా
క్కందుఁ గనన్ బడన్ సయిపు ♦ మంఘ్రిలవాలి యొనస్తు సేవలన్. 180

ఉ॥ నీయెడ నాకు వేడుక జ ♦ నింపకయున్న నిఁకెందుఁగల్గునో
పాయకయెంచు మాత్మమున ♦ భామరో! వేయుఱు చెప్పనేల? యీ
స్థాయదనంతవిష్టపవి ♦ భాసితసంతతి కీవు తల్లివై
శ్రీయలరారుచుందు విఁక ♦ సిద్ధము తండ్రిని నే నెఱుంగుమా!

గీ॥ అట్లగుటఁ జేసి నీయందు ♦ నరతి నాకు, నెట్టులేర్పడు నిఁక మన ♦ యిద్దఱందు
సురతలాలస మరునిచేఁ♦జొప్పడినది, కా దతనికన్నమున్న జ♦గంబుపొడమె.

గీ॥ విను పృథగ్జనరతి కలి♦వేణి! పంచ, బాణుఁ గారకుఁగాఁగ నే♦ర్పడినదాఁడ
నటులుగాకున్న మన్మథు ♦ నస్తమింపఁ, జేసి నినుఁ బెండ్లియాడుట ♦ సిద్ధమగునె?

క॥ మనుఁడును నను వేల్పులతోఁ, సరిగఁదలఁచి కలఁచి భస్మ ♦ సాత్కృతుఁడయ్యెన్
గిరిజ! జగత్త్రాణార్థం, బరయుము మన యిద్దరకు వి♦హారం బవనిన్. 184

ఉ॥ ఇత్తఱిఁ బల్కఁగూడ నిఁక ♦ నేదియొగాని జగచ్ఛుభార్థమే
హత్తఁగఁ దోఁచు నద్ది భవ ♦ దాత్మవశంబయి పొల్చు నింతలో
బిత్తరి! రిత్తయల్క నిఁకఁ ♦ బెంపొనరింపకు సాకతమ్మునన్
జిత్తమునందు నీ చరణ ♦ సేవకుఁగాఁగ నెఱుంగవో ననున్. 185

గీ॥ ఇట్లు పరిపరివిధముల ♦ నీశ్వరుండు, గట్టురాచూలి కాత్మనై ♦ కల్యమణఁపఁ
జాల వాచాలత దనర్ప ♦ సాంత్వనంబు, చేసినను దేఱక నితాంత ♦ చింతతోడ.

గీ॥ వేఁడినిట్టూర్పు విడిచి పూఁ♦బోఁడి యనియె
యిచ్చకములాడి నన్నింక ♦ నేచఁబోకు
నీదు చాటూక్తులకు లోఁగి ♦ నేను దెలివి
మాలి వంచింపఁబడితి నీ♦లీల నిపుడు. 187

గీ॥ మగనికిన్ బ్రియగాకున్న♦ మగువ ప్రాణ, ములను బాయఁగఁదగు నట్లు♦పూనకున్నఁ
దెగినదని యెల్లవారలు♦ నగుదు రెందు, నవని యున్నంతకాలంబు ♦ హాలహాలగళ!

ఉ॥ ఎంతయు నీకు నాతనువు ♦ హేయముగాఁ గనుపట్టుకున్న ని
ష్ఠింతటి కోర్చి నన్నిటుల ♦ నెల్లిదమాడెదె కాళియంచు? నే
నింతటి నల్పుదాననగు ♦ టింతయు దోసము నీది లేదు త
న్వంతము సేయుదున్ జదురు ♦ లాడకు' నీవిఁక మేటి మచ్చికన్. 189

—* పార్వతీదేవి తపంబు సేయుటకై శివుని సెలవడుగుట *—

గీ॥ శ్రీలయందిట్లు కార్ష్ణ్యంబు♦చెక్షయనుచు, ఘనులు పలుకుదు రద్దాన♦గాఢతపము
చేసి పాయుదు నైల్యంబుఁ ♦ జెలఁగి యిచట, నుండఁగానోపనద్దఁకి♦యుడుగుమార్య!

గీ॥ అనినవిని శంకరుఁడు దర ♦ హాస మమర, నిట్టులనె విరిఁబోఁణి! నీ ♦ కేల తపసు
పాయఁగాఁ జేతుఁగార్ష్ణ్యమి ♦ ప్పాట నేను, లేక నీవేనిఁ బాయఁగ ♦ లేవె చెప్పుమ.

వ॥ అనిన మహాదేవి యిట్లనియె.

ఉ॥ ఒల్లను నీసహాయ మది ♦ యెల్లను నాదు విభూతి నొందఁగా
నుల్లము శాంతినొంద దటు ♦ లుగ్రతపస్సొనరించి కాళిమన్
బొల్లుగ నుజ్జగించెదను ♦ బొచ్చెముఁబోలిఁ దలంప నీకిఁకన్
జెల్లదు దేవ! వేగ దయ ♦ సేయుము సెల్విఁక జోతచేసెదన్. 192

గీ॥ అనుడుఁ దప సెవ్వరినిఁగూర్చి ♦ యాచరింతు
వబ్జముఖ! యన్న నామె యి♦ట్లనియె మరల
దేవ! నినుగూర్చియే చేతు ♦ దివ్యతపముఁ
గాంచెదన్ గాంచనాకార ♦ గాత్ర మేను. 193

క॥ అనిన మహాదేవుఁడు దే, వినిఁ గని చిఱునగవు నగుచు ♦ వేల్పుల కార్యం
బును ఘటనసేయుటకు వల, దని నిర్బంధింపకున్న ♦ నార్య రయమునన్. 194

క॥ క్రిందుకొనునట్టివగతోఁ, గంది ప్రదక్షిణముచేసి ♦ కాంతుని విరహా
ర్తిం దవులచేసి హిమనగ, ముం దఱిసి గిరీంద్రమిథున ♦ మును గని ప్రీతిన్.

క॥ వందనముచేసి వారల, కుం దన తెఱఁగెఱుకచేసి ♦ కూరిమితో ము
న్నెందుఁ దపం బొనరించెనొ, యందే వాసంబుచేసి ♦ యాదరమొప్పన్. 196

—* పార్వతీదేవి తపస్సుచేయుట *—

సీ॥ భూషణంబుల విడనాడి ♦ పూవుఁబోఁడి, గగనధునిఁదానమాడి వ ♦ ల్కలముఁగట్టి
నియతసంకల్ప మొనరించి ♦ నిష్ఠమెఱయ, శైవలింగార్చనంబుఁ ద్రి♦సంధ్యలందు.

క॥ సలుపుచుఁ దపసొనరించెను, ఫలదళజలభక్షణముల ♦ బహుకాలము నె
చ్చెలులలరి కెలన సేవలఁ, గొలువఁగఁ జలిమలయనుంగు ♦ కూఁతురు ప్రీతిన్,

—* వ్యాఘ్రము పార్వతీదేవియొద్దకు వచ్చియుండుట *—

క॥ ఇటులఁ జిరకాల మరుగుడుఁ, గుటిలాత్మక మొక్క ఘోర ♦ గోహరి యుమ న
చ్చటఁబొడఁగని యశనేచ్ఛన్, జటులగతిన్ డాయ శైల♦జయు సాజముగాన్.

సీ॥ చెలులతోఁబాటుఁగనిదాని♦నలుకులేక, తొంటివలెనుండవ్యాఘ్రమా♦తుహినకుధర
జాతనూద్భూతరోమల♦స్తబ్ధతనువ, హించి యుండెఁ గరమువిస్మ♦యించి యందు.

వ. అంత.

చ॥ ప్రబలబుభుక్షఁ గొల్పులి ధ♦రాధరపుత్త్రిని డాసియున్ దదా
త్మబలవిధూతతాపయయి ♦ ధ్వస్తమలత్రియమై పరాంబికన్
నిబిడతరేమఁగొల్చుచు వ♦నేచరఘాతుక సత్త్వరాజి కెం
దు బిరుదుమీఱు శాస్త్రయయి ♦ దోఁచెను నిచ్చలు గాపుసేయుచున్. 201

చ॥ గిరిజయు దానిపైఁ గరుణఁ ♦ గేల్కొనఁజేసి యపత్యబుద్ధి వి
స్తరిలఁగఁ జేసెఁ దత్సఖులు ♦ దారును నెన్నఁడలంపరైరి గో
హారియును నంత నాత్మకుఁ గృ♦తార్థత నెంచి యహర్నిశంబులున్
నిరుపమభక్తి లోకజన♦నిన్ భజియించుచునుండె దండిగన్. 202

గీ॥ దుష్టసత్త్వంబులకుఁ గాని ♦ దుర్మతులకుఁ, గాని యత్త్రిత్తి చూచుట♦కేని వలను
గాకయుండెను జగదీశ♦కాంత యుమటఁ, గడఁగి శార్దూలరాజంబు♦గాపుఁగొనుట.

క॥ అంతఁ బరమేశకాంత ని,రంతర తప మంతయేని ♦ రాజిలెఁ గడు దు
ర్దాంతులగు దైత్యవరుల ని,తాంతశ్రమ డస్సి సురలు ♦ ధాతను వేడన్. 204

-* బ్రహ్మదేవుఁడు పార్వతీదేవియొద్దకు వచ్చి యొక శక్తినిఁ బుట్టింపుమనుట *-

క॥ ఆతఁడు వెరవున సమర,వ్రాతముతోఁ దుహినగిరికి ♦ వచ్చి త్రిజగతీ
మాతను మృడానిఁగని సం,ప్రీతి నెయిన్ మ్రొక్కి నుతులఁ ♦ బెల్లుగ సల్పన్.

చ॥ కని గిరిరాజపుత్త్రి కడు ♦ గారవ మొప్పఁగఁ దమ్మిచూలికిన్
గొనబుగ నర్ఘ్యపాద్యములఁ ♦ గూరిమి స్వాగతమున్ బొనర్పఁగా
వనరుహసంభవుం డలరి ♦ వారనిభక్తి దలిర్ప నంజలిన్
గొని యిటు పల్కె నజ్జగతి ♦ కోమలపేశలమంజులోక్తులన్. 206

ఉ॥ తల్లి! యిదేటి కిట్టడరి ♦ దారుణతాపముఁ జెందుచుంటి వీ
వెల్ల జగంబులేలు పర ♦ మేశ్వరి వొక్కటి నీకుఁదక్కువే
పెల్లుగ మున్ దపించి యల♦విశ్వగురున్ విభుఁగాఁగఁగొంటి వీ
వల్ల సుధాంశుమౌళివిర ♦ హంబెటుసైఁపఁగనోపి తీయెడన్. 207

గీ॥ అనిన వనజాతలోచన ♦ యనియె నలువ, కాదిసర్గంబునన్ బర♦మాత్మ శివుఁడు
నిన్ను సృజియించుటన్ జేసి♦నీవునాకు, సుతుఁడవై చెలువొందెద♦వతులతేజ! 208

క॥ మరలఁ బ్రజాసర్గమునం, దిరవుగ నీయలికమున మ♦హేశుఁడు పొడమన్
గురుతఁదగుశ్వశురుఁడవు భూ, ధరునకుఁబిత వౌటనాకుఁ ♦ దాతవు ధాతా! 209

వ. కావున రాణివాసంబు ముచ్చటనెట్లు నీయెట్టయెదుర గుట్టువీడి రట్టడికోర్చి మునుముట్టన్ దెలుపుదునైన నొక్క చక్కటి యాలకింపుము.

ఉ॥ నాదుశరీరమిద్ది కడు ♦ నల్పుగనుండుటఁ జేసి దీనిపై
నాదరబుద్ధి మానితిని ♦ నచ్చపుపైఁడియుఁగూడ నీడరా
లేదను మేను నూన నొక ♦ లీలఁగ నిట్లు తపించుచుంటి నీ
నీదు సమాగమం బిపుడు ♦ నిక్కము హేతువు తద్విభూతికిన్. 211

గీ॥ అనిన బిసరుహాభవుఁ డిట్టు♦లనియెఁ దల్లి!, యింతమాత్రమునకె తపం♦బిట్లు దుస్స
హముగఁ జేయంగవలయునే♦ నైన నీవు, లీల లోకహితార్థమై♦ కాళ్లుఁగాదె? 212

క॥ శుంభనిశుంభాసురులు విజృంభితులై సకలసురల ♦ చేసయుడఁచి యి
ఱ్ఱుంభినిఁ గలంచుచుండిరి, గంభీరకృపాంబురాశి! ♦ కడఁద్రుమఁ వారిన్. 213

ఆ॥ శక్తి నీవుదక్క♦ నక్తంచరేంద్రులఁ, బెఱలు చంపఁజాల ♦ రరయ మంబ!
వరము వారికిడితిఁ ♦ బురుషవధ్యులుగాక, కన్యయువతిచేఁ బో♦కారునట్లు

వ. కావున

ఉ॥ నిర్మలబుద్ధి నీపదవ ♦ నేజములన్ భజియింతు నీజగ
చ్చర్మముఁగోరి నీవిఁకను ♦ సత్వర మానలుపొప్పియున్న యీ
చర్మముపేరితోఁ జెఱుత ♦ శక్తిని వీడి మదంబ! దాన నీ
దుర్మతులైన రక్కసులఁ ♦ ద్రుంపఁగఁజేసి జగంబులేలుమా! 215

—* పార్వతీదేవి కాలతనువునఁ గౌశికిన్బుట్టించి తానుగౌరియగుట *—

క॥ అనియజుఁ డభ్యర్థింపఁ దు, హినగిరిసుత చర్మకోశ ♦ మెలమివిడి రయం
బునఁ గనకకేతకీసుమ, కనదుత్తమగౌరిమై ని ♦ కామంబలరెన్. 216

గీ॥ అంబ త్వక్కోశమునఁ ద్వ్యక్త ♦ మైన శక్తి, కౌశికీనామధేయయై ♦ కాలమేఘ
నిభశుభాకారకన్యయై ♦ నీటుమీఱి, మెఱసెఁ దామరచూలి య ♦ లరెఁగరంబు.

సీ॥ శంఖచక్రగదాది ♦ సకలసాధనసంయు, తాష్టమహాభుజ ♦ యైనదాని
ఇంద్రనీలంబుల ♦ నెకసక్కెమాడు ర, మ్యాంగమైన కృష్ణగా ♦ త్రింబుదాని
సూర్యచంద్రాగ్నుల ♦ సొంపుఁగన్పించు దీ, వ్యద్దివ్యనేత్రత్రి ♦ యంబుదాని
నవరత్నఖచితక ♦ నకనిర్మితోజ్జ్వల, త్కలిత చంద్రార్ధశే ♦ ఖరముదాని

గీ॥ మేల్మి బంగరువలువల ♦ మెఱయుదాని, సుందరీతిలకంబయి ♦ చొక్కుదాని
పూరుషస్పర్శనెఱుఁగని♦ పూవుఁబోఁడి, నంబ యిదె దేవకార్యార్థ ♦ మజునకొప్పెను.

వ॥ అంతఁ గాంచనగర్భుండు ప్రీతుండై యమ్మహాదేవిముంగట మెలంగుచున్న
శార్దూలవరంబున్ గాంచి విస్మితుండై యద్దానిపై వెగ్గలంబగు వాత్సల్యంబుఁ
బఱపు నప్పరమేశ్వరి కతండిట్లనియె. 219

ఉ॥ అమ్మ! యిదేల క్రూరమృగ ♦ మం దిటు లక్కటికన్ బొసర్చె దీ
విమ్మహి నాగుఁబామునకు ♦ నింపునఁ బాలను బోసినట్లు ని
క్కమ్ముగు క్రూరసత్త్వమున ♦ గా డిది యొక్క నిశాటఘాతుకుం
డిమ్మెయి దీనిపై నెనరు ♦ నించ జనించు విపత్పరంపరల్. 220

ఉ॥ ఎన్నియొ గోవ్రజముల్ దినియె ♦ నెందఱినో ద్విజాళిన్ వధించె నిం
కెన్నియొ జన్మముల్ సలిపె ♦ నెందఱికో యిఁక నిట్టి నీచుపైఁ
జన్నె భవత్కృపాసుధను ♦ జల్లఁగఁ దల్లిరో! యివ్విధంబునన్
మున్నొనరించినట్టి యఘ ♦ ముఁ గుడిపింపఁగఁ జెల్లు వీనికిన్. 221

వ. ఇంతలో నిసర్గదుష్టుండగు వీనితో నీకుఁ బనియేమనిన నమ్మహేశ్వరి తమ్మిచూలి కిట్లనియె.

ఉ॥ నీవనినట్టు లెట్టి యవి ♦ నీతుఁడుగాని యితండు మున్ను న
న్నీవిపినంబునన్ దలఁచి ♦ యెంతయు భక్తి భజించుచుండె నే
కావలుఁడైన నవ్విధముఁ ♦ గాంచను నేనిట దుష్టసత్త్వవి
ద్రావకుఁడై ననుం గొలిచె ♦ రాతిరియుం బవ లేకధీకతన్. 223

ఉ॥ కావున వీని నాత్మసుతుఁ ♦ గాఁగని నా నిలయంబునన్ మహా
దేవుని యాజ్ఞతోడ నొక ♦ దివ్యగణాగ్రణిఁ జేసెదన్ సుహృ
ద్భావము చెల్లు నట్లయినఁ ♦ బన్నుగ నింతటికన్న మిన్న లే
దీవిషయీని నాకుఁ బ్రియ ♦ మెంచుము దీనిఁ బయోజసంభవా! 224

ఆ॥ అనిన బ్రహ్మదేవుఁ ♦ డనియెను జనని! నే, నెఱుఁగ కిప్పుడు పేని ♦ యింగితంబు
దొంటివృత్తి మిట్లు ♦ నాడరిచెప్పితి నీదు, భక్తిఁ జెందె నేని ♦ బరవు దయను.

క॥ పుణ్యంబు లేమిసేయును, గణ్యంబగు నీదుభక్తిఁ ♦ గాంచనియెడఁ గా
రుణ్యవతి! తావకాంఘ్రి శ, రణ్యుండగు భక్తుఁ డెందు ♦ రవ్వఁగనఁడిలన్. 226

సీ॥ నీయధీనముగదా♦నిఖిలజంతువులకు, బంధమోక్షముల సం♦ప్రాప్తి భువిని
పరమశక్తిని నిన్నుఁ♦బాసి యేకర్మంబు, లందు సిద్ధినిఁ జెందు? ♦ నవని జనుఁడు
సర్వభావములందు♦స్వయముభవవ్వునైన, నీవె యూఁతవుగదా♦నిత్యమూర్తి!
అంబుజాక్షాదిది♦వ్యాగ్రిమమునకు నీ, యాజ్ఞ యైశ్వర్యభా♦గ్యావహంబు

గీ॥ కడచి రెంపఁజొ నీయాజ్ఞ♦గరుడకేత, నాబ్జభవు లిఁక రాఁగల ♦ రట్టివారు
నిన్నుఁ గొలువక పురుషార్థ♦మెన్నఁడేనిఁ, జెందఁజాలము దృఢమిది♦శివునిరాణి!

క॥ శక్తివిహీనుఁడు పుడమి న, శక్తుం డేపనినిఁ జేయఁ♦జాలం డరయన్
వ్యక్తమగు నిద్ది యే య,వ్యక్తులకున్ గూడ విష్ట♦పత్రియజననీ! 228

క॥ నీ వలిగినయెడ బ్రహ్మను, గావింతువు గసవుగాఁగఁ ♦ గరుణగలిగినే
నే వెడఁగునైనఁ జేసెదు, శ్రీవిభునిగ నీదు మహిమ ♦ చిత్రం బంబా! 229

సీ॥ అఖిలజగదీశ్వరుఁడుఁ బర♦మాత్ముఁడు నగు, శివునకీవిఁకఁ బుట్టుక♦చేటు లేని
ధ్యానసనాతనశక్తివి♦వైన లోక, యాత్రకై యొక్కరూపంబు♦నందితిట్లు. 230

వ. ఇట్టి నీవిభూతిప్రకారం బెవ్వరెఱుంగఁగలరు? దుష్కృతకర్ముండైనను నీశార్ద్రాలంబు నీయనుగ్రహంబున మహోన్నతసిద్ధిన్ బొందె నింకఁ బ్రతిబంధకంబు లేదనిన నవ్వనజసంభవు ననుగ్రహించి యంబికాదేవి కౌశికిన్ దేవకార్యంబు సల్పుమనుటయు. 231

—* కౌశికి శుంభనిశుంభాదులను జంపి వింధ్యగిరియం దుండుట *—

ఉ॥ తల్లికి జోతచేసి ప్రియ♦దంబున నాపెయనుజ్ఞఁ గౌశికీ
హల్లకపాణి రక్కసుల ♦ నంతముసేయఁగఁబూని ధాతతోఁ
బెల్లుగ వింధ్యశైలవర♦పృథ్వినిఁజేర నజుండు పేర్మి సం
ధిల్లఁగ నొక్క సింగమును ♦ దేవికి వాహన మిచ్చె మచ్చికన్. 232

క॥ ఆసవములఁ బలములఁ గడు, మీసరపుంజలజముల న♦మేయాపూపో
ద్భాసితదివ్యాన్నంబుల, వాసిగ నిడి కొల్చి పంప ♦ వరద రయమునన్.

ఆ॥ తా ననేకశక్తి ♦ తండంబుఁ బుట్టించి, వారితోడ సమర♦వసుధఁ జేరి
దైత్యవరులఁ బిలిచి ♦ దర్పంబునన్ జంపె, శరవితతులఁ గాము♦శరనిభాభల.

వ. లోకకంటకులగు నాదైతేయగ్రామణుల మరణంబున కలరి నలినసంభవుండు జేజేలతోఁ గౌశికిన్ బలువిధంబులఁ బూజించి యవ్వింధ్యాచలాధిపత్యంబిచ్చి యందకాపురంబుండ నర్థించి యుంచె. 235

—* శివుఁడు పార్వతీదేవియొద్దకువచ్చి కోపోపశమనంబుచేయుట *—

క॥ అంత శివుం డను సుమన, స్సంతతిహితకార్య మెలమిఁ ♦ జక్కపఱిచి య
త్యంతం బంచత్కాంచన, కాంతాంగికయగుట యరసి ♦ కడువేగమునన్.

ఆ॥ డాయవచ్చియనెఁ గ♦డానిబొమ్మరో! మది,గుమురుపడెఁ దపంబు ♦ గొప్పఁజెందె
రమ్ము! పోదమిపుడు ♦ రాజతాద్రికివేగ, ననుచు గౌరి బిగ్గ ♦ నక్కుఁజేర్చె.

ఉ॥ ఆలలితాంగియున్ విభుని ♦ యంఘ్రులకున్ బ్రణమిల్లి యంతనే
యాలముతోడఁ గొంచెమెడ ♦ దై ముఖపద్మము వంచినిల్వనా
బాలశశాంకశేఖరుఁడు ♦ భామను డాసి కరంబు కౌఁగిటన్
మేలుగఁజేర్చి యెత్తికొని ♦ మిక్కిలి ముద్దిడి పల్కె నిట్టులన్. 238

గీ॥ కనుము సర్వాంగసుందరి! ♦ కరుణనిపుడు, గడచె నాదశ యెద్దాన ♦ గాటమైన
యనునయోపాయ మదియు ని♦రర్థకంబు,గా మఱిఁగెనల్లఁ బార్వణ♦సోమముఖిరో!

సీ॥ రమణిరో! స్వేచ్ఛావి ♦ రాజితాకృతులమై, పరమభావంబును ♦ మఱచుటెట్లు
కలుగ నెప్పుడు చిత్త ♦ కాలుష్యహేతువు, లరయు సుందరిరో! తి♦థ్యంబుగాఁగ
పెఱవారికట్లు వి♦ప్రియకారణము మన, కన్యోన్య మొదవఁగా ♦ నడఁగు జగము
వాగమృతంబెల ♦ నాగ! నీవచ్చుమా, వర్ధామృతంబునే ♦ నవనియందు,

గీ॥ అరయ వాగర్థమయము సూ♦క్ష్మఫలలోక, మిందు నీ యమృతద్వయం♦బెవ్విధమున
విప్రయుక్తంబగుట కోప్ర? ♦ విప్రమోక్షి!, శాస్త్రయుక్తిప్రసిద్ధ మీ♦జాడఁ దెలియు.

క॥ అగ్నిశిఖోనిష్ణుఁడఁ గాలెయు, భగ్నుల! విను మేను నిక్క♦ముగ సోమశిరో
భాగ్నిలయ వీవు విశ్వం, బగ్నిషోమాత్మకమిది ♦ యరయ మఖిలమున్.

క॥ విద్యవు నీ వజ్ఞముఖీ!, వేద్యంబగు జ్ఞాన మేను ♦ విశ్వంబం నీ
విద్యావేద్యాత్మలమై, హృద్యగతిన్ వెలయుచుందు ♦ మెడఁబాటెటులో.

చ॥ జగముల నే సృజింపుటయుఁ ♦ జంపుట పేఱొకరీతిచేతఁగా
దు గణుతిసేయ మీవ యిటు ♦ దోఁచఁగఁ జేసెదు మామకాజ్ఞపై
నిగరపుటాజ్ఞయే బలిమి ♦ నేతకు నిచ్చలు సద్ధిమాయుచోఁ
దగు నెటు ప్రాభవంబుగనుఁ ♦ దామరసాయతలోచనా! యికన్. 243

ఆ॥ ఎందుఁగాని మనకు ♦ నెడఁబాటులే దెప్డు, డట్టి మన వియోగ ♦ మద్భుతంబు
లోకరక్షణాఅకుఁ ♦ జేకొంటి మాకృతు, లస్మదీయలీల ♦ యగునె వృథగ?

క॥ దేవతలకార్య మెవలో, భావించియె కాళి యంటి ♦ భామామణి! ని
న్నావిధము నీ వెఱుంగని, దై వెలసెనె యలుగనేల? ♦ యందుల కిటులన్.

క॥ అది యిటు జగదవనార్థం, బొదవెను నీయందిఁ కన్య ♦ మొదవదు ప్రేమా
స్పదమతి! యరయుమనఁ బ్రియం, వదుఁడగు విభుసూక్తులరసి ♦ వాసిగ నంతన్.

—* పార్వతీదేవి యలుకఁదొలఁగి శివునకుఁ గౌశికీవృత్తాంతంబుఁ జెప్పుట *—

గీ॥ సకలశృంగారభావైక ♦ జన్మభూమి, గౌరి తథ్యం బెఱింగి య ♦ ల్కుఁ దొలంగి
మందహాసంబు లజ్జయు ♦ మల్లడింపఁ, బలికెఁ గౌశికి నెన్నుచుఁ ♦ బ్రిభునకిట్లు.

ఉ॥ దేవర! చూడవైతి పతి ♦ దివ్యతనూజ్జ్వలమైన కౌశికిన్
దేవహితార్థమై సలిపి ♦ తిన్ భువనంబులలోన నెందు నే
నావనితాకృతిన్ గనఁగ ♦ నానాశా దానవవీరవర్యులన్
గావలులన్ వధించి తగఁ ♦ గాపురమొందెను వింధ్యభూస్థలిన్. 248

వ. అద్దాని రూపసామర్థ్యాతిశయంబు లెల్లఁ దమకుఁ జతురాననుండే యెఱింగింపఁ గలండని యాళీజనంబులకు శాస్త్రాలానయనంబునకై సెలవొసంగ నవ్వారలు వ్యాఘ్రింబుం దెచ్చి యెదురనిల్పన్ గాంచి యమ్మహాదేవి విభునకిట్లనియె.

—* పార్వతీదేవి శివుని వ్యాఘ్రమును దౌవారికునిగఁ జేయుమనుట *—

ఉ॥ నాథ! యుపాయనం బిది క ♦ నన్ దగు వ్యాఘ్రిము దీనితో సముం
డీధర నాకుభక్తుఁడొకఁ ♦ డేనియు లేఁడు దివానిశంబు లీ
భూధరభూమి నా నిలయ ♦ మున్ దగఁగాచెను ఘోరసత్త్వదు
ర్బాధలు లేకయుండఁ గడు ♦ భక్తిసతంద్రితమై మెలంగుచున్. 250

శా॥ నాయం దెక్కుడుప్రేమ యున్న యెడలన్ ♦ నాపేక్షఁ జెల్లించుచున్
నాయంతఃపురమందుఁ గావలిగ న ♦ న్నందీశ్వరాఖ్యున్ గడున్
శ్రేయోవైఖరి దీనినుంపు ముకుపుల్ ♦ బేర్చన్ బ్రసంగించి దా
సేయువాక్యములోఁ బ్రియంబుగఁ గృపా ♦ సింధూ! జగద్రక్షకా! 251

సీ॥ మధురమును బ్రణయోదర్క ♦ మంజులంబు, నైన దేవీవచనమును ♦ నాలకించి
ప్రీతి నొందితినని శివుం ♦ డాతతాద, రమున నద్దానిఁజూడ వే ♦ గమున నదియు.

సీ॥ మేల్మి బంగారుబెత్తంబు ♦ మెఱయఁనాగుఁ, బాముఁబోలిన వాలును ♦ భాసురంపుఁ
గనకరత్నవిచిత్రమౌ ♦ కంచుకంబు, గలిగి యొప్పెండె రక్షకా ♦ గ్రణిగ నపుడు.

వ. వానికిఁ బరమేశ్వరుండు సోమనంది యని నామధేయంబొసంగె. పరమేశ్వరియు నపురూపంబుగ నవ్వానిఁజూచి మేరలేని యానందంబునొందె నా జగత్సుందరి కిట్లు ప్రియంబుచేసి తరుణేందుభూషణుం డమూల్యవస్త్రాభరణంబులఁ బ్రత్యగ్రహరిచందనకుసుమదామంబుల దేవి నలంకరించె నయ్యవసరంబున. 254

కం॥ మేనాదేవియు శైలే, శానుఁడు తమ కూఁతుతనను ♦ చక్కఁబడుటయున్
మానుగ గౌరీతనువు, దానొందుటఁ దెలిసి యటకు ♦ దటిసి ప్రియమునన్.

## —✱ జగద్రక్షణార్థమై పార్వతీ పరమేశ్వరులు నిత్యసుఖంబు లొందుచుండుట ✱—

వ. కూఁతు నల్లునిఁ గాంచి యుంచితామోదంబున దుకూలపరిధానోత్తరీయాదుల ననేకమణిమయాభరణముల నుపాయనంబులిచ్చి యానందించి రంత జగత్కారకులగు పార్వతీపరమేశ్వరు లద్రిదంపతుల వీడ్కొని జయావిజయలతో సోమనందిన్ దోడ్కొని రజతాచలంబుఁజేరి సోమనంది నంతిపురంబునఁ గావలియుంచి ప్రమథజనంబలర మణిభవనంబునఁ బ్రవేశించి లోకరక్షార్థంబై నిచ్చలు సౌఖ్యంబులఁ జెందుచుండిరని సూతుండు శౌనకాదిమహామునుల కిట్లనియె.

కం॥ ఈచరితం బెవ్వఁడుగా, నీ చదివిన వినినఁ జెందు ♦ నిరుపమవిభవ
శ్రీచెలువుమీఱు సౌఖ్యము, లాచంద్రార్కంబు యశము ♦ నభవపదంబున్.

మ॥ ఘనదుర్భిక్షమహావ్యథాసమయజా ♦ గ్రద్దాత్రతాతుష్టశై
వనికాయా! సుమనోమనఃప్రియతమా! ♦ భర్త్రవ్రతాచారపా
వనలక్ష్మ్యూహ్యాయగేహినీనయనజీ ♦ వంజీవజైవాత్రకా!
వనజారాతివిభానిభోత్తమయశః ♦ పారిజ్జదాశావ్రజా! 258

గద్య. ఇది శ్రీ బుధజనవిధేయ ముదిగొండ నాగవీరేశ్వరనామధేయ
ప్రణీతంబైన శివపురాణంబందలి కుమారఖండంబునఁ
దృతీయాశ్వాసము సంపూర్ణము.

—.♦.—



శ్రీ శివాభ్యాన్నమః

# శ్రీ శివపురాణము

## యుద్ధఖండము.

### ప్రథమాశ్వాసము.



మద్ధవళపురీవిభు
తామేయరమాఢ్యసుంద♦రాంబావిద్యాం
బామానినీసహోదరి!
హైమవతీశార్చనార♦తా! లక్ష్మ్యంబా!

వ. అవధరింపుము. శౌనకాదిమహామునీంద్రులు సూతునితో నిట్లనిరి. 2

క॥ కొమరులునున్ గోడండ్రు మ,నుమ లొప్పఁగ రాజమండ♦నుం డగసుతతోఁ
ప్రమథులు గొలువఁగ వలనుచు,శివు నేమేమి యొనరించెఁ♦జక్కఁగఁజెప్పుమా.

గీ॥ త్రిపురముల నొక్కశరమునఁ♦దిగిచి యల్ల, నల్లవ్రాలెడు దొరలను♦బొల్లుచేసె
నని వినెద మెట్లొకమ్మున♦నభవుఁ డట్లు, సలిపెనో తెల్పు మాకిప్డు♦సత్యవచన!

వ. అని యడిగిన సూతుం డిట్లనియె.

— * త్రిపురాసుర చరిత్రము * —

ఉ॥ మున్నల తారకాసురుని ♦ ముమ్మొనవాల్ దొరపట్టి చంప నం
త న్నగులున్ దొరంగి సుర♦తల్లజు లెప్పటియట్లు శ్రీలతో
నున్నతిమీఱి యుండిరి ద♦నూద్భవకోటి రసాతలంబునన్
బన్న మెసంగనుండె సిరిఁ♦బాసి యలంద్రుచుఁ గొన్నినాళ్ళటుల్. 5

వ. అంత.

గీ॥ తారకాసురసుతులు గొం♦తవడి కెదిగి,పొదలిరవ్వారు ముగ్గురు♦పోటుమగలు
లావు చేవయు వెరవు చ♦లంబుగల్గు, వారు దండ్రిని మరపించు♦వార లెందు. 6

వ. అవ్వారికిఁ దారకాక్షుండు కమలాక్షుండు విద్యున్మాలి యను నామధేయంబులు
సుప్రసిద్ధంబులై తనరె నంత నచిరకాలంబున నవ్వారు.

గీ॥ కనకశైలగుహాన్ జేరి♦కరముతపము, ధాతను గుఱించి యయుతవ♦త్సరము లొంద
నలువ దఱిసి వరం బిత్తుఁ♦దెలుపుఁ డన్న, మ్రొక్కి వారలు దోయిలిఁ♦బూని యనిరి.

క॥ దేవా! వరంబు నిడు నెడ, సేవధువున మాకు మిత్తి ♦ యేర్పడని యటుల్
నీవారసి యిమ్మన నా, దేవజ్యేష్ఠుండు హాసించి ♦ దితిజుల కనియెన్. 9

చ॥ కనుపడునట్టి దెద్దియు జ♦గంబున శాశ్వతమై యెసంగ దీ
యనువున సర్వలోకములు ♦ నజహితేందులు సర్వలోకశా
సనులును వారికర్మఫల♦సంచితభోగము లొందియంతముం
గనుదురు మీర లెట్టు లది ♦ గాంచక యుందురు వేఱుఁ గోరుఁడీ ! 10

గీ॥ ఎద్దియేనియు దుర్లభం♦బెంచి యొక్క, సాఁకు నక్షిడి మిత్తి పొ♦సంగనట్లు
వరముఁ గోరుం డొసంగెద♦ననుచు ననుడు, వారలించుక చింతిలి ♦ బ్రహ్మ కనిరి.

—* త్రిపురాసురులు బ్రహ్మదేవుని వరంబు లడుగుట *—

చ॥ సరసిజసూతి! నీవు గడు ♦ సంపద లిచ్చిన భాగ్యమిచ్చినన్
జిరమగు నాయువున్నఁగవ ♦ దేఁకువ నేఁకటదీర భోగముల్
మురియుచు నొందఁజెల్లు నది ♦ భూరిగ లేనియెడన్ జనుండు సం
బరపడి యేమి బావుకొను♦వాఁడొ ? యెఱుంగుము నీ మనంబునన్. 12

ఉ॥ ఐనను నీవు కాదనిన ♦ నక్కట యేమి యొనర్తు మిప్డు నీ
మానసపుంబ్రకారమె య ♦ మర్చికొనన్ దగు పైఁడి వెండి యి
న్మా నగరంబులన్ ముపుర ♦ కాదటఁ గూరుపు మవ్వి నేలపై
యానక మింటఁ దిర్గుచు వి ♦ హారము సేయుచు నుండఁగావలెన్. 13

గీ॥ ఒక్కొకపురంబునందు మే♦మొక్కొకరము, వాస మొనరించెదముఁ కస♦ర్వహరుఁడలిగి
తేరుగానట్టి తేర నెం ♦ తేవసించి, విల్లుగానట్టి యొకవింతఁ ♦ విల్లుఁ దిగిచి. 14

క॥ వాలముగాకయె తగునొక, వాలమ్మున ముప్పురములఁ ♦ బడసి యొకయెడన్
గాలిచి చంపవలెన్ మము, మేలుగ నంతవఱకిమ్ము ♦ మేలియసురులన్. 15

వ. మఱియు మాకు సమృద్ధతేజోబలవిద్యాధనైశ్వర్య త్యాగభోగయోగంబు లనుమా
నింప కిమ్ము సర్వదేవమయుండగు శంకరుండు కింకరులగుమమ్ము సమయింప నేరఁ
డికఁ బైనఁగానున్న యట్లగుననిన విరించి తథాస్తని విశ్వకర్మయగు మయునిఁ
బిలిచి వారియభీష్టానుసారంబుగఁ బురంబులనిర్మించి యొసంగుమన్న నవ్వాఁడట్లు

హైమ రాజతాయసపురంబుల సమృద్ధైశ్వర్యశోభితంబులఁ గామగమనంబుల
నిర్మించియిచ్చిన నందు జ్యేష్ఠుండు భర్మపురంబును ద్వితీయుండు రాజతంబును
కనీయుం డాయసపురంబును గొని యందుఁ బ్రవేశించి యుండిరి మఱియు నాపు
రంబులు మూఁడును. 16

సీ॥ పద్మరాగమణిస ♦ ప్రాసాదములచేతఁ, గల్పవనకదంబ ♦ కంబుచేత
తుంగమాతంగతు ♦ రంగరాజులచేత, బహుగోబలీవర్ద ♦ పాళిచేత
అరవిందహల్లకా ♦ యతసరస్సులచేత, వాపీతటాకకూ ♦ పములచేత
సకలవస్తుప్రశ ♦ స్త సమూహములచేత, గంధర్వసిద్ధని ♦ కరముచేత
గీ॥ అతులవిద్యాధురీణాగ్రి ♦ జాళిచేత, సమరవిక్రాంతదైత్యాజ ♦ నములచేత
విలసితపతివ్రతాంగనా ♦ వితతిచేతఁ, బ్రతిగృహస్థశివాలయ ♦ ప్రతతిచేత.

క॥ రమణీయములై ప్రతిగే, హమున మఖాగ్నులను బాయ ♦ నట్టివియై చె
ల్వమరుచుఁ దిరుగుచునుండును, ద్యుమణిపదవినుండి యహివ ♦ లోకముదనుకన్.

ష–గీ॥ ఇట్టి త్రిపురంబులందు సు ♦ హేయులైన, దైత్యవరు లేపుమిగిలి మా ♦ ర్తాండమండ
లంబుదారకొని శేష వే ♦ శ్మంబువఱకుఁ, బురులతో సంచరించుచు ♦ భూతకోటి
కెల్ల హింసయొనర్చుచు ♦ నుల్లసిలుచు, సురలఁగుచుండిరి జనములె ♦ చ్చోటనేని.

ఆ॥ వారిఁ జెనక లేక ♦ వాసవుండును దక్కఁ, వేల్పులెల్ల వెఱచి ♦ విన్నఁదనము
తోడ మూఁకలగుచుఁ ♦ దోయజగర్భుని, సన్నిధానమునకుఁ ♦ జక్కనేగి.

క॥ మ్రొక్కి యిటు విన్నవించిరి, దక్కఁగలేమింకఁ ద్రిపుర ♦ దానవవీరుల్
నిక్కుచు నెల్లజగంబులఁ, జక్కాడుచు నున్నవారు ♦ సరిలేకెందున్. 21

ఉ॥ ప్రొద్దు కడున్ వడిన్ బడమి ♦ బోర్లగిలుం బురముల్ గనంబడన్
హద్దునుదప్పి తారలు హి ♦ మాంశుడు దాగుచు దిర్గుచుందురే
సుద్దియులేక బిక్కవడి ♦ చూచుచునుండు జముండు మేటియౌ
పద్దెఁగడ్పు చుంటిమిది ♦ పద్మభవా! కనరాదె నీకిటుల్. 22

చ॥ ఎపుడొ దివంబుపైఁబడి సు ♦ రేశులతో నిసుముం బొనర్తు ర
ష్టపుడును దేఱిచూచి కడు ♦ నబ్బురమొందుచు డిబ్బనేతుమం
చపకృతులాడి పోవుదురు ♦ హా యిఁకనేమి యొనర్తుమిత్తఱిన్
దెపదెపలాడు మానుడుల ♦ దీనతదీర్పు మనుగ్రహమ్మునన్. 23

చ॥ అనిన విరించనుండు హృద ♦ యంబున నారసి యవ్విధంబుఁ దా
వనిమిషరాజి కిట్లనియె ♦ నక్కట! యేమియొనర్పఁ జెల్లు వా
రనఘులు శంభుపూజనప ♦ రాయణు లిద్ధచరిత్రులట్టివా
రిని గెలువం దరంబగునె ♦ ప్రేటున మార్కొని యెవ్వరేనియున్, 24

సీ॥ వరము వారల కిడితి వె ♦ ప్పరము గాఁగ, వరబలంబునఁ నాత్మీయ♦బలము శంభు
పూజనఫలంబు నీకన్నె ♦ పొంకమొప్ప, నరిది వారల గెలువంగ♦ నగునె మనకు.

ఉ॥ పోవుద మిప్డు శంకరుని ♦ పొంతకు దైత్యులఘాతుకక్రియల్
దేవునిమానసంబునకుఁ ♦ దేటపడన్ వచియింత మాతఁడే
కానఁజమొంది మీఱు పల ♦ ఘావనులన్ దెగటార్పనోపు నీ
మీవగఁ జూపనోపునని ♦ మెచ్చి ప్రయాణము చేసి వారితో. 26

సీ॥ రజతగిరిఁజేరి నందితో♦నంపు సెలవ్రఁ, గాని మహేశ్వరు దరిసించి♦ కుతుకమొప్ప
మ్రొక్కి తలపయిందోయిలిఁ♦బూనియిట్లు, ప్రార్థనమొనర్చె నెంతయుఁ♦ బ్రాభవణితి.

మత్తకోకిల : ఈవె యిందుధరుండ వీవె చంద్రుఁడ ♦ వీ వుపేంద్రుఁడ వీశ్వరా!
నీవె నల్వవు నీవె చిల్వవు ♦ నీవె పొద్దువుమేశ్వరా!
ఈవె మిత్తివి నీవె సత్తివిఁ ♦ నీవె ముత్తివి శంకరా!
ఈవె యాకస మీవె యారస ♦ మీవె యగ్గి మహేశ్వరా! 28

చ॥ పొరిఁబుర దానవోత్తముల ♦ ఘోరభయంబు వెలఁజెంది కుంది నీ
దరి కిటు జేరినాము మముఁ ♦ దప్పక బ్రోవఁగదయ్య! యావు ప
క్కొరు లిఁక మన్పఁజాల రిది ♦ యోజనచేయుము దివ్యచిత్తమం
దురుకరుణాపయోధి! యిదు ♦ మోపక మా కభయంబు నింబుగన్. 29

క॥ దిక్కుమొగమొంది వేలుపు, లొక్కటితం బిట్టు బిట్టు ♦ ను చిలకొనుచు బల్
పొక్కుచు భువిఁబడి నీవే, దిక్కని విన్నపముసేయ ♦ దేఁకువ మెఱయన్.

—* శివుఁడు త్రిపురాసురులు భక్తులైనందున వధింపననుట *—

ఉ॥ క్రొన్నెలఁతాల్పుదాల్పువార ♦ కోవిదులార! యిటుల్ తలంకఁగాఁ
జన్న? వగన్ ద్రోరంగులు ని ♦ శాచరవీరులు భక్తు లెట్లువా
రి న్నశియింపఁజేతు నిఁక ♦ శ్రీపతియొద్దకుఁబోయి చెప్పఁ డా
మన్న యొకేని మాయఁ గొని ♦ మీ పరితాపముఁ బాపు రూఢిగాన్. 31

క॥ అనిచెప్పినవారానిముసము, నవె వైకుంఠమును జేరి ♦ నళినదయనుఁ ద
రని భక్తిమ్రొక్కి నుతులన్, గొనబుగఁ బొనరించి తెల్పి ♦ గోడెల్లఁ బగన్. 32

చ॥ తపమొనరింప దాదిఁక సు ♦ దర్శని! యుష్పదమల్ గడున్ వడిన్
బడి త్రిదివంబు రూపడఁచుఁ ♦ బ్రత్యహమున్ బెదరించుచున్నవా
రడలున నీదుసన్నిధికి ♦ నందజ మిట్లుపడెంచినాము మా
యడ రడపంగఁ బూనుము మ ♦ హాత్మ! కృపామయమూర్తి! చెచ్చెరన్. 33

క॥ అని యర్థించినఁ గమలన, యనుఁ డారసి యవ్విధంబు ♦ నంతయు శివభ
క్తిని నాయసురలకుఁ దదం, గనలకుఁ బతిభక్తిమాన్పఁ ♦ గడఁగెరయమునన్.

గీ॥ అట్లుగాకున్న నవ్వారి ♦ నణఁ జెనకఁగ, రాదనియెఱింగి మునుల సురలను వేగ
జతనమొనరింతుననియున్న ♦ సరగనొకని, సృష్టిసేయఁగఁదలఁచి న♦చ్చెరియమొప్ప.

—* విష్ణుమూర్తి అరిహన్ముని బుట్టించుట *—

ఉ॥ ముండితమైనయట్టి శిర ♦ మున్ గడుమాసిన యట్టివల్వలున్
దుండమునందుఁ జేల్కయును ♦ దోస్థలి బుంజికయున్ దలిర్పఁగా
దండిగ 'ధర్మ ధర్మ' యని ♦ దా స్మరియించుచు నొక్కఁ డచ్యుతున్
నిండగుభక్తిమైఁ దఱిసి ♦ నెక్కొని మ్రొక్కి యనుజ్ఞ నడ్గుడున్. 38

గీ॥ శేషశయనుఁడు వాని దృ♦ష్టించిచూచి, మెచ్చితలయూఁచి యిట్లనె♦ మేలుమేలు
బుద్ధిమంతుఁడ! నాయందుఁ ♦ బొడమితీవు, నేనుబనిచిన కార్యంబు♦ నెరపుమిఁకను.

క॥ అరిహన్నామముఁదాలిచి, హరువొప్పము చోటు నీకు ♦ నమరించెద ముం
దరసి పదియాఱువేలుగ, నరుదగు నొక మోహశాస్త్ర ♦ మమరింపు వెసన్.

గీ॥ కరమప్రభంశమయమును ♦ గర్మవాద
మయము మాయామయంబునై ♦ ప్రియము సేయ
వలయు నయ్యది యటుఁగూర్పు ♦ వలఁతివై వ
నుచుఁ దెలిపెఁ దద్రహస్యంబు ♦ నున్ వెరపుగ. 39

వ. అనిన నతండట్లు నిర్మించి తెచ్చి చూపించిన హరి యుప్పొంగి సత్వరంబుగ నీవిఁక
దైత్యపురత్రయంబుఁ జేరి యవ్వారల మోహపెట్టి శ్రౌతకర్మలఁ బాపు మద్దాన
వారు హతులయ్యెదరిఁక నీకు ముందుగఁ బ్రవేశంబుఁ గూర్పఁగా నారదునంపి
యవ్వారికి నీయందు భక్తిఁ బుట్టింతు నశ్రమంబుగ వారికి మోహంబుఁ గూర్పు
మని నారదుం దలంచి యమ్మునికిఁ దత్సాకల్యం బెఱింగించి యరిహునకు ముందు
దైత్యులఁ జెంది యవ్వాని నందుఁ బ్రవేశపెట్టుమనిపంచి యరిహునకు నలువురు
శిష్యులం గూర్చి వారికి ఋషి యత్యాకీర్త్యోపాధ్యాయు లనునామంబు లేర్పఱచి
వారితోఁ ద్రిపురంబులకేగుఁడనియుఁ ద్రిపురసంహారంబాదిగఁ గలియుగంబు వఱకు
నెందేని మరుస్థలి నొదిగియుండుఁ డనియుఁ గలియుగంబున మీరు యథేచ్ఛతో
నన్ని దేశంబులందు విజృంభించి చరింపుఁ డనియును జెప్పి పనిచె నంత నారదుండు
ముందుగఁ బుండరీకాక్షుని యుక్తిప్రకారంబు వేసంబు మార్చుకొని హిరణ్య
పురంబున కేగి తారకాక్షుండఱియుఁడు నతండు మునిం గాంచి. 40

గీ॥ మాతికడ పేల్కయేమి? యీ ♦ ముఱికిపటము
లేమి? యీ కుంచెయేటికి? ♦ ఋషివరేణ్య!
క్రొత్తవేసంబు వింతగాఁ ♦ గొంటి వేటి
కెఱుఁగఁజెప్పుము మాకు బోర ♦ కేమిలేక. 41

వ. అనిన దానవేంద్రునకు నారదమునీంద్రుం డిట్లనియె.

గీ॥ అసురనాథ! యొకండు మ ♦ హానుభావుఁ
డరుగుపడియె యాతఁడొసఁగె నిా ♦ యతులదీక్ష
యిదియె నిర్వాణకారణ ♦ మిదియె సకల
భోగసంపన్నిదానంబు ♦ పుడమిలోన. 42

క॥ దీనికి మించిన దెందును, గానఁగఁబడ దరసినాఁడఁ ♦ గౌశల్యమునన్
దీనికిఁ గ్రిందివె యన్నియు, మానితి తొల్లినాఁటి వెట్టి ♦ మతముల నెల్లన్. 43

వ॥ అనిన నవ్వాఁడును గాలచోదితుండై యిట్లనియె.

గీ॥ అట్లయిన మేమునుం గొందు ♦ మట్టిదీక్ష, నాఋషి యెవండొ తెల్పుమీ ♦ మతనియొద్ద
కరుగఁగలమన్న జడవారి ♦ యనియె నతఁడె, యేడవదినంబిటకువచ్చుఁ ♦ జూడుమధిప!

క॥ ఆయనఘదీక్ష నొందిన, నీయట్టి ఘనుండు నుడువ ♦ నేర్తునొకో? నీ
వే యాదు లీశుఁడవు నీ, వే యాదువు శ్రీశుఁడవు మ ♦ హిన్ దైత్యవిభూ! 45

వ. అనినుడివిచనినంతఁ దారకాక్షుండు నారదప్రోక్తప్రకారంబు దీక్షఁగొనంబూని దేశి
కుని యాగమనంబునకై ప్రతీక్షించుచుండె నంత నరిహన్మునియతియును శిష్యచతు
ష్టయంబుతో హిరణ్యపురోపవనంబుఁ జేరి యందు మాయావాదం బుపన్యసింపు
చున్నంతఁ దెలిసికొని తారకాక్షుండు వచ్చి పాదంబులకెఱఁగి యిట్లు ప్రార్థించె.

క॥ నా కిమ్ము దీక్ష యతిపతి!, చేకొనెదను నేను దమదు ♦ శిష్యుఁడ ననుచున్
శ్రీకాంతునియపరాకృతి, యై కరమొప్పిన యతీంద్రుఁ ♦ డసుర కనెనిటుల్.

క॥ నాయాజ్ఞ మిాఱనట్టిఁడు, నాయంతేవాసి యగు న ♦ నన్ దనుజుఁడు దా
సేయుఁడనై సేవించెద, మిాయానతి యతివతంస! ♦ మిాఱను గనుమా! 48

—* అరిహన్మని త్రిపురాసురులకు దీక్షనిచ్చి స్వధర్మములఁ జెప్పుట *—

వ. అనిన నవీనయతి యంగీకరించి దైత్యరాజునకును దత్సోదరులకును విధివిధానం
బుగ దీక్ష నొసంగె నామిాఁద దనుజులెల్లరుఁ గ్రమంబుగ దీక్షఁ గొనినంత
యతీంద్రుండు శిష్యమండలి కిట్లు స్వధర్మంబు లుపదేశించె. 49

ఆ॥ వినుఁ డనాదియగుచు ♦ వెలయు నీ సంసార, మిద్ది కర్తృకర్మ ♦ హీన మరయఁ
డిద్ది తనకుఁదానె ♦ యేర్పడు నట్టులే, తనకుఁదానె పోలియుఁ ♦ దథ్యమిద్ది.

ఆ॥ బ్రహ్మమొదలు గడ్డి ♦ పరకవఱకును నా, త్మయె యొకండు వేఱుఁ ♦ దలఁపఁ గనము
హరిహరులు విరించి ♦ యనుపేర్లు మనపేరు, లట్లె యిందుభేద ♦ మరయనగునె.

ఆ॥ బమ్మమొదలు దోమ ♦ ఱఱకును దేహంబు, సురుఁగు నియతమింత ♦ సూటిగాను
సకలజీవులకును ♦ సమమె యాహారని, ద్రాసురతభయములు ♦ తలఁచిచూడ.

గీ॥ దప్పిగొనినమనుష్యులు♦దకముఁజేరి, ప్రాణినముఁబాయుదు రొయ్యనప్పు♦ తక్కినవియు
దూపఁజెంది వడికినశి♦దోయమొంది, ప్రాణినిస్పృహ విడుచును♦తథ్యమరయ.

క॥ చెలువలు వేయుగు రున్నను, జెలువ యొకర్తెను నొకండు ♦ చెందును నటులే
పలుగుజ్జములున్నను ని, మ్ముల నొకగుజ్జమున నెక్కు♦బుడమి నొకరుఁడున్.

సీ॥ మంచమందుఁ బరున్న♦మహిఁబరున్నను నొక్క, నిద్రసౌఖ్యము♦నొందఁజేయు
బ్రహ్మకేని కొలంది ♦ పాటికీటమునకేని, జావున్న గడువేళ ♦ వాసహిల్లు
హింస సేయఁగఁ గోల♦దేజంతువునుగాని, భువి నహింసయె గదు ♦ భూరిధర్మ
మిచ్చుటనే స్వర్గ ♦ మిచటనే నరకంబు, సుఖదుఃఖములె వాని ♦ చొప్పులరయఁ

గీ॥ గలవుధర్మములును దాన♦ములునుబుడమి, స్వల్పఫలదములయ్యవి ♦ చర్చసేయ
హింసకుండెగునరకం బ♦హింసకుండు, చనెడుస్వర్గంబిచట లేదు ♦ సందియంబు. 54

వ. మఱియువినుఁడు.

గీ॥ సకలనిగమాగమాంతశా♦స్త్రములసార, మరసిచెప్పెదరెండు వా♦క్యములవినుఁడు
లే దహింసను నెందుఁబో♦లిన సుకృతము, లేదుహింసను నెందుఁబో♦లినయఘంబు.

వ. ఇఁక నుత్తమదానంబులు కొన్ని గలవు. చెప్పెద వినుము.

క॥ భీరున కభయం బొసఁగుట, గారింపఁబడిన జనునకు ♦ గ్రాసము తెవులున్
గూరిన వానికి సేవన, మారసి విద్యార్థి కొసఁగుఁ ♦ డభిమతవిద్యన్. 55

వ. అందులకుఁగాను

క॥ ధనమార్జనంబు చేయుఁడు, ధనమేకద సురాల నెల్ల♦ధర్మమ్ములనున్
ఘనమగు సౌఖ్యంబులనను, ధనముఁ బడసి పదియు రెండు ♦ దనుఁడు ప్రీతిన్

గీ॥ ఐదుజ్ఞానేంద్రియంబులు♦ నైదుకర్మ, కేంద్రియంబులుమనము బు♦ద్ధీంద్రియంబుఁ
బదియురెండగునివ్వాని♦ముదముగడుపఁ, గొలుచుటహితంబు పేరగు♦కొలుపులుడిగి

గీ॥ ప్రాణులను గొట్టి శవాల♦ మట్టుపెట్టి, నెత్తురులు గాల్వలాడఁగ ♦ నేస్తమనుచు
నేయి తిలలును నగ్నిలో ♦ వేయుచుండ్రి, జన్మములటంచుఁ గొందఱు♦ జంకులేక.

వ. వీరలవ్వాని మానుండికను.

గీ॥ ఎపుడొ పడిపోయెడు శరీర ♦ మెఱిఁగి వేగ, యావియున్నంత కేరక♦యతిశయిల్లఁ
బెల్లుగా భోగములఁజెంది ♦ యుల్లసిల్ల, పలయు నవ్వాలనేమి గ♦న్పట్టు? గనుఁడు.

గీ॥ తెంపుమై యాచకుల కిల ♦ దేహమేని, యొసఁగికోరికెఁ దీర్పఁగా ♦ నొప్పుయాచ
కులకుఁ దృప్తియొనర్పని ♦ కుజనులిలకుఁ, బరువు సేయుదు రెక్కుడే ♦ వంబుగాఁగ,

క॥ ఎంతకు ముదిమి దవీయం, బెంతకు దార్ఢ్యమున నొప్పు ♦ నింద్రియవర్గం
బెంతకు స్వస్థం బీమెయి, లంతకు సౌఖ్యములఁజెందుఁ ♦ డరసి యథేచ్ఛన్.

గీ॥ ఆయువడఁగిన పిమ్మట ♦ సకట! దేవ, మిలను నక్కల కల్ల కా ♦ కులకు భోజ్య
మగు నదియెఱిఁగి భోగింపఁ ♦ బస్థలకును, నొసఁగఁడిష్టంబులెంతయు ♦ నొప్పమిగిలి.

వ. ఇఁకను బ్రాహ్మణాదిజాతిచతుష్టయంబు కల్పితంబుగా నెఱుంగుఁడు.

గీ॥ సృష్టిఁదొలుతఁ బిరించి ♦ శ్రేష్ఠుఁడనని, సంతతి వసిష్ఠముఖులు త ♦ త్సంతతిజ్ఞ బొ
డమినమనయందుజాతిభే ♦ దము పొసఁగునె, యుఁరక వేదోపచింత్రకొం ♦ దఱదిహంలికి

గీ॥ ఇట్లు బోధింప నవ్వార ♦ లెంతయేని, సంతసంబొంది చెలరేఁగి ♦ శంభుపూజఁ
బాసి వేదోక్తధర్మంబుఁ ♦ బాసి యర్థ, కామముల నాశ్రయించిరి ♦ కడిఁదివేడ్క.

సీ॥ వావివర్ణలఁబాసి ♦ పసరంబులట్లు రేఁ, బవలు భామలఁగూడి ♦ పరఁగు పురుషు
లెదఁగొంకుమాలి తా ♦ మెదురిచ్చివిటులతో, సురతకేళులనష్ట ♦ చొక్కు వెలఁదు
లిది పవిత్రంబుకా ♦ దది పవిత్రంబంచు, నరయ కన్నియు మెక్కు ♦ నట్టి బావ
లెక్కుడు పొగరుతో ♦ నెఱి దోసములేని, పెద్దలపైఁ గాలు ♦ విసరు మొఱకు

గీ॥ లెట్టిదోసఁగుకు వెనుదీయ ♦ కెల్లపొద్దు, కానులనెగూర్చుచుండెడు ♦ దోసకాండ్రు
దేవుఁడెవఁడనిపదిరి నిం ♦ దించు చెడుగు, లాఱితేఱిరి త్రిపురంబు ♦ లందు నిండి. 67

క॥ స్త్రీలుం బూరుషు లిట్టులు, పాలింపక పూర్వధర్మ ♦ పదవీచ్యుతులై
రేలు పవల్ ధనకామే, చ్ఛాలాలసులైరి తటిగ ♦ సత్త్వంబెల్లన్. 68

గీ॥ అంతయునుగని వేల్పులు ♦ సంతసిల్లి, హరివిరించులఁ దోడ్కొని ♦ యభవుదండ.
కరిగి సాష్టాంగమొందియ ♦ య్యసురవరుల, తెఱఁగునంతయుఁదెల్పితీ ♦ వరమునీంద్ర

-* ధర్మచ్యుతులైన త్రిపురాసురులఁ జంపుమని సురలు శివునిఁ బ్రార్థించుట *-

ఉ॥ జాగొనరింప కీవిఁకను ♦ జాల్మల యుప్పురము ల్దహింపు వే
వేగ జగంబులన్ మనుపు ♦ విశ్వవిభూ! కరుణింపు లెమ్మనన్
బాగుగ దైత్యవృత్తముల ♦ భగ్నఁ దెలిసిఁగి జగద్ధితార్థియై
సాఁగెద నట్లు సేయ రణ ♦ సాధనముల్ సమకూర్పుఁడంచనెన్. 70

వ. అంత దేవతలాయసురులవరంబు తెలిసింగియుండుట నరదంబుగానియరదంబును
విల్లుగాకయెసంగువిల్లును బాణంబుగాక తగుబాణంబు మున్నగువానిఁగూర్పఁ
గడంగి విశ్వంభరను రథంబుగను నద్దానికి సూర్యచంద్రులద్వాదశారషోడశారం
బులగు చక్రంబులుగను ఉదయాస్తాచలంబులను నొగలుగను మంత్రంబులు ఘంటం
బులుగను ఋతుషట్కంబు నేములుగను మందరాద్రి చోటుగను నాకసంబు
టెక్కెంబుగను స్వర్గమోక్షంబులు ధ్వజంబులుగను షడంగపురాణ మీమాంసా
ధర్మశాస్త్రంబులు తేరినగలుగను దిక్కులు పాదంబులుగను ననంతుండుబంధము
గను సంధ్యంబులేడును రథకంబలంబులుగను గంగాదిసరిన్మతల్లులు స్వర్ణకంకణ
కరభూషితలగు చామరగ్రాహిణులుగను లోకాలోకాచలంబుసోపానంబుగను

విధిని సారథిగను దోలిపల్కులు తేజులుగను బ్రణవంబును గొరడాగను దర్వీక రంబులు పగ్గంబులుగను వేల్పులు రశ్మిధారులుగను అకారంబు గొడుగుగను బంగరుకొండ విల్లుగను శేషుండు నారిగను సరస్వతి ఘంటగను నారాయణుండు బాణంబుగను అగ్ని శల్యంబుగను తారలు తురంగభూషణంబులుగను మహర్షులు గుఱ్ఱపురౌతులుగను వివవాయువులు సైనికులుగను సంతరించి సర్వదేవమయుం డగు మహేశ్వరున కొసంగి రథారోహణంబు చేయుమని ప్రార్థించిన శంకరుం డామోదించి రయంబున స్యందనంబెక్క నప్డు వేదహయంబులు తుండంబులఁ దెఱిచి కనుగ్రుడ్లు మిడికించి పుడమిఁగూలుచు రథంబుచలించి ముందునకుఁ గ్రుంగఁ గులపర్వతంబులు చలించె. శేషుండు వడఁకె నయ్యది యంతఁగాంచి విష్ణుం డొక్క మహావృషంబై తేప పైకెత్తి హయంబులకు బాసటయై నిలిచె నప్పు డమరులెల్లఁ దమకుఁ బశుత్వంబునుఁ బరమేశ్వరునకుఁ బశుపతిత్వంబును గోరి వడపి రంత శివుండు.

—* శివుఁడు త్రిపురంబుల దహించి త్రిపురాసురులఁ జంపుట *—

క॥ ప్రత్యాలీఢపదుండయి, యత్యాశ్చర్యముగ దొరఁ ♦ మురసి యొక యెడఁ
దైత్యపురత్రయిఁగూరిచి, సత్యేచ్ఛుఁడు లాఁగివేసె ♦ సాయక మొకఁడున్. 72

చ॥ అశనిసహస్రపాతజని ♦ తాయతభూరికఠోరఘోష మా
దిశలఁదనర్చు నేనికల ♦ తీరగు వీనులఁ దూటుబుచ్చఁగా
దశశతభానుదీధితివి ♦ తానవిరాజితమైన బాణ మా
పిశితపుఁదిండ్ల యుప్పురుల ♦ బిట్టుగ బూదిరొనర్చె నంతతో. 73

గీ॥ తారకాక్షుండు నిజసహో ♦ దరులతోడ, నార్పరానట్టి యట్టి మ♦హాగ్ని వాతఁ
బడి దహింపఁబడుచు వేగఁ ♦ బరమశివుని, శంకరునిఁ జూచి మదిని వి♦జ్ఞప్తిచేసె.

క॥ ఎఱిఁగితి శంకర! నిను నే, మఱిసితి నీచేత నిట్లు ♦ పొలయుటకుఁ గడుఁగా
గరమరుదగు నిది యేఁటికిఁ, బరశివ! నీభక్తి నొసఁగు ♦ ప్రతిజన్మమునన్. 75

క॥ అనుచున్ దమ్ములఁ దానును, మనమందు నవీనమతవు ♦ మార్గము విడి పా
వనచరణ! భక్తశరణా!, పినాకి! యన వారితేజు ♦ భీమున్ జెందెన్. 76

గీ॥ రక్కసులతోడఁ ద్రిపురంబు ♦ లుక్కుమాలి, కాలిబూడిదలై భువిఁ ♦ గూలె నంత
దేవదుందుభి నాదముల్ ♦ దెజరిల్లె, హాగనిపైఁ బుష్పవృష్టి ♦ పెల్లడరి కురిసె. 77

గీ॥ త్రిపురదాహంబొనర్చి యెం♦తేనిరౌద్ర, వదనమున నొప్పుచున్న న♦వ్వహ్నినయనుఁ
గాంచి భీతిలి విష్ణు వి ♦ రించిముఖులు, సాఁగిలన్ బడి సన్నుతు ♦ ల్సలిపి రిట్లు, 78

—* శివుని దేవతలు స్తుతించుట *—

మత్తకోకిల: భక్తవత్సల! దేవదేవ! కృ♦పాళు! హర్ష నిధాన! చి
చ్ఛక్తిశోభిత! లోకనాయక! ♦ శర్వ! ధార్మికపాలనా
సక్త! మంగళమంగళాత్మక! ♦ శంకరా! యిఁక మాదు దీ
నోక్తులారసి సుప్రసన్నత ♦ నొందుమయ్య! మహామతీ! 79

క॥ అని యిటు లమరులవ్రాలిన, యనిమిషులకు నభయ మొసఁగి ♦ యఖిలేశ్వరుఁడం
తనె వెండికొండ కింపున, జనియెన్ సురలెల్లఁ జనిరి ♦ స్వపదముల కొగిన్.

వ. అరిహుండు విష్ణ్వాజ్ఞచేఁ గలియుగంబును బ్రతీక్షించుచు నంతేవాసులతో మరు
స్థలంబునఁ గాలంబుఁ బుచ్చుచుండె. మహాత్ములారా! మహేశ్వరుం డిట్లు త్రిపుర
దాహం బొనర్చి త్రైలోక్యరక్షణం బొనరించినట్టి యీ చరితం బెవ్వరేని చదివిన
వినిన నవ్వారు సకలదుఃఖంబులఁ బాయుదు రనిన సూతునకు మునులు మహాత్మా!
సంతసించితిమిఁక జాలంధరవధోపాఖ్యానం బెఱింగింపు మనుటయు సూతుండిట్లనియె.

—* జలంధరాసుర చరిత్రము *—

చ॥ ఒక దినమందు దేవవిభుఁ ♦ డొజ్జను దోడ్కొని వేడ్క వెండికొం
డకుఁ జని యందు శంభుసద♦నమ్మున కేఁగుచునుండ నంత నం
తకహరుఁ డద్ది యారసి ము♦దమ్మున వారిఁ బరీక్షచేయఁగా
నొక జటిలాకృతిన్ దనరి ♦ యొప్పుగ నధ్వపుమధ్య నుండుడున్. 82

చ॥ కనుఁగొని దేవరాజు పుర♦ఘస్మరుఁ డంచు నెఱుంగ కింత వే
గనె యిటు లడ్డె మార్గ మరి♦కట్టి వసించితి వేటి కాహుతా
శనసయునుండు గీముకడఁ ♦ జక్కఁగ నుండెనొ లేక యెందునేన్
జనియెనొ చెప్పునా నతఁడు ♦ జంకక పల్కకయున్న నత్తఱిన్. 83

ఆ॥ మరల నడిగెనట్లు♦సురపతి జటిలుని, నతఁడు వినియు విననియట్టులుండె
కినుకనొంది మరల ♦ గీర్వాణవిభుఁడడ్గె, నేమి చెప్పకుండె ♦ నీశ్వరుండు. 84

క॥ ముమ్మాఱిట్టులె యడిగిన, నమ్మహితుని లెక్కఁగొనక ♦ యాతని నుడులన్
సమ్మతి నాలింపక తా, నెమ్మెన్ దొంటివలెనున్న ♦ నిర్జరవిభుఁడున్. 85

మ॥ కని దర్వీకరమట్లు రోజుచుఁ దిర♦స్కారంబుఁ గావింతువా
నను గాపూరుష! కాంచు మిప్డె యని కి♦న్కన్ జంప వజ్రంబు నె
త్తిన నుగ్రుండు మహోగ్రహం బొదవ నా♦దేవేంద్రు హస్తంబునం
తనె నిష్పందమొనర్చుడున్ నిటల నే♦త్రజ్వాల లొక్కుమ్మడిన్. 86

క॥ తనరి పురందరుఁ గాల్పఁగ, నొనరినఁగని గురుఁ డెఱింగి ♦ యుడురాజధరుం
డని తెలిసి వినతుఁడై యిం,ద్రుని సాఁగిలఁబడ నొనర్చి ♦ రోజుచ ననియెన్.

క॥ శరణు మహేశ్వర! శర్వా!, శరణు విరూపాక్ష! రుద్ర! ♦ శంకరమూర్తీ!
శరణు మహోపద్వారణ!, శరణు పినాకీ! కపర్ది! ♦ సర్వవ్యాపీ! 88

శా॥ నీవే విష్ణుఁడ వీవె పద్మజుఁడవు ♦ న్నీవే మహారుద్రుఁడున్
నీవే సిద్ధులు దివ్యులున్ మునులునున్ ♦ నీవే జగద్లోకముల్
నీవే కర్తవు నీవె భోక్తవు మఱిన్ ♦ నీవేగదా భూతముల్
నీవే నేతవు శరణ్యనేలు కరుణా♦నీరాకరా! శ్రీకరా! 89

క॥ అడుగులఁబడిన మహేంద్రుని, నడలుచు నుతిసేయుచున్న ♦ నంగిరసుని శ
ర్వుఁడు గని యభయంబిడి తా,నడిగె బృహస్పతిని నిట్టు ♦ లాదర మెసఁగన్.

క॥ సురపతిఁ గావ్వఁగ వెడలెను, ఖరలోచనవీతి హోత్ర ♦ గాఢజ్వాలల్
గరమరయ మెచట నీనిన్, ఁబిత్యజింపఁగఁజెల్లుఁ ♦ జాగ్రతమినీషా! 91

క॥ అనుడు గురుఁ డరసి బెగడుచు, నను దేవాధీశ! యితని ♦ కభయమిడితి గ్ర
స్సనఁ గావు మనలకీలల, వననిధిలో విడిచిపుచ్చి ♦ నైశం బనినన్.92

క॥ విని యోమని శంకరుఁ డా, యనలజ్వాలలను సంద్ర♦మందు విడిచి యిం
ద్రునిఁ జూచి దేవగురునకు, నను ఁవమ్మైతి విప్ర ♦ డమరేంద్రునకున్.

క॥ ఇది మొదలు జీవసంజ్ఞన్, బొవలు బృహస్పతి! యనంగఁ♦బొంగి గురుండుఁ
ముదమున శివుని నుతించెను, బెదరుడిగి నుతించె గోత్ర♦భేదియు నీశున్. 94

గీ॥ ఇట్లు గండము దాఁటి మ♦హేంద్రుఁ డపుడు, శివునకభివందనము చేసి♦సెలవుఁ బెంది
బ్రదికితి నటంచుగురునితోఁ♦బదిలముగను, త్రిదివమున కేగెరయమున♦దీము మెఱయ

— * జలంధరుని జననము * —

చ॥ కడలినిఁ జెందినట్టి యల ♦ కాలనిషూదను నేత్రవహ్ని య
ప్పుడయొక బాలుఁడై పొడమి ♦ ఘోరున నేడ్చుచునుండఁ దద్రవం
బడరి లయాభ్రఘోషమటు ♦ లక్కట! సర్వజగంబులందు బి
ట్టడలు దనర్పఁగా విని సు ♦ రాగ్రణి లజ్జఁజేరి చెప్పడున్. 96

వ. పద్మజుండును సక్కజంబున నంబురాశిన్ జేరి యుండు.

గీ॥ చెలఁగిచద లేటితోఁబొత్తుఁ ♦ జెందినట్టి, కవలి యుత్సంగమునవోడి ♦ కంబుటాఱఁ
గూరుచుండిన యట్టి కు♦మారుఁగాంచి, తారసించినయప్పుడ కూ♦పారవిభుఁడు.

చ॥ వనజజుఁ గాంచి భక్తి మెయి ♦ వందనముల్ పొనరించి యున్న తా
ననమిడి వేడ్కతోడఁ దను ♦ జన్మునిఁజూపి, మహాత్మ! వీఁడు నా
తనుజుఁడు వీనిజాతకవి ♦ ధమ్ములఁదెల్పి యనుగ్రహింపుమా
యన నదియెల్లనారసి వి ♦ యంబున నబ్జజుఁడబ్జి కిట్లనెన్. 98

ఉ॥ వీఁడు కడున్ సమర్థుఁడయి ♦ విశ్వము మెచ్చఁగ శౌర్యశాలియై
మూఁడుజగంబులన్ గల స ♦ మున్నతశూరుల నోడఁబుచ్చి బల్
పోడిమి మించుఁ బెంచుయశ ♦ మున్ సరియెవ్వరు లేనియట్లుగాఁ
బాడుదు రచ్చరల్ దొడరి ♦ బాగుగ వీనిచరిత్ర మీయెడన్. 99

గీ॥ సర్వలోకాధిపత్యసు ♦ స్థితి నొందుఁ
గడుఁ బతివ్రతయై యొడి ♦ కమునమించు
మచ్చెకంటి ద్వితీయయౌ ♦ హెచ్చుమీఱు
భోగములఁ జెందుఁ దనివిగ ♦ భువనరాశి! 100

మ॥ అనుచుండన్ బుడుతండు బిట్టిగసి బ్ర♦హ్మాగ్రీవనుఁ బట్టి నె
ట్టనఁ బీడించెఁ దొలంగలాఁగుటకుఁ గ ♦ ష్టంబయ్యె నాలోన లో
చనయుగ్మంబుననుండి యశ్రులురలెన్ ♦ చక్రాంగవాహుండు పా
పని బీరంబునుఁ జూచి మెచ్చి యనియెన్ ♦ పాథోధికిన్వైఖరిన్. 101

క॥ జలబిందువులన్ బాపఁడు, జలజలనాకనులనుండి ♦ జాఱఁగ జేయన్
గలుగుట జలంధరాహ్వయ, మలరెడు నీతనుజునకు మ ♦ హార్ణవ! భువిలో.

క॥ అనిమడివి సముద్రుని ప్రా, ర్థన శిశునకు జాతకర్మ ♦ తతినుపనయనం
బును సలిపి యసురరాజ్యవి, భునిగాఁ బట్టంబుఁగట్టి ♦ పోయెన్ మరలన్. 103

వ. అంతఁ గడలియు.

ఉ॥ కంటికి ఱెప్పవోలె సుతుఁ ♦ గాటపు వేడుకతోడఁ బెంచుచున్
దంటయుఁ దద్జ్ఞుఁడై యలరు ♦ దైత్యగురుండగు భార్గవార్యుచే
వింటను విద్దెలన్ గడిఁది ♦ విజ్ఞునిఁ జేసి కరంబు పొంగి మి
న్నంటెఁ గుమారుఁ డెంతయు న ♦ నన్యపరాక్రమశాలియై తగన్. 104

—* జలంధరుని వివాహము *—

గీ॥ కాలనేమియనా నొక ♦ కడిఁది దైత్య, రాజపుత్రిని బృందయన్ ♦ రమణి సరసి
కొడుకునకుఁ దగు సతిగాఁగఁ ♦ గూర్చి పెండ్లి, చేసె సరివారలెల్లసె ♦ బాసనంగ.

క॥ ఆసతి మిక్కిలి రూపసి, శ్రీసతికిన్ బోటి పచ్చు ♦ చెలువ గుణశ్రీ
భాసిత పాతివ్రత్యవి, భాసిత యొడయనికిఁ జేయు ♦ పండువు నిచ్చల్. 106

గీ॥ వారి దాంపత్యమెంతయు ♦ వాసిమీఱె, చూడసొంపయి తనరె న ♦ సురవరేణ్య
బాసటన్ గని పాతాళ ♦ వాసులైన, పొలసుదిండ్లెల్ల విచ్చేసి ♦ కెలమి మరల.

గీ॥ అంతనొకనాఁటియెడ సభా ♦ భ్యంతరమున, నున్న రాహునుబరికించి ♦ యుశనుసడిగెఁ
గల మిదేమి? మహాత్మ! యి ♦ క్కరణినునికి, కనుడు భార్గవుఁడతనికి ♦ ట్లనియె మరల.

—* శుక్రుఁడు జలంధరునకు రాహువును గుఱించి చెప్పుట *—

ఉ॥ మున్ను నిలింపు లెల్లరును ♦ బూర్వసుపర్వుల సాయమొంది సం
పన్నతతోడఁ బాల్కడలిఁ ♦ బట్టి మథించి యపూర్వరత్నముల్
చిన్నెలవన్నెలన్ దనరు ♦ చెల్వల నచ్చరలన్ సుధాఘటం
బు న్నెఱిమీఱఁ జూఱగొని ♦ మోసముఁ జేసిరి దైత్యకోటికిన్. 109

గీ॥ మొదలఁ బొడమిన విసమును ♦ మూడుకనుల, సామికిన్ద్రావఁ జేసిరి ♦ సాహసమున
జంకులేక యెయ్యాదార ♦ చటులశాల, కూటమును ద్రావి జగముల ♦ కుందుమాన్పె.

ఉ॥ మాయలమారి యైన యుల ♦ మాధవుఁ డొక్క మిటారి చేడయై
యాయెడ కేగుదెంచి దనుః ♦ జాగ్రిణులన్ నిజహావభావలీ
లాయతదృష్టులన్ గరఁచి ♦ యాసుధఁ జేకొని దివ్యరాజికిన్
బోయుచునుండ వీఁడరిగి ♦ పొత్తుకుఁ జేరుటఁ జూచి యంతనే. 111

ఉ॥ జాబిలి తేలుకొండివలె ♦ సప్తతురంగున కద్ది తెల్పఁగా
నాబిసినీసఖుండు హరి ♦ కల్లన సన్నయొనర్చె నాతఁడున్
వే బిరుదొప్పఁగా మిగుల ♦ వెల్గు సుదర్శనధారతోడఁ దో
ఱ్ఱోఁ బడవేసె నా సుధను ♦ దోసిటఁ ద్రావెడు వీని మూర్ధమున్. 112

గీ॥ అమృతయోగమునన్ జేసి ♦ యకట! వీని, శిరసు మొండెమునన్ గూడ ♦ జీవయుక్తి
నుండఁగని నాగుఁబాము ను ♦ రెండుచేసి, యతికి యిరువురఁ జేసి ది ♦ వ్యపదమిచ్చె.

క॥ ఆ పగతో వీరిరువురు, నే పర్వములందు సూర్య ♦ హిమరశ్ము లెటన్
జేపడిన విడక మ్రింగుదు, రేపడతురు వీని చరిత ♦ మిదియె కుమారా! 114

గీ॥ అనిన విని యాజలంధరుఁ ♦ డౌడుగఱచి, యౌర! యెంతటియుపకార ♦ మాచరించి
రమరులును వారి యధిపతి ♦ యైన విష్ణుఁ, డిట్లు సైఁచెద వారి ని ♦ క్కట్లుగనుచు.

గీ॥ అనినాడివి ఘస్మరుండను ♦ నసురనొకనిఁ, బిలిచి యవ్విధమంతయు ♦ వినిచి యింద్రు
నొద్దకుం జని నానుడు ♦ లుచితభంగిఁ, జెప్పు మిప్పోవలెక్కనటు మీఁదఁ ♦ జేతమరసి.

—* జలంధరుఁ డింద్రుని యొద్దకు దూతను బంపుట *—

క॥ మాతండ్రి నట్లు మోఱకులై తఱిచి యనంతవసుచ ♦ యమ్ములఁ బడయన్
నీతియొకో వానిని నిపుడే తెండిక నిండుతిరుగ ♦ హితవెఱిఁగి మదిన్. 117

గీ॥ అట్టు లీకుంటి రేని యీ ♦ యబ్ధిపుత్రుఁ, డుడుగఁ డివ్వానిఁ గ్రక్కించు ♦ నుత్తలమున
బై సిమాలుదు రీరలు ♦ పరువెఱుంగుఁ, డని నుడివియారయుము వారి ♦ యాశయముల.

క॥ తడయక చని రమ్మని య, ప్పుడె వానిని బనుప నతఁడు ♦ పొంగి కడువడిన్
వెడలి యమరావతికిఁ జని, బిడౌజుఁ దగఁ బ్రారసించి ♦ పేర్మిన్ బలికెన్.

చ॥ వినుము సురేశ్వరా! భువన ♦ వీరుఁడు సింధుకుమారుఁడింపు నన్
బనిచినతీరు మీరు మును ♦ పాల్కడలిన్ మథియించి రత్నరా
జిని మదనాగవీతులను ♦ చెన్నగునచ్చరలన్ సుధారసం
బును గొనిపోయియుంటి రవి ♦ పొల్పగనిండిపు డొక్కపెట్టునన్. 120

ఆ॥ ఇచ్చిరేని సరియె ♦ యీకున్నమిన్నొల్లఁ, బట్టి తిగిచి మొగిచి ♦ మట్టగించి
చేకొనంగఁదలఁచి ♦ చెప్పియుండితి నిట్లు, తెలిసి యెందునేని ♦ దెగువఁగొనుఁడు.

క॥ అనిచెప్పియంపె ననుడున్, గనుఁ గవలన్ నిప్పులురలఁ ♦ గనలి మహేంద్రుం
డును నిట్లుచెప్పె దూతన్, గని చని వాఁడుప్రివ్వమిట్లె ♦ కంధిసుతునితోన్. 122

ఉ॥ కొండలనెల్ల తెక్కలను ♦ గొట్టుచునున్నపు డేను వీఁక నీ
తండిరి గొప్పగట్టులని ♦ తాంతములోఁగొని దాఁచియుంచెఁ దృ
ప్తుండయి యింకనారిపుల ♦ దుష్టనిశాటులఁ గుక్షిలోపలన్
మెండుగదాఁచె నందులకు ♦ మేకొనియట్లు మథింపుటయ్యె మున్. 123

సీ॥ బలిసి నీవిట్లు మీఁటి మా♦పైకిఁ గాలు, త్రివ్వలెక్కింతుమే త్రోసి ♦ రాజనిపుడె
చేసెదముగాక యీలాటి ♦ చింపులుడిగి, మిడిసిపడకుండుమా! యింక♦మీఁద నేని.

క॥ అని యిటులెచెప్ప చనుమన, ననంతరం బతఁడు వేగ ♦ నసురేంద్రుని కొ
ల్వున కేగుదెంచి యటుచె, ప్పిన నాతఁడు వ్రేటువడిన ♦ పెనుఁబామువలెన్.

మ॥ విసమున్ గ్రక్కెడునట్లు మేటిబుసలన్ ♦ వేమాఱు గావించుచున్
మసిఁ జేతున్ ద్రిదశాలయంబు సురలన్ ♦ మర్దించెదన్ ఖించెదన్
వెస నానావిధసైన్యముల్ వెలయఁగా ♦ వింపుండు యాత్రోత్సవం
బసురశ్రేష్ఠులకెల్లఁ దెల్పుఁడు రథం ♦ బాయత్తమున్ జేయుఁడీ! 126

వ. అని యాజ్ఞాపించి.

క॥ ఘనుఁడగు శుక్రుని రణమం, త్రినిగా నొనరించి యట్టి ♦ దేశిక శుభశా
సనములఁజేకొని యాహవ, మునకేగె జలంధరుండు ♦ పుడమి యదుర్వఁగాన్.

క॥ చనివేగ నాకలోకం, బును నెక్కొని ముట్టడించి ♦ పొల్పుగ రణభే
రిని మ్రోఁగఁజేసె సురలకుఁ, బెనుబెగడును నగడుపాడమి ♦ బీరంబెడలన్.

చ॥ విని యమరేంద్రుఁడున్ గినుక ♦ విస్తరిలంగ దిగీశముఖ్యులా
యనిమిషవర్యులన్ గొని యు ♦ దార భుజాబలమేర్పడన్ వరూ
థినిని సమర్చి యభ్రకరిఁ ♦ దేఁకువనెక్కి పవిన్ ధరించి బి
ట్టనికిఁగడంగి తా వెడలె ♦ నద్భుతమొందఁగ దైత్యసైన్యముల్. 129

క॥ గురుఁడును వెనుకొని యనిమం, తిరియై నడచెను సమస్త ♦ దివ్యశ్రేష్ఠుల్
పురిగొను వేడుకతో నడ, చిరి పెనురజ మంబరంబుఁ ♦ జేరఁగనెగయన్. 130

## —* దేవాసుర యుద్ధము *—

గీ॥ కడఁగి యన్యోన్యసైన్యముల్ ♦ గండుమీఱి, యొడిసి యుద్ధంబొనర్చిరి ♦ యులుసుపీఱ
ఘనగదాశక్తితోమర ♦ ఖడ్గముసల, హలపరశువుల నెంతయు ♦ నక్కజముగ.

కం॥ సంకులసమరం బలర న, శంకితులై యోధవరులు ♦ సాహసమొసఁగన్
బొంకముగ ద్వంద్వయుద్ధము, హుంకారార్భటులు సెలఁగ ♦ నొదవించిరొగిన్.

ఉ॥ అంత జలంధరుండు దివి ♦ జావళి కందఱ కన్నిరూపులై
పంతముతోఁ ద్రిశూలమును ♦ బట్టి సుపర్వులఁ ద్రెళ్ళఁ జేయుచున్
దంతులఁ జెండుచున్ హయులఁ ♦ దద్దయుఁ జీల్చుచు స్యందనంబులన్
వింతగ నుగ్గుసేయుచును ♦ వీరవినోదము సల్పె నాజిలోన్. 133

గీ॥ యమునిఁ బొట్టఁ బగిల్చె న ♦ య్యగ్నినవయఁ, జేసెఁ బాశిని నడలొందఁ ♦ జేసె నమ్మ
హాబలుని రూపుమాపె బి ♦ డౌజు జూసి, యల్లనైరావతగజంబు ♦ డిల్లపఱచి.

కం॥ వాసవుమస్త్రముఁ బగులఁగ, వేసిన నాతండు నొచ్చి ♦ భిదురముతోని పె
ల్లేసున నసురను మోఁదుడుఁ, దా సరకొనరింప కసుర ♦ తల్లజుఁ డంతన్. 135

గీ॥ వాఁడియమ్ముల విలుగూర్చి ♦ వాసవాన, నంబుఁ బగులఁగఁ జేసిన ♦ నగవిరోధి
రోసమున నట్టికైదువు ♦ లేసె నసుర, నిరువు రేనుఁగులట్లు బో ♦ రిరి చలమున.

కం॥ ఇరువురకున్ బాసటగా, సురలును నసురులును జేరి ♦ శూరతఁ జూపన్
బురుహూతుఁ డసురుల జలం, ధరుఁడు సురలఁ జంపి రధిక ♦ దర్పము మెఱయన్.

గీ॥ పొలిసినట్టి నిశాటులఁ ♦ బొదిగిపట్టి, యుశనుఁ డాత్మీయమంత్రప్ర ♦ యుక్తి మరల
బ్రదుకఁ జేయుచునుండె గీ ♦ ష్పతియు మృతసు, రలను బ్రదికించె నోషధీ ♦ కలనమునను.

గీ॥ అదియుఁ గని రజనీచరుం ♦ డడిగెఁ గావ్యు, నార్యసంజీవినీవిద్య ♦ యమరినట్టి
తాము దైత్యుల బ్రదికింపఁ ♦ దానునట్లె, సురల జీవుండు బ్రతికించు ♦ చొప్పదెట్లు?

కం॥ అని యడిగిన ద్రోణగిరిన్, ఘనమగు నోషధులఁ దెచ్చి ♦ క్రతుభుక్కులఁ జే
తనయుతులఁ జేసె ననుడున్, విని యామలఁ దెచ్చి కడలి ♦ వేసి రయమునన్.

చ॥ మరల సుపర్వులందఱను ♦ మారణమున్ బొనరించి యప్పురం
దరుఁ బరిమార్పఁ బూనె మృత ♦ తండములన్ బ్రదికింపఁగా మరు
ద్గురుఁ డలశైలమున్ గనక ♦ దుష్టనిశాటకృతం బెఱింగి వే
గిరము మహేంద్రుతో ననియెఁ ♦ గిమ్మన కొండెడ కేగుఁడీ వెసన్. 141

ఆ॥ అనువుదప్పినట్టి ♦ యవసరం బీక్షించి, నేరుపరి యొకింత ♦ నెగులు మాని
చెడ్డకాలమంతఁ ♦ జెల్లించి యటమీఁద, సిరులఁ జేరవలయుఁ ♦ జెలఁగి తిరుగ.

## —* దేవతలు పరాజయంబునొంది పాఱిపోవుట *—

క॥ అనిచెప్పిన ప్రెగ్గడనుడి, విని పఱచె మహేంద్రుఁ డతని ♦ వెనుకొనిచని రా
యనలముఖామరులెల్లను, వనరుచు నాకంబు విడిచి ♦ వైళంబొప్పన్. 143

గీ॥ వారలందఱు వడువగా ♦ వలసఁబోవ, టరసి యసురుండు త్రిదివంబు ♦ నాక్రమించి
స్వప్రతినిధానులకుఁ గైవ ♦ సంబుచేసి, తన నగరుఁజేరి యేలుచుం ♦ డెనుజగములఁ

చ॥ "పురపురఁబొక్కి" వేలుపులు ♦ ఘోరుననేడ్చుచుఁ బద్మలోచనున్
దఱియఁగఁబోయి మ్రొక్కిలిడి ♦ దానవభంజన! దీనరంజనా!
మరల నొకండు గండఁడయి ♦ మమ్ము దివంబుననుండి పాపె ము
ష్కరుఁ డసురుండు వాని కనిఁ ♦ జాలకపోతిమి దోర్బలంబునన్. 145

సీ॥ కడలిలోపల మధు ♦ కైటభులన్ గిట్టి, యజుని రక్షింపవో ♦ యతులకరుణ
నమృతంబుఁ గ్రవ్యాదు ♦ లపహరింపఁగ వారి, వంచించి యిడవో సు ♦ పర్వతతికి
నాహిరణ్యాక్షుఁ ద ♦ దగ్రజుఁబరిమార్చి, జగములకొసఁగవో ♦ శాంతిభిక్ష
బలియుఁడైనట్టి య ♦ బ్బలిని మోసముచేసి, వేల్పుల కీవో త్రి ♦ విష్టపంబు

గీ॥ చక్రధర! నీవుచేసిన ♦ సాయములను, మఱతుమే యెన్నినాళ్ళకు ♦ మానసమున
మరల దయచేసి యీదుష్టు ♦ మడియఁజేసి, సాఁకుమీయిఁక భక్తుల ♦ సాకతమున.

క॥ అని యిట్లు లర్థివేడుడు, ననుకంపన్ వనజనయనుఁ ♦ డారసి యప్లే
యని క్రవ్యాదున్ గడపెద, వనరకుఁ డిఁకమీఁద మీరు ♦ వాసవముఖ్యుల్!

## —* విష్ణుమూర్తి జలంధరునితోఁ బోరుట *—

గీ॥ అని రయంబునఁ దార్క్ష్యునా ♦ యత్తపఱచి, యసురవర్యునికడ కేగి ♦ యనిఁదొడంగి
సింగమట్టులఁగడఁగి వా ♦ సిందొడంగి, వానితోఁ బోరెనెన్నియో ♦ వాసరములు.

క॥ కౌమోదకి మున్నగు ను, ద్దామమహాసాధనముల ♦ దైత్యుని మోఁదన్
భీమబలుఁడైన నాతం, డేమియు నఱసేయ కమ్మ ♦ లేయుచునుండెన్. 149

గీ॥ అంత వేసారి నక్తంచ ♦ రాంతకుండు, వనధిసూనునిఁ గని యిట్టు ♦ లనియెనోయి
దైత్యవర్య! ముదంబయ్యెఁ ♦ దగినవాఁడ, విట్టి జెట్టితోఁ బెనఁగలే ♦ దెపుడు నేను.

క॥ నీకోరిన వరమిచ్చెదఁ, జేకొను మెఱిఁగింపు మిచ్ఛ ♦ సింధుజ! యనుడున్.
నాకేటికి నీవరములు, వైకుంఠుడ! యైన నిమ్ము ♦ వర మిప్పగిదిన్. 151

గీ॥ నీదుపురిఁబాసి వేగంబె ♦ నాదుభగిని, తోడ నాయింటనుండు సం ♦ తోసమొప్ప
నిదియె వరమగు వేఱొకం ♦ డేదియేని, వలితి లేదెందు నాకెప్డు ♦ జలజనయన!

వ. అనినఁ దథాస్తని నారాయణుం డిందిరతో జలంధరావాసంబున కేగి యుండె
సుఖంబుండె నంత బృందారకు లాతురులై కైలాసంబున కేగి కైలాదిసెలవుతో

శివునిఁజేరి కాంచి యసురవృత్తాంతంబును దమదు పరాజయంబును, వైకుంఠుని
యపజయంబును, మఱియు నెన్నంగను లక్ష్మీసహాయుండై జలంధరుని కైవసంబై
యుండుటయు సవిస్తరంబుగాఁ జెప్పి యద్దైత్యుని వధించి తమ్ముఁబాలింపు మని
యర్థించుటయును నాలించి బాలేందుశేఖరుం డచిరకాలంబున నట్లుసేయుదుఁ
బొండని వారిం బనిచి నారాయణుం దలంచిన నతండు దఱియుడు నాయసుర
వృత్తాంతం బడిగిన నతం డిట్లనియె. 153

ఉ॥ దేవ! జలంధరాసురుఁడు ♦ దేవరఫాలవిలోచనాగ్నిచే
నావనధిఁ జనించి పెను ♦ పై సురలందఱ నోడఁబుచ్చి దు
ర్భావమునన్ దివంబు నిజ ♦ పక్షులకై వసమున్ బొనర్చె నే
నా పెడఁగున్ వధింపఁ జని ♦ యక్కట వానికి లోఁగిపోయితిన్. 154

గీ॥ పెక్కుదినములు వానితో ♦ నక్కజముగఁ, బోరసల్పితి గెల్పేమి ♦ పొసఁగదయ్యెఁ
జుట్టఱికము మారసి యతండు ♦ పట్టఁబట్టి, సిరిని నన్నును దనయింటఁ ♦ జేర్చికొనియె.

క॥ అనినన్ శివుండు నగి వె, న్నునిఁ బొమ్మని నారదు నెద ♦ను దలఁప నతఁ డం
తనె వచ్చి మ్రొక్కె నమ్ముని, కనియెను లోకాధినాథుఁ ♦ డాలోచనతో.

క॥ మౌని! జలంధరుఁడను నొక, దానవుఁ డేపొంది సురలఁ ♦ దఱిమి దివంబున్
దానుగొని తనదువారల, కానాకం బప్పగించె ♦ నతిమర్మముఁడై.

క॥ వానికడ కీవు చని యే, దేనియు భేదంబుఁ బన్ని ♦ యింకగఁ జేయన్
గానొప్పుఁ జతన మమరుపు, పైనంతయు నేనొనర్తు ♦ బ్రహ్మజ! యనినన్.

వ. తాపసుం డతిత్వరితంబున జలంధరునిఁజేరి తత్కృతోపచారంబులఁ బ్రీతుండై యంత
నతండు దేవర్షీ! యెచ్చటనుండివచ్చితి యెచ్చటికేగెదవు? నా యైశ్వర్యంబుఁ గని
మెచ్చితివే? 159

సీ॥ హంసయుక్తవిమాన ♦ మపహరించితి నిదే, చూడుము రాజీవ ♦ సూనునొడిసి
యైరావతంబిది ♦ హయరత్నముచ్చైశ్శ్ర, వంబది కను మింద్రుఁ ♦ బాపి కొంటి
పద్మాదినిధు లవ్వి ♦ భాండార మటుఁజూడు, సంతరించితి శ్రీదు ♦ పంతమణఁచి
బంగారువర్షించు ♦ పాండురచ్ఛత్రంబుఁ, గను మిది కొంటిఁ బా ♦ శిని నదల్చి

గీ॥ కాలదండంబుఁ గయికొంటిఁ ♦ గాలు నోర్చి, కల్పవృక్షంబులను దెచ్చి ♦ నిల్పితి నవె
పెరడునన్ జూఁడు; మింకను ♦ సిరిని హరిని, యింటనేయుంచినాఁడ ము ♦ నీంద్ర! కనుమ.

గీ॥ ఇఁక నివియుఁగాక దక్కవే ♦ దేని నీవు, మదికి ముదమిచ్చునట్టిదా ♦ మంచిరతన
మున్నఁ దెల్పుము వేవేగ ♦ నుద్దవిడినిఁ, దెచ్చికొనియెద నెందున్న ♦ దివ్యమౌని!

వ. అనుటయు నసురేంద్రా! నీవు చెప్పినయంత సేయన్‌గలవాఁడవే. నీ యైశ్వర్యం బునకు సంతసించితి నైన వినుము, నేనిపుడు కైలాసంబుననుండి మహేశ్వరుం దరిసించివచ్చితి నతండు మహేశ్వరుం డనుటకుఁ దగినవాఁడు. 162

గీ॥ కాటిబూడిని నలఁదియుఁ ♦ గాటనున్న, దినమొులన్ దిగ్గుచుండినఁ ♦ డిండిలేక
విసముమెక్కినఁబాములఁ♦ వేసికొనిన, శివను గొనియుమ్మహేశతఁ♦జెందె హరుఁడు.

ఉ॥ కావున సర్వమంగళను ♦ నైకొని సర్వసమృద్ధులన్ మహా
దేవపదంబు మున్నయిన ♦ దివ్యపదంబుల నొందె శూలి నీ
వా వెరవొప్పినట్టి యొక ♦ యున్నులమిన్న సదృష్టశాలినిన్
దేవినిగాఁగొనన్ మిగులఁ ♦ దేజమునొందెద వింతకున్ భువిన్. 164

గీ॥ ఇపుడు నీదేవి బృంద యెం♦తేనిసొగసు, దనమునఁ బతివ్రతంబునఁ ♦ దనరు నైన
నల్ల పార్వతియట్టి యు♦నన్యభాగ్య, గాకయుండుట కొఱంతయై ♦ గానుపించె.

క॥ అనినంతనె శివఁబోలిన, దనసేటికి యూపెనే నృ ♦ షాంకు గెలిచితె
త్తును జూడు మునివరా! యని, తనసేనకుఁ దెలిపె దాడి ♦ ధవళగిరిపయిన్. 166

వ. తదనంతరంబున.

—* జలంధరాసురుఁడు కైలాసగిరిపై దండెత్తుట *—

చ॥ తగినవజీరులన్ గొని యు♦దాత్తగతిన్ రజతాద్రి కేగి బి
ట్టుగ రణభేరిఘోషము గ♦డుఁగడు నల్వఁగ నాలకించి ప
న్నగపతిహారుఁ డంతయు మ♦నంబున నారసి యొక్క వృద్ధుఁడై
యొగి దనుజాధిపుఁ గదియ ♦ నుద్ధతుఁ డాతఁడు నూచి క్రుద్ధుఁడై. 167

చ॥ ముదుక! హరుండు లేడె యెటఁ♦బోయె నెఱుంగఁగఁ జెప్పు మున్నచోఁ
బదిలముగాఁగ నీవరిగి ♦ పార్వతినిమ్మను జోగికేల సొం
పొదవెడు చెల్వ నాకు సరి♦యొప్పును దప్పదు కొందు నెట్టులే
నిది తన మేలుగా నుడువు ♦ విచారసమొందిన నేనె తీర్చెదన్. 168

చ॥ అను దనుజాధమోక్తి విని ♦ యంతకశాసనుఁ డాగ్రహంబునన్
బొనరియు నోయి వీరవర! ♦ పొంకముగల్గినయేని నీ సుద
ర్శనమును నెత్తి నెత్తిపయిఁ ♦ జక్కఁగ జేరుపు మట్లయైన నీ
వనలవిలోచనున్ గెలువ ♦ నర్హుఁడవన్న నతండు గిన్కమై. 169

ఉ॥ నానుడి కడ్డువల్కి యిటు ♦ నన్నుఁ బరీక్షయొనర్ప నెంచెదే
కానక నీవు సెప్పుపని ♦ కర్జమెసంగఁగఁ జేయఁ జెల్లునే
నీ నుడులెల్లమాని యిఁక ♦ నేరుపు గీరుపుఁ గట్టిపెట్టి చ
న్నీ నుడిసేయవేని యిపు♦డే కడతేర్చెద నిన్ను నావుడున్.

## —* శివుఁడు సుదర్శనంబున జలంధరాసురుఁ జంపుట *—

సీ॥ నీటిలోఁ గాలివ్రేలున ♦ నేర్పుమీఱ, వ్రాసిన సుదర్శనంబెత్తి ♦ రక్కసిపయి
వేసిన యతండు రెండయ్యె ♦ వేగనతని, తేజమీశ్వరునొందెను ♦ దీప్తులలర.

క॥ సైనికు లజరిన వీర, శ్రీనిధి యల కువలయేశ♦శేఖరుఁడు కడుఁ
బూనికి నలికాక్షాగ్నుల,చే నశియింపంగఁజేసె ♦ జేజే లలరన్. 172

క॥ కురిసెఁ బ్రసూనవర్షము, మెఱసెన్ దిశలెల్లఁ గాంతి ♦ మేకొని పేఁకఁ
బొరసెఁ దుందుభిరవములు, విరిసెఁ రక్కసుల తెగల ♦ వేడుక లెడసై.

ఉ॥ అంతకుమున్నె శ్రీశుఁ డసు♦రాధిపుగేహినియైన బృందచె
ల్వెంతయుఁ గోర్కెలూరఁ గని ♦ యెట్లు లభించుఁ దదీయభోగమఁ
జింత మునింగి యట్లసుర ♦ చేష్టను టూరసి వానిఁబొంది య
త్యంతము నాసఁ జేకొని ర♦యంబున నొండెడదాఁచి చెచ్చెరన్. 174

గీ॥ వృద్ధుఁడగు నొక్క యతినాథు ♦ వేసమొంది, రెండు క్రోతులఁ జేకొని♦దండిగా శి
వోహ మంచు జలంధరు ♦ నూరనొక యుపవనముఁ జేరి యుండె న♦ప్పట్ల నంత.

చ॥ తన మగఁ డంతకాంతకుని ♦ దర్పముతోఁ జెనకంగఁబోయెఁ దా
ననువిది కాదు పోకుమని ♦ యన్నను మానకయుండె రాకయుం
డెను గతమేమొకో? యనుచు ♦ డిల్లఁదనంబునఁగ్రాఁగి పోవుచున్
దనచెలికత్తెయల్ గొలువ ♦ దైత్యునిరాణి వనంబుఁ జేరి తాన్. 176

గీ॥ దేవసంస్మరణముల నెం♦తేని యాల, కించి యద్దెస కేగి వీ♦క్షించి యతిని
సాఁగిలఁబడి విభుని కు♦శలము నడుగ, సామి కపులకు నొక్కింత ♦ సంజ్ఞచేసె.

వ. వానరంబులు వేవేగచని యతిత్వరితంబుగ నాతుండెంబులఁదెచ్చి యచ్చేడియ ముందఱఁబెట్టిన నయ్యరవిందనేత్రి విభునిమృతియెఱింగి దుఃఖభరమ్మున మూర్ఛితయై కొంతతడవునకుఁ దెలివొంది కన్నీరు మున్నీరుగా విలపించుచు యతీంద్రుని పదంబులఁ బడి నాథునిజీవితం బర్థింప నతండు. 178

ఆ॥ ఈ కళేబరంబు ♦ నింటికిఁగొని చని, కడిగి తడిని నొత్తి ♦ గంధలేప
నము నొనర్చియొకట♦నమరించి యుంచుము, జీవితంబుఁ జెందుఁ ♦ జిగురుఁబోఁడి!

వ. అన నాపె తత్క్షణంబున నద్దేహంబు దాసీజనంబులతో నిజగృహంబునకుఁ గొని పోయి యతివరుండు చెప్పినట్లొనర్చి నిరీక్షించుచున్నంతఁ బుండరీకాక్షుండు క్రోతుల విడిచివచ్చి యోగబలంబున జలంధరదేహంబునఁ బ్రవేశించి కనులు దెఱచి కదలిన నమ్ముదిత ముదితయై పెనిమిటియని తలంచి గాఢాలింగనం బొనర్చె నంత విష్ణుండు సంతసంబున నాపెతో నహర్నిశంబులు క్రీడించుచు సుఖంబులొందు

చున్నంత నొక్కనాఁడు యదృచ్ఛచే వెన్నుం డొంటిగఁ బరుండి యున్నతఱి బృందాదేవి యలంకరించుకొని యందుఁ జేసుడు జలంధర దేహశకలంబుల మధ్య మేచకచ్ఛాయలనొప్పు నప్పలుంగుకౌతుం గాంచి యదరిపడి యేవంబునొంది విన్నదనంబున ఖిన్నయై మరగుచుఁ బదతాడితభుజంగివోలె మించుటల్కతోఁ జురచురఁజూచి యిట్లనియె. 180

గీ॥ ఓరి పోకిరి! తుంటరి! ♦ యోరి తులువ!, యోరి పరదారగామి! వి♦న్నోరి! మీఱి
చెఱిచితివి నన్నుఁ బరసతిఁ♦జేటుమూఁడు, నని తలంపక కనుకని ♦ ననుచితముగ.

క॥ పతిభావముతో నీసం, గతిఁ జెందితిఁ గాని వేఱుఁ♦గా దెప్పుడు నా
మతి యంటుపడదు నీ దు, ర్గతిఁ గను మిఁక నదరిపాటు ♦ గంగన్ గలియున్.

## —* విష్ణుమూర్తిని బృందాదేవి శపించుట *—

క॥ నీ యా లొక్కని కిట్టుల, నే యనువుగఁ జిక్కఁగలదు ♦ హేయపువాదుల్
సేయుదురు లోకులెంతయు, నీ యుల్లము గడిఁది వగను ♦ నెక్కొని పొగలన్.

వ. మఱియుఁ గపులతోఁగూడి యిచ్చెడుపని యొనర్చితివి గావున నీకుఁ గపులే తోడయ్యెదరని శాపంబిచ్చి పతిదేహఖండంబులఁ జితియందుంచి యూనిముసంబునఁ దా నా చిచ్చు నురికి ప్రాణంబులు వదలె నంత దామోదరుండు బృందావిరహంబు నోర్వక తేఁబవలా చితియందుఁబడి యన్యంబుఁ దలఁపకుండుటఁ గాంచి యిందిరయుఁ దక్కువేల్పులును బరమేశ్వరునిఁ గానన్బోయి యచ్చరితంబుఁ దెలిపి యనుగ్రహింపుమని యర్థింప నద్దయాకరుండు సర్వజగన్మోహినియును మూలప్రకృతియును మహామాయయు నగు నంబికను నియోగించిన నాజగజ్జనని శక్తిమయంబులగు మూఁడుబీజంబుల నొసంగి వీని విష్ణుండున్న బృందాచితిప్రదేశమందుఁ జల్లుండు మీయిష్టసిద్ధియగు ననుడు వారట్లుసేయ నందు ధాత్రీ తులసీ మాలతీవృక్షంబులు పొడమిన నవ్వాని సౌరభగ్రహణంబున విష్ణుండు మోహపరితాపంబుఁ బాసి వైకుంఠంబున కేగి సుఖంబుండె నీవృక్షత్రయంబునందుఁ బూర్వాపూర్వము గేశవున కెక్కుడానందదాయకంబై యెసంగునట్లగుటఁ జేసి కార్తిక మాసంబంది ధాత్రీ తులసీ పూజనంబు తక్కువేల్పులకన్న విష్ణుదేవున కెక్కుడు ప్రియం బంత సకలామరు లానందంబున స్వపదంబులఁ జెంది రిది జలంధరవధోపాఖ్యానంబు దీనిఁ బఠించిన వినినవారలకు సర్వపాపక్షయంబై శ్రేయంబులొందు నిఁక శంఖచూడవధోపాఖ్యానంబు వినుండని సూతుం డిట్లనియె. 184

## —* శంఖచూడ చరిత్రము *—

క॥ మునివరుఁడగు కశ్యపునకుఁ, దనుజుండగు విప్రచిత్తి ♦ తనయుఁడు దంభుం
డనువాఁడు గొడుకుఁబడయఁగఁ, బెనుతపసుఁ జెందియుండెఁ♦ బెద్దయుఁ బ్రొద్దుల్.

శివునిఁ జేరి కాంచి యసురవృత్తాంతంబును దమదు పరాజయంబును, వైకుంఠుని
యపజయంబును, మఱియు వెన్నునకు లక్ష్మీసహాయుండై జలంధరుని కైవసంబై
యుండుటయు సవిస్తరంబుగాఁ జెప్పి యా దైత్యుని వధించి తమ్ముఁ బాలింపు మని
యర్థించుటయును నాలించి బాలేందుశేఖరుం డచిరకాలంబున నట్లు సేయుదుఁ
బొండని వారిం బనిచి నారాయణుం దలంచిన నతండు దఱియుడు నాయసుర
వృత్తం బడిగిన నతం డిట్లనియె. 153

ఉ॥ దేవ! జలంధరాసురుఁడు ♦ దేవరఫాలవిలోచనాగ్నిచే
నావనధిఁ జనించి పెను ♦ పై సురలందఱ నోడఁబుచ్చి దు
ర్భావమునన్ దివంబు నిజ ♦ పక్షులకై వసమున్ బొనర్చి నే
నా పెడఁగున్ వధింపఁ జని ♦ యక్కట వానికి లోఁగిపోయితిన్. 154

గీ॥ పెక్కుదినములు వానితో ♦ నక్కజముగ, బోరసల్పితి గెల్వని ♦ బోఁగదయ్యె
చుట్టఱిక మారసి యతండు ♦ పట్టఁబట్టి, సిరిని నన్నును దనయింటఁ ♦ జేర్చికొనియె.

క॥ అనినన్ శివుండు నగి పె, న్నునిఁ బొమ్మని నారదు నెద ♦ ను దలఁప నతఁ డం
తనె వచ్చి మ్రొక్కి నమ్ముని, కనియెను లోకాధినాథుఁ ♦ డాలోచనతో.

క॥ మౌని! జలంధరుఁడను నొక, దానవుఁ డేపొంది సురలఁ ♦ దఱిమి దివంబున్
దానుగొని తనదువారల, కానాకం బప్పగించె ♦ నతిదుర్మదుఁడై.

క॥ వానికడ కీవు చని యే, దేనియు భేదంబుఁ బన్ని ♦ యింకఁగఁ జేయన్
గానొప్పఁ జతన మమరువు, పైనంతయు నేనొనర్తు ♦ బ్రహ్మజ! యనినన్.

వ. తాపసుం డతిత్వరితంబున జలంధరునిఁ జేరి తత్కృతోపచారంబులఁ బ్రీతుండై నంత
నతండు దేవర్షీ! యెచ్చటనుండి వచ్చితి వెచ్చటికేగెదవు? నా యైశ్వర్యంబుఁ గని
మెచ్చితివే? 159

సీ॥ హంసయుక్తవిమాన ♦ మపహరించితి నిదే, చూడుము రాజీవ ♦ సూను నోడిసి
యైరావతంబిది ♦ హయరత్నముచ్చైశ్శ్ర, వంబది కను మింద్రుఁ ♦ బాపి కొంటి
పద్మాదినిధు లివ్వి ♦ భాండార మటుఁ జూడు, సంతరించితి శ్రీదు ♦ పంతమణఁచి
బంగారువర్షించు ♦ పాండురచ్ఛత్రింబుఁ, గను మిది కొంటిఁ బా ♦ శిని నదల్చి

గీ॥ కాలదండంబుఁ గయికొంటిఁ ♦ గాలు నోర్చి, కల్పవృక్షంబులను దెచ్చి ♦ నిల్పితి నవె
పెరడునన్ జూడు; మింకను ♦ సిరిని హరిని, యింట నేయుంచినాఁడ ము ♦ నీంద్ర! కనుమ.

గీ॥ ఇఁక నివియుఁగాక దక్కువే ♦ దేని నీదు, మదికి ముదమిచ్చునట్టిదా ♦ మంచిరతన
మున్నఁ దెల్పుము వేవేగ ♦ నుద్దవిడిని, దెచ్చికొనియెద యెందున్న ♦ దివ్యమౌని!

వ. అనుటయు నసురేంద్రా! నీవు చెప్పినయంత సేయన్‌గలవాఁడవే. నీ యైశ్వర్యం
బునకు సంతసించితి నైన వినుము, నేనిప్పుడు కైలాసంబుననుండి మహేశ్వరుం
దరిసించివచ్చితి నతండు మహేశ్వరుం డనుటకుఁ దగినవాఁడు. 162

గీ॥ కాటిబూదిని నలఁదియుఁ ♦ గాటనున్న, దిసమొలన్ దిగ్గుచుండినఁ ♦ దిండిలేక
విసముమెక్కినఁబాముల ♦ వేసికొనిన, శివుని గొనియమ్మహేశితఁ ♦ జెందె హరుఁడు.

ఉ॥ కావున సర్వమంగళను ♦ గైకొని సర్వసమృద్ధులన్ మహా
దేవపదంబు మున్నయిన ♦ దివ్యపదంబుల నొందె శూలి నీ
వా వెరవొప్పినట్టి యొక ♦ యున్నులమిన్న నదృష్టశాలినిన్
దేవినిగాఁగొనన్ మిగులఁ ♦ దేజమునొందెద వింతకున్ భువిన్. 164

గీ॥ ఇపుడు నీదేవి బృంద యెం ♦ తేనిబాగసు, దనమునఁ బతివ్రతంబునఁ ♦ దనరు నైన
నల్ల పార్వతియట్టి య ♦ నన్యభాగ్య, గాకయుండుట కొఱఁతయై ♦ గానుపించె.

క॥ అనినంతనె శివఁబోలిన, దననేటికి యూపెనే స్వ ♦ పాంకు గెలిచి తె
త్తును జూడు మునివరా! యని, తనసేనకుఁ దెలిపె దాడి ♦ ధవళగిరిపయిన్. 166

వ. తత్క్షణంబున.

—* జలంధరాసురుఁడు కైలాసగిరిపై దండెత్తుట *—

చ॥ తగినవజీరులన్ గొని యు ♦ దాత్తగతిన్ రజతాద్రి కేగి బి
ట్టుగ రణభేరిఘోషము గ ♦ డుఙ్గడు సల్పఁగ నాలకించి ప
న్నగపతిహారుఁ డంతయు మ ♦ నంబున నారసి యొక్క వృద్ధుఁడై
యొగి దనుజాధిపుఁ దఱియ ♦ నుద్ధతుఁ డాతఁడు సూచి క్రుద్ధుఁడై. 167

చ॥ ముదుక! హరుండు లేడె యెటఁ ♦ బోయె నెఱుంగఁగఁ జెప్పు మున్నచోఁ
బదిలముగాఁగ నీపరిగి ♦ పార్వతినిమ్మను జోగికేల సొం
పొదవెడు చెల్వ నాకు సరి ♦ యొప్పును దప్పదు కొందు నెట్టులే
నిది తన మేలుగా నుడువు ♦ మీరసమొందిన నేన తీర్చెదన్. 168

చ॥ అను దనుజాధమోక్తి విని ♦ యంతకశాసనుఁ డాగ్రహంబునన్
బొనరియు నోయి వీరవర! ♦ పొంకముగల్గినయేని నీసుద
ర్శనమును నెత్తి నెత్తిపయిఁ ♦ జక్కఁగ జేరుపు మట్లయైన నీ
వనలవిలోచనున్ గెలువ ♦ నర్హుఁడవన్న నతండు గిన్కమై. 169

ఉ॥ నానుడి కడ్డువల్కి యిటు ♦ నన్నుఁ బరీక్షయొనర్ప నెంచెదే
కానక నీవు సెప్పుపని ♦ కర్జమెసంగఁగఁ జేయఁ జెల్లునే
నీ నుడులెల్లమాని యిఁక ♦ నేరుపు గీరుపుఁ గట్టిపెట్టి చ
స్మి నుడిసేయవేని యిపు ♦ డే కడతేర్చెద నిన్ను నావుడున్.

## —* శివుఁడు సుదర్శనంబున జలంధరాసురుఁ జంపుట *—

సీ॥ నీటిలోఁ గాలివ్రేలున ♦ నేర్పుమీఱ, వ్రాసిన సుదర్శనంబెత్తి ♦ రక్కసిపయి
వేసిన యతండు రెండయ్యె ♦ వేగనతని, తేజమీశ్వరునొందెను ♦ దీప్తు లలర.

క॥ సైనికు లడరిన వీర, శ్రీనిధి యుల కువలయేశ ♦ శేఖరుఁడు కడుఁ
బూనికి నలికాక్షాగ్నుల, చే నశియింపంగఁజేసె ♦ జేజే లలరన్. 172

క॥ కురిసెఁ బ్రసూనవర్షము, మెఱసెన్ దిశలెల్లఁ గాంతి ♦ మేకొని వీఁకన్
బోరసెఁ దుందుభిరవములు, విరిసెఁ రక్కసుల తెగల ♦ వేడుక లెడనై.

ఉ॥ అంతకుమున్నె శ్రీశుఁ డసు ♦ రాధిపు గేహినియైన బృందచె
ల్వొంతయుఁ గోర్కులూరఁ గని ♦ యెట్లు లభించుఁ దదీయభోగమన్
జింత మునింగి యట్లసుర ♦ చేడ్పడు టారసి వానిఁబొంది య
త్యంతము నాసఁ జేకొని ర ♦ యంబున నొండెడదాఁచి చెచ్చెరన్. 174

గీ॥ వృద్ధుఁడగు నొక్క యతినాథు ♦ వేస మొంది, రెండు క్రోతులఁ జేకొని ♦ దండిగా శి
వోహ మంచు జలంధరు ♦ నూరనొక యుపవనముఁ జేరి యుండె న ♦ ప్పట్ల నంత.

చ॥ తన మగఁ డంతకాంతకుని ♦ దర్పముతోఁ జెనకంగఁబోయెఁ దా
ననువిది కాదు పోకుమని ♦ యన్నను మానక యుండె రాకయుం
డెను గత మేమొకో? యనుచు ♦ డిల్లఁదనంబునఁగ్రాఁగి పోవుచున్
దన చెలికత్తెయల్ గొలువ ♦ దైత్యునిరాణి వనంబుఁ జేరి తాన్. 176

గీ॥ దేవసంస్మరణముల నెం ♦ తేని యాల, కించి యుద్దెసకేగి వీ ♦ క్షించి యతిని
సాఁగిలఁబడి విభుని కు ♦ శలము నడుగ, సామి కపులకు నొక్కింత ♦ సంజ్ఞ చేసె.

వ. వానరంబులు వేవేగ చని యతిత్వరితంబుగ నాతుండెంబులఁ దెచ్చి యచ్చేడియ ముందఱఁ బెట్టిన నయ్యరవిందనేత్రి విభునిమృతి యెఱింగి దుఃఖభరమ్మున మూర్ఛితయై కొంతతడవునకుఁ దెలివొంది కన్నీరు మున్నీరుగా విలపించుచు యతీంద్రుని పదంబులఁ బడి నాథునిజీవితం బ్రోచింప నతండు. 178

ఆ॥ ఈ కళేబరంబు ♦ నింటికిఁగొని చని, కడిగి తడిని నొత్తి ♦ గంధలేప
నము నొనర్చి యొకట ♦ నమరించి యుంచుము, జీవితంబుఁ జెందుఁ ♦ జిగురుఁబోఁడి!

వ. అన నాపె తత్క్షణంబున నద్దేహంబు దాసీజనంబుతో నిజగృహంబునకుఁ గొని పోయి యతివరుండు చెప్పినట్లొనర్చి నిరీక్షించుచున్నంతఁ బుండరీకాక్షుండు క్రోతుల విడిచిపుచ్చి యోగబలంబున జలంధర దేహంబునఁ బ్రవేశించి కనులు దెఱచి కదలిన నమ్ముదిత ముదితయై పెనిమిటియని తలంచి గాఢాలింగనంబొనర్చె నంత విష్ణుండు సంతసంబున నాపెతో సహర్నిశంబులు క్రీడించుచు సుఖంబులొందు

చున్నంత నొక్కనాఁడు యదృచ్ఛచే వెన్నుం డొంటిగఁబరుండి యున్నతఱి బృందాదేవి యలంకరించుకొని యందుఁజేరుడు జలంధర దేహాశకలంబుల మధ్య మేచకచ్ఛాయలనొప్పు నవ్వాలుంగుఁ జోతుం గాంచి యదరిపడి యేవంబునొంది విన్నదనంబున ఖిన్నయై మరగుచుఁ బదతాడితభుజంగివోలె మించుటల్కతోఁ జూరచురఁజూచి యిట్లనియె. 180

గీ॥ ఓరి పోకిరి! తుంటరి! ♦ యోరి తులువ!, యోరి పరదారగామి! వి♦న్మోరి! మిాఱి చెఱిచితివి నన్నుఁ బరసతిఁ♦జేటుమూఁడు, నని తలంపక కనుకని ♦ ననుచితముగ.

క॥ పతిభావముతో నీసం, గతిఁ జెందితిఁ గాని వేఱుఁ♦గా దెవ్వఁడు నా
మతి యంటువడదు నీ దు, ర్గతిఁ గను మిఁక నదరిపాటు ♦ గంగన్ గలియన్.

## —* విష్ణుమూర్తిని బృందాదేవి శపించుట *—

క॥ నీ యా లోక్కని కిట్టుల, నే యనువుగఁ జిక్కఁగలదు ♦ హేయపువాదుల్
సేయుదురు లోకులెంతయు, నీ యుల్లము గడిఁది వగను ♦ నెక్కొని పొగలన్.

వ. మఱియుఁ గపులతోఁగూడి యిచ్చెడువని యొనర్చితివి గావున నీకుఁ గపులే తోడ య్యెదరని శాపంబిచ్చి పతిదేహఖండంబులఁ జితియందుంచి యానిముసంబునఁ దానా చిచ్చు నురికి ప్రాణంబులు వదలె నంత దామోదరుండు బృందావిర హంబు నోర్వక తేఁబవలా చితియందుఁబడి యున్యంబుఁ దలఁపకుండుటఁ గాంచి యిందిరయుఁ దక్కువేల్పులును బరమేశ్వరునిఁ గానన్ బోయి యచ్చరితంబుఁ దెలిపి యనుగ్రహింపుమని యర్థింప నద్దయాకరుండు సర్వజగన్మోహినియును మూలప్రకృతియును మహామాయయు నగు నంబికను నియోగించిన నాజగజ్జనని శక్తిమయంబులగు మూఁడుబీజంబుల నొసంగి వీని విష్ణుండున్న బృందాచితిప్రదేశమందుఁ జల్లుండు మిాయిష్టసిద్ధియగు ననుడు వారట్లుసేయ నందు ధాత్రీ తులసీ మాలతీవృక్షంబులు పొడమిన నవ్వాని సౌరభగ్రహణంబున విష్ణుండు మోహాపరితాపంబుఁబాసి వైకుంఠంబున కేగి సుఖంబుండె నీవృక్షత్రయంబునందుఁ బూర్వపూర్వము గేశవున కెక్కుడానందదాయకంబై యొసంగునట్లుగుటఁ జేసి కార్తిక మాసంబందీ ధాత్రీ తులసీ పూజనంబు తక్కువేల్పులకన్న విష్ణుదేవున కెక్కుడు ప్రియం బంత సకలామరు లానందంబున స్వపదంబులఁజెంది రిది జలంధరవధోపాఖ్యానంబు దీనిఁ బఠించిన వినినవారలకు సర్వపాపక్షయంబై శ్రేయంబులొందు నింక శంఖచూడవధోపాఖ్యానంబువినుండని సూతుం డిట్లనియె. 184

## —* శంఖచూడ చరిత్రము *—

క॥ మునివరుఁడగు కశ్యపునకుఁ, దనుజుండగు విప్రచిత్తి ♦ తనయుఁడు దంభుం
డనువాఁడు గొడుకుఁబడయఁగఁ, బెనుతపనుఁ జెందియుండెఁ ♦ బెద్దయుఁబ్రొద్దుల్.

—— * శివుఁడు సుదర్శనంబున జలంధరాసురుఁ జంపుట * ——

సీ॥ నీటిలోఁ గాలివ్రేలున ♦ నేర్పుమీఱ, వ్రాసిన సుదర్శనంబెత్తి ♦ రక్కసిపయి
వేసిన యతండు రెండయ్యె ♦ వేగనతని, తేజమీశ్వరునొందెను ♦ దీప్తులలర.

క॥ సైనికు లడరిన పీర, శ్రీనిధి యల కువలయేశ ♦ శేఖరుఁడు కడుఁ
బూనికి నలికాక్షాగ్నుల, చే నశియింపంగఁజేసె ♦ జేజే లలరన్. 172

క॥ కురిసెఁ బ్రసూనవర్షము, మెఱసెన్ దిశలెల్లఁ గాంతి ♦ మేకొని వీఁకన్
బొరసెన్ దుందుభిరవములు, విరిసెన్ రక్కసుల తెగల ♦ వేడుక లెడనై.

ఉ॥ అంతకుమున్నె శ్రీశుఁ డసు♦రాధిపు గేహినియైన బృందచె
ల్వెంతయుఁ గోర్కెలూరఁ గని ♦ యెట్లు లభించుఁ దదీయభోగమున్
జింత మునింగి యట్లసుర ♦ చేడ్పడు టారసి వానిఁబొంది య
త్యంతము నాసఁ జేకొని ర♦యంబున నొందెడదాఁచి చెచ్చెరన్. 174

గీ॥ వృద్ధుఁడగు నొక్క యతినాథు ♦ వేసమొంది, రెండు క్రోతులఁ జేకొని ♦ దండిగా శి
వోహ మంచు జలంధరు ♦ నూరనొక యుపవనముఁ జేరి యుండె స♦ప్పట్ల నంత.

చ॥ తన మగఁ డంతకాంతకుని ♦ దర్పముతోఁ జెనకంగఁబోయెఁ దా
ననువిది కాదు పోకుమని ♦ యన్నను మానకయుండె రాకయుం
డెను గతమేమొకో? యనుచు ♦ డిల్లఁదనంబునఁగ్రాఁగి పోవుచున్
దనచెలికత్తెయల్ గొలువ ♦ దైత్యునిరాణి వనంబుఁ జేరి తాన్. 176

గీ॥ దేవసంస్మరణముల నెం♦తేని యాల, కించి యద్దెసకేగి వీ♦క్షించి యతిని
సాఁగిలఁబడి విభుని కు♦శలము నడుగ, సామి కపులకు నొక్కింత ♦ సంజ్ఞ చేసె.

వ. వానరంబులు వేవేగచని యతిత్వరితంబుగ నాతుండెంబులఁదెచ్చి యచ్చేడియ ముందటఁబెట్టిన నయ్యరవిందనేత్ర విభునిమృతియెఱింగి దుఃఖభరమ్మున మూర్ఛితయై కొంతతడవునకుఁ దెలివొంది కన్నీరు మున్నీరుగా విలపించుచు యతీంద్రుని పదంబులఁ బడి నాథునిజీవితం బ్రక్షింప నతండు. 178

ఆ॥ ఈ కళేబరంబు ♦ నింటికిఁగొని చని, కడిగి తడిని నొత్తి ♦ గంధలేప
నము నొనర్చియొకట♦నమరించి యుంచుము, జీవితంబుఁజెందుఁ ♦ జిగురుఁబోఁడి!

వ. అని నాపె తత్క్షణంబున నద్దేహంబు దాసీజనంబుతో నిజగృహంబునకుఁ గొని పోయి యతివరుండు చెప్పినట్లొనర్చి నిరీక్షించుచున్నంతఁ బుండరీకాక్షుండు క్రోతుల విడిచిపుచ్చి యోగబలంబున జలంధరదేహంబునఁ బ్రవేశించి కనులు దెఱచి కదలిన నమ్ముదిత ముదితయై పెనిమిటియని తలంచి గాఢాలింగనంబొనర్చె నంత విష్ణుండు సంతసంబున నాపెతో నహర్నిశంబులు క్రీడించుచు సుఖంబులొందు

చున్నంత నొక్కనాఁడు యదృచ్ఛచే వెన్నుం డొంటిగఁ బరుండి యున్నతఱి
బృందాదేవి యలంకరించుకొని యందుఁ జేరుడు జలంధరదేహశకలంబుల మధ్య
మేచకచ్ఛాయలనొప్పు నప్పలుంగురాతుం గాంచి యదరిపడి యేవంబునొంది
విన్నదనంబున ఖిన్నయై మరగుచుఁ బదతాడితభుజంగివోలె మించుటల్కతోఁ
జురచురఁజూచి యిట్లనియె. 180

గీ॥ ఓరి పోకిరి! తుంటరి! ♦ యోరి తులువ!, యోరి పరదారగామి! వి♦న్మోరి! మిాఱి
చెఱిచితివి నన్నుఁ బరసతిఁ♦జేటుమూఁడు, నని తలంపక కనుకని ♦ యనుచితముగ.

క॥ పతిభావముతో నీసం, గతిఁ జెందితిఁ గాని వేఱుఁ♦గా డెప్పుడు నా
మతి యంటువడదు నీ దు, ర్గతిఁ గను మిఁక నదరిపాటు ♦ గంగన్ గలియున్.

## —* విష్ణుమూర్తిని బృందాదేవి శపించుట *—

క॥ నీ యా లొక్కని కిట్టుల, నే యనువుగఁ జిక్కఁగలదు ♦ హేయపువాదుల్
సేయుదురు లోకులెంతయు, నీ యుల్లము గడిఁది వగను ♦ నెక్కొని పొగలన్.

వ. మఱియుఁ గపులతోఁగూడి యిచ్చేడుపని యొనర్చితివి గావున నీవుఁ గపులే తోడ
య్యెదరని శాపంబిచ్చి పతిదేహఖండంబులఁ జితియందుంచి యోనిముసంబునఁ
దా నా చిచ్చు నురికి ప్రాణంబులు వదలె నంత దామోదరుండు బృందావిర
హంబు నోర్వక తేఁబవలా చితియందుఁబడి యన్యంబుఁ దలఁపకుండుటఁ గాంచి
యిందిరయుఁ దక్కవేల్పులును బరమేశ్వరునిఁ గానన్‌బోయి యచ్చరితంబుఁ
దెలిపి యనుగ్రహింపుమని యర్థింప నద్దయాకరుండు సర్వజగన్మోహినియును
మూలప్రకృతియును మహామాయయు నగు నంబికను నియోగించిన నాజగజ్జనని
శక్తిమయంబులగు మూఁడుబీజంబుల నొసంగి వీని విష్ణుండున్న బృందాచితిప్రదే
శమందుఁ జల్లుండు మీాయిష్టసిద్ధియగు ననుడు వారట్లుసేయ నందు ధాత్రీ తులసీ
మాలతీవృక్షంబులు పొడమిన నవ్వాని సౌరభగ్రహణంబున విష్ణుండు మోహపరి
తాపంబుఁబాసి వైకుంఠంబున కేగి సుఖంబుండె నీవృక్షత్రయంబునందుఁ బూర్వ
పూర్వము కేశవున కెక్కుడానందదాయకంబై యెసంగునట్లగుటఁ జేసి కార్తిక
మాసంబందీ ధాత్రీ తులసీ పూజనంబు తక్కవేల్పులకన్న విష్ణుదేవున కెక్కుడు
ప్రియంబంత సకలామరు లానందంబున స్వపదంబులఁ జెందిరిది జలంధరవధో
పాఖ్యానంబు దీనిఁ బఠించిన వినినవారలకు సర్వపాపక్షయంబై శ్రేయంబులొందు
నిఁక శంఖచూడవధోపాఖ్యానంబువినుండని సూతుం డిట్లనియె. 184

## —* శంఖచూడ చరిత్రము *—

క॥ మునివరుఁడగు కశ్యపునకుఁ, దనుజుండగు విప్రచిత్తి ♦ తనయుఁడు దంభుం
డనువాఁడు గొడుకుఁబడయఁగ, ఁ దెనుతపసుఁ జెందియుండెఁ ♦ బెద్దయుఁ బ్రొద్దుల్.

సీ॥ కొంతకాలంబునకు వాని ♦ ఘోరతపముచే శిరసునందు నగ్నులు ♦ చెంగలించి
మంట లేపొందినంత ర♦మాసహాయుఁ, డరసి పొడగానవచ్చె దై ♦త్యాధిపతికి.

క॥ వరమడుగుమనుచు హరి యతఁ, డరవిందాత్మునకు మ్రొక్కి ♦ యడిగెను దనయుం
డురుపైనబలముగలవాఁ, డరాతిసూదనుఁ డజయ్యుఁ ♦ డమరావళికిన్. 187

క॥ నీయందు భక్తుఁడై కడు, శ్రేయంబులఁ జెందువాఁడు ♦ శ్రీరమణీశా!
గేయగుణాఢ్యుఁడు పొడమఁగఁ, జేయుము కృపఁజేసి సంత ♦ సింతుననంగన్.

సీ॥ హరి 'తథాస్తు'ని వరమిచ్చి♦యరిగెనతని, సతికిఁజూలేర్పడియె శుభ♦సమయమందు
కొమరుఁడుజనించె గోలోక ♦ గోప్యుఁడౌ సు, దాముఁ డారాధికాశాప♦దానవిధిని.

సీ॥ అల్ల శిశువున కొనరించి ♦ రవుడుజాత, కర్మమును నామకరణంబు ♦ గరిమదనర
శంఖచూడుఁడనుచు మేల్ ప్రశ♦స్తిఁదనరి, నాహ్వయంబెల్లజగముల♦యందునిండె.

క॥ ఆ చిఱుతయు దినదినమున, కేచుచు వర్ధిల్లి కళల ♦ నేపువడసి యెం
తో చనవున జైగీష, వ్యాచార్యునియొద్దఁ బడసె ♦ నభిమత మనువున్. 191

సీ॥ అంతఁ దలిదండ్రుల యనుజ్ఞ♦నంది పుష్క, రంబనెడు తీర్థతలమొంది♦సంబరమున
పెక్కువర్షంబులు తపంబు♦నొక్కతీరు, సల్పె దృఢమై యొసంగు సం♦కల్పమునను.

వ. అంత గొంతకాలంబునకు.

ఆ॥ తమ్మిచూలి దఱిసి♦సమ్మదమ్మున శంఖ, చూడుఁజూచి యనియె♦ శూర! వరముఁ
గోరుమిత్తుననుడుఁ ♦ గుతుకంబున నతండు, మ్రొక్కి ప్రస్తుతించి ♦ చక్కననియె.

చ॥ అనిమిషదానవాహిమను ♦ జాధిపు లందఱ నోడఁబుచ్చఁ జా
లిన బలవిక్రమంబులు ద ♦ లిర్పఁగఁజేయుము సర్వశత్రుసూ
దనునిగ ముజ్జగంబులను ♦ దక్కొని నేలఁగఁజాలువానిఁగా
నను బొనరింపుమీ తగ న ♦ నంతకృపాజలధీ! విధీ! యనన్. 194

వ. అనిన నతండు.

## —* శంఖచూడునకు బ్రహ్మ వరంబు లిచ్చుట *—

క॥ కోరిన కోరికలన్నియు, భూరిగ ఫలియించు నీకు ♦ భోగములను వి
స్తారముగ నొందుదువు బల్, గీరితినిన్ జెందఁగల వా♦గిన్ దనుజసుతా!

వ. మఱియు నొక్కవిశేషంబుఁ జెప్పెద నాలకించి యట్లు సల్పుము.

క॥ బదరీవనమున నొకతుక, సుదతీమణి కన్నె తులసి ♦ సుందరి తప సొ
ప్పదలిర్పఁజేయుచున్నది, ముదమున నీవిప్పు డందుఁ ♦ బోయి కను మింకన్.

సీ॥ ఆపడుచు విన్న ధర్మధ్వ♦జాఖ్య నమరి, నట్టి నృపుతనుజారత్న ♦ మన్నుమిన్న
నిన్నుఁ జూచి వరించును ♦ సన్నుతాంగి, నీకుఁ దగిన మిటారియౌ ♦ నేర్పులాడి.

వ. కావున,

చ॥ చనుమిఁక సత్వరంబటకుఁ ♦ జందనగంధినిఁ జెంది పెండ్లిఁ జే
కొనుము నితాంతభోగములఁ ♦ గోమలితో సుఖియింపు మింపుమైఁ
జెనుపుము ధర్మమున్ దిశలఁ ♦ బెంపొనరింపుము కీర్తిచంద్రికన్
దనుజులకెల్ల సంతసము ♦ దార్కొనఁజేయు మజేయవిక్రమా!

క॥ రత్నము సుమి యక్కాంతా, రత్నము నీవైనఁ బురుష ♦ రత్నంబవు దా
రత్నమునున్ జేకొనుమిఁక, రత్నము రత్నంబు సరస ♦ రాజిలునరే. 199

గీ॥ అనినొడివిచనియెవిధాత ♦ యపుడుశంఖ,చూడుఁడరుసమ్మదమరన ♦ చ్చొప్పునరయుచు
మీఱి బదరీవనంబును ♦ జేరికాంచె, నొక్కచోఁ దపసానరించు ♦ నక్కలికిని. 200

—* శంఖచూడుఁడు బ్రహ్మశాసనంబునఁ దులసిన్ జేరుట *—

సీ॥ బమ్మ చెప్పిన నుడికన్నఁ ♦ బలుతెఱఁగుల, నందముల విందుమీఱిన ♦ సుందరాంగిఁ
గాంచి యుబ్బిళులూరి యు♦గ్గలిక మించి, తారసించినవాని న♦త్తన్వి గాంచి. 201

క॥ పరికించిన మది గరఁగగ, విరిశరముల మరుఁడు విసరి ♦ వేయఁగఁదనలో
మురిసి తలవంచి మ్రొక్కిడి, సరసిజముఖి చేసె నతిథి ♦ సత్కారములన్. 202

వ. దానవేంద్రుండును దులసీసమర్పితకుశాసనంబునం దాసీనుండై తనపైఁ గురంగట
మెఱుంగుచూపులందలి చకచకల నాణిముత్యంబులట్లు గుమ్మరింపుచున్న
సుందరిన్ గనుంగొని మందహాసంబుతో నిట్లనియె. 203

ఉ॥ ఎవ్వతె వీవు? కల్కి! కుల ♦ మెయ్యది? నీయభిధాన మెద్ది? నీ
వివ్వనమందు నొంటితప ♦ మిట్లొనరించెద వేమిగోరి? తే
జవ్వనమందు నన్నిటను ♦ జక్కఁగఁ జాలినవానిఁ జెంది య
వ్వువ్వులవింటిదంటఋణ ♦ మున్ సరిపెట్టుట యొప్పదే చెలీ! 204

చ॥ కనులమెఱుంగు నెమ్మొగము ♦ కాంతి రదంబులనిగ్గుజగ్గులున్
చనుఁగవపొంకపుందళుకు ♦ సన్ననినెన్నడుమందపుంబసం
దనువగు మేల్పిఱుందుబిరు ♦ దానవకంబు టొయార మార! నేఁ
గనుఁగొనలేదు నీజెనయు ♦ కాంతను నెయ్యెడఁగూడ మానినీ! 205

చ॥ వలచితి నిన్నుఁ జేడియరో! ♦ వాస్తవమీయది నన్నుఁ జెందు మ
గ్గలముగఁ గామకేళుల సు♦ఖం బొదవన్ దనియింతు నెప్డు నీ
తలఁపున కన్యథాత్వమును ♦ దల్ప నొకప్పుడు నేనిఁ బ్రేముడిన్
గలయఁగ నేఁగుదెమ్ము పిక ♦ గానము లొప్పెడు నీవనంబునన్. 206

వ. అనవుడు నమ్మదిరాక్షియును,

క॥ తియ్యని నెయ్యంబుల నిటు, వియ్యముఁ బొసఁగింపఁ దలఁచు ♦ వీరపురుషుఁడా
నయ్యెడ నేత్రాంతంబుల, నొయ్యనఁ గనుఁగొనుచు నంత ♦ నువిద యిటులనెన్.

గీ॥ ఏను ధర్మధ్వజుఁడను మ♦హీశుసుతను, తులసియనుదాన శుభ మెదఁ♦ దలఁచియిట్లు
తపసుఁజేయుచు నిందుంటిఁ♦దజులు మీవు, ఒంటిపాటున స్త్రీలఁదా♦ పొందఁజనదు.

మ॥ పొలఁతుల్ మాయలమారు లెంతయును న ♦ పృంబోఁడు లున్నట్టిచో
కెలమిన్ జేరఁగరాదు బ్రహ్మనయినన్ ♦ హేలావిశేషంబులన్
గలఁతన్ బుచ్చి యలంత్రిగిత్తవలె లోఁ♦గన్ జేతు రవ్వారి య
త్తలఁపుల్ గూరిరము ల్లుల్లమున్విసము ని ♦ ద్దాక్షిణ్య లీనాతుకల్. 209

క॥ అన నాతం డెలనగవున, వనజేక్షణ కనియె వినుము ♦ భామిని! యెందై
నను ధీరుఁడైనవానికిఁ, జనుఁ బొలఁతుల గోష్ఠి నుండఁ ♦ జనవలరంగన్.

క॥ స్త్రీలయెడన్ బురుషులయెడ, మేలిమికలవార లువిద ♦ మిన్నా! కల రా
శీలం బెఱుఁగుట కర్జము, లోలాత్ము లెఱుంగలేరు ♦ లోటుఁదనమునన్. 211

క॥ నిను వెదకుచు వచ్చితి నీ, వనమునఁ గనుగొంటి నేత్ర ♦ పర్వముగ నిటన్
ననుబంచె నీకడకు విధి, నిను గాంధర్వమునఁ బడసి ♦ నెగడుమని సతీ! 212

క॥ ననునరయు శంఖచూడుం, డను దానవరాజపుత్త్రి ♦ నధికతరతపో
ధనునిగ నీమది నెంతయుఁ, జనునె విధిన్ దప్పసేయ ♦ సఖి! యిఁక మనకున్.

గీ॥ అనిన నామోదమున వాని ♦ యాననంబుఁ
గాంచి మది సంతసించి యి♦క్కరణి ననియె
ధీరుఁడ వటంచుఁ దెలిసితి ♦ నారులందు
ధీరతను గోల్పడినవాఁడు ♦ దేఁబెకాఁడె. 214

క॥ ఎవ్వఁడు స్త్రీవంచితుఁడగు, నవ్వాఁడు మృతుండు వాఁ డ♦నర్హుఁడు సభయం
దవ్వాని హవ్యకవ్యము, లవ్వేల్పులు పితలు సెంద ♦ రారయు మెందున్. 215

ఆ॥ స్త్రీపరాజితుండు ♦ సిద్ధమాశౌచి పం, చత్వ మొందువఱకు ♦ సందియంబు
లేదు దీనికన్న♦లేదు మిన్నైన యా, శౌచ మెందునేని ♦ సచ్చరిత్రి! 216

గీ॥ బాపఁడాశౌచమును బాయుఁ♦బదిదినముల, కల్లక్షత్త్రియులుఁడు ద్వాద♦శాహములకుఁ
బదియునైదుదినములకు♦వైశ్యుఁడొక్క, నెలకుశూద్రుఁడుశుద్ధిఁగొ♦నెదరుపుడమి.

వ. కావున.

క॥ నిన్నుఁ బరీక్ష యొనర్చితి, నన్నిటఁ దగినట్టివాఁడ ♦ వైతి విటులఁగా
కున్న నెటుదెలియనయ్యెడుఁ, గన్నియలకుఁ బురుషు తెఱఁగుఁ ♦ గనుటొప్పిదమా.

వ. అనుచున్నంతలో నబ్జసంభవుండు దారసించి శంఖచూడున్ గాంచి యిట్లనియె.

చ॥ తడ వొనరింపఁబోకు మింకఁ ♦ దన్వినిఁ జెంది మనోజభోగముల్
పడయుము వేగ నేకతమ ♦ భామలు దక్కిన నాలసింతురే
బెడఁగగు సోయగంబు గల ♦ బిత్తరి యీపకు నీవు నట్టులే
బెడఁగగు సోయగం బమరు ♦ వేడుకకాఁడ వికేల కొంకుటల్. 220

గీ॥ తగిన యన్నంబునరసకుఁ ♦ దగినకూర, సేకుఱుట దుర్లభంబగు ♦ క్షితితలమునఁ
దగినజోడీరలిర్వురిం♦బుగడగెన్ "శు, భస్యశీఘ్ర"మ్మనుడునచ్చుఁ♦ బాసి యికను.

వ. తులసిన్ జూచి యిట్లనియె.

గీ॥ తులసి! గోలోకమునునుండు ♦ లలితమూర్తి, యలసుదాముఁడితఁడు నీవు♦నల్లరాధి
కోరుశాపవశమ్మున ♦ నుర్విఁబుట్టి, నారు దంపతులౌదురు ♦ మీరలిందు. 222

ఉ॥ వీఁడు మహాతపస్వి బల ♦ వీర్యములం దసమానుఁ డెంతయున్
జూడఁగ నొప్పునందముల ♦ సొంపుల కాస్పదమైనవాఁడు నీ
కీడును జోడునై తనరి ♦ యింపుదలిర్చెడువాఁడు వీనితో
కూడికనొంది భోగములఁ ♦ గొందువు సందియమొంద కుగ్మలీ! 223

క॥ రమణివి నీవన్నింటను, రమణుఁడితం డెల్లయెడల ♦ రాజిలు మీయో
గము రమణీయము వీనిన్, గమనీయతరాంగి! చెందు ♦ గాంధర్వమునన్. 224

గీ॥ కలుములపడంతి వెన్నుకేల్ ♦ గాంచినట్లు, పలుకులవెలంది నాదుచేఁ ♦ బడసినట్లు
చాయయర్కునిఁ జెందిన♦చాయ శంఖచూడు నీవొంది సుఖములఁ♦ జూఱగొనెదు.

## —* తులసీ శంఖచూడులు గాంధర్వవిధితోఁ గలియుట *—

క॥ అంత నిటుచెప్పి పద్మజుఁ, డంతర్హితిఁ జెందె వార ♦ లన్యోన్యము వే
డ్కొంతయుఁ దలిర్ప నవ్వని, కాంతిరమునఁ గామసుఖము ♦ లందిరి వెలుచన్.

క॥ అన్యోన్యాలింగనముల, నన్యోన్యాఘ్రాణములను ♦ నళిలాలసతో
నన్యోన్యచుంబనంబుల, నన్యోన్యక్రీడనముల ♦ హాయిఁగొని రొగిన్. 227

చ॥ కొలఁకులఁ గేళికావనులఁ ♦ గ్రొన్నెలమావులకోనలందు మ
ల్లెలపొదలందు మేల్మిలవ ♦ లీగృహభూముల గాంగసైకతం
బుల గిరికాననంబులఁ బ్రి♦ మోదరసప్రసరాంచితాత్ములై
యలరుచు నిష్టభోగముల ♦ హాళిఁ బెనంగిరి యంగజోద్ధతిన్. 228

ఆ॥ అంతఁ గొన్నినాళ్ళ ♦ కాత్మపురంబున, కింతితోడ దాన ♦ వేశ్వరుండు
చేరి తల్లిదండ్రు ♦ లూరటఁగొనఁ దన, రాజ్యమేలె నసుర ♦ రాజి గొలువ.

క॥ కులగురుఁడగు భార్గవునిన్, బిలిపించి యమాత్యపదవిఁ ♦ బ్రియముగ నిడి యి
మ్ములఁ దదనుమతినిఁ బ్రజలకు, నలువుచునుండెను బ్రియంబుఁ ♦ జక్కఁగనపుడున్.

వ. ఒక్కనాడు దైత్యప్రేరితుండై శుక్రునివలన దేవదానవవైరంబును వేల్పులు
తమవారలకుఁ జేసిన యనుచితంబు లాలించి కినుకతో దేవతల నిగ్రహింపఁదలఁచి
వరూధినితోఁ జని నాకంబు ముట్టడించుడు.

గీ॥ ఇంద్రుఁడు సుపర్వబలముల ♦ నెల్ల ననికిఁ, దోడుకొనిపోయి యాశంఖ ♦ చూడుతోడ
బవర మొనరింపఁగా సుర ♦ వసులు దైత్య, విభునిచే నొచ్చి చచ్చియు ♦ వీఁగిరంత.

చ॥ కనుఁగొని యమ్మహేంద్రుఁడు ని ♦ కామభుజాబల మేర్పడన్ రయం
బునఁ గులిశంబునన్ దనుజు ♦ మోఁదుడు వాఁడఱసేయ కెంతయున్
గనలి నిశాతభూరివిశి ♦ ఖమ్ముల నింద్రుని గాత్రభేదనం
బును నొనరించి యార్చె సుర ♦ పుంగవు లాతురులై చలింపఁగన్. 303

## —* శంఖచూడ మహేంద్రుల యుద్ధము *—

వ. అంత శంఖచూడేంద్రు లిరువురును.

క॥ కరియున్ గరియును హరియును, హరియును గిరియును గిరియును ♦ నటు లుద్ధతిమైఁ
దఱుఁగని యుద్ధ మొనర్చిరి, సుర లసురులు విస్మయమునఁ ♦ జూచుచు నిలువన్.

ఉ॥ అంత నిశాచరేంద్రుని భు ♦ జాబల మెంతయు నంతకంతకున్
వింతగఁ బెర్గుచుండుటను ♦ వృత్రవిభేది యెఱింగి యంతలోఁ
బంతము వీడి పేఁడు పరి ♦ పంథివశం బొనరించి సేనతోఁ
జింతిలుచున్ హిరణ్యగిరి ♦ శృంగము చేరువ కేగె నార్తతన్. 231

క॥ సురపతి యరుగుటఁ గని మే, ల్చిరు దొప్పఁగ నసురభర్త ♦ పేర్మి సుధర్మన్
దఱిసి పదునాల్గు జగముల, దొరగా నభిషేక మొందెఁ ♦ దుష్టి యెసంగన్.

గీ॥ లోకములఁ బాలనము సేయ ♦ పేఁశ మీఱు
దనుజవర్యుల నందందుఁ ♦ దగిన తెఱఁగు
నిలిపె నధికారము లొసంగి ♦ నేర్పు మీఱఁ
దనదు శాసన మెంతేనిఁ ♦ దనరు నట్లు. 237

గీ॥ బలపరాక్రమముల యోగ ♦ బలమునను మ, హాత్ముఁడాతఁడు భువనంబు ♦ లందు నేమి
కొఱఁత లేకుండున ట్లేలెఁ ♦ గూర్మి మీఱఁ, బదియు నాలుగు జగములఁ ♦ బ్రోఢశక్తి.

క॥ పాడియుఁ బంటయు మెండై, యీడెనయని కలిమిపోవు ♦ లింటింటను న
ల్లాడఁగ నే సెబ్బర వె, న్నాడఁగ లేకుండె దనుజ ♦ నాథుని యాజ్ఞన్.
ఎల్ల జనంబులకును దాఁ, దల్లివలెం దండ్రివలెను ♦ దనరి మనుపుచున్
బెల్లెసఁగుచు నాకవేల్పుల, యుల్లములకు దూరమగుచు ♦ నుండెఁ గడిమిమై.

ఉ॥ వేలుపు లంత నంపడుచు ♦ వేగ విధిఁగొని వెన్నుఁడున్నయ
ప్పాలికిఁ జేరి రక్కసుఁడు ♦ భండనమందు జయించి తమ్ములన్
బ్రోలికి శ్రీలకున్ వెలిగఁ ♦ బుచ్చుట యంతయుఁ జెప్పి శత్రు ను
న్మూలనమున్ బొనర్చుటకు ♦ భోరున వేఁడుకొనంగ శ్రీశుఁడున్. 241

గీ॥ మదినిసర్వంబరసి దివ్య ♦ మండలికను, వినుఁడిఁక సుపర్వవరులాతఁ♦డును మదీయ
భక్తవర్యుండు గోలోక♦వాసి రాధ, శాపమునఁజేసి యసురుఁడై ♦ జననమొందె.

మ॥ మఱియున్ వాఁడు భుజాబలంబునఁ దపో ♦ మాహాత్మ్యమున్ జేసి యె
వ్వరికిన్ జివ్వను లోఁగఁ డుత్తమబల ♦ ప్రావీణ్యతేజోధురం
ధరుఁ డవ్వాని హరుండు శూలహతితోఁ ♦ జాఁ ద్రుంచు వేళె తెఱం
గరయన్ రాదన వేల్పు లంతనె మహే ♦ శాభ్యర్ణయానేచ్ఛులై. 243

క॥ కడువేగ హరుని డగ్గఱి, యడలుచుఁ బాదములఁబడి మ ♦ హాత్మా! యొక నం
జుఁడుతిండి శంఖచూడుఁడు, గడు నుద్ధతుఁ డిట్లు మమ్ముఁ ♦ గటకటఁబఱచెన్.

క॥ ఏలుము మము నసురను ని, ర్మూలముచేయుము గడంగి ♦ ముగ్ధేందుధరా!
జాలముచేసిన బ్రతుకన్, జాలము దయసేయు మింకను ♦ సత్వరము మదిన్.

గీ॥ అనుడు వారల ప్రార్థన ♦ నాలకించి, యారివేరముఁజెంది యే ♦ కాంశధరుఁడు
అసురఁ జంపెదనని వరం ♦ బాదితేయ, వరుల కిడి చిత్రరథుఁడను ♦ వానిఁజూచి

—* శివుఁడు శంఖచూడునికడకు దూతను బంపుట *—

చ॥ ధరపయి శంఖచూడుఁ డను ♦ దానవుఁడున్న పురంబుఁజొచ్చి యా
సురరిపుతోడ నా నుడిగ ♦ సూటిగ నిట్లను పోటుబంటవై
వెఱవక దివ్యవర్యులను ♦ వీఁగఁగఁజేసి తదీయమౌ సిరిన్
బురమునుఁ జూఱఁగొంటి విది ♦ పోలదు వారల కిమ్ము నాకమున్. 247

ఉ॥ నీదు నివాసమౌ నగరి ♦ నీవు మెలంగుము భూమినేలు మిం
పౌ దనుజేంద్ర! యిత్తెఱఁగు ♦ నారయు మట్లొడఁబాటుసేయవేన్
బూదియొనర్తు నిన్నుఁ గ్రతు♦భుక్కుల కీర్తు సమస్తసంపదల్
మీఁదట వచ్చు నాపదల ♦ మేలుగ నీమది నిర్ణయింపుమా! 248

క॥ అని నుడివి వాని చిత్తంబును వేగ నెఱింగిరమ్ము ♦ పొమ్మన నతఁడున్
విని శంఖచూడు నగరున, కనుపుగఁజని వాని కిట్టు ♦ లనియెన్ సభలో.

చ॥ హరుఁ డిటుసెప్పి యంపె విను♦మా! యసురోత్తమ! దివ్యవర్యు లం
దఱిఁ గదనంబునన్ గెలిచి ♦ తద్ధనవాహనవస్తువర్గముల్
బురమును రాజ్యమున్ బడసి ♦ పొంగుచునుంటివి చెల్లదింక స
త్వరముగ వారి సర్వమును ♦ వారలకిచ్చి మనంగఁ జూడుమా! 25

గీ॥ అట్లు సేయక దక్కిన ♦ యసుర! నిన్ను, వేగఁ జెగటార్చి యవ్వారి ♦ విభవ మెల్ల
వారి కిచ్చెద హెచ్చులు♦వలవ దుడుగు, మనియె నీయుల్ల మెట్టులో♦యరసి చెపుము.

క॥ అనిపల్కిన దనుజేంద్రుఁడు, విని లేనగు మొగమునందు ♦ వెలయఁగ గంధ
ర్వునిఁ గనుఁగొని యనియెను సన్మానమున నొక్కింత చేవ♦మానక యిట్టుల్.

గీ॥ చను నె తనజోలి సుంత యే♦జాడ నేని, దలఁపకున్నట్టి నాయెడ♦దాడిఁదలఁప
హరునకిది న్యాయమా నొకో!♦యనుచితంబు, గాదొకో! నీవ యోజింపు♦కౌశలమున.

గీ॥ కాక యటు లెత్తి వచ్చిన♦గడఁగి బెగడు, వాఁడనే వీఁక నెఱుఁగ రే♦వాసి యసదె
జయపరాజయములు కాల ♦ చక్రమొంది, యొదవుచుండును వానికై ♦బెదరఁ కేల.

వ. ఇఁకను.

క॥ ఏదో రీతిగ మాదా,యాదులు దివిపదులు మేము ♦ నన్యోన్యంబున్
వాదొనరింతుము గలియుదు, మేదైనను లేదు పనుల♦కిటఁబని యొకఁడున్.

గీ॥ చెప్పు మిప్పల్కు చని దూత! ♦ శివునితోడ, ననుడు నాతండు వేచని♦యభవుతోడ
నట్లు సెప్పిన "తినుకూడు♦నన్నకణము, దాఁకఁ బోకన్న" నుడివోలెఁ♦దగుట నెఱిఁగి.

వ. వేగంబున ప్రమథ భూతగణంబులకెల్ల శంఖచూడునిపై దండయాత్ర నెఱింగించి పయనంబుఁదెల్పిన వారందఱు సంతసంబున మిన్నుముట్టి యట్టహాసంబులు సేయుచు నతిత్వరితంబున వాహనంబుల నెక్కి సాయుధులై యా యోధనంబునకై నడచిరి. 257

## —* శివుఁడు శంఖచూడునిపై యుద్ధమునకు వెడలుట *—

సీ॥ భైరవుండును వీర♦భద్రుండు నమ్మహా, సేనుండు గంధగ ♦ జాననుండు
చండీశ్వరుండు బా♦ష్కలుఁడును మణిమంతుఁ, డానంది యశని మ♦హాబలుండు
కంకాలకోకిల ♦ శంకుకర్ణులును సం,తానక పిప్పల ♦ భానుకులును
కపిల కుటీచర ♦ కాలజిహ్వులు బలీ, భద్ర దుర్జయ కాక♦పాదనీలు

గీ॥ లగ్నికాగ్నిముఖామోఘు ♦ లల్లపూర్ణ, భద్రవిక్రుతవిశాఖ సం♦వర్తకులును
చంద్రతాపన లకులీశ♦సన్నిధులును, తాలకేతు కరాలాక్ష ♦ కాలకులును, 258

వ. మఱియు దీర్ఘదంష్ట్రదుర్గమ కేకరాక్ష విరూపాక్ష వికృతాననకందుకకుండవిష్టంభులును, మధుపింగలావేశన చతుర్వక్త్రకాష్ఠారూఢ లోకాంతక మహాకాల భృంగిరిటులును, ఉగ్రదశనోగ్రకోటరకులోచనవశీభద్రసుభద్రులును నానాయుధధరులై యనేక దివ్యవాహనంబుల నారోహణంబుచేసి బయలుదేఱిరింకను.

గీ॥ శతభుజయు శంఖచక్రాసి ♦ చర్మచాప, బాణ శక్తి గదా శూల ♦ పరశుముసల
వజ్రముద్గరఖట్వాంగ ♦ పట్టసాది, హస్తయా భద్రకాళిక ♦ హరుసమొదవ.

గీ॥ రక్తమాల్యాంబరంబుల • రక్తిమీఱఁ, దాల్చి నవ్వుచుఁ బాడుచుఁ • దనదుభక్త
పటలిఁ బ్రోచుచు వికటజి • హ్వన్ బాడువుగఁ, జాచి త్రిప్పుచుఁ బులి నెక్కి • సాఁగె నినికి.

క॥ హరితో హరిహయుతో సుర, వరులొగి వారువము లెక్కి • బహులాయుధముల్
పసనఁగొని కదనకేళీ, పరులై నడిచిరి మహేశ • బలము నిడి మదిన్. 262

ఉ॥ శంకరుఁ డప్డు దివ్యకవ • చంబును మై ధరియించి నూతనే
శాంకకిరీట మొంది వివి • ధాయుధముల్ గొని గోపతీంద్రమున్
బొంకము మీఱ నెక్కె ముని • ముఖ్యులు భోరున స్వస్తిగీతి న
ల్వంకల నిండి చేయఁ బల • భర్తువధింపఁ జనెన్ మహోగ్రతన్. 263

వ. ఇట్లు వెడలి పుడమిన్ జేరియుండు. 264

సీ॥ కపిలముని తపంబు • గాంచినయచ్చోటు, పుష్పభద్రానదీ • పుణ్యహాల
మపరాంబుధికిఁ బూర్వ • మందునొప్పినయది, మలయగిరికిఁ బశ్చి • మంపుఁజోటు
గంధమాదనగిరి • కటకదక్షిణసీమ, శ్రీశైలమున కుదీ • చీనభూమి
అక్షయవటముచే • నమరి సిద్ధాశ్రమం, బను పేరఁ బరఁగిన • యట్టికోన
గీ॥ వామమున గోమతి కరంబు • వాసిఁ బరగ
నాశరావతితోఁ గూడి • యపరవార్ధిఁ
జేరఁ జను పుష్పభద్రికుఁ • జేరువ దన
బలములను డించి యుండుండె • భర్గుఁ డపుడు. 265

వ. అంత శంఖచూడుండు ప్రణిధులచే శివుని దండయాత్రాగమనంబును విని వేగంబున ననేక శతాక్షౌహిణీబలంబుల నలవరించికొని యుద్ధంబునకు సన్నద్ధుండై రేయి శుద్ధాంతంబున నాత్మసతియగు తులసితో మహేశ్వరాహవయాత్రన్ దెలిపి తాఁ బోరునకై పయనంబు సేయుట నెఱింగించిన నాయింతుఁ బోఁడి వలదనియు, స్వారాజ్యంబాదితేయుల కిమ్మనియు నుద్బోధించిన వికవికనవ్వి పోల్ల యొడలికై పగతురు పై నెత్తి వచ్చినప్పుడోడఁబాటొంది లోఁగుట శూరధర్మంబు గాదనియుఁ బ్రపంచం బస్థిరంబనియు సుయశంబు శాశ్వతంబనియుఁ జెప్పి యూఱడించి సముచితాలింగనసురతోపభోగంబుల నాపెన్ దనియఁజేసి మఱునాఁ డుదయంబున మజ్జనాదికంబులఁ దీర్చి తనయునకు రాజ్యపట్టం బొసంగి తల్లిని భక్తి మెయిగారవించు మని యప్పగించి కవచధారణం బొనర్చి ఖడ్గతూణీరశరచాపాది సాధనంబుల నొంది కాంచనరథారూఢుండై మంగళధ్వానములతో వెడలి మహేశ్వరుండు విడిసినప్రదేశంబున కనతిదూరంబు సైన్యంబుల విడియించి తానొక్కరుండు మహేశ్వరదర్శనార్థమై సిద్ధాశ్రమంబుఁ జేరి యందక్షయవటచ్ఛాయ యుండు.

## —* శంఖచూడుఁడు శివుని దరిసించుట *—

సీ॥ యోగాసనమునఁ గూ♦ర్చుండియుండినవానిఁ, దవిలిముద్రాదృష్టిఁ ♦ దనరువాని
మందహాసాంకుర ♦ సుందరాస్యమువాని, బ్రహ్మతేజంబుచేఁ ♦ బరఁగువాని
శుద్ధస్ఫటికవర్ణ ♦ శోభితుండగువానిఁ, గేలఁ ద్రిశూలంబు ♦ గ్రాలువాని
శార్దూలచర్మంబుఁ ♦ జక్కఁగట్టినవాని, భక్తుల మిత్తినిఁ ♦ బాపువాని
గీ॥ సర్వసంపత్కరుని శాంతు ♦ సత్యరూపు, విశ్వరూపుని నాద్యుని ♦ విశ్వనాథు
విశ్వసంహారకారుని ♦ విశ్వకరుని, శంకరుని జ్ఞానబీజునిఁ ♦ జక్కఁగాంచి. 266

ఉ॥ దవ్వులనుండి నమ్రుఁడయి ♦ తత్పదయుగ్మముఁజేరి మ్రొక్కఁగా
నవ్విధుభూషణుండు దను♦జాధిపుఁ గన్గొని దానవేంద్ర! నీ
విప్పుడు సుఖంబెసఁగ ♦ నేలుచునుండుము నాకలోకమి
మ్మవ్విబుధాళి కట్లయిన ♦ నందఱుఁ జెందెద రిష్టసౌఖ్యముల్. 267

ఆ॥ పరులకష్టములను ♦ బాటింపకెంతయుఁ, దనదుసౌఖ్యములనె ♦ తలపరాదు
సంతసంబెసంగ ♦ సకలజనంబుతోఁ, గలసిమెలసిమనుట ♦ కర్జమెపుడు. 268

ఉ॥ నీవును ధేనులోకమున ♦ నెక్కొని మున్ను మహాత్ముఁ గృష్ణునిన్
సేవయొనర్చు గోపుఁడవు ♦ సిద్ధము; రాధికశాప మొంది యి
ట్లీవిధి దానవుండవయి ♦ యెంతయు నొప్పితి వట్లు గాన నీ
భావమునందు నీరసను ♦ బాయుము డాయుము మేల్మి మచ్చికన్. 269

గీ॥ అట్లుగాకున్న రణము సే♦యంగఁ గడఁగు
వేఱుతీరుఁ దలంపక ♦ వీరమూర్తి!
సర్వమును నారయఁగఁజాలు ♦ జాణ వీవు
న్యాయమగు తెరువును జెంది ♦ నడుచు టొప్పు. 269

వ. అనిన యసురేంద్రుండు తీవరంబుచెందక మొలకనవ్వొలుక ఫాలవిలోచనునితో
నిట్టులనియె.

ఉ॥ దేవర సన్నిధానమునఁ ♦ దెంపునఁ బల్కెదఁ గొన్నిపల్కులన్
భావమునందు వానికయి ♦ పర్వఁగఁజేయకుఁ డల్కనాయెడన్
దేవత లేము జ్ఞాతులము ♦ దెబ్బకొనుచుండుము పోరుచుండు మా
దైవవశంబునన్ సిరులఁ ♦ దాకొనుచుందుము మేమె వారలో. 271

గీ॥ వారికై తమరెత్తి రా♦వలయు నొక్కొ?
ఇదియె కడు న్యాయమొక్కొ! మా ♦ యదియె న్యాయ
మునకు దవ్వొకొ? నీవును ♦ బుండరీక
నయనుఁడును సల్పిన దురముల్ ♦ న్యాయములొకొ? 272

సీ॥ మధుకైటభులఁ గోడి ♦ మాయతో దేవుఁడిం, చి వధించె నవ్వారి ♦ శ్రీవిభుండు
త్రిపురరాక్షసుల నెం♦తేని మోసముచేసి, యలయించిచంపితి ♦ వయ్య నీవు
అమృతంబు సురలనే♦యారగింపఁగఁజేసి, రాహు నోర్వకచంపె ♦ శ్రీహరి వగ
తారకముఖ్యులౌ ♦ దైత్యులఁ గొమరుచేఁ, దునుమాడఁజేసితి ♦ వనఘ ! నీవు
గీ॥ మమ్ము జేజేలనొక్క స♦మానముగను, జూడకిటు పక్షపాతపుఁ ♦ జూపుఁజూడ
నగునె ? సకలేశ్వరులకిది ♦ యర్హమౌనె?, దివ్యచిత్తంబునకుఁజక్కఁ♦దెమ్ము దేవ !

వ. మఱియు నేదెట్టులైనను.

ఉ॥ ధీరతఁ బాసి మోటువడి ♦ దీనతనొందఁ దలంప దేవ! దు
ర్వారము కర్మబంధమని ♦ ప్రాజ్ఞులు వల్కెద రద్ది నమ్మెదన్
దీరుపు మొగ్గరం బదియె ♦ దీర్చెద నోర్చెద మీబలంబులన్
సారెకు దివ్యవర్గములఁ ♦ జక్కడగించెదఁ గాంచెదన్ బ్రథన్. 274

క॥ అని యిట్లు విన్నపంబును, బొనరిచి చని కట్టెదురుగ ♦ భూరిదనుజసే
నను మొగ్గరంబుఁ గూరిచి, ఘనమగు రణవాద్యరవముఁ ♦ గావించెఁదగన్.

క॥ అది విని దివ్యులు ప్రమథులు, గదనమునకుఁ గదలి వేడ్క ♦ గడలుకొనఁగసాం
పు దలిర్చు వ్యూహమమరిచి, ముదమున సింహధ్వనులను ♦ బొనరించి రొగిన్.

గీ॥ ఇరుదెగలవార లంతనె♦హెచ్చుమీఱు, మచ్చరంబునఁ బవరంబు ♦ విచ్చలవిడిఁ
గడఁగి తాఁకిరియొండొరుల్ ♦ఖడ్గముసల, హలగదాశక్తిహస్తులై ♦ యద్భుతముగ.

సీ॥ ఏనుఁగురౌతుల ♦ శ్లేన్గరౌతులతోడ, రథికులట్టులు మహా ♦ రథులతోడ
గుఱ్ఱపురౌతులు ♦ గుఱ్ఱపురౌతుల, తోడ బంటులు బంట్ల ♦ తోడఁ బెనఁగు
చుండిరి మడియుచు♦నుండిరి తలలును, గరములుఁ బదములు ♦ స్కంధములును
గూలుచునుండెను ♦ గుట్టలయట్టులు, కరులును హరులును ♦ సురిఁగి పుడమిఁ
గీ॥ గూలుచుండెను నెత్తురుల్ ♦గొప్పవాఁగు, లగుచుఁ బ్రవహించుచుండెనం♦దక్కజముగ
విఱిగియొరిగిన యరదముల్ ♦విరివిగాఁగ, నగబడుచునుండెఁ బడవల♦నాడెముగను.

వ అంత యోధాగ్రగణ్యులగువారలలో సమరంబునకుఁ దలపడి యన్యోన్యమిట్లు దాఁకిరి.

## —* ప్రమథదేవాసుర సమరము *—

సీ॥ వృషపర్వుతో గోత్ర♦భేదియు నవ్విప్ర, చిత్తితో నుష్ణర ♦ శ్మియును దంభు
తో నచ్యుతుఁడు కాలు♦తోడ దండధరుండు, గోకర్ణుతో నగ్ని ♦ పీఁక మీఱు
కాలకేతునితోడఁ ♦ బౌలస్త్యుఁ డమ్మయు, తో విశ్వకర్మ సం ♦ తోసమొప్ప
నాభయంకరునితో ♦నలమిత్తి చంచలు, తోఁగాద్పు ఘటపృష్ఠు♦తోడ బుధుఁడు

గీ॥ ఒరసి రక్తాక్షుతోఁ శనై ♦ శ్చరుఁడు కావ్యు, తోఁ గురుఁడు రత్నసాలుని ♦ తోఁ జయంతుఁ
డష్టవసువులు వర్చశ్చ ♦ యంబుతోడ, నా ధురంధరుతోఁ ధర్ముఁ ♦ డనిఁ బెనఁగిరి. 280

వ. మఱియు దీప్తిమంతునితో నాశ్వినేయులును, గణకాక్షునితోఁ గుజుండును, రాహువుతోఁ జంద్రుండును, ప్రభాకరునితో విశ్వేదేవులును, బిపిటునితో మన్మథుండును గోకాముఖచూర్ణఖడ్గధూమ్రసింహవిశ్వప్రతాపపలాశులతో ద్వాదశాదిత్యులును, పదునొక్కండు భయంకరులతోఁ బదునొక్కరుద్రులును, ఉగ్రదండాదులతో మణిమంతుండును మూలరాక్షసబలంబులతోడ నందీశ్వరాదులును యుద్ధంబునకు డీకొని పొనర్చుచుండిరి. 281

క॥ హరుఁడు వటమూలమందుఁ గొ, మరుతోడఁ గాళితో స ♦ మరమును గనుచున్
హరువుగనుండె నసుర బం, గరు గద్దియ నెక్కి పోరుఁ ♦ గనుచుండె రహిన్.

ఆ॥ చాలదినములిట్లు ♦ శైవబలంబులు, వేల్పులెల్ల దనుజ ♦ వీరవరుల
తోడ నాజిఁ బెనఁగి ♦ దోర్బలంబున వారి, తోడఁ బీడపడుచుఁ ♦ ద్రుంగుడుపడ,

చ॥ అరసి గుహుండు కాళికయు ♦ నాలముఁ జెంది స్వపక్షకోటికిన్
బిరుదుతనంబు చేకుఱఁగ ♦ బిట్టుగ దైత్యచమూసమూహముల్
బొరిగొని జొన్నకోఁతవలెఁ ♦ బొల్పడఁగించుచునున్నఁ గాంచి తీ
వరమున శంఖచూడుఁ డని ♦ వార్యబలుం డటఁ జేరి వారలన్. 284

క॥ పిడుగులఁ బోలిన శరముల, వడివడిఁ గురిపింప వేగ ♦ భర్గాత్మజుఁ డ
ప్పుడు వాని నెడము సేయుచుఁ, గడువడి రక్కసుని మోఁదె ♦ ఘనతరశక్తిన్.

క॥ వారిరువురు శక్తులతో, ఘోరంబుగఁ బోరిపోరి ♦ కుంఠితు లగుడున్
మీఱి దనుజేంద్రుఁ డండఁ గు, మారున్ మూర్ఛిలఁగఁజేసె ♦ మహితశరహతిన్.

వ. అంతఁ గాళిక కుమారున్ దత్క్షణంబున నెత్తికొని పరమేశ్వరుసన్నిధికిన్ గొని పోయినంతనె మహాసేనుండు గన్నులువిప్పి మరలఁ బ్రబుద్ధుండై బలంబుఁ జెంది యిందుశేఖరు సెలవొంది బవరంబుఁ జెందె నింతలోఁ గాళిక మిగిలి సకలాయుధంబులతో నసురబలంబులనెల్ల నిర్మూలంబు గావించుచు శోణితంబుఁ ద్రాఁగుచు వీరనృత్తం బొనర్చుచు శంఖచూడునిపై గవిసి గదాదండంబున బిట్టేసిన నతండు వ్రేటుఁబడియు నిల్వరించుకొని కఱకుటమ్ములఁ గాళిం బొదవిన నాయమయు నబ్బాణంబుల నిజశరంబులఁ జూర్ణంబొనర్చి సకలాస్త్రంబుల దానవేంద్రుపైఁ బరఁగింప నవ్వాఁడట్టియస్త్రంబులతో నవ్వాని మరల్చినఁ గినుకతో నామె పాశుపతంబు యోజించుచున్నంత నభోవాణి యెలుగెత్తి వీఁ డద్దానిచే సురుఁగఁడనియు మహేశ్వరునిచేఁ ద్రిశూలంబునఁ దెగుననియుఁ జెప్పిన భద్రకాళి యుద్ధిమాని

యితరరక్షస్సులఁ జెండి భక్షించుచు శివున కత్తెఱఁగెఱిఁగించె నంత గీర్వాణసంబో
ధితుండై మహేశ్వరుండా యోధనంబుఁ జేయునెడ శంఖచూడుఁడు పరికించి చూచి.

—* శివుఁడు శంఖచూడుని వధించుట *—

సీ॥ పెనుగదన్ శివునిపై ♦ విసరివేసిన సట్టి, గదచేతఁ బొడిచేసెఁ ♦ గాలహరుఁడు
ఖడ్గంబు శంకరుఁ ♦ గదసి వేయ హరుండు, పరశువుచేఁ ద్రుంచె ♦ పలు పొనర్చె
శక్తినిఁ ద్రిప్పి యీ♦శ్వరుపై విసర శూలి, భిండివాలమ్మునఁ ♦ బిండిచేసె
ముసలమ్ము బిట్టేయఁ ♦ బురహరుఁ డద్దానిఁ, జెల్చె ఖడ్గంబుచేఁ ♦ జేవమీఱి
గీ॥ అంతఁ దోఁచక విభ్రాంతుఁ ♦ డగుచు ధనువు
లాఁగి వాఁడిశరమ్ముల ♦ వేగ దుదుమి
తనువుఁ దూర్చిన వాని నెం ♦ తయును సరకుఁ
గొనక కాలాంతకుఁడు గడుఁ ♦ గినుకఁ గదిసి.

క॥ జాలమును మాని రిపుజన, మాలాసంహారకరణ ♦ మహితతరంబౌ
శీలమును శూలమునుగొని, మేలుగ నద్దానవేంద్రు ♦ మీఁదన్ వేసెన్. 289
గీ॥ దాన నసురుండు సమసెను ♦ బ్రాణ మొగసి, గోపుఁడై వేగఁ జెందెను ♦ గోభవనము
విరులవర్షంబు శివునిపైఁ ♦ గురిసె మొరసె, దివ్యదుందుభిరవము లెం ♦ తేనిమీఱి.

—* విష్ణుమూర్తి శంఖచూడరూపంబునఁ దులసితోఁ గ్రీడించుట *—

వ. అంత హతశేషులగు రక్కసులు పలాయితులై పాతాళంబుఁ జేరిరి. దేవతలు మహేశ్వరునిఁ బ్రస్తుతించి యవ్వారిఁదిమగ రాజతాద్రిన్ జేరిచి సెలవొంది స్వస్థానంబులకుఁ జేరి సుఖించి రొక్క పుండరీకనయనుండు శంఖచూడ సతియగు తులసి మిగుల యందకత్తెయగు టెఱింగి యాసుందరాంగి సౌందర్యగోరి యోగబలమ్మున శంఖచూడ రూపంబుఁ జెంది రథియై నగరుసొచ్చి పౌరులచేఁ గానుకలొంది యవరోధంబుఁ జేరిన సతియగుతులసి సంతసంబున జీవితేశుండనితలంచి యుద్ధజయంబెట్లు పొసఁగెనన్న నతండు పెద్దకాలంబు యుద్ధంబొనర్చి జయంబిరువురకు సమకూరకున్నఁ జతురాస్యుండు దటిసి నాకంబుఁ బాకారికిచ్చునట్లొడంబఱచి సంధిపొసగించెననియు నంతమీఁద దానిట్లు వచ్చితిననియును జెప్పిన నాయొప్పులకుప్ప మిన్నంది సంతసంబునఁ గౌఁగిలించుఁడుఁ గేశవుడభీష్టసుఖంబులొందె నంతఁ గొంత కాలం బప్పగిది నప్పాటలాధరి హరితో భోగంబులొందుచుఁ గొన్నినాళ్ళకు దేటమాటలఁ జూపుల సురతక్రీడాకౌశలంబుల భేదంబుల వార లారసి లాఁతిపూరుషుండని యెఱింగి యోరీ! నీవెవ్వఁడవు నిజముసెప్పుము తక్కినశపింతునన్న వైకుంఠుండు నిజరూపంబుఁ జూప నప్పడఁతి యేవగించి వగచి యసూర్యంపశ్యయగు తన్నిట్లు మోసగించి చెరిచిన గరుడకేతనుఁ గాంచి యిట్లనియె. 291

గీ॥ పాపమును బున్నె మును లేదె ♦ బంఢ! నాదు, శీలమంతయు నష్టేటఁ ♦ జెందనిట్లు
దుండగంబొనరించితే ♦ దోసకారి!, మొండిశిలవయియుండుము ♦ గండడంగ. 292

వ. అని శాపం బొసంగి విభుండు హాలియు వెఱంగి యక్కురంగలోచన పెద్దయెలుం
గున రోదనంబు సేయఁగఁ వారించి నీరజాక్షుం డిట్లనియె. 293

గీ॥ చెలువ! గోలోకమునననున్నుఁ ♦ గొలుచుచున్న, సతివి; నాయంశజాతుఁడౌ ♦ శంఖచూడు
వడఁతిన్నైతి విప్రునసునఁ ♦ బరఁగఁ దిగుగఁ, జేరు గోలోకమున కిప్డు ♦ చింతఁ బాసి.

—* తులసీ శంఖచూడులు విష్ణులోకంబుఁ జెందుట *—

వ. అందు రాధతోఁ పాటు నన్ గూడియుండు వీఁక నీతనువున గండకియను నది
యుత్పన్నయగు నద్దాన నేనును నీశాపప్రకారంబు సాలగ్రామశిలలగుదును,
నవ్వాని వజ్రకీటంబులు దొలిచి చక్రంబుల నిర్మించు మఱియు నీవు వేఱొండు
రూపంబునఁ దులసీవృక్షంబవై షోడశ దళముల విరుల నాకామోదంబుఁ
గూర్తువు. నీ పతియగు శంఖచూడుని యస్థిశకలంబులన్నియు శంఖంబులై యుద్భ
విల్లు నట్టి శంఖోదకంబుతో నన్నభిషేకించుట కరంబు మోదంబిడు. తులసీసాల
గ్రామశంఖంబు లొక్కెడ సంతరించి పూజించువార లైహికా ముష్మిక ఫలంబు
లొందుదు రని యంతర్హితుండైనఁ దులసియు నట్లే దేహంబుఁ బరిత్యజించి గోలో
కంబుఁ జేరె. ఇఁక నాయువతనువున గండకి యనునదియును దులసీవృక్షంబును
జనించిమించె. విష్ణుండును గండకీనదియందు సాలగ్రామ శిలారూపంబులొందె. శంఖ
చూడుని యస్థులెల్ల మున్నీట శంఖంబులై యొసఁగె నిట్లు శంఖచూడవధోపాఖ్యా
నంబు సర్వంబెఱింగించితి నిద్దిశ్రోతలకున్ బాఠకులకు భోగమోక్షంబులొసఁగు
నిఁక బాణాసురగాణాపత్యకథనం బెఱింగింతు వినుండని సూతుండిట్లనియె.

—* బాణాసుర చరిత్ర ముషాపరిణయము *—

క॥ ఘనుఁడు బలిసుతుఁడు బాణుం, డనితరబలవిక్రముఁడు స♦హస్రభుజుఁడు మే
దిని శోణపురి వసింపుచు, ననిమిషులను గెలిచి యొడిసె ♦ నాత్రిదివంబున్.

క॥ అందుఁదనవారి దొరలుగఁ, బొందించి వసింపఁజేసి ♦ భూతలమునఁ దాఁ
బొందికనుండె వియచ్చరు,లందఱు నవ్వానిఁగొలుతు ♦ రతిజాగరులై. 297

చ॥ ఒకపరి నాతఁ డీశ్వరుని ♦ యొద్దకుఁజేరి సహస్రపాణులన్
రకముగ వాద్యనిస్స్వనము ♦ రాజిలఁ దాండవమున్ బొనర్పెడున్
సకలజగన్నియంతయగు ♦ శంకరుఁ డర్మిలిఁజెంది యోరి! కో
రిక వెఱిఁగింపు,మిచ్చెద బి♦తీన వరంబు కరంబు ప్రీతిమై. 299

గీ॥ అనుడు నవ్వాఁడు మఱిసిమ ♦ హాత్మ! నన్నుఁ, జాలసము సేయ నాకోట ♦ వాకిటను భ
వజ్జనంబులతో నుండ ♦ వలయు నిదియె, వరమనిన శర్వుఁ డట్టులే ♦ వత్తుననియె.

## —— * శివుఁడు బాణాసురునకు వరంబిచ్చి శోణపురికి వచ్చియుండుట * ——

క॥ భోళాశంకరుఁ డిట్టుల, శైలం బవ్వేళ యుండె ♦ వాసియలర సి
ద్ధాళులతోఁ దనయులతో, హాళిఁ బ్రమథు లలరఁ జేరె ♦ నాసురనగరిన్. 300

గీ॥ సురలు గంధర్వులు మును ల ♦ ప్సరలు నచటఁ, జేరి శంకరుఁ గొలుచుచుఁ ♦ జింతఁ దక్కి
యుండి రిఁక జగముల నేలు ♦ చుండె బాణ, దైత్యుఁ డెదురొండు లేక యు ♦ దగ్రుఁ డగుచు.

వ. అంత గొన్నినాళ్ళకు

ఉ॥ అప్పురి చెంగటన్ వెలయు ♦ నట్టి ధునీతటిఁ దోట నొక్కనా
డప్పురవైరి యొప్పుగ వి ♦ హారము చేయుచునుండె నత్తఱిన్
గుప్పె సుగంధవాతములు ♦ కోయిలలున్ మఱి గోరువంకలుం
గొప్పగ గానముల్ సలిపెఁ ♦ గుంపములింపుగఁ బూసి భాసిలెన్. 302

గీ॥ మఱి యశోకద్రుమంబులు ♦ మాలతీ ల, తలును సంపఁగి మ్రాకు లెం ♦ తయును విఱియఁ
బూసెఁ జెన్నొందెఁ గలువలుఁ ♦ బుండరీక, ములును బలుతీరులొప్ప వి ♦ స్ఫుటతమిగాత్రె.

క॥ ఆసమయంబుననే బా, ణాసురసుత యుష యనుఁగువ ♦ యస్యలతో సం
తోసంబుగ వనకేళీ, వ్యాసక్తాత్మమున నటకు ♦ వచ్చి ప్రియముగన్. 304

వ. చెలులుం దాను నచ్చరమచ్చకంటులతోఁ గూడి యుద్యానంబున నుల్లంబు రంజిల్లఁ బలుతెరంగుల విహరింపుచు బెల్లగు నుల్లాసంబున నిట్లన్యోన్యము సల్లాపంబులొనర్పుచుండిరి. 305

## —— ♦ వృషభగతిరగడ ♦ ——

రమణి రమణీయమగు పుప్పప ♦ రాగ రాగముఁ జెందె మంకెన
కమల కమలావళిఁ గలామిషఁ ♦ గావఁ గావన మొందె జంకెన
ఘనమ ఘనమాకంద మెక్కెనఁ ♦ కానకానగువగల నిండఱ
కొనక కొనకరవీరమంజరిఁ ♦ గోరగోరంటలను ముందఱ
నవనవస్ఫుటకుసుమతతి నా ♦ నందమంద నొసఁగెనశోకము
అవునవునె నీపాదఘట్టన ♦ మందియుండె సుమాభిషేకము
ప్రియద ప్రియదాశ్వాస లభ్యవి ♦ భావిభావిని సింధువారము
సుమన సుమనతిసేయు నీనుడి ♦ సొంపుసొంపుల కర్ణికారము
అలికి నలికెడ వేల సంపగు ♦ లవేయవే మొగమెత్తి చూడుము
అలరు నలరులఁ గురిసి పేర్మిఁ గణ ♦ మదిగొమదిగొని వేడ్కఁ బాడుమ

నాకు నాకుటజములఁజూపిన ♦ నారి నారి కడంబులిచ్చెద
పోకపోకలఁ బ్రాకి జాదుల ♦ పొదల పొదలికఁజూడు వచ్చెద
మొగలి మొగలివె చిదుప చమురుగ ♦ మొల్ల మొల్లపు గుంపుఁగోసిన
బాగడఁ బాగడఁగనేల నేసుర ♦ పొన్న పొన్నలె యిన్ని పూసిన
తొగలతొగలఁ గనంగ నేలాకో ♦ తొంగితొంగి యనుంగుసోదరి
అగములగముల నరయ నేలాకో ♦ యదేయదే మందారమీదరి
కదలికదలినఁ గుప్పఁగుప్పనఁ ♦ గప్పఁగప్పురపుం వలంపులు
పొదమ పొదవల్లియలు వెల్లిగ ♦ బొనలుఁబొదలు రహిం దలంపులు
చెలువచెలువపు గతులయందము ♦ చిలుకచిలుకకుఁ బాటనేర్పుము
కలికికలికి నెవలియిదే చా ♦ క్కఁపురకపురహి నాటఁదీర్పుము
లేతలేతలకుచములేటికి ♦ లేమ లేమావులకుఁ దారుము
నాతినా తిలకమునుగని పు ♦ న్నాగనాగము నెక్కఁజేరుము 306

క॥ తరుణ సహకారతరువును, దరుణియటుల్ మాగధీల ♦ తాతిలకము సుం
దరకుసుమస్తబకయిదే, వరించిపెసఁగొనెఁ గనుండు ♦ వనజాతముఖుల్. 307

వ. ఇట్లాడుకొనుచు నవ్వులనవ్విరుబోణులు జవ్వనంబుసింగారంబులు మెఱయం
బువ్వులుగోయుచు వినోదంబులుసేయుచు నానందంబుగందళింప నందు విహారంబు
సేయుచుండుడు. 308

గీ॥ అట్టితటి దయితాసంగ ♦ మభిలషించి, హరుఁడు నందినిఁగని రావ్య ♦ ధరముఁజేరి
మండనముఁజెంది రమ్మను♦మా గిరీంద్రి, జాతనిచ్చోటికనఁజక్కఁ ♦ జనియతండు.

క॥ వేగఁజని దేవదేవికి, వేగమె కై సేసి శివుఁడు ♦ విచ్చేయుమనెన్
జాగొనరింప వలవదన, నాగిరిజయుఁ జొళ్ళియంబు ♦ నవుచుచుచు వడిన్. 310

క॥ నీవేగుము వచ్చెదనిఁక, దేవాధీశానుసన్ని ♦ ధికి నందీ! యటం
చా విశ్వజనని పల్కిన, నావాఁడటు శివునిదండ ♦ కరిగి వచించెన్. 311

వ. అంతఁ బువువింటివానియులజడి కోర్వక మట్టుమీఱిన దమకంబున నగ్గట్టువిలు
దొర నందినిఁ జూచి. 312

గీ॥ ఓరి! బసవన్న! యిల్లాల ♦ యురక వచ్చి, నాఁడ వచటికిఁ జనియుఁ బూఁ♦బోడి నిటకుఁ
దోడితెమ్ము మరలఁ బొమ్ము♦తొందరింపు, మనుడు రోజుచునతఁ♦ డుకాశ్యాద్రికేగ

ఉ॥ అత్తఱి నత్తెఱంగరసి ♦ యచ్చరలున్ మఱి యందమొప్ప లే
బిత్తరు లింకఁ గొంద ఱిదె♦వేళ మహేశ్వరుఁజెంద నిందు నే
మత్తగశేంద్రియాన శివు ♦ మన్ననలొంది విహారమొందు నా
పుత్తడిబొమ్మ యందఱకుఁ ♦ బూజ్యయగున్ త్రిజగంబులందునున్. 314

చ॥ అని యిటు నెల్లరాడ నృప ♦ భాండుని పుత్త్రిక చిత్రరేఖ యున్
వనజముఖనేత్రి యిట్లనియెఁ ♦ బన్నగశాయుఁడు మున్ను మోహినీ
తనువున శంభుమూర్తి కెటు ♦ దర్పకరాగము నివ్వటిల్లఁజే
సెనో యటు లేను గొరినయి ♦ చిత్తము నుత్తలమొందఁజేసెదన్. 315

గీ॥ అనుచు వేగ ఘృతాచి దా♦నమరెఁ గాళి, రూపమున నట్టె చండిక♦రూపమొందె
నట్ల విశ్వాచి సావిత్రి♦యయ్యె రంభ, మేన గాయత్రియయ్యె స♦మేళమొప్ప. 316

—* ఉష పార్వతీరూపంబు నొందుట *—

క॥ జయ పుంజకస్థలియు వి,జయ సహజని యయ్యె బాణ♦జయునకు నుషయున్
బ్రియ చిత్రరేఖ మదిఁగొని, రయమున నీహారశైల ♦ రాట్సుత యయ్యెన్. 317

గీ॥ యోగవిద్యావిశారద ♦ యుష గిరీంద్రి, జాతనువుఁ జెంది దివ్యల ♦ క్షణమనోజ్ఞ
మూర్తిదైనఁగనుంగొని♦ముదితలెల్ల, మురిసిరెంతయులోన న♦బ్బురముఁగొనుచు.

వ. అంత

క॥ వీరందఱు శివనికటముఁ, జేరి విలాసము లెసంగ ♦ సింగారము దై
వారఁగఁ దిఱుగఁగఁ దమిసే, కూరశపోయెను హరునకుఁ ♦ గొంచెంబేనిన్. 319

గీ॥ అంత జగదీశకాంత న♦గాధిరాజ, పుత్త్రి గై సేసివచ్చి వి♦భున కెఱంగి
అచటిపొలఁతులయాకార♦మరసిమురిసి, యుషనుగనుఁగొనిపల్కె మే♦లొప్పనిట్లు.

—* పార్వతీదేవి ఉషారూపంబుఁజూచి మెచ్చి వరంబిచ్చుట *—

క॥ బాలరో! నారూపంబిటు, మేలుగ నొందితివి తమిని ♦ మేకొని దైవక
నీలలితాకారమునకుఁ, జాలఁగ మెచ్చితిని వరముఁ ♦ జక్కఁగొనుమిఁకన్.

సీ॥ తరుణి! మాధవసిత ♦ ద్వాదశినాఁ డుష, వాసంబుఁ బొనరించి ♦ పవ్వళింపు
మారాత్రి నిశీథ♦మందు నీకలలోన, నీకోరినట్టుల ♦ నీకు విభుఁడు
శర్వాంశజాతుండు ♦ శంభుభక్తాగ్రిణి, చక్కనివారిలోఁ ♦ జక్కనయ్య
నీయిష్టమీడేర ♦ నిన్ను భోగంబులఁ, దనుపు నీకు మగఁడఁ ♦ తండెకాఁగ

గీ॥ లండనివరంబొసంగి యా♦లలిత యందు, శివునితో భోగసౌఖ్యముల్ ♦ చెందియలరె
వేషధారిణులందఱు ♦ విశ్వవిభుని, మనమునకు మెచ్చి ♦ యిండ్లకుఁజనిరి వేగ. 322

వ. ఉషయును సంతసంబున శివావచనప్రకారం బొనర్పఁబూని సమయంబు నిరీక్షించుచుండెనంత బాణాసురుం డెందును దన్నును గెలుచునట్టివానిని బ్రతియోధు నొకనిఁ గానక.

గీ॥ తన్నుఁగాయఁగ గోపుర♦తలముఁజేరి, యున్న నిఖిలేశ్వరునిఁగని ♦ యోడకిట్లు
మకురుతనమున నడ్గె శా♦బకహిమాంశు, మకుట! యొకవిన్నపంబిది♦మదినిఁజేర్పు.

ఉ॥ చేతులు పెక్కొసంగితివి ♦ చేవయు లావును వాసిమీఱు నీ
చేతులకున్ బరాబరిగఁ ♦ జెన్నలరించితి వయ్య! యెందు నీ
చేతులతీటఁ దీర్పఁగల ♦ చెల్వగుశూరునిఁ గాంచకుంటి నీ
వే తొలగింపఁగావలయు ♦ నీదురదన్ జగదేకశంకరా! 324

గీ॥ తోడరి పెనఁకువ నాతోడఁ ♦ దునియఁ జేయు
మీభుజంబుల నొకగుట్ట ♦ మొత్తుగాఁ బు
రాంతక! యటుల్ మదిని నిచ్చ ♦ గింతు ననుడుఁ
గడుఁగినుకఁ జెంది యిటులనెఁ ♦ గాలహరుఁడు. 325

ఉ॥ ఓరి దురాత్మ! యోతులువ! ♦ యోరికృతఘ్న! పలాదపాంసనా!
నోరెటు వచ్చెరా యిటు న♦నున్ దురమాడఁగఁ బిల్వ నిష్ట నీ
కీరహియెల్ల నే నిడిన ♦ దేకద సైనను నీదుకోర్కె యీ
డేఱును మత్సమానుఁడు ల♦యింపఁగఁ జేయును నీదుబాహులన్. 326

గీ॥ అది యచిరకాలమున నెద్దై♦త్యాధమా! పొ
సంగు భవదీయ మాయుధ ♦ శాలనుండు
నా మయూరధ్వజం బెపు♦డవనిఁ గూలు
నపుడె చేకూరుఁ బెను విగ్ర♦హంబు నీకు. 327

వ. అనిచెప్పిన ముదితుండై చని బాణుండు ప్రత్యహంబు మయూరధ్వజపతనంబు నిరీక్షించుచుండెనంత మహేశ్వరీవచనప్రకారంబు మధుమాసశుద్ధ ద్వాదశియందు.

గీ॥ ఉష యుపాసముచేసి మే♦లొప్పనాఁటి, రేయిఁ దామరసాక్షు న♦ర్చించి యంతఁ
బవ్వళించిన నడురేయిఁ♦ బార్వతీవ, రమునఁ గృష్ణుమనుమఁడు దా♦రసిలి రహిని.

—* ఉష యనిరుద్ధునితో స్వప్నమున భోగమొందుట *—

గీ॥ మేలుకొలిపి దనుజరాజ♦బాలనొడిసి, దృఢపరిష్వంగమునఁ దేర్చి ♦ తీయవిల్తు
భోగములనెంతయేని స♦మ్మోదమొదవఁ, జేసి యంతనె ద్వారకఁ ♦ జేరెమరల.

వ. తెలవాఱినయంత నాబాణాసురదుహిత మేల్కాంచి పాన్పున విభునిం గానక శుద్ధాంతంబంత వెదకి వేసారి తాఁ జెలువునితోఁ గలయుట కలయనుట కొడంబడక నిక్కంబకా నమ్మి యుమ్మలికమ్మునఁ బొగులుచు మజ్జనభోజనసుగంధానులేపనవేణీమండనాదికమ్ము లుజ్జగించి హృదయేశార్పితచిత్తయై బెండువడి యలందురుచుండుడు నంత మంతనంబునఁ జిత్రరేఖ దారసించి కతంబడుగ ననుంగు సఖియగుటెఱింగి యగ్గాణవలన తన మనోరథంబీడేఱునని తలంచి బెట్టు సేయక యిట్లు వక్కాణించె.

ఉ॥ అక్కరో! చెప్పెదాన విను ♦ మద్దమరాతిరి నాదు సెజ్జలోఁ
జొక్కపు లేఁతజవ్వనపు ♦ చూపరి యొక్కఁడు చేరి యెక్కుడౌ
మక్కువ బిగ్గ కౌఁగిళుల ♦ మానస మూరఁగఁ జేసి ధీరతన్
జక్కెరవిల్తు చెద్దుముల ♦ సంతసపెట్టి చనెన్ యథేచ్ఛమై.

ఆ॥ ఎచటివాఁడొ? జాతి ♦ యేదొ? యెట్టులనిట, కేగుదెంచెనో? మ ♦ ఱీడనుండి
మరలయెందుఁజనెనో? ♦ మానిని! వానినేఁ, బడయఁగలనొ? లేదొ!♦భాగ్యమెట్లొ?

చ॥ చెలియరో! వాని నీవరసి ♦ చెచ్చెర నిచ్చటఁ జేర్పకున్న నీ
చెలి కిఁక నీళ్ళువోయనగు ♦ సిద్ధము; మాంత్రికయోగసిద్ధికిన్
బలు తెఱఁగుల్ దనర్పఁగల ♦ ప్రౌఢిక నీకెవ రీడువత్తు రో
యలికులవేణి! నాదుబ్రదు ♦ కంతయు నీవశ మెక్కు డేటికిన్. ౩౩౪

ఆ॥ అనుచు నేలవ్రాలి ♦ నట్టి యాబాలేందు, నిటులఁ జూచి మిగుల ♦ నేర్పులాఁడి
యైన చిత్రరేఖ ♦ యుభయహస్తముఁజూపి, యనియెఁ జెలిమికలిమి ♦ యలరనిటులు.

ఉ॥ వెంపరలాడబోకు మిటు ♦ వేదురుచెంతకు సుందరాంగి! నీ
సొంపగు చెల్వమెవ్వరికిఁ ♦ జోద్యముగా మరులూరఁజేయ దే
యింపగువానికో యమరె ♦ నిట్టి మహోన్నతభాగ్య మర్థినె
లింపుల దానవేశ్వరుల ♦ లీలగ నేలువతండు రూఢిగన్.

—* చిత్రరేఖ చిత్రపటంబులను వ్రాసి చూపుట *—

చ॥ బెదరెదవేల? నీప్రియుఁడు ♦ విశ్వమునం దెటనున్నఁ బట్టి తె
చ్చెద ముదమున్ బొనర్చెదను ♦ జిత్రపటంబుల వ్రాతుఁ జూడుమీ!
త్రిదశుల దైత్యపుత్రుల స ♦ రీసృపమానవరాజసూనులన్
గుదురుగఁ జూచి తెల్పు మిఁకఁ ♦ గోమలి! నీమది నున్న రూపసిన్. ౩౩౫

వ. అనియిట్లు చిత్తరువులను వ్రాసి చూప నద్దనుజేంద్రకన్యక పటంబులనెల్లఁ దిలకించి యందుఁ గృష్ణపౌత్రుండగు ననిరుద్ధపటంబుఁజూచి బెదరి సిగ్గుజెంది మరల ఱెప్ప వేయక చూచి మురిసి తలవంచి జాఱుపాపట్టుకుప్పసంబుపైఁ జలువపయ్యెఁదము సుంగును జక్కఁజేసికొని చక్కన నక్కొమ్మ కిట్లనియె.

చ॥ సకి! యితఁడే యితం డిఁకను ♦ జక్కఁగ నద్దమరేయి నాదు సె
జ్జకుఁ జనుదెంచి మానధన ♦ చౌర్యముఁజేసిన టెక్కులీఁడు ని
ల్వకచనె నెందొ వేగఁ జెయిఁ ♦ బట్టుదునో యను శంకఁజేసి తా
నకమహనీయమంత్రగతిఁ ♦ బట్టుకరమ్మిఁక నాదుచెంతకున్. ౩౩౬

వ. మఱియు వీని రూపంబు నారసిన నుత్తమరాజపుత్త్రుండనియెఱుకసేయు. నాఁడు భవాని యొసంగిన వరంబందునను నిశీథలబ్ధపూరుషుండే విభుండగునని చెప్పుటచేత

నుత్తమకులునిగాక యన్యుని నమ్మాన్యచరిత్రి యెట్లు వక్కాణించు మఱియు
నీసంఘటనంబుగూడఁ దత్ప్రసాదంబుగఁ దలంతునైనను వీని కులగోత్రనామ
ముల నెఱుక సేయుమన్న నచ్చెలువమిన్న యలరియిట్లనియె.

ఉ॥ ద్వారక గోపురంబు యదు ♦ ధన్యుఁడు కృష్ణునిపౌత్రుఁ డన్నిటన్
జేరునఁ బెంపుఁ జేకొనిన ♦ వీరుఁడు శంబరవైరిపుత్త్రుఁడున్
శూరుఁడు ధీరుఁడున్ మిగుల ♦ సుందరుఁడౌ ననిరుద్ధుఁ డీతనిన్
గూరిచె గౌరి నీదుపయిఁ ♦ గూరిమిఁ బైఁడికి వజ్రమట్టులన్. 337

క॥ అనినఁ గడుమురిసి తాఁ జిన,తనమానిగ విష్ణుభక్తి ♦ తత్పర యగుటన్
వనజాక్షుని మనుమని దా.రను జేసెను గౌరి యనుచు ♦ రంజిలివేగన్. 338

చ॥ చనుమిఁక పోరంబటకుఁ ♦ జాతురి మాంత్రికయోగశక్తియున్
బెనఁగొని తేజుమీఱ యదు ♦ వీరునిఁ దెమ్మిటకుం బ్రియమ్మునన్
పెనుపతి మిత్తి పాతఁబడు ♦ నెచ్చెలినిన్ బ్రదికించికొమ్ము నా
ధుని నిటపెచ్చు నంతకిటు ♦ తోయజనేత్రి! తపించుచుండెదన్. 339

—* చిత్రరేఖ మంత్రశక్తిచే ద్వారకకుఁబోయి యనిరుద్ధునిఁ దెచ్చుట *—

గీ॥ అనుడు నిదియెంత పనియని ♦ యర్ధరాత్రి, వఱకునచ్చోట నేయుండి ♦ పరమశివుని
రాణికి మహేశ్వరునకెదఁ ♦ బ్రణుతిసల్పి, పరమగురుమంత్రసిద్ధ యం♦బరము నెగసి.

క॥ కడువడి ద్వారకఁజని సిరి, నడరెడు ననిరుద్ధు మేడ♦కరిగి యచట నొ
ప్పెడు నిజసతులన్ రతులన్, బడలిచి నిదురించియున్న ♦ ప్రద్యుమ్నసుతున్.

సీ॥ కాంచి శాంబరీమాయను ♦ గ్రమ్మఁజేసి, కామనందనుతోఁగూడఁ ♦ గనకతల్ప
మెత్తికొని రయమొప్ప ని ♦ యత్తలమును, జేరి వడి శోణనగరినిఁ ♦ జేరి మీఱి.

గీ॥ మట్టుమీఱిన విరహాగ్ని ♦ మఱుఁగుచున్న, బాణనందనశుద్ధాంత ♦ భాగమందు
ధరనువిగియటఁ బ్రద్యుమ్ని♦తల్పమునిచి, యుషకెఱిఁగించి తనవాస♦మొందె వేగ.

చ॥ ఉషయు సుగంధసారకును ♦ మోదకసేకములన్ బొనర్చి య
ప్పిషమశరాత్మజున్ నిదుర ♦ వీడఁగఁజేసినఁ దెల్వినొంది యా
సుషమతనుండు నల్గడలఁ ♦ జూచి నవౌకముగా నెఱింగి య
ప్పిషజవిలోచనన్ గదిసి ♦ విస్మితుఁడై యిటువల్కె ధీరతన్. 244

చ॥ చెలువ! యెవర్తవీవు? మణి ♦ చిత్రిత మీ గృహమేలు లక్ష్మివై
యలరుచునుంటె వియ్యెడఁ ♦ నక్కజ మేనెటు చేరఁగల్గితిన్
గలనొకొ నిన్నుఁబోల్ కలువ ♦ కంటిని చూచినయట్లు దోఁచు వే
తెలుపుము సర్వమిత్తెఱఁగు ♦ తేటగ నీదు సుధామయోక్తులన్. 345

ఆ॥ అనుడు లోన మురిసి ♦ యలఁతినగవుతోడ, మదిరనయన మఱియొ ♦ మాఱుఁజూచి
యనియె నెఱుక లేని ♦ యట్టియెడకు నెట్లు, చేసినారొ! మిగుల ♦ చిత్ర మిద్ది.

చ॥ "కలయెడ నిన్నుఁబోలఁ గలువ ♦ కంటిని చూచితి" నంటి రట్టులే
యలఘుతరాజ! నీవనిన ♦ యట్లుగ నొప్పెడు చెల్వ నొక్కనిన్
గలఁ గనినట్లు నాకుఁ బొడఁ ♦ గట్టుచునుండె విచిత్రమొప్ప నీ
కలకిటు కాళ్ళువచ్చి నినుఁ ♦ గ్రిచ్చుఱఁ దోడ్కొనివచ్చెనో యిటుల్. 347

గీ॥ అనుడు మేలముచాలు బా♦లా! యథార్థ, మెఱిఁగియుండియుఁ గైలాట♦మేలసేయ
తెలియఁబల్కుము వేయని♦దితమనీషు, లెందునుఁ సత్యసారులై ♦యెప్పుఁగాంత్రు

క॥ అన ముసిముసి నగవెలయఁగ, ననిరుద్ధునితోడ నిట్టు♦లనె నాసతియుఁ
నను మును రతులన్ దేల్చి, చను నే లాఁతిగఁ దలంప ♦ సౌందర్యనిధీ! 349

గీ॥ అని భవానీవరంబు తీ♦రట్లు గత ది, నార్ధరాత్రింబునందు స♦మాగమంబు
నాత్మసఖచిత్రరేఖ మా♦యాబలమునఁ,దన్నిపుడు దెచ్చుటయునునం♦తయును దెల్పె.

—* అనిరుద్ధుఁ డుషతోఁ గ్రీడించుట *—

చ॥ హరిజతనూజుఁ డట్టులు ప్రి♦యావిని వేదితవృత్తుఁడై కడుఁ
హరుసముఁజెంది యారమణి ♦ నక్కునఁజేరిచి భూరిమన్మథో
ద్ధురకళలన్ బెనంగి పరి♦తోషముఁ గూరిచె బాణపుత్రియున్
గరము రమించుచుండెఁబ్రియు ♦ కౌఁగిటఁజేరి యహర్నిశంబులున్. 351

గీ॥ ఇట్లు వారిద్ద రెంతయు ♦ నింపుమీఱ, నంతిపురమున భోగంబు ♦ లందుచుండ
నంతనొకనాఁడు కావలు♦లై చరించు, భటులెఱిఁగి బాణుతోడఁ దె♦ల్పఁగనతండు.

చ॥ కడువడి రోషవేగమునఁ ♦ గన్నుల నిప్పులు రాలుచుండ నె
వ్వఁడు హరియున్న పెన్గుహను ♦ బాలిశుఁడై యిటుచేరె వాని ని
వ్వాడ కడతెచ్చి రండని ప్రి♦భూతబలోత్తమయోధరాజిఁ బం
చుడు వడిఁజేరి వారు యదు♦శూరుని మోఁదిరి యాయుధంబులన్. 353

ఉ॥ అంత నతండు నొక్కపరి ♦ ఘూయుధమున్ గొని వారి నందఱిన్
బంతముమీఱ బాది పరి ♦ మార్చి జవంబున నార్చి నట్టి వృ
త్తాంత మెఱింగి వేగముగ ♦ నంతకసన్నిభమూర్తి యన్నిలిం
పాంతకుఁ డెక్కుడైన పృత ♦ నాధిపులన్ గని పల్కె నల్కతోన్. 354

చ॥ మనుజులకన్యలన్ గొనుట ♦ మానవభక్షుల కొప్పు నెప్పుడేన్
మనుజుఁడు మానుషాశనకు♦మారినిఁ బట్టుట వింటిరే! జలం
బున మును గుండ్లు మున్గు నిఁక ♦ మున్గక తేలుచునుండు బెండు లీ
యనువునఁ దల్లక్రిందులయి ♦ నట్లుగఁ దోఁచెను నాదు బుద్ధికిన్. 355

ఉ॥ ఒక్కఁడు పెక్కుజోదులను ♦ నుక్కఱఁగొట్టి వధించెనంట! యా
మొక్కలుఁ డెవ్వఁడో పొదివి ♦ ముక్కలు సేయుఁడు ఖడ్గధారలన్
జక్కఁగఁ బొండు వేగముగ ♦ శౌర్యము మించు సహస్రయోధులన్
నెక్కొని యక్కిశోరువస ♦ నీఱొనరింపుఁడు బాహుసంపదన్. 356

ఆ॥ అనియు నట్లు సైన్య ♦ మర్పించి పంపుఁడు, వా రుషాగృహంబు ♦ వజ్జనరుగ
దవుల వారిఁగాంచి ♦ దర్పంబులన్ నింగి, కెగసి పరిఘ వ్రేటు ♦ లేసి చంపె. 357

చ॥ అది విని యాతుధానవిభుఁ ♦ డాగ్రహమున్ మదిఁ జెంది మేటి దు
ర్మదమున నావృషాండుని స ♦ మస్తచమూగణనాథుఁ బిల్చి బె
ట్టిదులగు యోధులన్ గొని క ♦ డిందియుగంటిమి యుల్లసిల్లఁగాఁ
గదన మొనర్పఁగాఁ గదలె ♦ ఖడ్గధనుశ్శరపాణియై వడిన్, 358

చ॥ బిఱబిఱ నా యుషాభవన ♦ వీథినిఁ జేరఁగఁ గృష్ణపౌత్రుఁ డా
సురరిపుఁ జూచి జోదులను ♦ జూరొనరించి ప్రభూతరోషవి
స్ఫురణ దలిర్ప శక్తిఁగొని ♦ పోతర మొప్పుచునున్న బాణుపై
నుఱుముచు వేయ హా! యనుచు ♦ నుక్కఱి రక్కసి వ్రాలెఁ దేరిలో. 359

గీ॥ అదరి వృషభాండుఁ డెంతయు ♦ నక్కజముగ
నక్కుమారుని శౌర్యవీ ♦ ర్యంబులకుఁ గ
డున్ మురియుచుండ నబ్బాణుఁ ♦ డున్ దెమలియు
నంత మటుమాయమై చేరి ♦ యంబరమును. 360

—* బాణాసురుఁ డనిరుద్ధుని నాగపాశంబులఁ బంధించుట *—

మ॥ శరవర్షంబున ముంచి కృష్ణజసుతున్ ♦ జండాహినారాచబం
ధురపాశంబులఁ జుట్టి కట్టి పెలుచన్ ♦ దోర్గర్వ మొప్పార న
చ్చెఱుతన్ జంపఁగఁ గత్తి నెత్తఁగ వడిన్ ♦ సేనాధిపుం డాఁగి యి
త్తఱి వీనిన్ జెఱసాల నుంపు మటు మీఁదన్ జంపవచ్చున్ విభూ! 361

గీ॥ వంటయింటికుందేలయ్యె ♦ బాలిశుఁడితఁ, డెట్లు తప్పించుకొని పోవు ♦ నింతలోన
బాగుగ విచారమొనరించి ♦ వధయొనర్తు, మెపుడు వేగిరంపుంబను ♦ లిడుములిడును,

వ. అనిన నుడుంగకయున్న నప్పిశితాశనునకుఁ బెద్దయెలుంగున నభోభారతి యిట్లనియె.

ఉ॥ ఏటికి బాణదైత్య! వధి ♦ యింపఁగఁ జూచెదు వీని మాను మా
రాటముదక్కి యాతఁడు గ♦రంబు మహేశ్వరభక్తుఁ డీతనిన్
బాటలగంధి నీదు సుత ♦ భర్తనుగా వరియించె నీతఁడే
సాటిగ నీకు నల్లుఁ డిఁకఁ ♦ జంపకు తెంపకు కూఁతుతంతువున్, 363

గీ॥ మఱియు నీవిప్డు వీనిఁ జం♦పఁగఁ దలఁచిన, నిపుడె పెన్గినమూఁడు నీ♦ కెంచిచూఁడు
నీధ్వజము గూలునంతకు ♦ నిలుపుదాల్మి, యవల నీమదమంతయు ♦ నవసిపోవు.

వ. అనిచెప్పిన నప్పు డతం డెట్టకు నేనిమాని వాని నవ్వాలఁ దుదముట్టఁజేయ నెంచి పంజరంబున నునిచి చనినంత ననిరుద్ధుండు దండశూకవిషవిద్ధుండై పరితపించుచు నభీష్టమహాదేవియగు దుర్గం దలంచి యిట్లు నుతించె.

గీ॥ శివ! మహేశ్వరదేవి! రో♦షిణి! ప్రపన్న, దుఃఖనాశిని! పన్నగ ♦ స్తోమబద్ధ
తనుఁడనై కట్టఁబడియుంటిఁ ♦ దల్లి! వేగ, సాఁకుమిఁక దండశూకపా♦శములఁ ద్రుంచి.

గీ॥ నీపతియు నీవు దక్కన ♦ నితరు లొకరు, గలరె భక్తుల నేల జ ♦ గంబునందు
సర్గరక్షాంతకారిణి! చండికా! య♦శోద! లేలెమ్మ! రావమ్మ! ♦ సొక్కఁ బాప.

వ. ఇట్లు ప్రార్థించినయంత నమ్మహాదేవి భక్తపరతంత్రయై మహామాయాస్వరూపంబున నమ్మహారాత్రియందుఁ దఱిసి మణినూపురాలంకృతంబగు వామపాదంబు ఘాతంబునఁ బంజరంబుఁ బగులఁదన్ని యనిరుద్ధు వెడలించి నాగపాశంబులఁ బాపి వేవేగఁ దిరస్కరిణీయోగంబున నుషాంతఃపురంబునందుఁ జేర్చిన నతండు ప్రీతుండై యుషతో సుఖంబుండె నంత ద్వారకాపురంబం దనిరుద్ధుని దేవేరులు రతిప్రద్యుమ్నులును ననిరుద్ధునిఁ గానక శోకాతురులై శ్రీకృష్ణున కెఱింగించిన నతండును రుక్మిణి మున్నగువారు దుఃఖంబునఁ గ్రాఁగుచుఁ గాలరుల నెల్లయెడల నారసి యనిరుద్ధుజాడ నెఱింగిరండని పనిచి రంత నాలుగు నెలలమీఁద నొక్కనాఁ డబ్జలితనూజుని మయూరధ్వజం బబ్బురంబుగఁదుర షబ్బాటుగాఁ బుడమి వ్రాలి యుండుటంజూచి యంతఁడు కరకంపాతి వాయువని వికవికనవ్వుచు యుద్ధసన్నద్ధుండై ప్రతివీరాగమనంబునకై నిరీక్షించుచుండెనంత నవ్వాసరంబుననె నారదుఁడు శ్రీకృష్ణునిఁ జారసించి యనిరుద్ధోదంతం బెఱింగించిన నవ్వాసుదేవుం డించుక నగచి సత్వరంబున బలభద్రసాత్యకులను, గదప్రద్యుమ్న సాంబసారణాదులను దోడ్కొని ద్వాదశాక్షౌహిణీబలంబులతో గరుత్మంతు నధిష్ఠించి శోణితపురంబుఁ జేరి నగరంబు ముట్టడించి రణభేరీధ్వనులొనర్చినంత కోటగవను గాచుచున్న జేసి కంటిదొర కుమారులందోడ్కొని ప్రమథదనుజానీకినులతోఁ గూడి కట్టాయితంబై ప్రధనంబునకే తెంచి నిలువనంత నయ్యిరు తెగలవారికిట్లు సమరంబు ఘోసంగె.

గీ॥ వాసుదేవ శివులకు శం♦బరదమన గుహులకుఁ గూశ్మాండ కూపక♦ర్ణులకు హలికి
సాంబ బాణసుతులకు వృ♦షగరుడులకుఁ, దక్కవారల కిట్టులే♦తనరె దురము. 367

గీ॥ తవిలి బవరంబుఁ జూడ నెం♦తయును వేడ్క, జేసి యాకసమందు జే♦జేలగములు
సిద్ధగంధర్వ లచ్చరల్ ♦ చెలఁగి పుష్ప, కముల నెక్కి కనంగ న♦క్కయ్య మొప్పె.

క॥ కృష్ణుఁడు నడుపఁగ వే జయ, తృష్ణన్ గొని ఘోరకదన ♦ దీక్షాపరతన్
వృష్ణివరు లేచి రణకా, శిష్ణులగుచుఁ బ్రమథదనుజ ♦ సేనల మీఱన్. 369

చ॥ కనుఁగొని శూలపాణియును ♦ స్కందుఁడు గర్జనముల్ బొనర్పఁగా
వెనుబడియున్న సైనికులు ♦ పేర్కఁ జెలంగి కడంగియార్చి రం
తనె మురసూదనుండు పుర♦దానవహంత పయిన్ మహోగ్రరా
జినిఁ బఱపన్ దదస్త్రముల♦చే శమియింపఁగఁ జేసె శర్వుఁడున్. 370

చ॥ హరియును మచ్ఛరంబున వి♦హాగ్నుల నూరక గుప్పిరించు దు
ర్ధరశరరాజి శంకరునిఁ ♦ దాఁ బొదువన్ వికటాట్టహాసవి
స్ఫురితముఖారవిందుఁడయి ♦ భూధరచాపుఁడుఁ గృష్ణుమేన ని
ష్ఠురశరపఙ్క్తి నాటినఁ గ♦డున్ గడునొచ్చి విషణ్ణమూర్తియై. 371

శైవజ్వరముచే వైష్ణవజ్వర మోడి శివుని నుతించి యభయ మొందుట *—

క॥ హరి వైష్ణవజ్వరంబును, స్మరియించి పినాకినొంపఁ♦జక్కఁబనుపఁగా
హరుడును శైవజ్వరమున్, సరగఁదలఁచి పంప నవ్వి ♦ సమర మొనర్చెన్.

*గీ॥ శాంభవజ్వర మెగసి వి♦స్తారశౌర్య, సారమేర్పడ శీతల♦జ్వరమనంగఁ
బొలుచు వైష్ణవజ్వరమును♦బొదివిపట్టి, మర్దనముచేయ నుంకింప♦మదురుఁబాసి.

గీ॥ ప్రాణభీతినిఁగొని మహే♦శాంతికమును, జేరి నుతుల నలర్పఁగా♦శివుఁడు మెచ్చి
యభయవరమిచ్చి యిట్లనె♦నపుడు వైష్ణ, వజ్వరముతోడ వాత్సల్య♦ భావమెంచి.

క॥ అడలకు శీతజ్వరమా!, విడువుము మజ్జ్వరభయంబు ♦ విశ్వమున నిఁకె
వ్వఁడు చదివిన నీవాదం, బడలఁడుసుమీ! జ్వరభయమున ♦ నాతండెవ్వుడున్.

వ. అనిచెప్పిన నంతనయ్యది సంతసించి శివునకుమ్రొక్కి చనియె నటుమీఁద.

గీ॥ గుహుఁడుప్రద్యుమ్ను నొడిచెను♦గూపకర్ణుఁ, డల్లకూశ్మాండుఁడున్ సీరి♦నాక్రమించి
రాశరాసురపుత్త్రికుం ♦ డడరిసాంబు, నోడఁబుచ్చెను జయఘోష♦ముప్పతిలఁగ.

---

* శివపురాణే యుద్ధఖండే చతుఃపంచాశోధ్యాయే -

శ్లో॥ మహేశ్వరోథ తంద్దృష్ట్వా । యాంతం స్వంవిసృజజ్జ్వరం । మహేశ్వరో వైష్ణవశ్చ । యుయుధాతేజ్వరావుభౌ । వైష్ణవోథ సమాక్రంద । న్మాహేశ్వర బలార్దితః । అలబ్ధ్వాభయ।మన్యత్రి। తుష్టావ వృషభధ్వజం । అథ ప్రసన్నో భగవాన్ । విష్ణుజ్వరసుతో హరః । విష్ణు శీతజ్వరం ప్రాహ । శరణాగత వత్సలః॥ మహేశ్వర ఉవాచ॥ శీతజ్వరప్రసన్నోహం । వ్యేతు తేమజ్జ్వరాద్భయం । యేన స్మరతిసంవాదం । తస్యనస్యాత్ జ్వరాద్భయం । సనత్కుమారః - ఇత్యుక్తో రుద్రమానమ్య । గతో నారాయణజ్వరః ॥

క॥ నందియు శృంగమ్ములతో, మందాక్షుండగుచు నిక్కమున ♦ నెవ్వగఁ బడెన్ జి
వ్హాం దండశూకవైరిక, డిందె యనృగ్ధారలూలుక ♦ శిల్పాడి పటహేళన్. 378

## —* శ్రీకృష్ణుఁడు శివునిచే నోటుపడి నుతించుట *—

*మ॥ యదునాథుం డదె మెల్లఁ గన్గొని విరూ ♦ పాక్షున్ మహేష్వాసునిన్
గదనంబందు జయింపలేనముచు న ♦ ల్కన్ జాసి శ్రీశంకరున్
గదియన్ గాంచని మ్రొక్కి చేయిలిడి వి ♦ జ్ఞప్తిన్ బొనర్చెన్ మహే
శ! దయాబ్ధీ! శరణాగతార్తిహరణా! ♦ సర్వాత్మ! మృత్యుంజయా! 379

గీ॥ విశ్వసర్గానుపోషణ ♦ వినశనాది, హేతువై బోధరూపుఁడై ♦ యింపెసంగు
శాంతు లింగస్వరూపు నీ♦శ్వరుని గొలుతు, నెల్ల వేళల నొకభంగి ♦ నెసఁగువారను.

గీ॥ కాలము స్వభావమును ద్రవ్య♦కర్మజీవ, ములు నసువులాత్మ యేతత్స♦మూహవికృతి
బీజరోహప్రవాహమై♦ వెలయుజగము, నీదుమాయయె కొలుతు ని♦ర్జేత! నిన్ను.

గీ॥ విత్తనమునుండి మొలకయు♦ విత్తుమొలక, నుండి యెల్లప్రవాహము ♦ ట్లుండి సతత
మెడ తెగక యెంత యేనియు♦ నెసఁగుజగము, నీదుమాయయె కావొక్క♦నిత్యమూర్తి!

గీ॥ వాఙ్మయబ్రహ్మమందుగు♦ప్తముగనున్న, యుప్పరబ్రహ్మమీవని♦ య్నకలుషాత్ము
లైనవారు చిదాకాశ ♦ మనుచుఁ జూతు, రద్వితీయమహేశ! య♦నాదిపురుష! ౩౮౩

క॥ నీమాయచేత జగములు, వేమఱు మోహంబుఁ జెంది ♦ విత్తసుతస్త్రీ
కాములయి దురితనీరధి,లో మునుఁగుచుఁ దేలుచుండ్రు ♦ లోకార్తిహరా!

క॥ నీవొసఁగిన యీజగమునఁ గావలుఁడై నీదు పాద ♦ కమలములయెడన్
దావేడ్కఁ బూనకుండిన, నావాఁ డాత్మఘ్నుఁడగు మ♦హాదేవ! కడున్.

---

* శివపురాణే యుద్ధఖండే చతుః పంచాశోధ్యాయే -

శ్లో॥ అథ విజ్ఞాపయామాస । నతోభూత్వా కృతాంజలిః । శ్రీకృష్ణ శ్శంకరం భక్త్యా । సోపనోష భక్త వత్సలం । దేవదేవ మహాదేవ । శరణాగతవత్సల । నమామి త్వానంతశక్తిం । సర్వాత్మానం పరేశ్వరం.....................దేవదత్త మిదం లబ్ధ్వా । నృలోక మజితేంద్రియః । యోనాద్రియేత త్వత్పాదౌ । సశోచ్యోహ్యాత్మ వంచకః । త్వదాజ్ఞయాహం భగవాన్ । బాణాసోస్మీత్తమాగతః । త్వయైవశప్తో బాణోయం । గర్వితో గర్వహారిణా । నివృత్తస్వరణాద్దేవ । త్వచ్ఛాపోన వృథాభవేత్ । ఆజ్ఞాందేహి ప్రభో మేత్వం । బాణస్య భుజకృంతనే । ఇత్యాకర్ణ్యవచశ్శంభుః । శ్రీకృష్ణస్య మహేశ్వరః । ప్రత్యువాచ ప్రసన్నాత్మా । కృష్ణస్తుత్యా మహేశ్వరః॥ మహేశ్వర ఉవాచ - సత్యముక్తం త్వయాతాత । మయాశప్తో భిదైత్యరాట్ । మదాజ్ఞయా భవాన్ ప్రాప్తో । బాణదోర్దండకృంతనే । కింకరోమి రమానాథ । భక్త్యాధీన స్సదాహరే । పశ్యతో మేకథం వీర స్యాద్బాణ భుజకృంతనం । అతస్త్వం జృంభణాస్త్రేణ । మాంజృంభయ మదాజ్ఞయా । తతస్త్వం కురుకార్యంస్వం । యథేష్టంచ సుఖీభవ ॥

క॥ కిగ్గాడి దైత్యుఁ డీతం, డగ్గలమగు నిన్నుఁ జెనక ♦ నేతెంచె నిటుల్
నిగ్గగు నీ శాపబలం, బగ్గలి నను దోడితెచ్చె ♦ నీతని నొంపన్. 386

## —* శ్రీకృష్ణుఁడు బాణుని జయించుటకై శివుని సెలవొందుట *—

చ॥ సెలవొసంగు వేగ నిఁక ♦ చెన్నటి రక్కసి నిక్కుఁ బాపి చే
తులు బలివేతుఁ గాకులకుఁ ♦ దొల్లి మిఁకన్ సమరాంగణస్థలిన్
దలఁపుము నీదు శాప మది ♦ తథ్యవచస్కముఁగాఁగ నీకృపన్
వెలయఁగఁజేయు మాపయి న♦వీనసుధాకరఖండమండనా! 387

వ. అనిన శ్రీకృష్ణునకు శివుం డిట్లనియె.

చ॥ నిజ మిది దేవకీతనయ! ♦ నీవిఁక వీని భుజాసహస్రమున్
రజమొనరింపఁజెల్లు నయి ♦ నన్ గనుచుండియు భక్తపీడ నో
ర్వఁజనునె? చెప్పెదన్ వినుము ♦ పాయము నాపయి జృంభణాస్త్రమున్
వ్రజపరిపాల! వేయు నిదు♦రన్ గొనెదన్ విజయంబు నీకగున్. 388

ఆ॥ మున్నె యిడితిఁ గాదె ♦ మురహర! వరము నీ, కప్రమేయ బలము ♦ నాజిలోన
నన్నుఁ దొడరి కదియ ♦ నాకన్న మిన్నయౌ, నట్టు లదియు నట్లె ♦ యగును గనుము.

గీ॥ అనుడు వనజాక్షుఁ డెక్కుడు ♦ హరుస మొంది, జృంభణాస్త్రంబు నవుడు యో♦జించి పరవ
భక్తవశ్యుఁడై నిదురించె ♦ ఫాలనయనుఁ, డాప్రమథవీరగణముతో ♦ నాయదనున.

వ. అంత.

క॥ పగతుఱగుండెలు పగులఁగ, మిగుల సుశాఖ్వనియొనర్చి ♦ మించు నల హరిన్
దగఁ జెనకఁదలఁచి బాణుం, డొగి మూలబలములఁ గొని స♦ముద్ధతి మెఱయన్.

గీ॥ అల వృషాండుని సూతుఁగా ♦ నలవరించి, ఘనగదాశరచాపఖ♦డ్గములఁ దాల్చి
వీరపాణంబుఁ బొనరించి ♦ మీఱి రక్త, నేత్రుఁడై రథ మెక్కి య♦నికిఁ గడంగి. 392

గీ॥ యుద్ధభూమికిఁ జని యదు♦యోధవరుల, నెల్లఁగని నివ్రఁజెందుచు ♦ హేళుఁదత్కు
మారులను జూచి కడువడి ♦ శౌరిసేనఁ, జొచ్చి కరులను హరులను ♦ జూరుచేసి.

చ॥ గరుడుని నొక్కవాలమునఁ ♦ గాతరుఁ జేసి వడిన్ హలాయుధున్
బిరుదఱఁ బంచభల్లముల ♦ బిట్టడరించి రతీశు సాత్యకిన్
సరవిగ నిర్వ్యదేసి ఘన ♦ సాయకరాజి వెలార్చి యంత న
మ్మురహరు నాఱుకోలల స♦ముద్ధతిఁ గప్పి నరెన్ నదింపుచున్. 394

గీ॥ మేలిజోదుల మదకరి ♦ జాలములను, గుఱ్ఱపుఁ దళముల జొన్న ♦ గోసినట్లు
నఱుక నెత్తురువాఁగులు ♦ విరివిమీఱె, భయదమైతోఁచె యుద్ధభూ ♦ భాగమప్డు.

వ. అంతఁ గృష్ణుం డక్కజంపడి తెమల్చికొని యుక్కుమీఱి బాణాసురుఁ జేరి.

చ॥ హరులను జంపి సూతుపయి ♦ నర్వది భల్లములేసి చాపముం
విఱుగఁగఁ జేసి బాణుపయి ♦ వేయిశరంబులనేసి యార్చినన్
సురరిపుఁ డోహటింపకయె ♦ చూపఱు మెచ్చ మఱొండు విల్లొగిన్
గరమునఁ బూని శౌరిపయిఁ ♦ గాండశతంబు నిగుడ్చె నాప్పుడున్. 397

గీ॥ బాణుశరములఁ బొడిచేసి ♦ వాసుదేవుఁ, డాత్మశంకరుఁ దలఁచి ర ♦ యమున బాణు
చేతివిలుఁ బొల్లుచేసి యా ♦ శీవిషోప, ముల శరమ్ములఁ గ్రమ్మఱఁ ♦ బొదివె బాణు.

క॥ హరి వేసిన సాయకముల, సరకుఁ గొనక దునిమి యసుర ♦ శౌరిన్ గద ను
క్కఱ మోఁదిన రణతలమున, హరి వడి వడి లేచి యంత ♦ నాజని కినుకన్.

శా॥ కంసారాతి ప్రచండరోషమునఁ జ ♦ క్కన్ జక్రముం బట్టి య
మ్మాంసాహారు రయంబునన్ బొదివి దు ♦ ర్మాంసోరుతద్బాహులన్
ధ్వంసంబొందఁగఁ జెక్కఁ దున్మి తలఁ ద్రుం ♦ పన్ బూనఁగా దైవతో
త్తంసుం డాహరుఁ డేగుదెంచి యనియెన్ ♦ దాన్ల్లు సద్మాత్ముతోన్. 400

—* శ్రీకృష్ణుఁడు బాణుఁ జంపఁ దలపడ శివుఁడు వారించుట *—

ఉ॥ వేయిభుజంబులందు నర ♦ విందవిలోచన! దక్కె నాల్గిఁకన్
నా యిడినట్టి శాపవచ ♦ నం బది చెల్లెను వీని నాశముం
జేయకు మింక వేమరలఁ ♦ జేయుము చక్రము వక్రసారముం
నాయదిగాదె చక్రమిది ♦ నట్టదె మున్ను దధీచి నేయఁగాన్. 401

చ॥ అన హరునాజ్ఞ దైత్యు విడి ♦ యచ్యుతుఁ డంతన తోడ్తె బాణుఁడున్
గనకగిరీంద్రధన్వుఁ బొడ ♦ గాంచి కరంబులు మోడ్చి భక్తపా
లన! నిఖిలేశ్వరేశ్వర! క ♦ లాధరశేఖర! లోకసుందరా!
నన్నుఁ గరుణించి మన్నితి వ ♦ నాది! కృపామయమూర్తి! శంకరా! 402

సీ॥ నీవె బ్రహ్మంబవు ♦ నీవె యప్పరమాత్మ, మీవె సర్వవ్యాపి ♦ వీవె విభుఁడ
వీవె విరాట్టవు ♦ నీవె బ్రహ్మాండత, నుండవు సర్వాన్వి ♦ తుండ వీవె
పొక్కిలి వినువెర్వ ♦ మోమగ్ని రేతస్సు, జలము వీనులు దిశల్ ♦ తలదివంబు
పదములు భువి మనం ♦ బది చందురుఁడు చూపు, భానుండు కడుపకూ ♦ పారవిభుఁడు

గీ॥ బుద్ధి విధి కంతలము లంబు ♦ ముక్కు లెదయు
ధర్ముఁడు త్రినేత్రము ల్ఘ్రాణ ♦ త్రియము రోమ
రాజి యోషధివితతి స ♦ ర్వమయమూర్తి
వీవె పురుషుఁడ వమలాత్మ! ♦ యిదియె ప్రణుతి. 403

వ. అనుచు నస్రుగ్ధార లొక్కవ్వడి గుఱియుచుండ మెల్లనలేచి హరునిముందఱ
నాలీఢప్రత్యాలీఢ పదంబులతో వివిధాకారంబులగు స్థానకంబులతోడను భ్రూక్షేప

సహితంబులగు ముఖవాదసహస్రంబులతోడను శిరఃప్రకంపసహస్రంబులతోడను వివిధాకారంబు లమర నద్భుతసుందర తాండవంబొనర్చిన భక్తవత్సలుండగు పరమేశ్వరుండు సంతుష్టుండై వరంబడుగుమనిన నలరి బాణుం డిట్లనియె.

## —* శివుఁడు బాణాసురునకు వరంబు లిచ్చుట *—

సీ॥ వసుదేవసూనుండు ♦ ప్రద్యుమ్నులొనర్చిన, చేటులగాయంబు ♦ చెల్లుఁగాక
సాతత్యభావంబు ♦ జానువిరాజఁగ నీదు, పదభక్తి నిండార ♦ బరఁగుఁగాక
అక్షయంబైన నీ ♦ యతులగాణాపత్య, మొంది నిన్ గొలుచుచు ♦ నుండుఁగాక
హరితోడ సర్వది ♦ వ్యావళితోడుత, నిర్వైరమతి నాకు ♦ నెగడుఁగాక
గీ॥ నాదు తనయకుఁ బొడమిన ♦ నందనుండు, మేలుగా నీపురంబును ♦ నేలుఁగాక
తమమురజమును ననుఁబాసి ♦ తఱలుఁగాక!, నీదుభక్తులచెలిమి రా ♦ ణించుఁగాక!

వ. ఇట్లు గోరినంత శంకరుండు తథాస్తని యొసంగి తనయులతో నంతర్ధానంబునొందె నంత బాణుండు గాయంబులయుపాయంబుఁ బాసి సంతుష్టుండై శ్రీకృష్ణునిఁ గామపాల సాత్యకి గద ప్రద్యుమ్నాదులను బహూకరించి స్వభవనంబునకుఁ గొనిపోయి యుషానిరుద్ధుల రప్పించి యనునయించి యందఱకు భోజనతాంబూల చందనసురభికుసుమంబు లొసంగి కాంచనాంబరములఁ గట్టనిచ్చి నవరత్నాలంకృతజాంబూనదభూషణంబు లనేకంబు లర్పించి కూఁతున కల్లున కపరిమితానేకహిరణ్యరాసుల నొసంగినంత శ్రీకృష్ణుండు బాణుని గారవించి మనుమనితో మనుమరాలిఁ దోడ్కొని జయభేరులతో ద్వారకాపురంబుఁ జేరి సుఖంబుండిరంత బాణుండును శివప్రసాదంబున రుద్రానుచరాగ్రణి యయ్యెనిట్లు బాణాసురానుగ్రహకథనంబుఁ జెప్పితినిట్లె మహేశ్వరుండు కాశీపురియందు గజాసురుని వధించెనింకను నందే వ్యాఘ్రరూపియగు దుందుభి నిర్హ్రాదుండను దైత్యుఁ బొలియించి వ్యాఘ్రేశ్వర లింగంబై యందుఁ బేరొందెనిఁక మహేశ్వరి విదలోత్పల దానవుల సంహరించెనద్దానినిఁ జెప్పెదవినుండని సూతుండు మునుల కిట్లనియె. 406

## —* విదలోత్పల దానవ సంహారము *—

క॥ విదలోత్పల నామంబులఁ, బొదలెడు నిరువురు దనుజులు ♦ పురుషునిచేతన్
జదియని యట్టులఁ బద్మజు, కమరగు వరమొందిమిగిలి ♦ కొంటెలయికడున్.
తే॥ వేల్పులందఱినోడిచి త ♦ ద్విత్తములను, జూఱగొని యందునందును ♦ సొగసుకత్తె
లైన పడుచులఁబట్టుచు ♦ నహరహంబు, దిర్గుచుండిరి యెల్లెడ ♦ దీమసమున. 407
గీ॥ వారిపోతర మార్పఁగ ♦ వనజభవుని, యానతింజేసి నారద ♦ మౌని యొక్క—
నాఁడు వారలఁ జేరి య ♦ న్నాకరిపుల, యర్భలను గొని వర్ణించె ♦ నార్య నిట్లు.

ఉ॥ ఏమని చెప్పఁగల్గుదు మ ♦ హేశ్వరి చక్కఁదనంపు టక్కజం
బామహనీయుఁడౌ శివుఁడె ♦ యారయఁగాఁ గలవాఁడు నిక్కమా
భూమిధరేంద్రనందనయె ♦ పూజిత యెల్లజగంబులం దికన్
భామ యెవర్తె యేని యల ♦ పార్వతిఁబోలఁగ లేదు రూఢిగన్. 409

క॥ అని చెప్పి తఱలెనంతనె, దనుజులు మనసిజుని మేటి ♦ దాడికిలోనై
వనరుచు నెట్టులనేనియుఁ, జని గౌరిని దెత్తుమనుచుఁ ♦ జటులరయమునన్. 410

చ॥ గొనకొని పార్వతీశివులు ♦ గూరిమిఁ గాశినిఁ జేరి యుండుటన్
విని యటకేగి పొంచి యట ♦ విశ్వవిభున్ జగదేకసుందరిన్
గనుఁగొన లోయుచుండ నిటఁ ♦ గౌతుకమొప్ప మహేశ్వరాగ్రిమం
దనఘ భవాని కందుకవి ♦ హారము సేయుచునుండె నంతయున్. 411

క॥ అయ్యెడనుఁ బిశితాశను, లయ్యెడ కరుదెంచియాచి ♦ యుబ్బురపడి పే
ర్వొయ్యలయి యుమనుఁబట్టఁగ, నొయ్యనఁగొని శాంకేస ♦ ముద్ధరమాయన్.

ఆ॥ చదలఁజేరి గౌరి♦సరసకేగఁగఁ జూచు, వారి నరసి వృషభ్య ♦ భంజనుండు
వేగ నుమకుఁ గన్ను♦సైగ చేసిన నంత, మెఱఁగి యగజ యెంత♦యేని నగుచు.

గీ॥ చక్కఁ హాంబట్టుబంతివి♦సరి పలాన,యుగ్రమునుగొట్టవారలు♦ హాహాయనుచుఁబు
డమినిబడితన్నుకొనుచుఁ బ్రా♦ణములు వదలి, రమరులలరులఁగురిసిరి♦యంబపైని.

క॥ కందుకమదియును సురముని, బృందంబుల యాచ్ఛనొక్క ♦ పృథులింగంబై
యందమరఁ గందుకేశుఁ డ, నందగి జ్యోతిశ్లింగ ♦ నైకటభూమిన్. 416

వ. అంత హరివిరించనాది సురవ్రజంబు లమ్మహాలింగంబు నర్చించి శివునిచే నభీష్ట వరములొంది స్వస్థానంబులకరిగి రిఁక నేమివినవలతు రెఱింగింపుఁడనిన మునులు సూతునకు మహాత్మా! శివుని యష్టాశీతిలీలల నెఱింగింపుమనుటయు.

క॥ భోగీంద్రహారవిలస, ద్భోగేశ్వర చరణకమల ♦ పూజాజాగ్ర
ద్భోగార్యసోదరీ! చి, ద్భోగలసచ్చిత్తతోయ ♦ భూ! లక్ష్మ్యంబా! 418

గద్య. ఇది శ్రీ బుధజనవిధేయ ముదిగొండనాగవీరేశ్వరనామధేయ
ప్రణీతంబైన శివపురాణంబందలి యుద్ధఖండంబునఁ
బ్రథమాశ్వాసము సర్వము సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

:0:

మనా:—ఈ యుద్ధఖండమందలి యంధకాసురకథోపాఖ్యానము పునరుక్తి గావుండుటచే యిచ్చట మానె. లింగవైభవఖండమందుఁ జేర్పఁబడినది.



శ్రీ శివాభ్యాన్నమః

# శ్రీ శివపురాణము

## లీలా ఖండము

### ప్రథమాశ్వాసము.



విలసదుద్భటాన్వయ
జీవన రాకేందుమకుట శివ దేశికపా
త్రా! విద్యానంద త్సుక!
భావజరిపురూప! వీర ♦ భద్రారాధ్యా!

వ. అవధరింపు మక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె.

—* శివలీలావతార పరిగణన *—

గీ॥ శివుని లీలావతారముల్ ♦ చెప్పఁగలనె, లెక్కలేనట్టులొప్పెడుఁ ♦ బెక్కులవ్వి
నుడివెమునుకొన్ని నందికేశుఁడుసనత్కు, మారునకుదెల్పెనాతండు♦మాగురునకు.

క॥ ఒడికమ్మున దేశికుఁ డట్లు, నుడివెను శిష్యులకు మాకు ♦ నుతగుణగణు లి
య్యెడ మీకుఁజెప్పుదు నాలింపుఁడు లోకహితములు భోగి♦భూషణు లీలల్. 4

వ. మహేశ్వరుండు మున్ను సర్గకాముండై ధ్యానంబొనర్చు పరమేష్ఠికి సాయంబుఁ
జేయఁగోరి శ్వేతలోహితంబను పందొమ్మిదవ కల్పంబు మొదలుచేసి యిరువది
మూడవ కల్పంబువఱకు శ్వేతలోహి తామ్ర నీల హేమ ధవళ వర్ణంబులతో
సద్యోజాత వామదే వాఘోర తత్పురుషేశానావతారంబులొందుడు వారొక్క
రొక్కరు పుత్త్రచతుష్టయంబు నొంది విధాతకు విజ్ఞానంబును సర్గశక్తి నొసంగిరి.
(౫) ఇంకను శివుండు శర్వ భవ రుద్రోగ్ర భీమ పశుప తీశాన మహాదేవ రూపం
బులతోఁ గ్రమంబుగ భూ మ్యుదకాగ్ని మరుదాకాశ క్షేత్రజ్ఞార్క నిశాకర

పదార్థంబుల నధిష్ఠించి యీ యష్టతనువులతో నిండి చరాచర విశ్వమయుండై యెసంగె. (౧౩) అనంతరంబున స్వరచితంబగు సర్గంబు వృద్ధినొందమి నారసి విధాతృండు మిథునసృష్టిం జేయనెంచియు స్త్రీసర్గంబునందు శక్తుండుగాక మహాదేవుని గూర్చి తపింపుడు నచిరకాలమ్మునన మహేశ్వరుండు స్వాంతర్లీనంబగు శక్తి నర్ధతనువునన్ బహిర్గతంబుఁ గావించి యర్ధనారీశ్వరుండై యజునకుఁ బొడసూపి శక్తిచే నాతనికి స్త్రీసర్గశక్తి నొసంగించె (౧౪)

ఇఁకను ప్రథమద్వాపరంబున శివుండు శ్వేతుండనుమునియై శివతోఁగూడి హిమవచ్ఛిఖరంబందలి ఛాగలపర్వతంబందు వసించి శిష్య చతుష్టయంబుతో స్వయంప్రభుఁడను వ్యాసునకు స్వాత్మప్రబోధం బొనర్చె – ఇఁకను ద్వితీయద్వాపరంబు మొదలుచేసి యష్టావింశద్ద్వాపరంబులవఱకు శివుఁడు సుతార దమన సుహోత్ర కంక లోకాక్షి జైగీషవ్య దధివాహన ఋషభ యోగి భృగుతుంగ తపో అత్రి బలి గౌతమ వేదశిరస్క గోకర్ణ గుహావాసి శిఖండి జటామాల్యట్టహాస దారుక లాంగలి శ్వేతకేతు శూలి ముండీశ సహిష్ణు సోమశర్మ లకులీశ్వరులనునవతారంబులనొంది యథోచితంబుగఁ గొన్నిట శిష్యచతుష్టయంబుతో మఱిఁగొన్నిటఁబుత్త్రచతుష్టయంబుతో సత్య భార్గవాంగిర స్సవితృ మృత్యు శతక్రతు వసిష్ఠ సారస్వత త్రిధామ త్రివృచ్ఛత తేజో నారాయణ రక్షాఖ్య త్ర్యయ్యారుణి దేవ దేవకృతంజయ ఋతంజయ భారద్వాజ గౌతమ వాచశ్రవ శుష్మాయణ తృణబిందు యక్ష శక్తి పరాశర జాతుకర్ణ పారాశర్యాఖ్యులను నామంబులనొప్పు వ్యాసునకు బ్రహ్మవిద్యా ప్రబోధం బొనరించె (౪౧) అంతమీఁదశిలాదముని పుత్త్రార్థియై తపింప స్వాంశంబున నందికేశు నవతరింపఁజేసె (౪౩).

ఆమీఁద భైరవుఁడై యవతరించి యసత్యంబాడినవిధాతృని పంచమవదనంబును జిదిమివేసె (౪౪) మఱియు హిరణ్యకశిపుని సంహరించిననృసింహమూర్తి ముఖజ్వాలలచే లోకధ్వంసంబగు టారసి దేవప్రార్థితుండై మహేశ్వరుండు శరభావతారంబొనర్చి నృసింహాతను సంహృతిన్ బొనరించె (౪౫) విశ్వానరుండనుముని కపత్యంబులేకుండుడు నమ్మునిని తపించినంత స్వకీయాంశంబున గృహపతియను నామంబున నాతనికాత్మజునిగ నవతరింపఁజేసె (౪౬).

క॥ ఆగృహపతి యధికతపో, యోగంబున శివునికరుణ ♦ నొంది స్థిరాయు
ర్భోగంబుల దిక్పాల, శ్రీగరిమముఁ జెంది యలరె ♦ సిద్ధమునీంద్రులే! 6

వ. ఇఁకను హరిసహాయంబుచే రక్కసుల కంపనీయక యమృతపానం బొనర్చినదివ్యులహంకరింపఁగా యక్షేశ్వరావతారంబొంది యహ్వారి గర్వంబు నుడిపె (౪౭) వెండియునిఁక మహాకాలుండు తారుండు భువనేశ్వరుండు శ్రీవిద్యేశ్వరుండు భైరవుండు శివుండు ధూమవంతుండు బగలాముఖుండు మాతంగుండు కమలుండను

దశావతారంబులొంది మహాకాళి తార భువనేశ్వరి శ్రీవిద్య భైరవి ఛిన్నమస్త ధూమవతి బగలాముఖి మాతంగి కమల యను నామంబుల చేత నవతరించిన శక్తులంజేపట్టి లోకరక్షణం బొనరించె (౧౬)

ఇంకను రక్షోబాధితులగు దేవతల యుల్లజడిన్ గాంచి కశ్యపప్రార్థనచే మహేశ్వరుండు కపాలి పింగలుండు భీముండు విరూపాక్షుండు విలోహితుండు శాస్త జపాదుం డహిర్బుధ్న్యుండు శంభుండు చండుండు భవుండు నను పదునొక్కరై యవతరించి యసురులన్ భంజించి వేల్పులను రక్షించె (౧౭) అత్రి యను మునీశ్వరుండు పుత్త్రకాముండై త్రిమూర్తులఁగొల్చిన ముప్పురయ్యనఘునకుఁ బుత్త్రులై పొడముదుమని వరంబిచ్చినకతంబున శివుండు దూర్వాసుండను పేరున నత్రిపుత్త్రుండై యవతరించె (౧౮) ఇంకను దొల్లి శివవీర్యంబు సంగ్రహించిన మహాబలుం డద్దాని నంజలియందు సమర్పింపుడు శివాంశతో హనుమానుం డవతరించి రామకార్యంబునందు సాయం బొనర్చె (౨౦) మహాకాలుండను గణపాలుండు శివాశక్తుండై మహేశ్వరునిచే ననుగ్రహింపఁబడి శివశాపప్రకారంబు శివాంశచే భేతాళుండను భూతపతియై యవతరించె (౨౧) తొల్లి పాతాళవాసినులగు స్త్రీలం డవిలి విష్ణువు పుత్త్రులన్ గని యందు వసించి లోకరక్షణంబు మానియుండుడు శివుండు దేవప్రేరితుండై వృషేశ్వరావతారంబున నిగ్రహించి విష్ణువును స్వధర్మనియంత్రితునిగా నొనర్చె (౨౨) దధీచిమునికిఁ దత్సతియగు సువర్చాగర్భమందు స్వాంశంబునఁ బిప్పలాదమునియై యవతరించి తపోవైభవంబు నెఱపె (౨౩) మహానంద యను వేశ్యన్ బరీక్షింపఁగోరి వైశ్యపత్యవతారంబుఁ జెంది యామెన్ బరీక్షించి మోక్షంబు నిచ్చె. (౨౪) భద్రాయు వను మహారాజును బరీక్షింపఁగోరి మాయాశార్దూలావతారంబు నొంది (౨౫) మాయా ద్విజుండై (౨౬) పరీక్షించి శుద్ధుండగు తేనికి వరంబు లొసంగె. మఱియు యతినాథుండై (౨౭) ఆహుకుండను భిల్లునిఁ దత్పత్నినిఁ బరీక్షించి వారికి దమయంతీ నలులుగాఁ బునర్జన్మంబు నిచ్చి కలహంసంబై (౨౮) యవ్వారి దంపతుల నొనరించె. మఱియు మార్తాండవంశ్యరాజులలో.

ఆ॥ నభగపుత్త్రుఁడైన • నాభాగునిఁబరీక్షఁ, దానొనర్పఁ గృష్ణ • దర్శనుఁ డయి
నృపుని సత్యవచన•నియతి కెదన్ మెచ్చి, జ్ఞానమును నవసథ • నములనొసగె. 8

వ. ఒక్కపుడు గురుశత్రులు కైలాసాద్రి కేగుచుండ నవధూతయై (౩౦) మోసపడిన యింద్రునిఁ జంపఁబూనియు గురుప్రార్థనచే నాఁగి యింద్రు ననుగ్రహించె. భిక్షువర్యావతారంబుఁ జెంది బ్రాహ్మణి సందేహంబుఁ దీర్చి తత్పుత్త్రునకును రాజపుత్త్రుఁడగు ధర్మగుప్తునకును బ్రదోషార్చనావ్రతంబు నెఱఁగించి తత్సిద్ధిచే శ్రేయంబు లిచ్చె (౩౧) మునిపుత్త్రుండగు నుపమన్యుండు క్షీరార్థియై

తపించుచుండుడు మహేంద్రావతారంబొంది యుపమన్యుఁబరీక్షించి యటుపై నిజరూపంబుఁజెంది వరంబులిచ్చె (౮౨)

పార్వతీదేవి తపస్సుఁ జేయుచుండగా బ్రహ్మచారియై వచ్చి యద్దేవినిఁ బరీక్షించె (౮౩) తపస్సిద్ధినొంది పార్వతి తలిదండ్రులయొద్ద కేగినంతి నర్తకుండై యోషధిప్రస్థంబుఁజేరి మేనకా హిమవంతులను గన్నె నిమ్మని యర్థించె. (౮౪) అటుపిమ్మట శివునిలీల లెఱింగి పార్వతి నిచ్చుట కిష్టపడిన మేనకాహిమవంతుల కడకు వైష్ణవద్విజుండై వచ్చి శివాపకర్షన్ బోధించి కన్నెనీవలదని నొడివె. (౮౫) ధనురాచార్యుండను కీర్తిఁబడసిన ద్రోణుండు పుత్త్రార్థియై శివుని భజింపఁగా స్వాంశమున నశ్వత్థామ యనువానిఁ బుట్టించె. (౮౬) కౌరవ పాండవ యుద్ధంబు చివరరేయి శస్త్రపాణియై పాండవశిబిరంబుఁజొచ్చు నశ్వత్థామకు భూతాకృతియై వెలుపించి యాపై ననుగ్రహించె. (౮౭) పాశుపతాస్త్రంబుఁగోరి తపించుచున్న నర్జుననిఁ బరీక్షింపఁగోరి కిరాతపతియై యాతనితోఁబోరి మరల ననుగ్రహించి పాశుపతం బిచ్చె (౮౮) ఇట్లు పరమేశ్వరుం డష్టాశీతిలీలారూపంబు లొంది భక్తుల ననుగ్రహించె నిందు గొన్నిటిని సవిస్తరంబుగా నింతకుమున్న మీకుఁ బురాణాంతరంబులఁ జెప్పియుంటిని గావున నిపుడు విశేషించి కొన్నిలీలలఁ బ్రతిపాదించెద వినుం డని సూతుండు మునుల కిట్లనియె,

## —* నందికేశ్వరావతారలీల *—

శా॥ సాలంకాయనమౌనిపుత్త్రుఁడు మహే ♦ శానప్రియుం డుల్లస
చ్ఛీలుండైన శిలాదుఁ డుత్తమసుత ♦ శ్రీఁగోరి నాకేశ్వరున్
బౌలోమీశుఁ దపంబునన్ గొలువ న ♦ ప్పాకారి యేతెంచి యి
మ్మేలా? తీవ్రతపంబొనర్చె దన మా ♦ నీంద్రుండు మోదంబునన్. 10

క॥ జేజేలదొరకు మ్రొక్కి త,నూజు నయోనిజు ననిధను ♦ నుతగుణు నడుగన్
యోజించి మునివరునకు బి,డౌజుండనె నా కశక్య♦మగు నిట్లొసఁగన్. 11

ఆ॥ నేనకాదు వనజ ♦ నేత్రుండు నలువయుఁ, గూడనొసఁగలేరు ♦ కొమరునిట్లు
వారలేను మృతినిఁ ♦ బడసెదువారమే, యెట్టులొసఁగఁజెల్లు ♦ నిట్టివరము. 12

చ॥ హరుఁడొకరుండు దక్క నిక ♦ నన్యు లొసంగఁగఁజాల రివ్వరం
బరయ మునీంద్ర! శంకరుఁ డ ♦ నాదిలయుండు పరాత్పరుండు నీ
వరుసముమీఱఁగా నియమ ♦ మారసి యాహరునిన్ భజించినన్
బిరుదతఁడిచ్చు నివ్వరముఁ ♦ బేరిమి నీకు మునీంద్రతల్లజా! 13

క॥ అనినుడివి యాతఁడరిగెను, మునివర్యుండంత మోద ♦ మున నానిముస
మ్మునసే తపమారంభము, నొనరిచి భజియించుచుండె ♦ నుడురాజధరున్. 14

దశావతారంబులొంది మహాకాళి తార భువనేశ్వరి శ్రీవిద్య భైరవి ఛిన్నమస్త
ధూమవతి బగలాముఖి మాతంగి కమల యను నామంబుల చేత నవతరించిన
శక్తులఁజేపట్టి లోకరక్షణం బొనరించె (౧౭)

ఇంకను రక్షోబాధితులగు దేవతల యలజడిన్ గాంచి కశ్యపప్రార్థనచే
మహేశ్వరుండు కపాలి పింగలుండు భీముఁడు విరూపాక్షుండు విలోహితుండు
శాస్త జపాదుం డహిర్బుధ్న్యుఁడు శంభుండు చండుండు భవుండు ననుపదు
నొక్కరై యవతరించి యసురులన్ భంజించి వేల్పులను రక్షించె (౧౮) అత్రి
యను మునీశ్వరుండు పుత్త్రకాముండై త్రిమూర్తులఁగొల్చిన ముగ్గురయ్యానఘు
నకుఁ బుత్త్రులై పొడమునట్లు వరంబిచ్చినకతంబున శివుఁడు దూర్వాసుండను
పేరున నత్రిపుత్త్రుండై యవతరించె (౧౯) ఇఁకను దొల్లి శివవీర్యంబు సంగ్ర
హించిన మహాబలుం డఞ్జని నంజలియందు సమర్పింపుడు శివాంశతో హను
మానుం డవతరించి రామకార్యంబునందు సాయంబొనర్చె (౨౦) మహాకాలుండను
గణపాలుండు శివాశప్తుండై మహేశ్వరునిచే ననుగ్రహింపఁబడి శివశాపప్రకా
రంబు శివాంశచే భేతాళుండను భూతపతియై యవతరించె (౨౧) తొల్లి పాతాల
వాసినులగు స్త్రీలఁదవిలి విష్ణువు పుత్త్రులన్ గని యందు వసించి లోకరక్షణంబు
మానియుండుడు శివుఁడు దేవప్రేరితుండై వృషేశ్వరావతారంబున నిగ్రహించి
విష్ణువును స్వధర్మనియంత్రితునిగా నొనర్చె (౨౨) దధీచిమునికిఁ దత్సతియగు
సువర్చాగర్భమందు స్వాంశంబునఁ బిప్పలాదమునియై యవతరించి తపోవైభవంబు
నెఱపె (౨౩) మహానంద యను వేశ్యన్ బరీక్షింపఁగోరి వైశ్యపత్యవతారంబుఁ
జెంది యాపెన్ బరీక్షించి మోక్షంబు నిచ్చె. (౨౪) భద్రాయు వను మహా
రాజును బరీక్షింపఁగోరి మాయాశార్దూలావతారంబు నొంది (౨౫) మాయా
ద్విజుండై (౨౬) పరీక్షించి శుద్ధుండగు తేనికి వరంబులొసంగె. మఱియు యతి
నాథుండై (౨౭) ఆహుకుండను భిల్లునిఁ దత్పత్నినిఁ బరీక్షించి వారికి దమయంతీ
నలులుగాఁ బునర్జన్మంబు నిచ్చి కలహంసంబై (౨౮) యవ్వారి దంపతుల నొన
రించె. మఱియు మార్తాండవంశ్యరాజులలో.

ఆ॥ నభగపుత్త్రుఁడైన ♦ నాభాగునిఁబరీక్షఁ, దానొనర్పఁ గృష్ణ ♦ దర్శనుఁ డయి
నృపుని సత్యవచన♦నియతి కెదన్ మెచ్చి, జ్ఞానమును నవసథ ♦ నములనొసఁగె. ౮

వ. ఒక్కపుడు గురుశత్రులు కైలాసాద్రి కేఁగుచుండ నవధూతయై (౩౦) మోసపడిన
యింద్రునిఁ జంపఁబూనియు గురుప్రార్థనచే నాఁగి యింద్రు ననుగ్రహించె.
భిక్షువర్యావతారంబుఁజెంది బ్రాహ్మణి సందేహంబుఁదీర్చి తత్పుత్త్రినను రాజ
పుత్త్రుఁడగు ధర్మగుప్తునకును బ్రదోషార్చనావ్రతంబు నెఱఁగించి తత్సిద్ధిచే
నవ్వారికి శ్రేయంబులిచ్చె (౩౧) మునిపుత్త్రుండగు నుపమన్యుండు క్షీరార్థియై

తపించుచుండుడు మహేంద్రావతారంబొంది యుపమన్యుఁబరీక్షించి యటుపై నిజ రూపంబుఁజెంది వరంబులిచ్చె (౧౨)

పార్వతీదేవి తపస్సుఁ జేయుచుండఁగా బ్రహ్మచారియై వచ్చి యద్దేవినిఁ బరీక్షించె (౧౩) తపస్సిద్ధినొంది పార్వతి తలిదండ్రులయొద్ద కేగినంత నర్తకుండై యోషధిప్రస్థంబుఁజేరి మేనకా హిమవంతులను గన్నె నిమ్మని యర్థించె. (౧౪) అటుపిమ్మట శివునిలీల లెఱింగి పార్వతి నిచ్చుట కిష్టపడిన మేనకాహిమవంతుల కడకు వైష్ణవద్విజుండై వచ్చి శివాపకర్షన్ బోధించి కన్నెనీవలదని నొడివె. (౧౫) ధనురాచార్యుండను కీర్తిఁబడసిన ద్రోణుండు పుత్త్రార్థియై శివుని భజింపఁగా స్వాంశమున నశ్వత్థామ యనువానిఁ బుట్టించె. (౧౬) కౌరవ పాండవ యుద్ధంబు చివరరేయి శస్త్రపాణియై పాండవశిబిరంబుఁజొచ్చు నశ్వత్థామకు భూతాకృతియై వెఱపించి యాపై ననుగ్రహించె. (౧౭) పాశుపతాస్త్రంబుఁగోరి తపించుచున్న నర్జునునిఁ బరీక్షింపఁగోరి కిరాతపతియై యాతనితోఁబోరి మరల ననుగ్రహించి పాశుపతం బిచ్చె (౧౮) ఇట్లు పరమేశ్వరుం డష్టాశీతిలీలారూపంబు లొంది భక్తుల ననుగ్రహించె నిందు గొన్నిటిని సవిస్తరంబుగా నింతకుమున్న మీకుఁ బురాణాంతరంబులఁ జెప్పియుంటిని గావున నిపుడు విశేషించి కొన్నిలీలలఁ బ్రతిపాదించెద వినుం డని సూతుండు మునుల కిట్లనియె,

## —* నందికేశ్వరావతారలీల *—

శా॥ సాలంకాయనమౌనిపుత్త్రుఁడు మహే ♦ శానప్రియుం డుల్లస
చ్ఛీలుండైన శిలాదుఁ డుత్తమసుత ♦ శ్రీఁగోరి నాకేశ్వరున్
బాలోమీశుఁ దపంబునన్ గొలువ న ♦ వ్వాకారి యేతెంచి యి
ట్లీలా? తీవ్రతపంబొనర్చె దన మౌ ♦ నీంద్రుండు మోదంబునన్. 10

కం॥ జేజేలదొరకు మ్రొక్కి త,నూజు నయోనిజు ననిధను ♦ నుతగుణు నడుగన్
యోజించి మునివరునకు బి,డౌజుండనె నాకశక్య ♦ మగు నిట్లొసఁగన్. 11

ఆ॥ నేనెకాదు వనజ ♦ నేత్రుండు నలువయుఁ, గూడనొసఁగ లేరు ♦ కొమరునిట్లు
వారలేను మృతినిఁ ♦ బడసెడువారమే, యెట్టులొసఁగఁజెల్లు ♦ నిట్టివరము. 12

చ॥ హరుఁడొకరుండు దక్కనిక ♦ నన్య లొసంగఁగఁజాల రివ్వరం
బరయ మునీంద్ర! శంకరుఁ డ ♦ నాదిలయుండు పరాత్పరుండు నీ
వరుసముమీఱఁగా నియమ ♦ మారసి యాహరునిన్ భజించినన్
బిరుదతఁడిచ్చు నివ్వరముఁ ♦ జేరిమి నీకు మునీంద్రతల్లజా! 13

కం॥ అనినుడివి యాతఁడరిగెను, మునివర్యుండంత మోద ♦ మున నానిముస
మ్మునసే తపమారంభము, నొనరిచి భజియించుచుండె ♦ నుడురాజధరున్. 14

గీ॥ అన్నపానంబులను బాసి ♦ యభవునందె, డెందమును జక్కఁ జేర్చి యే ♦ కొందలంబు
లేకయుండెఁ దడవు కాల ♦ మేకనియతి, ముని; యతనిపైన వల్మీక ♦ మును దనర్చె.

గీ॥ వజ్రసూచీముఖంబులై ♦ వనరు కీట
ములు తెగల్ గమ్ముకొని నెత్తు ♦ రులను ద్రావి
మూఁగియుండె నస్సృఙ్మాంస ♦ ములును జర్మ
మును లయంబొందె నొక్క యె ♦ ముకలు మిగిలె. 16

మత్తకోకిల: అంతఁ దా జగదీశ్వరుం డపు ♦ డాదరంబు భరంబునన్
గాంతతోఁ బ్రమథాళితో సుమ ♦ నస్సముచ్చయరాజితో
నెంతయేనిఁ దపోధనాఢ్యమునీంద్ర ♦ బృందముతోడనున్
వింతగాఁ జనుదెంచి యిచ్చెద ♦ వేఁడు మిష్టు వరంబునాన్. 17

చ॥ కడఁగి సమాధిఁ జెంది తన ♦ కాయమునందు మనంబు లేక నె
ప్పుడు శివపాదపద్మములఁ ♦ బొందుగ ధారణ నొందియున్న న
క్కడిఁది మునీశ్వరుండు శితి ♦ కంఠు నుడిన్ వినకున్న నంత శం
భుఁడు తన పాణిపద్మమున ♦ ముట్టె మునీంద్రుని మస్త మర్మిలిన్. 18

ఆ॥ అపుడు గనులు దెఱచి ♦ యా తాపసాగ్రణి, శివుని చరణములకుఁ ♦ జేరి మ్రొక్క
వరముఁ గోరు మిదెద ♦ బాడబతల్లజ! యని శివుండు వలుక ♦ నంత మునియు.

క॥ పరమశివ! సుతు నయోనిజు, సురుచిరు నవినాశు నీదు ♦ జోకగువానిన్
బరమకృప నిమ్ము మురిసెద, వర మిదియే సర్వలోక ♦ వంద్యపదాబ్జా! 20

వ. అనిన లోకనాథుం డిట్లనియె.

మత్తకోకిల: ఓ మునీశ్వర! యట్టులేన్ విను ♦ మున్నతాత్మ! రయంబునన్
నీ మనోరథసిద్ధిగా నిఁక ♦ నే నయోనిజమూర్తినై
ప్రేమ మొప్ప జనింతు నాశవుఁ ♦ బేరు లేక యెసంగు న
ట్లోము నన్నిఁకఁ దండ్రి వౌచు మ ♦ హోచ్చకీర్తు లెలర్పఁగా. 21

గీ॥ అని మహాదేవుఁ డంతర్ధి ♦ నంతఁ జెందె, నమ్మునియు నాశ్రమముఁ జేరి ♦ యందు మునుల
కభవవరదాన మెఱిఁగింప ♦ నందఱపుడు, మురిసి రెంతేని నానంద ♦ భర మెసంగ.

## — నందికేశ్వర జననము —

గీ॥ కొంతకాలంబెడుసు సూచి ♦ యంత మౌని, జన్న మొక్కఁ డొనర్పఁగా ♦ స్వాంతమందుఁ
దలఁచి మఖశాల నిర్మింపఁ ♦ దలఁచుటయును, నంత నె శివాంశతో బాలుఁ ♦ డవతరించె.

క॥ తరుణేందుకిరీటముతో, సురుచిర భస్మానులిప్త ♦ శుభ్రతనువుతో
వరభుజచతుష్టయముతో, హరువుగ బాలకుఁడు పొడమె ♦ హరునంశముతోన్.

క॥ విరులుగురిసె శివుపైఁ గి, న్నరులును గంధర్వజనులు ♦ నాడెంబుగఁ బా
డిరి పలుకుచెలువ నలువయు, సిరియు హరియు శివయు శివుఁడు ♦ చేరిరి వేడ్కన్,

సీ॥ మఱియు నింద్రుండు మున్నగు♦సురలు మునులుఁ, జేరివచ్చి శిశుఁ జూచి♦చెలఁగి మునినిఁ
దజ్జనకుఁ గాంచి మిగుల సం♦తసముఁ జెంది, మెచ్చి తమతమ నెలవుల ♦ కిచ్చఁ జనిరి.

ఉ॥ అంత మునీశ్వరుండు సుతు ♦ నక్కునఁ జెక్కొని స్వీయమాశ్రమం
బెంతయు వేడ్కఁ జేర్చ శిశు ♦ వీశ్వరరూపముఁ బాసి బాలుఁడై
వింతగఁ గన్పడెన్ మునియు ♦ వేగఁ గనుంగొని యించు కాత్మలోఁ
జింతిలి జాతకర్మమును ♦ జేసి మునీంద్రుల సమ్మతంబునన్. 27

గీ॥ నంద మొసఁగినవాఁడౌట ♦ నంది యనుచు, నామకరణం బొనర్చి నా♦నావిధార్థ
సంచయము నెమ్మిమై నర్థి ♦ జనుల కిచ్చి, తనియఁ జేసి ముదంబునఁ♦దనరుచుండె.

క॥ ఐదవయేఁ డుపనయనము, నాదట నొనరించి దేశి ♦ కాగ్రణులకడన్
వేదాధ్యయనారంభము, మోదమున నొనర్పఁ జేయ ♦ మునియతఁ డంతన్. 29

క॥ సాంగములగు వేదమ్ముల, సంగీతకలన్ సుశాస్త్ర ♦ షట్కము నెంతేఁ
బొంగుచుఁ గడుసులువుగఁ బూ, ర్తిం గావించెను గరంబ♦రిడిఁ జెందగురుల్. 30

వ. అట్లు.

గీ॥ దాఁటెనాతఁడులంత స♦ప్తమ సమయది, జరుగుచుండఁగ నొకనాఁడు♦పస్సునందు
ఘనులు మిత్రావరుణులు నా♦మునులువారిఁ, జేరవచ్చినఁ గనుఁగొని♦చెలఁగి వేగ.

క॥ బుడుతండును దాను శిలా, దుఁడు నవ్వారలను గొల్చి ♦ తుష్టిగ నన్నం
బిడి కుడువఁ జేసి రంతనె, యడరుచు నర్భకునిఁ గాంచి ♦ యనిరిటు వారల్, 32

క॥ ముని! యీపాపఁడు చదువుల, ననువరియేఁడైన నాయు ♦ వరయఁగ నసదై
కనుపడెడు దీననెంతయు, వనరక తెలియంగనొప్పు ♦ భావములోనన్. 33

వ. అనిచెప్పి యంతనే వారు యథేచ్ఛం జనిరి శిలాదముని యవ్వారి వచనంబునఁ గడు విషాదంబుఁ జెంది కుమారుఁ జూచి ఘోరంబుగ విలపించుచున్నంత నంది నిజజనకున్ బొడఁగాంచి యిట్లనియె.

చ॥ వనరెదవేల తండ్రి! వెఱ♦వన్ బనిలే దొకకీడు నాకెటన్
బొవరదు కాలుఁడేనియును ♦ భూతములెవ్వియునేని నన్ను డా
యను దగవింకఁ దాల్మిఁ గొను ♦ మల్మటఁ బాయు మనంగ నంత న
మ్ముని విని యిట్టి తేఁకువను ♦ బూనుట మొందలిదండిచేసగున్. 35

క॥ చదువుననుగాని యెక్కుడు, చదురగు తపసుననుగాని ♦ జగమున మిత్తిన్
బొదువఁబడ కెట్టులేనియు, బ్రదికినవా రెవ్వరయ్య ♦ పట్టీ! చెపుమా! 36

వ. అనిన నంది యిట్లనియె.

క॥ చదువుననుగాక యెక్కుడు, చదురగు తపముననుగాక ♦ జనకా! మిత్త్రిన్
బాదువఁబడకేను రూఢిగ, బ్రదికెద జముగిట్టినట్టి ♦ భర్గుని కరుణన్, 37

చ॥ సెలవు నొసంగు దీవెనను ♦ జేయుము పోయెద శర్వుఁ గొల్వఁగా
నలఘుతపోనిధాన! యన ♦ నమ్ముని సంతసమొంది నిన్ను నె
ప్డలయఁగనీక సాఁకు పర ♦ మాత్మ శివుండిఁక నీవు చెచ్చెరన్
బలితపుఁ దాపసవ్రతముఁ ♦ బన్ని గడింపు చిరాయువున్నతుల్. 38

క॥ అని సెలవొసఁగుడునందియుఁ, దన తండ్రికిఁ దాతకును ము♦దమ్మున జోతల్
పొనరించి దివ్యధుని ప్రక్క నున్న విపినంబుఁజేరి ♦ కడఁగెఁ దపంబున్. 39

సీ॥ రుద్రజపమొనరించుచు♦రూఢిమీఱఁ, బరమకరుణాసముద్రునిఁ ♦ బార్వతీశు
మదినిఁ గుదురుగనిల్పి స♦మర్చనంబు, చేయుచుండన చిరమందె ♦ శ్రీగళుండు.

—* శివుఁడు నందికేశునకుఁ బ్రత్యక్షమగుట *—

క॥ ఉమతోడుతఁ బ్రమథగణ, ప్రముఖులతో సకలదివిజ ♦ నర్గముతో మో
దము మీఱఁగ మునినుతునా, శ్రమమునఁబొడసూపి శూలు♦జక్కఁగని కృపన్.

క॥ నందిశిరంబునఁ జెయి నా, నందంబున నునిచి వేగ ♦ నాయన! వరమొం
దందగినవాఁడవైతివి, పొందుగ వాంఛితములడుగు ♦ పూరింతుననన్.

క॥ శైలాది యంత శివపద, నాళీకంబుల కెఱగి ఘ ♦ నస్తుతిశిఖలన్
జాలఁగ నజరానిధనుని, నీలగ్రీవుని నుతించె ♦ నేరిమిదనరన్. 43

గీ॥ అంత శంకరుఁడెంతేని ♦ యాదరమున, నందిఁజేకొని కౌఁగిటఁ ♦ జెంది శివను
గణములనుగాంచి యత్యంత♦ కౌతుకమున,నందితోనిట్లనెఁ బ్రేమ♦చింద వడిగ.

ఉ॥ నీకు జరామృతుల్ గలుగ♦నే సుత! యెన్నఁడునేని నీవిఁకన్
నా కెనవై తనర్చెద న♦నశ్వరమూర్తివి భ్రంశితార్తివై
శోకములన్ రుజల్ గనక ♦ శోభిలుచుండెద వెల్లకాలమున్
నాకడనుండుఁ డీవిఁకను ♦ నాయన నాయన నాయనల్ రహిన్. 45

గీ॥ ఇట్లుచెప్పి శిరంబున ♦ నెసఁగు హేమ, కమలహారము శైలాది ♦ గళమునందు
వేసినంత నెయుతఁడును♦ వెలసెఁబంచ,ముఖుఁడు త్రినయనుఁడునుదశ♦భుజుఁడునగుచు.

గీ॥ శర్వుఁ డావెంటనే తన ♦ జడల నున్న, హారనిర్మలమగు వారి ♦ నంజలిన్ ఘ
టించి నందిపయిన్ జల్లె♦ మించిజలము,లైదునదులయిప్రవహించె♦నక్కజముగ.

వ. అయ్యవి యైదును త్రిస్రోత, జటోదక, స్వర్ణోదక, జంబూనది వృషధ్వని, యని
యైదు నామంబులఁ బరఁగుచు నచ్ఛోదకంబులు మహావేగంబులునై జపేశ్వర

సన్నిధానంబునఁ బ్రవహించుచు రాణించె నీపంచనదులఁ గృతాభిషేకుండై జపేశ్వరు నర్చించి నట్టిఁ డీశ్వరసాయుజ్యంబు నొందు నిందు నందియంబులే దిఁక శంభుఁడు శాంభవిఁ జూచి దేవీ! యిబ్బాలకుని గణేంద్రునిగా నభిషేకింప నెంచెద నీవెట్లు దలంచెదవనిన నాజగన్మాత యిట్లనియె.

గీ॥ దేవ! యట్లే యొనర్పు నం♦దికి గణాధి, పత్యపట్టాభిషేక మీ♦బాలకుండు
నాసుతుండగు నెంతయు ♦ వాసిఁ జెందు, నీదయామృతరసవృష్టి ♦ నిండి నెగడ.

వ. అనినంత శివుండు గణపాలురఁ గనుఁగొని.

గీ॥ నంది నాపుత్త్రుఁ డితఁడు మీ♦యందఱకును, విభుఁడు పూజ్యుఁడు మీరిష్ట♦వీనిఁ బూని
చేయుఁ డభిషేక మెంతయుఁ♦జెలువు మీఱ, నేఁటినుండియు మిము నేలు♦నేర్మి నితఁడు.

—* నందికేశ పట్టాభిషేక వివాహములు *—

వ. అని సెలవిచ్చిన నవ్వారలెల్ల సకలసన్నాహంబు లొనర్చి నందిఁ గారవించి యభిషేకించి రనంతరంబునఁ బరమేశ్వరానుమతితో సర్వసుపర్వు లేతెంచి

గీ॥ హరివిరంచనులును హరి♦హయుడు తక్క, దిక్పతులును రవీందులా♦దివ్యమూర్తు
లెల్ల నందికి యభిషేక♦మింపు దనరఁ, జేసి శిరసుల నంజలుల్♦చేర్చి రపుడు. 52

గీ॥ అభవుఁడంత మరుత్తుల♦యనుఁగుగూఁతు, దీటగు సుకీర్తియనుదానిఁ♦దెచ్చి నంది
కొసఁగఁ జేసి యొనర్పించె♦నుపయమంబు, సకలమునులును సురలును♦సంతసింప.

వ. మఱియు నయ్యవసరంబున.

సీ॥ చందురు వెలుఁగుల♦జానుమీఱెడు సిత, చ్ఛత్త్రం బొకండును ♦ చామరద్వ
యము వానిఁ బట్టెడు♦నట్టి సుపర్వ్వచ, యమ్మను భర్మసిం♦హాసనంబు
రవ్వలకెంపుల♦రాణమీఱిన హేమ, మకుటాదిభూషణ♦నికరములును
దేవి కంఠమునుండి♦తీసియిచ్చిన నాణి, ముత్యాలదండయు♦మురుపు దనరు

గీ॥ పసిఁడిదండయుఁ బాండుర ♦ భద్రగజము, కఁడు బలీవర్ద మల్లసిం ♦ గంపు టెక్కె
మమరు బంగారుతేరు ర♦యమున నంది, కొసఁగె జగదీశ్వరుండు పెం♦పెసఁగు కరుణ.

క॥ నందియుఁ దత్పతియును బొ, లెందుధగున శార్యకను దు♦హిణునకునుం గో
విందున కడుగుల పైఁబడి, వందనము లొనర్చి రపుడు ♦ వాసి దలిర్పన్. 55

క॥ అత్తఱి శివుండు ప్రేముడి, హత్తగ శైలాదికిట్టు ♦ లనియెఁ గుమారా!
యిత్తన్వి సుకీర్తియు నీ, చిత్తము రంజింపఁ జేయుఁ ♦ జెలిమి మెఱయఁగన్. 56

క॥ నీవును నీదు వెలందియుఁ, బావనుఁడు శిలాదమౌని ♦ పతి తత్పితయున్
నావాసంబున నుండుఁడు, శ్రీ వెలయ సుఖముల మీఱుఁ ♦ జేకుఱఁ జేతున్. 57

క॥ నాకిష్టుఁడవై మంతిరి, నైై కడిఁది బలంబు వెలయ ♦ ననుచరుఁడవునై
లోకములకెల్ల జేతవు, నైై కడుపూజ్యుండవగుచు ♦ నలరెదు వత్సా! 58

సీ॥ నీదుతండ్రియుఁదాతయు♦నాదుగణములనందుఁ బ్రాముఖ్యముఁ జెంది♦యుండురిఁకను
నేనెచటనుండు నీవందు ♦ నిలువుమీవు, నెటవసించిన నేనందు♦నెగడియుండు. 59

వ. అనినంత మృడానియు వరంబులొసఁగనెంచి నందికేశుఁ జూచి యిట్లనియె. 60

క॥ నేనును వరముల నిచ్చెద, మానసవాంఛలను దెల్పు♦మా! పుత్త్రి! యనం
గా నంది నీపదద్వయి, మానక తగు భక్తినొసఁగు♦మా! జనని! యనెన్. 61

వ. అంత నఖిలాండేశ్వరి తథాస్తనియొసంగి భక్తితోఁగూడ నాతనికిఁ దత్సతికిఁ దివ్యభోగభాగ్యంబులను బుత్రపౌత్రాభివృద్ధి ననుగ్రహించె నంత శివుండు నందికేశుని సాన్వయంబుగ సబాంధవంబుగ నిజస్థానంబుఁజేర్చుకొని సుఖంబుగనుంచె. హరివిరించనాది సకలగీర్వాణులు మున్నగువారు సంతసించి శివానుగ్రహంబుం బ్రశంసింపుచు నిజధామంబులకరిగిరి. ఇది నందికేశావతారచరిత్రం బియ్యది మీకెఱింగించితి. 62

క॥ ఈలీల నెవ్వఁడేని యు, లోలమతిఁ వినినఁ జదువ ♦ లోకసుఖంబుల్
జాలఁబడసి పరమందున, నీలగ్రీవుని సదంబు ♦ నెక్కొను మానుల్! 63

వ. ఇఁకను శ్రీ భైరవలీల నెఱింగించెద వినుండు.

## —* శ్రీ భైరవలీల *—

చ॥ మునులును నిర్జరోత్తములు ♦ మున్నొకమాఱు హిరణ్యశైలముం
దనువుగఁ గొల్వునం దమరు ♦ నబ్జజుఁ గాంచి నమస్కరించి పా
వన! కరుణాభిరామ! నిను ♦ బ్రార్థనచేసెదమయ్య యీ జగ
మ్మున నిఁక నవ్యయంబయిన ♦ యొంకపుఁ దత్త్వము దేదొ తెల్పుమా! 64

క॥ అని యడిగిన వారలఁ గని, వనజాసనుఁ డపుడు ఖండ ♦ పరశుని మాయన్
బెనఁగొని యప్పరతత్త్వం, బును దెలియక యిట్టులనియె ♦ మోహితబుద్ధిన్,

ఉ॥ నేనసుఁడీ జగంబులకు ♦ నిక్కపుఁ గర్తను నీశ్వరుండనుఁ
నేన సమస్తశక్తులకు ♦ నేర్మిఁబ్రవర్తకుఁడన్ నివర్తనం
బేనె యొనర్తుఁ బుట్టుటయు ♦ నీల్గుట యన్నది నేనెఱుంగ నె
ష్టేనె యనశ్వరంబయిన ♦ యీశ్వరతత్త్వము నిద్ధమానసుల్! 66

క॥ ననుభావింపుం డిట్టుల, నన విని సైరింప కండె ♦ యలరిన నారా
యణునంశమైన క్రతుఁ డి, ట్లనియెను గడు నాగ్రహమున ♦ నబ్జజుతోడన్.

క॥ ఎఱుఁగక పరతత్త్వంబిటు, నెటిదారఁగి వచించెదేల ♦ నేన విభుఁడ నం
చఱిమునీగా పీరల ముం, దఱ ననుచితమిది యరయు ♦ తామరసభవా! 68

చ॥ పొరిఁబొరి నీజగంబులను ♦ బుట్టఁగఁజేసితి నేనకాదె? యీ
శ్వరుఁడను యజ్ఞపూరుషుఁడ ♦ సర్వము నేలెడువాఁడ నేనె ని
బ్బరమగు తత్త్వమారయుము ♦ పన్నగ నిందఱిలోన నిప్డు పె
ద్దరికముఁ జూపఁబోకు మిటు ♦ తప్పులు పల్కకు నీరజోద్భవా! 69

క॥ అని యిటు నిద్దఱునున్ వా, దొనరిచి యద్దాని మాని ♦ యొప్పుగ శ్రుతులన్
గని తమదు తారతమ్యం, బును గూరిచి యడిగిరిట్లు ♦ పూనికతోడన్. 70

క॥ ఎందునుబ్రిమాణములు మీ, యందుఁగలదు సమ్మకము ర♦యమున నిగమముల్
పొందెఱిఁగి యవ్యయంబగు, కందువతత్త్వం బదేదొ ♦ కడఁగిచెప్పుడీఁకన్. 71

వ. అని యడిగిన విధివిష్ణుల కవ్వానిలో ముందుగ ఋగ్వేదం బిట్లనియె.

క॥ ఎవ్వనిలోపల జగములు, నివ్వటిలున్ సర్వమెవని ♦ నేర్మినడచు నిం
కెవ్వనిఁ బరతత్త్వముగా, నవ్విజ్ఞులు చెప్పుదురొకఁడె ♦ యారుద్రుఁడగున్.

వ. యజుర్వేదం బిట్లనియె.

క॥ ఎవఁడెల్ల జన్మముల యో, గవిధానంబునను గొలువఁ ♦ గాఁబడెడు సతం
బెవఁడీడె మాయెడఁబ్రామా, ణ్యవిభవమతఁడొకఁడె తత్త్వ♦ మగుశివుఁడరయన్.

వ. సామవేదం బిట్లనియె.

గీ॥ ఎవనిచేతను దిరిగెడు♦ నెల్లవిశ్వ, మెవని యోగులు గొలుతురు♦ హృదయమందు
నెవని తేజంబుచే విశ్వ ♦ మెల్ల వెలుఁగు, నాత్రిలోచనుఁడే యవ్య♦యమగుజోతి.

వ. అధర్వణవేదం బిట్లనియె.

గీ॥ ఎవనిఁజూతురు భక్తితో ♦ నెల్లజనము, లాతతానుగ్రహముఁగోరి ♦ యర్థులగుచు
నెవఁడు భక్తులదుఃఖంబు♦లింకఁజేయు, నతఁడె యవ్యయతత్త్వమా♦నభవుఁడరయ.

క॥ ఈలాఁగున నోలగమున, నాలుగువేదములు చెప్ప ♦ నాళీకభవుం
డాలక్ష్మీశుఁడు కడుమో, హాలసులై పలికిరిట్లు ♦ నాగమములతో. 73

ఉ॥ నిచ్చలు నాతితోఁ గలసి ♦ నేమిఁబాసి శ్మశానభూమిలో
మెచ్చుచుఁ గ్రీడసేయు నొక ♦ మేలిమిలేదు దిగంబరుండు పె
న్మచ్చికతోడఁ జిల్వలను ♦ మైధరియించి ప్రమోదమొందు నే
హెచ్చును జూచి తత్త్వమని ♦ యీశునిఁజెప్పితి రీరికన్ శ్రుతుల్! 74

వ. అనినంత నఖిలవేదశిరోభూషణంబును నిఖిలవేదాగ్రిహాశ్యమానంబును నగు ప్రణ
వంబు మూర్తిమంతంబై వచ్చి యవ్వారి కిట్లనియె. 75

క॥ శివుఁ డాత్మభిన్నుఁడై తగు, నువిదను నెపుడేనిఁ గలియఁ ♦ డొప్పుగ వినుఁడీ!
శివ యాత్మశక్తి వారి కొ,దవునే భేదం బొకండె ♦ తత్త్వమరయఁగాన్. 76

గీ॥ శివుని నెడఁబాసియుమ రదు♦శివయుటులనె, శివను నెడఁబాసి యొనరఁడు♦శివుఁ డెపుడును
వారి కన్యోన్యభేద మె♦వ్వట్ల లేదు, చంద్రచంద్రికలకుఁబోలె♦ జగమునందు. 77

వ. మఱియు లీలామూర్తులగు నవ్వారి విహారంబు లోకాభ్యుదయకారణంబై యల
రారుననిన మోహాతిమిరంబుఁ బాయకయున్న నాహరివిరించుల యగ్రమందు.

ఆ॥ తేజ మొకఁడు పొడమె ♦ దిక్చక్రమెల్లను, నాకసంబుఁ బుడమి ♦ నావరించె
నందుఁ బురుషుఁ డొక్కఁ♦డావిర్భవించెను, ఫాలలోచనుఁడు త్రి♦శూలధరుఁడు.

చ॥ కమలజుఁ డిందుభూషణుని ♦ గ్రక్కునఁ జూచి మదంబుడంబు పె
ల్లమరఁగ నిట్లుబల్కె విను ♦ మర్భక! నాయలికస్థలంబునన్
గొమరుఁడవై జనించితివి ♦ కూరిమి రుద్రుఁడటంచు మున్ను నా
మము బొనరించినాఁడ నను ♦ మంచిగఁ గొల్వు మనుగ్రహించెదన్. 80

గీ॥ అని గడుఁగా గరువంబుతో♦నడరు నలువ, తీరుఁగని యీశ్వరుం డప్డు♦భూరిరోష
భరితుఁడై భైరవాకృతిఁ♦బరఁగుపురుషుఁ, బొడమఁజేసెను నొకని న♦ద్భుతముగాఁగ.

వ. అంత నతండు.

—* శ్రీ భైరవ ప్రాదుర్భావము *—

ఉ॥ బంగరురంగులన్ దనరి ♦ భాసిలు మేలి జటాచయంబుతో
నింగిని నేలనుఁగా దెసల ♦ నిండి లయాభ్రనినాదమట్లు బల్
భంగుల మ్రోయు నాడమరు ♦ భాసురఘోషముతోఁ గృశానుదృ
క్సంగతభీషణార్చుల ప్ర♦కాశముతో నుదయించి వేల్మిడిన్. 82

గీ॥ పరమశివు నాజ్ఞఁ జేకొని♦పంకజభవు, పంచమశిరంబుఁ గొనగోటఁ♦బట్టిచిదిమె
సింధురేంద్రము దా సర♦సీవనంబు, డాసి యరవిందమును లీలఁ ♦ గోసినట్లు.

—* శ్రీ భైరవుఁడు బ్రహ్మదేవుని పంచమ శిరంబును ద్రుంచుట *—

క॥ దోసం బేయంగంబునఁ, జేసెనొ యద్దానిఁబట్టి ♦ శిక్షించుటయే
వాసియగుఁగాన నవ్విధి, దోసపుఁ బంచమశిరంబుఁ ♦ ద్రుంచెఁ గడువడిన్. 84

గీ॥ అంత యజ్ఞతనుండగు ♦ నబ్జనయనుఁ, డడలి రుద్రానువాకంబు ♦ లపుడు చదివె
నలువయును నార్తుఁడై కడు♦నలఁగికలఁగి, బెదరి శతరుద్రపాఠంబు♦బిట్టొనర్చె.

వ. అపుడు దయామయుండును భక్తవత్సలుండునగు మహాదేవుండు హరివిరించుల
భయంబుడిపి యనుగ్రహంబుఁ జూపి భైరవునిఁజూచి యిట్లనియె. 86

క॥ ఈ యజ్ఞపురుషుఁడగు హరి, యీ యరవిందోద్భవుండు ♦ నెపుడును నీకుఁగా
బాయంగరాని పూజ్యులు, సేయకు వీరి కిఁకఁ గీడుఁ ♦ జేయుము చెలిమిన్.

గీ॥ కాలుఁడట్టుల రాజిలు ♦ కారణమున, కాలరాజను పేరొంది ♦ క్రాలఁగలవు
మఱియు విశ్వముభరియించు ♦ బిరుదవౌట, భైరవుండనుపేరున ♦ భాసిలుదువు.

ఉ॥ కాలుని గుండెకున్ బెదరు ♦ గల్గఁగఁజేయుటఁ గాలభైరవా
ఖ్యాలలితుండవౌదువు జ ♦ గమ్మున భక్తజనంబులోని పా
పాలను మ్రింగివేయుటను ♦ బట్టి కడున్ గలుషాదనాఖ్యనున్
మేలుగ నొందఁగాఁగల వ ♦ మేయచరిత్ర! పవిత్ర! నీవికన్. 89

గీ॥ ఇఁకను దుష్టాత్ములనెల్ల ♦ నెపుడు మర్ద, నంబుచేయుటచే భువ ♦ నంబులందు
గరిమ నామర్దనాఖ్య నొ ♦ నరఁగఁజెంది, ఖ్యాతిఁగాంతువు లోకక ♦ ల్యాణమూర్తి!

వ. ఇంకను.

గీ॥ వైధసంబైయులరు నీక ♦ పాలమొంది, బ్రహ్మహత్యాపనోదనా ♦ ర్థంబు వ్రతము
లోకమున కెఱిఁగింపుచు ♦ వీఁకభిక్షుఁ, గొనుచుఁ గాపాలిక వ్రతం ♦ బునఁ జరింపు.

వ. అని యిట్లు భైరవున కుపదేశించి యా సమయంబునందు.

సీ॥ కెంజాయవలువలు ♦ కెంపుపూదండలు, కెంపుగందములు బల్ ♦ సొంపుగూర్ప
మిట్టపల్వరుసతో ♦ మీఱు బెన్నాల్కతో, మొకమెంతొ వికృతమై ♦ బుగులుసేయ
అగ్గిజోతులఁబోలు ♦ నిగ్గుగల్గినయట్టి, కనుగ్రుడ్లు మిగుల న ♦ క్కజముఁగూర్ప
నిడివైన కత్తిని ♦ నెత్తిపుఱ్ఱను గేలు, దోయి ధరించి బల్ ♦ తుష్టియెసఁగ

గీ॥ దగయడఁగమాటిమాటికిం ♦ పగురుధిరముఁ, ద్రావుచున్ భైరవునకును ♦ దలకుదనరఁ
జేయఁగా గర్జనంబును ♦ జేయుచున్న, బ్రహ్మహత్యను సృజియించి ♦ భర్గుఁడపుడు.

ఆ॥ ఓకరాళి! నీవు ♦ నీకాలభైరవు, వెనుకఁ దిరుగుచుండు ♦ వెరవుతోడఁ
గాశినెపుడు చేరఁ ♦ గాలరాజీతఁడు, విడువు మంతవఱకు ♦ వెన్నుఁదగులు. 93

వ. అనిచెప్పి యంతర్ధానంబుచెందె హరివిరించు లాత్మపదంబులకరిగి రంత భైరవుం
డును శివోక్తప్రకారంబుగఁ గాపాలికవ్రతంబు ననుష్ఠింపుచు సకలభువనంబులఁ
గ్రుమ్మఱుచు నఖిలపుణ్యతీర్థంబులఁ గ్రుంకుచునున్నను బ్రహ్మహత్య పాయక
వెంటనంటియుండె నట్లొక్కనాఁడు.

—* భైరవుఁడు వైకుంఠమున కేగుట *—

క॥ వైకుంఠపురికిఁ జనుదెన్, శ్రీకాంతుం డెదురువచ్చి ♦ చేరి చరణనా
ళీకములకు మ్రొక్కిడి సు, శ్లోకముల నుతించి రమను ♦ జూచియిటులనెన్. 95

మ॥ చెలువా! చూచితె! దేవదేవుని విభున్ ♦ శీతాంశురేఖాంకురో
జ్జ్వలపింగోరుజటాకలాపమకుటున్ ♦ శశ్వజ్జగన్మండలీ
విలసత్సర్గకలాభిరక్షణలయా ♦ భిప్రీతకేళీపరున్
జ్వాలదగ్నిప్రతిమానసున్ ఘనకృపా ♦ శ్లాఘ్యైకచారిత్రునిన్. 96

చ॥ కలికిరో! ధన్యవైతివిటు ♦ గాలగళుంగని యేను ధన్యుఁడన్
జలజవిలోచనా! యితఁడె ♦ సర్వజగద్రచనాస్పదుండు కౌ
శలుఁడు విభుండు యోగిహరి ♦ చందన మాత్మ సమస్తభూతకో
టుల కిటువంటి దైవము క♦డున్ గృపఁజేసితెఁ బున్నె మెంతయో. 97

సీ॥ ఎవని నామముఁ దలఁచిన ♦ నెల్లవారి, కీతనువ్యథలన్నియు ♦ నిగిరిపోవు
అట్టి దేవర తనువొంది ♦ యిట్టులాసె, రూప మెద్దియు లేకున్న ♦ రూపరివలె.

గీ॥ నళినములఁబోలె నిడువైన♦నాదు కనులు, చెలియరో! యిందు నిందుశ♦కలశిరస్కు
హరునిఁ గనిపంట వొందిధ♦న్యంబులయ్యె, నహహ! మనదైన భాగ్య మెం♦తనఁగవచ్చు

గీ॥ ఇట్టులిందిరతోఁ బల్కి ♦ చుట్టువాలు, నార మహాదేవుఁ గనుఁగొని♦ దోయిలొంది
యడిగెనిది యేమి వేసమో♦యభవ! తెల్పు, బిచ్చమేటికిఁ గొనెదిట్లు♦ప్రియము మెఱయ

వ. అనిన భైరవుండు వెన్నునకిట్లనియె.

గీ॥ నలువ పంచమమస్తంబు ♦ నఖముచేతఁ, జిదిమివేసితిఁ గావున ♦ శ్రీవిభుండ!
పాపపరిహారమునకిట్లు ♦ వ్రతముఁబూని, తిరుగుచుంటిని సకలది ♦ గ్దేశములను.

వ. అనిన మహేశ్వరుని వచనంబు విని గోవిందుఁడల్లన నగి శిరంబు వంచి యిట్లు బలికె
దేవా! ప్రభుండవగు నీవెట్లు తలపెట్టిన నట్లొనర్పు సమైనను. 102

ఆ॥ నన్ను మాయచేత ♦ నలఁగఁ జేయక దేవ!, నీదు సెలవుచేత ♦ నేను గల్ప
కల్పమందుఁ బొడమఁ♦గాఁ జేయుచుంటిని, బొడ్డుతమ్మి విధిస ♦ ముత్కరముల.

క॥ పోరిఁబొరి మము బోటులదు, స్తరమగు నీమాయచేతఁ ♦ దద్దయు నొంచన్
హర! యిట్లొనరించెద విది, యెఱిఁగితి నే హృదయమందు ♦ నెసకంబెసఁగన్.

చ॥ విలయదినంబునన్ దొడరి ♦ విశ్వములన్నియుఁ జక్కడంతు వ
వ్వలనన వేల్పులన్ మునుల ♦ బాపలఁ బట్టి వధింపకుందు వే
బలితపు బ్రహ్మహత్యదవు ♦ పాతక మొందునదూఱు దేవ! నీ
తలఁపిటుగాక పాపములు ♦ దాకొను నే నిను లోకపావనా! 105

క॥ కడచిన బ్రహ్మలపునుకలు, బెడఁగుగ నీకంఠహార ♦ విలసితము లివే
కడపితివెట నా దోసము, లుడురాజకలాపరిష్కృ ♦ తోజ్జ్వలమకుటా! 106

గీ॥ కడఁగి పంచమహాపాత♦కములఁ జేసి, యును విభూ! నీదు నామంబు♦లను దలంచి
నాశమొనరించు నాపాప♦రాశి జనుఁడు, నీకు దోసంబు లెటఁగమ్ము ♦ నీలకంఠ!

క॥ ధన్యుండనైతి నేనును, ధన్యయు నాసిరియు నీదు ♦ దరిసెనమున నా
ధన్యులగు యోగులును నే, మాన్యుని దరిసింపలేక ♦ మఱుగుదు రెదలో.

ఆ॥ ఇట్లు పలికి హరుని ♦ యింగిత మారసి, రమకు సన్న సేయఁ ♦ గమలనయనుఁ
డంత లక్ష్మిదెచ్చి ♦ యమృతభిక్షాన్నంబు, హరుకరస్థపాత్రి ♦ యందు నిడియె.

వ. అంత మహావిష్ణువు భైరవదేవుని వెనుకనున్న బ్రహ్మహత్యఁ గాంచి యిట్లనియె.

క॥ ఏటికిఁ బరమేశ్వరుఁ బసి, పాటిగ నిటు వెనుకఁ దగిలి ♦ పరఁగెద విఁక ని
చ్చోటు విడి యెందు నేనియు, నీటుగఁ జరియింపుమమ్మ ♦ నీకిష్టముగన్. 111

వ. అనుడు బ్రహ్మహత్య యిట్లనియె.

క॥ ఇమ్మహచేఁ బరమేశు ము, దమ్మున సేవించుచుంటి ♦ దైత్యాంతక! నా
కెమ్మెయి హరుదరిసెన మి, ట్లిమ్మెయిఁ బవిత్రినగుదు ♦ నెంతయు నేనిన్.

వ. అనిచెప్పి యుద్దిపాయక దేవుని వెన్నాడియే యుండెనంత భగవానుండగు భైర
వుండు నారాయణుని ప్రహ్వీభూతభావంబునకుఁ గరంబలరి లక్ష్మీనారాయణుల
కభీష్టవరంబులిచ్చి యచ్చోటు వదలి యనేక పుణ్యతీర్థంబులను సేవించుచు నొక్క
నాఁడు భాగీరథిన్ దాఁటి శ్రీకాశీపురిన్ బ్రవేశింపుడు. 113

క॥ కెవ్వన నఱచి భయంబున, నవ్వీఁడి బ్రహ్మహత్య ♦ హా హా యనుచున్
జివ్వనఁ జిలువల దరిఁబడె, నవ్వేధసకర్పరంబు ♦ నవనిన్ బడియెన్. 114

వ. అంత భైరవుండును మహాహర్షంబున విశ్వేశ్వరుని యనుమతితోఁ గాశీవాసుల
కెల్ల రక్షకుండై యందుఁ గాపురంబుండెఁ గపాలవిమోచనతీర్థంబు దన్నాశ్రయించిన
వారలకు సకలాఘంబుల బోఁజిమ్ముచు హరుసమ్మొసంగు నీయుపాఖ్యానంబుఁ
జదివిన వినిన సకలాభీష్టంబులు చేకుఱఁగలవని మునులు సూతున కిట్లనిరి,

## —* శ్రీ శరభావతార లీల *—

క॥ మును గమరప్రముఖులస, త్తనువుల యెడ శివుఁడు విష్ణు ♦ దర్ప మణఁచి సాఁ
కినయట్లు వచించితి వ, ఘ్నునచరితం బానుపూర్వి ♦ గాఁ జెపు మనఘా! 116

గీ॥ అనుడు సూతుఁడు విని వారి ♦ కనియెఁ దొల్లి, శివుఁడు హరికచ్ఛపాది ప్ర ♦ సిద్ధభయద
రూపములనిగ్రహించియా ♦ టోపమణఁచె. నందునృహరివిజయము రు ♦ చ్యంబు వినుఁడు

మ॥ మును మౌనీంద్రుఁడు కశ్యపుండు దితి నే ♦ పున్ మీఱు పుత్త్రద్వయిన్
గనినన్ వార లుదగ్రమూర్తులయి లో ♦ కగ్రామమున్ వేఁపఁగా
ననువొప్పన్ హరి సూకరాకృతి హిర ♦ ణ్యాక్షున్ వడిన్ జంపె నం
తనె తద్భ్రాత హిరణ్యపూర్వకశిపు ♦ ద్దండుండు చండాకృతిన్. 118

చ॥ హరిని వధింపనెంచి వన ♦ జాసను గూరిచి నిష్ఠఁ బేర్చి య
త్యురుతరతాపసవ్రతమ ♦ హోన్నతి నెంతయు మెప్పుఁగూర్చి స
త్వర మసమానభూరిబల ♦ వైభవముల్ దగఁ జెంది యుల్లస
త్తరభుజవీర్యసంపద ని ♦ తాంతము దిక్కుల గెల్చి పెల్చనన్. 119

చ॥ తునిమెద నిప్పు విష్ణు నతి ♦ దుర్లభయుద్ధజయిష్ణుఁ గీటడం
తును మునిరాజిని దివిజ ♦ ధూర్వహకోటిని నేటుమీఱ నా
జననికిఁ జిత్తశాంతి నొక ♦ చందమునన్ బొనరింతు నాదు కీ
ర్తిని నలుదిక్కులన్ మిగులఁ ♦ దేజరిలన్ వెలయింతు వ్రేల్మిడిన్. 120

గీ॥ అనుచు వైకుంఠమున కేగి ♦ యజ్ఞనయను, దఱియఁబోవుడు హరి వాని ♦ దర్పమెఱిఁగి
మఱియొకప్డా మొఱకుఁ బట్టి ♦ మట్టుపెట్టఁ దలఁచి యగుపట్టకున్న న ♦ ద్దైత్యుఁ డేచి,

గీ॥ భీరువై పాఱిపోయె గో ♦ విందుఁ డెటకొ, యింకనవ్వాని వెదకుట ♦ యేవమనుచుఁ
జక్కస్వారాజ్యమును గైవ ♦ సంబుఁ జేసి, కొనివసించెను శోణపు ♦ రినిముదమున.

ఉ॥ మీఁదటఁ గొన్నినాళ్ళకు న ♦ మేయగుణాఢ్యుఁడు తత్పుతుండు ప్ర
హ్లాదుఁడు విష్ణుభక్తి సన ♦ యంబు ప్రియంబుగఁ జేయ వాని బల్
బాధలపెట్టు నయ్యసుర ♦ పాంసను నంతముసేయ స్తంభమం
దాదట నారసింహతనుఁ ♦ దాల్చి వనజాక్షుఁడు దోఁచి యుద్ధతిన్. 123

చ॥ పొగరడఁగన్ హిరణ్యకశి ♦ పున్ వడిఁబట్టి నిజోరులందుఁ జే
రఁగఁగొని సాంధ్యవేళ నఖ ♦ రప్రతతిన్ హృదయంబు వ్రచ్చి పేగ్
బగఁదెగటార్చి వానిపరి ♦ వారము లొక్కటఁ జుట్టుముట్ట బి
ట్టగు కినుకన్ వధించి భృశ ♦ మార్చె ముఖార్చులజ్వాల లొప్పఁగాన్. 124

వ. అంత.

క॥ దుందుభిరవముల ననిమిష, బృందం బొనరించె లోక ♦ భీకరుఁడగు నా
తుందుడుకురక్కసుని మృతి, కిం దనిసియుఁ దనయుర్లై రో ♦ గిన్ సురవర్యుల్. 125

మ॥ అతిలోకంబయి లోకభీషణము నృహ ♦ ర్యక్షాస్యమున్ గాంచి యా
తతభీతిన్ దవులన్ వసించి రమరుల్ ♦ దాఁ బద్మసంవాస య
ద్భుతమౌ నాథునిమూర్తిఁ జూచి వెఱచెన్ ♦ భూతార్తి నీక్షించి వా
క్పతిముఖ్యుల్ హరిఁ దేర్పఁబంచిరి వెసన్ ♦ బ్రహ్లాదు భక్తోత్తమున్. 126

క॥ అతఁడును డాసి నృహరికిఁ, బ్రీతిన్ జోతలనుసల్పి ♦ ప్రియసంస్తుతులన్
జేతమునకెక్క సల్పఁగ, శీతలమతిఁ జెంది యా నృ ♦ సింహుం డంతన్. 127

మ॥ తనహస్తంబును భక్తమస్తకమునన్ ♦ దాఁ జేర్చి యాలింగనం
బును సల్పన్ ముఖపావకార్చులతతుల్ ♦ మున్నున్నయట్లున్నఁ గ
న్గొని సంతోషముఁ దక్కి యక్కఱ సురల్ ♦ గోడవ్యధిన్ బాయువం
చొనరన్ శంకరుఁ జేరఁబోయిరి విప ♦ త్త్యుద్రేకవిద్రావతన్. 128

ఆ॥ పరమశివుని యంఘ్రి ♦ సరసీరుహద్వయి, కెఱఁగి లోకసుఖము ♦ నిచ్ఛగించి
యిట్లు విన్నవించి ♦ రెలమిమై శ్రీమహా, దేవ! దేవదేవ! ♦ దీనపాల!

## —* దేవతలు శివునిఁజేరి నృసింహమూర్తికి శాంతిఁగూర్పుమని ప్రార్థించుట *—

ఆ॥ పెక్కుతడవ లీవు ♦ పెనుదుఃఖములఁ బాపి, కనికరమున మమ్ముఁ ♦ గాచితయ్య!
యిపుడు నృహరిప్రకృతి♦కితవునాపాదించి, తొంటియట్ల మనుపు♦దురుసునుడిపి.

చ॥ కడలి మథింపఁగా భువన ♦ కాండవినాశనహేతువై కడున్
బొడమినయట్టి క్ష్వేలమునఁ ♦ బొంకమడంగిన మమ్ము నాపదన్
జెడనియటుల్ కృపన్ విసముఁ ♦ జెచ్చెరఁ గంఠమునందుఁ జేర్చి యె
క్కుడుగను సాఁకలేదొకొ యు♦కుంఠితశక్తిఁ బ్రపన్నవత్సలా! 131

గీ॥ అనుచు దామోదరోదంత♦మంతమనవి, చేసిశాంతినిఁ గోరు రా♦జీవగర్భ
ముఖ్యులన్ గాంచితద్విధ♦మునకుమనసు, నొచ్చినరహరిగర్వంబుఁ ♦ బుచ్చఁగడఁగి.

చ॥ తనయుని వీరభద్రుని నె♦దన్ దలఁపంగ నతండు తత్క్షణం
బునఁ జనుదెంచి రుద్రునకు ♦ మ్రొక్కి కృతాంజలియై ప్రియంబునన్
నను దలఁపన్ బనేమి భువ♦నప్రభు! వేగనొసంగు మానతిన్
ఘనమగు నీప్రసాదమును ♦ గానఁగఁజేయుమ యీయెడన్ ననన్, 133

## ——* శివుఁడు వీరభద్రునకు నృసింహావతార శాంతిని గుఱించి చెప్పుట *——

క॥ అను వీరభద్రసూక్తుల, విని ప్రేముడి నిట్టులనియె ♦ విశ్వవిభుండీ
యనిమిషుల కకాలంబున, నొనరెను భీ యెంతయేని ♦ యుడుపుము దానిన్.

క॥ నరహర్యనలము మండెడు, దురాపమై దాని నార్పు ♦ దోర్బలమున ముం
దఱ హితమును గఱపు మతం, డరయనిచోఁ జూపు మద్భ♦యదభావంబున్. 135

ఉ॥ కావలుఁడట్టు లీతఁడిటు ♦ గానక క్రిందును మీదు మీఱి మో
హావిలచిత్తుఁడై కడిఁది ♦ హుంకృతిఁ జూపుచునున్నవాఁడిఁకన్
దేవతలెల్ల నీ మహిత ♦ తేజముమెచ్చి నుతింపఁగా జగ
ద్రక్షవహా! వీర రాజనర♦సింహునిగిట్టి యడంపు హుంకృతిన్. 136

గీ॥ సూక్ష్మమున సూక్ష్మమును నిఁక ♦ స్థూలతేజ
మునను స్థూలంబు హరియించి ♦ పుత్త్ర! తెమ్ము
నృహరి వక్త్రింబునన్ గృత్తి ♦ నిన్ మదాజ్ఞఁ
గొనుము చనుమన నజ్జేత ♦ కూర్మిమీఱి. 137

చ॥ మురిసి యటుల్ పొనర్తునని ♦ మ్రొక్కి నిజానుచరోత్కరంబు సం
బరమున నార్వఁగా దనుజ ♦ మర్దనుఁ డున్నెడ కేగుదెంచుడున్
హరి గని మెన్ విపక్షతిమి♦రార్క శతార్కవిభాసమానదు
ర్ధరమహనీయతేజ నతి ♦ దర్పనృసింహసమూహపూజితున్. 438

శా॥ మాద్యద్వీరసహస్రసంయుతు బలో ♦ న్మత్తారివిధ్వంసన
ప్రోద్యద్భైరవగర్జితున్ జలధర ♦ ప్రోన్నీలగాత్రోజ్జ్వలున్
ఖద్యోతేందుహిరణ్యవీర్యనయనున్ ♦ గ్లాఖండదంష్ట్రాంకురున్
సద్యస్సాకలజగత్త్రయక్షయకర ♦ స్ఫారాగ్నిసంకాశునిన్. 139

క॥ పురుహూత ధనుఃఖండ, స్ఫురదురుభ్రూలతాఢ్యు ♦ శుభ్రశశికలా
పరిశోభితావతంసున్, బరికించెను నృహరి యపర ♦ పరశివమూర్తిన్. 140

మ॥ హరినిన్ జూసి మహేశసూనుఁడు మహా ♦ హ్లాదంబుతో నిట్లనెన్
సరసీజాక్ష! జగంబులన్ మనుప వి ♦ శ్వస్రష్టచే మున్ను నే
ర్పఱపంగాఁబడినట్లు గాఢకరుణా ♦ పాథోధివై పెక్కుమా
ర్గిరవొప్పంగ విపత్తులన్ గడపి నీ ♦ వీ విశ్వముల్ ప్రోవవే. 141

—* వీరభద్రుఁడు నృసింహునకు సామోక్తుల శాంతింపుమనుట *—

సీ॥ అటుజలజంబవై ♦ హయశిరస్కునిఁగూల్చి, పరమేష్ఠి కిడితివి ♦ ప్రాఁబలుకుల
కచ్ఛపమూర్తివై ♦ కవ్వపుగిరిమోచి, యొదవజేసితివి పీ ♦ యూష మబ్ధి
సింగారిపడుచువై ♦ జేజేల కిడితి వా, యమృతంబు రాకాసు ♦ లరిదిఁజెంద
కిటివై హిరణ్యాక్షుఁ ♦ గెడపి వసుధనురాఁ, బట్టితి వబ్ధిపాల్ ♦ పడఁగనీక

గీ॥ ఇపుడు నరహరిమూర్తివై ♦ యీ హిరణ్య, కశిపుని వధించి సకలలో ♦ కపవిత్రతుల
బాలుఁబ్రహ్లాదు రక్షించి ♦ బాధకీర్తిఁ, దనరఁజేసితి వాచంద్ర ♦ తారకముగ.

క॥ శివభక్తుఁడవగు నీకీ, భువి నధికుఁడు లేఁడులేఁడు ♦ పోలెడువాఁడున్
భువనములకెల్ల నీవె ప్ర, భవుఁడవు ప్రభుఁడవు మహాప్ర ♦ భావుఁడ వెందున్.

గీ॥ ఎప్పుడెప్పుడీ జగములకు ♦ గొప్పతిప్ప, లుప్పతిల్లునో యరసి నీ ♦ వప్పుడపుడు
భువి నవతరించి యవ్వానిఁ ♦ బొలియఁజేసి, సాఁకుచుందువు ధర్మర ♦ క్షైకచతుర!

ఉ॥ పాతకుఁడౌ దితిప్రసవ ♦ పాంసనుఁ డంతముజెందెఁ దత్సుతుం
డాతురతన్ దొరంగి సుఖ ♦ మందె నిలింపులుచెంది రిష్టముల్
ఖ్యాతిగడించె నీతను విఁ ♦ కన్ ద్వరగా నుపసంహరింపు ని
ర్భీతిగ నెల్లవారలు ప్ర ♦ జల్ సుఖియింతు రనంతకాలముల్. 144

క॥ అని యిటుల శాంతముగ నా, డిన వీరుని మృదుభణితుల ♦ డెందమునం దాఁ
గొనక కఠినోక్తులను రయ, మునఁ బల్కె రదములబెదరు ♦ పుట్టించు చిటుల్.

క॥ ఎందుండి వచ్చితివో నీ, వందే చరియింపు ప్రొమ్ము ♦ హరతనయా! నా
కిందు హితోక్తుల నుడువకు, డిందఁగఁజేతును జగముఁ గ ♦ డింది బలమునన్.

చ॥ జగముల కేను నాయకుఁడ ♦ శాసకుఁడన్ జెఱుతున్ బ్రపంచమున్
మగుఁడ సృజింతుఁ బెంతు నిఁక ♦ మానుఁడు నాకొక శాస్త్ర గీస్త్ర వే
ఱుగ నొకఁ డెందులేఁడు విను ♦ రూఢిగ నాదు ప్రసాదమొంది చ
క్కఁగ సకలమ్ము స్వాస్థ్యమును ♦ గాంచి రహించును నిర్విశంకతన్. 147

క॥ కలిమియుఁ దెలివి విభూతియు, బలమునుగల సర్వవస్తు ♦ వర్గమును మదిన్
దెలియుము మామక తేజో, విలసితమని యెల్లయెడల ♦ విశ్వతలమునన్. 148

క॥ కర్త్తను విష్టపకోటికి, భర్త్తను సకలాబ్జజాండ ♦ పాళికి నింకన్
హర్త్తను సర్వమున కిటుల్, నేర్తురె లాఁతులు మదీయ ♦ నిపుణత నెఱుఁగన్.

గీ॥ విధులను నిషేధములను వే♦జ్వోఱ చూపి, ధరఁబ్రవృత్తి నివృత్తులఁ ♦ దనరఁజేసి
యీ సకలలోకములనెల్ల ♦నేలుచుందు, నాకుఁ గఱపఁగవచ్చితే ♦ లోకహితము.

ఉ॥ పొక్కిలితమ్మియం దజునిఁ ♦ బుట్టఁగఁజేసితి నెక్కుడైన యీ
చక్కని వేదరాశి నిడి ♦ సర్వజగంబుల సంతరించు నే
ర్పెక్కుడు వేడ్కనిచ్చితి మ ♦ తెవ్వఁడు నాకెన ? నే స్వతంత్రుఁడన్
నిక్కమెఱుంగువారు గమ ♦ నింతురు నా యసమానసంపదన్ . 151

ఉ॥ కావున సర్వశక్తులకుఁ ♦ గారణమై యలరారు నన్ను నీ
భావమునం దెఱింగి వెడ ♦ పల్కులుమాని నమస్కరించి వే
నీ విపుడేగుమిం దిఁకను ♦ నిల్వకు చేట్పడఁబోకు వీఁకఱన్
నావుడు వీరభద్రుఁడు మ ♦ నంబున నల్గక పల్కెనిట్టులన్. 152

——* వీరభద్రుఁడు నృసింహునిపైఁ గోపించి భాషించుట *——

చ॥ ఎఱుఁగవె లోకనాయకుని ♦ నెల్లరకున్ హరుఁడైనవాని ని
ట్లఱిముఱి వెఱ్ఱిపల్కులను ♦ నాడుట నీసరివాని కొప్పునే
మఱచితివే మహేశు నన ♦ మానమహామహిమాభిరాము మేల్
తెఱఁగుఁ దలంపు కీడ్వడకు ♦ తెంపరి! యుద్ధము దంభవాక్యముల్. 153

ఉ॥ నీయవతారముల్ నిలుప ♦ నేరమిఁగ్లైనె నీకు వీఁకమై
బాయఁగఁజేయఁడే శివుఁడు ♦ పాయనిదర్పమెసంగు వాని నీ
వాయెడరన్ దలంప విపు ♦ డాయతదుఃఖము దారసిల్లె నే
సాయమొనర్ప వచ్చితిని ♦ స్వాంతమునందుఁ దలంపు నానుడుల్. 154

చ॥ ప్రకృతివి నీవు పూరుషుఁడు ♦ భర్గుఁడు నీయెడ వీర్యముంపఁదా
వకమగు నాభిపద్మమున ♦ బ్రహ్మజనించెను లోకసృష్టికా
తుకమున నాతఁడున్ దపసు ♦ ధూర్జటిఁగూర్చి యొనర్పఁ బద్మజా
లికమున నుద్భవించె నిజ ♦ లీలఁదనర్పఁగఁ జంద్రమౌళియున్. 155

ఉ॥ ఆహరుఁ డిప్డు నిన్నుఁ దెగ ♦ టార్పఁగఁ బంచెను లోకరక్షకై
యోహరి! మంచిమాటలకు ♦ నొప్పిన మే లటుగాక యుండినన్
దాహము చేసెదన్ నిను ని ♦ తాంతరుషాయతవహ్నికీలలన్
మోహమునొంది వాఙ్నినద ♦ ముల్ పొనరించిన నొప్పునే యిటుల్. 156

క॥ నీకూర్మకపాలంబుల, నీకిటిదంష్ట్రలను జేర్చి ♦ నీలగళుఁడు దాఁ
జేకొని ధరించు నిపుడును, శ్రీకాంతా! మఱచెదేల ♦ చింతింపు మెదన్. 157

మ॥ ప్రతిహారంబున నీనృసింహశిరమున్ ♦ బ్రిస్ఫారరత్నంబుగాఁ
గుతుకంబొప్పఁగఁ జేర్చి కంఠమున నుగ్రుం డింపుమైఁదాల్చు నీ
సుతుఁడౌ బ్రహ్మ శిరంబుఁ ద్రుంచి దురిత ♦ క్షోభంబుఁ బోకార్చ ని
ట్లతిదర్పం బిది యేల నీకు నృహరీ! ♦ యజ్ఞాతతత్త్వాత్మతన్. 158

క॥ ఉపకారము సాధులయెడ, నుపయోగించునెడఁ జక్క ♦ నొప్పు గరంబా
యుపకారం బన్యులయెడ, నపకారముగాఁగమాఱు ♦ నరయుము నృహరీ! 159

క॥ కావఁగఁగర్తవు భర్తవు, గావు హరీ! హర్తవెపుడు ♦ గావు దెలియుమీ
యేవలనరయక పల్కితి, వీవు స్వతంత్రుఁడవుగా విఁవేకెం దేనియునున్. 160

క॥ కుమ్మరిచక్రిమ్మట్టుల, నమ్మన్మథహరుని యిచ్ఛ ♦ నఖిలాకృతులన్
గిమ్మనక యవతరించుదు, విమ్మహి నరకేసరీ! మహేశవశుఁడవై. 161

ఆ॥ దక్షయజ్ఞమందుఁ ♦ దావకోద్ధతిని నేఁ, జూచినాఁడ నీవు ♦ చూడలేదె?
పద్మనయన! యనిని? ♦ బాసిపోవఁగలేదె, యేలయెఱఁగియెఱఁగి ♦ యిట్లు దొడర.

గీ॥ తామసుఁడవౌట మున్నిట ♦ దందశూక, తల్పమం దెప్డు గాఢని ♦ ద్రావశుండ
వగుచునుందువుపరమాత్మ ♦ నరయఁజాల,వసురసంప్రాప్తి నీకుఁదో ♦ డగునుహరుఁడు.

ఆ॥ చక్రిపాణి! నీవు ♦ చక్రి మెవ్వరిచేతఁ, బడసినావొ! యట్టి ♦ పరమశివుని
మఱచి యిట్టులాడ ♦ మరియాదౌనో! చద్ది, తిన్న రేవు మఱచి ♦ తెగడనగునె?

క॥ మున్ను దధీచిమునీంద్రుఁడు, సన్నుతుఁడు మహేశభక్త ♦ సత్తముఁ డాజిన్
నిన్నమరులతో గెల్చెను' బన్నముచెందితివి నాఁటి ♦ పస యెఱుఁగ వెదన్.

చ॥ విభుఁ డఖిలేశ్వరేశ్వరుఁడు ♦ విశ్వనిదానుఁడు సర్వశాసకుం
డభవుఁ డనంతవిక్రముఁడు ♦ హంత, హిరణ్మయమూర్తి, దుస్సహ
ప్రభుఁడు స్వతంత్రుఁ డక్షరుఁడు ♦ భైరవపక్షిమృగస్వరూపుఁ డా
ప్రభునివిధం బెదన్ దెలిసి ♦ పంకజలోచన! శాంతిఁజెందుమా! 165

క॥ లేకున్న మహాభైరవు, ఢాకకు గురియగుదు విపు డిటన్ దతోక్రోధా
శ్యాకంబగు మృత్యువు నీ, పై కుతికి హరించు వినుము ♦ పవి ద్రుమము నటుల్.

## —* శరభావిర్భావము *—

మ॥ అన నంతన్ విని యన్నిశాచరహరుం ♦ డత్యంతరుష్టాత్ముఁడై
ఘనరోషంబున మించి యఘ్నుని పిఁ♦కన్ బట్టి గీటార్పఁబూ
న్కిని నెష్టాందెనొ యన్నిమెషమున నిం♦గిన్ గోటితీక్ష్ణాంశుసం
జనితానూనమహస్సముత్కరము లు♦చ్చైర్భంగి శోభిల్లఁగన్. 167

ఉ॥ కాదది సౌర మగ్నిజము ♦ కాదు సుధాకరమూర్తిజంబునున్
గాదు తటిత్ప్రభూతమును ♦ గాదు మహోభరితాంబరౌజమున్
గా దుపమానవర్జితము ♦ గాలహరౌజము సర్వతేజముల్
పాదుగ నందడంగి కను ♦ పట్టెఁ గడున్ గడు ఘోరరూపమై. 168

గీ॥ అంత వేలుపు లెంతయు♦ నక్కజముగఁ, జూచుచుండఁగ వ్యక్తమై♦తోఁచె బరమ
శివునిసంహారతనువు జే♦జేలు జయజ,యధ్వనులు చేసి రెక్కుడు ♦ హర్షమునను.

వ. అంత. 169

*సీ॥ వేలకుమించిన ♦ వెలయు హస్తములందు, వివిధాయుధంబులు ♦ విస్తరిలఁగ
విరివిమీఱిన జటా♦విసరమధ్యంబునఁ, దరుణేందు శేఖరం♦బుఱవు దనర
కడు బలిష్ఠంబయి ♦ క్రాలెడు తనువున, ఱెక్కలునున్ జంచు ♦ వుక్కునిగుడ
పదునాఱువన్నెల ♦ బంగారుకన్నను, మిన్నయైయలరారు ♦ వన్నెమెఱయ

గీ॥ వజ్రములఁబోలు నఖములు♦వాసినెసఁగ, మిగులఁదీక్ష్ణంపుదంష్ట్రలు♦బుగులుగొలుప
నలుకయొలికెడు నేత్రత్ర♦యంబు వెలయఁ, గంఠమున మేచకచ్ఛాయ♦గడలుకొనఁగ.

---

* శివపురాణే శతరుద్రసంహితాయాం ద్వాదశాధ్యాయే—
సహస్రబాహుర్జటిల । శ్చన్ద్రార్ధ కృతశేఖరః । సమృద్ధోగ్రశరీరేణ । పక్షాభ్యాం చంచునాద్విజః । అతితీక్ష్ణో మహాదంష్ట్రో । వజ్రతుల్య నఖాయుధః । కంఠేకాలో మహాబాహు । శ్చతుష్పాద్వహ్ని సన్నిభః । యుగాన్తోద్యతజీమూత । భీమగంభీరనిస్వనః । మహాకుపిత కృత్యాగ్ని । వ్యావృత్త నయనత్రయః । స్పష్టదంష్ట్రా ధరోష్ఠశ్చ । హుంకార సహితో హరః । ఈదృగ్విధ స్వరూపశ్చ । హ్యుగ్ర ఆవిర్బభూవహ । హపరిస్తద్దర్శనాదేవ । వినష్ట బలవిక్రమః । బిభ్రద్ధామ సహస్రాంశో । రథః ఖద్యోత విభ్రమం । అథ విభ్రమ్య పక్షాభ్యాం । నాభిపాదాన్విదారయన్ । పాదాన్నిబంధ పుచ్ఛేన । బాహుభ్యాం బాహుమండలం । భిన్దన్నురసి బాహుభ్యాం । నిజగ్రాహ హరో హరిం । తతో జగ్మశ్చ గగన । న్దేవాస్సహమహర్షిభిః । సహసైవా భయా ద్విష్ణుం । సహిశ్యేన యివోరగం । ఉత్క్షిప్యోత్క్షిప్యసంగృహ్య । నిపాత్య చనిపత్యచ । ఉడ్డీయోడ్డీయ భగవాన్ । పక్షఘాత విమోహితం । హరింహర స్తం వృషభం । వివేశానన్త యీశ్వరః । అనుయాన్తం సురాస్సర్వే । నమో వాక్యేనతుష్టువుః । ప్రణేముస్సాదరం ప్రీత్యా । బ్రహ్మాద్యాశ్చ మునీశ్వరాః । నీయమానః పరవశం । దీనవక్త్రః కృతాంజలిః । తుష్టావ పరమేశానం । హరిస్తం లాలితాక్షరైః । నామ్నామష్ట శతేనైవ । స్తుత్వాతం మృడమేవచ । పునశ్చ ప్రార్థయామాస । నృసింహ శ్శరభేశ్వరం । యదా యదా మమాజ్ఞేయం । మతిస్స్యాద్గర్వదూషితా । తదాతదా పనేతవ్యా । త్వయైవ పరమేశ్వర ॥
నందీశ్వర ఉవాచ॥ ఏవం విజ్ఞాపయన్ప్రీత్యా । శంకరం నరకేసరీ । నత్వాశక్తో భవద్విష్ణు । ర్జీవితాంత పరాజితః । తద్వక్త్రం శేషగాత్రాన్తం । కృత్వా సర్వస్వవిగ్రహం । శక్తియుక్తం తదీయాంగం । వీరభద్రోఽహరత్తదా ॥ నందీశ్వర ఉవాచ॥ అథబ్రహ్మ దయోదేవా । శ్శారభం మాపమాస్థితం । తుష్టువుః శంకరం దేవం । సర్వలోకైక శంకరం ॥

సీ॥ ప్రళయకాలానల ♦ ప్రతిభటద్యుతులు చూ, డ్కుల కెంతయేని సం ♦ కోచ మొదవ
కల్పాంతజీమూత ♦ గాఢ భయదనాద, హుంకారశబ్దంబు ♦ జంకునొసఁగ
స్పష్టదంష్ట్రాగ్రధా♦ష్ఠంబైన వక్త్రంబు, బ్రహ్మాండకబళన ♦ ప్రౌఢిఁ దెలుప
అతినిష్ఠురములైన ♦ యష్టపాదంబులు, హరిదష్టదేశంబు ♦ లాక్రమింప
గీ॥ బొమలముడితోడ నొప్పు వి♦స్ఫూర్జదుగ్ర, మన్యుభరదీప్తదృష్టుల♦మంటలెగయ
నృహరిదర్పంబు శూన్యమై♦నేలకొరుగ, శరభమూర్తిగనంబడె ♦ సత్వరమున.

క॥ హరి తద్దర్శనముననే, కరమురుడుగ బలము సడలి ♦ గగ్గోల్పడి భా
స్కరఖద్యోతములకువలె, తరమెఱిఁగి నిజాస్త్రమయము ♦ తప్పదనుకొనెన్.

మ॥ శరభేశానుఁడు విక్రమించి నిజప♦క్షద్వంద్వఘాతంబునన్
హరినాభ్యంఘ్రులఁ జీల్చి పుచ్ఛమున జం♦ఘాంకంబులంగట్టి బం
ధురహస్తావళితోడఁ దద్భుజములన్ ♦ నొప్పించుచున్ బట్టి దు
ర్ధరపౌనర్భవధార వక్షమున వి♦స్తారంబుగా వ్రచ్చుచున్. 173

క॥ శ్యేనము పన్నగమునుబలెఁ, దా నరహరి నొడిసి మిన్ను ♦ దఱిసి బహువిధో
డ్డీననిపాతశతంబులఁ, బ్రాణాంతదశన్ బొనర్చె♦ పటుదర్పమునన్. 174

## —* నృసింహావతార శాంతి *—

గీ॥ హరికిసమ్మోహముడిపి శాం♦తాత్మకునిగ, హరుఁడొనర్చెను బ్రహ్మాది♦సురలుమురిసి
యాదరంబున లలితాక్ష♦రాళి నిట్లు, ధ్యానమొనరించి యలరించి ♦ రామహేశు.

క॥ హర! సంసారభయంబుల, హరియించుటఁజేసి హరుఁడ ♦ వైతివి మఱియున్
హరినిపుడు నిగ్రహించుట, హరిహరుఁడవటంచుఁ బరఁగె ♦ దయ్య! మహాత్మా!

వ. మఱియును

సీ॥ అష్టమూర్తులచేత ♦ నఖిలప్రపంచంబు, విభజించి ధరియించి ♦ వెలసినావు
కష్టంబులొంది స్రు♦క్కఁగఁగాంచి మమ్ముగ, టెక్కించి ప్రేమించి ♦ యేలినావు
పంచకృత్యముల నే ♦ ర్పఱచి రచించుచు, సరియొక్కరుఁడు లేక ♦ సాఁకినావు
సచ్చిదానంద ల♦క్షణుఁడవై ఘనుఁడవై, నిర్వికారుండవై ♦ నెగడినావు
గీ॥ సత్యరూప! ప్రభూ! ప్రాజ్ఞ! ♦ సన్నిధాన!, విబుధనాయక! విశ్వేశ! ♦ వేదవేద్య!
దీనబంధూ! దయాసింధు! ♦ ధృతనవేందు, శరభమూర్తి! నళినజాండ ♦ చక్రవర్తి!

క॥ కమలాక్ష కమలజన్మ, ప్రముఖామరవరుల మునులఁ ♦ బశుపతి! నీవే
క్రమముమెయి సృష్టిచేసితి, వమితతపోదృశ్యభాస్వ ♦ రాయత తేజా! 178

వ. అంత నరహరియును.

మ॥ విరిసెన్ మోహమహాంధకారము లస ♦ ద్విజ్ఞానభానూదయం
బరుసంభావ్యంగఁ జేసురేకా శుభము సం ♦ ప్రాప్తించె దేవేశ! ముం
దఱ నెప్డేనియు మోహమిట్లె పొసఁగక ♦ దచ్ఛాంతిఁ గావించి సు
స్థిరకారుణ్యము నాపయిన్ బరపుమా ♦ చేమోడ్పుఁ గావించెదన్. 179

చ॥ అన విని శంకరుండు గడు ♦ హర్షమునొంది నృసింహ! నీవు నా
పనుపున దైత్యులన్ జదిపి ♦ పాలనసేతువు లోకరాజి జీ
వననిధియందు జీవనము ♦ వైఖరి నాయెడఁ జెందియుందు విం
కను యశమొందు మక్షయము ♦ గా నరవిందదళాయతేక్షణా! 180

వ. అంత వీరభద్రుండు శివాజ్ఞన్ జేసి హరి యభీష్టప్రకారంబు గడంగి. 181

ఆ॥ నట్టులేక వేగ ♦ నరకేసరి శిరంబుఁ, గత్తిఁ బెఱికి నఱికి ♦ కృత్తి నొలిచి
హరునకొసఁగె శ్రీశుఁ ♦ డానరహరి తను, వంతఁ బాసి నీర ♦ జాక్షుఁడయ్యె. 182

వ. అనంతరంబు శివుఁడు నృసింహాకృత్తిధరుండై తదీయరుండమాలాభూషితుండై నిజగణంబులుగొల్వ రాజతాద్రిన్ జేరె, వనజాక్షుండును దక్కిన సుపర్వులెల్లరు జగచ్ఛాంతి కలరి శివుని వినుతింపుచుఁ దమ స్థానంబుల కేగిరి. 183

గీ॥ శారభచరిత్రమీయది♦ చదువవినిన, భయములను బాపు నపమృత్యు♦బాధమాన్పు
వ్యాధులనుగొట్టు శత్రుసం♦హతులగిట్టు, సకలసుఖములఁ జేకూర్చు♦సాంబవినుఁడు.

క॥ మఱియును భూకంపాదులఁ, గరవృష్ట్యల్పాతివృష్టి ♦ కష్టంబులయుం
దురుపాతోల్కాపాతము, ల రహిఁ జదివి రేనియును దొ♦లఁగు నవ్వి వెసన్.

గీ॥ ఇఁకఁ జతుర్దశి నష్టమి ♦ నీశ్వరోత్స,వముల శివలింగ సంస్థాప♦నముల నీ మ
హాచరిత మెవ్వఁడేని పా♦రాయణంబొ,నర్ప శివసన్నిధికిఁగార♦ణముగఁ దనరు.

## —* యక్షేశ్వర లీల *—

ఉ॥ మున్నుసుధార్థులై సురలుఁ ♦ బుణ్యజనుల్ గలశార్ణవంబు న
త్యున్నతితో మథింపఁదొలి ♦ నుద్భవమయ్యె మహావిషంబు దా
నన్నిటఁ బాసి కీడ్వడి వి ♦ నాకధరున్ శివుఁజేరి మ్రొక్కి యా
పన్నులమైతి మీవిసముఁ ♦ బాపి మమున్ బ్రదికింపు మీశ్వరా! 187

క॥ ఇంచుకనీవిఁక జాగొన,రించినఁ జచ్చెదము చంద్ర ♦ రేఖామకుటా!
కాంచి జగమ్ముల యలమటఁ, గొంచక వేగిరముబ్రోవు ♦ గోపతినాథా! 188

చ॥ అని యరవిందలోచనము ♦ ఖాసురులెల్లరు రక్కసుల్ మునుల్
వనరుచుఁ దన్నువేడ నత ♦ వత్సలుఁడా శివుఁ డవ్విసంబుఁ జే
కొని వడిమ్రింగి కంఠమునఁ ♦ గూరిమి మై ధరియించె నంత వే
దనవిడి వారు శంకరు ను♦దారుఁ గడున్ గొనియాడి రున్నతిన్. 189

ఆ॥ గరిమ నలుతనిట్లు ♦ కాలకూటముఁ దాల్చి, కడఁగి శివుఁడు నీల ♦ కంఠుఁ డగుడు
నీలకంఠ! యనుచు ♦ నేర్పునఁ బిలిచిరి, పరమమునులు సురలు ♦ బరమశివుని.

గీ॥ పాలసంద్రంబుసురల జే ♦ జేలు రక్కసులును జేరి మథింపఁగా ♦ సురభి వెల్ల
యేన్గు శ్రీదేవి యచ్చర ♦ లిగురుఁబోండ్లు, నిక్కువీనులజక్కిజ ♦ నించెనందు.

క॥ హరి శ్రీదేవిని గొనియెన్, సురపతి గొనె వెల్లయేన్గు ♦ సురభిని గొని రా
దరమున మునులిక జక్కిని, మురియుచు బలిదనుజుఁ డొందె ♦ భూరిప్రీతిన్.

గీ॥ అంత నమృతఘటం బుద ♦ యంబు నొందె, శ్రీపతియనుగ్రహమున జే ♦ జేలు ద్రావి
రసురు లెల్లరుఁ గనుచుండి ♦ రందు నొక్క, రాహువును ద్రావె దేవవ ♦ ర్గమున దూఱి.

చ॥ చందురు కన్నుసన్న హరి ♦ చక్రముతోఁ దలఁద్రుంచె వాని నా
తుందుడుకందు మ్రిందక యె ♦ తుండము మొండెము నిర్జరారి యీ
పొందె సుధాకరున్ రవిని ♦ నుక్కఱఁబట్టి గ్రసించుచుండ్రు ద
క్కుందఱు రక్కసుల్ వసరి ♦ యాతురులై కనుఁ గప్పు మంటచే. 194

వ. ఆయుధంబులన్ ధరియించి సురలతో డీకొని పోరితెమ్మొనరింపుడు, 195

క॥ శ్రీవిభుని సాయముండుట, దైవతనాయకులు సుధను ♦ త్రాగుటచే సు
శ్రీవిక్రమమున దైతే, యాజి నోడింపఁబఱచి ♦ రహీనపద మసురుల్. 196

గీ॥ దానవేంద్రనిగరువంబుఁ ♦ బూనిసురలు, మిన్ను చూచుచుఁ బెచ్చుగ ♦ మెలఁగుచున్నఁ
గాంచి యుడురాజమౌళి యు ♦ క్కసటుఁ దీర్ప, నొక్కనాఁ డొక్క యక్షురూ ♦ పొంది వేగ.

ఉత్సాహ: పసిఁడిమలకుఁ జేరి యట సు ♦ పర్వవితతి గన్గొనన్
బసమెయి న్నిలింపు లెంతొ ♦ ప్రౌఢగర్వ మేర్పడన్
బిసరుహాక్షుతోడఁ గూడి ♦ బింకముల్ గడున్ జవం
బెసఁగఁ గొట్టుచున్న జూచి ♦ యిట్టులనియె యక్షుఁడున్. 198

క॥ ఏమిది పదరెద రింతకు, నేమి యొనర్చితిరి చెప్పుఁ ♦ డీ నాకన సు
త్రామముఖు లనిరి యక్షున, కీమాడ్కి నహమికఁ బెద్ద ♦ యెలుఁగేర్పడఁగాన్.

చ॥ కడలి మథించి శ్రీరమను ♦ గల్పకభూజముఁ గామధేనువున్
బెడఁగగు నశ్వరత్నమును ♦ వెల్లనియేనిక మానికంబులన్
కడుఁ గృశమైన నెన్నడుము ♦ కల్కి చనుంగవ లొప్పు చెల్వలన్
గుడుచుటకున్ సుధాఘటముఁ ♦ గొంటిమి యీహరి యేచు నున్నతిన్. 200

చ॥ పలలము మెక్కునట్టి యల ♦ బాలిశులోర్వక మమ్మెదిర్చినన్
జలమునఁ బట్టి చంపితిమి ♦ చక్కని యుక్కది లేక రక్కసుల్
పొలిసిరి కొందఱింక వెఱ ♦ పున్ గొని పాఱిరి యారగాలయం
బిలనిఁక మమ్మెదుర్పుటకు ♦ నెవ్వరు చాలుదురన్న నాతఁడున్. 201

గీ॥ సరియె యటులైన నంతకుఁ♦జాలువారె, నైన నొకనుడి వినుఁడు మీ♦రధికబలులు
పూన్కిఁ గాంచి కదల్పుఁడీ♦పూరిరెమ్మ, ననుచు నొకతృణముంచెఁ ద♦దగ్రమందు.

—* దేవతలు గడ్డిపరకను గదల్పలేకపోవుట *—

వ. అంత నవ్వారద్దిగాంచి గరువంబున నూర్పునను ముఖపవనంబునను చేతుల నాయు
ధంబుల మహాస్త్రంబులఁ గదల్పలేక యాకులపాటుఁ జెంది వెకలులై తడఁబడి
యుక్కుఁ బాసి గుక్కిళ్ళు మ్రింగుచున్నం గాంచి యంబరవాణి పెద్దయెలుంగుతో
నిట్టులనియె. 203

ఉ॥ మోసముఁ జెందినారిటులు ♦ ముగ్ధశశాంకధరుండె యక్షుఁడ
వ్వేసముఁ జూచి మోసపడి ♦ వీఁడేఁడులై తిరిఁకన్ దలంపుఁడీ
భాసిలు లోకపుంజములఁ ♦ బాయకసల్పియు సాఁకి మల్పునా
యీసరుఁడంచుఁ జిత్తముల ♦ నెంతయు నేనియు దేవనాయకుల్ ! 204

క॥ అని యుపదేశించిన వా,రనువుగ నపు డరసి వేగ ♦ యక్షేశ్వరపా
వనచరణములకు మ్రొక్కిడి, ఘనముగ నుతియించి రిట్లు♦కరుణాంచితులై.

చ॥ ఎఱుఁగక గోతిలోఁ బడితి ♦ మీశ్వర ! తప్పు సహింపు మిప్పు డం
దఱమదమున్ హరించి విత♦తంబగు నీదు ననుగ్రహంబు సం
బరమును జెందఁజేసితివి ♦ పల్కుఱు నీయెదుటన్ బ్రగల్భముల్
బఱపితి మన్ని యోర్వఁదగుఁ ♦ బాలకపాలక ! సర్వశాసకా ! 206

గీ॥ సర్వమున కీవె కర్తవు♦సర్వశక్తు, లకుఁ బ్రవర్తకుఁడవు నివ♦ర్తకుఁడ వెందు
అద్వయంబగుపరమాత్మ♦వయ్య! నీవు,నిన్నుఁ దెలియఁగఁగల మోహి♦మ్మింపుమీఁకను.

క॥ అని వినుతించిన శర్వుఁడు, వనజాక్షప్రముఖదివ్య♦వర్గమునకు బో
ధనఁ జేసి వినయపద్ధతిఁ, జనియెన్ గైలాసమునకుఁ ♦ జయ్యన నంతన్. 208

గీ॥ ఎవ్వఁడేనియు నీలీల ♦ నెంతయేని, భక్తిఁ జదివిన నవ్వాఁడు ♦ పాపజాల
మెడసి యిష్టార్థములఁ జెందు♦నిఁకనుఁ బరమ, శివుని దివ్యప్రసాదంబుఁ♦జేకొనునిల.

వ. ఇట్లు యక్షేశ్వరలీల నెఱింగించితి నిఁక దుర్వాసోమున్యవతార లీల నుపన్యసింతు
వినుండని సూతుండు మునుల కిట్లనియె. 210

—* దుర్వాసోమున్యవతారలీల *—

క॥ అత్రియను నొక్కముని వై,ధాత్రుఁడు బుధమిత్రుఁ డిద్ధ♦తరభాసురచా
రిత్రుఁడు సద్గుణమణిగణ, పాత్రుం డనసూయనాఁగఁ ♦ బఱఁతియుఁదానున్.

గీ॥ పుత్రసంతానరతులై త్రి♦మూర్తులను మ,దిన్ భజించుచు నిర్వింధ్య♦తీరమందుఁ
దపసానర్చిరి నూఱేండ్లు ♦ తావవేద,నన్ గలంగి జగంబులు♦నలతఁ జెంద. 212

క॥ ఆరసి వారలతపసును, నీరజభవ నీరజాక్ష ♦ నీలగళులు వే
తారసిలి వరములిచ్చిరి, వారికిఁగొమరులయి తమరు ♦ ప్రభవించునటుల్.

గీ॥ అజుఁడు జాబిల్లియై దాన♦వాంతకుండు, దత్తుఁడై కృత్తివాసుండు♦తాపసేంద్రుఁ
డైనదూర్వాసుఁడై వారి♦యాత్మజులుగఁ, బొడమిరెంతయునున్నతి♦పొల్పుమీఱ.

వ. ఆ మువ్వురయందు దూర్వాసుండు మిగుల తపోధనుండై శిష్యులఁ గూడికొని
మేదినిం బుణ్యతీర్థస్థలంబులఁ గ్రుమ్మరుచు నొక్కనాఁడు ద్వారకాపురి కేగి
శ్రీకృష్ణుచే సత్కారంబు లొంది తన్మందిరంబునఁ గొన్నినాళ్లు వసించె. శౌరియును
మిగులఁ గోపనుండగు నమ్మునికి విధేయుండై యాతిథ్యంబు నెఱవేర్చుచుండె.
ముని యొక్కనాఁడు పెక్కుసహస్రంబుల వారి యన్నంబుఁ దానొక్కఁడే మెక్కు
చుండు. మఱియొక్కపు డత్యల్పముగ భుజించుచుండు. కారణంబులేక వికవిక
నవ్వుచుండు నట్టులే మిన్నక యేడ్చుచుండు నిట్లు శ్రీకృష్ణావసథంబందు మెలంగుచు
నొక్కనాఁడు కృష్ణుని శయ్యాస్తరణంబులఁగాల్చి యలంకృతమైన గట్టువాలు
కన్నెల వాతలఁబెట్టి యలయించి కృష్ణుఁ జేరి పాయసంబుఁ దినియెద వండింపు
మనుడు. 215

క॥ శౌరియుఁ బాయసమును గో,క్షీరంబున వండఁజేసి ♦ చెలువుగ దానిన్
సారతర భక్ష్యములనుఁ, భూరితరాన్నోదకముల ♦ మునిపతికొసఁగెన్. 216

వ. అంత నమ్మునీశ్వరుండును.

ఆ॥ వేఁడి పాయసమును ♦ వేగ భుజించి శే, షించినట్టిదాని ♦ క్షిప్రముగను
దనువునంతఁ బూసి♦కొనుము కృష్ణా! యన, నతఁడు నొండుదలఁప ♦ కట్లుచేసె.

వ. మఱియు శ్రీకృష్ణుండు భక్తితో మునిప్రసాద మ్మొక్కపాదంబులందుఁ దక్క
తక్కిన శిరోముఖ్యాంగంబులందు లేపనం బొనరించుకొనియె నంత మునియును
ప్రత్యగ్రపుష్పలతికఁ బోలియుల్లసిల్లు కృష్ణాగ్రపత్నిని రుక్మిణిఁ జూచి. 218

గీ॥ ఇఁకను మిగిలినపాయస♦మెత్తితెచ్చి, యాపెయొడలునఁబూసి ర♦యముననామెఁ
బట్టి యొక తేరికింగట్టి ♦ బరవసమున, నెక్కి యూరేగె యాదవు ♦ లెల్లరుఁ గన.

క॥ మఱియును గృష్ణుఁడు గనఁగాఁ, గొరడాతో నొక్కదెబ్బఁ ♦ గోమలి నేసెన్
బరికించుచుండి హరి త, త్తఱ మొక్కింతేని గొనఁడు ♦ తాలిమిబల్మిన్. 220

క॥ పెఱయాదవు లప్పట్టున, హరియౌదాసీన్యమును శ ♦ తాత్ముఁడగు మునీ
శ్వరు విధముఁగని కినుకతోఁ, గొఱగొఱలాడంగ నుడిపె ♦ గోవిందుఁడొగిన్.

గీ॥ మునియునట్టులెరథ మెక్కి♦ పురమునెల్లఁ, బరుగుతోఁదిర్గుచుండఁగఁ♦ బథమునందు
నొక్కయెడ రుక్మిణీసతి ♦ యుక్కుమాలి, వ్రాలి నమ్ముని గశతోడ♦ బాదెమరల.

వ. కృష్ణుండు వీక్షించి మనంబునం దెటియక యవ్వారితో నడచుచుండె నంతఁ దాపసుండు క్రుద్ధుండై యరదంబు డిగ్గి పదాతియై గినియుచు వడివడిఁ దెన్ను మాలి పోవుచుండఁ గృష్ణుం డెదురుపోయి మ్రొక్కి నిలిచి మహాత్మా! యను గ్రహింపు మనుగ్రహింపుమని వేఁడుటఁ జూచి తేజస్వియగు నమ్మహాత్ముండు పరిహర్షితుండై శ్రీకృష్ణున కిట్లనియె. 223

## —* దూర్వాసుఁడు శ్రీకృష్ణునకు వరము లిచ్చుట *—

చ॥ గెలిచితివయ్య! కోపము నొ♦గిఁ బురుషోత్తమ! నుంతతప్ప నీ
వలన నెఱుంగ సంతసము ♦ వాటిలెఁ గోరుమికఁ వరంబులఁ
గలిమిదనర్ప నిచ్చెదను ♦ గ్రిచ్చఁఅ నెట్టివియైనఁ జూడు నా
బలితపు వైభవమ్మిపుడు ♦ పాయక సేయు మహార్థసిద్ధులఁ. 224

ఉ॥ ఓదనమందుఁ బ్రాణులకు ♦ నొప్పెడు నెట్లు జగంబునందు నా
మోదము నీయెడఁ దనరు ♦ భూరిగ నట్టులఁ బుణ్యమూ యశం
బేదుదు నీ త్రిలోకముల ♦ నెల్లను నున్నతిగందు వెంతయే
నాదరపాత్రమాదువు జ♦నార్దన! సర్వజగద్విభూషణా! 225

ఉ॥ నీనిలయంబునం దికఁను ♦ నే దహియించిన సర్వవస్తువుల్
మానుగఁ దొంటియట్లమరు ♦ మాధవ! యింకను మత్ప్రసాదముఁ
బూనిక నెందు నెందునను ♦ బూసితివోయట మిత్తిగల్గ ది
ట్లీ నెఱిఁదప్పి పాదముల ♦ నేలొకొ పూయవు మెచ్చ నేనటుల్. 226

క॥ అనినంతఁ గృష్ణుఁడును దన, తనువుఁ బరికింప నదియుఁ ♦ దద్దయు తేజో
ఘనమైయుండుటఁ గనుగొని, మనమున నక్కజముఁ జెందె ♦ మఱియుఁ మఱియుఁ.

గీ॥ మౌనిరుక్మిణినిఁ జూచి ♦ మానినీమ, ణిరో! మగువలందుఁ గడుఁ గీర్తి ♦ నెగడఁ గలవు
జరయు రుజయును నీకెప్పు♦డారయవమ్మ!, పుణ్యగంధమై దేహంబు ♦ పొలుచు నీకు.

క॥ పదునాఱు వేలుమించిన, ముదితలు నీసవతులందు ♦ మురువొప్పెదు వ
మ్మా! దయితుఁడీ హరియును గడు, ముదమునఁ గనుఁగొనెడు నిన్నుఁ ♦ బూర్ణేందుముఖీ!

క॥ అనియిటుల వరములను నిడి, ఘనుఁ డమ్మునినాథుఁడంతఁ ♦ గదలియ థేచ్ఛఁ
జనియెను హరియును రుక్మిణి, యును భవనమ్మునకుఁ జనిరి ♦ యుత్సాహమునఁ.

గీ॥ అందుముని దహియించిన ♦ యఖిలవస్తు, వులును దొల్లింటికన్న సొం♦పుగఁ గనుపడ
మదులఁ గడు నచ్చెరువుఁ జెంది ♦ మౌనివరుని, శక్తి నెంతయుఁ బొగడిరి ♦ సంతసమున.

వ. ఇట్లు దూర్వాసుండు పుడమి ననేకులఁ బరీక్షించి యభీష్టవరంబు లిచ్చె. కుంతి భోజునింటఁ గన్నియయై యున్నపు డమ్మహాత్ముం డామె పరిచర్యలకు మెచ్చి

సిద్ధమంత్రింబొసంగె, మఱియుఁ బాండవధర్మపత్నియగు ద్రోవది కభీష్టవరంబు లిచ్చె. ఇట్లు మహాతపోధనుండును మునికులాగ్రగణ్యుండును నగు దుర్వాసో మునిచరిత్రింబుఁ జెప్పితినిఁక హనుమదవతారలీలల్ గుఱించి యించుక ముచ్చ టించెద వినుండని సూతుండు మునులకిట్లనియె. 232

## —* హనుమదవతారలీల *—

క॥ తొల్లి శివవీర్యమును గొని, యల్ల మహాబలుఁడు రమణి ♦ యా నంజనియుం
దుల్లంబలరఁగఁ జేర్పఁగఁ, బ్రొల్లసదతిబలుఁడు హనుమఁ ♦ డుద్భవమయ్యెన్.

వ. అంత నతఁడు.

ఉ॥ పుట్టిన కొన్నినాళ్ళకె న ♦ భోమణిఁ జూచి ఫలంబు బుద్ధితో
నెట్టనఁ జేతఁబట్టి తిన ♦ నేర్మిఁ గడంగుచునుండ వేలుపుల్
చట్టనఁజేరి కాదిది ఫ♦లంబు ప్రభాకరుఁడంచుఁ జెప్పి తా
మెట్టులొ వీడఁజేసిరి ది♦నేశుఁ గపీశుని బుజ్జగించుచున్. 234

గీ॥ అతఁడును గొంతకాలంబు ♦ నవలఁజదువ, గోరి భానునికడకేగి ♦ భూరిమతిని
ఆ నవవ్యాకరణముల ♦ నధ్యయనము, చేసె నెంతయుఁ గోవిదుల్ ♦ వాసిఁబొగడ.

వ. అనంతరము పరమేష్ఠియనుమతి రామకార్యార్థమై సుగ్రీవుని ముఖమ్మున దాశ రథిన్ జేరి సాగరలంఘన సీతాసందర్శనాది ఘనకార్యంబులొనర్చి రామునికి బాసటయై వెంబరవిత్తులగు రావణాది రక్షోవీరుల వినాశనంబుఁజేయించి రామ కార్యంబు నెఱపి లోకంబున ననమానయశంబున్ బడసె నిది హనుమదవతారలీల యిఁక పిప్పలాదమున్యవతారలీల నెఱింగింతు వినుండని సూతుండిట్లనియె.

## —* పిప్పలాదమున్యవతారలీల *—

క॥ వినుఁడిఁక దధీచముని తపువ, జననాథుని నొడిసి దనుజ ♦ శాసనముఖులౌ
ననిమేషులను శపించిన, ఘనుఁ డనఘుఁడు శాంభవుండు ♦ కారుణికుండున్.

గీ॥ తత్సతి సువర్చనాఁగ ని♦తాంతసుగుణ, రాశి మగనికిఁజాయ క♦రణి మెలఁగుచు
సేవఁజేయుచు విభుమన♦శ్రీ నెఱింగి, సంతసంబున గాలంబు ♦ జరుపుచుండె.

క॥ సురపతి వృత్రాసురుతోఁ, బరిపీడితుఁడై సిలింప ♦ వర్గము దానుం
బరమేష్ఠిఁ జేరఁజని యు,త్తరఁగెల్ల వచింప విని వి♦ధియు నిట్లనియెన్. 239

చ॥ తెలిసె భవన్మనంబిఁక ద♦ధీచమహాముని శర్వసత్కృపా
కలితవరంబునన్ బడసె ♦ గాటపువజ్రమయాస్థివర్గమున్
జెలిమిని నమ్మునిప్రవరుఁ ♦ జేరి తదస్థులఁగోరి యద్ధనా
బలియుఁడు వానిమిాకొసఁగు ♦ భద్రము కాఁగలదిట్లు పొందిరన్. 240

క॥ అనిపనిచిన వారు దధీ, చి* నివాసముఁజేరఁబోయి ♦ చింతాయుతులై
యనుపముఁడగు నమ్మునివరుఁ, గనుఁగొనియిట్లనిరి భూరి♦కౌతుకమొదవన్. 241

మ॥ ఇతఁడే తీవ్రతపోవ్రతాధిగతవి ♦ శ్వేశానకారుణ్యసం
చితవిస్ఫూర్జితదివ్యవజ్రరచితా ♦ స్థివ్రాతసంశోభితా
యతతేజోమయమూర్తి సర్వసుమనో ♦ హార్థాభిసంధాయకో
న్నతపుణ్యాతిశయానువర్తి యసమా ♦ నంద్యైకవిస్ఫూర్తియున్. 242

వ. అనుటయు దధీచిముని యవ్వారలనుజూచి యుచితరీతిఁ బూజించి.

గీ॥ ఆర్తిఁదఱిసిన నవ్వారి♦యభిమతమును, దెలిసికొని వేగమునఁ దన♦పొలఁతియగు సు
వర్చనిఁకనొకయాశ్రమ♦పదముకనిపి, సురలకనె నేమికాంక్షింతు♦రెఱుఁగఁజెపుఁడు.

వ. అనియడుగఁగా సర్వశాస్త్ర ప్రవీణుండగు శక్రుండు స్వార్థపరుండై దధీచికిట్లనియె.

చ॥ మునివర! శైవభూషణస ♦ ముజ్జ్వల! చారుయశోనిధాన! నీ
ఘనమగు నస్థివర్గమును ♦ కాంక్షయొనర్చెద మిమ్ము దాని నే
ర్పొనరఁగ నాయుధమ్ములను ♦ నొద్దికఁగూర్చి తదీయధార వృ
త్రుని నిక నస్లై నయ్యసుర ♦ తోఁ జనుదెంచినవారిఁ గూల్చెదన్. 244

గీ॥ దాన జగముల కగు శాంతి ♦ మౌనిచంద్ర!, నీదు కీర్తి జగమెల్ల ♦ నిండి యెల్లరు
నెంతదనుకఁ బ్రపంచ మి♦ట్లొప్పుఁగాంచు, నెంతవఱకర్కతారేందు♦లెలమిఁగాంత్రు.

వ. సర్వజ్ఞుఁడవగు నీకు మేము వచింపవలయునే.

## —* దధీచిముని యోగముచేఁ బ్రాణములఁబాసి తనువును దేవతలకిచ్చుట *—

చ॥ అన విని మౌనిచంద్రుఁడు ర ♦ యమ్మున నంతఁ బరోపకారమం
దనురతుఁడై మనమ్మునఁ గృ♦పాకరు నీశ్వరుఁగొల్చి పెల్చనన్
దనువును బాసె నక్షర ము♦దారమునై తగు బ్రహ్మధామమున్
గొనియెను విగ్రహంబుపయి ♦ గొప్పగఁజేకుఱెఁ బుష్పవృష్టియున్. 246

గీ॥ కామధేనువుఁ దెచ్చి దు♦గ్ధములఁ దనువుఁ, గడిగి యవ్విశ్వకర్మచే ♦ గాటమైన
యస్థివితతినిఁజేయించి♦యాయుధముల, వెన్నెముకఁజెందెనింద్రుండు♦వృత్రుమలుప.

గీ॥ అంతలోన సువర్చ ని♦జాశ్రమంబుఁ, జేరి పెన్మిటి లేమియుఁ ♦ జిదియలైన
తనువు నెత్తురునఱదలు ♦ ననిమిషులను, గని తదీయవిధంబు సం♦తసునెఱింగి.

వ. ఎక్కుడు దుఃఖించి యమ్మహాసాధ్వి కినుకతో ననిమేషులన్ జూచి యిట్లని
శాపంబిచ్చె. 249

* పరా:—ఈ దధీచి దధీచ శబ్దము లికారాకారాంతములు రెండును మూలమందుఁ గలవు.

ఉ॥ తేరగవచ్చె వజ్రమయ ♦ దివ్యతరాయుధముల్ నిలింపులీ
తీరుగ నెవ్వరేని మునులం ♦ దెంపునఁ జంపిరె స్వార్థలోభులై
మీరలెఱుంగరే? వెఱవు ♦ మీఱి యొనర్చితి రిట్లు మీరు మీ
వారలు సౌఖ్యమున్ బడయఁ ♦ దక్కినవారలు చావ నేమగున్. 250

కం॥ పశుకృత్యముఁ జేసితి రిటు, విశయం బొకయింత లేక ♦ వేలుపులారా!
పిశితాశుల ననవలెనా?, పశువులగుదు రికమీఁద ♦ బాలిశమతితోన్. 251

కం॥ అని వేగమ్మున నాసతి, తన పతితోఁగూడ బ్రహ్మ ♦ ధామముఁ జెందన్
వనకాష్ఠంబులతోడఁ జి, తినిఁ జేర్పఁగ గగనభార ♦ తి యనె నిటు లొగిన్.

చ॥ వల దిటు సాహసింపకుము ♦ వారిజలోచన! నీదు గర్భమం
దలఘుతరోజుఁ డమ్మునివ ♦ రాగ్రిణి తేజము జేరియున్న దు
జ్జ్వలతనుఁడౌ కుమారుఁ గని ♦ చక్కఁగ నిక్కృతినిన్ బొనర్పు మ
వ్వల; నెటనేని మూర్ఖొనిన ♦ వారలు గాలరు భర్తతోఁ జితిన్. 253

కం॥ ఆకసపుఁ బలుకు వినియును, నాకులనై యప్పతివ్ర ♦ తాభరణము తాఁ
జేకొని యొకశిల నుదరము, జోకఁ బగులఁగొట్టె నందు ♦ శోభితలీలన్. 254

—* పిప్పలాద జననము *—

గీ॥ తనరుచుల వెల్గు పదిదెసల్ ♦ దనరిమిగుల, రుద్రునవతారమైకడు ♦ రుచిరమూర్తి
ఘనుఁడగు దధీచి తేజోభి ♦ కలితుఁడగుచుఁ, బొడమె నందనుఁ డాకెకుఁ ♦ బొంకముగను.

కం॥ నందనుగని తనమది నా, నందము నొందియును దనదు ♦ నాథుని వేగన్
జెందఁగఁ గడువడినైఁ జి, చ్చుం దఱియఁగ రావినీడ ♦ సుతుఁ జేర్చియనెన్.

గీ॥ రావినీడవసింపు చి ♦ రంబు తండ్రి!, యెల్లవారలకును సుఖం ♦ బీఁదలంపు
నేను పతిలోకమునకేగు ♦ దాన నీదు, తండ్రి నే నిన్ దలఁతుము రు ♦ ద్రస్వరూప!

వ. అని యప్పతిదేవత గొడుకును ముద్దుచేసి రయంబునఁ జిచ్చుఱికి పార్థివ తనువుఁ బాసి దివ్యదేహయై పతితోఁగూడి మహాకైలాసంబుఁ జేరఁబోయి యందుఁ బరమశివున్ గొల్చుచుండె నంత హరిబ్రహ్మాది సురవరులెల్లఁ జేరి రుద్రావతారుం డగు దధీచిముని తనయున్ గాంచి బహూకరించి పిప్పలాదుండని నామకరణంబు జేసి దేవా! లోకంబులకు సుఖంబొనరింపుమని కోరి దుందుభివాద్యంబులతో గంధర్వగానంబులతో నుత్సవం బొనర్చి యంతర్ధానంబొందిరి పిమ్మట పిప్పలాదుం డశ్వత్థమూలంబున నివసించి చిరకాలంబు తపంబుచేసి యనరణ్యాసుతన్ బెండ్లియాడె నాయుద్వాహకథనంబు మున్నొకమాఱు మీకెఱింగించితి నిక్ష యతినాథలీల నారయుండని సూతుండు మునులకిట్లనియె.

## —* యతినాథ లీల — ఆహుకభిల్ల చరిత్రము *—

ఉ॥ ఆహుకుఁడన్ వనేచరకు ♦ లాగ్రణి యొక్కరుఁ డర్బుదాద్రిపై
నాహుక నాగ సువ్రత మ ♦ హాశివభక్తియునైన చానతో
నా హరు శంకరున్ శివుని ♦ నర్మిలిఁ గొల్చుచునుండె నంత గో
వాహుఁడు వారి భక్తినిఁ గృ ♦ పామతిఁ గాంచి పరీక్షసేయఁగాన్. 259

క॥ ఆ యెఱుకవానిఁ బోలిన, సోయగమగు మేనిఁ జెంది ♦ సొంపుగ యతియై
డాయఁగవచ్చెను వేగిర, మా యర్బుదశైలమునకు ♦ హరుసంబలరన్. 260

ఉ॥ అత్తఱి భిల్లుఁడున్ దనకు ♦ నాత్మవధూటికి భోజనార్థమై
యుత్తలమొప్పఁ గైదువుల ♦ నొందు విలున్ గొని దవ్వుఁ జేరి యు
వ్వెత్తుగ మత్తజంతువుల ♦ వ్రేటునఁ గూలిచి తెచ్చుచుండెఁ బెం
పెత్తనబత్తిఁ దత్పతి మ♦హేశ్వరుఁ గొల్చుచునుండె నిక్కలోన్. 261

ఉ॥ ఆయతినాథుఁడాస్థలికి ♦ నాయెడఁజేరి వనేచరౌకముం
డాయఁగఁబోయె భిల్లుఁ డట ♦ డాసి మహాదర మొప్ప నయ్యతిన్
బాయనిభక్తిఁ గొల్చె యతి ♦ వల్లభుఁ డప్డు నిషాదుతో ననెన్
సాయమువేళ యయ్యె నెటు♦సాఁగుదు వ్రేఁగగు కొండకానలోన్. 262

ఉ॥ రాతిరి యెట్టులో వనచ♦రా! భవదీయపుఁ జక్కిలోన నేఁ
బ్రీతిగనుండి తెపటికి ♦ వేగ నెటేఁ జనువాఁడనన్న కై
రాతకుఁ డిట్లువల్కె యతి♦రాణ్మణి! నీనుడి నిక్కవంబె నా
యీతగు గీము స్వల్పతర ♦ మెట్లు వసింపఁగఁజేతు నిన్నిటన్. 263

చ॥ అన యతి దీనదృష్టిఁ గల♦యన్ గని పోవఁగనెంచ భిల్లి వే
గనె విభుతోడ నిట్లనియె ♦ కర్జముఁదప్పినఁ దప్పుధర్మ మీ
యనఘునిఁబంపఁజూడక గృ♦హంబున నుంపు మితండు నీవు గీ
మున నె పరుండుఁ డే నిరవు ♦ ముందఱ నిద్దురపోదు వెల్పటన్. 264

గీ॥ ఆయుధమ్ముల నన్నియు♦నవలఁ జేర్తు, సుఖముగా మీరలిద్దఱు♦బొక్కుఁ డిందు
నతిథిమెచ్చును ధర్మంబు ♦ హానికాదు, గేస్తు తెఱఁగిది కాదేని♦ గెంటువడును.

ఉ॥ భిల్లి యిటుల్వచింప విని ♦ భిల్లుఁడు చింతయొనర్చె నుల్లమం
దిల్లిది చాలదయ్యె నతి♦థీశ్వరు భూరితరాటవీస్థలిన్
బెల్లగు చీఁకటిన్ విడువఁ ♦ బేరిమి హాయును మాయు ధర్మ మీ
హల్లకపాణి నొక్కరిత ♦ నావల గెంటి పరుండఁజెల్లునే? 266

క॥ ఈ రెండుతీరులందును, నేరమె గన్పట్టుచుండె ♦ నేనే యవలన్
జేరెద నాయుధవర్గముఁ, జేరిచెద బహిస్థలంబు ♦ చేవ యిది యగున్. 267

సీ॥ వీర లిద్దరు నిదురింతు రీ ♦ వేశ్మమందు, కాఁగలట్టిది యగునని ♦ వేగ నాతఁ
డాయుధంబుల నన్నిటి ♦ నవలఁజేర్చి, తానును బరుండె వెలపల ♦ ధర్మమెంచి.

గీ॥ యతియును నిషాదినియును గే♦హమున నిదురఁ
జెందిరిఁక నైశతమములు ♦ గ్రిందుకొనియె
నంత నద్దమరేయి సిం♦హములు పులులు
నెలుఁగుఁ గని రా నతండును ♦ నేపుసూపి. 269

—* భిల్లుఁడు సింగములతోఁ బోరి చచ్చుట *—

ఉ॥ కైదువులొంది ధీరతఁ బ్ర♦కాశిల ఘాతుకజంతుమండలిన్
మోఁదుచుఁ బోరుచుండెఁ బసి♦పూని గభాలున నవ్వి భిల్లు మీఁ
మీఁదికివచ్చి వ్రచ్చి పొల ♦ మెక్కి యథేచ్ఛనుబోయె నంత సూ
ర్యోదయవేళ నయ్యతివ♦రోత్తముఁ డీవలఁజేరి చూడఁగన్. 270

సీ॥ భిల్లుఁ డగుపట్టఁడయ్యె యం♦దెల్లకడల, శోణితాక్తమౌ నచ్చోటఁ♦జూడఁబడియె
వానియస్థులఁ గనుగొని♦దీనుఁడగుచుఁ, గటకటా! యని దుఃఖించెఁ♦గరుణమీఱి.

సీ॥ అంత భిల్లియు వేగిర ♦ మచటఁజేరి, భర్తయస్థులఁ బరికించి ♦ ప్రబలశోక
భారపీడితయై కడు ♦ వగచె నచటి, కొండలెల్లఁ బ్రతిధ్వని ♦ గొప్పసేయ.

చ॥ అటు లొకకొంతసేపు హృద♦యంబున నెవ్వఁగఁజిక్కి పొక్కి యం
తట వ్యసనంబు మాని మది ♦ ధైర్యముఁజెంది యతీంద్రవర్యుతో
నిటులనె మామకీనహృద♦యేశ్వరుఁ డేగిన తెన్నుఁబట్టి లం
పటనయి పోవుదాన ముర♦పంబెసఁగన్ రచియింపుమీ చితిన్. 273

క॥ ప్రారబ్ధకర్మచోదిత, భూరిగహనసత్వచయబు♦భుక్షావశుఁడై
నారమణుఁడు మడిసెను విభుఁ, జేరఁజనెద నిదియె సూటి ♦ చేడెల కెందున్.

క॥ ధన్యుఁ డితఁడు కృతకృత్యుఁడు, మాన్యుని నిను బూజచేసె♦మాపున నిఁక నే
మన్యంబెంచక స్థల మిడె,నా న్యాయవిశేషమట్టు ♦ లరయుదురె యొరుల్.

వ. అంతఁ గృతకయతియు.

గీ॥ ఆటవికబోటి పలుకుల♦నాలకించి, తగవిదియటంచు మదిలోనఁ♦దలఁచి వేగ
అస్థులను బ్రోగుచేసి శు♦ష్కవనీజ, ములనుబేరిచి చిచ్చు ర♦గులుప నందు.

ఉ॥ ఆశబరీమతల్లి జల♦మాడి విశుద్ధపటంబుఁ గట్టి యా
వేశముతోడ నచ్చితికి ♦ వేగఁ బ్రదక్షిణ మాచరించి హృ
ద్దేశమునందు సర్వజగ♦తీ పరిశాసనకర్తయైన యా
శ్రీశివమూర్తికిన్ నతులు ♦ చేసి ప్రియంబున నిట్లు వాకొనెన్. 277

క॥ తెలిసీ తెలియని నాచేఁ, తల ననుచిత మెంతయేనిఁ ♦ జనరేడుఁ గృప నా
కలుషములఁ బాపు మిదెజో, తలు సేసెద దేవదేవ! ♦ దర్పకదమనా! 278

వ. ఇఁకను.

సీ॥ ఎత్తిన వేడ్కనైన ♦ యెడపక నీపాద, పద్మచింతనమును ♦ బాయనేని
విభుని దైవముగ భా♦వించి తదాజ్ఞఁజే, కొని మేలినడవడి ♦ మనెదనేని
కల్లనెవ్వాడు నాలు♦కకుఁ జొరనీక స, త్యంబె పట్టని మదిఁ ♦ దలఁతునేని
అతిథులయందు న♦భ్యాగతులందును, బేర్మి నన్నంబు ల♦ర్పింతునేని
గీ॥ ఇఁకను జన్మంబు మరల నా♦కిడెదవేని, దాసజనుల కభీష్టముల్ ♦ దార్తువేని
భిల్లు నాహుకునే గూర్చు♦విభునినాకుఁ, బర్వతేంద్రసుతామనః ♦ పద్మమిత్ర! 279

వ. మఱియును.

క॥ జన్మములెన్నియొసంగిన, నిన్మఱవంజాల నట్టి ♦ నేటుగు భక్తిన్
మన్మనమునఁ బెనుపుము త్రిజ, గన్మోహన! దివ్యచరిత! ♦ గౌరీకాంతా! 280
క॥ అని శివునకుఁ దన మానస, మునఁ బూజనొనర్చి వేగఁ ♦ బువ్వుఁబోఁడి హుతా
శనుమధ్య కెగసి దుమికెను, ఘనతరసాధ్వీయశంబు ♦ గడలుకొన దిశల్.

వ. అంత శివుం డా కైతవయతి రూపంబు విడిచి ప్రత్యక్షుండై యప్పతివ్రతారత్నం
బున కిట్లనియె. 282

—* భిల్లసతికి శివుఁడు ప్రసన్నుండై వరంబులిచ్చుట *—

ఉ॥ ధన్యవు ధన్యవీ విఁక ని ♦ శాంతము నిన్ వరియించినట్టి సౌ
జన్యనిధాన మీశబర ♦ సత్తముఁ డాహుకనామధేయుఁడున్
ధన్యుఁడు సంతసం బొదవెఁ ♦ దద్దయు నీ పరిపూతరీతికిన్
మాన్యచరిత్ర! సందియము ♦ మాని వరంబులఁ గోరు మిచ్చెదన్. 283

వ. అనినంత.

గీ॥ ఆతతానందకందమై ♦ యలరుపరమ, శివునినుడివిని హారుసంబుఁ ♦ జెంది మ్రొక్కి—
యూరకుండె నిషాదిని♦యురుతరకరు, ణాళుఁడై యిట్లుపల్కెఁ జం♦ద్రార్ధమౌళి.
క॥ ఈజన్మ మిందుఁగడచె వి, రాజితగతి నీకు భిల్ల♦రాముని కిటులన్
బైజన్మమునసిరులు పై, పైఁ జెన్నెసలారఁగలవు ♦ పల్కెద వినుమా! 285
ఉ॥ చందురు వంగసంబునఁ బ్ర♦శస్తి వహించిన వీరసేనరా
జేందునికిన్ దనూజుఁడయి ♦ యీ శబరుండు నలుండనాఁగ బు
ట్టొందుఁ జతుస్సముద్రరశ ♦ నోన్నతదివ్యదిలాధినాథసం
క్రందనుఁడై సిరిన్ దనరు ♦ గాఢయశంబును జెందు నెంతయున్. 286

ఉ॥ నీవు విదర్భనేలు నర♦నేతకు భీమునకున్ గుమార్తవై
యావటిలంగఁ బేర్మి దమ♦యంతి యనన్ బడు పేరితో నన
న్యావహరూపకాంతిసుగు♦ణాకరవై యమరేంద్రముఖ్యులన్
బోవిడి యన్నలున్ నృపతి♦ పూజ్య వరించి సుఖంతు వెంతయున్. 287

ఉ॥ ఏను యతీంద్రరూపమున♦ నెంతయు మీ పరిచర్య లొందుటన్
మానిని! రాజహంసనయి♦ మంచిగ నీకును నైషధావనీ
జానికి మొక్కలంబయిన♦ చక్కని కూరిమిఁ గూర్చి పెండిలిన్
మానుగఁగూర్తు నిర్వురు స♦మంచితభోగము లొందుదుర్భువిన్. 288

క॥ ఒక కొమరుఁడు పుట్టును వా, నికిఁ జంద్రాంగదుఁడనాఁగ♦ నిరుపమశీలుం
డకలుషుఁడు పొడము నవ్వా, నికి సీమంతిని శివార్చ్య♦నిరత సతి యగున్. 289

వ. వీర లిర్వురచే మీవంగడంబుపావనంబై దేదీప్యమానంబుగ లోకప్రసిద్ధంబగు టయేకాక యనేకజనంబులకుఁ దారకంబై పుణ్యమార్గదాయకంబై యలరు.

మ॥ అవసానంబున మీర లిర్వురును నా♦ యాత్యంతికంబైన భ
క్తివిశేషంబునుజెంది యోగము మదిన్♦ గీల్కొల్పి యద్దాన ను
ద్భవ నాశంబులులేని మోక్షపదమున్♦ ప్రాపింతురునాఁజెప్పి యా
శివుఁ డవ్వారలచోట లింగమయి వా♦సిన్ జెందె మోదంబునన్. 291

క॥ అచలంబగు లింగంబై, నచలముపై వెలసినట్టి♦ యక్కటతమున నం
దచలేశ్వరుఁడను నాహ్వాయ, మచలేంద్రసుతావిభుండు♦ హరుఁడొందె నటుల్.

గీ॥ భిల్లదంపతు లట్లు బల్♦ పేర్మిమైన, నంతరపు జన్మమందు రా♦జాధిరాజ
పదవి దంపతులై శివ♦భక్తి నొంది, ముక్తినొందిరి శ్రీశివ♦ సూక్తిసరణి.

క॥ ఈ చరితంబు పవిత్రం, బై చెలువగు యతియు రాజ♦హంసంబున్నై
శ్రీచెన్నగు శివులీలల, నేచిన రహిఁ వినినఁ గాంతు♦ రెల్ల సుఖములన్. 294

క॥ సర్వైహికభోగంబుల, సర్వస్వర్లోకభోగ♦ సౌఖ్యంబులనున్
శర్వునిపై భక్తియుఁ గడు, హర్వ్యాగఁ గాంతురు వినిచిన♦ నన్యులకుఁ దగన్.

వ. ఇఁక శివభక్తాగ్రగణ్యుండును బయఃపారావారసాధకుండును బ్రహ్మఋషియునగు నుపమన్యుమహామునీంద్రుని చరిత్రంబుఁ దెలుపు సురేశ్వరలీలను జెప్పెదభక్తితో నాలకింపుఁడని యిట్లనియె. 296

## —* సురేశ్వరలీల - ఉపమన్యు చరిత్రము *—

క॥ ఉపమన్యుఁడు మునిమాన్యుఁడు, విపులశివకృపానులబ్ధ♦ విమలజనిఘనుం
డుపగతమోహాటోపుఁడు, నుపముఁడు శ్రీవ్యాఘ్రపాత్తు♦ నూజుఁడు పుడమిన్.

సీ॥ ధౌమ్యమునిపూర్వజుఁడతండు♦తనదుపూర్వ,జన్మమునసిద్ధుఁడయ్యెనే♦చందమునను
స్వపదముననుండిజాతియో♦జాడమునికిఁ, గొమరుఁడై పుట్టెదైవయో♦గమునఁ జేసి.

చ॥ శివునియనుగ్రహంబున నె ♦ చిన్నతనంబునఁ బాలుపైఁ దమిన్
దవిలి తపంబొనర్చి సత♦తంబు కుమారదశన్ గణేశితన్
శివపరతత్త్వవక్తృతను ♦ క్షీరసముద్రము సర్వవైదుషిన్
శివకరపాదుకాద్వయినిఁ ♦ జెంది భువిన్ సిరులొందెఁ బొందుగన్. 299

క॥ అని నొడివిన సూతునినుడి, విని మోదముతోడ మునులు ♦ వేగిరముగ నా
యనఘుం డుపమన్యుచరి, త్రను సర్వముఁ జెప్పుమనుడుఁ♦జక్కఁగ నతఁడున్

గీ॥ వినుఁ డతఁ డొకప్డు కడుపసి♦తనమునందుఁ, దల్లితో మేనమామల♦తావు కేగి
కొన్నిపొద్దులచోటనుండి♦కోరిమరలఁ, దమయిరవుఁజేరియుండెనం♦తనొకనాఁడు

ఉ॥ త్రావుట కావుపాలొసఁగు ♦ తల్లి! యనంగఁ దదంబ రాగులన్
దా వెసదంచి పిష్టము సు♦దంబునఁ జేరిచి తెచ్చి పాలుగా
నావిడ యిచ్చెదున్ బుడుతఁ ♦ డారసి పాలివి గావు తల్లి! న
న్నీవిటు మోసపుచ్చఁదగు♦నే! యన నాపెయుఁ గుంది యాత్మలోన్. 302

వ. కుమారున కిట్లనియె.

ఉ॥ నిక్కము తండ్రి! నీనుడి; వ♦నిన్ వసియించి యిటున్నవారమా
యెక్కువ యావుపాలు మన ♦ కెట్లు లభించును? మేనమామగా
రిక్కను గ్రోలితీవు కడు ♦ నింపగు నాలవయస్సు లట్టి వీ
చక్కని దుర్లభంబు తను♦జా! ననుఁ బొక్కఁగఁ జేయ కీయెడన్. 303

ఉ॥ సేద్యము లే దొకింతయును ♦ జేడ్పడియుంటిమి లేమితో నిటుల్
చోద్యముగాదె గవ్య మెటు ♦ చొప్పడు నీకుఁ గుమార! పూర్వమం
దాద్యు మహేశ్వరున్ శివుని ♦ నర్చనసేయము దివ్యకాంతమై
హృద్యమతిన్ దలంచి యిపు ♦ డీశ్వరుఁగొల్వ లభించు దుగ్ధముల్. 304

ఆ॥ చోళ్ళపిండి నీటఁ ♦ జొప్పించి యిటు పాల,వలె నమర్చి యిడితి ♦ వాస్తవంబె
చవి నెఱింగియుంట♦సరగున నవ్వాని,ద్రోసి యిట్లు హఠముఁ♦దొడరఁజనునె?

మ॥ అనినన్ డింభకుఁ డప్డు తల్లిఁగని ధై♦ర్యంబొంది యిమ్మాద్రిఁ బ
ల్కెను దల్లి! పొగులంగ మాను మికఁ దా♦ల్మిన్ జెందు డెందంబునన్
మనదారిద్ర్యమువాసె నేఁటికి మరు♦న్నాథుండు శర్వుండు నీ
వనిన ట్లున్నయెడన్ దగన్ గొలిచి నే♦నార్జింతు దుగ్ధోదధిన్. 306

క॥ అన నాపెయు నాయన! యో, మనుమానము లేదు శంభుఁ♦డాద్యుఁడు పరముం
డనుకంపాంచితహృదయుఁడు,ఘనుఁ డార్యాహృదయవిభుఁడు♦గలఁడు దృఢముగాన్.

క॥ కలఁడు హుతాశనమండలిఁ, గలఁడు గభీరాంబురాశి ♦ కాండములందున్
గలఁడోషధీచయంబులఁ, గలఁడుగలండీ యఖిలజ ♦ గములఁ గుమారా! 308

—* ఉపమన్యునకుఁ దల్లి శివుని వైభవంబుఁ జెప్పుట *—

ఉ॥ ఆతనిచేతనే జగము ♦ లన్నియు నిట్లు జనించె మించుగా
నాతనిఁ గొల్చి రెల్లసుర ♦ లవ్విధి విష్ణువు లెప్డు దాసులై
యాతని సుప్రసాదమున ♦ నక్షరభాగ్యము లొందు నెందు న
ల్లాతఁడె విస్మితన్ మనకు ♦ నందఱకున్ గల దిక్కు పుత్రకా! 309

వ. కావున.

ఉ॥ ఆ హరు నా మహేశ్వరు శు♦భావహుఁ గొల్వుము లాఁతివేల్పులన్
నీ హృదయంబునన్ దలఁప♦నేరకు చేరకు వారి జాడకెం
దా హిమశైలజావిభుని ♦ నా ప్రమథాధిపతిన్ దయామయున్
గోహయు బాలచంద్రధరుఁ ♦ గూరుచు విద్య నొసంగెదన్ సుతా! 310

గీ॥ సప్తకోటిమహామంత్ర ♦ సమితియందు
రాణఁ దనరెడు పంచాక్ష♦రమను నెందు
శివున కిది వాచకంబై ప్ర♦సిద్ధిఁ జెందు
సర్వమంత్రంబు లిటఁ జేరి ♦ శక్తినొందు. 311

గీ॥ సర్వమంత్రంబులందుఁ బ్ర♦శస్త మిద్ది, సర్వరక్షాపరంబయి ♦ జానుమీఱు
నిద్ది రసనాంచలముఁ జేరె♦నేని దుర్లభం బరుదుగానఁ బంచాక్ష ♦ రంబుఁ గొనుము.

గీ॥ అరయు తజ్జాతమగు సఘో♦రాస్త్రమంత్ర,మును ననుత్తమమైభువిఁ ♦ దనరు శైవ
జనసమూహమున కిది ర♦క్షావహంబు, దీనిఁగూరిమి సేవింపు ♦ వేఱువలదు. 314

గీ॥ తండ్రి విరజాగ్నిఁ గొనిన సు♦త్తమభసితము, గలదు నీకని దాఁచితిఁ ♦ గలుషహరము
మంత్రములతోడ నిత్తుఁ గు♦మార! కొనుము, దీననీకగు రక్ష సం♦దియము లేదు.

ధ్రువకోకిల: అని కుమారున కాపె మంత్రము ♦ లట్లు చెప్పియు నా విభూ
తిని నొసంగి శివంబు నీకిడు ♦ దేవుఁ డల్ల శివుండనన్
దనయుఁ డంతఁ గడున్ గడున్ బ్రియ ♦ దంబునొంది మనంబునన్
జననికిన్ బలుమాఱు మ్రొక్కులు♦సల్పి యిట్లనె హెచ్చుగాన్.

క॥ సేవించెద శివు నమ్మరో!, భావించెద మదిఁ దదీయ ♦ పదనళినయుగళిన్
గావించెద ఘనతపమున్, శ్రీవెంచెద శంభుదత్త ♦ సిద్ధుల కలిమిన్. 317

క॥ రప్పించెద శివు నిచటికి, మెప్పించెదఁ దన్మనంబు ♦ మేలిమి భక్తిన్
దప్పించెద సకలాఘులఁ, దెప్పించెదఁ బాలకడలిఁ ♦ దేఁకువ యెసఁగన్. 318

శా॥ శ్రీలాలిత్యముమీఱఁ దల్లికి సమీ♦చీనోక్తు లిబ్బంగిఁగా
బాలుం డప్డు వచించి తాఁ బయనముం♦ బాంఛింపఁ దన్మాతయుం
వాలాయంబుగ నిన్ను మెచ్చు నగజా♦ప్రాణేశ్వరుం డీశ్వరుం
డాలంబుం బొనరింపఁ డిచ్చుఁ బరమా♦హ్లాదంబునం భద్రముల్. 319

చ॥ మఱియుఁ గుమార! యొక్కనుడి ♦ మంచిగ విన్ము శివుండు భక్తిఁదా
నెఱుఁగఁగఁ గోరి సేయును బ♦రీక్ష చరాచరజంతుమండలిన్
నెఱి నొకచేతనాకృతిని ♦ నొక్కని డాసి భ్రమింపఁజేయు నె
త్తెఱఁగున నేని మార్పడక ♦ తేఁకువ నారయుమా! మహేశ్వరున్. 320

శా॥ దుర్విజ్ఞేయుఁడు చాపలాత్ముల కిలన్ ♦ దుర్దర్శుఁడై యొప్పు నా
శర్వుం డర్భక! తద్విచిత్రగతు లెం♦చన్ జాల రెవ్వారలా
సర్వేశానుని దివ్యరూపములఁ బ్రి♦స్తావింతు యోజింపుమీ
యుర్విన్ భక్తులఁ బ్రోవఁ బోవుతఱి డా♦యున్ వాని మై దూదుచున్. 321

క॥ కమలజమధురిపురుద్రుల, విమలాకృతులను మహేంద్ర ♦ విశ్వేదేవ
ద్యుమణివిధుదస్రరూపము, లమరికఁ జేకొను మహేశుఁ♦డరయుము పుత్త్రా!

చ॥ నరులయు దివ్యపుంగవుల ♦ నారుల రూపములన్ బిశాచకి
న్నరనరయక్షరాక్షసఖ ♦ గాధరభిల్లకిరాతమూర్తులన్
హరిశరభేభసైరిభవృ ♦ షాశ్వతరాఽశ్వతరక్షుఋక్షసూ
కరముల వ్యాఘ్రజంబుకవృ ♦ కప్రకరంబులమూర్తు లొందెడున్, 323

గీ॥ మఱి యులూకబలాకోష్ట్ర♦మకరకాక, గృధ్రచక్రాంగ కృకలాస ♦ కీరగరుడ
క్రౌంచమేషాజబర్హిశ్వ♦గాత్రములను, దవిలి చేకొని బాలేందు♦ధరుఁడు డాయు.

క॥ పాడిమొదపై యొకప్పుడు, దూడయగుచు నొక్కమాఱు ♦ తోరపువేడ్కన్
గోడెయయి లేడియయి మేల్, గోడిగయయి యొక్కమాఱు ♦ గూడఁగవచ్చున్.

ఉ॥ పాముల ప్రోగులన్ మఱియుఁ ♦ బాముల మేల్మికడెంబులన్ మఱిన్
బాముల పేరులన్ బడసి ♦ పాముని జందియమున్ బొనర్చి పెన్
బామునఁ గెంజడల్ మిగుల ♦ వాటముగా బిగియించి కట్టి య
క్కోమలచంద్రమండనుఁడు ♦ గుల్కుచువచ్చు నెఱుంగు పుత్త్రికా! 326

క॥ గొడుగును గమండలంబును, నిడినగు గట్టయును దాల్చి ♦ సీటొప్ప నొక
ప్పుడు గత్తిని గొడ్డలినిన్, జెడిదపురోకలిని గదను ♦ జేత్మ ధరించున్. 327

ఉ॥ ఆడుచునుండు జంత్రముల ♦ హాయిగ మేళనచేసి రాగముల్
పాడుచునుండు వేదములఁ ♦ బల్కుచునుండును నవ్వుచుండు బ
ల్వేడుకసేయుచుండు పవ♦ళించియు నుండును నావులించు బి
ట్టేడుచుచుండు వేడబము ♦ లెంచఁగరావు కుమారచంద్రమా! 328

క॥ కడుఁ బసిపాపై యొకపరి, కడుముదుకై యొక్కతఱిఁ జా♦కాటపు యువయై
పొడసూపు నొక్కతడవను, బొడవుగ నొకమాఱు మరలఁ ♦ బొట్టిగఁబొలుచున్.

క॥ జోగిగఁగుఱ్ఱమ్మరు నలుగడ, యోగిగఁ దనరారుచుండు ♦ నొక్కెడఁ జెవిటై
మూఁగగఁ గుంటిగ గుడ్డిగ, దాఁగనుపడుచుండు శివుఁడు ♦ తనయా! వినుమా!

ఉ॥ వేలకొలంది బాహువులు ♦ వేలకొలంది పదంబులున్ మఱిన్
వేలకొలందిగాఁ గనులు ♦ వేలకొలందిగ వీనులున్ గడున్
వేలకొలంది నాసికలు ♦ వేలకొలంది తలల్ ధరించి మే
ల్లీలల నొప్పసల్పుచు ల♦లిన్ గనవచ్చు శివుండు పుత్త్రకా! 331

ఉ॥ ఏనికమోముతోడ మఱి ♦ యేనికగొంగ మొగంబుతోడ సొం
పై నుతికెక్కె నెక్కుడు ము ♦ ఖావళితోడను నూర్ధ్వకేశుఁడై
జానుగ గోష్ఠమధ్యమున ♦ జన్నపుస్తంభమునందు నగ్నినిన్
మానక వేదిమధ్యమున ♦ మారహరుం డలరున్ గుమారకా! 332

క॥ తెల్లనివాఁడై యొకపరి, నల్లనివాఁడై యొకప్డు ♦ నానావర్ణ
ప్రోల్లలితుండై యొకమా, అల్లమహాదేవమూర్తి ♦ యగుపట్టు సుతా! 333

ఉ॥ కావున నంతయేని మదిఁ ♦ గశ్మలభావముఁ జెంద కెంతయున్
భావపురస్సరంబుగ శి♦వావిభు నీశ్వరు నమ్మి కొల్వు మా
దైవతపూజితుండు సము♦దారవరంబుల నీకొసంగు సు
శ్రీ విలసిల్ల సిద్ధులను ♦ జేకొని రమ్మిఁక వేగిరమ్ముగాన్. 334

## —* ఉపమన్యుఁడు హిమాద్రిఁజేరి శివునిఁగూర్చి తపం బొనరించుట *—

క॥ అని మూర్ధంబునఁ జేయిడి, పనిచెను దనుజాతు నతఁడు ♦ పరువునఁ దుహినా
ద్రినిఁజేరి యందు గంగా, ధునితటి నిరవొంది సలిపెఁ ♦ దుశ్చర తపమున్.

గీ॥ ఎనిమిదిటుకలతోడ నిం♦పెనయునొక్క, దేవళముఁగట్టియందుఁ బా♦ర్థివములింగ
మెలమి నెలకొల్పి శివుఁబార్వ♦తీశునావ, హించి జలబిల్వతతులఁ బూ♦జించుచుండె.

క॥ పంచాక్షరమంత్రమును జపించుచు లింగార్చనమును ♦ వేడ్కనలుపుచున్
జంచలభావమ్మొందక, పంచాబ్దము లొప్పవిప్ర ♦ బాలుఁడు పేర్మిన్. 337

గీ॥ తపసొనర్చుచునుండఁ గొం♦దఱు మరీచి, శప్తులైనట్టి మానిపి♦శాచు లపుడు
పావనిన్ భయపెట్టి త♦పంబుఁజెఱుపఁ, బూన నర్భకుఁ డుడుగక ♦ పూన్కి మెఱసి.

క॥ వంచితుఁడుగాక యెపుడును, బంచాక్షరదివ్యమంత్ర ♦ పరతంత్రుండై
మించి యుదంచితశక్తి మ, రించెన్ బైశాచవితతి ♦ కృతవిఘ్నములన్. 339

వ. అంత నవ్వారలు పంచాక్షరీనాదశ్రవణంబునఁ బామసభావంబు వీడి రతిమొదలా
చిట్టిముని కుపచారంబు లొనర్చుచుండి రంత నతండును. 340

సీ॥ అవనిని వామపా♦దాంగుష్ఠమున మోపి, ఫలమునఁ దపసొందె ♦ వందయేండ్లు
పండును విడి శీర్ణ ♦ పత్రంబునున్ దిని, ప్రౌఢిఁ దపంబొందె ♦ వందయేండ్లు
పత్రంబునున్ మాని ♦ పానీయముల నాని, పరగఁ దపంబొందె ♦ వందయేండ్లు
వారిఁగ్రోలుటఁ బాసి ♦ వాయుభక్షణఁజేసి, తపమొందె నేడువం ♦ దలగునేండ్లు

గీ॥ వర్షసాహస్రమిట్లు త♦పంబుఁజెంద, మునితపంబు నెదర్ మెచ్చి ♦ ముఖ్యభక్తుఁ
డని యెఱింగియుమది మఱి♦నరయఁగోరి, భర్గుఁడంత మహేంద్రరూ♦పంబుఁదాల్చె.

—* శివుఁడు దేవేంద్రుఁడై వచ్చి యుపమన్యునకు వరమిచ్చెద ననుట *—

గీ॥ అమరగణములతోడను ♦ నప్పరోజ, నములతోడను సిద్ధగం ♦ ధర్వయక్ష
వరులతోడఁ గిరీటంబు ♦ వజ్రకుండ, లముల ముక్తావళులఁ దాల్చి ♦ కొమరుమీఱ.

చ॥ అమృతమువోలెఁ దెల్లనయి ♦ యద్రివలెన్ ఘనమై కడున్ గడున్
స్తిమితములౌ శ్రుతిద్వయ ము♦దీర్ణతరారుణనేత్రయుగ్మమున్
గొమరగు మేలితొండమును ♦ గొప్పమదస్రుతియొప్పి నాల్గు దం
తములుగలట్టి ప్రాగిభ ము♦దారత నెక్కి మహోత్సవంబునన్. 343

క॥ వెల్లగొడుగు గిరుగడల శో, భిల్లెడు చామరయుగంబు ♦ వెలయఁగఁ బువ్వుల్
చల్లఁగ జేజేల్ గడురం, జిల్లుచు నచ్చరలు నెలమి♦చే నటియింపన్. 334

గీ॥ కెలనఁబౌలోమిపేర్మిమై♦యలర నాస, హస్రనయనుఁడు మునిడాసి ♦ యనియెనీదు
తపసునకు నేఁగరంబు ము♦దంబువడితి, వరములన్ గోరు మిచ్చెద ♦ వాసిమీఱ.

క॥ అనుడు ముని యాబిడౌజునిఁ, గని యంత నమస్కరించి ♦ గారవమున నో
యనిమిషనాథా! శివభ, క్తిని నిడుమని తొంటివలె నొ♦గిన్ దపియించెన్. 346

చ॥ కనుఁగొని దేవవల్లభుఁడు ♦ గ్రక్కున మానికుమారుఁ గాంచి నీ
మనసుననున్న గోర్కులను ♦ మా కెఱిఁగింపకయుంటి వోరి! య
మ్మనసిజవైరిఁగూర్చి యన♦మాన తపం బిటు సేయుచుంటి వా
తనివస నేనెఱుంగనిదె? ♦ తల్పుము నిల్పుము నానుడుల్ మదిన్. 347

క॥ అని కొన్ని దూషణోక్తుల, ముని కనుతాపంబుగదురఁ ♦ బురుహూతుఁడు ప
ల్కినవినికినుకనుగొనియతఁ, డనియెను దుశ్చ్యవనుఁగనిమ ♦ హాగ్రహమొదవన్.

మ॥ నిను నేఁగోరను గోర వాంఛితములన్ ♦ నిక్కంబు దేవేంద్ర! నీ
యనుకంపన్ మదిలోఁ దలంప నెపు డ♦న్యాదిత్యసంఘంబుచే
తనుగానీ గొనఁగాఁ దలంప వరముల్ ♦ తథ్యంబు సర్వేశ్వరుం
డినచంద్రానలలోచనుం డిడెడు నా ♦ కిష్టార్థసామ్రాజ్యముల్. 349

ఉ॥ ఈ నుడి నిశ్చితంబనుచు ♦ నెంచుము నీ మదిలో నొకించు
శానుని సర్వదివ్యగణ♦శాసను నిందయొనర్చి తీయెడన్
గానక వేదపుంజములఁ ♦ గానక నార్షపథంబుఁ గన్నులన్
గానక శార్వవైభవముఁ ♦ గల్లరి యల్లరి మాని విన్మిఁకన్. 350

క॥ పశుపతినుడి నవుదును నేఁను శచీపతి పురువునే న♦నోకహమును నేన్
పశుపతిభిన్నోక్తికి నా, వశమగుఁ త్రైలోక్యలక్ష్మిఁ ♦ బాయుదు నపుడే.

క॥ హరచరణనళినసేవా, నిరతి నమరు పుల్కసునిజ ♦ నిన్ బడయుదు నా
హరుభక్తి నీఁగొనని పురందరు జన్మముఁగాని యెపుడు ♦ దాల్చను వినుమా!

క॥ చాలున్ జాలును వేఱగు, నాలాపము లొందనేల ♦ యన్యకథల నే
వేళను క్షణార్ధమేనియుఁ, గాలహరుని భజనవిడక ♦ గడపు జనునకున్. 353

క॥ ఒకదిన మర్ధదినము నే, నొకఁడు ముహూర్తంబునేని ♦ నొకక్షణమేన్న
మ్మకమైనభక్తి యొనరదు, సకలేశునను‌గ్రహంబు ♦ సమకూరనిచోన్. 354

క॥ కృమినేనియు లేక పతం, గమునేనియు నట్లుకాక ♦ కడునేవపు శ్వా
నమునేని యగుదు శివునడి, నమరప్రాభవమునొల్ల ♦ నన్యుల నుడులన్. 355

ఉ॥ నాకముగాని నీయమర ♦ నాయకపీఠముగాని యల్లనా
ళీకభవాధిపత్యమును ♦ లేక నిరంజనమాపదంబుగా
నీ కరమొప్పుకోర్కుల న♦నేకములన్ విడనాడి పేర్మిమై
శ్రీకరుణాళుఁడౌ శివుని ♦ సేవకవృత్తిని గోరెదన్ జుమీ. 356

క॥ ఎంతవఱ కిందురేఖా, కాంతజటాజూటు డద్రి ♦ కన్యాచేతః
కాంతుఁడు మెచ్చఁడో యంతకుఁ, గాంతు జరామరణజన్మ ♦ ఘనదుఃఖములన్.

చ॥ రవిశశిపావకగ్రహవి♦రాజితదీప్తులఁ గప్పు దీప్తివై
భవములమించువాని నిర♦పాయమహామహిమంబువాని నీ
భువనకదంబసారమయి ♦ పొల్చెడు నొక్కని రుద్రు నాద్యు ను
ద్భవనిధనంబులన్ గనని ♦ బల్లిదుఁగొల్వక శాంతి యబ్బునే? 357

సీ॥ ఘనమోహనీహార ♦ గతులడంగునె శివా, ర్కమహోరుచి ప్రసా♦రమునఁగాక
ప్రబలనైకవిధాఘ ♦ పారంపరీతమం, బవియునే శశిమౌళి ♦ యండఁగాక
బహుపూర్వభవభవా ♦ పద్వార్ధిఁ గడతురే, నగచాపకారుణ్య ♦ నౌకఁగాక
దుర్భరదారిద్ర్య ♦ దుఃఖాగ్ని యారునే, శివకృపారసవృష్టి ♦ సిద్ధిఁగాక
గీ॥ జన్మమృత్యు జరావ్యాధి ♦ సమధికార్తి, జాలనిర్వాపణాఢ్య ♦ మోక్షప్రశస్త
భాగ్యరమ చెందునే! ♦ శివోపాస్తి లేక, ఎట్టివానికినేని మహేంద్ర! ♦ యరయు! 369

క॥ నాదోసంబులచే నిఁక, నేదేనియు జనని మరల ♦ నేనెత్తిన నం
దేదుత మహేశుఁ డక్షయు, మై దైవాతెడు ప్రపత్తి ♦ నాదరువగుచున్. 360

వ. అని యిట్లు తన్ను లెక్కసేయక యుక్కుమిగిలి ధిక్కరించుచున్న యమ్ముని
కుమారుఁగాంచి కినుకమించి నముచిసూదనుం డిట్లనియె. 361

క॥ చల్లని మెల్లని నానుడు, లుల్లంబునఁ దలఁచి వరము ♦ లొందఁ గిటుల బల్
త్రుళ్ళి నను గడ్డివరకగఁ, బిల్లఁడ! చూచెదవె నీదు ♦ పెంపెదో కనెదన్.

క॥ ఎవ్వండా రుద్రుఁడు? వర, మెవ్వనిచే గొనఁదలంచి? ♦ తెచ్చుట నుందున్?
దవ్వోకో? దాపోకో? దాఁపక, చివ్వునఁ జెప్పుమన్న నతఁడు ♦ చెలఁగుచు ననియెన్.

—* కృతకేంద్రుని కుపమన్యుఁడు శివుని గుఱించి చెప్పుట *—

ఉ॥ ఎవ్విభునిన్ బదార్థముగ ♦ నెంతురు లేదనుచుందు రట్టులే
యెవ్వనిఁ గంటిమంచు మఱి ♦ యెవ్వడు గన్గొనమంచు నెంతురో
యెవ్వని నొక్కనిన్ భువి న♦నేకునిగాఁగఁ దలంచుచుందురో
యవ్విభుఁ డీశ్వరుం డతఁడె ♦ యభ్యుదయంబు లొసంగు నాకిఁకన్. 364

ఉ॥ ఎవ్వఁడు మోహసంతమస ♦ మెల్లను బాఁపఁగఁజేయు జ్యోతియా
నెవ్వని రూపెఱింగి మును ♦ లెవ్వడు దుఃఖము లొందఁబోవ రిం
కెవ్వని జ్ఞానవైభవము ♦ లెంచఁగరాకయె మించియుండునో
యవ్విభుఁ డవ్యయుండు విబుధాధిప! నాకిడు మేటిభద్రముల్. 365

ఉ॥ ఎవ్వఁడు సర్వభూతముల ♦ నేపున భావనచేసి మించెనో
యెవ్వఁడు సర్వదేశముల ♦ నేకవిధంబుగ నిండియుండెనో
యెవ్వఁడు సర్వసంపదల ♦ నీగికిఁజాలునొ భక్తకోటికిం
దవ్వనజోదరాదిజన ♦ నావహుఁ డీశ్వరుఁ డిచ్చు నిష్టముల్. 366

చ॥ అవని జలంబు లగ్గి యని♦లాంబరముల్ బదియింద్రియంబులున్
సువిహితముల్ దదర్థములు ♦ శుద్ధమనంబును బుద్ధ్యహంకృతుల్
శివునిగఁ దత్త్వవేదులు ప♦చింతురు నిన్నును నన్ను దృశ్య మీ
వివిధచరాచరావళిని ♦ వృత్రహరా! హరుఁగాఁగ నెంచుమా! 367

ఉ॥ యోగులు సాంఖ్యవాదులును ♦ యుక్తిగఁ గొల్తురు లెక్కసేతురే
యోగివరేణ్యతేజమును ♦ నొప్పఁగ దిక్కులు కాల మర్కతే
జోగరిమల్ గ్రహంబులును ♦ శోభిలుతారలు రాసు లేమహా
భాగుఁడొ యాతఁడే యరయు ♦ పాలకపాలకుఁ డెందు వాసవా! 36

సీ॥ ఊర్ధ్వరేతస్కుఁడై యుండి ♦ యువిద నెవ్వ, డర్ధతనువున ధరియించి ♦ యలరు నెవఁడు
చెఱకువిల్తుం డెవనిచేతఁ ♦ జేటువడియె, నాతఁడే విను విశ్వక ♦ ల్యాణమూర్తి.

గీ॥ ఎవనియైశ్వర్యమసమాన ♦ మెవఁడుభూత, తతులతోఁ గ్రీడసేయు ని♦తాంత మెవని
గణములతులబలైశ్వర్య♦ఘనములగుచు, దర్పమునమించురుద్రుఁడా♦తండెయరయు.

క॥ వసువుల ధరించు నెవ్వఁడు, పసఁదగు నోషధుల కెవఁడు ♦ ప్రభుఁడగు యోగీ
డ్వీసరములు జ్ఞానకల త్రిద,శసమితి కర్మగతి నెవని ♦ సంసేవించున్. 371

గీ॥ వినుము క్షరమక్షరంబు స♦విద్యవిద్య, ధర్మమును నధర్మమును గృ♦తంబకృతము
నెవనిచే నేర్పడునతండె ♦ యెఱుఁగుసర్వ, కారణముగాఁగ శక్ర! ని♦క్కంబుగాఁగ.

గీ॥ తల్లిచేతను విని మది ♦ నెల్ల లాఁతి, వేల్పులను నిచ్చగింపక ♦ పీడినాఁడ
వీరలిచ్చెడు వరముల♦ వేఁడికొనుట, "కొఱవితోఁ దలగోఁకి ♦ కొనుట" గాదె?

క॥ పిడివాద మేల దడవెదు, వెడలుము ఘోషముఁ దొఱంగి ♦ వృత్రహరా! నీ
వెడఁగుబిభీషికలకు నే, జడియుదునని తలఁప కెపుడు ♦ స్వాంతములోనన్.

క॥ హరియును విరించి నీవును, సుర లసురులు సర్వసిద్ధ ♦ చూడామణు లా
హరునే బరమునిగాఁ జెపు, దురు నితరం బతనికన్న ♦ దొడ్డయుఁ గలఁడే!

క॥ లాఁతుల హేతువులను బురు, హూతా! నుడువంగనేల? ♦ యుత్సుకమతి నా
భూతేశ్వరలింగంబును, నాతురులై కొల్తు రరయు ♦ మఖిలసుపర్వుల్.

క॥ మఱి యింక నొక్కనిలింగము, ధరలో నెవఁడేనిఁ గొలువఁ ♦ దలఁచినటులు నీ
వెఱుఁగుదువె? చెప్పు మెపుడేన్, జిరకాలముక్రింద వినినఁ ♦ జిత్తంబలరన్.

క॥ ఎవ్వని లింగము బ్రహ్మయు, నవ్వనరుహనయనుఁ డీవు ♦ నఖిలసురలు మేల్
నివ్వటిలఁ బూజసేతురొ, యవ్విభుఁ డధికుండుగాఁడె ♦ యరయు మనమునన్.

క॥ లేరు ప్రజలు పద్మాంకులు, లేరటఁ జక్రాంకజనులు ♦ లేరట వజ్రి
శ్రీరచితాంకులు జగమున, నారయు లింగాంకులును భ♦గాంకలు సర్వుల్.

క॥ విను శక్తిచేతఁ బొలఁతులు, కనఁగ భగాంకలు మహేశ♦ఘనతరలింగం
బునఁ బురుషులు లింగాంకులు, ననువుగ గుఱుతొందఁబడుదు♦రరయవె మఘవా?

క॥ ఇప్పగిది శాంకరప్రజ, నెప్పుడు గనుచుండియును శి♦వేతరు నెవఁడేన్
జెప్పినచోఁ గారణమని, యొప్పుదురే? యట్టి దుర్జ♦నోక్తుల విజ్ఞుల్. 381

క॥ ఈశ్వరుఁడే పుంలింగం, బీశ్వరి స్త్రీలింగ మెందు ♦ నిరువురచే నీ
విశ్వము వ్యాప్తంబగుచు న, నశ్వరముగఁ దేజరిల్లు ♦ నాదిత్యపతీ! 382

ఉ॥ కావున దేవరాజ! యిఁకఁ ♦ గర్వము మానినవల్కుఁ బల్కఁబో
కీవిపు డేగు ముందు మిట ♦ నిష్టముచొప్పున నేను శ్రీమహా
దేవుని గొల్తు నాతఁ డిడు ♦ దివ్యవరంబును లేక శాపమేన్
దేవురుగొట్టునై యితర ♦ దేవుల వేడను గాంక్షితంబులన్. 383

మ॥ అనుడున్ మానక కిన్క నేదొ నుడి జం♦భారాతి పల్కంగఁ బో
గని యమ్మానిసమారుఁ డీ కుటిలుఁ డిం♦కన్ బోవఁ డెబ్భంగి నీ
తనిఁ దప్పించుకొనంగఁ జాలుదును భ♦క్తప్రీతుఁడౌ శర్వుఁ డిం
కను నాపైనిఁ బ్రసాదమున్ సలుపఁ డీ ♦ కష్టంబు నెట్లేఁదెదన్. 385

## —* ఉపమన్యుని మెచ్చి శివుఁడు ప్రత్యక్షమగుట *—

క॥ అని యంత నఘోరాస్త్రము, మనమున యోజించుచుండ ♦ మంజుళభేరీ
ధ్వనులును కాహళమురజా, ధ్వనులును వినవచ్చె చదలు♦ధవళంబయ్యెన్. 386

వ. వెఱంగుపడి దిక్కులు సూచుచున్నంత నైరావతగజంబుతో నాఖండలుం డదృశ్యుండై యచ్చోట.

సీ॥ హంసరౌప్యేందుకుం♦దారవిందబిసాళి, జవ్వాదు ధవళవ♦ర్ణంబుతోడ
వజ్రసారములు సు♦వర్ణప్రభములు దీ, క్ష్ణంబులై మించు శృం♦గములతోడ
విపులతరస్కంధ ♦ విలసితంబును సురూ, పంబై యలరు మూపు♦రంబుతోడ
రంగారు బంగారు ♦ రామణీయకతఁ జె, న్నారెడు తొడవుల ♦ తీరుతోడ
గీ॥ మహితమధుపింగళాక్షియు ♦ గ్మంబుతోడ, లీలఁ గ్రాలెడు మేల్ గంగ ♦ డోలుతోడ
నింబుమీఱినకృష్ణపు♦చ్ఛంబుతోడఁ, దనరువృషభేంద్రమును ముని♦ తనయుఁడు గనె.

వ. అనంతరంబున.

సీ॥ ఆహిమగిరిఁ బోలి♦నట్టి వృషం బెక్కి, యుమతోడ మురియుచు♦న్నవానిఁ
బున్నమచందురుఁ♦బోలి తాఁ జల్లని, వెన్నెలగురియుచు ♦ వెలయువాని
వేయిసూర్యులఁబోలి ♦ విశ్వంబులెల్లను, గాంతుల నిండారఁ ♦ గప్పువానిఁ
బ్రళయానలము భంగిఁ ♦ బటుతర తేజంబు, లొక్కుమ్మడిగఁ గుప్పు♦చున్నవాని
గీ॥ శివునిఁ బొడఁగాంచి యుద్విగ్న ♦ చిత్తమునను
మరల నిదియేమొ యని యను♦మానమొంది
యంతనే సౌమ్యుఁడై విధూ♦మాగ్నిపోల్కి
మెఱయు గౌరీశ్వరుని గాంచె ♦ హరుసమునను. 390

ఉ॥ తెల్లని యంబరంబులును ♦ దెల్లని బూదియుఁ దెల్లగందమున్
దెల్లని పుష్పహారములు ♦ దెల్లని జందెము దెల్లనౌ వగల్
దెల్లనిదౌ ధ్వజంబు గడుఁ ♦ దెల్లనిదౌ యెడ లష్టబాహువుల్
నల్లని కంఠమున్ ద్రినయ♦నంబులు రంజిలు శర్వుఁ గన్గొనెన్. 391

ఉ॥ ఈ నుడి నిశ్చితంబనుచు ♦ నెంచుము నీ మదిలో నొకించు కీ
శానుని సర్వదివ్యగణ♦శాసను నిందఱొనర్చి తీయెడన్
గానక వేదపుంజములఁ ♦ గానక నార్షపథంబుఁ గన్నులన్
గానక శార్వవైభవముఁ ♦ గల్లరి యల్లరి మాని విన్మిఁకన్. 350

క॥ పశుపతినుడి నవుదును నే,ను శచీపతి పురువునే న♦నోకహమును నేన్
పశుపతిభక్తికి నా, వశమగుఁ ద్రైలోక్యలక్ష్మిఁ ♦ బాయుదు నపుడే.

క॥ హరచరణనళినసేవా, నిరతి నమరు పుల్కసునిజ ♦ నిన్ బడయుదు నా
హరుభక్తినిఁగొనని పురంధరు జన్మముఁగాని యెపుడు ♦ దాల్పను వినుమా!

క॥ చాలున్ జాలును వేఱుగు, నాలాపము లొందనేల ♦ యన్యకథల నే
వేళను క్షణార్ధమేనియుఁ, గాలహరుని భజనవిడక ♦ గడపు జనునకున్. 353

క॥ ఒకదిన మర్ధదినము నే, నొకఁడు ముహూర్తంబునేని ♦ నొకక్షణమేన్న
న్మికమైనభక్తి యొనరదు, సకలేశునను్గ్రహంబు ♦ సమకూరనిచోన్. 354

క॥ కృమినేనియు లేక పతం, గమునేనియు నట్లుకాక ♦ కడునేవపు శ్వా
నమునేని యగుదు శివునుడి, నమరపాభవమునొల్ల ♦ నన్యుల నుడులన్. 355

ఉ॥ నాకముగాని నీయమర ♦ నాయకపీఠముగాని యల్లనా
లోకభవాధిపత్యమును ♦ లేక నిరంజనమాపదంబుగా
నీ కరమొప్పఁకోర్కుల న♦నేకములన్ విడనాడి పేర్మిమై
శ్రీకరుఁడాళుఁడౌ శివుని ♦ సేవకవృత్తిని గోరెదన్ జుమీ. 356

క॥ ఎంతవఱ కిందురేఖా, కాంతజటాజూటు డద్రి ♦ కన్యాచేతః
కాంతుఁడు మెచ్చఁడో యంతకుఁ, గాంతు జరామరణజన్మ ♦ ఘనదుఃఖములన్.

చ॥ రవిశశిపావకగ్రహవి♦రాజితదీప్తులఁ గప్పు దీప్తిపై
భవములమించువాని నిర♦పాయమహామహిమంబువాని నీ
భువనకదంబసారమయి ♦ పొల్చెడు నొక్కని రుద్రు నాద్యు ను
ద్భవనిధనంబులన్ గనని ♦ బల్లిదుఁగొల్వక శాంతి యబ్బునే? 357

సీ॥ ఘనమోహనీహార ♦ గతులడంగునె శివా, ర్కమహారుచి ప్రసా♦రమునఁగాక
ప్రబలనైకవిధాఘ ♦ పారంపరీతమం, బవియునే శశిమౌళి ♦ యండఁగాక
బహుపూర్వభవభవా ♦ పద్వార్ధిఁగడతురే, నగచాపకారుణ్య ♦ నౌకఁగాక
దుర్భరదారిద్ర్య ♦ దుఃఖాగ్నియారునే, శివకృపారసవృష్టి ♦ సిద్ధిఁగాక
గీ॥ జన్మమృత్యు జరావ్యాధి ♦ సమధికార్తి, జాలనిర్వాపణాఢ్య ♦ మోక్షప్రశస్త
భాగ్యరమ చెందునే! ♦ శివోపాస్తి లేక, ఎట్టివానికినేని మహేంద్ర! ♦ యరయు! 369

క॥ నాదోసంబులచే నీఁక, నేదేనియు జనని మరల ♦ నేనెత్తిన నం
చేదుత మహేశుఁ డతఁడయ్య, నై దైవాతెడు ప్రపత్తి ♦ నాదరువగుచున్. 360

వ. అని యిట్లు తన్ను లెక్కసేయక యుక్కుమిగిలి ధిక్కరించుచున్న యమ్మునిఁ
కుమారుఁగాంచి కినుకమించి నముచిసూదనుం డిట్లనియె. 361

క॥ చల్లని మెల్లని నానుడు, లుల్లంబునఁ దలఁచి వరము ♦ లొందక కిటుల బల్
తుళ్ళి నను గడ్డిపరకగఁ, బిల్లఁడ! చూచెదవె నీదు ♦ పెంపెదో కనెదన్.

క॥ ఎవ్వం డా రుద్రుఁడు? వర, మెవ్వనిచే గొనఁదలంచి? ♦ తెచ్చట నుండున్?
దవ్వోకో? దాపొకో? దాఁపక, చివ్వనఁజెపుమన్న నతఁడు ♦ చెలఁగుచుననియెన్.

—— * కృతకేంద్రున కుపమన్యుఁడు శివుని గుఱించి చెప్పుట * ——

ఉ॥ ఎవ్విభునిన్ బదార్థముగ ♦ నెంతురు లేదనుచుండు రట్టులే
యెవ్వనిఁ గంటిమంచు మఱి ♦ యెప్పుడు గన్గొనమంచు నెంతురో
యెవ్వని నొక్కనిన్ భువి స♦నేకునిగాఁగఁ దలంచుచుందురో
యవ్విభుఁ డీశ్వరుం డతఁడె ♦ యభ్యుదయంబు లొసంగు నాకిఁకన్. 364

ఉ॥ ఎవ్వఁడు మోహసంతమస ♦ మెల్లను బాఁపఁగఁజేయు జ్యోతియౌ
నెవ్వని రూపెఱింగి మును ♦ లెప్పుడు దుఃఖము లొందఁబోవ రిం
కెవ్వని జ్ఞానవైభవము ♦ లెంచఁగరాకయె మించియుండునో
యవ్విభుఁ డవ్యయుండు విబుధాధిప! నాకిడు మేటిభద్రముల్. 365

ఉ॥ ఎవ్వఁడు సర్వభూతముల ♦ నేపున భావనచేసి మించెనో
యెవ్వఁడు సర్వదేశముల ♦ నేకవిధంబుగ నిండియుండెనో
యెవ్వఁడు సర్వసంపదల ♦ నీగిఁజాలునో భక్తకోటికెం
దవ్వనజోదరాదిజన ♦ నావహుఁ డీశ్వరుఁ డిచ్చు నిష్టముల్. 366

చ॥ అవని జలంబు లగ్గి యని♦లాంబరముల్ బదియింద్రియంబులున్
సువిహితముల్ దదర్థములు ♦ శుద్ధమనంబును బుద్ధ్యహంకృతుల్
శివునిగఁ దత్త్వవేదులు వ♦చింతురు నిన్నును నన్ను దృశ్య మీ
వివిధచరాచరావళిని ♦ వృత్రహరా! హరుఁగాఁగ నెంచుమా! 367

ఉ॥ యోగులు సాంఖ్యవాదులును ♦ యుక్తిగఁగొల్తురు లెక్కసేతురే
యోగివరేణ్యతేజమును ♦ నొప్పుగ దిక్కులు కాల మర్కతే
జోగరిమల్ గ్రహంబులును ♦ శోభిలుతారలు రాసు లేమహా
భాగుఁడొ యాతఁడే యరయు ♦ పాలకపాలకుఁ డెందు వాసవా! 368

సీ॥ ఊర్ధ్వరేతస్కుఁడై యుండి♦యువిద నెప్డు, డర్ధతనువున ధరియించి♦ యలరు నెవఁడు
చెఱకువిల్తుం డెవనిచేతఁ♦జేటువడియె, నాతఁడే విను విశ్వక ♦ ల్యాణమూర్తి.

సీ॥ ఎవనియైశ్వర్యమసమాన ♦ మెవఁడుభూత, తతులతోఁ గ్రీడసేయు ని♦తాంతమెవని
గణములతులబలైశ్వర్య♦ఘనములగుచు,దర్పమునమించురుద్రుఁడా♦తండెయరయు.

క॥ పసువుల ధరించు నెవ్వఁడు, పసఁదగు నోషధుల కెవఁడు ♦ ప్రభుఁడగు యోగీ
ద్వీసరములు జ్ఞానకల తిరిద,శసమితి కర్మగతి నెవని ♦ సంసేవించున్. 371

గీ॥ వినుము క్షరమక్షరంబు న♦విద్యవిద్య, ధర్మమును నధర్మమును గృ♦తంబకృతము
నెవనిచేనేర్పడునతండె ♦ యెఱుఁగుసర్వ, కారణముగాఁగ శక్ర! ని♦క్కంబుగాఁగ.

గీ॥ తల్లిచేతను విని మది ♦ నెల్ల లాఁతి, వేల్పులను నిచ్చగింపక ♦ వీడినాఁడ
వీరలిచ్చెడు వరముల♦ వేఁడికొనుట, "కొఱవితోఁడుతఁదలగోఁకి ♦ కొనుట"గాదె?

క॥ పిడివాద మేల దడవెదు, వెడలుము ఘోషముఁ దొఱంగి ♦ వృత్రహరా! నీ
వెడఁగుబిభీషికలకు నే, జడియుదునని తలఁప కెపుడు ♦ స్వాంతములోనన్.

క॥ హరియును విరించి నీవును, సుర లసురులు సర్వసిద్ధ ♦ చూడామణు లా
హరు నేఁ బరమునిగాఁ జెపు, దురు నితరం బతనికన్న ♦ దొడ్డయుఁ గలఁడే!

క॥ లాఁతుల హేతువులను బురు, హూతా! నుడువంగనేల? ♦ యుత్సుకమతి నా
భూతేశ్వరలింగంబును, నాతురులై కొల్తు రరయ ♦ మఖిలసుపర్వుల్.

క॥ మఱి యిఁక నొక్కనిలింగము, ధరలో నెవఁడేనిఁ గొలువఁ ♦ దలఁచినటులు నీ
వెఱుఁగుదువె? చెప్పు మెపుడేన్, జిరకాలముక్రింద వినినఁ ♦ జిత్తంబలరన్.

క॥ ఎవ్వని లింగము బ్రహ్మయు, నవ్వనరుహనయనుఁ డీవు ♦ నఖిలసురలు మేల్
నివ్వటిలఁ బూజసేతురొ, యవ్విభుఁ డధికుండుగాఁడె ♦ యరయ మనమునన్.

క॥ లేరు ప్రజలు పద్మాంకులు, లేరెటఁ జక్రాంకజనులు ♦ లేరెట వజ్ర
శ్రీరచితాంకులు జగమున, నారయ లింగాంకులును భ♦గాంకలు సర్వుల్.

క॥ విను శక్తిచేతఁ బోలఁతులు, కనఁగ భగాంకలు మహేశ♦ఘనతరలింగం
బునఁబురుషులు లింగాంకులు, ననువుగ గుఱుతొందఁబడుదు♦రరయవె మఘవా?

క॥ ఇప్పగిది శాంకరప్రజ, నెప్పుడు గనుచుండియును శి♦వేతరు నెవఁడేన్
జెప్పినచోఁ గారణమని, యొప్పుదురే? యట్టి దుర్జ♦నోక్తుల విజ్ఞుల్. 381

క॥ ఈశ్వరుఁడే పుంలింగం, బీశ్వరి స్త్రీలింగ మెందు ♦ నిరువురచే నీ
విశ్వము వ్యాప్తంబగుచు న, నశ్వరముగఁ దేజరిల్లు ♦ నాదిత్యపతీ! 382

ఉ॥ కావున దేవరాజ! యిఁకఁ ♦ గర్వము మానినవల్కుఁ బల్కెఁబో
కీవిపు డేగు ముందు మిట ♦ నిష్టముచొప్పున నేను శ్రీమహా
దేవుని గొల్తు నాతఁ డిడు ♦ దివ్యవరంబును లేక శాపమేన్
దేవరుగొట్టునై యితర ♦ దేవుల వేడను గాంక్షితంబులన్. 383

మ॥ అనుడున్ మానక కిన్క నేదొ నుడి జం♦భారాతి పల్కంగఁబోఁ
గని యమ్మౌనికుమారుఁ డీ కుటిలుఁ డిం♦కన్ బోవఁ డెబ్భంగి నీ
తనిఁ దప్పించుకొనంగఁజాలుదును భ♦క్తప్రీతుఁడౌ శర్వుఁ డిం
కను నాపైనిఁ బ్రసాదమున్ సలుపఁ డీ ♦ కష్టంబు నెట్లీఁదెదన్. 385

## —* ఉపమన్యుని మెచ్చి శివుఁడు ప్రత్యక్షమగుట *—

క॥ అని యంత నఘోరాస్త్రము, మనమున యోజించుచుండ ♦ మంజుళభేరీ
ధ్వనులును కాహళమురజా, ధ్వనులును వినవయ్యె చదలు♦ధవళంబయ్యెన్. 386

వ. వెఱంగుపడి దిక్కులు సూచుచున్నంత నైరావతగజంబుతో నాఖండలుం డదృశ్యుండై యచ్చోట.

సీ॥ హంసకాశ్యేందుకుం♦దారవిందబిసాళి, జవ్వాడు ధవళవ♦ర్ణంబుతోడ
వజ్రసారములు సు♦వర్ణప్రభములు దీ, క్ష్ణంబులై మించు శృం♦గములతోడ
విపులతరస్కంధ ♦ విలసితంబును సురూ, పంబై యలరు మూపు♦రంబుతోడ
రంగారు బంగారు ♦ రామణీయకతఁ జె, న్నారెడు తొడవుల ♦ తీరుతోడ
గీ॥ మహితమధుపింగళాక్షియు♦గ్మంబుతోడ, లీలఁగ్రాలెడుమేల్గంగ ♦ డోలుతోడ
నింబుమీఱినకృష్ణపు♦చ్ఛంబుతోడఁ, దనరువృషభేంద్రమునుముని♦ తనయుఁడుగనె.

వ. అనంతరంబున.

సీ॥ ఆహిమగిరిఁబోలి♦నట్టి వృషంబెక్కి, యుమతోడ మురియుచు♦మున్నవానిఁ
బున్నమచందురుఁ♦బోలి తాఁజల్లని, వెన్నెలగురియుచు ♦ వెలయువాని
వేయిసూర్యులఁబోలి ♦ విశ్వంబులెల్లను, గాంతుల నిండారఁ ♦ గప్పువానిఁ
బ్రళయానలము భంగిఁ ♦ బటుతర తేజంబు, లొక్కుమ్మడిగఁ గుప్పు♦చున్నవాని
గీ॥ శివునిఁ బొడఁగాంచి యుద్విగ్న ♦ చిత్తమునను
మరల నిదియేమొ యని యను♦మానమొంది
యంతనే సౌమ్యుఁడై విధూ♦మాగ్నిఁబోల్కి
మెఱయు గౌరీశ్వరుని గాంచె ♦ హరుసమునను. 390

ఉ॥ తెల్లని యంబరంబులును ♦ దెల్లని బూదియుఁ దెల్లగందమున్
దెల్లని పుష్పహారములు ♦ దెల్లని జందెము దెల్లనౌ నగల్
దెల్లనిదౌ ధ్వజంబు గడుఁ ♦ దెల్లనిదౌ యెడ లష్టబాహువుల్
నల్లని కంఠమున్ ద్రినయ♦నంబులు రంజిలు శర్వుఁ గన్గొనెన్. 391

సీ॥ వల్లజడలలోనఁ ♦ బద్మకోరకమట్లు, బాలేందు శకలంబు ♦ పరిఢవిల్ల
త్రేతాగ్నులట్లు దే♦దీప్యమానములైన, మూఁడునేత్రములు వి♦స్ఫూర్తిఁబొదల
బంగారురంగారు ♦ పద్మహారంబులు, వసుధకెల్లను సౌర♦భంబు నొసఁగ
తకధోంధిమింధిమి♦ధంధణా యనుచు మ, స్తమున గంగమ్మ నృ♦త్తంబుసలుపఁ
గీ॥ దనకు సరిదూఁగు బలమొప్పి ♦ దట్టులైన
యనుచరశ్రేష్ఠులెల్లెడ ♦ ననుసరింప
మూర్తిమంతంబులగు నస్త్ర ♦ ములును గొలువ
నెదురఁ గన్పడె మునికి స♦ర్వేశ్వరుండు. 392

సీ॥ ఇంద్రాయుధముడాలు ♦ నీసడించుపినాక, మనిమెడు సప్తశీ♦ర్షాహిధనువు
అఱనిముసములోన ♦ నఖిలజగములకు, సున్నఁజుట్టించు పా♦శుపతమస్త్ర
మవనినెల్లను రజం♦బగునట్టు లొనరింపఁ, జాలినయట్టి త్రి♦శూలవరము
సర్వశూరావళీ ♦ సంహారకంబయి, భవ్యకీర్తిఁదనర్చు ♦ పరశురాజ
గీ॥ మితర సాధనములును న♦నేకవిధము
లగుచు నష్టాదశభుజంబు ♦ లందు నమర
దిక్కరులతూఁగు మాన్పించు ♦ దివ్యడమరు
కార్భటులుమ్రోయఁ గన్పడె ♦ హరుఁడు మునికి. 393

మ॥ కుడిప్రక్కన్ బరమేష్ఠి హంసముపయిన్ ♦ గూర్చుండి సేవింపఁగా
నెడమన్ బన్నగవైరి నెక్కొని హృషీ♦కేశుండునున్ గొల్వఁగా
నడుమన్ శ్రీజగదంబ కట్టెదుర ఘం♦టాశక్తులన్ దాల్చి స్కం
దుఁడు నెమ్మిన్ భజియింప దంతిముఖుఁడున్ ♦ దోడ్తోడ రాణింపఁగా. 394

క॥ రెండవ శంకరుఁ డనఁగా, నిండగుసిరిఁ దనరునంది ♦ నేరుపుమీఱన్
మెండగు త్రిశూలమును గొని, దండిగ నలుగడలఁ గనుచుఁ ♦ దాఁజరియింపన్.

మ॥ అల స్వాయంభువముఖ్యులౌ మనువు లా♦యంభోజజన్మాదులున్
విలసన్మౌనివతంసులౌ భృగుముఖుల్ ♦ వృత్రాసురఘ్నాది ది
వ్యులు భూతప్రమథాళి మాతృకలునున్ ♦ భూతేశ్వరున్ జుట్టి పె
క్కులు స్తోత్రంబు లొనర్చుచుండిరి కడున్ ♦ గోలాహలంబొప్పఁగా. 396

క॥ హరి యగ్రసామబుక్కులఁ, బరమేష్ఠిరథంతరమునఁ ♦ బాకారి మహో
త్తరశతరుద్రీయంబున, హరునిన్ స్తుతిఁజేయుచుండి ♦ రవ్యగ్రమతిన్. 397

క॥ పరిధిస్థార్కునివలె ని, క్షరమధ్య వెలుంగు సాంబ♦శంకరుఁ గని సం
బరమొంది మునితనూజుఁడు, ధరఁ జాఁగిలఁబడి యొనర్చె ♦ స్తవ మిప్పగిదిన్.

## —* ఉపమన్యుఁడు శివుని స్తుతించుట *—

సీ॥ దేవదేవ! మహాను♦భావ! యవిజ్ఞేయ, విగ్రహా! దేవేంద్ర ♦ వేషధారి!
ఆదిత్యలోచన! ♦ ఆదిత్యవక్త్ర! యా, దిత్యబింబగత యా♦దిత్యవర్ణ!
నారీనరశరీర! ♦ నాగహారగ్రీవ!, సర్వార్తిభంజన! ♦ సాంఖ్యగమ్య!
యోగిపూజిత! యచిం♦త్యోదంతదుర్గమ!, సర్వవర్ణోజ్జ్వల! ♦ సౌమ్యమూర్తి!
గీ॥ కృష్ణపింగళ! సోమ! య♦గ్నిముఖనేత్ర!, చంద్రసాహస్రలోచన! ♦ సౌమ్యవదన!
చారుమణిమయమకుటకే♦యూరధారి!, వందనములొనరించెద ♦ వరద! నీకు.

క॥ లోకోత్పత్తిస్థితివిల, యాకర! కందర్పదర్ప ♦ హర! కాలహరా!
నాకారిపురహరా! నా,ళీకోద్భవశీర్షహర! గొ♦లిచెద మది నిన్నున్. 399

కవిరాజవిరాజితము॥ పవనరయోన్నతి♦భాసుర! భూరిపవి ♦ భంజనరూపవి ♦ భాస్వర! చి
ద్భవన! చిదాత్మక! ♦ పాలితవిష్టప! ♦ భక్తజనార్తివి ♦ భంగకరా!
భవ! కరుణాకర! ♦ పాలక! యంధక♦భంజక! దుర్భవ♦భంజక! శ్రీ
శివ శివ శంకర! ♦ శ్రీకర! జోతలఁ♦జేసెదఁ బ్రేముడిఁ ♦ జేకొనుమా!

సీ॥ సురలయెడను నీ వ♦జుఁడవు రుద్రుల నీల, లోహితుండవు నీవ ♦ లోలహృదయ!
ఆదిత్యులందుఁ బ♦ద్మాక్షుండ వగు దీవు, వసువులయందుఁ బా♦వకుఁడ వీవు
అలమరుత్తుల హరి♦హయుఁడవు జక్కుల, యందుఁ గుబేరుండ ♦ వయ్య నీవు
సాంఖ్యమునన్ బురు♦షప్రతీతుండవు, నఖిలభూతములందు ♦ నాత్మ వీవు
గీ॥ గ్రహసముచ్చయమందు భా♦స్కరుఁడ వీవు, ఋషివితానమున వశిష్ఠ♦ఋషివి నీవు
చుక్కలందును జాబిల్లి ♦ వక్కడలులఁ, బాలకడలివి లోకైక ♦ పాలనీవు! 401

ఉ॥ కొండలలోన మేరువువు ♦ గొప్పగుయోగుల శంకరుండ వీ
వండజరాజియందు విన ♦ తాత్మజమూర్తివి పాములం దనం
తుండవు గ్రామ్యజంతుతతి ♦ దొడ్డ వృషంబవు వర్ణకోటి వి
ప్రుండవు బొఁపలందునను ♦ బొల్చెద వీశ్వర! దీక్షితుండవై. 402

క॥ శ్రుతులందు సామవేదమ, వతులయజుర్మంత్రతతుల ♦ హవణించులస
చ్ఛతరుద్రీయంబవు పితృ,తతి వైవస్వతుఁడ వీవు ♦ దాక్షిణ్యనిధీ! 403

క॥ వనమృగముల సింగమవై, యనువగు నాశ్రమములన్ గృ ♦ హస్థాశ్రమివై
ఘనగతులన్ మోక్షమవై, యనిశము రాణించుచుందు ♦ వసదృశతేజా! 404

మ॥ పరమేష్ఠి న్నిజదక్షిణాంగమున వి♦శ్వస్రష్టఁబుట్టించి శ్రీ
ధరు వామాంగమునన్ జగస్థితికి సం♦ధానించి యాపై నెదన్
హరణంబున్ బొనరింప రుద్రునటులే ♦ యావిర్భవింపంగఁ జే
సి రహిన్ జిత్రముఁ జూచుచుందువు జగ♦త్సేవ్యా! కృపాంభోనిధీ! 405

చ॥ ఎఱుఁగక నీమహేంద్రతను ♦ వెగ్గలుపల్కితి మ్రొక్కకుంటి నీ
చరణసరోరుహంబులకుఁ ♦ జక్కఁగఁ బాద్యమొసంగ నైతి నా
దరమున మత్కృతంబు దురి♦తంబు నడంపు క్షమింపుమింపునన్
వరద! కృపాకరా! ప్రణత♦వత్సల! భక్తుఁడ జోతచేసెదన్. 306

క॥ అని యడుగులపై వ్రాలిన, మునితనయుని గ్రుచ్చియెత్తి ♦ మోదమున శిర
స్సునఁ జేయిడి మృదుమధురవ, చనములతో నిట్టులనియె ♦ సాంత్వనమొప్పన్.

చ॥ మది ముదమొందినాఁడ నుప ♦ మన్యుమునీశ్వర! భక్తవర్య! నీ
కుదురగుభక్తిఁ గన్గొనఁగ ♦ గొప్పగ నిట్లు పరీక్ష చేసితిన్
చెదరదు నీదు భక్తి యిఁక ♦ జెందుము సిద్ధులఁ గోరుకొమ్ము నీ
విదియదియంచుఁ గొంకక య♦భీష్టవరంబుల నిత్తు వేడుకన్. 408

వ. అనునంత నుపమన్యుండు.

ఉ॥ ఇప్పుడె పుట్టినాఁడ జగ♦దీశ్వర! జన్మము భాగ్యమొందె నీ
గొప్పసురల్ మునుల్ ఋషులు ♦ గోరి భజించిననైన దర్శనం
బెప్డు డొసంగనట్టి పర♦మేశుఁడ విట్టులు దర్శనంబు నా
కిప్డు డొసంగి యాదరము ♦ నిచ్చితి వింతకు నెక్కుడున్నదే. 409

గీ॥ వరమునకు నేనుదగియున్న ♦ వరద! నీకు, భక్తినిడు మఖిలజ్ఞత్వ ♦ భాగ్యమిమ్ము
బంధువులతోడ క్షీరాన్న♦భక్షణంబు, నొసఁగుమాయాశ్రమమున నీ ♦ వుండుమెప్పుడు

—— * శివుఁడు ఉపమన్యునకు వరంబు లిచ్చుట * ——

వ. అనుటయు మహేశ్వరుండు.

సీ॥ ముదిమి దెవుల్ మృతి♦మున్నగునవి లేక, నిత్యయౌవనముతో ♦ నెగడుచుండు
యశము తేజమునుది ♦ వ్యజ్ఞానమును జెంది, ఋషులందుఁ బెంపార ♦ పిల్లఁదనరు
మాచారమును గుణా♦ఢ్యతయు సర్వజ్ఞత, ప్రియదర్శనత్వంబు ♦ పెంపుజెందు
మమృతసంయుతము క్షీ♦రాన్నంబుఁ గుడువఁగ, పాలసంద్రంబు నీ♦పజ్జనుండు
గీ॥ బంధువులతోడఁ బుడమిఁగ ♦ ల్పంబు మెలఁగి, నన్నుఁ జేరఁగవత్తు వా♦నందమునను
అక్షయంబగు నీవంశ ♦ మలరుదు రిల, బందుగులు నీకు నాయందు♦భక్తి యమరు.

క॥ నీయాశ్రమమున లింగము, నై యుండెద నెల్లకాల ♦ మామోదమునన్
డాయుదు నిపుడచ్చోటికి, జేయుదు నీకెప్డు మేలు ♦ సేకుఱఁ బుత్త్రా! 412

క॥ పెంతువు నాభక్తిని గా, వింతువు కృష్ణాదులకు భు♦విన్ మద్దీక్షన్
మింతువు సర్వోన్నతి బో, ధింతువు పాశుపతతత్త్వ ♦ దీవ్యద్గరిమన్. 413

గీ॥ అనినుడివి పాదుకద్వయి ♦ నమ్మునీంద్రు, నకునొసఁగి బుజ్జగించి పి♦నాకధరుఁడు
సూర్యకోటిసమప్రభా♦శోభితుండు, తనదుగణములతోడ నం♦తర్ధిఁ జెందె. 414

వ. అంత మునీశ్వరుం డత్యంతసంతుష్టుండై వ్రతసమాప్తి బొనరించి దివ్యతేజస్వియై తత్క్షణంబు తన యాశ్రమంబుఁ జేరి నిజజననీపాదారవిందంబులకుఁ బునఃపున ర్వందనంబు లొనరించి శివప్రసాదం బాద్యంతంబుఁ దెలిపిన నామహాసాధ్వియు నమితానందంబునొంది కుమారు నభినందించె. శివానుగ్రహంబున నవ్వారల కఖండధనధాన్యసమృద్ధియు క్షీరసాగరప్రాప్తియుఁ గలుగ బంధుజాలంబుతో నిత్యంబు క్షీరాన్నభక్షణం బొనరించుచు నీశ్వరుసేవించుచు సుఖంబుండి రీ పావన చరిత్రం బెవ్వరేనిఁ జదివిన విన్న నవ్వారలు మనీషితార్థంబు లొందుదు రిఁకఁ గిరాతేశ్వరలీల నెఱిఁగింతు వినుం డని సూతుండు మునుల కిట్లనియె.

—* కిరాతేశ్వరలీల అర్జునాస్త్రప్రాప్తికథ *—

ఉ॥ కౌరవనాథుఁడా శకుని ♦ కైతవమొప్పిన జూదమందు బల్
ధీరులు శూరులై కడిఁది ♦ తేజుల మించిన పాండవేయులన్
నేరిమి గెల్చి వారిసిరి ♦ నెట్టనఁ జేకొనెఁ జేసికొన్న య
త్తీరువుఁ బట్టి కానలకు ♦ దీనత నేగిరి పాండునందనుల్. 415

ఉ॥ వారినిఁ జూడఁగా నటకు ♦ వారిజలోచనుఁడైన శౌరి బల్
పేరెముతోడ వచ్చి కని ♦ బిట్టుగ దుఃఖిలుచున్న ద్రోవదిన్
ధీరులెయయ్యుఁ బెన్వగలఁ ♦ దేఁకువమాలిన పాండుపుత్త్రులన్
చేరిమి నూరడించి కడుఁ ♦ బెంపును బింపును గూర్చుచుండుడున్. 416

ఆ॥ ధర్మతనయుఁడనియెఁ ♦ దామరసాక్ష! యె, ట్లనియిడుములోర్చి ♦ యీసమయముఁ
దీర్చువారమవలఁ ♦ దెరువేదిగురుభీష్మ, కర్ణద్రోణసుతులఁ ♦ గడచుటకును. 417

క॥ రారాజు దుస్ససేనుఁడు, వారల తమ్ములును సింధు ♦ పతియును గడు దు
ర్వారబలదర్పఘను లిఁక, వీరల నందఱ జయింప ♦ వీలగు నెట్టుల్. 418

చ॥ మఱియును రాజసూయమున ♦ మారుతితోడను గ్రీడితోడనున్
బరిభవమొందినట్టి జన ♦ పాలురు మత్సరమొంది యుద్ధతిన్
గురుపతిఁ జేరి మీఱి మముఁ ♦ గూల్పఁదలంచుచు నున్నవారు దు
ర్భరమగు వీరినందఱ దు♦రంబున నోర్వఁగఁ బద్మలోచనా! 419

ఉ॥ ఏది యుపాయ మిందు మము ♦ నెట్టుల సాఁకఁదలంతువయ్య! దా
మోదర! నీవకాక మఱి ♦ యొక్కఁడు గల్గునె మాకు దిక్కు? నీ
వాదటఁ జిత్తమందుఁ గడు ♦ నారసి మేలగునట్టి మార్గమున్
గాదిలిప్రేమఁ దెల్పు మది ♦ గాటపుపూన్కి నొనర్తు మిత్తఱిన్. 420

క॥ అనిన వనజాక్షుఁ డారసి, యనియెను ధర్మజునితోడ ♦ ననఘచరిత్రా!
మునివరుఁ డుపమన్యునిశా, సనమున నే శివునిఁ గొలిచి ♦ శక్తులు గొంటిన్.

చ॥ అభవుఁడు సంశ్రితార్తిహరుఁ ♦ డద్భుతశౌర్యధురంధరుం డస
ద్విభవహరుండు ♦ మీరికను ♦ విశ్వవిమోహనధీరుఁడైన యా
విభుని భజించి చేకొనుఁడు ♦ వెగ్గలమొప్ప సమస్తసంపదల్
రభసములేని మార్గ మిది ♦ రాజలలామ! తలంచి చూడుమా! 423

గీ॥ పరమశివుని కృపోన్నతిఁ ♦ బడసి యేను, గడుబిరుదులైన రిపుల ను♦క్కఱ వధించి
నాఁడఁ గల్యాణములఁ జెంది♦నాఁడ సుతుల, వరమతులఁ గాంచినాఁడ నృ♦పాలతిలక!

—* వ్యాసమహాముని పాండవులయొద్దకు వచ్చుట *—

క॥ అనిచెప్పి వనజనేత్రుఁడు, చనియెను ద్వారకకు నంత ♦ సన్మునినాథుం
డనఘుఁడు కృష్ణద్వైపా,యనుఁడు ఘనుం డరుగుదెంచె ♦ నవ్వారిఁ గనన్.

ఉ॥ వచ్చిన మౌని గన్గొని నృ♦పాలురు చాల ముదంబుఁ జెంది మేల్
హెచ్చినభక్తి నర్చనల ♦ నెంతయుఁ జేసి సుయోధనుండు బల్
మచ్చర మొప్పఁగాఁ గడిఁది ♦ మాయపుజూదముఁ బన్ని గెల్చి రా
లచ్చినిఁ జెంది కాన కిటు♦లన్ దముఁ బంచుటఁ జెప్పి రార్తులై. 425

క॥ మఱియున్ బాంచాలియుఁ దన, పరిభవమును దుస్ససేను ♦ పశుకృత్యమునున్
గురుపతియవినీతియు దు,ర్భరవేదనఁ జేయు కర్ణు ♦ పరుషోక్తులనుఁ. 426

క॥ ఎఱుగంగఁ జెప్పి కడు వం,దురుచుండఁగ మౌనివరుఁడు ♦ ద్రోసదిచింతన్
హరియించుచుఁ బాండవులకుఁ, గరమనురాగమున నోర్పుఁ ♦ గఱపుచు ననియెన్.

ఉ॥ మీరలు చాలఁ గష్టములు ♦ మేకొనినన్ సుకృతార్థులై హితం
బారసి సత్యమున్ దొరఁగ ♦ రభ్యుదయంబగు మీకు నిట్టులే
ధారుణిలోన సజ్జనులు ♦ దద్దయు బ్రాణవిమోక్షమందునున్
మీఱరు ధర్మపుం దెరువు♦మేరను ధీరమనీషులై పొరిన్. 428

క॥ కౌరవులును మీరును నా, కారయఁగా నొక్కభంగి ♦ నైనను ధర్మ
శ్రీ రహిఁ జెందుట మీయెడఁ, గూరిమి కరమలరుచుండు ♦ గుణరత్ననిధుల్!

వ. అనినంత.

ఆ॥ పాండవాగ్రజుండు ♦ పలికె మహాత్మా! నీ, విందురా ముదంబుఁ♦ జెందె మనము
దీఱిపోయె వగలు ♦ తెఱపిగా నిఁకమీఁద, సర్వసంపదలు పొ♦సంగఁగలవు.

ఉ॥ దేవర! పావనుండు వసు ♦ దేవసుతుం డల శౌరి యమ్మహా
దేవు భజించినన్ రిపులఁ ♦ ద్రెళ్ళఁగఁ జేయునటంచు నెక్కుడౌ
శ్రీవిలసిల్లు సంపదలఁ ♦ జెన్నెసలారఁగఁ నిచ్చునంచు స
ద్భావమ్ముతోడఁ జెప్పి చనె ♦ భర్గుని నెట్లు భజించువారమో? 431

చ॥ అనిన ఋషీంద్రుఁ డిట్లనియె ♦ నద్దియె సౌఖ్యనిధానమౌ పథం
బనితరతుల్య మా హరు మ♦హాత్మునిఁగూర్చి తపంబొనర్ప నీ
యనుజునిఁ గవ్వడిన్ బనుపు ♦ మాతఁడు ధీరుఁడు కార్యసిద్ధి వే
గనె పొనరించి వచ్చెడు న♦కల్మషచిత్త! యటుల్ పొనర్పుమా! 432

క॥ మీరిటుల నల్పకున్నను, వైరులఁ జెనకంగ లేరు ♦ వాస్తవ మిది య
క్కౌరవనాథుఁడు పెక్కురు, శూరులసాయమును జెంది ♦ శోభిలుచుండెన్.

చ॥ అలఁతులఁ బోదురే గురుఁడు ♦ నభ్రధునీతనుజుండు చివ్వలో
నలిగిన వీరి నోర్వఁగల ♦ యాజసికుం డెవఁ డల్లకర్ణుఁడుం
బలియుఁడు ద్రోణజుండు పరి ♦ పంథివిదారణధీరుఁ డట్టివా
రలఁ గెలు పొందువారలె? పు ♦ రద్విషు సాయము లేక పాండవుల్! 434

చ॥ పరమశివున్ దగన్ గొలువ ♦ భర్గుఁడు పాశుపతాస్త్రరాజ మా
దరమలరారఁగా నొసఁగు ♦ దాన, నుదగ్రవిరోధికోటులన్
దురమున లెక్కసేయకయె ♦ త్రుంచఁగఁజాలుదు రట్టులౌట శం
కరుని భజింపఁబూనుఁడిఁకఁ ♦ గర్జము నిర్వహిలున్ గుమారకుల్! 435

వ. అర్జునున్ జూచి

చ॥ చనుమిఁక నింద్రకీలమను ♦ శైలము జహ్నుసుతాతటంబునన్
బొనరు నటన్ వసించి తప ♦ మున్ సలుపంగఁ దలంపు శక్రవి
ద్యను జెపుదున్ మొదల్ దొడరి ♦ దైవతనాయకు నాశ్రయింపుమా
ఘనుఁడిఁక నెట్టివిఘ్నములఁ ♦ గల్గఁగనీక తపంబు సాఁకెడున్. 436

క॥ అని నొడివిన విప్రోచ్ఛం,డును సమ్మదమొంది నే న♦టులె సేతుఁ దపం
బనఘా! తపోవిధానం,బును నంత నెఱుంగఁ జేయు ♦ పొందిక మీఱన్. 437

గీ॥ అనుటయు నతండు శక్రవి ♦ ద్యను నొసంగి, పార్థివేశసమర్చనా ♦ పద్ధతియును
దన్మహామంత్రములఁ దెల్పి ♦ తఱలెనంత, నర్జునునిఁ జెందెఁ దేజశ్చ ♦ యంబు లపుడు.

వ. అట్లు తేజంబు లొందినమీఁద

ఉ॥ తక్కిన పాండునందనులు ♦ ద్రౌపదియున్ గడు దివ్యదీప్తులన్
నెక్కొని మించు నర్జునుని ♦ నెట్టనఁ గన్గొని యుబ్బి వైరులన్
జక్కడఁగింతు మింకఁ గొనఁ♦జాలుదు మేమె జయంబు రూఢిగా
నక్కఱకంఠదేవుని మ♦హాకరుణన్ గొని యస్త్రలాభమున్. 439

క॥ అని సంతసించి యవ్విజ,యునిఁ బాయుట కాత్మఁ దలఁకు♦చుండిన నవ్వా
రినిఁ గని కిరీటి యచిరం,బున సిద్ధినిఁ బడసి వత్తు ♦ పొలుపుగ నిటకున్. 440

గీ॥ సెలవొసఁగుఁడన్నఁబాండవుల్ ♦ చింతఁదక్క, పోయివేగనె వరసిద్ధిఁ ♦ బొంది రమ్ము
నిరియటుల్ కృష్ణ! శివమగు♦నీకుఁబథము, శంకరుఁడుశంకరుండగు ♦ సంతతమ్ము.

## —* అర్జునుఁడు తపస్సుకై యింద్రకీలాద్రికి బోవుట *—

వ. అనుటయు నర్జునుం డన్నలగు యుధిష్ఠిర భీముల పదంబులకెఱఁగి కవలఁ గౌఁగిలించుకొని పాంచాలరాజసుతకు గారవించి పయనంబొనర్చి యుత్తరాభిముఖుండై సుశకునంబులఁ బరికించుచు నింద్రకీలాద్రిఁ జేరి యందు గంగాకూలంబున నమరు నశోకవనిఁ బ్రవేశించి యొక సుస్థలంబు నాశ్రమంబు చేసికొని గురూక్త ప్రకారంబుగ నింద్రియంబుల నిగ్రహించి నియతంబుగ గంగావగాహనంబొనర్చి భస్మపుండ్రాంకితతనుండై త్రికాలంబుఁ బార్థివలింగపూజనంబొనర్చుచు శక్రవిద్య ననుష్ఠింపుచు మహేశ్వరున్ గొల్చుచుండె.

గీ॥ అంత శక్రుండు విజయుని♦యాత్మమును బరీక్ష సేయఁగ బ్రహ్మచా♦రియయి డాయ
నర్జునుఁడు తత్పదమ్ముల♦యందు వ్రాలి, యర్చనము సల్పినంత నా♦యమరవిభుఁడు.

క॥ తపసేటికి నొనరించెదు, విపులమతీ! యనినఁ గ్రీడి ♦ విప్రోత్తమ! నే
రిపులను జయించి మాద్రాయపు సిరిఁ గొననెంచి తపను ♦ వర్ధినొనర్తున్.

క॥ అని తెలిపిన నాతండును, ఘనతప మొనరించి పుడమిఁ♦గాక్షింతురె? ము
క్తినిఁదక్క యొండు నిట్టుల, వినలే దెవుడేని యనుచు ♦ వికవిక నగుచున్.

క॥ కోరుము మోక్షము రాజ్యముఁ, గోరకు వజ్రంబునిచ్చి♦కొందురె కాచం
బారసి యెవ్వండేనియు, ధారుణిలో రాజతిలక! ♦ తలఁపు మిది మదిన్. 446

గీ॥ అనిన ఫల్గునుఁ డనియె ధ♦రామరేంద్ర!, నీవనిన వచనం బెంత♦నిక్కమైన
పదియునాల్గవయేట నేఁ♦బగఱ గెడపి, రాజ్య మగ్రజున కొసంగఁ♦బ్రతినఁగొంటి.

క॥ అక్కటతన రాజ్యకాంక్షన్, జిక్కిటి నన నతఁడి డేటి ♦ చేష్ట యిపుడు నే
నక్కట లువాసి మోక్షము, దక్క గొనుము గానిచో వృ♦థాయగుఁ దపమున్.

గీ॥ అనిన గినుకొంది విజయుఁడా ♦ యగ్రకులునిఁ
గని యనియెఁ బొమ్ము నీ కేటి ♦ కనవసరపు
జోలి యన మానకతఁడు హె♦చ్చుగ వచింపఁ
జాలు మాటాడ కిఁకమీఁద ♦ శాస్త్రియగును. 449

క॥ అనినంత నమ్మహేంద్రుఁడు, తనయునిధీరమతి కాత్మఁ♦దద్దయు ముదమున్
గొని యంతనె నిజరూపం, బనువుగ ధరియింపఁ గాంచి ♦ యర్జునుఁ డంతన్.

క॥ బిడియపడి యమ్మహేంద్రుని, యడుగులఁబడి యెంతయేని ♦ యభినుతిసేయన్
గడు మెచ్చి యనియె నాకేశుఁడును గుడాకేశుతోడ ♦ సొంపుగ నిట్టుల్.

క॥ వర మడుగు మిచ్చెదను సత్వరము కుమారా! యనుడు న♦తం డంత సురే
శ్వర! శాత్రవవిజయము సేఁకుఱఁజేయుము నాకటన్న ♦ గోత్రారియనున్.

ఉ॥ ద్రోణుఁడు జాహ్నవీసుతుఁడు ♦ దోర్బలవిక్రముఁ డల్ల కర్ణుఁడున్
ద్రోణసుతుండు తావకవి♦రోధివశంబున నున్నవా రని
వారిపరాక్రముల్ సమర♦దక్షులు వారల గెల్వ నెట్టి గీ
ర్వాణులు శూలపాణి యగు ♦ భర్గుఁ డొకండు వినాగ ఫల్గునా! 453

ఉ॥ కావున నీ వవశ్య మిఁకఁ ♦ గవ్వడి! నెవ్వడిఁ గాలకాలునిన్
భావమునందు నెక్కొని త♦పం బొనరింపు మతండు సత్కృపా
శ్రీవిభవాంతరంగుఁడు వి♦శిష్టుఁడు సర్వజగంబులందు నా
దేవుఁడు నీకొసంగు నిఁక ♦ దివ్యము పాశుపతాస్త్రరాజమున్. 454

గీ॥ దాన నీవిఁక సుకరంబు♦గా నితాంత, శూరులగు భీష్మముఖ్యుల ♦ బీరమణఁచి
ధార్తరాష్ట్రులఁగడపి భ♦ద్రముగ రాజ్యలక్ష్మిఁ జేకొందువిందు జా♦లంబు లేదు.

క॥ ఇఁక నామంత్రంబు జపింపుము పినాకిని సతమ్ము ♦ భావములోఁ బా
యక సేవించుచునుండుము, సకలసుఖంబు లొనఁగూడు ♦ శర్వునికరుణన్.

క॥ అని నొడివి యంత సంక్రం, దనుఁడు నిజానుచరులను ద♦నయునకున్ దో
డొనరించియుంచి క్రమ్మఱఁ, జనియెను స్వస్థానమునకు ♦ సమ్మదమొదవన్.

గీ॥ అర్జునుండప్డు జనకుని ♦ యాజ్ఞ తీరు, శంకరునిఁ బదిలముచేసి ♦ స్వాంతమందు
ఏకపాదమ్మునన్నిల్చి ♦ యేకనిష్ఠ, సలిపెఁ బంచాక్షరీమంత్ర♦జపము రహిని.

గీ॥ అంతఁ గొన్నాళ్లు జరిగిన♦యంతమీఁద, శంకరుండు దయన్ జెంది ♦ సవ్యసాచి
నించుకపరీక్షఁ జేయఁగ ♦ నెంచియొక కిరాతరాజాకృతిని జెంది ♦ రాణగదుర. 459

—* మూకాసురుఁడు సూకరాకారముతో నర్జునునకుఁ గీడుసేయ వచ్చుట *—

గీ॥ పలువురుగిరాతులనుగూడి♦పాండవేయుఁ, దరియుచుండగ నొకమూక♦దైత్యుఁడప్డు
ధార్తరాష్ట్రుని ప్రేరణఁ♦దఱసి సూక, రాకృతిన్ జెంది నర్జును ♦ నంతికమున. 460

క॥ కడురొదఁ జేయుచు నిటునటు, బుడిబుడిఁ దిరుగుచుఁగిరీటిఁ ♦ బొడువఁగ నుంకిం
చెడు చెడునిశాటుఁ గనుఁగొని, యెడఁదన్ యోజించె నప్పు♦డింద్రజుఁడిట్టుల్.

క॥ వీఁడెవ్వఁడొ రక్కసుఁడిఁట, బోడిగ నరుదెంచి నన్నుఁ ♦ బొడువఁగనునటుల్
చూడఁగదోఁచెను మిన్నక, రాఁ డరివర్గంబులోని ♦ రక్కసి యితఁడౌ. 462

క॥ పలువుర రక్కసులను నేఁ, బొలియించితి వీఁడు వారి ♦ పొలఁకువ యగునో
ఖలుఁడగు దుర్యోధనునకుఁ, జెలికాఁడై నన్నుఁబొడువఁ ♦ జేరెనొ యిట్టుల్.

గీ॥ ఎట్టులైనను సీతం డ♦హితుఁడు నిజము, వీనిఁ గనుఁగొనఁ గలఁగెను♦ మానసంబు
అలరు మిత్త్రునిఁ జూచిన♦నంతరంగ, మరినిఁ గనుఁగొన వ్యాకులం♦బై తనర్చు.

గీ॥ కులము నాచార మెఱిఁగించుఁ ♦ గుడుపు సెఱుఁగఁ
జేయు దేహంబు శుత్త్రిమును ♦ జెప్పు వచన
మట్లు స్నేహంబు నెఱిఁగించు ♦ నక్షియెందు
నిందు సందియ మొనర దా♦క్కింతయేని. 465

క॥ ఆకృతిచేతను నడచే, జోకఁదనరు చెయిదిచేతఁ ♦ జూపులచేతన్
వాకులచే ముఖకలచే, లోకులు దెలియుదురు మనము♦లోని విధంబున్. 466

వ. మఱియు లాఁతులఁ జూచునపుడు లోచనం బుజ్జ్వలంబును సరసంబును వక్త్రింబు
నారక్తకంబునునై నాల్గువిధంబుల నమరు. 467

గీ॥ చెలిమిగలవారిఁ గనఁగ ను♦జ్జ్వలమయి తగుఁ
గొమరులన్ జూడ సరసమై ♦ కోమరుమిగులుఁ
గామినులఁ జూచినంత వ♦క్త్రిమగుచుండుఁ
బగరఁగనఁగ నారక్తమై ♦ పరఁగు నక్షి. 468

వ. అట్లు కావున

క॥ వీనిన్ గనుఁగొనినంతనె, నానేంద్రియరాజి గలఁగె ♦ నాకిఁక వీనిన్
బోనీకపట్టి చంపుటె, యా నుచితపుఁదెఱఁగు గుటని ♦ యాజ్ఞయు నిటులే.

వ. అని యిట్లు కృతనిశ్చయుండై

గీ॥ గాండివము లాగి బాణమ్ము ♦ గదియఁ జేయు
చుండ నత్తఱిఁ బురశాస ♦ నుండు వరుని
పైఁ గలట్టికృపణ్ మూక♦వధ నొనర్పఁ
గడఁగి యొనరించె నొకపాటి ♦ గర్జనంబు. 470

క॥ రోదసుల నిండి యా ధ్వని, భేదిల్లఁగఁజేసె నెంతో ♦ బిట్టుగ గిరులన్
మోదమ్మున నర్జునుఁ డా, నాదము విని విస్మయము మ♦నమ్మునఁగొనియున్.

గీ॥ ఇట్లు గంభీరమగు నాద♦మీశ్వరుండె, సలిపియుండు మఱొక్కండు ♦ సలుపలేఁడు
శౌరియును బాదరాయణుం♦డారవీందు, పావకాక్షుని లీలలఁ ♦ బలుకలేడె ?

క॥ ఆ శివుఁ గొలిచెడివారికి, లేశంబేనియును సేగి♦లే దఘకర్మా
వేశంబున నొకయెడ నా, వేశించిన నడఁగిపోవు ♦ విశ్వేశుకృపన్. 473

వ. మఱియు నవశ్యభోగ్యంబగు ప్రారబ్ధదుఃఖంబునుగూడ నప్పరమేశ్వరుండు గర్భ
ణించి యున్మూలనం బొనర్చు. 474

గీ॥ విసము నమృతంబుఁ జేయును ♦ విసముఁ జేయు
నమృతమును నిచ్చతోడ నా ♦ యమృతమూర్తి
సర్వమునకు సమర్థుఁడీ ♦ చందమెఱిఁగి
కొలిచి సిద్ధులఁ గొందురు ♦ కుశలమతులు. 475

సీ॥ ఇట్టులనుకొనుచుండఁగ ♦ నీశ్వరుండు, దారసిలి యర్జునునిఁగావ ♦ దానవునిప
యిన్ శరంబేసెనంత నే♦యింద్రసుతుఁడు, కయిదువునుజార్చికపటసూ♦కరముమీఁద

—* కృతకకిరాతార్జునులు మాయాసూకరముపై బాణంబులేసి చంపుట *—

గీ॥ శివుని బాణంబు పృష్ఠంబుఁ♦జెంది నోట, వెలువడి ధరిత్రిఁ జెందెను ♦ శ్వేతవాహ
నునిశరమ్మును వక్త్రంబు♦నుంచి పృష్ఠ, మున వెడలి ప్రక్కఁబడియె న♦మ్మూర్ఖుఁడీల్గె,

క॥ సూకరతనువున్ బోవిడి, రాకాసి నిజాకృతిన్ బ♦రానుండయ్యెన్
నాకచరుల్ సుమవృష్టిఁ బి, నాకి పయిన్ నరునిపై నొ♦నర్చిరి వేడ్కన్. 478

వ. అంత

క॥ తనయమ్మును గొనిరమ్మని, యనుజీవిని నొకనిఁబంపె ♦ హరుఁ డాతండున్
జనుదెంచె సాయకముఁగొనఁ, దన బాణముఁగొనఁగఁ గ్రీడి♦దరిసె నచటికిన్.

గీ॥ అచటఁ బడియున్న బాణంబు ♦ హరునియనుచ
రుండు గొనఁబోవఁగా నర్జు♦నుండు వేగ
వాని బెదరించి కొనియెను ♦ బాణ మప్పు
డాతఁ డిట్లనె నిదియేటి ♦ యాగడంబు. 480

క॥ విడువుము శరమ్ము ముని! మా, రొడయని బాణమనుడు విజ♦యుఁడు గడుఁ గినుకన్
వెడగ! యిటులేల పల్కెదు, విడిచితి నేఁగాదె నాదు ♦ విశిఖము నిపుడే. 481

వ. రేఖారూపంబును మన్నామాంకితములగు పుచ్ఛంబులను గనుఁగొనరాదే యనినఁ
గాననచరుం డర్జునున కిట్లనియె. 482

ఉ॥ తాపసవేసమొంది యిటు ♦ దండిగ నుంటివి గాని నిక్కమా
తాపసి నీవుగా విటుల ♦ దబ్బరలాడుదురే? యదైనచో
పాపముగాదొకో యొరుల ♦ వస్తువుకై యిటు ప్రాకులాడఁగా
నీ వస యంతయున్ బోరయు ♦ నీకిదిదక్క దెఱుంగు రాఢిగాన్. 483

ఉ॥ ఒంటిగ నున్నవాఁ డనుచు ♦ నూహయొనర్చితి నీవు నన్ను బల్
దంటలు భిల్లపుంగవు లు♦దారులు పెక్కురతోడ నిందె ని
క్కంటకుఁ డాఢ్యుఁడౌ విభుఁడు ♦ చక్కఁ గనుంగొనుచున్నవాఁ డదే
యొంటికొనన్ శరంబు నిడు ♦ మూరక వాకొక కిట్టులెంతయున్. 484

ఉ॥ నీ కుపకారముఁ జలుప ♦ నేగద మాదొర పూన్కితోడ ని
ట్లాకులుఁడై యిటన్ దఱిసి ♦ యమ్మునఁ బ్రాణముఁబుచ్చె వీని నీ
వాకృతముఁ దలంప విటు ♦ లక్కట! యెక్కటమిష్టసిద్ధియా
వాకున బొందు మే లిడిన ♦ వానికిఁ గీడు దలంపు మాయురే! 485

ఉ॥ అమ్మున కాసనొందితివె? ♦ యట్టులనేని మదీయనాథు నీ
యమ్మిదుమంచు నద్దుము మ♦హామహుఁ డాతఁ డొసంగు నిట్టి పె
క్కమ్ములు చాలఁగాఁ దనరు ♦ నాతనిదండ వితండ వాదముఁ
జిమ్మము తెమ్ము బాణమును ♦ జేష్ఠతనం బొడిగట్ట కిమ్మగా. 486

వ. అనిన వనేచరునిఁగాంచి సవ్యసాచి మించుటల్కతో మనంబున శివున్దలంచి
యవ్వాని కిట్లనియె. 487

ఉ॥ బొంకులు పల్కుచుంటి విటు ♦ పొల్పుగ నీదగు జాతితీరుగా
నింకను నిన్నదిప్పుటకు ♦ నేఁదలపన్ దగునొక్క రాజనై
మంకుకిరాత! నీవసరి ♦ మానిసివే యెటులయ్యెడిఁ గేల యీ
పెంకెతనమ్ము లమ్మునకు ♦ పేర్మి నొసంగెద నిప్పుడున్నచో. 488

గీ॥ అనవుడున్ భిల్లుఁ డిట్లనె ♦ నకట! నీవు, ఋషివిగా విల్లు గోరెదు♦రిత్తవావు
నిన్ను వనాయోలఁవారసాయు♦కమ్ము వేగఁ, గాని వోఁ [illegible] వెపుడె.

క॥ అనఁ దిపుగఁ బాసఁ దనియెను, వనచర! దొత్తెమ్ము నీవు ♦ భర్త నతనితో
ననిఁజేసెద నీతోఁ బెనఁగను సింగము చనునె జంబు♦కముతోఁ బోరన్.

క॥ చూచెదవుగాని నావస, వేచని తొత్తెమ్ము నీదు ♦ విభుని ననఁ గదుఁ
జూచుచుఁ జని వేగంబె వ,నేచరుఁడు హరునకుఁ దెల్పె ♦ నేటుగ నంతన్.

క॥ విని శంకరుండు సైన్యం,బునుగొని చని క్రీడి కెదురఁ ♦ బొందించి రయం
బున మునుపటి యెఱుకను బం,పెను సద్గును ధైర్యపరయుఁ♦బేరిమి నతఁడున్.

ఉ॥ ఏటికిఁ గోల్పడన్దలఁతు ♦ వీ యటవీస్థలిలోనఁ బ్రాణముల్
మాటికి నీదు సోదరులు ♦ మానిని నీదుకళత్రముఁ గదుఁ
గాటపుదుఃఖ మొందుచును ♦ గాంక్షయొనర్తురు నీదు రాకకై
వాటముమీఱ శత్రువుల ♦ పాల్పడు రాజ్యము పాఱజూడుమా! 493

వ. అనిన విని యర్జునుండును.

గీ॥ నాదు సోదర్యులును మఱి♦నాదుసతియు, శోకమెంతేనిఁజెంది నొ♦చ్చుచునుగాక
నాదురాజ్యము శత్రుజ♦నము కెదక్కఁ, గాక నేనోడుదునె మీరుఁ♦గఱటియెఱుకు.

క॥ రమ్మను మీయొడయుని నే,రమ్మనుమీ! యిట్టులాడ ♦ రాజులతో ఘో
రమ్మనుమీ! బవరము భా,రమ్మనుమీ! యనృత మెపుడు♦రహిసారసినన్. 495

ఆ॥ అనిన మరల వాఁడు♦హరున కీ వచనముల్, వినిచినంత శివుఁడు♦మనమునందు
మెచ్చి పోరుసేయ ♦ మేకొనినిలిచిన, హరునిఁ గుప్పె విజయుఁ ♦ డంపగముల.

క॥ హరునియనుచరులు సైనిక,వరులు నరునిపైన బాణ♦వర్షముఁ బఱుపన్
సరకుగొన కెంతయేనియుఁ, గిరీటి మనమందు హరునిఁ ♦ గీల్కొని వేగన్.

—* మాయాకిరాతార్జునుల యుద్ధము *—

గీ॥ గణవరులకై దువులను దు♦న్కల నొనర్చి, వాఁడినారసములను న♦వ్వారి దూఱ
నేయ నెంతయు నొచ్చి సం♦తెడముఁ జెంది, రుభయులీశార్జునులు చేయు♦చుండిరనిని.

వ. అందు.

ఉ॥ శంకరుఁ డాత్మమందు దయఁ ♦ జాలఁగనొంది కిరీటిపైఁ గడున్
జంకుచు వేయు బాణములు ♦ శక్రసుతుం డిఁక లాగి లాగి బల్
బింకముఁ జూపుచున్ శివుని ♦ బిట్టుగ మోఁదుచునుండె నమ్మల
న్బొంకముమీఱ వీరి దుర♦మున్ గనుచుండిరి నింగి దేవతల్. 499

గీ॥ అంతఁ గొంతవడికి నస్త్ర♦నాశుగములు, నస్త్రములు నెల్ల ఖిలమయ్యె♦నాత్మకవచ
మును సురిగె నప్డు కొంకక♦ర్జునుఁడు మల్ల, యుద్ధమునకుఁ దొడంగె స♦న్నద్ధుఁడగుచు.

క॥ హరుఁడును పాండుసుతుండును, గరమరుదుగ ముష్టియుద్ధ♦కౌశలులై బల్
బిరుదొప్పఁ బోరుచుండిరి, హరుసమ్మనఁ జూచుచుండి ♦ రమరులు చదలన్.

సీ॥ పట్టుదలతోడఁ బార్థుండు♦భర్గు నొంపఁ, బూని శ్రమఁ జెందుచుండ నా♦భూతనాథుఁ
డించుకేని యలయక హా♦సించుచున్నఁ, గాంచి లజ్జించి యీశ్వరు♦గాఁ దలంచి.

—* అర్జునుఁడు మాయాకిరాతుని శివునిగాఁ దెలిసికొని స్తుతించుట *—

చ॥ తెలిసితినయ్య! నిన్నఖిల♦దేవశరణ్య! వరేణ్య నీశ్వరున్
బలుమఱు గృష్ణుఁడున్ గురుఁడు ♦ బన్నుగఁ జెప్పిరి నీ వినోదముల్
దలఁపఁగలేక యిట్లు దురి♦తమ్మొనరించితి సైఁపు మెట్టులేన్
గలుషచరిత్రు నన్ బరమ♦కారుణికాత్మ! మహాత్మ! యాదృతిన్. 503

గీ॥ అనినయంతనె శివుఁడు పె♦ల్లాదరమున, తనదురూపంబుఁ జెంద ఫ♦ల్గునుఁడు చూచి
మనమునందక్కజంబొంది♦ తనదు చెడ్డ, కై పునఃపునంతపనర వే♦గముగ మ్రొక్కె.

క॥ ఎవ్వనిఁ గొలుచుచునుంటినొ, యెవ్వనికృప నివ్వటిలునొ ♦ యీ భువనము లిం
కెవ్వఁడు సర్వేశ్వరుఁడో, యవ్విభు నేఁ దెలియనైతి ♦ నజ్ఞత బలిమిన్. 506

వ. అనికొని సాష్టాంగపడి శిరమునం దంజలిఁ జేర్చి నిలిచియున్న యమరేంద్రనందను
గనుఁగొని జగన్నాథుం డిట్లనియె. 507

చ॥ వగవ కొకింతయేని నృప♦వల్లభ! నీదగు ధైర్య మారయన్
నిగరపు శోధనం బిటుల ♦ నే నొనరించితి నీ ప్రహారముల్
దగుఁగతి నర్చ్వోలె నెడఁ♦దన్ దలపోసితి నీదు తప్పు నుం
తగుపడ దింకఁ గోరుము ర♦యమ్మున నీదు మనోరథమ్ములన్. 508

వ. మఱియు నాబాణమ్మునుగూడ నేనె మాటుపఱచి యిట్లు దురంబుఁబొసఁగించితి
ననుటయు నర్జునుండు తిరుగ నమస్కరించి పరమేశ్వరున కిట్లనియె. 509

గీ॥ భక్తవల్లభుఁడవగు నీ♦భావమునకుఁ, గన్పడునె నాదు ననుచిత♦కార్య మభవ!
యింకను నీదు గృపాళుత్వ♦మెంతయేని, వర్ణనీయముగన్ గాదె♦వరద! నాకు. 510

క॥ చదలున రిక్కలఁ బుడమిన్, బొదలెడు రజములను వృష్టి♦బొసఁగంబడునా
యుదకకణమ్ముల నీయెడఁ, గుదురగు గుణములను లెక్క♦గొనశక్యమొకో! 511

సీ॥ దేవదేవాయ సు♦ధీగమ్యవిభవాయ, తేజస్స్వరూపాయ♦తే నమోస్తు
కైలాసవాసాయ ♦ ఘనపంచవక్త్రాయ, త్రివిలోచనాస్యాయ♦తే నమోస్తు
డమరుకపాలఖ♦డ్గకరాయ యజగవ, త్రిశిఖాఢ్యహస్తాయ ♦ తే నమోస్తు
కర్పూరపాండురాం ♦ గాయ నాగాజిన, దీవ్యచ్ఛరీరాయ♦తే నమోస్తు

గీ॥ త్రిపురదైతేయనాశాయ♦తేనమోస్తు, మౌనిజననుతచరితాయ♦తేనమోస్తు
త్రిపథగాయుక్తమస్తాయ♦తేనమోస్తు, దృఢకిరాతస్వరూపాయ♦తేనమోస్తు.

కందగర్భిత మణిగణనికర వృత్తము
సురవరనుతపద సురుచిర కరుణా
కరసురగిరిధరకమలజముఖ సం
హరపటుతరకర హర హిమకరభా
స్కరకచసముదయ కనకఘనతనూ! 513

క॥ ఎదియెది జగమునఁగనఁబడు, నదియది నీ తేజమరయ ♦ నఖిలాత్మక! యె
ప్పొదవఁగఁ జిద్రూపుఁడవై, పొదలెదవు త్రిలోకములను♦బురుషశ్రేష్ఠా! 514

క॥ వరమేమిగోరవలె శివ!, యెఱుఁగవె నీ వెల్లవారి ♦ యింగితముల ము
ష్కరులగు నరులమదము నీ, దరిసెనమునఁబాయు సిరులఁ♦దార్పుము దేవా! 515

—* శివుఁ డర్జునునకుఁ బాశుపతాస్త్ర మిచ్చుట *—

వ. ఇట్లని పార్థుండు భక్తవత్సలుండగు శంకరునియడుగులన్ బడి దోయిలొగ్గియున్న
మహేశ్వరుండు సంతసించి స్వకీయంబును దుర్జయంబునగు పాశుపతాస్త్రం
బర్జునున కిచ్చి యిట్లనియె. 516

క॥ నాయస్త్రంబిది దుర్జయ, మీయెడ నిచ్చితిని నీకు ♦ నింద్రతనయ! దు
ర్జేయుఁడవై యలరెద విఁక, నీయభియాతినిచయమును ♦ నిర్జించి రహిన్. 517

వ. మఱియు నీకిష్టబంధువుండైన కృష్ణుండు నాకంతరంగభక్తుం డాత్మభూతుం డాతనిఁ బ్రేరించి నీకు సాయంబుఁ జేయించెద నాయనుగ్రహంబున నీకు విజయంబగు నీక రాజ్యంబు నిష్కంటకంబుగఁ జెంది ధర్మంబేమఱక నడుపుమని చేసాచి సవ్యసాచిశిరంబందుంచి గారవించి యంతర్హితుండయ్యె నర్జునుండును నస్త్రలాభంబు నొంది మురిసి శివుని నుతింపుచు నిజాశ్రమంబుఁ జేరి తనరాకకై ప్రాణంబునట్లు గాక్షించుచున్న సోదరులకును పాంచాలరాజసుతకును దపోవృత్తాంతం బాద్యంతం బెఱింగించి శివానుగ్రహంబును నస్త్రప్రాప్తియుం దెలిపిన వారలెల్లఁ గరంబుమురిసి శివునిఁ బెక్కుతీరులఁ గైవారం బొనర్చి రంత దివినుండి పుష్పవృష్టి గురిసె నావెంట శ్రీకృష్ణుండరుదెంచి యర్జుననిన్ గాఢాలింగనం బొనరించి మహేశ్వరానుగ్రహం బెంతయేనియుఁ గొనియాడె నిట్లు కిరాతేశ్వరలీల మీకుపన్యసించితి నిద్దాని వినినఁ జదివినవారలకు సర్వార్థంబులు నేకూరుననుడు. 518

క॥ మాధుర్యధుర్యసువచో, బోధామృతదాన చతుర! బుధజనసేవా
సాధితవిజ్ఞానాసి, చ్ఛేదితశిష్యాఘపాశ! శివభక్తవశా! 519

గద్య. ఇది శ్రీ బుధజనవిధేయ ముదిగొండ నాగవీరేశ్వరనామధేయ
ప్రణీతంబైన శివపురాణంబందలి లీలాఖండంబునఁ
బ్రథమాశ్వాసము సర్వము సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ





శ్రీ శివాభ్యాన్నమః

# శ్రీ శివపురాణము

## లింగవైభవఖండము

### ప్రథమాశ్వాసము.



యలరంగ నెవ్వఁడు వి♦చిత్రముగా వికృతిన్ దొరంగి యా
త్మీయపుమాయతోఁడ జగ♦తీవలయాకృతిఁదాల్చె భోగమో
క్షాయతనంబు లెవ్వనికృ♦పాఢ్యకటాక్షములే వెలుం గెదక్
బాయక కాంత్రయోగు లల♦పర్వతజావిభుఁ గొల్తు శంకరున్.

మ॥ కరుణాశోభితవీక్షణంబు స్మితరం♦గద్వక్త్రపద్మంబు బం
ధురతాపత్రయభంజకంబు హిమరు♦క్తోత్రాభిరామంబు భా
స్వరసౌఖ్యాకరసచ్చిదాత్మకమునున్ ♦ బ్రాలేయశైలేంద్రజా
పరిరంభోజ్జ్వలమైన యీశతను వా♦పాదించుతన్ సౌఖ్యమున్. 2

క॥ శ్రీకోటీశనగావా, గ్న్యాకబరీభూత శర్వపూస్సంభవ! రా
కాకుముదాప్తజ్యోత్స్నా, శ్రీకరసుయశోభిరామ! శ్రీలక్ష్మ్యంబా! 3

వ. అవధరింపుము.

క॥ శౌనకముఖ్యులు పరమే, శానకథాశ్రవణజనిత ♦ సంతోషభర
శ్రీనిధులై యక్కథకున, కానతులై యిట్టఁగున ♦ నడిగిరి వరుసన్. 4

క॥ విన్నారము శివలీలలఁ, గన్నార మనన్యలభ్య ♦ కౌతుక మెదఁ జే
కొన్నార మభవభాగ్యము, మన్నారము దుఃఖతతులు ♦ మరలుటవలనన్. 5

క॥ హరచరితశ్రవణంబున, మరగినమాచేత మద్ది♦మాని యలరునే
యురుకీర్తి! చెప్పుమిఁక శాం, కరలింగంబులను వరుస♦గా లెక్కమరన్. 6

క॥ జ్యోతిర్లింగములను దజ్జాతమహాలింగములను ♦ జక్కఁగఁ దత్సం
భూతియు మా కెఱిఁగింపుము, సూతబుధేంద్రా! నితాంత♦శుభగుణసాంద్రా!

గీ॥ ఇవియునుంగాక పుడమిపై ♦ నెన్ని యేనిఁ, గలవు శివలింగములు వాని ♦ నెలవులను ద
దీయనామంబులను మాకుఁ ♦ దేటపడఁగఁ, దెలుపుమయ్య! సుధీగేయ ♦ దివ్యచర్య!

వ. అనుటయు నక్కథకుండు కరంబుమురిసి యమ్మహామునుల కిట్లనియె. 9

గీ॥ లోకముల మేలుఁగోరి సు♦శ్లోకులార!, మీర లడిగితి రెంతయు ♦ మేల్మిమీఱ
మీపయింగల చెల్మిక♦ల్మిని నుడివెద, శంభులింగములవిభూతి♦సంగ్రహించి.

గీ॥ లెక్క లేనట్లుగా శివ♦లింగమూర్తు, లవని దైవాఱుచున్నవి ♦ నాకలోక
మందుఁ బాతాళమునఁ బెక్క♦లట్టివాని, నెల్లఁ దెలియఁగఁ దరముగా♦దెవ్వరికిని.

వ. ఐనను నాయెఱింగినయట్లు మీ సాన్నిధ్యంబునఁ జెప్పెద నాకర్ణింపుఁడు. 12

—* సూతుఁడు మునులకు జ్యోతిర్లింగోపలింగంబు లెఱిఁగింపుట *—

*సీ॥ సిరిమీఱు సౌరాష్ట్ర♦సీమ సోమేశ్వరుం, డల శ్రీగిరిని మల్లి♦కార్జునుండు
ఉజ్జయినీపురి ♦ నున్న మహాకాలుఁ, డోంకారభూమి నొ♦ప్పొందు నీశుఁ
డామిహికాచలం♦బందుఁ గేదారుండు, సరవిఢాకిని భీమ♦శంకరుండు
అవిముక్తమందు వి♦శ్వాధినాథుం డల్ల, గౌతమీతటిఁ ద్ర్యంబ♦కప్రభుండు

గీ॥ భవ్యమగు నాచితాభూమి ♦ వైద్యభర్త, దారుకావని నాగేశ ♦ ధీరమూర్తి
సేతువున రామనాథాఖ్య♦శివుఁడు శ్రీశి, వాలయంబున ఘుశ్మేశ్వ♦రాహ్వయుండు.

ఉ॥ ఈ పదిరెండులింగముల ♦ నెవ్వఁడుగాని కడుం బ్రపత్తిమై
నోపికఁ జేరి కొల్చు నతఁ ♦ డొందు శుభంబు లిహంబునందు దు
ష్ప్రాపపు మోక్షలక్ష్మిఁ గొనఁ♦జాలుఁ బరంబునఁ సర్వసిద్ధులన్
జేపెడు నివ్వి భక్తులకు ♦ సిద్ధముగా మునివంశరత్నముల్! 14

గీ॥ లింగములఁ జేరఁబోవఁగా♦లేకయున్నఁ, దవిలి లింగాహ్వయంబులఁ♦దలఁచుచుండి
రేనియు సకృత్తుగాస్మరి♦యించిరేని, యును శివుం డట్టివారల♦ కొసఁగుసిరులు. 15

వ. ఇంక నీ జ్యోతిర్లింగములలోఁ దొమ్మిదిలింగముల కుపలింగంబులు తజ్జాతంబులై
యొసంగు నవ్వాని వినుండు. 16

---

* శివపురాణే కోటిరుద్రసంహితాయాం ప్రథమాధ్యాయే—

శ్లో॥ సౌరాష్ట్రే సోమనాథంచ । శ్రీశైలే మల్లికార్జునం । ఉజ్జయిన్యాం మహాకాల । మోంకారే పర మేశ్వరం । కేదారం హిమవత్పృష్ఠే । ఢాకిన్యాం భీమశంకరం । వారణాస్యాంచ విశ్వేశం । త్ర్యంబకం గౌతమీతటే । వైద్యనాథం చితాభూమౌ । నాగేశం దారుకావనే । సేతుబంధేచ రామేశం । ఘుశ్మేశంచ శివాలయే । ద్వాదశైతాని నామాని । ప్రాతరుదాయయఃపఠేత్ । సర్వపాప వినిర్ముక్తః । సర్వసిద్ధిఫలంలభేత్ ॥

వ. సోమేశ్వరలింగంబున కుపలింగం బంతకేశలింగంబు వసుమతీసాగరసంయోగంబున నలరారు, మల్లికార్జునలింగంబున కుపలింగంబు రుద్రేశ్వరలింగంబు, భృగుకక్షమందు సుఖావహంబై యమరు, మహాకాలలింగజాతంబగు నుపలింగంబు దుగ్ధేశలింగంబు, నర్మదాతీరంబునఁ బాపహరంబై ప్రసిద్ధంబై యుండు, ఓంకారజాతంబగు కర్దమేశలింగంబు బిందుసరంబందు సర్వకామఫలప్రదంబై యొప్పొందుఁ గేదారేశ్వరజాతంబగు భూతేశలింగంబు యమునాతటంబందు ద్రష్టలకును బూజకులకును, మహాపాపహరంబై హరువొందు, భీమశంకరసంభూతంబగు భీమేశ్వరలింగంబు సహ్యాచలంబందు మహాబలవర్ధక ఖ్యాతిఁగాంచు, నాగేశ్వరసముద్భూతంబగు భూతేశ్వరలింగంబు మల్లికా సరస్వతీతీరంబున దర్శనమాత్రంబునఁ బాపహరంబై వెలయు. ఘుశ్మేశలింగజాతంబగు వ్యాఘ్రేశ్వరలింగం బిహపరసాధకంబై యుండు నీ లింగనవకంబు దర్శనమాత్రంబున బాపహరంబులై సకలకామఫలప్రదంబులై విరాజిల్లు. 17

## శ్రీ కాశి

శా॥ గంగాతీరమునందుఁ జెన్నలరుశ్రీ ♦ కాశీపురం బింపుమీ
ఱంగా లింగము లందుఁ గోట్లశతముల్ ♦ రాజిల్లు విశ్వేశుఁ డం
దుం గొప్పౌ నవిముక్తకేశ్వరుఁడు దా♦నున్ *కృత్తివాసేశుఁడున్
బొంగున్ గాంచెదరల్లె వీరిసిరిఁ జూ♦పున్ వృద్ధబాలేశుఁడున్. 18

క॥ మఱియుఁ దశాశ్వమేధే, శ్వరుఁడున్ గేదారనాథ ♦ శర్వుం డట్లే
యరుదగు నా తిలభాండే, శ్వరుఁడుఁ బాగడొందువారు ♦ జగముల మిగులన్,

## —* ప్రాచీన దివ్యలింగములు *—

క॥ గంగా కూపారంబుల, సంగమముల సంగమేశ ♦ శంకరుఁడొప్పన్
రంగొప్ప కౌశికీనది, చెంగట నాగేశ్వరుండు ♦ చెలఁగు సిరులతోఁ. 20

గీ॥ భక్తులకునెల్ల సిరుల నె♦ప్పాట నొసఁగు, వలఁతిభూతేశ్వరుఁడు కడు♦వాసిఁదనరు
దరిసెనమున నె సిద్ధులఁ♦దార్చు సిద్ధ, నాథలింగము భువిలో న♦నన్యశక్తి. 21

గీ॥ గండకీతీరమునఁ బటు♦శప్రభుండు, ఫల్గునీతీర పూరేశ ♦ ధర్మమూర్తి
తప్తకాతీరవర్తి యు♦దారకీర్తి, యలకుమారేశ్వరుం డఖి♦లార్తిహరుఁడు. 22

గీ॥ తీర్థరాజంబునబ్రహ్మ ♦ దేవవిభుఁడు, మాధవేశ్వరియునుగూర్చు ♦ మంగళముల
వెలసి సాకేతపురి దోస♦ములనుఁజిమ్మి, యెల్లసుఖములనొసఁగు నా♦గేశ్వరుండు.

---

* ఈ కృత్తివాసేశ శబ్దము మూలములో సంజ్ఞావాచకముగ వాడఁబడినది. కావున నేనట్లే గ్రహించితిని. శివపురాణే కోటిరుద్రసంహితాయాం ప్రథమాధ్యాయే.

శ్లో॥ కృత్తివాసేశ్వరస్సాక్షాత్ । తత్తుల్యో వృద్ధబాలకః॥

గీ॥ సింధుతీర కపాలేశ ♦ శివుఁడు మఱియు, నెల్లదోసంబులడఁచు వ ♦ క్త్రేశ్వరుండు
ధౌతపాపేశ్వరుండు ని ♦ ర్ధూతభవుఁడు, తరమె భీమేశ్వరునిఁబెంపుఁ ♦ దలఁప నెవుడు.

గీ॥ చంద్రకాంతిప్రదుండు శ్రీ ♦ చంద్రకేశ, విభుఁడు సిద్ధేశ్వరుం డిష్ట ♦ విత్తదాత
అల్లబిల్వేశ్వరుఁడు మహా ♦ హార్షకరుఁడు, పురుడులేకయె చెలువొందు ♦ ముజ్జగముల

గీ॥ ఇల దధీచిరణోర్వి జ ♦ ప్యేశ్వరుండు, ఉత్తరపురి దూరేశ్వరుం ♦ డురుసుఖదుఁడు
పూర్ణయందొప్పుఁ బూర్ణేశ ♦ భోగిభూషుఁ, డాభరద్వాజవిభుఁగాని ♦ యాడఁదరమె.

క॥ అంధకుఁ డెచ్చో శివు గ, ర్వాంధుండై చేసికూలె ♦ నచ్చో దివిష
ద్గంధర్వులు పాడఁ గృపా, సింధుం డా యంధకేశ ♦ శివుఁడు వసించున్. 27

సీ॥ శృంగేశ్వరుండును ♦ సేనేశ్వరుండు గో,పీశ్వరుం డమరు వ ♦ క్త్రేశ్వరుండు
వైద్యనాథేశుండు ♦ వామేశ్వరుండు కా,మేశ్వరుండును విమ ♦ లేశ్వరుండు
వ్యాసేశ్వరుండును ♦ భాండేశ్వరుండు సు,కేశేశ్వరుండు భూ ♦ తేశమూర్తి
శుక్రేశ్వరుండును ♦ సూర్యేశ్వరుండు నా,కేశ్వరుండును సంగ ♦ మేశ్వరుండు

గీ॥ అనఘుఁడు సులోచనేశ్వరుం ♦ డా ప్రసిద్ధుఁ,డైన సిద్ధేశ్వరుం డఖి ♦ లార్థదుండు
నందికేశపుంజేశు లా ♦ నందకరులు, అల్ల రామేశకుంభేశు ♦ లార్తిహరులు. 28

వ. మెండియు సోమేశ్వరుండును శూలటంకేశ్వరుండును మాధవేశ్వరుండును లోకేశ మహాలింగంబును గంగేశుండును వటేశ్వరుండును సర్వపాపహారుండగు వక్త్రేశ్వరుండును నందీశ్వరుండును విమలేశ్వరుండును గంటకేశ్వరుండును సర్వలోకసుఖావహుండగు శరణేశ్వరుండును గర్దమేశుండును అచలేశ్వరుండును ననంతేశ్వరుండును యోగీశ్వరుండును సప్తేశ్వరుండును భద్రేశ్వరుండును జండీశ్వరుండును సంగమేశ్వరుండును మున్నగు దివ్యలింగంబులు పూర్వదిగ్జాతంబులిఁక దక్షిణదిగ్జాతంబులగు దివ్యలింగంబులను జెప్పెద వినుండు. 29

—* దక్షిణదేశ దివ్యలింగములు *—

క॥ కాలంజరపర్వతమున, నీలగళేశ్వరుఁడు హరుఁడు ♦ నెగడెడు సిరులన్
లీలాలోకనమాత్రమె, కాలుష్యములెల్ల నడఁచి ♦ కాచెడుఁ బ్రజలన్. 30

వ. నర్మదానదీతీరస్థంబు లగు పాషాణంబులన్నియు శివలింగంబులు. వానిలోఁ బ్రధానంబులు వినుండు. ఆర్తేశ్వరుండును, బరమేశ్వరుండును, సింహేశ్వరుండును, శర్మేశ్వరుండును, కుమారేశ్వరుండు, పుండరీకేశ్వరుండు, మండపేశ్వరుండు, తీక్ష్ణేశ్వరుండు, దుంధురేశ్వరుండు, శూలేశ్వరుండు, కుంభేశ్వరుండు, కుబేరేశ్వరుండు, సోమేశ్వరుండు, మంగళేశ్వరుండు, హనుమత్ప్రతిష్ఠితుండగు మహాకపీశ్వరుండును బ్రహ్మహత్యాదోషనివారకుం డగు నందికేశ్వరుండును సర్వకామప్రదులై యొసంగుదురు. 31

గీ॥ చిత్రకూటాద్రి మత్తహా♦స్తిప్రభుండు, ఈశివునితూర్పునందుఁ గో♦టీశలింగ
మలరు గోదావరీసరి♦దపరదిశను, బశుపతీశ్వరుఁ డొప్పౌందు ♦ భద్రమూర్తి.

క॥ గోదావరికిం దక్కిన, మాదిశయం దొప్పుమిాఱు ♦ నత్రీశ్వరుఁ డా
పాదించె శుభము లనసూ, యాదేవికి నత్రిమునికి ♦ నక్షయ మొసఁగన్. 33

క॥ పురుషోత్తమపురిదండన్, స్ఫురదుపమహిమాస్పదుండు ♦ భువనేశ్వరుఁడన్
నారుఁడొప్పు నర్మదాద్రి శిఖరమునఁ గోటీశ్వరుండు ♦ గలుషము లడఁచున్.

గీ॥ వంశధారాతరంగిణీ ♦ ప్రాంతమందు, నమరు ముఖలింగమననొప్పు ♦ నాదిదేవుఁ
డిప్పమ్రాకులకోనయం♦దొప్పుమిాఱి, బోయలకుఁగూడ నిచ్చెను ♦ ముక్తిసొత్తు.

క॥ హరువొప్పు రాజరాజే, శ్వరితోడన్ గుక్కుటేశ ♦ శంకరుఁడు రహిన్
బరఁగుచుఁ బీఠపురంబునఁ, గరమరుదుగ సిరుల నొసఁగి ♦ కాచున్ బ్రజలన్.

క॥ ఉండున్ రాజమహేంద్రపు, రిం డాకొని గౌతమిాస ♦ రిత్కూలమునన్
ఖండేందుశేఖరుఁడు మా, ర్కండేయశివుండు జగముఁ ♦ గాచుచుఁ గరుణన్.

క॥ ధవళేశ్వరమునఁ గుంభో, ద్భవమానివరప్రతిష్ఠఁ ♦ బరఁగుచు నిచ్చల్
శివుఁ డల్ల యగస్త్యేశుఁడు, వివిధసుఖంబులను భక్త♦వితతి కొసంగున్. 38

క॥ కుక్షిస్థాఖిలభువనుఁడు, రక్షోదక్షఘ్నుఁ డమర ♦ రాజేశ్వరుఁ డా
దాక్షారామంబున నిట, లాక్షుఁడు భీమేశ్వరుండు ♦ హావశించు సిరిన్. 39

క॥ మాణిక్యాంబిక యమర, శ్రేణీసేవితచరణకు ♦ శేశయ నిర్ని
ద్రాణవరాక్షిను తద్విభు, రాణి యగుచు మనుచు భక్త♦రాజి ననుపుగాన్.

గీ॥ ఇఁకను రామేశ్వరుం డగ♦స్త్యేశ్వరుఁడు గ, ణేశ్వరుండును నాభైర♦వేశ్వరుండు
నాకులేశ్వరుఁ డనియెడు ♦ నభవలింగ, ములును భీమేశలింగంబు ♦ ఘాంతనమరు.

క॥ కుసుమశరారికుమారుం, డసదృశకరుణామయాత్ముఁ ♦ డార్తిహరుఁడు ప
ట్టిసమందు వీరభద్రుఁడు, విసువక భక్తులను గాచు ♦ వేయికనులతో. 42

గీ॥ గౌతమిాశైవలిన్యవా♦గ్భాగమందు, వెలయు వేములవాఁడ క♦ల్మలకు జాడ
ఇందుఁ దిరముండు రాజరా♦జేశ్వరుండు, రాజరాజేశ్వరిన్ గూడి ♦ రాణగదుర.

గీ॥ ఈ స్థలికి నాతిదూరస్థమై ♦ యొసక మొసఁగు, చుండుఁ గాళేశ్వరంబను ♦ నూర్జితస్థ
లంబచట సిద్ధులకుఁ దాన♦లంబుగాఁగ, నలరుఁగాళేశ్వరుండు పు♦ణ్యాములపండు.

సీ॥ పరుగిడు నేవీటి♦పడమర విభుజాడ, కృష్ణవేణి సరోజ ♦ కిసలపాణి
పతియాజ్ఞనే పోలిఁ ♦ బాలించు జగములఁ, గనకదుర్గాదేవి ♦ శాంతమూర్తి
ఇంద్రకీలాచలం ♦ బేవీటిపై నిక, శ్రేణికిఁ గోటయై ♦ చెలువుమిాఱు
ఆంధ్రమేదినికి నా♦యకరత్నమై సిరి, నెసఁగు నేపురవరం ♦ బింపుమిాఱి

గీ॥ అట్టి నగరీవతంసమై♦యలరు విజయ, వాటికాక్షేత్రమందలి ♦ పర్వతాగ్ర
శృంగమును జెంది కడిది వా♦సిందనర్చు, మల్లికార్జునమూర్తి యా♦మ్నాతకీర్తి.

క॥ హేలాపురమందు మహా, కాలుండు జలాపహాఖ్య♦క ప్రభుం డొప్పున్
లీలాకల్పితవిష్టప, జాలుం డగస్త్యేశుం డుండు ♦ జానుగం బెడనన్. 46

క॥ ఈవనిపురిం గరుణాంచ, ద్భావుం డగస్త్యేశ్వరుండు ♦ పరంగును సిరులన్
గావలుల నడంచి భక్తుల, నేవేళన్ దాటికొండ ♦ యీశ్వరుం డోమున్. 47

క॥ విమలోదకకృష్ణాధుని, కమరంగా దక్షిణతటి ♦ నమరావతియం
దమరేశ్వరుండు కరుణో, త్తమ చాముండీశ్వరికి ప్రా♦ణవిభుం డుండున్. 48

క॥ హారుఁడల్ల శ్రీకపోతే, శ్వరుం డంబికతోడ జగము♦సాఁకుచు నెప్పుడున్
గరమరుదు పున్నెముల కా, కరమా చేజెరలయందుం ♦ గాపురముండున్. 49

గీ॥ ఎల్లమంద యనంబడు ♦ గొల్లమంద, లోన నొక మేటికొండపై ♦ లోకనాథుం
డుండు కోటీశ్వరుండు మ♦హోన్నతుండు, అతనికృపలెక్కసేయంగ♦ నలవియగునె.

క॥ కవిజనగీతుండు మొదల, హావణించును సాగరేశుం ♦ డార్యాయుతుండై
ధవళపుర మెపుడుపాయుఁడు, ధవళేశ్వర దేవుం డిద్ధ♦దర్పము మెఱయన్. 51

గీ॥ శ్రీగిరికిందూర్పుగవనుగాం♦జెలువుమీఱి, యలరుం ద్రిపురాంతకమను దీ♦వ్యన్నగంబు
గీ॥ అందుం దిరముండు శ్రీత్రిపు♦రాంతకుండు, త్రిపురసుందరితోఁగూడి ♦ తేజువెసంగ.
శ్రీగిరికి దక్కిణంబగు ♦ భాగమందు, శ్రీమహానందికేశ్వర ♦ శివుఁడు వెలయు
నార్యతో భోగమోక్ష శు♦భావహుండు, తీర్థమట నవరూపమై ♦ తేజరిల్లు.

గీ॥ ఓంకారక్షేత్రంబున, నోంకారేశ్వరుఁడు వెలయు ♦ నుడుగనికరుణన్
సంకటము లడంచు నిచ్చలుం, గింకరులకునెల్లవెల్ల♦కీరితి కిరవై. 54

గీ॥ శ్రీనగమునకుం బడమరం♦గా నలంపు, రిం దనరుం దుంగభద్రాప్రస ♦ రిత్తటమున
జోగులాంబాసహాయుండు♦భోగమోక్ష,కరుఁడుబ్రహ్మేశ్వరుఁడుగడు♦గరిమమెసంగ.

వ. మఱియు నవబ్రహ్మ లిందుం బ్రత్యేకంబుగ శివలింగంబులం బ్రతిష్ఠించుటం జేసి
బ్రహ్మేశ్వరలింగంబుతో లింగనవకం బిందు విలసిల్లు, 56

క॥ ఏలేశ్వర మనంబడు శ్రీ,శైలంబున కుత్తరమునం ♦ జక్కని తీర్థం
బాలించి జనుల మొఱలను, బాలించును సోమనాథ ♦ భర్గుం డందున్. 57

గీ॥ నిడుదవెల్లిగం బరుగిడు ♦ నిడుదవెల్లి, వాఁగు దరిం జేరి కీరితి ♦ వాసిమీఱు
నలమహాలింగవిభుఁడు వా♦విలిగుబురులు, దేవళముసుట్టిసేవించు ♦ దిటవుమీఱి.

క॥ పెన్నకుం దక్కిణమున పాం, పెన్నంగ నెల్లురినిం జేరి ♦ యెల్లప్రజకుం బా
పు న్నలంతకలంతలను జూ, పున్నయుము హరిహరవిభుఁడు ♦ ముదముదలిర్పన్.

క॥ శ్రీకాళహస్తివిభుఁ డతి, లోకుఁడు సుశ్లోకుఁ డఖిల♦లోకార్చితుఁడై
వాకులకున్ జేకూరునె?, జోకఁగ నద్దేవు పెంపు ♦ సొంపు నుతింపన్. 60

సీ॥ వాయులింగమ్మైయచ్చోట♦వాసిఁగాంచు, ముక్తిఁ జెందిన శ్రీయుఁ బా♦మును గజంబు
లింగమందైక్యమొందిన ♦ లీలలు గను, పట్టు దీవె చలించు నె♦ప్పట్ల నచట. 61

గీ॥ అలరు జ్ఞానప్రసూనాంబ ♦ యనఁగ నామ, హేశ్వరునిరాణి భక్తుల♦కెల్లసిరుల
సంతరించును బోనరించు♦సంబరంబు, నలసువర్ణముఖీధుని ♦ యచటఁ బరఁగు. .

వ. మఱి యందువేయు కైలాసగిరియందు హరిహరతీర్థంబు కోటిలింగసన్నిధానంబు
మున్నగునవి యనన్యవైభవంబులు. 63

క॥ వేదగిరీశ్వరుఁ డొప్పును, సాదరుఁడై గిరిని నాగ♦మాంబికతోడన్
పేదలసాదల గరుణన్, శ్రీదయితులఁ జేయు భక్తి ♦ సేవించినచో. 64

గీ॥ భక్తవత్సలనాథుండు ♦ పరఁగుఁ ద్రిపుర, సుందరీదేవియును దోడ♦సందడించు
నందు భక్తులకూడెడు♦వందురులు గ,డింది మేలొందునని బుధు♦లందురెపుడు.

క॥ కాంచిధరణీరమణీమణి, కాంచి యచటి వైభవములఁ ♦ గాటపు వేడ్కన్
గాంచి యటఁ గోపురంబున్. గాంచి మిగుల నలరెను సహ♦కారవిభుఁ డొగిన్.

గీ॥ పదియునెన్మిదిపీఠాల ♦ పట్టభద్రి, వైనశక్తులయందెక్కు♦డైన తేజ
లెసఁగు కామాక్షి యప్పర♦మేశురాణి, యందుఁ దిరముండి ప్రోచు భ♦క్తాళి నెపుడు.

గీ॥ హరుపుమెయి విష్ణుకంచియం♦దలరుఁ బ్రభుని, స్వ్యాలకుండెల్ల జగముల ♦ పాలకుండు
వరదరాజు లసత్కృపా ♦ వార్ధిమూర్తి, క్షీరసాగరకన్యతోఁ ♦ జెలువుమీఱి. 68

క॥ కోమరుండు తిరుత్తనియం, దమరికతో దాసజనుల ♦ కా యూ సిద్ధుల్
సమకూర్చుచుండుఁ గడువే,గముతోఁ బ్రేమమున సతము ♦ గంటికి ఱెప్పై.

క॥ శ్రీరహిమీఱెడు నా కా, వేరికి దక్కిణపుదెసను ♦ వెలసిరి సిరి మా
యూరేశ్వరుఁ డభయాంబిక, గౌరీ మాయూరమందుఁ ♦ గాచుచుఁ బ్రజలన్.

గీ॥ ఆ మహాలింగ మొప్పు మ♦ధ్యార్జునమున, శ్రీ బృహత్సుందరీదేవి ♦ చిత్తపుండ
రీకమార్తాండ మాశ్రిత♦శ్రీకరంబు, తెలియఁ దరమా నాకా! తదీయ♦దివ్యశక్తి.

క॥ చియ్యాళికొండమీఁదను, నెయ్యముఁ దియ్యంబుమీఱయ ♦ నెక్కొని జనులన్
వెయ్యిగనులొప్పఁ గాచెడు, నొయ్యనఁగ నుమామహేశుఁ ♦ డురుతరకరుణన్.

వ. కొండదిగువన్ ద్రిపురసుందరీసనాథుండు బ్రహ్మపురీశ్వరుండు దిరముండు. త్రిభువన క్షేత్రంబందు శరభావతారం బెత్తిన కంపహరేశ్వరుండు ధర్మసుందరీనాథుండుండు. 73

క॥ హృద్యగతినొప్పు నెపు డన,వద్యముగా భవరుజలను ♦ బాపుచుఁ గడిమిన్
వైద్యేశ్వరమందు మహా,వైద్యేశ్వర దేవవిభుఁడు ♦ బాలాంబికతోన్. 74

క॥ తేజోమయ మరుణాద్రిన్, తైజసలింగంబు సకల ♦ దైవతపూజ్యం
బై జానొందును మహిమం, బా జలజాక్షుఁడేని జాలఁ ♦ డరసి నుడువఁగా. 75

క॥ ఆ శివుని రాణివాసము, పేశలకరుణాలయం బ♦పీతకుచయనా
శ్రీశివ రాణించును భవ,పాశంబులఁ ద్రుంచు భక్త♦పాళి కనువుగాన్. 76

వ. అందలి తీర్థం బసాధారణంబు.

క॥ కావేరి కనతిదూరం,బై వెలయుఁ జిదంబరము వి♦యల్లింగ మటన్
సేవితమైతగు ముక్తికిఁ. దావల మాయెడ శివుండు ♦ తా నటియించున్. 77

గీ॥ అట నటించు మహానటు ♦ ననుసరించుఁ, దోడ శివకామసుందరి ♦ జోడుగాఁగ
నతనిసిరి కుద్ది ముల్లోక♦మందు లేదు, కనకచిద్దివ్యసభ లిందుఁ ♦ గానుపించు. 78

క॥ మరకతలింగంబును గొ,ల్తురు మఱువ కహర్నిశంబు♦లును గడుభక్తిన్
హరువగు నాపరివస్యల, నరుదుగఁ గనుఁగొనిన నఘము♦లడఁగున్ద్రుటిలోన్.

గీ॥ కుంభఘోణము కావేరి ♦ కూల మచట
మంగళాంబికతోడఁ జె♦లంగు నభవ
మూర్తి కుంభేశ్వరుఁడు వీరి ♦ పొత్తు గలిగి
యలరుదురు బృహద్విభుఁడు నా♦గాహ్వయుఁడును. 80

క॥ మఱి యుండునందె సోమే,శ్వరుఁడాదిగఁ గల్గునట్టి ♦ శంకరమూర్తుల్
కరమొప్పచుండ్రి ధరణీ, సురు లచ్చోట వేనవేలు ♦ శూరులు త్రయిలోన్.

క॥ జంబూవనమం దుగ్రిర, జంబూర్జితకరుణఁ బొప్పు ♦ సలిలమయుండై
జంబూకేశానుండు ని, జం బూహాతీత మచటి ♦ చందంబు మునుల్! 82

గీ॥ కోరి తపసానరించి యం♦దాఱితేఱి, నట్టి యఖిలాండరాజ్ఞి కే♦ల్పట్టి యందె
వెలసె శంకరుఁ డర్కేండు ♦ కలశజన్మ, రామతీర్థంబులందుఁ గ♦రంబు మెఱయు.

గీ॥ వెలసిచెలువొందు మఱియుఁగా♦వేరిదరిని, విశ్వగురుఁడల్ల మాతృభూ♦తేశ్వరుండు
కోర్కులీడేర్చుతల్లి శ్రీ ♦ కుంతలాంబ, అంచితోదార యప్పర♦మాత్మదార.

ఆ॥ దేవదేవుమఱఁది ♦ కావేరినడుమ శ్రీ, రంగపట్టణమునఁ ♦ బొంగెసంగ
రంగరాజు పాప♦రాసెజ్జపై యోగ, నిద్రఁజెందియుండు ♦ భద్రకరుఁడు. 85

గీ॥ పళనియందుఁ గుమారుండు♦పర్వతంబు, పైనిఁ జెలువొందు భక్తు లె♦ప్పట్లదరిసి
కొలిచికొందురుకోర్కులు♦గొనలుసాఁగ, నవ్విభుని తేఁకువఁదలంప♦నలవియగునె?

వ. తిరువేయూరునందు ధర్మసంవర్ధనీనాథుండు పంచనాదేశ్వరుండు సకుమారుండై
భాసిల్లు. 87

సీ॥ రమ్యపాండ్యావనికి నెల్ల ♦ రాజధాని, మధుర యద్దానిఁ బాలించు ♦ మధురకీర్తి
సుందరేశ్వరుఁ డురుకృపా♦సుందరుండు, వరద మీనాక్షి దేవితో♦వైభవమున.

క॥ వైహాయసనిమ్నగ యం,దే హారు వొందును జనంబు♦లెల్ల మురియఁగా
శ్రీహేమపద్మసరసియు, నాహరు నాయుమను గొల్చు♦నామోదమునన్. 89

సీ॥ కడిమియడవులు మూలలిం♦గమునుదరిసి, చుట్టుఁ జేరియు మీనాక్షి♦చుట్టుఁ జేరి
బలిసి కొలుచుచునుండుఁబు ♦ ష్పపత్రతతుల, నల్ల హరిచందనవనంబు ♦ నతకరించి.

వ. తిరువణంబా రనియెడు దివ్యక్షేత్రంబును నరుణజటేశ్వరుండు బృహన్నాయకీ
విభుండు పాలించుచుండు. 91

సీ॥ తనరు వృద్ధాచలంబున♦దాక్ష్యమొదవ, వృద్ధగిరినాయకుఁడు మరు♦ద్వృద్ధుఁ డెలమి
వృద్ధబాలాంబతో నందె♦విమలవారి, చారుముక్తామణీధుని ♦ సందడించు. 92

వ. ఉత్తరకోశంబందు మంగళేశ్వరీసంగతుండు మంగళేశ్వరుండు వెలయు. 93

క॥ శ్రీరామేశ్వరభూమిని, నారామేశానుపక్క ♦ హనుమప్రతిష్ఠన్
మీఱిన విశ్వేశుఁడు పే,సారక దాసులను సాఁకు ♦ సారెకుఁ గూర్మిన్. 94

క॥ కడయూరు మోక్షలక్ష్మికిఁ, గడయూరు మృకండుసుతునిఁ ♦ గాలునిదాడిన్
గడునడలువానిఁ గాచిన, కడింది వేలుపు హరుండు ♦ గాపుండు నటన్. 95

వ. ఇయ్యవి దక్షిణదిగ్భవలింగంబు లిఁకఁ బ్రతీచి నలరు లింగంబులను వినుండు.

## —* పశ్చిమదేశ దివ్యలింగములు *—

క॥ మహీశూరనాఁగఁబరఁగెడు, మహీశూరన్ దరుణచంద్ర ♦ మకుటుండు దయా
మహితుఁడు నంజుండేశుఁడు, రహి చాముండీవిభుఁడును ♦ రాణింతు రటన్.

క॥ పంపాసరస్సుకడ నను,కంప విరూపాక్షవిభుఁడు ♦ కాళీసఖుఁడై
సొంపుగ నుండెడు వానర, శంపాగాత్రిలు కరంబు ♦ సల్పఁగ సేవల్. 98

క॥ ఉడిపి దురితంబు వెఱపుల, నుడిపి కడున్ దేజరిల్లు ♦ నొప్పఁగఁ బుడమిన్
బడమరసంద్రముకడఁ గొమ,రుఁడు సుబ్రహ్మణ్యుఁ డఘహ♦రుండుండు నటన్.

క॥ గోకర్ణక్షేత్రంబున, గోకర్ణేందోపవీతి ♦ కోమలశశిశే
ఖరుకల్పుండు మహాబలుఁ, డాకేకసినుతుని కీర్తి ♦ యలరఁగఁ దనరున్. 100

క॥ శ్రీవసుదేవసుతుని నెల,వై వార్ధి మీఱు ద్వార♦యభ్యర్ణమునన్
రైవతకాద్రిపయి మహా,దేవుఁడు గిరికన్యతోడఁ ♦ దేజరిలు సిరిన్. 101

క॥ తగ వెలసియుండుఁ గపిలా,నగరంబునఁ గాలరామ♦నాథుం డుమతో
నెగడు మహాసిద్ధేశుం, డొగిఁ బడమరకడలి మేలి ♦ యొడ్డున మానుల్ !

సీ॥ ఆ మహామాయనగరి ర♦త్నాకరతటిఁ, బరశురామార్చితంబైన♦వాలుకేశ
లింగమలరెడుఁగొండపై♦లింగ మొండు,కలదుపురినిమహామాయ♦గాచుచుండు.

సీ॥ పండరీపురమందు శ్రీ♦పాండురంగ,విభుని దివ్యశిరఃపీఠి ♦ వెలసియుండు
శంభులింగము కరుణాప్ర♦సాదఘనము, దరిసెనంబిచ్చు హెచ్చుగ♦ధన్యులకిల.

వ. ఇవి ప్రత్యగ్భవలింగంబు లిఁక నుదీచి నలరు లింగంబులను నారయుఁడు.

—* ఉత్తరదేశ లింగంబులు *—

క॥ గంగాద్వారం బిద్ది యు,సంగ హరిద్వారమని య♦నంగఁ గలుములన్
రంగారెడు మాయాపురి, సింగారంబొప్ప శివుఁడు ♦ శివతో వెలయున్. 106

క॥ తనరు నపరగోకర్ణం, బనఁగ మహావనతలము ద♦శాస్య ప్రతిష్ఠన్
జనుఁ జంద్రఫాలనాథుం,డన వైద్యేశ్వరుఁడనఁగ మ♦హాదేవుఁడటన్. 107

సీ॥ మిశ్రఋషివరతీర్థం బ♦మేయమందు, వెలయు దాధీచ శివలింగ♦మలఘుమహిమ
నొనరుఁజూడ నైమిశారణ్య♦మున ఋషీశ, లింగ మద్దానిఁజేర న♦డంగు నఘము.

క॥ హత్యాహరతీర్థంబని, స్తుత్యర్హంబగుచు నొప్పు ♦ సొంపుగ నచటన్
సత్యద్యుతి శివలింగము, నిత్యంబుగ వెలసి యొసఁగు ♦ నిరుపమ రమలన్.

క॥ దేవప్రయాగతీర్థము, దేవఋషీడ్సేవితంబు ♦ దివ్యంబచ్చోటన్
ఠీవియలర లలితేశ్వరుఁ, డావాసముచెంది కాచు ♦ నందఱను గృపన్. 110

సీ॥ పరఁగ నేపాలనగరిలోఁ♦బశుపతీశ్వ, రుండు లోకాధినాయకుం♦డుండు సిరుల
సిరను దరిసెనమగును వా♦సిగను బూర్వ,కాయమగుపట్టు కే♦దారకాననమున.

వ. మఱియుసాలగ్రామోత్పత్తికారణంబగుగండకీనిర్ఝరిణి నేపాలంబందె ప్రవహించు.

సీ॥ తత్సమీపస్థలంబునఁ ♦ దనరుముక్తి, నాథలింగంబు మోక్షైక ♦ సాధకంబు
కలవు పెక్కులు పుడమి లిం♦గంబులిట్లు, నుతువనోపినయట్లను♦నుడివినాఁడ.

సీ॥ అమరఁ గాశ్మీరమునకుఁ బ్రా♦గాశ నమర, నాథలింగము సిరులఁ ద♦నర్చు రంగు
మీఱఁగా వంగదేశ స♦మీపమందుఁ, దారకేశ్వరుఁడొప్పెందు♦ధన్యులార! 114

సీ॥ అని యిటులు దివ్యలింగంబు♦లమరుచోట్లు, వరుసఁ దెల్పుఁడుఁ దాపస♦వరులుమరల
నతని కీలింగమూర్తు లె♦ట్లవని వెలసి, పేరుగాంచెనో చెప్పుమన్నఁ♦బేర్మి నంత. 115

సీ॥ తల్లి! నాపాలికల్పక♦వల్లి! లక్ష్మి!, వీరభద్రగురునిరాణి! ♦ విమలకీర్తి!
లింగవైభవఖండమం♦దంగుమీఱ, కృతినిఁగొనుప్రథమాశ్వాస♦మతులసరణి.

గద్య॥ ఇది శ్రీ బుధజనవిధేయ ముదిగొండ నాగవీరేశ్వరనామధేయ
ప్రణీతంబైన శివపురాణంబందలి లింగవైభవఖండంబునఁ
బ్రథమాశ్వాసము సర్వము సంపూర్ణము.

—:o:—



శ్రీ శివాభ్యాన్నమః

# శ్రీ శివపురాణము

## లింగవైభవఖండము

### ద్వితీయాశ్వాసము.



యోగిరాట్ప్రసాదస
మాయాతతపోవిభూతి ♦ మహితస్ఫూర్తీ!
కాయజవిపక్షమూర్తీ!
న్యాయానుసరాధ్వవర్తి ♦ నందితకీర్తీ!

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె.

ఆ॥ చిలువఱేనికేని ♦ నలవికా దివ్వాని, తీరుతెల్లనరసి ♦ తేటపఱుప
నాయెఱింగినంత ♦ మీయంతికంబునఁ, జెప్పవాఁడ వినుఁడు ♦ చెలిమిమీఱ. 2

—* సౌరాష్ట్రము - సోమనాథలింగము *—

క॥ కలువలదొర దక్షునికూఁ, తుల నిర్వదియేడుగురనుఁ ♦ దోయజదళనే
త్రల నశ్విన్యాదికతా, రలఁ బెండిలియాడెఁ గడిఁది ♦ రక్తిదలిర్పన్. 3

వ. అంతఁ గొన్నినాళ్లకు

ఉ॥ చక్కనిచుక్కయై యలరు ♦ జాణను రోహిణి నిచ్చ నెక్కుడౌ
మక్కువ బుజ్జగించుచు సు♦మాళముమీఱఁగ వేడ్కసేయుచున్
దక్కినయాండ్ర నొక్కపు డె♦దం దలపోయకయున్న నందఱున్
బొక్కుచుఁ దండ్రితో ననిరి ♦ భూరివిషాదభరంబుతో నిటుల్. 4

ఉ॥ అక్కట తండ్రి! మాదువిభుఁ ♦ డందఱి మమ్మొడఁ జేసిపాసి తా
నొక్కతె రోహిణిన్ దవిలి ♦ యొండుదలంపకయున్నవాఁ డికే
దిక్కగు మాకుఁ దాప మెటు ♦ తీరు సహోదరియైనయద్ది మ
మ్మొక్కరణిన్ వెలార్ప నిది ♦ యెట్లు భరించి తరింతుమీవ్యథన్. 5

శా॥ తానే చక్కదనాలకిక్కయఁట! యం♦దంబందు నేచేడియల్
గానన్ లేరఁట! యుద్ది యద్దికనియే ♦ కాంతుండు తత్సంగతిన్
మానన్ లేఁడఁట! దోసమిందుఁ దనదే ♦ మాత్రంబు లేదంట! యెం
దేనిన్ వింటివె పల్లదంబులిటు దం♦డ్రీ! యెట్టులోర్వన్ దగున్. 6

ఉ॥ అందఱి నేల యిట్లు జల♦జారికి నిచ్చితి వొక్కరోహిణీ
సుందరి నిచ్చినన్ మిగుల ♦ సొంపుగనుండెడి దెక్కడేని మా
కుం దగుభర్త చిక్కకయె ♦ గోడ్డయిపోవునొ పృథ్వి తండ్రి! యీ
వందురు నెట్లుపాయుదువు ♦ వల్లభుకొల్వొటు చెందు మాకికన్. 7

—* దక్షుడు చంద్రుని శపించుట *—

చ॥ అని పెనువంత నాయుదవ♦దార్పరు దక్షుని నొక్కపెట్టునన్
గని విలపించుచున్ బలుకఁ ♦ గల్వలజేని కతండు మంచిబో
ధన మొనరించెఁ జంద్రుఁడది ♦ దాఁటి మెలంగఁగఁ దొంటికైవడిన్
గినిసి శపించె దక్షుఁ డిఁక ♦ గీడ్పడుమీ క్షయనంచుఁ జెచ్చెరన్. 8

ఉ॥ అంతనె యాతఁ డాక్షయము ♦ నంది దురంతనిరంతరార్తిమై
నెంతయుఁ జిక్కిపొక్కి తెరు♦వెద్దియుఁగాంచ కలందురన్ మరు
త్వంతుఁడు మున్నుగల్గు సుర ♦ వర్యులు మానివతంసు లాత్మలన్
జింతిలి బమ్మదేవరను ♦ జేరఁగఁబోయి వచించి రంతయున్. 9

ఉ॥ చందురు దుండగంబులను ♦ జక్కనెఱింగినయట్టి నల్వ యీ
చంద మెమేలు వీని కన ♦ సర్వసువర్వులు మాను లీక్షయన్
జెందినరాజుతో జగము ♦ చెన్నసలారఁ బ్రకాశ మొందునే?
యొందదె పోసి మీకువల♦యోన్నతి? యారయు మన్న నాతఁడున్. 10

చ॥ గురుసతిఁబట్టి కూడి కొడు♦కున్ గనె నాపెనుగూడ స్వీయమం
దిరమునుజేర్చె నత్రియును ♦ నేనును బోయి హితంబుఁజెప్పి య
గ్గురున కొసంగఁజేసితిమి ♦ కోమలినిన్ మగుడన్ గురుండు మా
యురవగుబోధఁగ్రైకొనియె ♦ నుత్పలనేత్రిను లజ్జితాత్ముఁడై. 11

గీ॥ ఒజ్జ కట్లొనరించె మ♦హాపకృతిని, గట్టుకొన్నట్టిదారలఁ ♦ గనకయుండె
నొక్కరోహిణితగులంబు ♦ నొందియుండె, మామదక్షునినుడి నవ♦మానపఱచె.

ఉ॥ ఐనను లోకసౌఖ్యమును ♦ నారసి చెప్పెద నాప్రభాసమ
న్యానతరాఘహారియగు ♦ నొద్దిక వీఁడటఁజేరి శంకరున్
బూనికఁగొల్చుచున్ దపసుఁ ♦ బూని వసించినఁ గొన్నినాళ్ళకీ
గ్లానిని మాన్పఁగాఁగలఁడు ♦ కాలహరుండు దృఢంబు పొండికన్. 13

క॥ మృత్యుంజయమంత్రజపం, బత్యంతనియమముతోడ ♦ నాఱు నెలలటన్
నిత్యం బొనరించినచో, సత్యంబుగఁ బాయు క్షయ రు ♦ జయ సురవర్యుల్! 14

వ॥ అని పంచిన

ఉ॥ వేలుపులంత సంతసము ♦ వేరోని యందుల కంప జాబిలిన్
జాలఁ బ్రపత్తితో నతఁడు ♦ శంకరుఁ గొల్చుచు నాఱుమాసముల్
గాలహారోరుమంత్రమును ♦ గాటపుభక్తి జపించుచుండ మేల్
మేలనుచున్ శివుండటకు ♦ మెచ్చుచు వచ్చి యొసెన్ హిమాంశుతోన్. 15

—* చంద్రుఁడు శివుని యనుగ్రహంబున క్షయరుజను బాయుట *—

గీ॥ కోరుము వరంబు నావుడు ♦ ఘోరరుజను, బాపుమన శంకరుం డొక ♦ పక్షమందుఁ
బాసి వృద్ధినిఁగొను మన్య ♦ పక్షమందుఁ, గార్శ్య మొందుము పుడమికిఁ ♦ గర్జమల్లె.

క॥ అనిచెప్పినఁ జందురుఁ డ, ట్లనె యనుమతిఁ జెంచి యిమ్మ ♦ హాస్థలమున నీ
వనిశము వసింపుమన విని, యనఘుఁడు సోమేశుఁ డనఁగ ♦ హరుడుండె నటన్.

వ. చంద్రుండు దర్విన తీర్థంబు జంద్రకుండంబనఁబరంగు నఖిలదురితాపహారంబు.
అందిప్పగిదిఁ జందురుండు క్షయరోగంబు వ్యవస్థన్ జేసి పాసె. అప్పటినుండి
తక్కిన కళత్రంబుల గారవించుచు మెప్పువడయుచుండె నది మొదలుచేసి
యాదివ్యజ్యోతిర్లింగంబు గొలిచినవారలకెల్ల సకలాధివ్యాధులఁ బోకడచుచు
శ్రేయంబు లొసంగుచుండె నిది సోమేశ్వరలింగోత్పత్తిచరిత్రిం బిఁక మల్లికేశ
లింగోత్పత్తిని వినుండని సూతుం డిట్లనియె 18

—* శ్రీశైలము - మల్లికార్జున లింగము *—

క॥ ఒకమన్వంతరమందు శి, వకుమారుఁడు కొమరుఁడు గణ ♦ పతి కోడ్పడి పెం
డ్లికిఁ జెందకలిగి సహ్యా, ద్రికటకమును జేరి యొకఁడె ♦ దిరముండె నటన్. 19

చ॥ కొమరుఁ డొకండు సహ్యగిరి ♦ కూటమునందు విరక్తినుండఁగా
నుమయును శంకరుండు దన ♦ యున్ దగఁజేరి బహూకరించి ప్రే
మము మెయిఁ గ్రమ్మఱన్ దమదు ♦ మందిరశైలముఁ జేరుమన్న న
క్కొమరుఁడు పోక యాచిఱుత ♦ గుబ్బలియందె వసించె నల్కతోన్. 20

చ॥ అది గని శంకరుండును హి ♦ మాచలకన్యయుఁ బుత్త్రిఁ బాసి పో
మదిఁగన కట్టిగట్టకు సు ♦ మారుగఁ గొంచెముదూర మున్న య
ట్టిదియగు శ్రీగిరిన్ దఱిసి ♦ శివిగఁ గాపుర మొంది యందుఁ బెం
పొదవఁగఁ జూచివత్తురు త ♦ నూద్భవుఁ బండుగులందు దండిగన్. 21

గీ॥ మల్లెవిరులను బోలిన ♦ వెల్లయమరు, దివ్యలింగంబుగా నందుఁ ♦ దేజరిల్లి
మల్లికార్జునుఁడనుపేర ♦ నుల్లసిల్లె, శంకరుఁడు భక్తజనమనః ♦ కింకరుండు. 22

క॥ మల్లులని పేర్గొనిన వా, రెల్లరకధి నాథుఁడగుచు ♦ నెసఁగిన కతనన్
మల్లేశ్వరుఁడను నామం, బల్లలితేందుధర మూర్తి ♦ యట ధరియించెన్. 23

క॥ మఱి చంద్రవతియనానొక, ధరణీభృత్తనయ మల్లె ♦ దండనొసఁగి యా
హరుఁ బూజించుట మల్లీ, శ్వరుఁడని పేరొందెననియుఁ ♦ జాటుదురు ప్రజల్. 24

సీ॥ శంకరార్ధాంగి భ్రామరీ♦శక్తి శక్తు, లరసి కొలువఁగఁ బీఠమం♦దధివసించి
యుండు నట్టులె లింగంబు♦లుండు వేన, వేలు మల్లీశలింగంబు ♦ విందుమరగి.

ఉ॥ ఇవ్వసుధాధరం బిటుల ♦ నీశ్వరుఁ డీశ్వరి తన్ను జేరుటన్
దవ్వులనుండియే శిఖర ♦ దర్శనమున్ బొనరించినంతనే
క్రొవ్వునఁ బాపపుంజములఁ ♦ గూలిచి మోక్షధనం బొసంగు నెం
దవ్వను లాకొలంకులును ♦ నాస్థలులున్ గలవే జగంబునన్. 26

క॥ పాతాళగంగనాఁ గృ, ష్ణాతటిని యటన్ గభీర♦జలసంభృతయై
పాతాళమంటి తనరుచుఁ, జేతోజారాతి నెపుడు ♦ సేవించు రహిన్. 27

క॥ ఇమ్మల సేవించినవా, రిమ్మహి సంపదలఁబొదలి ♦ హెచ్చుగనిఁక జ
న్మమ్మొందని యక్షయమో, క్షమ్మున్ జెందుదురు నిజము ♦ సన్మునిచంద్రుల్!

## —* ఉజ్జయిని - మహాకాళలింగము *—

ఉ॥ గొజ్జఁగిపూలతేనియలఁ ♦ గ్రోలుచుఁ దేఁటులదాఁటు లింపుమై
రొజ్జలువోలె గీతముల ♦ నోలిఁబఠింపఁగ శీప్రకూలమం
దుజ్జయినీపురంబు గడు ♦ నున్నతిమీఱెడు వైభవంబుతో
నిజ్జగమందు నానగరి ♦ కీడగు పట్టణ మొండు లేదెటన్. 29

ఉ॥ మానక యందు నుండు నిగ♦మప్రియుఁడన్ ద్విజవర్యుఁ డీశ్వరా
ర్చానియతవ్రతుం డఖిల ♦ సద్గుణశోభితుఁడిద్ధకీర్తి య
వ్వానికి నల్వురాత్మజులు ♦ పావనమూర్తులు లోకపూజితుల్
మానక గౌరిపూజలను ♦ జొక్కుచునుండెడువార లెంతయున్. 30

వ. దేవప్రియుండు ప్రియమేధుండు సుకృతుండు సువ్రతుండునను నామధేయంబులన్
బరంగుచు నన్నలువురు శివపూజాపరాయణులై నిచ్చలుఁ బార్థివశివలింగంబుఁ
బూజించుచుండి రంత.

చ॥ నలువవరంబు నొంది యొక ♦ నంజుడు మేపరి పోతరించి భూ
తలముననున్న కర్మరుల ♦ ధర్మములెల్ల నడంచి దైవపూ
జలఁ గికురించి సజ్జనుల ♦ సాదులఁబట్టి వలార్చుచుండె న
క్కలుషున కుల్కి పాసి రిలఁ ♦ గర్మపరుల్ శివకేళవార్చలన్. 31

ఉ॥ నిచ్చలుఁ బార్థివేశ్వరుని ♦ నిష్ఠభజించుచున్నయట్టి యీ
సచ్చరితుల్ పలాశుచెడు ♦ సాహస మారసి యుల్కులేకయే
నచ్చికతో శివార్చనఁ బొ♦నర్చుచునుండఁగ రక్కసుండు పెం
పెచ్చిన మచ్చరంబు వహి♦యించి కడుఁ గ్ వడిఁజేరి వారలన్. 32

చ॥ పొడిచెద మిమ్ము లింగమును ♦ బూజనొనర్చినఁ బాఱవేయుఁ డి
ప్పుడు కడతేర్తు నిందఱను ♦ బూన్కిఁ గనుంగొనుఁడన్న బించుకే
నడలక వారు పార్థివము ♦ హాళినలింగముఁ బూని తొంటికై
వడి వడిఁగొల్చుచుండఁగఁ గ్రొ ♦ వాఁడునుఁగైకొని చెండ నెత్తినన్. 33

చ॥ కదలక బ్రాహ్మణుల్ శివునిఁ ♦ గాంచుచు 'నోంహర' యంచునుండి ర
ప్పదనున లింగమూర్తిపయిఁ ♦ బారములేని బిలంబు దోఁచె న
ప్పదవిని దివ్యలింగము వి♦భాసము మద్భుతదీక్షితిచ్ఛటల్
బొదలఁగ నుద్భవిల్లి పెను♦బూది యొనర్చెను మేటిరక్కసున్. 34

గీ॥ దూషణుండని పేర్గొన్న♦దుష్టదైత్యు, నట్లు కాల్చి వధించిన ♦ యాతతార్తి
హరుని హరునిఁగనుంగొని♦యగ్రిజన్ము, లుబ్బికడువడి సాష్టాంగ♦మొరఁగి యనిరి.

చ॥ అలుసుగ నెల్లధర్మముల ♦ నడ్డి మమున్ బొలియింపవచ్చు నీ
తులువను జంపి మా వనట ♦ దుంచిన నీదు దయామయాత్మమున్
దెలిసి నుతింపనోపుదుమె ? ♦ దేవర ! యీవిటుపోవ నెప్డునీ
స్థలమున నున్కి సేయుచున ♦ శంకరుఁ డొప్పి వసించె నందటుల్. 36

వ. అదిమొద లమ్మహాలింగంబు మహాకాలలింగంబనన్ బరంగుచు భక్తజనంబులన్ బాలించుచుండె. మహాదేవియును శివుం డందు వసించుటఁజేసి తానును దఱిసి వచ్చి యందు మహాకాళి యను నాఖ్యఁ జెంది యుండె నంతఁ గొంత కాలంబు చనినంత. 37

## —* చంద్రసేనమహారాజ చరిత్రము *—

ఉ॥ అప్పురమందు నొక్క శివ ♦ నాంతకభక్తుఁడు చంద్రసేనుఁడన్
గొప్పనృపుండు పూతమతి ♦ కోమలచంద్రకిరీటలింగముఁ
దప్పక పూజసేయుచు ము♦దంబుననుండ మహేశ్వరాజ్ఞ నొ
క్కప్పుడు మాణిభద్రుఁడను ♦ నాథ్యుఁడు సిద్ధుఁడు డాసి వాసిగన్. 38

మ॥ ఒక చింతామణి నిచ్చి దీని గళమం ♦ దుత్కంఠమైఁ దాల్చు మీ
వికఁ నీ రత్నము సోఁక లోహ మెదియేన్ ♦ హేమంబగున్ దీని చే
రిక నీసీమను వృష్టిదోషములు మా ♦ రీభూతవిస్ఫోటకా
దికపీడల్ సొర వెప్డు మంగళము లెం♦తే సౌఖ్యముల్ సేకుఱున్. 39

చ॥ అని యిటుచెప్పి సిద్ధుఁడు ని ♦ జానుమతిన్ జనినంత సంతసం
బున నరనాథుఁ డమ్మణిని ♦ బొంకముగా నఱుతన్ ధరించి సూ
ర్యునివలె వెల్గె రాష్ట్రమది ♦ యొప్పె హిరణ్మయమై ప్రజల్ గడున్
ధనపతులై యొసంగిరి ని ♦ తాంతము కీర్తిమించె ధారుణిన్. 40

క॥ నలుదిక్కుల నరపతులిఁ, యలుకుడువిని సర్వమరసి ♦ యాసక్తిగాని సే
నలు గూర్చుకొని యవంతిని, నలునలఁకుల ముట్టడించి ♦ నయమెసలారన్. 41

ఉ॥ కాలరులన్ దగన్ బనిచి ♦ కట్టడిగా నిటు చెప్పియంపిరా
మేలిమిరత్న మిచ్చి చెలి ♦ మిఁక బొనరింపుము లేదయేని నీ
వాలముఁజేర రమ్మిఁక ర♦యమ్మున నంచిటు లవ్వసుంధరా
పాలునిఁ జేరి వారు నుడు♦వన్ విని యాతఁడు భీతచిత్తుఁడై. 42

మ॥ ఒకఁడో యిద్దఱో ముగ్గురో యయినచో ♦ నుత్సాహమేపార నా
జికిఁ జేరన్ జని నిల్వరించి రిపులన్ ♦ జెండాడుదున్ గాని యీ
సకలోర్వీపతులేకమై యిటుల ను ♦ చ్చండప్రతాపానల
ప్రకటజ్వాలలఁ జుట్టుముట్టఁదరమే ♦ వారింప నేకాకికిన్. 43

వ. మఱియు

గీ॥ అడిదములు బాకులీటెలు ♦ నంపగములు
గదలు గుదియలు మొదలుగాఁ ♦ గలుగు నాయు
ధములు దురమొనరింపఁగా ♦ దగినజోదు
లలఁతి నాకడ నెటుచేరఁ ♦ గలను గలను. 44

వ. అట్లుగాక యిమ్మణిని వీరి కొసంగి చెలికారంబుఁ బడయుదుమన్నను బ్రయో
జనంబులేదు. 45

చ॥ ఒకనికి నిచ్చినన్ మఱియు ♦ నొండొకఁ డాజిఁదొడంగు వీరిలో
నొకఁ డొకఁ డిప్డు ముందుఁ దన ♦ కొప్పన సేయుమటంచుఁజెప్ప నే
డికి నొసఁగన్వలెన్ గడిఁది ♦ రిమ్మణి నొసంగ నరేంద్రులందు నే
నిఁక నెటు లీ విపజ్జలధి ♦ నీఁది తరించెడువాఁడ నీయెడన్. 46

మ॥ అని చింతింపుచు నేఁడు దా నపుడు సే ♦ యన్ బోలు కార్యంబు నె
ట్లును యోజింపఁగఁజాల కీశ్వరు దయా ♦ ళున్ నెమ్మదిన్ నమ్మి వే
గనె బిల్వాదిసువస్తువుల్ గొని మహా ♦ కాళేశు దివ్యాలయం
బును జేరన్ జని మేటినేమ మొనరన్ ♦ బూజింపుచుండెన్ శివున్. 47

## —* గోపబాలక చరిత్రము *—

వ. ఆ సమయంబున నీశ్వరమాయావిశేషంబున

ఉ॥ ప్రేంత మొకర్తు కోపెలకు ♦ వెన్క వసించుచు నొక్క పాకలో
నాతఁడె బాపఁడేడ్వ నుర ♦ మందు వహించి కుమారు నస్సుడిన్
బ్రీతిగఁజేర్చి తాఁ డచట ♦ బిట్టుగ శంకరుఁ గొల్చుచున్న తీ
ర్చేతము మెచ్చఁజూపెఁ దన ♦ చిన్నికుమారున కెంతో వింతగన్. 48

వ. అంత

శా॥ ఐదారేడుల బాలుఁడా శివసప ♦ ర్యన్ భక్తిమై నాత్మలో
నాదర్శంబువలెన్ ధరించి చని యొ ♦ క్కశ్మంబు నప్పాకయం
దేదో మూలఁ బ్రతిష్ఠచేసి శుచియై ♦ యింపొప్ప నర్ఘారలన్
బూదిన్ బత్త్రిరిఁ దుమ్మిపుష్పములతోఁ ♦ బూజించుచుండెన్ రహిన్. 49

సీ॥ శివుని కైంకర్యమందు వ ♦ సించి యొడలె,ఱుంగ కానందవార్ధి న ♦ డంగియున్న
చిన్నపాపని యాకలి ♦ గొన్న కడుపు, నరసి కుడుపఁగ నవ్వాని ♦ యవ్వ పిలిచె.

చ॥ పిలిచిన నాలకింపకయె ♦ పెర్మి శివున్ గనుచున్న బాలకున్
బలుమఱు పిల్చి వేసరి జ ♦ వంబున నయ్యెడ కేగుదెంచి పే
రలుక సుతుండు సల్పెడు శి ♦ వార్చనమంతయుఁ ద్రోచివేసి చా
పలమున నల్లలింగమును ♦ బాఱఁగవైచెను దిబ్బపై వడిన్. 51

ఉ॥ అంతనె యార్తిమై హరహ ♦ రా యని బాలుఁడు మూర్ఛనొందె న
య్యింతియు నల్కతోడఁ జని ♦ యెచ్చటనో నిదురించె నంతఁ గా
లాంతకుసత్కృపన్ బుడుతఁ ♦ డల్లన గన్నులువిచ్చి చూడఁగా
నెంతయు వింతఁ గన్పడియె ♦ హేమమయంబగు దేవళం బటన్. 52

చ॥ అడిగని లోనికేగ నట ♦ నందపువజ్రమయంపులింగమున్
జదురుగఁ దీర్చికూరిచిన ♦ నందులు శాంకరివిగ్రహంబునున్
గుదురగు గర్భగేహమును ♦ గోధ్వజమున్ మధురాంబుపూరమౌ
హ్రదమును పూలతోఁటయును ♦ నబ్రముగాఁ గనుపట్టె వానికిన్. 53

శా॥ అర్చావస్తువులెల్ల హేమమయపా ♦ త్రాళిన్ దనర్చెన్ బ్రదీ
పార్చుల్ శోభిలుచుండె నెల్లెడల దీ ♦ వ్యద్రత్నపాంచాలికల్
వర్చస్సుల్ నిగుడించుచుండె నిఁక న ♦ బ్బాలుండునున్ వింతగా
నర్చిష్మంతునిఁబోలు తేజమును దా ♦ నష్టొంది వేగంబునన్. 54

చ॥ శివునకు గారికిన్ నతులు ♦ చేసి నిజాంబయొనర్చినట్టి బి
ట్టవినయకృత్యమున్ సయిపు ♦ మంచు నుతించి తదంబఁదెచ్చి వై
భవమును జూపఁగోరి తన ♦ పాకకుఁ జేరఁగఁబోవ స్వీయమౌ
భవనము తేజరిల్లె మణి ♦ బంధురధాళధళీపరీతమై. 55

వ. అంత నతండు మఱియు నక్కజంబుతో నిక్కన్ జేరి యందొక్క పసిండిమంచంబునై నిఱుగడల దిండ్లమరించియున్న పట్టుపరుపుమీఁద నెట్టనఁ బవళించి నిదురించుచున్న వేల్పుంబువుఁబోఁడిఁబోలి కాంతులవెదఁజల్లు తల్లిన్ గాంచి యచ్చెరువొంది ప్రబోధంబొనరించి కోవెలకుఁదోడ్తెచ్చి యచ్చిత్రంబెఱింగించి చూపింపుడు నవ్వెలంది వెఱఁగొంది తనచిట్టికొమరుని గట్టినిష్ఠను దేవుని యకారణకరుణాపరీవాహలహరీసాహిత్యంబును నత్యంతంబెఱింగి మెచ్చి తన యపారాపచారంబును మన్నించుమని యర్థించి తత్పార్శ్వప్రాసాదమందు మహాకాల లింగంబు నర్చించుచున్న చంద్రసేననృపాలున కావృత్తాంతం బాద్యంతంబుఁ దెలిపి యన్నరవరున్ దోడ్తెచ్చి స్వాయంభువంబగు నాలింగంబును దేవళంబు మున్నగువానిఁ జూపింప నతం డాశ్చర్యంబునొంది చిట్టివాని ముద్దుగొని శంకరుఁ బలుమఱు గొనియాడుచున్న నప్పట్టున. 56

గీ॥ ముక్కుపచ్చలాఱని గొల్ల♦బుడుతఁడోకఁడు, భక్తిసేయఁగలింగము♦ద్భవము చెందె
గుడిహిరణ్మయమువ్వాని♦గుడిసెయంత, కనకమయమయ్యెననిపౌర♦జనులువ్రాయ.

గీ॥ నగరివెల్పట నున్నట్టి ♦ నరబిడౌజు,లెల్ల నివ్వార్తవిని తథ్య ♦ మెఱుఁగఁగోరి
చంద్రసేనునికడకాత్మ♦జనులనంపి, యతని యనుమతిఁ బురిఁజేర ♦ నాతఁడలరి.

క॥ వారందఱఁ దగురీతిగ, నారాధనచేసి వల్ల♦వార్భకభక్తి
శ్రీరచితంబగు కోవెలఁ, జేరిచి చూపింప వెఱఁగుఁ♦జెందిరి వారల్. 59

—* హనుమంతుఁడు ప్రత్యక్షమై గోపబాలుని బుజ్జగించుట *—

ఉ॥ ఆ సమయంబునందు నభ♦వాలయగోపురభిత్తి చిత్రమై
భాసిలు నంజనీసుతుఁడు ♦ ప్రాణకలన్ గొని వృద్ధిఁజెంది గో
పీసుతు ముద్దుచేసి పృథి♦వీపతులన్ గని పల్కె మేదినీ
శాసకులార! కాంచితిరె? ♦ శంకరభక్తుల శక్తివైఖరిన్. 60

చ॥ కడుఁ బసిపాప వీఁడు శివుఁ ♦ గాటపువేడుకఁ గొల్చి తత్కృపన్
బడసె నిటుల్ ప్రియంబుగఁ బ్ర♦పంచమునం దిఁకఁ బెద్దయై సిరుల్
బడయుఁ బ్రతిష్ఠఁగాంచు నరి♦వారలచేఁ బొగడొందుఁ బద్మనా
భుఁడు హరి వీని వంశమునఁ ♦ బుట్టుకఁగాంచును గొన్నినాళ్ళకున్. 61

వ. మఱియును

ఉ॥ గొల్లలకెల్ల నాయకుఁడ ♦ గుఱ్ఱజుడై వీఁడిఁక శ్రీకరుండనా
నుల్లసిలున్ భవత్ క్షితుల ♦ నుండెడు మందలకెల్ల వీని రా
జిల్లఁగ రాజుఁజేయుఁడిఁకఁ ♦ జెల్మియొనర్పుఁడు చంద్రసేనుతో
వల్లవబాలుతో నతము ♦ భాగ్యములొందుఁడు పొందు వీండ్లకున్. 62

గీ॥ నరవరుల కిట్లు చెప్పి వా♦నరవిభుండు, వల్లవీసుతు నక్కునఁ ♦ బడసి వాని
కీశ్వరార్చావిధంబెల్ల ♦ నెఱుఁగఁజెప్పి, చిత్తరువులోనఁజేరె వి♦చిత్రమొదవ.

వ. అంత నారాజవర్యులు

చ॥ బ్రదికితిమింక వాయుసుతు ♦ పాల్పడకింతకు నీతఁ డిందఱిన్
జదివిన నెవ్వరడ్డము నృ♦శంసులమై యిటు చంద్రసేనుపైఁ
గదనముచేయ వచ్చితిమి ♦ కాదవునంచు నెఱుంగకిట్లు దు
ర్మదమిఁకఁ బాసి వీరికి న♦మస్కృతిచేసి చనంగ మేలగున్. 64

వ. అని రాజులందఱా గొల్లపిల్లవాని నెత్తికొని ముద్దిడి పసిండిరథంబు లేనుంగులు గుఱ్ఱములును బాఁడియావులమంద లనడ్వాహంబులు నవరత్నఖచితానేకభూషణంబులు నేవళంబు లెక్కుడురొక్కంబులిచ్చి చంద్రసేననృపాలునకెఱఁగి క్షమాపణంబుఁగోరి యాతనిమచ్చికఁజెంది మహాకాలలింగంబునకు శ్రీకరలింగంబునకు నర్చలుచేసి స్వదేశంబులకేగి యచ్చటి వ్రజంబులకెల్ల శ్రీకరుని దొరఁజేసిరి. మహాకాలలింగంబును భక్తిచేసి పూజించిన చంద్రసేనుం డిట్లాపదఁబాసి సుఖమొందె. శ్రీకరగోపుండును హనుమత్ప్రోక్తానుసారంబుగ శివునిఁ బూజించుచుఁ బ్రశస్తిగాంచె నిది మహాకాలలింగమహాత్మ్యం బిఁక నోంకార నాథలింగంబును గూర్చి వినుండని సూతుం డిట్లనియె. 65

## —✱ ఓంకారక్షేత్రము - పారమేశ్వరలింగము ✱—

క॥ నారదమునీంద్రుఁ డొకపరి, గూరిమి గోకర్ణవిభుని ♦ గొలిచి వెడలి సు
శ్రీరంజిలు వింధ్యాద్రికిఁ, జేరఁగ నగరాజు పూజ♦చేసి ప్రియమునన్. 66

చ॥ మునివర! యెల్లలోకములఁ ♦ బూన్కిఁ జరించుచునుందు వీవు నా
కెనయనవచ్చు భూమిధర ♦ మెచ్చటనేనియుఁ గల్గియున్నదే?
యనితరలభ్యవైభవర♦మాయతభూతుల నొండె దండిమై
నొనరిన మూర్తిసంపదను ♦ నొండె నెఱుంగఁగఁజెప్పు మీయెడన్. 67

చ॥ అని యడుగంగ మౌనివరుఁ ♦ డల్లననవ్వి ధరాధరేంద్ర! నీ
కెనయగు పర్వతంబు గల♦దే? యొకఁ డిజ్జగమందు నెందునై
నను విను మా హిరణ్యగిరి ♦ జ్ఞప్తికివచ్చె నవగ్రహంబు లా
ఘనగిరికిన్ బ్రదక్షిణము♦గా నడచున్ బలుమాటలేటికిన్. 68

క॥ అది యొకటిదక్క వేఱొక, టెదియున్ నినుఁబోలదన్న ♦ నెంతయు నగతో
నది విని ఛటికిలఁబడి యతఁ, డెదలో సిగ్గొంది కడిఁది ♦ యీరసమొప్పన్.

ఉ॥ మేరునగంబుకన్నఁ గడు ♦ మిన్నగ మిన్నుఁ గడింది పెంపునన్
జేరి రవీందుమార్గముల ♦ చేవ నడంచెదనంచుఁ బార్థివా
కారము లింగమున్ గొలిచి ♦ కాంక్షమెలంగఁగ భక్తదుఃఖని
స్తారుఁ డుదారుఁ డా హరుఁడు ♦ దాఁ గనవచ్చి వరంబు నడ్డడున్. 70

ఉ॥ పెంపునొసంగు లోకమునఁ ♦ బెద్దగఁ జేయుము దేవ! నన్ను నాన్
గంపితచిత్తుఁడై శివుఁడు ♦ కర్జమెఱింగి నగేంద్రుతోడ నీ
వింపుగఁ గోరినట్లు వర ♦ మిచ్చితి నీవిఁక లోకసౌఖ్యమున్
దెంపరివై యడంపకు మ♦దించి యొనర్చినఁ బోయు నున్నతుల్. 71

క॥ అని చెప్పఁగ నందలి ముని, జనములు దేవతలుఁ గూడి ♦ శంకరు నందే
యునికి యొనరింపుమని ప్రార్థనసేయ వసించె దండధర ♦ దమనుఁ డటన్. 72

క॥ ఒక తను వోంకారేశ్వరుఁ, డొక తను నమలేశుఁడనఁగ ♦ నొప్పలరుచుఁ దా
సకలము గనుఁగొనుచుండును, నకలంకుఁడు శంకరుం డ♦నాదివిభుఁ డొగిన్.

గీ॥ పరఁగ నోంకారవిభుఁడు శం♦కరుఁడు పృథ్వి,లింగమం దిట్లుచేర బె♦డంగు రంగు
మీఱు నాస్థలమొప్పె నోం♦కారమనఁగ, సాటి యద్దానికదె వేఱు ♦ సవతులేదు.

వ. ఇఁక నీ యోంకారలింగంబు భక్తులకు సర్వాభీష్టప్రదం బద్దానిఁ బూజించిన
జనుండు పునర్జన్మంబు నొందఁ డిది యోంకారేశ్వరలింగోద్భవచరితం బిఁకఁ
గేదారలింగోత్పత్తిని వినుండని సూతుం డిట్లనియె. 75

## —* హిమగిరి - కేదారలింగము *—

క॥ నరనారాయణు లను నిర్వురు హరితేజమున ధర్మ♦పుత్త్రకులై శం
కరుఁగొలుచుచుందు రాహిమ, గిరి మునులు ద్రిలోకహితము♦గీల్కొనిమదిలోన్.

ఉ॥ వార లహర్నిశంబులును ♦ పార్థివలింగసమర్చనంబు వి
స్తారముదంబు పెంపెసఁగ ♦ సల్పుదు నయ్యెడురాజమౌళి యు
ద్వారలఁ జేరవచ్చి యన ♦ వద్యవరంబును గోరుఁ డన్న స
ద్ధీరు లిటన్ వసింపుమన ♦ దేవర యుండె హిమాటవీస్థలిన్.

సీ॥ తవిలి హిమతిగ్మమైన కే♦దారభూమి, శంకరుం డిట్లు వెలసి ప్ర♦శస్తికెక్క
దేవతలును ఋషీశ్వరుల్ ♦దివ్యమునులు, కొలిచిదుఃఖంబులను బాపి♦కొందు రెలమి.

శా॥ అంతన్ గొన్నియుగంబులైన పిదపన్ ♦ హార్యశ్వసంకాశులౌ
కుంతీపుత్త్రకు లల్ల లింగమును బల్ ♦ కూర్మిన్ సమీపింప నా
ద్యంతాతీతుఁడు శంభుఁ డొక్క మహిషం♦బై పాఱుటన్ గాంచి యు
కౌంతేయుల్ గడుభక్తిమై నొడిసిలా♦గన్ జిక్కెఁ బుచ్ఛంబటన్. 79

ఉ॥ దున్న యదృశ్యమై చనుడుఁ ♦ దోఁక యొకం డిటు లభ్యమైన వా
రున్నతభక్తిమైఁ గొలిచి ♦ యోర్వఁగరాని వగన్ దొలంగి సం
పన్నసుఖంబు లొందిరిఁక ♦ మస్తక మా*నయపాలభూమిలోఁ
బన్నుగఁ జేరి నిల్చి సుస ♦ పర్యలఁగాంచుచునుండె మించుగన్. 80

గీ॥ పుచ్ఛభాగము కేదార♦భూమియందు, లింగమై వెల్గె నిచ్చలు ♦ రంగుమీఱు
శీర్షభాగంబు లింగమై ♦ చెన్నుమీఱె, నల్లె నేపాలనగరంబు ♦ నందుసతము.

క॥ ఈ కేదారజ్యోతి, ర్శ్రీకరలింగమును నెవఁడు ♦ సేవించిననే
నీ కేదారంబునఁగానఁ, జేకొనడు పునర్భవంబు ♦ సిద్ధమిది మునుల్ ! 82

వ. ఈ కేదారలింగం బెల్లవారలకు భోగమోక్షప్రదం బిద్దానిస్వరూపం బెఱింగించితి నిఁక భీమశంకరజ్యోతిర్లింగసంభవంబును వినుండని మునులకు సూతుండిట్లనియె.

## —* ఢాకిని - భీమశంకరలింగము *—

శా॥ జానొందున్ సిరికామరూపమను దే♦శంబొందు భూమండలిన్
దానన్ గర్కటినాఁగ రక్కసికిఁ బ్రో♦ద్యచ్చండసంరంభుఁడో
సూనుం డొక్కఁడు భీముఁడన్ గడిఁది పే♦ర్శోభిల్ల రాజిల్లుచున్
నానాదివ్యమునీంద్రసంచయములన్ ♦ బాధించుచుండెన్ బోరిన్. 84

శా॥ వాఁ డొక్కప్పుడు దల్లితోననియె న♦మ్మా ! నన్నుఁగన్నట్టి య
య్యాఁ డెవ్వం? డెచటన్ వసించు? నెపుడే ♦ వాడన్ గనన్ రాఁడు నీ
జాడన్ దల్పఁ డొకర్తవే మనుదు వీ♦ చక్కిన్ నిజంబాడుమా !
చూడన్ వేడుకపుట్టె నాదుజనకున్ ♦ సొంపొప్ప సెప్పట్టునన్. 85

చ॥ అని యడుగంగ నద్ది యసు♦రాంత దలంకి యిటుల్ వచించె నం
దన ! విను మేను గర్కటుఁ డ♦నంబడు రక్కసుకూఁతురన్ విరా
ధుని యనుఁగుంబొలంతుకను ♦ దోర్బలధుర్యుఁడు రామచంద్రుఁ డా
తనిని వధింప నన్నిచటఁ ♦ దండిరి సాఁకుచునుండెఁ బేర్మినై. 86

గీ॥ తల్లి పుష్కసి యనునది ♦ తండిరియును, నొక్కనాఁ డాకటన్ గడు♦సుప్రిక్కభక్ష
ణార్థమై సుమహాత్ముఁడో♦నాయగస్త్య, శిష్యుఁ బైకొని భస్మావ♦శిష్టమైరి.

---

* టిప్పణి—ఈ నయపాలశబ్దము నేపాలశబ్ద రూపాంతరము. నయం (నీతిం) పాలయతీతి నయపాలః శివపురాణే కోటిరుద్రసంహితాయాం ఏకాదశాధ్యాయే—

శ్లో॥ నయపాలాఖ్యపుర్యాంతు । ప్రసిద్ధాయాం మహీతలే ।
లింగం పశుపతీశాఖ్యం । సర్వకామ ఫలప్రదం ॥

ఉ॥ అప్పటినుండి నేనొకస ♦ హాయము లేక నిరాశ్రయంబుగా
నెప్పుడు దుఃఖితాత్మనయి ♦ యివ్వని నుండఁగఁ గుంభకర్ణుఁడన్
గొప్పనిశాటవర్యుఁ డట ♦ కన్ జనుదెంచి యెదో నిమిత్తమై
యొప్పఁగ నన్నుఁ జూచి మరు ♦ లొంది మనోజశరాభితప్తుఁడై. 88

ఆ॥ కదిసి రెట్టఁబట్టి ♦ కలియఁబూనిననే న, నాదరించి తోలఁగ ♦ నతఁడు బల్మిఁ
బట్టువిడకమీఱి ♦ నెట్టన భోగించి, చనియె లంక కంత ♦ శంక లేక. 89

గీ॥ రావణునితమ్ముఁ డతఁడు శ్రీ ♦ రామచంద్రు
చేత నన్నయుఁ దానును ♦ జేటుజెంది
రంట! నాలంక కేను చే ♦ రంగఁబోవ
లేదు నిన్ గన్నదాన నా ♦ లీలఁ బడసి. 90

వ. ఇది యథార్థవృత్తాంతం బిందు సత్యేతరంబు లేశంబు లేదని యమ్మనుష్యాదిని
నుడువఁ గడుఁగనలి యప్పలాశుండు హృదయంబున 91

ఉ॥ అక్కట! పక్కిడాల్ దొర మ ♦ హాబలు మజ్జనకున్ వధించెఁ బే
రెక్కిన పెద్దతండ్రిఁ బొలి ♦ యించె విరాధుని గీటడంచె నా
మక్కువతాతముత్తవల ♦ మాని యొకం డటు బూదిచేసె నే
నెక్కరణిన్ సహింతు నిది ♦ యెల్ల నెఱింగి మఱుంగుచున్ మదిన్. 92

ఉ॥ నేనల కుంభకర్ణుని క ♦ నిందితపుత్త్రుఁడనేని శ్రీహరిన్
మానుల దేవతాధముల ♦ మట్టము చేసెదఁ గొట్టెదన్ సిరుల్
దీనిధి నాదు తల్లికి మ ♦ దిన్ బగదీఱ ముదంబుఁ గూర్చెదన్
బూనిక మైఁ దపించెద న ♦ పూర్వతరోత్తమశక్తు లేర్పడన్. 93

చ॥ అని తనతల్లి నెల్పుఁగొని ♦ యబ్జజుఁ గూర్చి మహాతపంబుఁ జే
ర్చినమతి నల్ప నాతఁడును ♦ జేరి వరం బడుగంగఁ గోరె నా
దనుజుఁ డనన్యసాధ్యమయి ♦ తద్దయు మీఱు మహాబలం బతం
డును విధిలేక యిచ్చిచనె ♦ నొచ్చుచు మానసమం దొకింతయున్. 94

—* భీమాసురుఁడు శివభక్తుఁడగు సుదక్షిణునిఁ దత్సతినిఁ జెరయందుంచుట *—

చ॥ అసురయు నంత దేవతల ♦ నందఱి గెల్చి సిరుల్ హరించి యు
క్కెసఁగఁగ శ్రీహరిన్ వెదకి ♦ యెందును గానఁగలేక పీఁక ని
వ్వసుమతిఁ గామరూపమునఁ ♦ బార్థివముఖ్యు సుదక్షిణాఖ్యు న
క్కసు మెయి నొంచి వానిసిరిఁ ♦ గైకొని యుంచెను బందిగమ్మునన్. 95

ఆ॥ అతనితోడఁ జెఱను ♦ నాతని గృహిణి సు, దక్షిణయును నుండెఁ ♦ దగ నిరువురు
పార్థివేశలింగ ♦ భక్తులై నిచ్చలుఁ, బూజసేయుచుండి ♦ రోజమెఱయ. 96

చ॥ నిరతము పార్థివార్చనము ♦ నెక్కొని శైవషడక్షరీజప
స్థిరమతులై మహేశ్వరుని ♦ చేతము మెచ్చఁగఁ గొల్చుచున్న నా
యిరువురు రాజదంపతుల ♦ యీతులఁబాపి సుఖింపఁజేయ శం
కరుఁ డెదసెంచి యుండెఁ జనెఁ ♦ గాలమొకింత యనంతరం బటుల్. 97

వ. అంత

ఉ॥ భీముఁడు లోకభీముఁడయి ♦ బిట్టుగ సర్వసుపర్వవర్యులన్
భూమినిలింపులన్ మునుల ♦ భూరిమదంబున నేచుచున్ మఖ
స్తోమములందు భాగములఁ ♦ జూఱలుగొంచుఁ జరించుచుండె నా
తామసుచేయు బాధలకుఁ ♦ దాళఁగలేక ననేకు లేకమై. 98

ఉ॥ పార్థివలింగపూజనము ♦ భక్తిమెయిన్ బొనరింప నంత స
ర్వార్థకరుండు శర్వుఁడు ర♦యమ్మునఁజేరి యభీష్టమడ్గఁగా
నర్థిమెయిన్ మునిప్రవరు ♦ లయ్యసురన్ హరియింపఁగోరి రిం
ద్వర్థకిరీటుఁ డట్లియని ♦ యారసి దైత్యునివృత్త్యయంబులన్. 99

గీ॥ తనదు ప్రియభక్తుఁడైన సు♦దక్షిణుండు, కొలుచుపార్థివలింగంబు ♦ నలఘుశక్తు
లలరఁజేరి ఖలున్ బల♦లాశుఁజంప, సమయమారయుచుండె ని♦శ్శంకుఁడగుచు.

మ॥ పిశితాశుండును గామరూపపతి దే♦వీయుక్తుఁడై పార్థివే
శు శివున్ గొల్చెడి తీరెఱింగి యటకున్ ♦ జొత్తెంచి యవ్వారితోఁ
బశుభర్తన్ గొలువంగ నేమియగు? న♦ప్పాటిన్ విడుం డిప్డు మ
ద్వశమున్ బొందుచు నన్నుఁ గొల్వ డిఁక మి♦మ్మల్లైన మన్నించెదన్. 101

క॥ కాదేనిఁ బొడుతు ననఁగా, భూదయితుఁ డొకింత బుగులుఁ♦బొందక యనియెన్
మా దైవంబును గొలిచెద, మేదైవను సరియె సిద్ధ ♦ మెఱుఁగు దురాత్మా!

క॥ హరుఁడు చరాచరభూతే, శ్వరుఁడు దయాకరుఁడు భక్త♦పరిపాలకుఁ డా
తురులన్ మముఁ గాపాడెడు, సరకుగొనము నీదు డాకఁ♦జను మిఁక దవులన్.

గీ॥ అనిన దనుజుఁడు బిట్టాగ్ర♦హంబుఁ జెంది
పండ్లు పటపటఁ గొఱుకుచుఁ ♦ బార్థివేంద్రు
పయిఁ గరాళాసి విసరె 'మాం♦పాహి' యనుచుఁ
గనులుమూయఁగ తేఁడు శం♦కరుఁడు దోఁచి. 104

—* పార్థివలింగమునుంచి శివుఁడు వెలువడి భీమాసురునిఁ జంపుట *—

క॥ భక్తులను సాఁకుటయె గడు, యుక్తంబగు వ్రతము నాకు ♦ యోజింపుము నీ
శక్తి నిఁక మట్టుపఱచెద, నక్తంచర! యేను భీమ♦నాథుఁడఁ గనుమా! 105

క॥ అని యసురుని కరవాలముఁ, బినాకముచేతఁ జదుపఁ ♦ బిండిగ నాతం
డును మరలఁ ద్రిశూలము వేయను మునుకలు చేసె దాని ♦ నభవుం డలుకన్.

వ. అంత దనుజుండు మరల

ఉ॥ పట్టిస మేసినన్ శివుఁడు ♦ భగ్నము చేసెఁ ద్రిశూలధారచే
నట్టియెడన్ నిశాచరుని ♦ యానతి రక్కసిమూఁక లుక్కునన్
జుట్టి రణంబు సేయుటకుఁ ♦ జొచ్చిన నారదమౌని డాసి యీ
చెట్టలఁ జెచ్చెరన్ గడపు ♦ చేయుభుజాలము దేవ! నాఁ బడిన్. 107

శా॥ హుంకారం బొనరించెఁ గాలహరుఁ డ♦త్యుగ్రస్వనం బొప్ప నా
తంకం బొంది పడిన్ ధరన్ దిరుగుచున్ ♦ దైత్యుండు గూలెన్ మహా
హంకారంబున మీఱు రక్కసులు హా♦హా యంచుఁ బీనుంగులై
రోంకారధ్వనితో నుతుల్ సలిపిరా ♦ యుగ్రున్ శివున్ దేవతల్. 108

వ. అంత గౌరీకాంతుండు సుదక్షిణుని దత్సతిని ననుగ్రహించి కామరూపంబున మరల నవ్వారి నభిషిక్తులఁ జేసిన వారును దక్కిన దేవమునిగణంబు లెల్లఁ బరమేశ్వరు నాపార్థివలింగంబందె వసింపఁ బ్రార్థింప భక్తవత్సలుం డీయకొని యట్లుండెఁ దదాదిగ నీభీమశంకరలింగంబు రక్షోభూతభేతాళాది భయనివారకంబై భోగమోక్షప్రదంబై భక్తులఁ బాలించుచుండె నీయది భీమశంకరలింగమాహాత్మ్యం బిఁక నఖిల కల్యాణహేతువును, మోక్షలక్ష్మీ జీవాతువు నగు విశ్వేశ్వరలింగంబు యొక్క చరిత్రంబును వినిచెద నవధరింపుఁడని సూతుండు మునుల కిట్లనియె. 109

## —* శ్రీకాశీ - విశ్వేశ్వరలింగము *—

ఉ॥ నిర్గుణమై యఖండమయి ♦ నిత్యమునై శివమై యనన్యసం
సర్గమునై ప్రకాశిలెడు ♦ సారతరోత్తమ తేజ మీజగ
త్సర్గముఁ గోరి చెల్వమరె ♦ శక్తి శివాఖ్యల *స్త్రీ, పుమాంసుఁడై
నిర్గతమైన యక్కవయె ♦ నేరిమి గారణమయ్యె సృష్టికిన్. 110

క॥ పురుషుఁడె మహేశ్వరుం డిఁకఁ, దరుణియె యాశక్తి వినుఁడు ♦ తద్వ్య మిది చరా
చరభువనం బెల్ల మహేశ్వరరూపం బారయుండు ♦ సచ్చరితు లెదన్. 111

గీ॥ వారు సర్గాదియందు ని♦వ్వారిఁ బ్రకృతి
పురుషులను సృష్టిఁ జేయఁగాఁ ♦ బొడమి వారు
గారణములఁ గానఁగాలేక ♦ కడు నడలుచు
నుండఁగఁ దపించుఁడను సూక్తి ♦ యొక్కఁడు విని. 112

* ఇందు స్త్రీ, పుమాంసుఁడై యని వ్యస్తపదము. సమాసము కాదు.

—* శివుఁడు కాశీ పంచక్రోశమును సృష్టించుట *—

ఉ॥ ఎచ్చటనుండి సేయఁగల ♦ మెన్నికమీఱు తపంబు? మాకుఁ జో
టెచ్చటఁ గానరాదు జల♦మే తుదిముట్టక తోఁచుచుండె నా
గ్రిచ్ఛ యనైదుక్రోసు లెటు ♦ గన్పడునేలను సృష్టిచేసి వా
రచ్చెరువొందఁ జూపి శివుఁ ♦ డందు వసించి తపింపుఁడంచనెన్. 113

ఉ॥ తానును లింగరూపమునఁ ♦ దత్పురిఁ జేరి కరంబుప్రీతి న
ద్దానినిఁ బాయకుండుట స♦తం బవిముక్తసమాహ్వయంబునన్
బూనెఁ బురంబు లింగమునుఁ ♦ బొల్పెసలారెఁ దదాఖ్య శంకరుం
డా నగరిన్ వహించుఁ ద్రిశి♦ఖాగ్రితలంబున నెత్తి నీళులన్. 114

గీ॥ కడు నసత్కర్మములనెల్లఁ♦గౌశలమున, నొడిసి కర్షణగావించి♦సుడియఁజేయఁ
గాశి యనుపేరుఁ జెంది వి♦ఖ్యాతమయ్యె, నైదుక్రోసులఁబరఁగు న♦య్యాభవభూమి.

గీ॥ అంత నప్పురిఁ జేరి వా♦రాస్థమెఱయఁ, జిరము తపసానరింపుడు ♦ సృష్టిఁ గోరి
పుండరీకేక్షణుని తనూ♦ద్భూతఘర్మ, సలిల మొక్కండు వాపియై♦యలరుటయును.

—* చక్రపుష్కరిణి మణికర్ణిక యగుట *—

చ॥ మినుసిగవేల్పు డాసి కడు♦మిక్కిలియచ్చము దీయనైన య
వ్వనరుహనేత్రసంకలిత♦వాప్యుదకంబును గాంచి మెచ్చువే
డ్కను దలయూఁచినన్ బడియెఁ ♦ గర్ణమునందలి వజ్రకుండలం
బొనరెను దానఁ దీర్థ మది ♦ యుర్విపయిన్ మణికర్ణికాఖ్యనై. 117

గీ॥ దాన మజ్జనమాడిన♦మానవులకుఁ, దెవులు దురితంబు డిందు నెం♦తేని నభవ
పదముఁజేరెడుబాట గ♦న్పట్టు నట్టి, తీర్థమిడఁబాయలేరెట్టి♦దివ్యమునులు. 118

మ॥ హరియున్ శంకరమాయచేఁ బ్రకృతితో ♦ నత్యంతనిద్రాళుఁడై
యొరుగన్ దద్విభునాభిపద్మమునఁ దా ♦ నుత్పన్నుఁడై నల్వ శం
కరునాజ్ఞన్ విరచించె నద్భుతగతిన్ ♦ గౌశల్యమొప్పొందఁగా
దిరమై నేఁబదికోట్ల యోజనమితిన్ ♦ దీపించు భూలోకమున్. 119

గీ॥ అందు సకలచరాచర♦ప్రాణినిచయ, ములను రచియించెఁ జాతురి♦పొలుపుమీఱఁ
గాశి నఖిలప్రళయములఁ♦గాండమందు, మునుఁగనీఁడుహరుఁడుశూల♦మునధరించు.

ఉ॥ ఇమ్ముగ బ్రహ్మదేవుఁడట ♦ నెంతయు భక్తిమెయిన్ దశాశ్వమే
ధమ్ము లొనర్చి లింగ మభి♦ధానము వెల్గఁ బ్రతిష్ఠ చేసి శ
ర్మమ్మును జెందె మాను లమ♦రప్రవరుల్ మనుజుల్ దదీయ మా
ర్గమ్మును బట్టి లింగములఁ ♦ గాశిఁ బ్రతిష్ఠ నొనర్చి రింపుమై. 121

చ॥ పరశివశక్తియున్ దనదు♦భర్త శివుండట విశ్వభర్తనాఁ
బరఁగెడు దివ్యలింగమయి ♦ వాసముచెందుటఁ జూచి తాను సం
బరమున నన్నపూర్ణయను ♦ భాస్వరనామముఁదాల్చి చేరి శం
కరుకెలనన్ వసించె ముని♦కాంత లెఱింగి చెలంగి పొంగఁగాన్. 122

ఉ॥ తాతముఁదాతలై కపిల♦దారుణరోషమహాగ్నికీలలన్
భూతిగ నేలఁగూలిన య♦పుణ్యుల నాదృతి నుద్ధరింపఁగాఁ
బ్రీతి మెయిన్ భగీరథుఁడు ♦ పృథ్వికి గంగను దెచ్చినంత గం
గాతటినీమతల్లి వడిఁ ♦ గాశినిఁజేరి భజించె శంకరున్. 123

క॥ ఆగంగా స్నానంబున, కేగంగాలేనిమనుజుఁ ♦ డెంతయుఁ దమితో
నోగంగా గంగాయని, సాగంగాఁబాయఁగలఁడు ♦ సర్వాఘములన్. 124

గీ॥ అజునిపంచమశిరముఁ గో♦యంగఁ దన్ను, వెనుకొనిన బ్రహ్మహత్యయు♦విధికపాల
మును దొలఁగిజాఱఁ గాశికా♦పురినిఁజేరి, భైరవుండుండె నాక్షేత్ర♦పాలకుఁడయి.

వ. మఱియు నం దాకాలభైరవునితోఁగూడి యష్టభైరవులును డుంఠిప్రముఖులగు నేఁబదియాఱుగురు గణపతులును నవదుర్గలును నేకాదశరుద్రులును ద్వాదశాదిత్యులును గౌరీనవకంబును నిరువదియిద్దరు కేశవులును నవగ్రహంబులును స్వనిర్మితతీర్థోదకంబులతో స్వప్రతిష్ఠితశివలింగంబుల నర్చించుచు ముప్పది మూఁడు కోట్ల దేవతలును విలసిల్లుచుందు రిందు మృతిఁజెందినవార లిఁక మాతృగర్భంబుఁ జెందక పారమేశ్వరసాయుజ్యంబు నొందుదు రిందు సందియంబు లేదీ విశ్వేశ్వర లింగార్చనం బఖిలభోగమోక్షప్రదంబనుట న్యూనోక్తిగ సంభావింపుఁడు.

క॥ కాశీక్షేత్రంబును వి, శ్వేశుండును నన్నపూర్ణ ♦ యుభయముఖుఁడాడుం
డీశుండు భైరవుం డఘ, పాశంబులఁ ద్రుంతు రొక్క ♦ పరి దలఁచినచోన్.

వ. ఇట్లు విశ్వేశ్వరలింగ చరితంబు సందర్భంబు సూత్రప్రాయంబుగ మీకెఱింగించితి నిఁక త్రియంబకేశ్వర జ్యోతిర్లింగస్వరూపంబును వినుండని సూతుం డిట్లనియె.

## —* గౌతమీతటము - త్ర్యంబకలింగము *—

చ॥ మునికులమందు గౌతముఁ డ♦మోఘతపోవిభవాఢ్యుఁడై భృశం
బనిశము శంభులింగనియ ♦ తార్చన సల్పుచుఁ బత్నితో వసిం
చెను హరువొప్ప బ్రహ్మగిరి ♦ చేరువ నొక్క వనస్థలంబునం
దనువుగ శిష్యకోటి తన♦యందుఁ బఠింపఁగ న్యాయశాస్త్రముల్. 129

గీ॥ అంతఁ గొండొకకాలంబు♦నందుఁ బుడమిఁ, గడు ననావృష్టిపొదల నె♦క్కడలఁగాని
త్రావ నీళులుగఱవయ్యె ♦ గ్రాసమసలె, శూన్యమయ్యెను దెసల నె♦చ్చోటనేని.

క॥ ఆకట మలమలమాడుచుఁ, దేఁకువసెడి యెల్లప్రజలు ♦ దిగులుపడి కడున్
జీకాకుతోడ నలుగడ, లేకాకులు గాకులగుచు ♦ నేగిరి వెలుచన్. 131

ఉ॥ ఆయెడరందు గౌతమమ♦హాఋషి యవ్వరుణున్ జలేశ్వరున్
బాయనిభక్తిఁ గొల్చుడు న♦పాంపతి యమ్మునికిన్ బ్రసన్నుఁడై
చేయుదు నీకభీష్టమును ♦ జెప్పుమనన్ మునివంశమండనుం
డాయతవృష్టిఁ గోరె సుద♦శాధిపుఁ డందులకొప్ప కిట్లనెన్. 132

వ. మునీంద్రా! పరమేశ్వరున కిష్టంబులేకయున్న యిక్కాలంబందు నేను వృష్టి
కార్యంబునకు సమర్థుండనుగాను. 133

చ॥ ఎవనిభయంబు నెక్కొని స♦మీరుఁడు వీచు మఱేని యుల్కచే
రవి యుదయించు నే బిరుదు ♦ త్రాసముఁజేసి మహేంద్రుఁ డగ్గి మృ
త్యువును బనుల్ పొనర్తు రభ♦యుం డఖిలాబ్జభవాండనాథుఁ డా
శివుఁడు తదీయమా వశముఁ♦జెంది తనర్చు జగంబు సర్వమున్. 134

ఉ॥ కావున నేను వృష్టి కెటు ♦ గర్తను గాఁగల నొక్కగర్తమున్
నీవిఁకఁ ద్రవ్వికొన్మచట ♦ నీరము నించెద జానుదఘ్న మ
చ్చో వివిధౌషధీతతిఁ బ్ర♦సూనఫలద్రుకదంబమున్ ముదం
బావహిలంగఁ గూర్చికొను ♦ మాఱకయుండు జలంబు లెప్పుడున్. 135

-*గౌతమమహర్షి వరుణానుగ్రహంబున నొకచిన్నకుంటను నిర్మించుకొనుట*-

చ॥ అనుడు మునీంద్రవర్యుఁ డటు ♦ లారసి కుంట నొకండు ద్రవ్వ జీ
వనవిభుఁ డచ్ఛనీరమును ♦ వట్టుటలేకయె జానుదఘ్నమై
తనరెడునట్లు నించెను హి♦తమ్ముగ గౌతముఁ డెల్లధాన్యముల్
వనరెడుచేలు పుష్పఫల ♦ పాదపవాటికలన్ దనర్చెడున్. 136

సీ॥ అవిరళఘనసుగం ♦ ధాఢ్యమరంద ని, ష్యందసుందరసుమ ♦ కుందకుటజ
మందారమాధవీ ♦ మాలతీవకుళచం, పకకరవీరకే ♦ తకులతతులు
పరిపక్వఫలరాజి ♦ భాసురసహకార, దాడిమద్రాక్షాబ ♦ దరులపఙ్క్తి-
పనసఖర్జూర రం♦భాజంబుజంబీర, లికుచబీజాపూర ♦ నికరములును

గీ॥ మెండుగాఁబండి చెన్నారి♦మీఱుఁ బ్రీహి, యవతిలాఢకచణకప్రి ♦ యంగుమాష
రాజమాషమసురముద్గ ♦ రాజియావ, నాళగోధూమవితతి ఘ♦నముగఁదనరె.

వ. మఱియు వార్తాకకర్కటీజాలీకోశాతకీకూశ్మాండపిండాలుకందముఖ్యశలాటుశాకం
బులును జీవంతికోపోదకీపీలుచాంగేరీప్రముఖదళశాకంబులును నమితంబులై పొద
లియున్న సమయంబున. 138

## —* గౌతమాశ్రమమునకు మునులు వచ్చుట *—

సీ॥ తనతాతతాతకుఁ ♦ దమ్మునికొమరుని, కొడుకంచు నొక్కండు ♦ కూడవచ్చె
తనతండ్రితండ్రి య♦ల్లునిచెల్లెలికి మేటి, మఱఁదియం చొక్కండు ♦ దరలివచ్చె
తనమేనమామ న♦దినె యల్లునికి బావ, గారని యొక్కండు ♦ గలియవచ్చె
తనతోడియల్లుని ♦ తండ్రితండ్రికి మేన. యల్లుఁడంచును నొక్కఁ ♦ డరసిడాసె

గీ॥ ఇట్లు చుట్టఱికంబుల ♦ నెఱుఁగఁ జెప్పి, కొనుచు గుంపులుగుంపులై ♦ మునికులజులు
ఆండ్రుబిడ్డలతో గౌత♦మాశ్రమంబు, వెదకికొనివచ్చి రెంతయు ♦ విందుమీఱ.

వ. అంత గౌతమమహర్షియును

ఉ॥ వచ్చినవారికెల్లఁ గడు ♦ వాసిదలిర్పఁగఁ దాను భార్యయున్
మచ్చికతో నెదుర్కొనుచు ♦ మంచిగ మజ్జనభోజనంబులన్
హెచ్చుగ నిచ్చుచుండె శ్రమ ♦ మేదియులేక భుజించుచున్ గడున్
మెచ్చుచు నందఱచ్చటనె ♦ మేలుగనుండిరి గాపురంబులన్. 140

ఆ॥ గొప్పవారి చెలిమి ♦ గొప్పగూర్చును దాని, గొప్పవాఁ డెఱుంగుఁ♦ గొంచెవాఁడె
ఱుంగఁ డట్టివానిఁ ♦ బొంగి సేవించునో, యట్టి ఫలముఁ జెందు♦నవని నరుఁడు.

క॥ సింగంబుగుహకుఁ జనెనే, నింగొను ముత్యములరాసి♦నిన్ జంబుకభూ
మిం గడువేసుకమైఁ డా, యంగాఁ బునుకలును బొక్క ♦ లలవడు పెక్కుల్.

క॥ చందనము చెఱకు శాఖులు, గుందనమును నొరులకెపుడు ♦ గూర్చును సుఖముల్
బొందిక నిడు స్వార్థము లే, దెందు నటులె కాదె సుజను ♦ లెంతయు భువిలోన్.

గీ॥ పుడమి విజితేంద్రియుఁడు దయా ♦ లుఁడును మదము
లేనివాఁడును నుపకారి ♦ యీ నలువురు
స్తంభములయట్లు దాల్తురు ♦ సతత మోపి
యీ జగంబును సందియ ♦ మింత లేదు. 144

వ. అంత

మ॥ బహుకాలం బిటులేగ నొక్కదివస ♦ ప్రాహ్ణంబునన్ గౌతమ
ద్రుమహింశుం డీశ్వరపూజకై సలిలమున్ ♦ దోడ్తెండనన్ శిష్యులున్
రహిమీఱన్ గలశంబులన్ గొని సరో ♦ రాజంబుఁ జేరంగఁ బో
నహివేణుల్ మునిభార్య లప్పుడె జలం ♦ బాడంగ విచ్చేయుడున్. 145

మ॥ కని యగ్గౌతమశిష్యు లా మునిసతీ ♦ కాండంబుతో నొక్కప్ర
క్కను జేరుండు ఘనుండు దేశికుఁడు వే♦గన్ బూజకై తీర్థమున్
గొని తేరన్ మముఁ బంచె నట్లుదకమున్ ♦ గొంపోవలెన్ దల్లుల
న్నను నవ్వార లటుల్ దొలంగక కడున్ ♦ గర్వం బఖర్వంబుగాన్. 146

చ॥ చనుఁడు చనుండు మీర లిఁక ♦ సత్వర మేమిటఁ దీర్థమాడి నీ
ళ్ళను గొనిపోవఁగా నలెఁ జ ♦ లంబానరింపకుఁ డల్పు లీవు మా
ఘనత నెఱుంగ కిట్లు పలు♦కన్ దొరకొంటి రనంగ వార లం
త నె చని యాశ్రమంబునకుఁ ♦ దద్గురురాజ్ఞికిఁ జెప్ప నాపెయున్. 147

చ॥ కడవ నొకండు గైకొని త♦గన్ సరసీస్థలిఁ జేరి నీరమున్
వడిఁ గొని తెచ్చి యిచ్చెఁ దన ♦ భర్తకుఁ దాల్మిని దేవపూజ నా
తఁడు పొనరించె నమ్మునుల ♦ దార లహల్య మదంబుతోడ నీ
యెడ మము బల్కరించకయె ♦ యేగెను జుల్కనచేసి తానటుల్. 148

ఉ॥ పోవునుగాక యిప్పగదు ♦ పోఁడిమి యాడఁగఁ జేయకుందుమే?
దేవికి నింత యెల్లిదమె? ♦ దేబెలె మా మగ? లంతయింతతోఁ
బోవిడువారమే? యనుచుఁ ♦ బోయి స్వభర్తల సన్నిధానమం
దావిధమెల్ల మార్చి కడు ♦ నల్క జనింపఁగఁ జెప్పి రేడ్చుచున్. 149

ఉ॥ అంత మునుల్ గడున్మదుల ♦ నాగ్రహమొంది కడిందినిష్ఠతో
దంతిముఖున్ విధానమునఁ ♦ దద్దయుఁ గొల్వ నతండు వచ్చి మీ
చింతలఁ దీర్తు వాంఛితముఁ ♦ జెప్పుఁడనంగ మునుల్ ముదంబుతోఁ
బంతము మీఱ నివ్వనికిఁ ♦ బాపుఁడు గౌతము నన్న నాతఁడున్. 150

మ॥ తగునే? యాకలిదప్పులన్ మఱఁగుచున్ ♦ దారల్ సుతుల్ శిష్యులున్
మిగులన్ బొక్కుచుఁ బ్రాణభీతి నిటకున్ ♦ మీ రేగుదేరన్ దయా
నుగుఁడై గౌతముఁ డెల్లవారికి చటన్ ♦ బోనంబు లర్పించి మీ
వగపున్ బాపి మనంగఁ జేసె నిపుడా ♦ బ్రాహ్మణ్యు నొప్పింతురే? 151

క॥ ఉపకృతి సల్పినవారల, కపకృతి సేయంగఁ దలఁచు ♦ టతినిందిత మ
ట్లపయశమనక యొనర్చిన, నృపశువు నశియించు నెంత ♦ నేర్పరియేనిన్. 152

ఆ॥ కాన నడిగి వేఱొ ♦ కండు వరముఁగోరుఁ, డనిన వారు మాన ♦ కదియె కోరి
పట్టుఁబట్ట నతఁడు ♦ భవితవ్యమారసి, యట్లెసేతు మీరు ♦ సఘముపొడము. 153

వ. దయాళుండు నాపద్బాంధవుండునగు గౌతముం డించుకకాల మిక్కట్టులన్ జిక్కి
వందురినను నయ్యనఘున కయ్యది పరిణామసుఖంబై యొసంగఁగలదు సంది
యంబు లేదు. 154

ఆ॥ మంచివాఁడు చెడ్డ♦మానిసి కాఁబోవఁ, డెపుడు చెడుగు మంచి ♦ నెంచఁబోఁడు
కుక్క గోవుగాదు ♦ గోవు కుక్కయుఁగాదు, జగమునందు బ్రహ్మ ♦ శాసన మిది.

—* మునులనిర్బంధముచే గణపతి మాయాధేనువై గౌతమునిచేఁ జచ్చుట *—

వ. అని గణపతి యంతర్హితుం డైన నంత గౌతమమహర్షియును దత్పత్నియు నమ్మునుల కైతవంబు నెఱుంగక యానందంబున నున్నంత నొక్కనాఁడు గణపతి మాయావిశేషంబున. 156

ఉ॥ మిక్కిలిబక్కయౌ నొకఁడు ♦ మేకొని వ్రీహివనంబు మేయుచున్
దొక్కుచునుండ గౌతముఁడు ♦ దొల్గఁగఁజేయఁగఁ బూరిపోచ పై
నొక్కటివేసె దాన మొదఁ ♦ వుర్వి నమాంతము గూలి యాలె హా!
యెక్కడి దోసమొందితి మ♦హేశ్వర! యంచు మునీంద్రుఁడేడ్చుచున్. 157

గీ॥ ఉటజమునవున్న తత్పత్ని♦యును దదీయ, శిష్యులును నార్తరుతి విని♦చేరవచ్చి
కారణంబారసి నితాంత♦గాఢశోక, గర్తమునఁ గూలి యేడ్చిరి ♦ యార్తిపడుచు.

వ. అంత.

చ॥ కని మునులున్ దదంగనలు ♦ గౌతముఁ జేరి విధంబెఱింగి గో
ఘ్ను! నిబిడపాపి! యెంతటి య♦కార్య మొనర్చితి వోరి! నీ మొగం
బును గన దోస మిప్పతిలుఁ ♦ బొమ్మిట కేని వనంబుఁ బాసి నీ
యనుచరపుత్త్రమిత్త్రదయి♦తాదులఁ దోడ్కొని వేగ దవ్వులన్. 159

గీ॥ నీవిచటనుండ మేమిందు ♦ నిలువరాదు, దేవఋషిపితృకార్యముల్ ♦ దీర్పరాదు.
హవ్యకవ్యంబులను గొన♦రగ్నిపితలు, సాఁగు సకుటుంబ మెటకేనిఁ ♦ జక్కనిపుడు

వ. మఱియును

క॥ దైవతపితృముఖముల నీ, వేవిధమున సల్పఁగూడ ♦ దెఱుఁగు మిదిమొదల్
నీవొనరించిన దురితం, బేవడువున సడలఁబడక ♦ యెక్కుడు భరమౌ. 161

క॥ అని యెల్లరు దిట్టుచు రా, ళ్ళను విసరుచుఁ దఱుమ మునిల♦లామం డట్లే
చనియెద మొదలన్ గనికర, మొనరింపుండయ్య! యనుచు♦నొయ్యన నపుడే. 162

—* గౌతమఋషి యాశ్రమమును విడిచి దవ్వేగుట *—

వ. అవ్వారి శాసనప్రకారంబు గలత్రంబును శిష్యజనంబును దోడ్కొని యచ్చోటికిఁ గ్రోశమాత్రప్రదేశంబు దాశ్రమంబుఁ జేసికొని యందొక్కమాసంబట్లు గడపి యొక్కనాఁడు మునిజనాశ్రమంబుల కించుకసమీపంబున కేగి యవ్వారి నెల్ల సతిప్రియాసంబున నొక్కెడఁగూర్చి విధేయుండై మహాత్ములారా! నాకుఁ బాటిల్లిన యీ పాతకంబుబాసి యేనెట్లు పునీతుండనగుదు ననుగ్రహించి సెలవీయుండని ప్రార్థించిన నవ్వార లిట్లనిరి. 163

క॥ చేసినదోసము నిష్కృతి, చేసిననేగాని శాంతిఁ ♦ జెందదు పుడమిన్
వాసిగఁ బ్రాయశ్చిత్తముఁ, జేసికొని యఘంబుఁబాయు ♦ సిద్ధమిది మునీ! 164

వ. ఆప్రాయశ్చిత్తంబు తెఱం గెఱింగించెదము వినుము.

క॥ ఇమ్మహి గోహత్యా పా, పమ్మును బొనరించినట్టి ♦ వాఁడను నేనం
చు మ్మేదిని నంతయునుక్, ముమ్మాఱు ప్రదక్షిణములఁ ♦ బొనరింపు మొదల్.

వ. అటుమీఁద నొక్క మాసంబు చాంద్రాయణవ్రతం బొనరింపుము. తదనంతరంబున.

ఆ॥ నూటయొక్క మాఱు ♦ పాటిగ బ్రహ్మగి,రికిఁ బ్రదక్షిణముఁ బొ♦రిన్ సలుపుము
అంతమీఁద మృన్మ♦యములైన లింగంబు, లర్థిఁ గూర్చి సేయు ♦ మర్చనంబు.

వ. ఇట్లుచేసినచో నఘంబువాయు నింక మఱియొక పద్ధతి వినుము.

చ॥ దినదిన మీశ్వరున్ గొలిచి ♦ దివ్యతపం బొనరించి దేవగం
గను నిటఁ దెచ్చి తద్విమల ♦ కాండమునం దఘమర్షణావగా
హనముఁ బొనర్చినన్ దురిత♦మంతయు డుల్లు శుభాప్తిఁ గోరి యిం
కను శివలింగకోటులను ♦ గల్పనచేసి భజింపు మాపయిన్. 168

—* గౌతముఁడు పార్థివలింగార్చనం బొనర్చుట - శివుఁడు ప్రత్యక్షమగుట *—

వ. ఈరెండు తెఱంగులయందు నీ కిష్టం బెట్టు లట్లనుసరింపుము. శక్తుండ వైనచో జతనంబుగ నీ వ్రతి ద్వైవిధ్యంబు ననుష్ఠింపుమనుటయు నమ్మునిచంద్రుఁ డోంకారధ్వనిచేసి వెడలి మునిగణోక్తంబులనెల్ల నతిసులభంబుగ నతిత్వరితంబుగ నొనర్చి ప్రత్యహ మహల్యయు శిష్యప్రశిష్యులును దన్ను సేవించుచుఁ బార్థివలింగసహస్రంబుల నిర్మించి యిచ్చుచుండ నియతమతిఁ బార్థివలింగపూజనం బొనర్చుచుండె నంతఁ బరమదయాళుండును భక్తజనావనదీక్షాబద్ధకంకణుండు నగు శివుం డావిర్భవించి వరంబడుగుమన మునీంద్రుండు పరమశివుని శాంతసుందర రూపంబుఁ జూచి హర్షించి నమస్కరించి స్తుతుల్ ఘొనరించి దేవా! నన్ను నిష్పాపున్ బొనరింపుమన్న నలరి బాలేందుమౌళి యిట్లనియె. 169

ఉ॥ ధన్యుఁడ వీవు మౌనికుల♦తల్లజ! పుణ్యుఁడ వీవు పాప్ములౌ
నన్యులు నిన్ వెలార్చి రిటు ♦ లక్కట! యక్కసుతో; ననన్యసా
మాన్య! త్వదీయదర్శనస♦మాగతపుణ్యగతిన్ బవిత్రమై
మాన్యతఁ జెందు నీ జగము ♦ మద్వచనం బిది నమ్ము నెమ్మనై. 170

ఉ॥ వారలె గోఘ్నఘాతకులు ♦ వారె కృతఘ్న గురుఘ్న పాంసనుల్
వారలె ధర్మబాహ్యులు ♦ వారలె కుత్సితగర్హ్యకర్మతుల్
వారలె ఘాతుకాగ్రణులు ♦ వారె నృశంసులు వారె జాల్ములె
వ్వారలు నిన్నుఁ బుణ్యు నిటు ♦ వంచనఁ జేసి కలంచిరో మదిన్. 171

క॥ వారలసంగతిచే నె,వ్వారలు దూషితులుగాక ♦ వరఁగెద రిలలో
వారికి నిష్కృతిలేదిఁక, ధీరతరమనీష! దీనిఁ ♦ దెలియుము మదిలోన్. 172

వ. ఇది యంతయు నీ యాశ్రమంబున నీచేఁ బోషితులైన మునిజనులు దోషా జనపేరితులై యొనర్చిన వృత్తాంతంబుగాని యథార్థంబుగా దీ దివ్యదృష్టిఁ జూడుమని పరమేశ్వరుఁ డవలోకింపఁజేసిన మునివర్యుఁ డవలోకించి విస్మితుండై పరమేశ్వరున్ జూచి. 173

క॥ ఉపకారమె యొనరించిరి, కృపానిధి! నిజంబు వారు ♦ కించులయిన నీ
కృపకున్ బాత్రిమనైతిని. నిపుణుఁడనై నడసితొంటి ♦ నీదరిసెనముఁ. 174

వ. అని యూనందించి చొక్కియున్నంత వరంబిచ్చెదఁ గోరుకొనుమనుడు. 175

సీ॥ ఓమహాదేవ! నన్నిట్లు♦లోమఁదలంచి, యుంటి వటుగానఁ జేరిముడి♦నొసఁగుదేవ
గంగ నీయెడ లోకోప♦కారమగును, నాకును గడున్ బ్రియంబగుఁ ♦ జోకమెఱయ.

—* శివుఁడు గౌతమునికై గంగను భువి కవతరింపఁజేయుట *—

వ. అనినంత శివుండు దయాళుండై తథాస్తని నిజజటాజూటమండలాంతర్గామిని యగు గంగను నియమించి జార్చిన నాపెయు స్త్రీరూపంబునఁ బొడసూపినఁ గాంచి గౌతమమునీంద్రుండు. 177

క॥ తల్లిరో! ధన్యవుఁ బుణ్యవు, ముల్లోకంబులకు శుద్ధిఁ ♦ బొనరించెద వు
త్ఫుల్లాబ్జలోచనా! నను, జల్లఁగ నిర్మలునిఁజేయు ♦ శంకరురాణీ! 178

వ. అని యంజలిచేసిన నగ్గంగాదేవి.

క॥ నీకభిషేకముఁగూరిచి, వీఁకఁజనెద శివునితలకు ♦ వేఁగ ననఁగ బల్
వ్యాకులితుండగు ముని నవ, లోకించి శివుండనియె ని♦లువుమని గంగన్. 179

వ. గౌతమానుగ్రహార్థం బిందు లోకోపకారంబుగ నీమన్వంతరకాలంబు వసింపుమనుటయు నద్దేవియు నీవును నిఖిలసుపర్వు లిందు వసించుదురేని నేనట్లుండెద నన్న శివుం డంగీకరించి గౌతమార్చితపార్థివలింగంబు నధిష్ఠించి త్ర్యంబకేశ్వరుం డను నామ్యాయంబుఁ జెందియుండె నంత దేవత లట దారసిల్లి తల్లి! జీవుండు సింహరాశిన్ జెందిన వత్సరంబంతయు నీసాన్నిధ్యంబందు నివసించెదము తక్కిన యేఁడులు దినంబున నుండెదమని యొప్పించి యరిగిరి. అంత గంగయు నదీరూపంబుఁజెంది బ్రహ్మగిరిశిఖరాగ్రవిరాజితౌదుంబరవిటపివిటపాళ్లిమనికట*పురటలతాంతరాళనిర్గతయై. 180

* టిప్పణి — పురటలతాంతరాళనిర్గతయై = బంగారు తీవెలవంటి తీవెలయొక్క మధ్యప్రదేశము నుండి బయలు వెడలినదియై

ఇందులకు శ్రీభాగవత పంచమస్కంధ ద్వితీయాధ్యాయమందు - నికటపురటలతారూఢస్థలవిహంగమిథున -

ఇందులకు శ్రీధరీయవ్యాఖ్య -

నికటపురటలతాః సన్నికృష్ట స్వర్ణవల్ల్యః- తాస్వారూఢాః స్థలవిహంగమాః మయూరాదయః

శా॥ రేఖామాత్రము దోఁచి యంతనె కడున్ ♦ రెట్టించి దిట్టంబుగా
శాఖామూలములన్ దిగన్ విడిచి యం ♦ చత్తుంగరంగ త్తరం
గాఖేలత్కలహంససారసరథాం ♦ గాళీస్వనస్యందథా
టీఘాతస్థలియై విదితగతులన్ ♦ దీవ్రిఁ విరాజిల్లుడున్. 181

ఉ॥ గౌతమమౌని తత్పతియు ♦ గంగను మజ్జనమాడిరంత నా
గౌతమశిష్యులందఱును ♦ గాటపుభక్తిని స్నాతులై రటన్
గౌతమియంచు ఖ్యాతిఁగొని ♦ గంగ చెలంగియెసంగఁ గాంచి యా
గౌతము నేఁచినట్టి ముని ♦ కాండము గంగను జేరవచ్చుడున్. 182

చ॥ కని ధుని ఘోరపాతకులు ♦ కశ్మలులెందుఁ గృతఘ్నమూర్తు లీ
మునులిఁకఁ దానమాడుటకు ♦ ముట్టఁగనచ్చిరి వీరికాఁకు నో
ర్వను గనరాకపోదునని ♦ వైశమణంగి యదృశ్యయయ్యె నం
తనె కని గౌతముం డకట ♦ తల్లిరో! పోయితె పాసి నీసుతున్.

చ॥ అని వనరంగ నంతనె ద ♦ యాళువునై మునిపై ననుగ్రహం
బున నటఁ గొంతదూరమటుఁ ♦ బోనిడి క్రమ్మఱఁదోఁచి దివ్యపా
వనవనపూర్ణయై పొదలి ♦ భాసురతన్ బ్రవహించి మించెఁ గ
న్గొనిమది గౌతముం డలరి ♦ కోమలసూక్తులఁ బాడెఁ దద్గతిన్. 184

—* గౌతమ శిష్యులు మునులను నెపించుట *—

వ. అంత గౌతమాంతేవాసిప్రముఖులు.

చ॥ మును లొనరించినట్టి యఘు ♦ మున్ సకలమ్ము నెఱింగి మట్టుమీ
ఱినవడి గౌతమార్యుఁడు మ ♦ ఱిన్ మఱి వారణ సేయుచుండినన్
గనలుచు నమ్మునిబ్రువులఁ ♦ గన్గొని యిట్లని శాపమిచ్చిరీ
డును భవదీయవంశ్యులు వి ♦ రోధులు కాఁగల రీశభక్తికిన్. 185

వ. మఱియును.

గీ॥ యాచకులును దరిద్రులై ♦ యామ్యదిశను,బొడమి యవిభూతిఫాలులై ♦ పౌనరుదురుశ
శాత్ములై నరకంబుల ♦ ననుభవింత్రు, సత్య మిది మా వచనము ని ♦ స్సంశయముగ.

వ. అని శపించిన వారందఱుఁ దామొనర్చిన యకార్యంబునకు మనంబుల నిందించు
కొనుచు దక్షిణదేశం బరిగిరి. ఇందు గౌతమమహర్షి సదారుండై శిష్యవర్గంబుతోఁ
ద్రియంబకేశ్వరు నారాధించుచు నిత్యానందంబున నుండె నదిమొదలు త్ర్యంబ
కేశ్వరుఁడు భక్తకల్పద్రుమంబై యఖిలజగజ్జేగీయమానదివ్యజ్యోతిర్లింగంబై
యొసంగె నిది త్ర్యంబకలింగచరిత్రం బిఁక వైద్యనాథేశ్వరచరితంబు వినుండని
సూతుం డిట్లనియె. 187

## —* శ్రీ వైద్యనాథలింగము *—

శా॥ లంకానాయకుఁడైన రావణుఁడు కై◆లాసాచలాధీశ్వరున్
పంకేజాక్షముఖామరార్చితపదా◆బ్జాతున్ శివున్ శంకరున్
బింకంబొప్ప భజింప నెంచి హిమభూ◆భృద్వృక్షషండోర్వియం
దోంకారస్మరణంబు సేయుచుఁ దపం◆బుత్సాహియై సల్పుడున్. 188

క॥ చిరకాలము దానవునకు, హరుఁ డగుపడకున్న శిరసు ◆ లాఱును మూఁడున్
నఱికి హవనం బొనర్చెను, బరమేశ్వరుఁ డప్పుడును గృ◆పన్ గనకున్నన్.

శా॥ అంతన్ దక్కిన మస్తకంబు నసితో ◆ నంతంబునొందింప ని
శ్చింతన్ బూన శివుండు దారసిలె వ◆చ్చెన్ బూర్వభంగిన్ దలన్
సంతోషంబున శంకరుం డడుగు మి◆చ్చన్ గూర్తునన్ దైత్యుఁ డ
త్యంతంబున్ బలమిచ్చి యేడుగడవై ◆ యస్మత్పురిన్ జేరుమా! 190

క॥ అని కోరిన విని శంకరుఁ, డెనలేనిబలంబు నతని ◆ కిచ్చి చనవుతో
ననుపమలింగం బొకఁ డిడి, యనెఁ గొనిచని దీని నుంపు ◆ మాత్మనగరిలో.

గీ॥ లింగమం దేను వసియింతు◆లీల మెఱయఁ, జెలిమితోఁ జేర్పు పురి కని◆దేవుఁ డరిగె
నంత లింగంబుఁ జేకొని◆యసురవిభుఁడు, వచ్చుచున్ దెరువున దైవ◆వశముఁజేసి.

క॥ మూత్రోత్సర్జనమునకై, యాత్రంబున నొక్క వల్ల◆వాంజలి నిడఁ ద
న్మాత్రభరమోపక చితా, క్షేత్రంబున నాతఁ డుంచె ◆ శివలింగంబున్. 194

వ. అంత రావణుఁడు శుద్ధుండై వచ్చి లింగంబు నెత్తికొనఁబోవ నద్ది సప్తాధోలోకంబులు దాఁటి పాఁటంబుగఁ బ్రతిష్ఠితంబై కదల్పశక్యంబుగాకుండుటఁ జూచి యందె యర్చించి తన శిరశ్ఛిద్రవ్రణంబులనెల్ల వైద్యునియట్లు సులభంబుగ మాన్పి సుఖంబొసంగినందున వైద్యేశ్వరజ్యోతిర్లింగంబని పిలిచి యాత్మనగరంబున కేగె ననంతరంబు బ్రహ్మవిష్ణ్వాద్యఖిలదివ్యజనంబులును మునిజనంబులును వచ్చి పూజించి యీలింగంబు భవరోగంబులకెల్ల వైద్యంబుచేసి మాన్ప సమర్థంబుగావున వైద్యనాథలింగంబని కొనియాడి రటుమీఁద నొక్కనాఁడు నారదఋషి దేవజనప్రేరితుండై రావణునిచేరువ కేగి యాతిథ్యసేవలన్ బడసి యతనికిఁగలిగిన శివప్రసాదంబు తెఱంగును శివలింగప్రతిష్ఠాస్వరూపంబును విని పెదవివిఱిచి శివుఁడు కైతవంబొనర్చె నీకిచ్చినబలంబు కరంబుగరిష్ఠంబయేని నీవిపుడుచని కైలాసాద్రిన్ బెల్లగింపుము దానసంతయుఁ దెల్లంబగు నీరహస్యంబెవరికిం దెలుపకు నే నరయుచుండెదనన్న నతండు నిక్కంబకావగచి వచ్చి కైలాసాద్రిన్ బెకలింపుచుండుడుఁ దత్రత్యులెల్లరు విత్రస్తులై యుండ పరమశివుండు తత్కారణంబడుగఁగాఁ బరమేశ్వరి వాచాటీపరిపాటిఁ బరిహసించుచు నిట్లనియె. 194

ఉ॥ మేలగు శిష్యుఁడెంతయును ♦ మెచ్చుదనర్చెడు రావణాసురుం
డేలికమీఁదనే కినిసి ♦ యేస్తుఁదారసిలెన్ బళీ! బళీ!
చాలఁగ సంతసంబొదవె ♦ సాత్త్వికశిష్యునిఁ గూర్చికొన్నవా
రీలలిఁజెందెఁ దత్ఫల మిఁ ♦ కేమనువారము దేవ! యిత్తఱిన్. 195

క॥ అని సాక్షేపముగ జగజ్జనని నుడువ హరుఁడు వాని ♦ శపియించెఁ గృత
ఘ్నుని నిట్టు లోరి! యచిరంబున నీ మద మణఁగుఁగాక ♦ పొమ్మిఁక వేగన్.

వ. అంత నడిగి రావణుండు భయంపడి యపచారక్షమాపణం బర్థించి లంకాపురం బునకేగె నాఁటనుండి త్రిలోకంబులవార లీ లింగంబు నర్చించి భోగమోక్షం బుల నొందుచుండి రిది వైద్యేశ్వరలింగచరితం బిఁక నాగేశ్వరలింగోత్పత్తిని వినుండని సూతుం డిట్లనియె. 197

## —* దారుకవనము - నాగేశ్వరలింగము *—

ఉ॥ దారుక నాగరక్కసియుఁ ♦ దత్పతి దారుకుఁ డుగ్రమూర్తి వి
స్తారబలంబుతో నపర ♦ సాగరతీరవనస్థలిన్ బొరిన్
జేరి సమస్తభూప్రజకు ♦ సిల్గులు గూర్చుచున్న నౌర్వుఁడన్
ధీరమునిన్ శివవ్రతుని ♦ దివ్యులు మానులు చేరి యార్తిమై. 198

చ॥ వలఁతివి నీవు రక్కసుల ♦ పాల్బడనీక జనంబు నేల నీ
వలన భయంబుఁ బాపికొన ♦ వచ్చితి మిందఱమన్న నాతఁడున్
ఖలులగు దానవాధముల ♦ కల్మష మారసి దైత్యు లీ ధరా
తలమును బాసి వేఱుకడఁ ♦ దాము చరింతురుగాక వీఁకఱన్. 199

సీ॥ అట్లుచనరేని నశియింతు ♦ రనుచు శాప, మొసఁగఁగ నిశాచరులుగడు ♦ నులికి దుఃఖ
తాత్ములై మనుగడ యెట్టు ♦ లందఱమిఁక, నెచటికేగఁగవలయునో ♦ యెఱుకపడదు.

క॥ అని వనరుచున్న దారుక, యను నారక్కసి యొయారి ♦ యనె శాంకరి దా
మును నాకిడె నొకఁడువరంబును దదనుగ్రహమునఁ గడ ♦ వుదము కడలిలోన్.

ఆ॥ కడలికుక్షియందుఁ ♦ గాపురంబుండి యీ, పరిజనులును మనము ♦ ప్రక్కలందుఁ
దిరుగు తరణిజనులఁ ♦ జెఱఁబట్టి వారల, ధనముఁ జూఱఁగొంద ♦ మనవరతము.

చ॥ అని నుడువంగ దారుకుఁడు ♦ హర్షమునొంది నిశాచరావళిన్
గొని చని దుర్గమాంబునిధి ♦ కుక్షిభువిన్ వసియించి చేవ జీ
వననిధిలోఁ జరించు యుడు ♦ పంబులఁబట్టి ధనంబుఁగొట్టి య
మ్మనుజుల నార్తిఁ బెట్టుచుఁ గ్ర ♦ మంబుఁ దొరంగి రహించుచుండఁగా. 203

క॥ ఒకకలమున బేహారము,నకు ద్వీపాంతరముఁ బరిజ ♦ నముతోఁ జనఁ బో
వొక వైశ్యుని సుప్రియునా,మకు శివపూజకునిఁ బట్టి ♦ మదమొప్పారన్. 204

ఉ॥ బందిగనుంచి దాసజన ♦ వర్గముతో ధనమున్ హరింపఁగా
బందినె వైశ్యుఁడుండి శివ ♦ భక్తిని మానక పార్థివేశపూ
జం దగసల్పుచుండ దను ♦ జప్రభుఁ డారసి వచ్చి వేగ నీ
చందము మాను మిట్టి వెడ ♦ జాడఁ దలంచినఁ ద్రుంచివేసెదన్. 205

క॥ అని తెగటార్పన్ దన జన,మునకుఁ గనుసన్న సేయ ♦ మూఁగఁగ వారల్
గని వెఱపుఁగొనియు వైశ్యుఁడు, మనమున శంకరునినమ్మి ♦ మఱియిటులనియెన్.

చ॥ మును త్రిపురాసురుల్ మొనసి ♦ భూరిబలంబున నీత్రిలోకహిం
సను బొనరించుటారసి ప్ర ♦ శస్తకృపాంబునిపానభూతుఁడై
ఘనరణసాధనంబులను ♦ గల్పనచేసి జ్వలద్దృగగ్నులన్
దనుజులఁ దత్పురంబులను ♦ దాహముచేసిన సామి యోముఁడే. 207

క॥ రక్షింపుము శంకర! నను, రక్షింపుము సకలలోక ♦ రక్షాదక్షా!
రక్షింపుము శివ! దుష్టుల, చే క్షయముం జెందనీక ♦ సేవకునిఁ గృపన్. 208

క॥ నీవే యేడుగడవు శివ!, నీవే యొడయఁడవు ద్రవిణ ♦ నిధివియు నీవే
నీవాఁడను నీదాసుఁడ, నీవిదె యీ ప్రాణములిఁక ♦ నిలుపు మహేశా! 209

వ. అని యభ్యర్థించిన నాక్షణంబున శివుండు పార్థివలింగంబందుండి జ్యోతిస్స్వరూపంబున నెగసి ప్రసన్నుండై పాశుపతాస్త్రం బవ్వైశ్యునకొసంగి తత్ప్రహారంబున రక్కసులనెల్లఁ బొలియించిమించిన దారుకాప్రార్థితయై మహేశ్వరుని పట్టంపురాణి విభునిఁదఱిసి.

—* పార్వతీదేవి దారుకను రక్షింపుమని శివుని వేడుట *—

ఉ॥ వేఁకటి నొందియున్నది వి ♦ వేకనిధాన! నిశాటి దీనిపైఁ
బోకడసేయు మాగ్రహముఁ ♦ బూను మనుగ్రహభావమున్ జిరం
బీక శిశుత్వమందు నను ♦ హెచ్చుగఁగొల్చి వరంబులొందె నా
శ్రీకలనన్ దదాత్మజులు ♦ సింధుతటిన్ వసియింతురిగావుతన్. 210

వ. అని యిట్లర్థించిన నఖిలేశ్వరుం డిట్లనియె.

ఉ॥ రాణిరో! నీమనంబరసి ♦ రక్కసినొక్కతెఁగాఁతు నిప్డు పూఁ
బోఁణి! తదీయనందనులు ♦ పొల్పుగ నిందువసింత్రు నే నని
ద్రాణతలింగరూపమునఁ ♦ దప్పక యిందునెయుందు మానవ
త్రాణముగోరి నీవటులె ♦ రాణదలిర్పఁగనుండు మిచ్చటన్. 211

వ. అనినొడివి భక్తానుగ్రహార్థం బమ్మహేశ్వరుండు నాగేశ్వరుండను నామధేయంబుతో నందుఁజేరి వసించియుండె. మహేశ్వరియును నాగేశ్వరి యను పేరుతో నచ్చోటనే వెలసియుండె నది మొదలా నాగేశ్వరజ్యోతిర్లింగం బఖిలసిద్ధికరంబై

యొప్పె నిది నాగేశ్వరలింగచరితం బిఁక రామేశ్వరలింగస్వరూపంబును వినుండని
సూతుం డిట్లనియె. 212

—* శ్రీరామేశ్వరలింగము *—

ఉ॥ నీరజలోచనుండు రజ ♦ నీచరులన్ వధియింపఁగోరి యీ
ధారుణి సూర్యవంశమునఁ ♦ దా జననంబునుజెంది జానకీ
వారిజపత్రనేత్రను వి ♦ వాహముచెంది పితృప్రియార్థమై
ఘోరతరాటవిన్ దఱిసి ♦ కోమలిఁ గోల్పడెఁ బఙ్క్తికంఠుచే. 213

ఉ॥ అంత దురంతచింత మాఱి ♦ దశ్వాకులాగ్రణి వానరేంద్రుతోఁ
బొంతముచేసి మారుతిస ♦ మున్నతవిక్రమదీప్తి మైథిలీ
కాంతవిధం బెఱింగి ప్లవ ♦ గప్రభుసంకలితోరువాహినీ
క్రాంతతటాంతరుండగుచుఁ ♦ గాండనిధిన్ వడిఁజేరె ధీరుఁడై. 214

వ, మంతనంబందు.

ఉ॥ రావణుఁడన్న నల్పుఁడె ? య ♦ రాతిగణంబుల నుక్కడంచి నా
నావిధసంపదల్ పొదల ♦ నాయకుఁడై తగు మేఁటి యమ్మహా
దేవునిభక్తిఁ జేసి కదుఁ ♦ దేజముఁజెందిన ధీరవర్యుఁడీ
జీవనరాశి నల్పసర ♦ సిన్ వలె మీఱెదుపోవిడ యారయన్. 215

క॥ మనమందర మిపుడీ యుద, ధిని దాఁటుటయెట్లు పిదప ♦ దితిజాధిపతిన్
బెనఁకువఁ గూల్చుట యెట్లది, యొనఁగూడును శివునికరుణ ♦ నొందకయున్నన్.

గీ॥ వినుము సౌమిత్రి! యీసింధు♦వేలయందు, శంభులింగార్చనంబు ని♦ష్ఠ మెయిసల్పి
తత్ప్రసాదంబుఁబడసి యు♦దారశక్తి, నొడిసిదాఁటుద మంబుధిఁ ♦ గడప రిపుని. 217

క॥ అని స్థిరహృదయుండై చ, య్యనఁ బార్థివలింగ మొండు ♦ పావనికన్నై స
ల్పి నితాంతభక్తిఁగొలువుడుఁ, బినాకధరుఁ డంతఁబొల్చి ♦ ప్రేముడిఁబలికెన్.

—* శివుఁడు రామునకుఁ బ్రత్యక్షమై వరంబు లిచ్చుట *—

శా॥ రామా! దాశరథీ! ముదంబొదవె నీ ♦ రారజ్యమానార్చనన్
బ్రేమన్ గోర్కులఁదెల్పు మిచ్చెదనన్ ♦ బృథ్వీవరోత్తంసుఁడో
హేమగ్రావశరాస! రావణుని తు ♦ త్రుంకించి గీర్వాణ ను
ద్దామంబై యలరారుశక్తి నిదుమా ♦ దాక్షిణ్య మేపొందఁగాన్. 219

క॥ మఱియును నేసలతో మే, మఱిముఱి మున్నీరుదాఁట ♦ ననువగుజతనం
బెఱిఁగింపు మీస్థలంబున, నెఱిమీఱఁగ నీవు సతము ♦ నిలువు మహేశా! 220

వ. అని యిట్లు వరంబడిగిన శివుండు రామునకు * రావణనిర్వాపణప్రవీణంబగు సామర్థ్యం బొసంగి సేతుబంధనోపాయం బెఱింగించి రామచంద్రార్చితపార్థివ లింగంబందు జ్యోతీరూపంబునఁ బ్రవేశించి రామేశ్వరలింగం బని పేరొంది రామున కిట్లనియె. 221

ఉ॥ ఎంతటిదాఁక నీకువల ♦ యేశ్వరుఁ డీరవి యీయుడుప్రజం
బెంతటిదాఁక నీదు ప్రియము ♦ లీనదు లీభువి చెల్వమీఱునో
యంతటిదాఁక నే నిచట ♦ హర్షవసంగత భవదీయలింగమం
దెంతయుఁ బ్రేమతోడ వసి ♦ యింతు యశంబొనరింతు నీకిలన్. 222

వ. అని సెలవిచ్చినంత సకలదివ్యజనంబులు మునిజనంబులు వచ్చి యా రామేశ్వర లింగంబున కర్చనంబు లొనర్చి యానందించి చని రదిమొదలాలింగంబు సుప్రసిద్ధంబై త్రిలోకార్చితంబై వెలసె నంత రామచంద్రుండు.

గీ॥ సేతుబంధన మొనరించి ♦ సింధుదాఁటి, సపరివారము పౌలస్త్యుఁ ♦ జదిపి తత్పు
రికి విభీషణుఁ బ్రీతి నే ♦ లికను జేసి, సతినిఁగొని పుష్పకంబెక్కి ♦ సంతసమున.

క॥ పారావారము దాఁటి స, దారుండగు రాఘవుండు ♦ దా నటుఁబూర్వం
బారాధించిన లింగముఁ, జేరి మహాభక్తిఁగొలిచె ♦ సీతయుఁ దానున్. 225

వ. మఱియు నంత సీతాప్రార్థనఁ జేసి రామచంద్రుండు వేఱొకలింగంబుఁ బ్రతిష్ఠింప నెంచి సీతారచితసైకతలింగంబొకండును గించిద్విలంబనంబున నాంజనేయుండు గాశినుండి తెచ్చినలింగంబొకండును బ్రతిష్ఠించిపూజించె సైకతలింగంబును రామ నాథలింగంబనియును హనుమాదానీతలింగంబును విశ్వేశ్వరలింగంబనియును జెప్పుదురు. 246

క॥ ఈ రామేశ్వరలింగముఁ, జేరి నరుం డెవ్వఁడేని ♦ శ్రీగంగాంభో
ధారల నభిషేకించినఁ, జేరును గైలాసశైల ♦ శిఖరపదంబున్. 227

---

* శివపురాణే కోటిరుద్రసంహితాయాం త్రింశాధ్యాయే—

శ్లో॥ కృతవాన్ రాఘవః పూజాం । శివధర్మపరాయణః । స్తుతించ వివిధాంకృత్వా । ప్రణిపత్య శివం ముదా । జయంచ ప్రార్థయామాస । రావణాజౌ తదాత్మనః ।
తతః ప్రసన్నహృదయో । రామభక్త్యా మహేశ్వరః । జయోఽస్తుతే మహారాజ । ప్రీత్యాచ పునరబ్రవీత్ ।...... పునశ్చ ప్రార్థయామాస । సాంజలి ర్నతమస్తకః ॥ రామః—త్వయా స్థేయ మిహస్వామిన్ । లోకానాం పావనాయచ । పరేషా ముపకారార్థం । యదితుష్టోసి శంకర ॥ సూతః—ఇత్యుక్తస్తు శివస్తత్ర । లింగరూపో భవత్తదా । రామేశ్వరశ్చ నామ్నా వై । ప్రసిద్ధో జగతీతలే । రామస్తత్ప్రసాదేన । సింధుముత్తీర్యచాంజసా । రావణాదీన్ నిహత్యాశు । రాక్షసాన్ ప్రాపతాం ప్రియాం ॥

వ. ఇయ్యది రామేశ్వరలింగచరిత్రం బిఁక ఘుశ్మేశ్వరలింగచరిత్రంబుఁ జెప్పెద నాకర్ణింపుఁడు. 228

## —* దేవగిరి శివాలయము - ఘుశ్మేశ్వరలింగము *—

క॥ దేవగిరినికటమున భూ, దేవుఁడు బ్రహ్మవిదుఁ డభవ ♦ దీక్షితుఁ డవనిం
బావనుఁడు భరద్వాజకు, లావిర్భూతుఁడు సుధర్ముఁ ♦ డనునొకఁడలరున్.

క॥ అతనికి సుదేహయనునొక, చతురమతి కలత్రమలరు ♦ సమ్యగ్గుణశో
భిత గృహకార్యవిశారద, పతిహిత సుచరిత్ర ధర్మ ♦ పారీణ గడున్. 230

ఉ॥ వారలు దేవతాతిథిస ♦ పర్యలఁ బేర్మి నొనర్చుచుండి ర
వ్వారికి సంతుగాక పలు ♦ వత్సరముల్ చనినంతఁ జింతతోఁ
గూరి సుధర్ముదేవి మదిఁ ♦ గుందుచు వైభవ మెంతయుండినన్
సారెకు దూఱుచున్ విధిని ♦ సంతిస మొందకయుండె నిచ్చలున్. 231

ఉ॥ ధీరుఁడుగానఁ దత్పతి మ♦దిన్ గన కెట్టి విచారమున్ మహో
దారతతో నిటుల్ నుడువు ♦ తన్విరో! ఏందుర నేల? యిట్టు లె
వ్వారికి నెవ్వరౌదు రిల ♦ బందుగులెవ్వరు? తల్లిదండ్రు లె
వ్వారలు? పుత్రులెవ్వ? రిఁక ♦ స్వార్థపరంబు జగంబు సర్వమున్. 232

క॥ కావున వగపక సతతం, బీవు శివునిఁ గొలుచుచుండు ♦ మింపుగ నన భూ
దేవియు మానక స్త్రీస్వా, భావికగతి సుఖముఁదప్పి ♦ వనరుచునుండెన్. 233

గీ॥ అట్టితఱిఁ బొరుగింటికి ♦ నరిగి యెదియొ, పనికిఁ దత్సతితో మాట ♦ పట్టుదలకు
జగడమాడఁగనాబిడ ♦ దెగడియిటుల, నుడివెనుసుదేహమన సెంతొ ♦ నొచ్చిపోగుల.

క॥ ఉప్పరము లున్నవనుచున్, గొప్పగు నగ లున్నవనుచు ♦ గొప్పనుచు నీ
వెప్పుడుఁ దుళ్ళకు బంగరు, కుప్పలుగల రోసి! నాకుఁ ♦ గొడుకులుఁ గూఁతుల్.

ఆ॥ దుడ్డు గలుగనేమె? ♦ గొడ్డుదానవు నీవు, తినుట కెవ్వరేని ♦ దిక్కులేరు
బిడ్డలున్నదానఁ ♦ బేర్మి నా కెనయాదె?, తల్లకిందులగుచుఁ ♦ దపసుఁగొనిన.

క॥ అనినఁ జివుక్కురుమను మదిఁ, గనలుచు నిజగృహముఁజేరి ♦ కాంతుని కంతన్
బెనువగ వినిచిన నాతఁడు, వినియు విననియట్టు లుండె ♦ విత్తముఁ డౌటన్.

ఆ॥ ఆ సుదేహ యంత ♦ కంతకు సంతాన, కాంక్ష యగ్గలింపఁ ♦ గాంతుఁ గదిసి
కలదె లేదె నాకు ♦ గర్భవైభవమంచుఁ, గ్రుచ్చిగ్రుచ్చియడుగఁ ♦ గొంకకతఁడు.

ఆ॥ రెండుపిరుల శివుని ♦ దండ నుంచి యొకండు
గొనుము పణఁతి! యనినఁ ♦ గోమలాంగి
యిష్టసుమముఁ బాసి ♦ యీవలి పుష్పంబుఁ
గొనినఁ జాగని నిజేశుఁ ♦ గోవిదుండు. 239

ఉ॥ ఆరసి యద్ది యంతఁ బతి ♦ కర్మిలి వేఱొకఁ బెండ్లిసేయఁగాఁ
గోరి మహాత్మ! నాకిఁకను ♦ గూనలు గల్గరు తెల్లమయ్యె మేల్
మీఱఁగ వేఱుబాలికను ♦ మీరు వివాహము చెందుఁ డాపెకున్
మీఱక పుట్టు నందనుఁడు ♦ మేలగు నందఱకున్ బ్రియంబగున్. 240

క॥ అన విని యిపు డిట్టులె నీ, వనెదవు వేఱొర్తుఁ బెండ్లి ♦ యాడిన సవతిన్
గని పోరు సేతు వెంతయు, ననుమానము లేదు పెండ్లి ♦ యాడను మరలన్. 241

వ. అనుటయు

క॥ నా చెలియలు పదిరెండేం, డ్లేచిన యీ డొప్పుబాల ♦ నిప్పింతు దయన్
జూచి వివాహంబాడుము, నా చెలియలి నేచుదాన ♦ నా? యెటులైనన్. 242

సీ॥ అని దివారాత్రులెంతయు ♦ నధిపుతోడ, నొడివి మదిఁ గరఁగించి పె♦ల్లొడిసి తనదు
చెలియలిం దెచ్చి పెండిలి ♦ చేసి దాసి, యట్లు సేవించుచుండె న♦య్యనుజ యెపుడు.

క॥ ధర్మవిదుఁడైనయట్టి సు, ధర్ముఁడును సుదేహతోడఁ ♦ దా నిటులనియెన్
నిర్మలమతి! నీ చెలియలి, నర్మిలి నీ వేలుచుండ ♦ నగుఁ బసిదానిన్. 244

ఆ॥ అనుచు ఘుశ్మ యనెడు ♦ నాహ్వాయం బొప్పెడు, చిన్నయాలి నప్ప ♦ చేతఁ బెట్టి
నిత్యవైభవమున ♦ నెగడుచుండె నతండు, ఘుశ్మ యక్క సెలవుఁ ♦ గొని ముదమున.

క॥ దినదినము నూటయొక్కం, డనువుగ మృల్లింగములను ♦ నమరించి శివా
ర్చన విధిమై సలిపి ముగిం, చిన మీఁదను వానినెల్లఁ ♦ జెఱువునఁ జేర్చున్.

—* ఘుశ్మకుఁ బుత్త్రుఁడు జన్మించుట *—

క॥ కొన్నేళ్లుజరుగ లింగము, లన్నియు నొక లక్ష యయ్యె ♦ నంత శివకృపన్
జెన్నలరు ఘుశ్మ కెంతయుఁ, జిన్నారిసుతుండు పొడమెఁ ♦ జేతంబలరన్. 247

క॥ అందముగాఁ బొడమిన తన, నందను నానందభరము ♦ నఁ గని సుధర్ముం
డెందు ననాసక్తుండై, నం దద్దయు ముదముఁగొనె జ ♦ నంబు లలరఁగాన్. 248

క॥ బందుగులున్ లాఁతులు నిఁక, నందఱు ఘుశ్మన్ గరంబు ♦ హరుసంబున మె
ప్పొందఁగఁ గొనియాడిరి వ్యథఁ, జెందె నొకర్తుక సుదేహ ♦ చెనఁటితనమున్.

వ. అంతఁ గొన్నాళ్ళకు

సీ॥ రూపరేఖాకలాశీల ♦ రుచిరుఁడగుచు, బాలుఁ డేపొంద నొకబాడ ♦ బప్రముఖుఁడు
కడిఁదిధనికుఁడు దనకూతు♦ గారవించి, యిచ్చి పెండిలిచేసె సొం ♦ పెచ్చుమీఱ.

క॥ వియ్యపువారలు వారల, వియ్యంబులు ఘుశ్మనెంతొ ♦, వేడుకఁ జూడన్
గొయ్యతనంబున నోర్వక, గయ్యాళిసుదేహ మెండు♦గాఁ దపియించెన్. 251

ఆ॥ జ్యేష్ఠ జ్యేష్ఠయగుచుఁ ♦ జెడుమదినొందఁగా, ఘుశ్మయెటేఁగి వేగఁ ♦ గొడుకు కోడ
లును ద్వాదీయులమ్మ! ♦ మనమం దెఱుంగుము, నాదువాదు కారు ♦ నమ్మమిఁకను.

క॥ తల్లిబలెఁ గొడుకు పెనిమిటి, తల్లిబలెన్ గోడ లెదలఁ ♦ దలఁచిరి ప్రియమహా
నిల్లాలిగఁ దలఁచును విభుఁ, డుల్లమున సుదేహసట్టు ♦ లొప్పఁడు ఘుశ్మన్.

క॥ ఈరీతి వారలుండిన, మీఁది సుదేహావధూటి ♦ మేలోర్వక వి
స్తారపుఁబాపము లోఁగొని, నేరంబుల వెదకికొనుచు ♦ నిందితమతియై. 254

గీ॥ ఘుశ్మకన్నీరుచేత నా ♦ కుంగలట్టి, హృదయ తాపానలము శమి ♦ యించుఁగాక!
వేఱువిధమైనఁగాదట్లు ♦ నేరమనక, దానిసూను వధింతు నం ♦ తయునుఁ గుదురు.

గీ॥ పైనిఁ గానున్నదగునని ♦ పాపభయము, మాలి చీఁకటిరాతిరి ♦ మందిరమునఁ
బడఁతితో సెజ్జఁగూపకు ♦ కొడుకు నొడిసి, పొడిచిచంపెను గత్తితో ♦ గడిఁదిపగను.

క॥ కసిదీరినదని కుసివడి, వెసఁగొమరుని తుంపెములను ♦ వెదకికొని సమీ
పసరస్సున నేసి వడిం, బసరంబైఁజేరె మరల ♦ మందిరభూమిన్. 257

మ॥ తెలవాఱన్ రుధిరాక్త శయ్యఁగని యెం ♦ తేభీతి నాత్మేశ్వరున్
గలయంగాంచక కోడ లార్తయయి యా ♦ క్రందధ్వనుల్ సేయఁగాఁ
గలుషస్వాంత సుదేహ సేరి యెఱుఁగం ♦ గాలేనియట్టుల్ వ్యథా
కులవోలెన్ విలపించె నెల్లడరఁ బ ♦ ద్దుగ్గాడి హా హా యనన్. 258

గీ॥ అపుడు ఘుశ్మయుఁ దాఁ బార్థి ♦ వార్చనంబు, సలుపుచుండెను నాథుండు ♦ సరసనుండె
గోడుగోడున నేడ్చుచుఁ ♦ గోడ లవ్వి. ధంబుఁ దెలిపిన ధీరయై ♦ తలఁచె నిట్లు. 259

క॥ ఎవనిదయన్ గొడుకేర్పడె, నవికలకృపుఁ డతఁడె సాఁకు ♦ సర్వభు భక్తో
త్సవకరుఁడని పేరొందిన, శివుఁడు మహాకాళమూర్తి ♦ సిద్ధం బిందున్. 260

ఆ॥ కాకయట్లు శివుఁడు ♦ గాపాడకున్నచో, నెవ్వ రేమియడ్డ ♦ మీ జగమున
మాలకరి విరులను ♦ మహిఁగూర్చు నెడసేయు, నట్లె హరుఁడు జగము ♦ నవఘళించు.

క॥ కావున వగపేలని శివ, దేవునియెడ నమ్మకమున ♦ దివ్యలింగా
ర్చావిధ్యంతంబున సర, సీవనమునఁ గలిపి మరలె ♦ శివలింగములన్. 262

వ. అంత

ఉ॥ వచ్చితి వచ్చితిన్ జనని! ♦ వైళమె యేను భవచ్ఛివార్చనా
సచ్చరితోన్నతిన్ శివప్ర ♦ సాదసమున్నతి మాఱుఁదల్లి చేఁ
జచ్చియుఁ బుట్టితిన్ మరలఁ ♦ జక్కఁగ నన్ గొనిపొమ్ము గీముకున్
జెచ్చెరనంచుఁ బుత్త్రకుఁడు ♦ చేరఁగవచ్చినఁ జూచి తాల్మియై. 263

క॥ ఎక్కుడు మోదము లేకయె, యక్కవయిన్ గినుకఁగొనక ♦ యాకె గొమరుపైఁ
జక్కఁగఁజేయిడెఁ గడుమె, చ్చెక్కఁగ ముక్కంటిసామి ♦ యే తెంచివడిన్.

ఉ॥ మెచ్చితి నీదుపూజనము ♦ మేలగు నీదగు తాల్మికెంతయున్
హెచ్చుగ నిచ్చెదన్ వరము ♦ నీవిఁకఁ గోరుము నీసపత్ని నేఁ
జెచ్చెర ముక్కముక్కలుగఁ ♦ జెండెదనిప్డు త్రిశూలధారనాన్
గ్రిచ్చఱ ఘుశ్మ దానడిగెఁ ♦ గావుము నాస్వసనంచు నాధృతిన్. 265

వ. అంత శివుండు

క॥ ఏమిటికి కోమఁగఁజూచెద, వీమెను నీపట్టిఁబట్టి ♦ హింసించెను పో
రామిన్ వలఁపఁగఁ జనునే?, పామునకున్ బాలుఁబోయ ♦ భావ్యంబగునే? 266

వ, అనిన ఘుశ్మ యిట్లనియె.

క॥ కీడొనరించినవారికిఁ, గూడ ప్రభూ! మేలుసేయఁ♦గూడున్ గాదే
యూడదె నీ దరిసెనమునఁ, గూడనితలఁవది సుదేహ♦కున్ సుచరిత్రా! 267

గీ॥ అనిన శివుఁడల్లె వేఱొకం♦డడుగు వరమ, నాఁగ నయ్యేలనాగ వే♦వేగ లోక
రక్షణంబును గోరి యా♦రాజమౌళి, నందె వసియింపుమనెఁదన♦యూహ్వాయమున.

వ, అనిన శివుండు.

క॥ నీవర్థించినయట్టులె, యీ విమలజలాశయమున ♦ నెంతయు నీ పే
రావహిలన్ ఘుశ్మేశుఁడ, నా వెలసెద నాలయం బ♦నఁబడు సరసియున్. 269

క॥ ఇఁక నిట నను గొల్చినవా,రికి నిష్టార్థముల నిడి పా♦రిన్ బ్రోచెద మీ
యకలంకాన్వయ మిది నూ,టికిమించి సుపుత్రి లొప్పి ♦ శివిగాను నిలన్.

ఆ॥ అనుచు లింగరూపుఁ♦డై యుండె శంకరుం, డనఘుఁడగు సుధర్ముఁ♦డాసుదేహ
వచ్చి ఘుశ్మతోడ ♦ వరదు మహేశ్వరుఁ, గొలిచి రంద జెంపు♦గూరుమదుల.

క॥ శరదాగమమున నీటన్, బొరసిన కాలుష్య మవియు ♦ పోల్కి సుదేహాం
తరదురితాశయ మెల్లన్, హరదర్శనమునను విరిసె ♦ హరువొప్పొందన్.

వ. సుదేహాయు జీవితుండైన పుత్రింగాంచి మురిసి తన చేసిన ద్రోహంబునకులజ్జించు
చుండ విభుఁడును ఘుశ్మయుఁ బాపహారంబులగు ప్రాయశ్చిత్తంబులొనరింపఁ
జేసి రంత నంద అన్యోన్యప్రేమలఁ బొదలియుండి రదిమొద లా లింగంబు ఘుశ్మే
శ్వరలింగంబనియు సరోవరంబు శివాలయంబనియుఁ బేరొందె నిది ఘుశ్మేశ్వర
లింగ చరిత్రం బిట్లు ద్వాదశజ్యోతిర్లింగ చరిత్రంబులఁ జెప్పితి నిఁకేమి వినఁగోరుదు
రనిన సూతునకు శౌనకాదిమును లిట్లనిరి. 273

## —* లింగస్వరూపకథనము *—

క॥ లింగస్వరూప మెట్టిదొ?, లింగపదార్థంబెదో? తె ♦ లియఁజెప్పుము మా
కుం గరుణమెఱయఁగా దీ, నిం గూరిచి చెప్పుచుండ్రి ♦ నేక విధములన్. 274

క॥ అని ప్రశ్నింపుడు సూతుం, డనియెను మునులార! మీర ♦ లడిగిన విషయం
బును దెలిపెదువాఁడ జగ, జ్జనముల శ్రేయింబుకొఱకు ♦ సాకల్యముగాన్.

క॥ అరయఁగ నాద్యంతములన్, బొరయక శోభిల్లు నద్ది ♦ బోధాస్పదమై
ధరఁ బూర్ణమై యఖండ, స్ఫురణంబై యలరు లింగ ♦ మూర్తి మునీంద్రుల్! 276

క॥ అనితరసాధారణమై, యనుపమఘనశక్తియుక్త ♦ మై యచలంబై
మునుకొని సకలజగత్సా, ధనమై లింగంబు వెలయుఁ ♦ దాపసవర్యుల్! 277

క॥ ఏకంబై చిన్మయమై, వాకులకున్ మదికి దవుల ♦ వర్తించునదై
శ్రీకరమై శ్రితసేవిత, మై క్రమపుజోతిరూప ♦ మై బ్రహ్మంబై. 278

క॥ అమలంబై వేదనిదా, నమునై సర్వార్తిభేద ♦ నమునై శివమై
కమలాక్షకమలజన్మా, ద్యమరాతీతస్వరూప ♦ మై యమరు మునుల్! 279

వ. ఈ లింగస్వరూపవిభవంబుఁగూర్చి నేనకా దెవ్వార లెంతకాలంబైనను సమగ్రం
బుగా నుడువలేరు గుఱుతుకై రవిదీపన్యాయంబుగ నించుక వక్కాణించితి
నింక లింగశబ్ద నిర్వచనంబు వినుఁడు. 180

క॥ విరివగు నీసకలచరా, చరభువనము లెందుఁడిందు ♦ సర్వంబ లీ
మరలనెటఁ బొడము జగముల, కిర వెయ్యది లింగమది ము ♦ నీంద్రవతంసుల్!

వ. ఇఁకఁ బ్రతీకోపాసనయందలి శివలింగంబుఁగూరిచి కొంద ఱొక యైతిహ్యమున్
జెప్పుదు రద్దాని నుడివెద నాలకింపుఁడు. 282

—* దారుకావనముని చరిత్రము *—

ఉ॥ దారువనంబునాఁగ వసు ♦ ధాతలమందుఁ గరంబు శ్రీల నొ
ప్పారుచుమీఱు నచ్చోట మ ♦ హామహులిద్ధతపోధనాగ్రణుల్
ధీరులు మౌను లుండుదు స ♦ తీసుతశిష్యగణంబు గొల్వ న
వ్వారలఁ జూచి తోడిఋషి ♦ వర్యు లడఁగ్గొని యుందు రెంతయున్. 283

మ॥ శివభక్తిం గొని నిత్య మమ్మునివరుల్ ♦ సేవించుచుం దీక్షను శి
ష్యవరుల్ పుత్రులుగొల్వ నింధనకుశా ♦ ద్యర్థంబుగా నొక్కనాఁ
డు విదూరాటవికేగి రయ్యెడ శివుం ♦ డున్ వారలన్ మెచ్చి హె
చ్చు వరంబుల్ దయనీఁదలంచి మదులన్ ♦ శోధింపఁగా నింపుష్టై. 284

మ॥ కడునందంబగు లేఁతయౌవనపుటా ♦ కారంబునన్ జెంది యొ
క్కఁడు వేడ్కన్ జెప్ప దిగంబరుండయి మునీ ♦ ట్లోకసన్నిధిన్
బెడఁగొప్పొందఁగ భిక్షమెత్తుకొన రా ♦ వీక్షించి యవ్వార ల
న్వేడవిల్తున్ గిఖరించినట్టిఁడని బ ♦ ల్విభ్రాంతలై చింతతో. 285

చ॥ మది గెలువంగ నోడి యల ♦ మారహరుఁ బడిఁజేరి విభ్రమా
స్పదమగు తత్తనూజ్జ్వలరస ♦ ప్రసరంబును గన్నుదోయిఁ బే
ర్మద మొదవంగఁ గ్రోలుచు గ ♦ మల్గములై హరు సన్నివేశమున్
వదలఁగలేక పైకొనెడు ♦ బాళి మరల్పఁగలేక పేఁకతోన్. 286

—* మునిభార్యలు శివునిఁజూచి మోహించుట *—

క॥ చక్కెరవిల్తునికోలల, కక్కసములు లార్తిఁగొని భ ♦ యంబు విడిచి మేల్
నిక్కెడు చనుఁగవఁగ్రుచ్చుచు, నక్కల బిగ్గఁగ నొడిసి ♦ రమ్మారహరున్.

సీ॥ చిగురుఁబోడియొకర్తె ♦ చికురబంధముజాఱఁ, గౌఁగిలింపుచుఁబ్రభూ! ♦ కావుమనియె
చెలువయొకర్తుక ♦ శివుచేయి తన ఘన, స్తనమండలిం జేర్చి ♦ సాఁకుమనియె
విరిదండకై వడి♦యురమందువ్రాలియే, లుము దేవ! యని యొక్క ♦రమణియనియె
పొగరుగుబ్బలను పేఁ♦పునఁ గ్రుచ్చి ననుఁబ్రోవు, మనివేడెనొక విక♦చాబ్జగంధి

గీ॥ కదిసిపైకొని ముద్దాడెఁ♦గలికియొకతె, వదములొత్తుచునిలిచెను ♦ భామయొకతె
రమ్మురమ్మని చెయిలాగె ♦ రామయొకతె, నేనునీదాననని చేరెఁ♦జానయొకతె. 288

చ॥ ప్రిదిలినయట్టి కంచెలను ♦ బిగ్గరఁబట్టి మఱొక్క కేలితో
వదలెడునీవిఁబట్టి పసి ♦ వట్టి మదిం దగు దీమునట్టి క్రొ
మ్మదవతియొక్క భామ యస♦మానమనోజమనోజ్ఞమూర్తి! నీ
కిదియె యుపాయనంబిడితి ♦ నీతను వీవు గ్రహింపు మిష్టమున్. 289

సీ॥ దిక్కునీవేసామి ♦ మ్రొక్కెదానను ననుఁ, బాసిపోవకుమంచుఁ ♦ బల్కెనొకతె
సారంబులేని యీ ♦ సంసార మే నొల్ల, నీవె యేడ్గడవంచు ♦ నిలిచెనొకతె
యిల్లొల్ల విభునొల్ల ♦ నీధనంబొల్లని, స్నానించి వచ్చితి ♦ ననియె నొకతె
ఈవె నాప్రాణంబు ♦ లీవెధనంబు నిన్, విడువలే నంచని ♦ వేడె నొకతె

గీ॥ ఆర్తనేలినఁ బుణ్యమా♦ననియెనొకతె, కనవె సర్వజ్ఞుఁడవు తాప♦మనియె నొకతె
నన్విడినఁ బాయుదానఁ బ్రా♦ణమనెనొకతె, అరసియెటులేనిరక్షింపు♦మనియెనొకతె.

వ. మఱియును గొందఱు గరువతనంపుప్రోడ లక్కందర్పజేతన్ గాంచి పరవశలై

గీ॥ చనులఁ గండూతి చేసె భా♦మిని యొకర్తు
చెక్కులను గీఱె నొయ్యారి ♦ చెలువ యొర్తు
పయ్యెదం జార్చి సరిచేసె ♦ భామ యొర్తు
దీనదృష్టుల హృదయంబుఁ ♦ దెలిపె నొర్తి. 292

వ. ఇఁకను బెక్కండ్రు చక్కని పడంతులు బిడ్డపాపల నింటఁబడవైచి తగులమున
హరున్ దారసించి మూఁగిరి. 293

ఉ॥ ఇందఱు చుట్టుముట్టి సుర♦తేచ్చఁ గదుర్గఁగడుఁ దీవరింపుచున్
గందరగోళమున్ సలుపఁ♦గా హరుఁ డెంతయు నిర్వికారుఁడై
యందఱఁగాంచి యిట్లనియె ♦ నక్కట! మీ మగలుండ లాఁతితోఁ
గందువఁ గూడఁగాఁ దగునె? ♦ కర్మల మియ్యది చేరుఁ డింద్లకున్. 294

చ॥ అన విని వారలెంతయును ♦ హా! యిటు ద్రోయఁగఁజెల్లునే మమున్
ఘనుఁడవు కామతంత్రములఁ ♦ గాంచిన ప్రోడవు కోరి వచ్చి చే
రిన ననబోంట్ల కామితము ♦ రిత్తయొనర్చి తొలంగ నొప్పనే?
నిను నిఁకఁ బాసిపోవుటకు ♦ నేర్తుమె? దోసము గీసమున్ననున్. 295

క॥ అని యిటుఁ దెంపునఁ దనపై, ననురాగభరంబు నిలిపి ♦ నట్టి యువతులన్
గని తత్పర్వేంద్రియముల, కనఘుఁడు దలఁపునని ఘనత ♦ రానందమిడెన్. 296

గీ॥ అంత నక్కాంతలెల్ల ని♦తాంతహర్ష, పారవశ్యంబునన్ మీఱి ♦ పడయరాని
సిరికిఁ జెలరేగి యారాజ♦శేఖరునకుఁ, జెలిమి నుపచారముల నిట్లు♦చేసి రంత.

క॥ గొడుగున్ బట్టె నొకర్తుక, తడఁబడుచున్ బాపలొందెఁ ♦ దన్వియొకతె బ
ల్వడి వింజామరలొందిరి, బెడఁగొప్పఁగ జతలు జతలు ♦ బింబోష్ఠు లొగిన్.

క॥ అద్దముఁబట్టె నొకతె యొక, నిద్దపుజవరాలు భక్ష్య ♦ నిచయకబళముల్
తద్దయు నొసంగుచుండెను, గద్దెను మోచికొని తెచ్చెఁ ♦ గలికియొకతెయున్.

వ. ఇట్లు మునివనితారత్నంబులెల్ల బరిపరివిధంబులఁ బరమేశ్వరుసేవించుచు మహా
నందంబున సర్వంబును మఱచి చొక్కియున్న సమయంబున మునివరులు పుత్రి
చ్ఛాత్రిసమన్వితులై బహువిధసమిత్కుశఫలాశప్రసూనఫలమూలంబులఁగొని
స్వాశ్రమంబులఁ జేరవచ్చి యందు భిక్షుకునిన్ గళత్రంబుల శీలభంగదుర్వృత్తం
బును గాంచి విస్మితులై వీఱిడులై విన్నఁబోయి వగచి మహోగ్రహపరవశతన్
భిక్షునిన్ జేరి యిట్లు ధర్షించిరి. 300

ఉ॥ ఎవ్వఁడవీవు గల్మషుఁడ! ♦ యేటికిఁజేరితి వీవనం బిటుల్
గ్రొవ్వి దురాత్మకృత్యమున ♦ కున్ వెనుదీయక మావధూటులన్
బువ్విలుకానిసేఁతలకుఁ ♦ బూనిచి శీలము గంగఁగల్పితీ
విన్వని నిన్నుఁబూడ్చెద మిఁ ♦ కెవ్వరిఁదెచ్చిన వచ్చినన్ సురల్. 301

క॥ అనిదూఱిన జడియక య, మ్మునివరులన్ జూచి నగుచు ♦ ముగ్ధేందుకలా
కనదవతంసుం డూరక, యె సిలిచినన్ వారు మిగుల ♦ హెచ్చుగుకినుకన్. 302

శా॥ పాషాణంబులఁ గట్టెలన్ బడితెలన్ ♦ బల్వు ర్ముగ్గుగాఁడి వి
ద్వేషావేశముతోడ బాఁద శివుఁ డెం ♦ తే వానిఁ దప్పింపుడున్
రోషంబున్ గొని భిక్షులింగమును వా ♦ ర్గూలన్ శపింపన్ శివుం
డీషత్తుల్గక లింగమున్ బెఱికి వా ♦ రీక్షింప వైచెన్ ధరన్. 303

### —* శివలింగము మునులను బాధించుట *—

ఆ॥ మునులు సూచుచుండ ♦ భోగిభూషణుఁ డదృ, శ్యతను జెందె నంత ♦ జటులలింగ
మేచి భయదమగుచు ♦ హెచ్చుగు జ్వాలల, నింగిముట్టి మునుల ♦ నిగిడి చుట్టె.

ఉ॥ వారు భయంబునొంది త్రిది ♦ వంబు మొదల్గలచోట్ల కేగ న
వ్వారల వెంటనే యదియుఁ ♦ బాయక యేగి దహింపఁజొచ్చినన్
భూరివిషాదతప్తులయి ♦ పొక్కుచుఁ బద్మజుఁ జేరఁబోయి య
గ్గోరము నెల్లఁ దెల్ప విని ♦ గొబ్బున నాతఁ డెఱింగి సర్వమున్. 305

చ॥ వరదుఁడు భక్తలోలుపుఁడు ♦ భర్గుఁడు మిమ్ము ననుగ్రహించుకో
సరము భవద్గృహంబులకుఁ ♦ జక్కఁగవచ్చిన మీరు క్రిందుమీఁ
దరయక తూలనాడి పర ♦ మాత్మున కెగ్గొనరించి యిట్టి దు
ర్భరమగు చెట్టనొందితిరి ♦ రక్షకు లెవ్వరికన్ మలీమసుల్ ! 306

సీ॥ మిట్టమధ్యాహ్నమం దెట్టి ♦ చెట్టగాని, యిరవుఁ జేరఁగ నాతిథ్య ♦ మీవలయును
నందు సర్వేశ్వరుఁడె యటు ♦ లరుగుదేర, మొరటులై గీడుచేసితి ♦ రెఱుకఁదప్పి.

క॥ సిరిరా మోకాలొడ్డిన, తెఱఁగున మీరెంత యేనిఁ ♦ దేఁకువ సెడి వే
గిరపడి యభ్యుదయంబును, గరముఁ జెఱచుకొనిన వారు ♦ కార్పణ్యమునన్.

క॥ అని యీసడింప గోడున, వనరుచు దిక్కెవ్వె యవియె ♦ వహ్నిజ్వాలల్
గను మాహుతియగుదుము నీ, కనుకంప జనింపకున్న ♦ నరవిందభవా !

క॥ అని యగ్గికగ్గమగు న, మ్మునిజనులన్ గాంచి యజుఁడు ♦ భూరితరకృపన్
గొనకొని జతనము నారసి, యనె నిట్టుల జడుపు నుడిపి ♦ యతివేగమునన్.

మ॥ శివ నర్థింపుఁడు వేగ యీశ్వరి కృపా ♦ శీలాత్మ గుహ్యాకృతిన్
శివలింగంబును దాల్చి ప్రోఁచు నితర ♦ స్త్రీలజ్జాల రాలింగమున్
శివ గుహ్యాకృతిఁ జెంద నందు నిలుపన్ ♦ జేట్పాటు దప్పున్ వడిన్
భువనంబుల్ సుఖమొందు లాఁతి తెఱఁగేల్ ♦ బోదార్తి యొందేగినన్. 311

వ. అంతదనుక

గీ॥ అష్టదళమేసియొకకుంభ ♦ మచటనునిచి, పంచపల్లవములను దూ♦ర్వాయవాంకు
రములఁ జేరిచి గంగోద ♦ కముల నింపి, వేదసూక్తుల మంత్రించి ♦ వినయమెసఁగ.

క॥ నతిఁజేసి లింగమునకున్, శతరుద్రీయమున నీట ♦ స్నాతమొనర్పన్
హితమతితో లింగం బీ, గతినిఁదొరఁగి శాంతి నించు♦కన్ గాంచు వెసన్.

### —* సముచితార్చనచే శివలింగంబు శాంతిజెందుట *—

వ. అటుమీఁద నేఁ జెప్పినయట్లు పరమేశ్వరీ పరమేశ్వరుల సేవించి తత్కృపాను
భావంబున లింగమునకు శాంతిఁగూర్చి యీభంగంబుఁ బాయుఁడనిన మునులు

పరమేష్ఠిఁ బురస్కరించుకొని తదుక్తప్రకారంబున జగన్నిదానులగు మహేశ్వరీ మహేశ్వరుల నర్చించిన నవ్వార లిద్వరు దయామయులై పొడసూపి రందుఁ బరమేశ్వరియోనాకృతిఁ శివలింగంబు నాకర్షింప నయ్యది యందుఁజేరి సుప్రతిష్ఠితంబై శాంతిఁజెందె నంత మును లా యుమామహేశ్వరాత్మకంబగు లింగంబుఁ బూజించి మ్రొక్కి యిట్లనిరి.

చ॥ ఎఱుఁగక తప్పుఁజేసినను ♦ నెంతయుఁ గూరిమి పేర్మిఁ నిట్లు లా
దరమునఁ బ్రోచు టెంతటి యు ♦ దారమనంబొ? ప్రశంసచేయఁగా
దరమొకొ! మాదృశాజ్ఞులను ♦ దర్పకశాసక! దేవదేవ! సీ
శరణము నొందినార మవ ♦ చారసహస్రములన్ క్షమింపుమా! 314

క॥ తలిదండ్రులు లోకమునకుఁ, దలిదండ్రులు సర్వదేవ ♦ తాతతి కీరల్
తలిదండ్రులౌట మాకటు, గలుషాత్ముల మమ్ము నెమ్మిఁ ♦ గాచితిరి ప్రభుల్!

గీ॥ అని నుతులుచేయుచున్న మ♦హర్షివరుల, కీశ్వరేశ్వరు లభయంబు♦నిచ్చి వేగ
నంత నంతర్ధినొందిరి ♦ యఖిలసురలు, చేరి లింగంబు నర్చన ♦ చేసి రపుడు.

ఆ॥ ఆ యుమామహేశ్వ♦రాత్మకంబైన యా, లింగ మద్ది శివుల ♦ లీల మెఱయ
హాటకేశలింగ ♦ మని పేరుచెంది లో, కముల నోముచుండెఁ ♦ గరుణతోడ.

వ. మునులుఁ బరమేష్ఠియు నిజనివాసంబులఁజేరి సుఖంబుండి రీయదియే లింగోత్పత్తి కారణంబనియు నీ లింగరూపంబును నెల్లలోకంబులవా రర్చించుచుండిరనియుఁ జెప్పెదురిఁక మఱికొందఱు విజ్ఞమూర్ధన్యు లిట్లు వేఱుతీరు చెప్పెదు గారయుఁడు.

క॥ హరుఁ డాద్యంతంబులఁ దాఁ, బొరయక చెలువొందు నట్లె ♦ పొంకపు సిరి సే
కుఱ లింగము తుదమొదలులఁ, దొరయకయున్నందునఁగొలు♦తురు ప్రతికృతిగాన్.

క॥ తొల్లి విధి విష్ణులకు సని, పెల్లగుడు నఖండదివ్య ♦ పృథులింగంబై
డిల్లఁబడఁజేసి వారలఁ, జల్లార్చెదదాజి శివుఁడు ♦ జగములు మెచ్చన్. 320

వ. ఇట్లు లింగోద్భవంబుమొదలెల్లలోకంబులవా రఖండంబగునట్టి లింగంబు నర్చించుచుండి రిది లింగస్వరూపచరిత్రం బిఁకేమడుగుదురన శౌనకాదులు సూతునికిట్లనిరి.

—* లిం గో ద్భ వ చ రి త ము *—

క॥ అవ్వనజాక్షున కజునకుఁ, జివ్వపొసఁగ శివుఁడు గడిఁది♦సిరి లింగంబై
యవ్వారి పోరువాపిన, యవ్వాసి నెఱుంగఁజెప్పు♦మయ్యా! యఖిలమున్. 322

మ॥ అనుడున్ సూతుఁడు హర్షమొంది మునులా ♦ రా! చెప్పెదన్ విశ్వభా
వనుఁడౌ శర్వుని మేలిలీల వినుఁడీ ♦ పద్మోద్భవుం డొక్కవే
ళను రాయంచను నెక్కి యుక్కున సురల్ ♦ శంసాధ్వనుల్ సేయ లో
కనికాయంబును జూచువేడ్కఁ దరలెన్ ♦ గాంతాసమేతంబుగాన్. 323

చ॥ చనిచని దుర్ధరోచ్ఛ్రతర ♦ చండకరాది గరిష్ఠమండలీ
ఘనవిలయోర్ధ్వసప్తఋషి ♦ కౌశలపేశలతాపసస్థలీ
కనదురుగాంగతుంగతర కమ్రి ♦ తరంగసమర్పితాంబుపా
వనవనజాత గంధవహబాలక ♦ జాలక మండలంబులన్. 324

క॥ చరియించుచు నటనట ని, ర్ఝరతల్లజులోసఁగునట్టి ♦ సత్కారములన్
బరిమోదంబునఁ బడయుచు, గరమానందంబెసంగఁగా ♦ నలరుతఱిన్. 325

ఉ॥ అంతకుమున్న సారసద ♦ ళాక్షుఁడు చక్రి రమా సమేతుఁడై
యెంతయు వేడ్కఁ బక్షిపయి ♦ నెక్కి యిటుల్ భువనంబు లన్నియున్
బంతుగఁ జూచిచూచి నిజ ♦ వాసముఁ జేరఁగఁ బోవుచుండఁగా
నంతట దైవయోగమున ♦ నంబుజసంభవుఁ గాంచె నొక్కచోన్. 326

—* బ్రహ్మ విష్ణుల కలహము *—

చ॥ కని ముదమొంది పుత్రకుని ♦ గారవమున్ బొనరంగ డాసి నం
దన! సుఖమే? యటన్నఁ గడు ♦ దర్పముతోడుత సర్ప మట్లు చి
వ్వునఁ గినుకన్ వచించె నిటు ♦ పోటుతనం బిది యేటికోయి? నీ
తను విదె కూల్తునా హరియుఁ ♦ దద్దయు నాగ్రహపూరితాత్ముఁడై. 327

చ॥ కొమరుఁడవంచు నాకుఁ గడుఁ ♦ గూర్చెడు చుట్టమవంచు మించుకూ
రిమి నినుఁ బల్కరించఁగ మతిన్ మఱి ♦ మీఱి దురుక్తులాడెదే?
రమ యలుగంగనీ భువన ♦ రాజి గలంగఁగనీ దురాత్మ! మ
స్తము నిదె ద్రుంచివేసెదను ♦ జక్కఁగఁ గన్గొది చక్రధారచే. 328

వ. అనిన సురజ్యేష్ఠుం డిట్లనియె.

చ॥ తనుజుఁడ నెట్లు నీ కనుచి ♦ తంబని యెంచక మాటిమాటికి
ట్లనెదవు కశ్యపాత్మజుఁడ ♦ వర్భక! యేను బితామహుండ నీ
కనిశము పూజనార్హుఁడ స ♦ మస్తము విస్మరణం బొనర్చి డీ
కొన గమకించ దే? యయినఁ ♦ గొంకక నిల్వుము చెల్వు సూచెదన్. 329

క॥ మఱియును సర్గాదిని నే, గఱువతనం బమర వికచ ♦ కమలదళాక్షా!
యఱివుగ సృష్టియొనర్చితి, నెఱుఁగవె యీభువనజాలమెల్ల మనమునన్. 330

క॥ అనుడు హరి యదితిపుత్రుల, వనటను బొనడపఁ దలఁచి ♦ వాస్తవముగ నం
శను నొక్కఁడు గైకొనినం, దనధర్మము నట్లు చెంది ♦ నాఁడ నదితికిన్. 331

వ. ఇంకను

క॥ నను సర్గాదిని బుట్టిం, చినవాఁడవె? మధుసూదనముఁ ♦ జెంది యిటుల వె
న్కనుముందుఁ గనక వాగెదు, పసువాఁడా! మన్నాభిపద్మ♦మందుఁ బొడమియున్.

వ. అనిన నతండును

క॥ నేనును సష్టి చెందితి, నీనలినోదరమునందు ♦ నీరజనేత్రా!
కానక పరపరిమాణము, సూనుఁడ సూనుఁడ యటన్నఁ ♦ జొప్పడునెట్టుల్. 333

క॥ నీకొక్కనికేగాక నృ,లోకమునకు సర్వదివ్య♦లోకమున కహీ
ళ్లోకమునకు సర్వమునకు, శ్రీకాంతా! కర్తనేను ♦ సిద్ధము వినుమా! 334

చ॥ అన నవు డేను నేనలఁతి ♦ వల్లుఁడ నిల్వుమునిల్వు త్రిళ్ళుడం
తును నదియేనొనర్తు నని ♦ దోర్బలగర్వవిఘూర్ణితాస్యుఁడై
యనికిఁ గడంగి యంపఁగమి♦నార్చుచుఁ బేర్చుచుఁ గ్రిమ్మరింపుచున్
వెను గనకే యహర్నిశలు ♦ వేలకువేల్ వెడలించి రబ్దముల్. 335

క॥ వైరించులు వైష్ణవులును, సారెకు బలదర్పవేగ ♦ శౌర్యోన్నతులన్
మీఱుచుఁ బోరుచునుండిరి, భూరితరగదాసికుంత♦పుంజంబులచే. 336

క॥ వారల సమరముఁగన దై,వాతెను వేడుక సుపర్వ♦వర్యులు చదలన్
జేరి విమానంబుల న,వ్వారల వారలను గనుచు ♦ వర్తిలి రెలమిన్. 337

ఉ॥ దానవసూదనుం డపుడు ♦ తద్దయుఁ గ్రొద్ధతమీఱి ధాతపైఁ
గానఁగ రానియట్లు శర♦కాండములన్ బరఁగింప నాతఁడున్
మానక విష్ణువక్షమున ♦ నాటఁగ నింపెను మేటిభల్లముల్
మానసమందు వేల్పు లస♦మానమహాద్భుత మొంది రోలిన్నై. 338

మ॥ అంతన్ దైత్యకులాంతకుండును మహా♦శాస్త్రంబు యోజించి దు
ర్దాంతుండై పరమేష్ఠిపై విసర ను♦గ్రస్ఫూర్తిఁ బద్మోద్భవుం
డెంతేనల్క వహించి పాశుపత మ♦స్త్రేశంబు బిట్టేయఁగా
గంతుల్ వేయుచు వేయితీర్లవియునుం ♦ గాటంబుగాఁ బోరుఁడున్. 339

క॥ పదివేల వివస్వంతుల, నొదవెడు తేజంబు పొదల ♦ నుస్వోత్తుగ న
ప్పదనున నస్త్రద్వయమది, కదనముసేయంగ బెదరుఁ ♦ గాంచి నిలింపుల్. 340

ఉ॥ అక్కట! బ్రహ్మవిష్ణు లిటు ♦ లంతముగానని యాజినొంది యి
ట్లెక్కువయైన నస్త్రముల ♦ నేసిరి వాసిదొలంగి లోకముల్
నిక్కము వీని మంటలకు ♦ నెట్టనరూపఱు నిష్టె మేము నీ
యుక్కుకుఁ జత్తుమంచుఁ గడు ♦ నుక్కిరిబిక్కిరియాచు నార్తతన్. 341

చ॥ కలఁడుగదా మహేశ్వరుఁడు ♦ కాలహరుండు హరుండు సర్వమా
యలఘునిచేత నే పొడము ♦ నట్టులె పెంపగు నాశమొందుఁ గ
న్నుల కగుపట్టకే చను న♦నుగ్రహమొందును సర్వకార్యకౌ
శలుఁడు దయామయుం డతని ♦ సన్నిధి కేగి వచింత మీస్థితిన్. 342

—* దేవతలు శివునితో బ్రహ్మ విష్ణువుల పోరు మాన్పుమని యర్థించుట *—

చ॥ అని మది నిశ్చయించుకొని ♦ యా నిముసంబున రాజతాద్రికిన్
జని వడి నందిసెల్వుఁగొని ♦ శంకరు సానతశంకరున్ దయా
ఘనుఁ గని జోతచేసి యజ♦కంజదళాక్షుల ఘోరజన్యమున్
జనముల యార్తిసిన్ దెలిపి ♦ సత్వరశాంతినిఁ గోర భర్తయున్. 343

ఉ॥ ఇంతకుమున్నె యారయుదు ♦ నీ సమరంబును లోకదుఃఖమున్
జింతిలుచుంటి దీనికయి ♦ చెన్నఁటులై యల వార లిర్వు రి
క్లెంతయు వంతఁగూర్చి రిఁక ♦ నే నడగించెద వీరిగర్వమున్
బొంతముమీఱ లోకసుఖ♦మున్ బొనరించెద దేవపుంగవుల్ ! 344

వ. అని వక్కాణించి.

సీ॥ డమరుకభేరీప♦టహకాహళమృదంగ, వేణువీణాధ్వనుల్ ♦ వెలసి మ్రోయ
చిత్రధ్వజంబులు ♦ సింగారపుంజామ, రములు వీవనలొంది ♦ ప్రమథులమర
నలుదిక్కులందును ♦ నాల్గుప్రామినుకులు ♦ నొడికారమొప్ప స♦న్నుతులు సేయ
కై దండఁజేకొని ♦ కాదంబవనరాజ్ఞి, జగదంబ దాపల ♦ సందడింప.

గీ॥ పలువిధములగువాహన ♦ ప్రతతులొంది, పొందుగా గణపాలురు ♦ ముందునడువఁ
బంచమండలయుతమును♦బ్రణవరూప, మైన తేరెక్కి శివుఁడు ప♦యనమొనర్చె.

ఉ॥ కత్తియుఁ గత్తళం బమరి ♦ కన్ ధరియించి శిలాదసూతి బల్
హత్తిన వేడ్కఁ బారిషదు ♦ లన్ గణపాలురఁ జక్కఁజేయుచున్
మిత్తికిమిత్తియౌ శివుని ♦ మేలిమిసన్నలతోఁ బ్రియాణ ము
ద్వృత్తరథంగఁగూర్చెఁ దృటి ♦ యందు రణోర్విని జేరి రందఱున్. 446

వ. తత్కాలంబునందు శివుండు తన జనంబుల నెల్ల నించుక దవ్వులనే నిలిపి,

—* తేజోలింగోద్భవము *—

గీ॥ అమ్మహేశాస్త్ర పాశుప ♦ తాస్త్రజనిత, ఘనతరజ్వాలలను హరి ♦ కమలభవులఁ
గాంచి వాద్యధ్వనులను జా♦లించిమించి, యగ్నిలింగమై యచ్చట ♦ నవతరించె.

కం॥ అగ్నిస్తంభాకృతి ను, ద్విగ్నుల వగనడఁప విష్ణు♦విధుల యహమికన్
భగ్నముసేయఁగ గరుణా, మగ్నమతిన్ లింగమై య♦మరె శివుఁడంతన్. 348

గీ॥ ఆ మహేశాస్త్ర పాశుప ♦ తాస్త్రములు జ
వంబుతో నష్టె యగ్నిలిం♦గంబుఁ జెంది
యందె యంతర్ధిఁ జెందెఁ బ♦ద్మాక్ష పద్మ
భవులు లింగంబు నాకృతి ♦ పాఱఁజూచి. 349

చ॥ తుద మొదలుం గనన్ బడవు ♦ దొడ్డగ నాకస మంటియుండె ని
య్యది హరియించె నస్త్రముల ♦ నారయఁగాఁదగు నాది యెచ్చటో
యెదియొకో యంత్యభాగమని ♦ యిర్వురు చాల దిదృక్షఁ జేసి య
య్యదనున నే ప్రయాణము ర ♦ యమ్మునఁ జేసిరి వాసి మీఱఁగన్.

ఉ॥ అంచ యొకండుగా నమరి ♦ యంతుఁగనన్ జదలొందుచుం బ్రయ
త్నించెను నల్వ యల్లె కిటి ♦ దేహముఁ జెంది మొదల్ గనుంగొనన్
గాంచనచేలుఁ డంతయును ♦ గాశ్యపిఁ ద్రవ్వుచుఁ బోవుచుండె న
ట్లెంచఁగరాక వత్సరము ♦ లెన్నియొ దాటుచునుండెఁ బర్వనన్, 351

శా॥ పెక్కుల్ వర్షము లిట్లు విష్ణుఁడు ధరన్ ♦ భేదింపుచున్ బోయి తా
నక్కాలాంతకలింగమూర్తి యరుదౌ ♦ బానున్ గనన్ దక్కి తా
నుక్కున్ గోల్పడి చిక్కి వేమరలి యా ♦ యూర్ధ్వోర్వినిన్ జేరి స
మ్యక్కౌశల్యమతిన్ వసించె మది వి ♦ శ్వాత్మున్ శివున్ మెచ్చుచున్. 352

క॥ ఎగిరి యెగిరి బమ్మయుఁ దా, నగణితమగు నంబరమున ♦ నరిగి యరిగి యెం
దగుపట్టక లింగాంతము, మిగిలియె యలరుటను గాంచి ♦ మిడుకుచునుండన్. 353

గీ॥ కేతకీపువ్వు మొక్కండు ♦ ధాతకప్డు, గానుపట్టుడుఁ బలికించి ♦ కరము మురిసి
దళసిపుష్పేశ! యెటనుండి ♦ తరలితీవ, నుడునదియు లింగమధ్యంబు ♦ నుండియనియె.

క॥ మొదలెక్కడ? యన నాతని, కదియనె నేనెఱుఁగ నీవు ♦ నారయలే వీ
వెదకుమదిఁ గట్టిపెట్టుము, పదిలంబుగ నిల్లుఁ జేరు ♦ పద్మజ! యనినన్. 355

ఉ॥ సాప్తపదీన మండ్రు విను ♦ సఖ్యము నెచ్చెలివైతి వీవిఁకన్
గోప్తవుగమ్ము రమ్ము ధర ♦ కున్ శివమస్తముగంటి నందు నీ
వాప్తతమీఱ సాక్షివయి ♦ యద్దినిజంబనిపల్కి నాకు సం
తృప్తియొనర్పుమన్నఁ దలఁ ♦ డిప్పెను ద్రోయఁగలేక యద్దియున్. 356

—* లింగశిరంబుఁ జూచితినని బ్రహ్మ బొంకుట *—

ఉ॥ అంతఁ బితామహుండును బ్రి ♦ యమ్మునఁ బృథ్విని జేరి వీఱి యం
దంతకుమున్నె యున్న కమ ♦ లాక్షునిఁ గన్గొని పల్కెఁ గంటి లిం
గాంతము కేతకీసుమము ♦ నారయఁ డీయదిసాక్షిఁ యన్న నా
ద్యంతయుఁ గొంకకట్టులది ♦ పల్కుటకుల్కి సరోజనాభుఁడున్. 357

ఉ॥ ఓడితి ధాత! నీవ కడు • నుత్తమమూర్తివి పూజసేతు నేఁ
జూడఁగలేదు మూలమన • శూలధరుం డట దోఁచియెక్కడో
వేడుకతోఁ బ్రసాదమును • వెన్నునిపై వెలయించి ధాత య
క్కాడని చెల్వుపైఁ గినిసి • క్రుద్ధత శ్రేష్ఠమహోజవంబునన్. 358

శా॥ భూమిమధ్యంబుననుండి భైరవు మహా • ప్రోచ్చండహుంకారలీ
లామాద్యద్రవు వెల్వరింపఁ నతఁడు • ల్లాసంబునన్ ఫాలమున్
భూమిన్ సోఁకఁగ మ్రొక్కి యెక్కవని కే • పున్ మీఱ శాసింపు దే
వా! మోదంబునఁ గూర్చు నొక్కనిముసం • బం దిప్పె వేగోన్నతిన్. 359

*గీ॥ అనుడు శివుఁడిట్టులనె వత్స!•యరయువిధిని, జగములకుఁ దొలివేల్పును•జంకకితని
వాఁడియసిధారఁగోలువు జ•వంబుమీఱ, ననుడువిధికైశ్యమున్ బట్టి•యతఁడు వేగ.

క॥ ఏ శిరసున బొంకాడెనొ, నా శిరసున్ జఱపి తక్కి • నశిరంబులనున్
నాశము సేయఁగఁ గడు నా, వేశముతోఁ గత్తి నెత్తి • విధి యార్తుండై. 361

చ॥ మదమును బాసి "భోవరద! • మాం కరుణాకర పాహి" యంచుఁ ద
త్పదములవ్రాలె వెన్నుఁడును • భర్గునిఁజేరి నమస్కరించి పెం
పొదవఁగఁ గావు మింక నజు • నూడఁగఁజేసితి పాపమస్తమున్
సదయుఁడ! నీవుగా కెవరు • సాఁకఁగలా రిటు లార్తపాలనా! 362

గీ॥ అని నుతించినయంత దే•వాధినాథుఁ, డపుడు భైరవు వారించి • యజునకనియె
గొప్పపోసరమై యిట్లు • తప్పుదారి, త్రొక్కితివిగాన నిప్పుడీ • పొక్కునాపె,

—* శివుడు బ్రహ్మను శపించుట *—

ఉ॥ ఇంతియకాదు నీకు గుడి • యెవ్వరు గట్టరు పూజసేయఁబో
రెంతయుఁ దావకోత్సవము • లెవ్వరునున్ బొనరింప రింక య
జ్ఞాంతములందుఁ గర్మనిచ • యాంతములందును నీకుఁ బూజఁ గా
వింతురు లేకయున్నఁ జెడు • విశ్వమునన్ సకలక్రియాంతతుల్. 363

వ. అని యట్లఖిలేశ్వరుండు బ్రహ్మయెడ నిగ్రహానుగ్రహంబులు జఱపి కూటసాక్షి
యగు కేతకిం గాంచి కసరి యిట్లనియె. 365

క॥ కేతకి! యంహోభీక,ఖ్యాతికి వెనుకొనక కల్ల • లాడితి విట్టుల్
పాతకి! నిను నేఁ దాఁకను, నీతముగా నామపూజ • నీకు వెలియగున్. 366

క॥ అని శపియించినఁ గేతకి, మనమున నారటము నొంది • మన్మథహరుఁ గ
న్గొని దేవర! క్షమియింపుం, డనదపయిన్ గినుకదగునె • యధిపున కెందున్.

---

* శివపురాణే - విద్యేశ్వరసంహితాయాం అష్టమాధ్యాయే - శివః.
శ్లో॥ వత్స సోఽయంవిధస్సాక్షా । జ్జగతాం మాద్యదైవతం । నానమర్చయఖడ్గేన । తిగ్మేన జవసాపరం॥

గీ॥ నలువ మోహమాటమునఁ జెట్ట ♦ నాకుఁ బోడమోఁ, జాపలంబునఁ దవిలి యు♦సత్యవచన
మాడితిని నేను మన్నించి♦యభవ! కరుణఁ, బఱపు శాపంబుఁ ద్రిప్పుము♦గరిమ దనర.

చ॥ అని యిటు నేలఁ వ్రాలి శర ♦ ణాగతుఁడై బ్రతిమాలు కేశవున్
గని హరుఁ డిట్లనెన్ దృఢము♦గా నిను దాఁకను నేను మట్కుటుం
బినియుఁ దనూజులున్ బ్రమథ ♦ వీరులు దాల్తురు పొమ్మనెన్ ముదం
బునుగని యంత నయ్యదియుఁ ♦ బోయెను శంకరులీలఁ బాడుచున్.

## —* బ్రహ్మవిష్ణ్వాదులు తేజోలింగంబుఁ బూజించి వరములొందుట *—

గీ॥ అపుడు హరియు విరించియు ♦ నఖిలదేవ, గణము లర్చనవస్తువ ♦ ర్గంబుఁ గూర్చి
యభవలింగంబుఁ బూజింప♦నాదరమున, హరుఁడు వరమిత్తుఁ జెప్పుఁడన్న ♦నలరి వారు

క॥ ఈలీల దేవవల్లభ!, యీలింగాకృతిని నలరు♦మిట నిచ్చలునాఁ
బాలింపుమడి శివుఁడు తే, జోలింగమనంగ నుండు ♦ సూక్ష్మాకృతినై. 371

వ. అనాద్యంతంబగు నీయాకారంబును మాటుపఱచి సూక్ష్మలింగంబునై యఖిల
జనార్చనంబులఁ గొనుచు నెల్లలోకంబులవారికి భోగమోక్షంబు లిచ్చుచుండును.
అగ్నిపర్వతసదృశంబైన లింగంబునైతిఁ గావున నీక్షేత్రం బరుణాచలంబనంబడు.
మార్గశీర్షార్ద్రానక్షత్రంబున నుద్భవించుటఁ జేసి యిందు మార్గశీర్షార్ద్రయందు
నన్ను దరిసించినవారు నాకుఁ గుమారతుల్యులై యొప్పుదురాదినంబున నన్నుఁ
బూజించినవారలు వాగగోచరంబగు ఫలంబు నొందుదురు. మఱియిందలి దాన
హోమజపంబులు కోటిగుణితంబులై ఫలంబు లొసంగు మామకీనంబులగు
క్షేత్రంబులందెల్ల నిది శ్రేష్ఠతరంబై విరాజిల్లుచు జనంబులకెల్ల స్మరణమాత్రం
బున మోక్షసాధకంబై వెలయునని నొడివి పరమశివుండంతర్ధానంబు నొందె
నంత హరివిరించి ప్రముఖ నిఖిలసురలును మురియుచు నాలింగమునర్చించి తమ
ధామంబులఁ జేరి రీలింగోద్భవచరిత్రం బెవ్వరేనిఁ జదివిన వినిన నవ్వారికిఁ బర
మేశ్వరుండు సకలశ్రేయంబు లొసంగునను మునులు సూతునకు మహాత్మా!
మున్ను శివలింగంబు నర్చించి శ్రేయోబలంబులఁ గొన్నవారెవ్వరో యట్టి వారిని
వరుసగా వినఁదలతు మెఱిఁగింపుమనుటయు సూతుం డవ్వారికిట్లనియె.

## —* శివభక్తానుక్రమణిక *—

క॥ రమతో హరియును వాణీ, రమణీమణితోడ నజుఁడు ♦ రహిని వశిష్ఠా
దిమునులు సధర్మిణులతోఁ, గమలహితాహితులు మున్ను♦గాఁగలగ్రహముల్.

క॥ కుంభభవుఁ డాత్మసతితో, జంభారిప్రముఖులైన ♦ సర్వదిశీశుల్
కుంభినికి గంగఁ దెచ్చిన, యంభోజజనిభుఁడు గౌత♦మార్యుఁడు సతితోన్.

సీ॥ దూర్వాసుఁడును నల ♦ యౌర్వుండు నారద, ముని బృహస్పతి శక్తి ♦ ముని పరాశ
రమునియు నల్లపా ♦ రాశరి శుకుఁడును, భార్గవుండు దధీచి ♦ గర్గఋషియు
వామదేవుఁడుయాజ్ఞ ♦ వల్క్యుండు జైమిని, యుపమన్యుఁడునుశిలా ♦ దోగ్రమూర్తి
నందికేశ్వరుఁడు సా ♦ నందుఁడత్రిమృకండ, మునియు మార్కండేయు ♦ మునియు గాథి

గీ॥ జుఁడును జమదగ్ని పరశురా ♦ ముఁడును శ్వేత
కేతుఁడును శౌనకాది వి ♦ ఖ్యాతఋషులు
లింగపూజను సల్పి సి ♦ ద్ధింగనిరి మ
హామహులు వారిఁ దలఁచిన ♦ నఘము వోలఁగు. 375

క॥ మఱి యష్టవసువులును దుం, బురుఁడును గంధర్వసాధ్య ♦ ముఖులెల్లరు గి
న్నరులును జారణులును గిం, పురుషులు శివలింగమూర్తిఁ ♦ బూజించి రొగిన్.

క॥ నరనారాయణఋషులు బ, దరికాననమందుఁ దనరి ♦ దారుణనిష్ఠన్
బరమేశ్వరలింగంబును, నిరతమునున్ గొలుచుదురు ము ♦ నివరేణ్యమణుల్!

గీ॥ శేషవాసుకి తక్షకుల్ ♦ శ్రీపవాహ, నంబయి యొసంగు నల సుప ♦ ర్ణప్రభుండు
ఘనుఁడుస్వాయంభవుండనౌ ♦ మనువునంబ్రి,యవ్రతుండునునాతని ♦ యనుజుఁడెలమి

వ. మఱియు నౌత్తానపాది యగు ధ్రువుండును వృషభుండును భరతుండును శివలిం-
గంబులఁ బూజించి సిద్ధులంగాంచి రిఁకను. 379

చ॥ మునుకొని యా హిరణ్యకశి ♦ పుండు తదాత్మజుఁడున్ విరోచనుం
డనఘచరిత్రుఁడైన బలి ♦ యాతని పుత్త్రుఁడు బాణదైత్యుఁడున్
ఘనుఁడగు రావణాసురుఁ డ ♦ కల్మషుఁడైన విభీషణుండు నిం
పున శివలింగపూజనముఁ ♦ బూన్కి నొనర్చి రనారతంబునున్. 380

సీ॥ వైవస్వతమను వి ♦ క్ష్వాకు కకుత్స్థ మాం, ధాతలు ముచికుంద ♦ ధరణినాథుఁ
డా హరిశ్చంద్రమ ♦ హారాజు కల్మాష, పాదుండు సగరభూ ♦ పాలకుండు
అల భగీరథుఁడు ఖ ♦ ట్వాంగుండును దిలీప, నృపుఁడు రఘుం డజ ♦ నృపతి దశర
థనృపాలకుండును ♦ దాశరథియు నను, జులును దత్పుత్త్రులు ♦ సూర్యవంశ

ఆ॥ రాజవర్యులెల్ల ♦ రాజవంశాగ్రణి
యగు పురూరవుండు ♦ నసముఁడైన
నహుషుఁడును యయాతి ♦ నలుఁడుఁ జంద్రాంగదుం
డల్ల పాండునృపతి ♦ యతనిసుతులు. 381

క॥ శ్రీకృష్ణుఁడు ప్రద్యుమ్నుం, డా కృష్ణునిఁ జెనయు సాంబుఁ ♦ డల్లజనకసు
శ్లోకనృపాలుండు వర, శ్రీకజరాసంధనృపతి ♦ శేఖరుఁడెలమిన్, 382

వ. వీరువా రననేల? సుప్రసిద్ధమహాపురుషు లందఱును దత్పూజకులును. 383

క॥ శివలింగపూజనంబును, నవధానముతోడఁ జేసి ♦ యా యా సిద్ధుల్
వివిధసుఖంబుల ముక్తిని, భవమును నార్జించి రట్లు ♦ పావనచరితుల్. 384

వ. ఇఁక నేమి వినఁగోరుదు రనిన సూతునకు దయాళూ! తనివిచాలదింకను గొన్ని లింగవిశేషంబుల నెఱింగింపుమనుటయు సూతుండు మునుల కిట్లనియె. 365

## —* అంధకేశ్వరలింగచరిత్రము *—

ఉ॥ సాగరతీరమందు నొక ♦ చండబిలంబున నంధకుం డనా
వేఁగగు రక్కసుం డొకఁడు ♦ వీరుఁడు సర్వసురాళిఁ గొట్టి త
ద్భాగతసర్వసంపదలఁ ♦ బూర్తిగఁ గైగొని యెల్లవారలన్
గాఁగఁగఁ జేసి తద్ధనముఁ ♦ గావలుఁడై కొనుచుండె నుద్ధతిన్. 386

క॥ పవలున్ రాతిరి గర్తము, న వసించుఁ దదీయ హితజ♦నంబులతోడన్
వివిధజను లులుకుడుదు రా, నన్నుఁ జేతెంచునొకో యని మ♦నంబుల నెపుడున్.

వ. అంతఁ గొంతకాలంబు చనినంత,

ఉ॥ దేవతలంతగూడి కడుఁ ♦ దెంపుమెయిన్ శివుఁ జేరి మ్రొక్కి య
క్కావలుఁడైన యంధకుని ♦ ఘాతుకరీతినిఁ దెల్పి యుక్తిలున్
జావఁగఁ జేసి లోకముల ♦ సాఁకుదునాగ ననంగశాసనుం
డా వగఁ బాపఁగోరి దను♦జాగ్రణి ధామముఁ జేరి ధీరతన్. 388

క॥ సురల ననికిఁ బురికొల్పిన, హరునాసర వారు దురము♦నం దంధకునిన్
దఱుముడు దనుజుఁడు గర్తముఁ, దఱియగఁ జన హరుఁడు వాని♦దర్పంబడఁగన్.

సీ॥ లాఁగిశూలంబెవన్ గుచ్చి♦ లావుసెడి ద, నుజుఁడుగూలుటఁగని సుర♦వ్రజమువాని
యంత్యదశనీదు దరిసెనం♦బను రేఁగాన, వాని ధన్యునొనర్పు కృ♦పానిధి! యన.

వ. దయార్ద్రహృదయుండగుచు మహేశ్వరుం డద్దైత్యుంగాంచి నీవేమి వాంఛింతు విచ్చెదఁ దెలుపుమనిన నవ్వాఁ డిట్లనియె. 391

క॥ నాపేరట లింగమ్మై, యీ పారావారతీర ♦ హృద్యస్థలియం
దోవరమేశ్వర! వెలయుము, నీ పరమకృపావిభూతి ♦ నెగసి వెలుఁగఁగాన్.

వ. అనిన శంకరుం డామోదించి వానిదేహము నాగర్తమందుఁదోచి తా నందు నంధకేశలింగం బను పేరితో వెలసె నంధకుండు శివసాయుజ్యంబునొందె నిఁక నా యంధకేశలింగంబు త్రిభువనపూజ్యంబై యెసంగె నా లింగంబు భక్తితో నాఱునెల లర్చించువారలకు సర్వసిద్ధు లొనగూడు, వృత్త్యర్థ మర్చించినవారు దేవలకశ్రేష్ఠులగుదురు. 393

## —* సుదర్శనుని చరిత్రము *—

చ॥ పరఁగ దధీచి నాఁగనొక ♦ బాపఁడు సంతత మంధకేశభా
స్వరతరలింగ మర్చనము ♦ సల్పుచు జీవనవృత్తికై యతం
డరిగె మఱొండు గ్రామమున ♦ కాత్మజు నచ్చోట నుంచి వాఁడునుఁ
సరవిగ లింగపూజనము ♦ సల్పుచునుండె యథాక్రమంబుగన్. 394

ఉ॥ పేరు సుదర్శనుం డనుచుఁ ♦ బిల్తురువాని, దుకూలనాఁగఁద
న్నారి నికృష్టవంశ్యయగు ♦ నాతుక పెన్మిటి నాత్మనశ్యునిన్
గారచియించె నాతఁడును ♦ గాంతకులోఁగి మెలంగుచుండు న
వ్వారికి నల్వురాత్మజులు ♦ వర్ధిలుచుండిరి యంతమీఁదటన్. 395

వ. కొంతకాలంబునకు సర్వజనసేవ్యంబును మహాపర్వంబును నగు శివరాత్రి
యరుదెంచిన. 396

గీ॥ ప్రొద్దుపొద్దున లేచియా♦భూమిసురుఁడు, శివునికోవెల కేగుచోఁ ♦ జెలువ యద్దు
కూల పెన్మిటి నోడిసి నన్♦గూడి సురత, సౌఖ్యమొసరించిపోవు మె♦చ్చటికినేని.

క॥ అని వేగ బలాత్కారం, బొనరించిన నాతఁడట్లె ♦ పొందుగ సౌఖ్యం
బొనరించి యంతగుడికిన్, జని యర్చనచేసె శివుని ♦ జనములు సూడన్. 398

వ. అంత శివుండు క్రుద్ధుండై.

ఉ॥ ఓరిదురాత్మ! కల్మష♦దోద్ధత! హేయచరిత్ర! నేఁడిటుల్
నారినిఁగూడి స్నానము నొ♦నర్పకయే ననుఁబూజఁ జేసితే?
ధీరత యెల్లఁ గోలుపడి ♦ తేజముమాలి జడత్వమొందుమా!
నారియునున్ మదంబఱి మ♦నంబునఁ గ్రుళ్ళునుగాక చెచ్చెరన్. 399

వ. అని శపియించిన నాతఁ డట్లే యున్మత్తుండయ్యెఁ దత్పత్నియునుఁ బరితపించు
చుండె నంత గ్రామాంతరముననున్న దధీచి యెఱింగి యాతురుండై వచ్చి కొడు
కున్ గాంచి కోడలి యవివేకకృత్యంబున కనుతాపంబొంది విషాదంబుతో.

గీ॥ శివుఁడొనర్చినశిక్షను ♦ శివవినాగఁ, బెఱలుదప్పింపలేరని ♦ ప్రియము మెఱయ
నంబికనుభక్తిఁగొలువఁగ ♦ నార్యయపుడు, వచ్చివరమిత్తుననుడు న♦బ్బాడబుండు.

చ॥ తనయునివృత్తమంతయును ♦ దాఁచకఁ దెల్పి యెటేని వాని వ్యా
ధినిఁ దొలఁగించి ప్రోవుమనఁ ♦ దేఁకువతో శివురాణి యట్లనే
యను శివుసాయ మర్థిఁ బడ♦యఁగవలె శంకరు నిష్ఠఁ గొల్వుఁడీ
యనఁగనె వార లీశ్వరుని ♦ నాదరమొప్ప భజింప నాతఁడుఁ. 402

సీ॥ వేగవచ్చిన శివయు న♦వ్విప్రసూను, దారకునొనర్చి శివుని యు♦త్సంగమందుఁ
జేర్చి ఘృతధారస్నాతునిఁ♦జేసి యొక్క, జన్నిదంబును మెడవైచి♦సత్వరమున.

క॥ శివగాయత్రీమంత్రము, నవిరళకృపఁ జెప్పి విభుని ♦ గార్గ్యా! స్వతనూ
భవు వీనిఁ గావుమనుడు న, భవుఁ డామోదమున ననియె ♦ బాలకుతోడన్.

సీ॥ భక్తులిల నాకొసంగిన ♦ వస్తురాజి, నెల్లఁ గొనుచుండు మఘము నీ♦కేమిగాదు
నాసమర్చనమున భవా♦నీసమర్చ, నమున ముఖ్యుండవగుచునుం ♦ డుముజగమున

క॥ ప్రాజాపత్యంబున నీ, భోజనమే సిద్ధిఁగూర్చుఁ ♦ బొసఁగకయున్నన్
రాజిల చావ్రతము సెడున్, యోజింతురుగాక యటుల ♦ నుర్విజనంబుల్.

క॥ స్నానము మఱవకు వర్ణుల, మానటులన్ దిలకముంచు ♦ మాస్యతలమునన్
మానకు మిఁక శివసంధ్య న, నూనమతిన్ నా సమర్చ ♦ నొనరింపు మొగిన్.

వ. ఇట్లయిన నీయఘమంతయుఁ దొలంగి భద్రింబగునని సర్వేశ్వరుం డనుగ్రహించి నంతఁ బరమేశ్వరియు నానందంబున వాని నంధకేశార్చనంబున నుంచి తత్పుత్రకుల నల్వురు వటువుల నాల్గుదిక్కులకు శివార్చనయందు నియుక్తులన్ జేసి వారల కభీష్టవరంబులిచ్చి యంతర్ధానంబునొందిరి. శివానుగ్రహంబున నవ్వారు విస్తరించి రిఁకఁ దపోవ్రతంబుల నెడఁబాసి దేవలకులనఁ బేరుంగాంచినారైన నీశ్వరశాసనంబునఁ జేసి వార లీశ్వరపూజయం దగ్రిణులైరి. ఆదియందవ్వారిపూజ గానియవ్వ డెవ్వారును బూజింపఁదగ దట్లు పూజించిరేని యప్పూజ నిరర్థకంబగు. మంచి యేనియుఁ జెడ్డయేనియు వటువును బరిత్యజింపరాదిఁక బ్రాజాపత్యవ్రతంబున నీ వటుభోజనంబు వ్రతసంపూర్తిన్ బొనరించు నద్దాని వినుం డంధకేశలింగ పరిసర పురంబందు భద్రుండను నొక్క నృపుండు.

క॥ ప్రాజాపత్యవ్రతమును, నోజన్ సలుపంగ శర్వుఁ♦డొక ధ్వజమిడి యా
భ్రాజద్ధ్వజము నుషస్సుల, రాజేంద్రా! యెత్తుమరల ♦ రాత్రులనొరగున్.

ఆ॥ వ్రతముఁ జరుగకున్న ♦ ధ్వజమిది యొరగదు, చూడుమనుచుఁ జెప్పి ♦ శూలపాణి
చనియెఁ బార్థివుండు ♦ సల్పుచుండెను వ్రతం, బహరహంబు నీశ్వ♦రార్చనమున.

క॥ ఊలన్ బాపలు సాపడ, లీలన్ ధ్వజ మొరగునట్టు♦లే వడుగొక నాఁ
డోలిమొదల్ గుడిచిచనన్, వైళంబుగఁ బుడమినొరగె ♦ ధ్వజ మబ్రముగాన్.

చ॥ అదిగని రాజవర్యుఁ డెద ♦ నబ్బురమొంది మనీషులున్ గడున్
విదులగు బ్రాహ్మణోత్తములఁ ♦ బిల్చియనెన్ భవదీయ జగ్ధియాఁ
బిదప ధ్వజంబు వ్రాలు నిది ♦ వింతగ నేఁటొ ముందువ్రాలె మీ
ర్మదిఁ బరికించి చెప్పుఁడన ♦ మంచిగ యోజనచేసి వారలున్. 412

క॥ వటుఁడొకఁడు ముందు భోజన, మిట జేసిచనెన్ శివాజ్ఞ ♦ హెచ్చగువాఁడీ
చటులవ్రతమున దానన్, స్ఫుటముగ నాధ్వజమున వ్రాలెఁ♦బుణ్యచరిత్రా! 413

క॥ చండీపుత్రులు వారలు, నిండించుఁదదర్చ పేర్మి ♦ నీలగళునకున్
జండీదేవికి ననిరి ప్రభుండలరేఁ బ్రజల్ యశంబు ♦ భోరుకొనఁగన్. 414

వ. ఇట్లంధకేశలింగ చరిత్రంబును వటుకోత్పత్తియు మీకెఱింగించితి నింకనత్రీశలింగ చరిత్రంబును వినుండని సూతుండు మునులకిట్లనియె. 415

## —* అత్రీశలింగము *—

ఉ॥ కామదమంచుఁ బేర్వడిన ♦ కాననమొక్కఁడు దక్షిణావనిన్
రామగిరీట్సమీపమున ♦ రాణఁదనర్చు మనుండె నచ్చటన్
దామరసోద్భవోద్భవుఁ డు♦దారతపోనిధి యత్రియుండెఁ ద
ద్భామ పతివ్రతావ్రతని♦ధానము నా ననసూయ తోడుతన్. 416

ఉ॥ ఛాత్రులు వల్కు రెప్ప డుట ♦ జమ్మున వేదములన్ బఠింపుచున్
శ్రోత్రసుఖంబు సేయుచు వి♦శుద్ధమతిన్ దను గొల్చుచుండఁగా
నత్రిమహామునీంద్రుఁడు ని♦జాంగనయౌ ననసూయతోడ నీ
ధాత్రిని నేరెఱుంగని యు♦దాత్తతపం బొనరించుచుండఁగాన్. 417

గీ॥ దైవవశమున నూఱేండ్లు ♦ దారుణంబు
గా ననావృష్టి యగుడు వృ♦క్షంబులెల్ల
నెండె నెచ్చోటఁ దడిలేక ♦ యుండెఁ బుడమి
నెల్ల జంతువు లెచటికో ♦ యేగె వగను. 418

గీ॥ నిత్యవృత్తికి లేదయ్యె ♦ నీరమెందు, వేఁడిగాడ్పులు చెలరేఁగి ♦ వీచుచుండె
నెందు హాహారవంబులే♦యెసఁగుచుండె, నంత ననసూయ మగనితో♦ననియెనిట్లు

క॥ వినఁజాల నార్తనాదము, గనఁజాలఁ బ్రజాతిదాహ♦కష్టంబుల నిం
కను నే సహింపఁజాల న,నిన శివుని దలంచి యట ము♦నివరుం డంతన్. 420

## —* అత్రిముని తపస్సమాధి నొందుట *—

క॥ భీమంబగు దుర్భిక్షము, నామెయిఁబరికించి క్షిప్ర♦మప్పుడె ప్రాణా
యామము చేసి సమాధిన్, నేమమునన్ జెందియుండె♦నేటగుతపమున్. 421

వ. అంతేవాసు లందఱుఁ గలిదప్పుల వందురి యొద్దడి నెదురలేక యెందేనిఁ జనిరంత మీఁద. 422

మ॥ అనసూయాసతి జీవితేశ్వరుని న♦త్యంతంబు సేవింపుచున్
గొనబౌ మృణ్మయలింగ మొక్కఁడు గడున్ ♦ బ్రాఁకంబుగాఁగూర్చి పా
వనమంత్రంబులఁ గొల్చుచుండె సతమున్ ♦ భావోపచారంబులన్
దనుజుల్ గొందఱు తత్తనూజ్జ్వలత కా♦త్మన్ బొక్కి కామార్తులై. 423

ఉ॥ ఆమెను బారసించి చటు ♦ లాగ్నివిధమ్మునఁ జిమ్మి తచ్ఛవి
స్తోమముచేత నోరసిలి ♦ సోలి యుడల్గొని వాఱి రష్ట్ర స
ర్వామరబృంద మద్దిగని ♦ హర్షమునొంది తదీయమహా వనిన్
ప్రేముడిఁజేరి చూచిరి వ♦రేణ్యుల నమ్మునినమ్మునీట్సతిన్. 424

చ॥ కని మునిసేయు నత్తపసు ♦ కన్న మునీంద్రునిఁ గాంచి సేయు పూ
జనము ఘనమ్ముగా నరసి ♦ చాలఁగ వారల సన్నుతించి చ
య్యన దివికేగి రందఱును వి♦యద్ధునియున్ హరుఁడున్ మనంబులన్
మునిమిథునేప్సితంబులను ♦ బొందుగఁ గూర్పఁదలంచియుండఁగన్. 425

క॥ మునియుగతపములు మొదలా, దినమున కేఁబదియునాల్గు ♦ దీరెను సమలం
తనుసేని వృష్టియొనరదు, ముని యుగ్మమొనర్చుచుండెఁ ♦ బూనిక్తపములన్.

ఉ॥ అంతనె యత్రిమౌని తన ♦ ధ్యానము డించి పురంధ్రితోడ న
త్యంతము దప్పి పుట్టెను ర ♦ యమ్మునఁదె మ్ముదకమ్మునాన్ మునీ
ట్కాంత కమండలంబుఁగొని ♦ కాన జలంబునుగాన కాత్మలోఁ
జింతిలె నేమిసేతు? నెటఁ♦జేయుదుఁ? గాంతుని దప్పిఁ దీర్పఁగాన్. 427

— * గంగాదేవి స్త్రీరూపముతో ననసూయకు దర్శనమిచ్చుట * —

ఉ॥ లేదుదకం బొకంట నని ♦ లేమమనం బరియాడుచుండఁ గా
లూదక యందు నందుఁ గను♦చుండఁగ స్వర్ణది యొక్క నాతియై
యాదృతి నమ్మునీశ్వరుని ♦ యంగన వెన్కొని పల్కె సాధ్వి! నీ
కేది ప్రియంబు సెప్పు మది ♦ యిచ్చెద వచ్చితి మెచ్చి నిన్నిటుల్. 428

క॥ నీ సెలవున్ గడుఁగూరిమిఁ, జేసెదఁ జెపుమమ్మ! యిట్లు ♦ శివసేవనమున్
నీ సామి సేవనంబును, వాసిగ నొనరించినట్టి ♦ పావన వెలమిన్, 429

క॥ అనుడు మునిసతియు నెనుకకుఁ, గని యాపెన్ జూచిపల్కెఁ ♦ గమలనయన! యెం
దుననుండి వచ్చితివి? నీ, ఘనత నొకింతయును దెల్పఁ♦గాఁదగు ననినన్. 430

ఉ॥ గంగను నేను గోర్కెలడు ♦ గన్దగు నన్న మునీంద్రపత్ని సా
ష్టాంగముగాఁగ మ్రొక్కి జల ♦ మడ్గఁగఁ గర్తముఁజేయు నీరమున్
బొంగుగఁ గూర్తునాఁ దపసి♦బోటి యటుల్ పొనరించె గంగ యు
ప్పొంగుచు నింపెఁ దత్క్షణమె ♦ పుణ్యజలంబుల గర్తగర్భమున్. 431

ఆ॥ అపుడుజలము గమండల♦మందునింపి, కొనియు నభ్రధునికి మ్రొక్కి♦యనియెనిట్లు
తల్లి! నా పతి వచ్చు నీ♦కండ కిప్పు, డంతవఱ కీవు గృపనిట ♦ నాగవలయు.

క॥ అన వల్లె యన నాపెయుఁ, జని సలిలము మానికొసగ ♦ సత్వరమున న
మ్మనఘుఁ డుదకమునుఁ ద్రావి మ, దిని నలరి జలంబు లెందుఁ♦దెచ్చితి వబలా!

చ॥ ఎపుడెపు డీవొసంగు జల ♦ మిట్టిది కా దమృతోపమానమై
తపనముసేయు నాహృదయ ♦ దారుణపీడ హరించె నిద్ది యీ
విపినమునందు దుర్లభము ♦ వేయినుడుల్ పనియేమి నీవిఁకన్
జెపుమెటనుండి తెచ్చితివొ ♦ చెల్వరొ! యిమ్మధురోదకంబులన్. 434

చ॥ అనిఁడుగంగ నాపె హృద♦యంబునఁ దర్కముచేసె వాస్తవం
బును దెలుపంగ నాకడిమి ♦ హొల్పును దెల్పిన యట్టులౌను గ
ల్లను నుడునంగ నయ్యది ద♦లంపఁగరాని యఘంబగుఁ గటా!
యొనరఁగ జీవితేశ్వరున ♦ కొప్పగనట్లు వచింతునీయెడన్. 435

క॥ అని యనసూయాసతి నె, మ్మనమున యోజించి తమదు ♦ మహిమమువలనన్
ఘనమగు శివకృపవలనన్, మనవనమునఁజేరె గాంగ♦మధురోదకముల్. 436

గీ॥ అనిన నత్రియునేఁగాంతు♦ననుచుమురిసి, రాఁబదీయప్రియయు గర్త♦రాజనికట
మునకునేతేరఁగనుపట్టెఁ♦బూర్ణసలిల, రుచిరమై చెలువొందు స♦రోవరంబు. 437

వ. కన్గొని బిగాన యం దత్రిముని ప్రీతుండై స్నాతుండై నిత్యకర్మంబు లొనర్చి
కొనియె ననసూయయు నవగాహనంబుచేసె నంతఁ బరమేశ్వరుండును స్వర్ధునియు
దర్శనంబిచ్చి యత్రిమునిని ననసూయను బ్రశంసించి వరంబులిచ్చెద మడుగుఁడనిన
ననసూయ గంగ కిట్లనియె.

—* అనసూయ గంగ నెల్లప్పు డట వసింపు మనుట *—

క॥ తల్లీ! యీ తాపసవని, నెల్లప్పుడు మఱచిపాయ ♦ కీవుండవలెన్
జల్లఁగ నాయెడఁగల కృప, ఫుల్లాంబుజనయన! భువన ♦ ములు హొలుపొందన్.

క॥ లోకోపకారమును నగు, వీఁకన్ గరుణాతిశయము ♦ వెల్లివిరియఁగా
నీ కమనీయోదకముల, నీకానన్ సతము నిలిపి ♦ తేని మహాత్మా! 440

చ॥ మునిసతి యిట్లుగోర నల ♦ ముగ్ధశశాంకధరేష్టపత్ని స్వ
ర్ధుని యిటువల్కె నమ్ము హ♦రున్ భజియించిన పుణ్యమిమ్మ నీ
వనిన మాటల్ హొనర్చెద మ♦హాత్మ! పతివ్రత! యీపతివ్రతం
బున కెనరావు యోగములుఁ ♦ బుణ్యములున్ దపముల్ జగంబునన్. 441

క॥ నీబోఁటి పతివ్రతచే, నాబోటులు శుద్ధిగాంత్రి ♦ నా మునిసతి గా
రాబొప్ప నొక్కయేఁటను, దాఁబడయు శివార్చఫలముఁ ♦ దడయకయిచ్చెన్

వ. దేవధునియు ననసూయ గోరినయట్లాపుష్కరిణియందుఁ బుష్కరరూపంబున
సాన్నిధ్యంబు చేసియుండె నంత ననసూయాత్రులు మహేశ్వరు నిట్లు ప్రార్థించిరి.

క॥ మందాకిని యెట్టుల మా, యం దాదరమెసఁగ నిందు ♦ నమృతమయంబై
పొందికఁజేరి వసించెనో, యిందుధరా! యట్టులరసి ♦ యీవుండు మిటన్. 444

క॥ అని యడుగ శివుఁ డటు లెయని, యనసూయారచితలింగ ♦ మందుఁబ్రవేశం
బొనరించి జగము లేలెను, జను లత్రీశుఁడని పుడమిఁ ♦ జాటి యలరఁగా. 445

వ. అంత యథాపూర్వంబుగ వనంబంతయు బహుపల్లవపుష్పఫలాఢ్యంబై చెలువొంది యెడ్డడిఁబాసిన వలసఁబోయిన ఋషులందఱు మరలఁ దఱలివచ్చి శాంతి హోమంబులు నెరపి రపుడు ఘనాఘనంబులు సువృష్టి నాపాదించె మునులంద ఱానందంబునఁ బొదలి రిది యత్రీశ్వరలింగ చరిత్రం బిఁక నందికేశలింగోదంతంబును వినుం డని సూతుండు మునులకిట్లనియె 446

## —* నందికేశలింగము—బ్రాహ్మణీచరిత్రము *—

క॥ రేవానదికిన్ బడమర, గా వర్తిలుతీరమందు ♦ ఘనతరశోభా
సేవితమగు కర్ణికనా, శ్రీవెలయుపురిన్ ద్విజుఁడు వ♦సించు నొకఁడిలన్. 447

చ॥ అతఁడు తనూజయుగ్మమున ♦ కర్థముఁబంచి యొసంగి యంగనన్
సుతులకు నప్పగించి శివు ♦ చోటగు కాశికి నేగి యం దనా
రతము హరున్ భజించి సుక ♦ రంబుగ నీశ్వరుఁజెందె నాదిలో
నతనిపురంధ్రి యాత్మజుల ♦ నారయుచుండెను గొంతకాలమున్. 448

గీ॥ అంతఁ గొన్నేఁడులకు బాప♦నమ్మ రుజను, జెంది రోజుచు మృతివేళ ♦ సిద్ధమైన
నుసురు లుత్క్రమణంబు గా♦కుంటఁజూచి, యగ్రపుత్రుఁడుదరిసి యి♦ట్లనియె వేగ.

ఉ॥ అమ్మరో! నీదు చిత్త మిపు ♦ డక్కట! యేదో కొఱంతఁజెంది యి
ట్లుమ్మలికమ్ముఁజెందు మది ♦ నున్న తెఱంగును దెల్పు నీ యభీ
ష్టమ్మును దీర్తు సత్యమనఁ ♦ జయ్యన నాపె దదస్థిరాసిఁ దూ
ర్ణమ్ముగ గంగఁజేర్పుమని ♦ నందనుఁ డట్లె యొనర్తునంచనెన్. 450

గీ॥ అంత బ్రాహ్మణి "హరహరా" ♦ యంచు నుసురు
విడిచెఁ గొడుకులునున్ విధి ♦ విహితముగను
శవమును దహించి యస్థిసం ♦ చయన మొనరఁ
జేసి కర్మంబులన్నియుఁ ♦ జేసి రపుడు. 451

గీ॥ మాసికశ్రాద్ధమొనరించి♦యానువాదుఁ, డనెడువిప్రాగ్రసుతుఁడును♦దినమునందుఁ
దల్లిఋణమును దీర్పఁగాఁ♦దలఁచి యుచిత, దానధర్మము లొనరించి♦తగినయట్లు.

క॥ తన భార్యాపుత్రులతో, ననుమతిఁగొని శివుని మనము ♦ నందుఁ దలఁచి యొ
క్కనిఁగూడఁ దోడుకొని గం, గనుగూరిచి తఱలె నస్థి ♦ కాండముతోడన్. 453

క॥ నడిచి యొకయోజనము భా,నుఁడు గ్రుంకుచునుండ బ్రాహ్మ♦ణుం డొకపల్లెన్
బొడఁగాంచి చేరి యచ్చోట, విడిసి యొకఁడుపాఱు నింటి ♦ వేదికయందున్.

వ. సంధ్యావందనాదికర్మములను సలిపి సేవకునితోడఁ బవళింపుచు నప్పుడం దొకవింత జరిగె నద్దానిఁ జెప్పెద వినుండు. 455

## —* ధేనువు సాహసకృత్యము *—

ఉ॥ ఆ యెడలన్ వసించెడి ధ ♦ రామరుఁ డొండొకయూరికేగి యా
సాయమునందె వేగ నిజ ♦ సద్మముఁ జేరఁగవచ్చి యావుపా
లాయెడఁ బిండఁగోరె తన ♦ యాలినిఁ బిల్చి ఘటంబుఁదెమ్మనా
నాయెలనాగ యిచ్చుడు ర ♦ యంబునఁ గ్రేపును బాపి లాఁగఁగాన్.

చ॥ అదియనుబోక బ్రాహ్మణుని ♦ యంఘ్రినిఁ ద్రొక్కఁగ నొప్పిఁజెంది యా
ప్పదమున నాతఁ డాగ్రహముఁ ♦ బట్టి కఠుల్వడి దానిఁగొట్టె న
మ్మొద వది గాంచి యశ్రుకణ ♦ మోచనమున్ బొనరించె దుగ్ధముల్
బిదికి ద్విజుండు లోనికిఁ జ ♦ నెన్ వృషపోతము మాత కిట్లనెన్. 457

ఉ॥ ఏటికిఁ దల్లి! యశ్రువుల ♦ నెంతయురాల్చితి వింతవంత నీ
కేటికి దాపరించె నన ♦ నింతకునెక్కుడిఁకేమి గావలెన్
గాటులు సెందఁగా నొడలు ♦ గాదిలిబిడ్డని బాధచుండ నా
రాటముచెంది ఖిండదె క ♦ రంబు భరంబుగఁ జిత్త మాత్మజా! 458

వ. అనిన లేఁగ యిట్లనియె.

క॥ తొలిజన్మంబున మదమున, సలిపినదోసంబు లురక ♦ చనునే? వానిన్
సొలయకఁ గుడువఁగ వలదే?, తొలఁగునె దోసంబులెందు ♦ దూఱిన జననీ! 459

క॥ సుకమును దుఃఖంబును నొం, డొక డొసఁగఁగ లేఁడు కర్మ ♦ మొసఁగునుస్వీయం
బిఁక వగవనేల? సర్వము, స్వకృతఫలంబులని యెఱుఁగఁ ♦ జను దేహులకున్.

ఆ॥ అనిన సురభి యిట్టు♦లనియెఁ గుమార! నీ, వనినచందమంత♦యును నెఱింగి
యున్నదాననైన ♦ నుడుగక మోహవ, శంబుఁజేసి యిట్లు ♦ జాలిపడితి. 461

ఆ॥ అనుచు మరలఁ గనుల♦నశ్రులు వెలిపుచ్చు, తల్లికనియె లేఁగ ♦ తగునె మరల
నెఱిఁగియెఱిఁగి యిట్టు ♦ లేడ్వఁగా నమ్మరో!, యేమిసేయుదాన ♦ వేడ్చియిపుడు.

వ. అనిన ధేనువిట్లనియె.

ఉ॥ నావలె నీ ద్విజన్ముఁడు ఘ♦నంబుగ దుఃఖముఁజెంది యేడ్వఁగా
నావగ పాయు నంతకుఁ బొ ♦ నర్చునిటుల్ పరితాప మిద్ది నే
నేవగనైన వీనిసుతు ♦ నెల్లి వధించెద మూఁడునాఁగఁ దా
భావమునందు రోసి వెస ♦ వత్సము ధేనువుతోడ నిట్లనెన్. 463

చ॥ మునుపటి జాములో దురిత♦మున్ బొనరించి పశుత్వమొంది యీ
ననటను జెందినార మిఁక ♦ బ్రహ్మవధం బొనరించి యిప్డు నూ
తనముగ భూరిపాతకముఁ ♦ దక్కక చేకొనఁగాఁ దలంప నీ
మన సెటులొప్పెనో? యెఱుఁగ ♦ మాతరో! యీతరుణంబు నందిటుల్. 464

క॥ తానెవరో? సుతులెవ్వరో?, నానాబాంధవ సుహృజ్జ♦నంబు లెవరొకో?
లోనరయ నెవ్వ రెవరిన్, గానరు సర్వులును గాంతు♦ కర్మఫలములన్. 465

గీ॥ కర్మమున జన్మమొదవు న♦క్కర్మమంత, స్సైనఁ గాని లభింప దా♦యమృతపదము
అందు దుష్కర్మ మొనరించు♦నట్టివారి, కంతులేక దుర్జన్మము ♦ లమరుచుండు.

చ॥ అన విని యావు తా ననియె ♦ నద్దురితంబును బాపునట్టి చో
టును మదిగుర్తెఱింగితె యి♦టుల్ పొనరింపఁగఁ బూనినానన్
విని యురకుండె దూడయును ♦ వేదికపైఁ బవళించియున్న బ్రా
హ్మణుఁడు సువాచుఁ డద్ది విని ♦ యక్కజమొందె మదిన్ గడున్ గడున్. 467

వ. అంత

చ॥ తెలతెలవాఱఁగా బుడమి ♦ దేవర యగ్గృహనాథుఁ డాత్మజున్
బిలిచి కుమార! పాల్పొదవుఁ ♦ బిండుము నేనొక యూరికేగఁగా
వలె నని చెప్పి పాంథుఁడగు ♦ బాపనికిన్ దెలవాఱె యాత్రికై
సలుపు ప్రయాణమన్న విని ♦ చక్కఁగ నాతఁడు వింతఁ జూడఁగాన్. 468

గీ॥ తలఁచి "పోయెద నించుక ♦ డడసి యివుడె
నొక రించుక నోగిలియు♦న్నాఁ" డనంగఁ
బోయె బ్రాహ్మణుఁ డంతఁ ద♦త్పుత్రకుండు
దూడగొని లాగి పిదుకఁబో ♦ దుగ్ధములను 469

ఉ॥ గొడ్డు డటాలునన్ వటునిఁ ♦ గొమ్ములతో నుదరంబుఁ గ్రుచ్చి పై
కొడ్డుగ నెత్తి కూల్ప ధర♦కున్ ద్విజబాలుఁడు వాసెఁ బ్రాణముల్
బిడ్డనిపాటుఁ జూచి పృథి♦విన్బడి కూయిడెఁ దల్లి యెల్లరా
పడ్డను బాఁది బాఁది విడు♦వన్ జనె నయ్యది పేరెమొందుచున్. 470

ఆ॥ బ్రహ్మహత్యచేతఁ ♦ బాండురవర్ణంబు, తొలఁగి నలుపుఁజెంది ♦ తోఁచెఁబసర
మంత యాత్రికుఁడగు♦నాసువ్రతుండును, భృత్యుతోడ దాని♦వెంటనరిగె. 471

ఉ॥ ఆవది తోకయెత్తికొని ♦ యర్మిలి నర్మదఁజేరి యందునన్
రేవలఘట్టముల్ విడిచి ♦ కేరుచు డగ్గఱి నందికేశలిం
గావసథోజ్జ్వలత్తటము ♦ నం దవగాహమునొందె బ్రహ్మహ
త్యావిలపంకమున్ దొరఁగి ♦ యంతనె వింతగనొందె శౌక్ల్యమున్. 472

చ॥ కనుఁగొని బ్రాహ్మణుండు మదిఁ ♦ గౌతుకమొంది కడిందిభక్తిఁ బా
వనతరతత్తటాంబువుల ♦ వాసిగ మజ్జనమొంది పోవుచుం
టను గని యొక్క దివ్యకుల ♦ నారి ద్విజన్మునితోడ బ్రాహ్మణా!
చనె డెట కీవు? చెప్పు మిఁక ♦ సత్యముదప్పక యన్న నాతఁడున్. 473

వ. తన యుదంతంబు నెఱింగించిన నా దివ్యభామిని నీతల్లియస్థుల నీతీర్థమునందే యుంపు మద్దాన నీజనని దివ్యదేహంబునొంది శివలోకంబు సేరఁగల దిది వైశాఖ శుద్ధసప్తమీదినం బీవాసరంబందు భాగీరథి యీతీర్థంబందు సాన్నిధ్యంబుసేయు నని చెప్పి యంతర్ధానంబుసేయుటయు ధరామరుం డాపెను గంగాదేవిగా నెఱింగి మరలి తనతల్లియస్థులలోఁ జక్కసగం బత్తీర్థంబందు వేయనంతలో నతనితల్లి దివ్యదేహంబునొంది గగనపథంబందుండియే కొడుకును గాంచియిట్లనియె. 474

చ॥ కొడుక! కృతార్థతన్ బొరసి ♦ కొంటివి ధన్యుఁడవైతి నేను ని
ప్పుడె సురలోకవాసమును ♦ బొందెద నీ కెడలేక సౌఖ్యముల్
దొడరెడుఁ బాడిపంటలును ♦ దొడ్డగ భాగ్యము సేకుఱున్ గడున్
గడు భవదీయవంశ మిలఁ ♦ గాంచును వృద్ధి నఖండరీతిగాన్. 475

గీ॥ ఇట్లు పలుమఱుదీవించి ♦ యింద్రలోక
మరిగి చిరకాల మట సౌఖ్య♦మంది పిదపఁ
బరమశివకృపఁ జెందె ని♦ర్వాణలక్ష్మి
బాపఁ డదిగాంచి విస్మయం♦బడి ముదమున. 476

వ. తక్కిన సగమస్థులనుగూడ నాతీర్థంబందే వేసి సేవకునితోఁ దనపురంబుఁ జేరె ననుడు మునులు మహాత్మా! నందికేశలింగ చరిత్రంబును వైశాఖ శుద్ధసప్తమీతిథియందు మందాకిని యాతీర్థంబుఁ జేరుటకుఁగల కారణంబును జెప్పుమనుడు సూతుం డిట్లనియె. 477

## —* ఋషికాచరిత్రము *—

చ॥ ఋషికయనాఁగ నొప్పెడు మ♦హీసురవర్యకుమారి యొర్తి బల్
సుషమతనూజ్జ్వలాంగి విధి ♦ చోదన బాల్యవితంతువై కడున్
ఋషికులమెల్ల మెచ్చఁగ స♦మిద్ధతపం బొనరించుచుండెఁ గ
ల్మషహృదయుండు మూఢుఁడను ♦ మాంసభుగగ్రణియొక్కఁ డాపెపై. 478

చ॥ వలపును జెంది పంచశర ♦ భల్లవిదారితచిత్తుఁడై పడిన్
జెలువను దారసించి తన ♦ చిత్తముఁ దెల్పి బలాత్కరింప స
త్కులజ శివార్చనాపరయుఁ ♦ గోవిదయై యలరారు నాపె య
క్కలుషు ననాదరింప వెసఁ♦గన్నను మిన్నను గాన కాతఁడున్. 479

ఉ॥ పైకొన నుద్యమింప ద్విజ ♦ బాలవితంతువు దిక్కుమాలి య
ప్పోకిరికిన్ హితోక్తులను ♦ బోధనొనర్చియు లబ్ధిలేమికిన్
లోకశరణ్యు శంకరుని ♦ లోనఁదలంచి తదీయనామగా
నైకమనంబుతో నిటుల ♦ నాయమ నాయమ యంచు భీతిమై. 480

ఉ॥ కిించుదనమ్ముతోడఁ బరి ♦ కించక పీఁడిటు దుర్మదాంధుఁడై
కొంచకశీలభంగమును ♦ గూర్పఁగడంగి పయింబడంగనుం
కించుచు నున్నవాఁడెవరు ♦ గిల్బిషమాఁగుదురిందు నీవె యూ
హించి దయారసంబెద వహించి ♦ ఖలున్ గడతేర్పు మీశ్వరా! 481

—* హరిణగతిరగడ *—

శివ శివ శివ శివ ♦ శివ శివ శంకర!
శివ శివ శివ శివ! ♦ శివమునికింకర!
కవిజననుతపద ♦ కంజసముజ్జ్వల
రవిశశినయన! హి ♦ రణ్యతనూజ్జ్వల!
శ్రీకర! దయ నిటు ♦ చిమ్ముము నాపయి
పీఁక వసురఁ దెగ ♦ వేయుము పాపియి
తేఁకువఁ గొనుమీ ♦ దివ్యచిత్తమున
నీ కెవ రేదురు త్రి ♦ నేత్ర! మొత్తమున
నీ పదంబులకు ♦ నెక్కొని మొక్కెద
నాపదఁ బాపిన ♦ నభవా! దక్కెద
వాద మేల? పెఱ ♦ వానికిఁ జిక్కుదు
మీఁదటఁ గనుఁగొన ♦ మిత్తికి దక్కుదు
తలకొనఁజాల న ♦ ధర్మము దేవర!
యలవునఁజేరి కృ ♦ పాకర! బ్రోవర
శంకర శంభో! ♦ శరణుఁ జేసెదను
పంకజారిధర! ♦ పదము డాసెదను
సంకటహర! నిను ♦ సారెకుఁ దలఁచెద
హంకృతివిడి నీ ♦ యడుగులఁ గొలిచెద
పంకిలకర్మము ♦ బాయఁగఁ జేయుము
వంకలఁబోవక ♦ వశ్యముడాయుము
కావఁగ రావే ♦ కరుణామూర్తీ!
పోవఁగనీవే ♦ పూరితకీర్తీ!
నానేరమినిఁ గ ♦ నందగ దిత్తఱి

నీ నెఱిఁ దప్పిన ♦ నీల్గును బిత్తరి
తల్లివి నీవే ♦ తండ్రివి నీవే
యెల్లలోకముల ♦ కేలిక వీవే
ముల్లోకములకు ♦ మూలం బీవే
చల్లగఁ బ్రజలను ♦ సాకెదు వీవే
తోడువునీవే ♦ దారవును నీవే
నీడవునీవే ♦ నెయ్యుఁడ వీవే
నీవే త్రాతవు ♦ నీవే నేతవు
నీవే దాతవు ♦ నీవె విధాతవు
భక్తురాల నీ ♦ పాలఁబడితి నిఁక
శక్తిపతీ! వే ♦ సాఁకుము గొంకక
యొప్పరికించిన ♦ నొప్పాని నీకది
తప్పదు నీకిఁకఁ ♦ దారసింప కిది
రమ్మిఁక రమ్మిఁక ♦ రాజభూషణుఁడ!
నమ్మితి ని న్నా ♦ మ్నాయభాషణుఁడ!
గౌరీకాంతుఁడ! ♦ కలుషవిదారుఁడ!
శ్రీరమణాదిక ♦ చిత్తవిహారుఁడ!

—* శివుఁడు రక్కసునిఁ జంపి ఋషికకు వరంబు లిచ్చుట *—

గీ॥ ఆర్తితో నిట్లు వేఁడఁగ ♦ హరుఁడు వేగ, భక్తరక్షణదాక్షిణ్య ♦ భంగులలర
వచ్చియసురనువీక్షింప ♦ భస్మరాశి, యయ్యెఁ బలలాశి దత్క్షణం♦బందెయచట.

వ. అంత శివుండు ఋషికన్గాంచి.

క॥ కోరినవరముల నిచ్చెద, నీరజదళనేత్రి! సుకృత♦నిశితచరిత్రి!
ధీరమతి! యడుగుమన నెదఁ, దేఱి ప్రణుతి నిరతమతినిఁ ♦ దెలిప యిటులనెన్.

క॥ బ్రదికించినాఁడ వీశ్వర!, సదయహృదయ! దేవదేవ! ♦ శరణావనసం
పదుదార! దీనబంధూ!, మదమెత్తిన యసురఁ గడపి ♦ మాన్పితి వార్తిన్. 485

సీ॥ ఆయెఁగా తెరపి మే♦లాయెగా సుఖముపెం, పాయెగా పోయెఁగా♦డాయువనట
ఊడెఁగా మదముపె♦న్నాడెగా దృశము పో,నాడెగా యసుర దై♦త్యాధముండు
పాసెఁగా బాధలో♦డాసెగా బోధవే, మాసెఁగా వెఱపువి♦శ్వాసమెసఁగ
మించెఁగా కోర్కెరు♦చించెగా భక్తిపేర్మి, మించెగా హృదయము ♦ దంచితముగ.

గీ॥ నిండెఁగాఁగీర్తి యెల్లెడఁ ♦ బండెఁగా మ, దీయపూజనమిది పార్వ♦తీసహాయ!
పొదలెఁగా బెదరఖిల దు♦ర్వాదులకెంతొ, సకలలోకైకరక్షణ♦ చతుర! యిపుడు.

చ॥ ఇఁకను వరంబు లేటికి మ♦హేశ్వర! యైనను నీదు పాదసే
వకమతి నాకొసంగు మన♦పాయముగాఁగ జగంబులేల ను
త్సుకత వసింపు మిందనుడుఁ ♦ దోడనె యీశ్వరుఁడున్ దయామయా
త్మకుఁడయి లింగరూపమునఁ ♦ దా వసియించె వనస్థలంబునన్. 487

వ. అఖిలజనానందకరంబగుట నాలింగంబు నందికేశలింగంబని పేరొందె నంతగంగా
దేవియునున్ డాసించి యమ్మునిని కిట్లనియె. 488

క॥ అమ్మరో! తాపకసుచరి,త్రిమ్ముని కే నెంతయున్ ముదంబువడితి వ
ర్షమ్మున నొకతడవ త్వదీ,యమ్మగు మజ్జనమునొప్పు♦నప్పాలనుందున్. 489

వ. ఈనాఁడు వైశాఖశుక్లసప్తమి యగుట నేఁటట నీదినంబందీ తీర్థంబునందుఁబ్రవే
శించి యమ్మెలునాఁడు చనుదునని యంతర్ధానంబుఁజెందె నిట్లు నందికేశలింగో
త్పత్తియును నర్మదాతీర్థంబునందు గంగాప్రాప్తియును మీకెఱింగించితి నిఁక
హరీశ్వరలింగచరిత్రంబు నెఱింగింతు వినుండని సూతుండు మునులకిట్లనియె.

## —* హ రీ శ్వ ర లి ం గ ము *—

ఉ॥ సర్వజగంబులేలు నల♦శౌరి నిశాచరమండలిన్ నిజా
ఖర్వపరాక్రమోగ్రత ని♦శామలయం బొనరించుచుండినన్
గర్వముతోడ వారు సుర♦కాండముఁబట్టి పలార్చుచుండఁగా
నోర్వఁగలేక లేఖులు ర♦మోన్నతి పెన్నునిఁజేరి యార్తులై. 490

క॥ తమగోడు విన్నవించి ర,యమునన్ రక్కసులపీఁచ♦మడఁచి జగములన్
మముసాఁకుమనుచు వేఁడుఁ, గమలాకాంతుండు వెరవు♦గాంచకకించన్.

ఉ॥ ఎందఱిఁబట్టి చంపిన ర♦ణోద్ధ్యులు రాక్షసవర్యు లేచి యీ
చందము వేల్పులన్ గలఁచి ♦ సర్వజగంబుల కార్తిసేయుచున్
ముందుకు వచ్చుచుండిరి య♦మోఘతరంబగు నాయుధంబు లే
కిందఱ నెట్టు లాజి సమ♦యింతు గడింతు జయాతతోన్నతుల్. 492

క॥ అని మదిఁదలపోసి వెసన్, జని కైలాసాద్రిఁజేరి ♦ శంకరు నెదలోఁ
గొని పార్థివలింగమునకుఁ, గనకాబ్జసహస్రపూజఁ ♦ గావింప నొగిన్. 493

మ॥ ఒకనాఁ డీశ్వరుమాయఁజేసి హరి దా ♦ నుగార్చ్యయందున్న వే
శవ నంభోజ మొకండు దక్కువగుడున్ ♦ లక్ష్మీశ్వరుం డీ జగ
న్నికరబంతయు దివ్యదృష్టిఁగని య ♦ న్నీరేజరాజంబుఁ గా
నక యాశ్చర్యభయంబులొంది పెలుచన్ ♦ ధైర్యంబుతో నంతనే. 494

సీ॥ గద త్రిశూలం బజ♦గవము వజ్రంబు హ, స్తములందు నెంతేనిఁ ♦ దళుకు లీన
నెలబాలుఁ డొప్పారు ♦ లలితకిరీటంబు, నిగనిగలందంబు ♦ నీటుసూప
మొలపయిన్ గట్టిన ♦ పులిచర్మ మెంతయుఁ, గర్బురదీధితుల్ ♦ గ్రమ్ముకొనఁగ
నురమున నొప్పారు♦చున్న పసిండి త, మ్ములదండ చీలమం♦డలముఁ దాఁక
గీ॥ సంజపొద్దున శారద ♦ సమయమందు, మేల్మిపరివేషమందున ♦ మెఱయుచంద్రుఁ
డట్లు విలసిల్లు నఖిలాబ్జ ♦ జాండవిభుని, శంకరునిఁ గనుఁగొనియెను ♦ జక్రధరుఁడు.

క॥ ప్రమథగణంబులతోఁ గడుఁ, గొమరొప్పఁగఁ జుట్టఁబడిన ♦ గోధ్వజుఁ డొప్పెన్
రమణీయుఁ డగు తెప్పగవే, ఘమున నలరు ప్రొద్దువలె న♦క్షత్యుఁడయి కనన్. 42

వ. మఱియు నప్పరమశివుని

క॥ ఏకాదశరుద్రులు, శ్రీకరు లుడురాజశకల ♦ శేఖరులు ఘన
శ్లోకులు పరమంత్రంబుల, శ్రీకంఠు నుతించుచుండి ♦ రి కరము పేర్మిన్. 43

క॥ ఆదిత్యులు వసువులు వి, శ్వేదేవులు నాశ్వినులును ♦ సిద్ధులు సాధ్యుల్
మోదంబలరఁగ శశ్వ ద, మహాదేవు నుతించుచుండి ♦ రందుఁ గడువడిన్. 44

గీ॥ శతమఖుండును విష్ణుండు♦శతధృతియు ని, తరులు గీర్వాణులును రథం♦తరమునామ
మున మహేశ్వరసాన్నిధ్య♦మునఁ బఠించు, చుండి రెంతయు నుల్లాస♦మొప్ప మీఱ.

వ. మఱియు సనకాదియోగీశ్వరులు బ్రహ్మర్షులు దేవర్షులు భూమ్యాకాశములు
ఋక్షములు గ్రహములు నెలలు పక్షములు ఋతువులు నహోరాత్రులు సంవ
త్సరములు క్షణములు ముహూర్తములు యుగములు విద్య లితిహాసములు సన
త్కుమారుఁడు మరీచి యంగిరుఁడు నత్రి యగస్త్యుఁడు పులస్త్యుండు పులహుఁడు
క్రతువు మనువులు దక్షుఁడు భృగుఁడు వశిష్ఠుఁడు వేదములు ఛన్నంబులు దక్షి
ణలు స్తోత్రంబులు హవిస్సును మూర్తిమంతంబులగు యజ్ఞద్రవ్యంబు లనంతాది
నాగరాజులును గంగాది పుణ్యనదులును సాగరంబులును దేవతలును దేవపత్ను
లును దేవకన్యలును దశదిక్కులును మునిసహస్రంబులు పరమేశ్వరుని నమస్క
రించుచుఁ గొలుచుచుండిరి ఇకను గీతవాదిత్రకోవిదులగు గంధర్వులు నచ్చరలు
నాటపాట లొనర్చుచుండిరి ఇకను విద్యాధరులు జక్కులు దయ్యములు మున్నగు
నవి కొండలు మాత్రికలు మనోవాక్కరణంబుల మహాదేవు నుపాసించుచుండె
నిట్లు క్రొత్తపదుఱఁ బరమేశానుండు పాదసూపి వాసుదేవునికి జగంబును గాంచు
చున్నంత హరి యమ్మహాదేవునిఁ గన్నొజాలకుండుటయు నమ్మహేశ్వరుండు ఱేఁగి
యతని కిట్లనియె. 46

క॥ పలుమఱు నీచేతను బూ, జలఁ గొనుచుంటిని హరీ! ప్ర♦శస్తచరిత! యి
మ్మూల నినుబోలెడు నిష్టుఁడు, గలుగఁడు నాకీ జగతి నో♦కండేనియునున్. 47

## —* శ్రీకృష్ణుఁడు శివుని స్తుతించుట *—

గీ॥ అనిన విని యాతఁ డిట్లనె • నమ్మహాత్మ, నకు నమస్కార మిడ్డి యు • నారతంపుఁ
బుణ్యకారణునకు బ్రహ్మ • మును లనుదురు, నిన్ను బ్రహ్మాధిపతినిగా • నిగమ వేద్య!

వ. మఱియును.

క॥ నారాయణునిగ నరునిగ, ధీరులు సెప్పుదురు నిన్ను • దెలిసితిని విభూ!
సారసభవుఁడవు నీవే, శ్రీరుద్రుఁడవీవె • తక్కు దేవేలీవే! 49

ఉ॥ నీవలనన్ జగంబులిటు • నెక్కొనె స్థావరజంగమంబులై
యీవిధమొప్పు ప్రాణములు • నింద్రియముల్ మనముల్ బ్రతీకము
ల్పావకుఁడున్ హవిస్సును స • వంబులు సోముఁడు వేదమంత్రముల్
నీవె మహేశ! దత్తమును • నీవె యధీతము నీవె యారయన్. 50

క॥ నీవే యెల్లరహృదయము, లో వాసముసేయునా య • లోకపురుషుఁడవో
దీవే యణిమవు లఘిమవు, నీవే జ్యోతివి మహాత్మ! • నీకివె ప్రోతల్. 51

## —• దండకము •—

శ్రీమన్మహాదేవ! దేవాదిదేవా! సుదివ్యత్ప్రభావా! భవాపత్సముద్రాంతరోద్వి
గ్నజీవోద్ధరప్రౌఢభావా! భవా! సర్వగీర్వాణకుర్వాణకోటీరకోటిస్ఫురత్కోటిజ్వాల
దత్నాంచిచంచద్ ఘృణీజాలనీరాజితాంచత్పదోత్ఫుల్లనాళీక! నాళీకజన్మాది
తాళీకవాగ్రీమతన్మస్తవిచ్ఛేదనాటీకసవ్యాగ్రహస్తాగ్ర భాస్వన్నఖాగ్రా! ప్రశ
స్తేందురేఖాసముత్పింగరంగజ్జటాబంధబంధీకృతాకాశగంగా సముత్తుంగభంగాభిషి
క్తోత్తమాంగాభిరామా! యుమాదేవి దివ్యాంగరాగోరుసౌగంధ్యవిశ్వసనాభ్యాసలా
లాలితక్రౌంచభిత్కుంజరేంద్రాననా! పాలితశ్రీశిలాదాత్మజానందసంస్తోభిల
వేత్రాంశుమాలా పరిక్షిప్తసాన్నిధ్యసంశోభితా! శర్వ! సర్వాత్మనానందమోదా,
వచోభూతవేదా! భవద్దివ్యమాహాత్మ్య మూహింపశక్తుండనే! తావకీనాసపద్యోరు
దేహంబు రూపంబుఁ దేజంబుఁ గారుణ్యభావంబిటుల్ చూపినావస్మదీయుం బెంచకే
ధన్యునిన్ జేయవే నిన్ను గన్నారఁగంటిన్ జగంబెన్నఁగాంటిన్ గడున్ హస్తముల్
దర్శముల్ వేగఁ బాలింపుమా పల్కులాలింపుమా సర్వలోకేశ్వరా! శంకరా!
శ్రీకరా! తేనమస్తే నమస్తే నమః.

గీ॥ ఇట్లు కృష్ణుఁడు పలికిన • నెల్ల జగము, లుల్లసిలియుండె యనునట్లు • లొక్కమాఱు
సింహనాదంబులొనరించి • చెలఁగెఁ గృష్ణు, శిరమునన్ బుష్పవర్షంబు • గురిసె మిగుల.

గీ॥ అపుడు భగవానుఁడగు శివుం • డతిరయమున, దేవియగునుమనున్ శత • ధృతినిఁ జూచి
నలిననేత్రునకనె హరి! • నాదుభక్తి, కరమొనర్చెద వీవు నేఁ • గాంచుచుందు.

—* శ్రీకృష్ణునకుఁ బార్వతీశివులు వరంబుల నిచ్చుట *—

క॥ ఎనిమిదివరముల నడుగుము, వనజేక్షణ! నీయభీష్ట ♦ వాంఛితముల లే
దన కే నొసంగెదను నా, మన మిది ప్రేమించు నిన్ను ♦ మానక యెప్పుడున్.

క॥ పరమశివుఁ డిట్లు డగ్గఱి, కరుణంబలికి నట్టినుడుల ♦ కర్ణ మెఱిఁగి తా
మరసాక్షుం డో కృష్ణుఁడు, శిరమున మ్రొక్కులిడి పల్కెఁ ♦ జెన్నుగ నిట్టుల్.

చ॥ సుకృతమునందు దార్ఢ్యము య ♦ శోధనమున్ ఘనమహాబలంబు శ
త్రుకులవిఘాతమున్ శతసు ♦ తుల్ వరవిక్రమవిస్ఫురత్తనుల్
సకలజనప్రియత్వమును ♦ సాకతరోత్తమయోగశక్తి తా
వకమగు సన్నికర్షము శి ♦ వా! యొసగంగఁ దలంతు నర్మిలిన్.

*సీ॥ అనిన నట్లగుఁగాక ని ♦ నమ్మహేశుఁ, డమ్మహేశ్వరి జగదంబ ♦ యనియె నిట్లు
ప్రభుఁ డొసంగెను నీకు నీ ♦ వరములఁ గృష్ణ!, యష్టవరముల నేనిత్తు ♦ నట్లె కొనుము.

వ. అనుటయు నతం డంబికకు శిరంబున మ్రొక్కి యిట్లు వరంబుల నడిగె. 58

గీ॥ పాపలం దల్క లేమియుఁ ♦ బరమభోగ
మును సుతశతంబుఁ గులమందు ♦ ముదముఁ దల్లి
దండ్రియొక్కయు సుప్రసా ♦ దములు శమము
దాత్వ్యము నొసంగు మమ్మ! నెం ♦ తయును జనని! 59

క॥ అనినఁ దథాస్తని త్రిభువన, జనని మఱియు ననియె నమర ♦ సన్నిభ! యెప్పుడే
నిని నే పాలికిఁ బల్కను, గనెదవు భార్యాసహస్ర ♦ కౌశల్యంబున్. 60

గీ॥ మఱియు దారలవాల్లభ్య ♦ మరుదు మిగులు, బాంధవప్రేమ మఱియ ♦ బలము తనరు
నేడు వేలు ద్విజులు నీదు ♦ నిమ్మ నందుఁ, గుడుతు రిష్టంబు తీరు నీ ♦ కూరు తనువు.

క॥ వరముల నిట్లొసఁగి తగన్, వరదులు శివు లంత దివిజ ♦ వర్గముతోడన్
నరగున నంతర్హితులై, రరుగమ్మను జెంది కృష్ణుఁ ♦ డంత రయమునన్. 62

వ. గురుండగు నుపమన్యునిఁ జేరి మహేశ్వరానుగ్రహం బెఱింగించినంత మురిసి
యమ్మహామహుండు పద్మలోచనున కిట్లనియె. 63

* శివపురాణే ఉమాసంహితాయాం తృతీయాధ్యాయే - శ్రీకృష్ణ వచనం —
శ్లో॥ [illegible] వరాన్ దేహి । వృషదేవ నమోస్తుతే। సర్వేశ్వరస్త్వమేవాసి। మత్ప్రభుశ్చ విశేషతః॥
సనత్కుమార ఉవాచ - తస్య తద్వచనం శ్రుత్వా । తమాహ భగవాన్ భవః । సర్వం భవిష్య
తిత్యేవం । పునస్స ప్రాహ శూలభృత్ ॥ సాంబో నామ మహావీర్యః । పుత్రస్తే భవితా బలీ
......శ్రీకృష్ణ ఉవాచ - శ్లో॥ ఇత్యాద్యాస్సువరాన్స్వంతు । ప్రసాదాత్తవ పార్వతి॥ సన
త్కుమార ఉవాచ - తస్య తద్వచనం శ్రుత్వా । దేవీ తం చాహ విస్మితా । ఏవ మస్త్వితి భ
ద్రం తే । శాశ్వతీ సర్వకామదా॥

క॥ లేఁడు శివుఁబోలు వేల్పు, లేఁడు శివున్ బోలు దాత ♦ లీలాకారా!
లేఁడు శివుఁబోలు సులభుఁడు, లేఁడు శివున్ బోలు బిరుదు ♦ లెక్కింపంగన్.

వ. అని సంతసించినంతఁ గృష్ణుం డాయనఘుని సెలవొంది స్వపురంబుఁ జేరి జాంబవతియందు సాంబుండన్ గుమారునిఁ బడసి సుఖంబుండె నిట్లు శ్రీకృష్ణ పుత్రలాభోదంతం బెఱింగించితి నిఁకేమి వినుదురన సూతునకు మునులు మహాత్మా! మున్నెవ్వరెవ్వరు శివమాయామోహితులై జ్ఞానంబుఁ బాసి చరించిరో యట్టి వారి నెఱుంగఁ జెప్పి యవ్వలఁ బాపభేదంబులను బాపభోగ్యంబులగు నరక భేదంబుల నెఱింగింపుమనిన సూతుం డలరి యిట్లనియె.

## —* శివమాయా మోహితులు *—

క॥ కమలాక్షుండా విష్ణుఁడు, భ్రమాత్మకంబైన శివుని ♦ బలువగుమాయన్
దెమలంగలేక యనేక, ప్రమదలసాంగత్య మొందెఁ ♦ బలుతెఱఁగ నిలన్. 66

క॥ నలువయు శివమాయఁ గడున్, నలిగి యలవిగానియట్టు ♦ నష్టనిరహంచేఁ
గలయఁగఁ బూనెను గూఁతున్, బలుమఱు లోఁతులనుఁ జూచి ♦ బాళి నలరెన్.

క॥ మీఁదున్ గ్రిందును గనకయె, కాదన కనుచితపుసరణిఁ ♦ గామఁబలసి దున్
గాదిలిచెల్లెలిని వశి, ష్ఠాదులు గనయంగఁ గడఁగి ♦ రభవుని మాయన్. 68

వ. మఱియు నజేయంబగు నాశివమాయన్ జేసి.

సీ॥ ఇంద్రుఁడు గౌతమ♦ఋషిపత్ని నాయహ, ల్యను మోసఁజేసి క్రీ♦డనుబొసఁగె
అగ్ని కృత్తికలను ♦ నార్యురవలచి బ, ల్మరులొంది ప్రాణంబుఁ ♦ బోసఁగఁ బోడరె
నమ్మహాబలుఁడును♦నంజనిన్ గామించి, క్రీడించి పుట్టించెఁ♦గేశవర్య
మిత్రావరుణు లల్ల♦ మెలఁత నూర్వశిఁ జూచి, గళితతేజస్కులై♦కనిరి సుతులఁ

గీ॥ చందురుఁడు గురువనితతో♦సారతోరు, భోగములనొంది తనయుని♦బుధునిఁ గనియె
శాండిలియనాఁగ నొకకన్నె♦సర్పవైరి, వలచి ఱెక్కలుగాల్పఁగఁ♦బడియె వినుఁడు.

సీ॥ వాచస్పతి యటంచు ♦ వైభవంబున మించు, జీవుఁడగ్రజపత్నిఁ ♦ జెందెఁ దనివి
బ్రహ్మనిభుండు ప♦రాశరుం డల దాశ,కన్యకతోఁ గూడి ♦ కనియె వ్యాసు
ఘనుఁడో విభాండక♦ముని లేడిఁ గని ముక్త, తేజుఁడై కనియె సు♦తున్ గుమారు
నచ్చరయగు మేన♦యనుపొలంతికిలోఁగి, గాధిపుత్రుఁడు గంగఁ♦గలిపెఁ దపసు

గీ॥ ఇఁక భరద్వాజుఁడ నెడుమా♦నీంద్రుఁడలఘుఁ, డా హరిద్వారమున గంగ♦యందుఁ గ్రీడ
లాడెడు ఘృతాచియను దాని♦నభిలషించి, స్కన్నవీర్యుఁడై కనియె నొ♦క్కనిఁ దనూజు.

వ. వారు వీర ననేల? లోకంబందెల్ల వారలు శివమాయామోహితులై కామబాణంబులకు గుఱిగానివారు లేరిది సిద్ధం బిఁకను బాపంబుల తెఱం గెఱింగించెద వినుండు.

## —* పాపభేదములు *—

క॥ మనసున నాలుగునున్ వాక్కున నాలుగు మూర్తి నాలుగును నగు పాపా
లను బొనరించినవారలు, చనుదురు నిరయంబుఁ జేర సన్మునివర్యుల్! 72

వ. అవి యెవ్వియందురేని వినుండు.

క॥ పరసతినిఁ గవయఁగోరుట, పరధనముల కాసపడుట భావముచేతన్
బరుల కపకృతినిఁ గోరుట, యిరవుగఁ జెఱుపనులఁదలఁచు టెపుడుఁదగ వెదక్.

సీ॥ అప్రియముఁ బల్కుటయుఁ గల్లలాడుటయును
కొండెములు సెప్పుటయు సుంతఁ గొంకులేక
తిట్టుటయు నను నివి నాల్గు చెట్ట లెపుడు
వాకునెడ దోసములు వీనిఁ బాయవలయు. 74

క॥ తినఁదగనివి దినుటయుఁ బర,ధనముల దొంగిలుట పరుల దారలతోఁ గ్రీ
డనుబొనరించుట హింసయు, ననుచితములు దేహమునకు నారయవలయున్. 76

వ. తినఁ దగని పదార్థంబుల నిర్ణయింతుఁడు.

గీ॥ వినుఁడి శ్వమాంసములును లశునపలాండు శిగ్రువిడ్వరాహంబులు శేలువును న
భక్ష్యములు గాఁగఁ జెప్పఁగబడుట వాని, వర్జనమొనర్పవలె ధర్మపరుఁడెపుడు.

వ. ఇఁకను వరుసగ దోసంబులను వక్కాణించెద వినుఁడు.

క॥ శివునిన్ గురుఁ దలిదండ్రుల, శివభక్తుని మఱియు శైవశిక్షాచార్యున్
శివశాస్త్రంబుల నెపుడే, నవమతి నిందింపఁగూడదఘమగును గదున్. 78

సీ॥ శివలింగమును జూచి చేమోడ్పనట్టిఁడు, శివుగుడికిఁ బోలఁతుకఁ జెందునతఁడు
శివపూజనంబులను మ్రుచ్చిలికొనునాతండు, శివరాత్రిఁ బవలుబో సేయునతఁడు
శివసన్నిధిఁ బుస్తకాజిని ఖచ్చునట్టిఁడు, శివప్రాజవరాని భుజించునతఁడు
శివపూసని పెట్టు పేల్పుఁ జింతసేయుచునుండు, శివునివ్రతంబులఁ జెఱచునతఁడు

గీ॥ గురునిఁ గొలువక పాతంబుఁ గోరునతఁడు, గురునిపరిచర్య సల్పని కుత్సితుండు
ఆపదన్ గుందుగురుఁ బాసినట్టియతఁడు, చేరుదురు నిరయంబును సిద్ధమిద్ది. 78

సీ॥ అసుచిస్థు పేదాఢ్యయన మొనర్చునతండు, తల్లిదండ్రుల నెప్డు నొల్లనతఁడు
పంచయజ్ఞంబులఁ బాసి మెక్కునతండు, తను గొప్పగా నెన్నుకొనునతండు
చదివిన వేదంబు వదలి మఱచినట్టిఁ, డాలను బోయల కమ్మునతఁడు
దేవభూదేవ వృత్తినిఁ జూఱగొన్నట్టిఁ, డాలమందలు మేయునట్టి పొలము

గీ॥ నాక్రమించిన యట్టిఁడు నాల చెరువునందు నగ్గినివేసెడు నట్టియతఁడు
దీనులగువారిసొత్తు నెంతేనిఁ గొనిన, యట్టిఁడును నిరయంబుల నందఁగలరు. 79

క॥ చెఱువులుఁ దోఁటలు గుంటలొ, నరిచిన వ్రతములను దనదు♦నాతిని సుతలన్
మఱి సుతులను వెలకమ్మెడు, నరుఁడొందఁగలండు ఘోర♦నారక బాధల్. 80
ఆ॥ వినుఁ డనాథయైన♦వెలఁదిని బాలను, వృద్ధురాలి మిగుల ♦ వెఱ్ఱిదాని
సతినిఁ దపసుఁజేయు♦చానను వంచన, చేయువారు నరక♦సీమ నుంద్రు 81
క॥ వేదక్రేతలు మఱియు, వ్వేదమునున్ దెగడువారు ♦ వేదవిరోధుల్
వేదముఁ జూచి పఠించెడు, వేదస్తులు నిరయగతికిఁ ♦ జేసదు రవలన్. 82

—* పంచమహాపాపులు *—

క॥ బాపనిఁ జంపినవాఁడు సు, రాపియు గురుతల్పగుఁడు హి♦రణ్యస్తేయుం
డీ పాపులఁ గూడిన పెను, పాపుఁడునుం బంచఘోర♦పాపులు పుడమిన్. 83
సీ॥ గోవిప్రకన్యకా♦గురుకార్యములకు వి, ఘ్నంబు చేసెడునట్టి ♦ కశ్మలుండు
గురుల దోసములేని ♦ కోమలినిన్ బరి, జనులఁ బాసినయట్టి♦ పాపశాలి
చలిపందిరుల మేలి ♦ సత్రంబులను సభా, భవనంబులన్ గూల్చు ♦ పంకమూర్తి
బాలవృద్ధులకును ♦ బరిజనులకుఁ బెట్ట, కన్నంబు ముందు ది ♦ న్నట్టి ఖలుఁడు
గీ॥ విల్లు నమ్ముల కత్తుల♦విసము నమ్ము, వాఁడు పశువులకున్ ముకు♦త్రాడు వేయు
వాఁడు శిలలను మేకుల♦బాటకడ్డి, వేయువాఁడును నిరయంబుఁ ♦ జెందఁగలరు.

ఉ॥ కల్లలనాడువాఁడు గురు ♦ కాంతను నోడక ధిక్కరించువాఁ
డుల్లమునందు నక్కటిక ♦ మూననివాఁ డభిచారకృత్యముల్
పెల్లుగ సల్పువాఁడు ద్విజుఁ♦బిల్చియు సుంతయు నీకపంపువాఁ
డొల్లమి సాధులౌ ద్విజుల ♦ నూరక దూఱెడువాఁడు పాతకుల్, 85
క॥ పరివేత్తయుఁ బరివిత్తియుఁ, దెఱువలనున్ దార్చునతఁడు ♦ దంపుస విసమున్
బరులఁ దినిపించువాఁడును, నిరతముఁ గామాకులుఁడయి ♦ నెగడెడువాఁడున్.

క॥ కన్నెను జెఱిచెడువాఁడును, గన్నెయధన మపహరించు ♦ కఱటి రజముతో
నున్నసతిఁ గూడువాఁడును, బన్నుగఁ బర్వముల రతినిఁ ♦ బడసెడువాఁడున్.
గీ॥ వరుసగానట్టి యువిదతో♦సురతమొందు, నరుఁడునుం గూటసాక్షియుఁ♦ బరులసొమ్ము
దాఁచనిడ నపహ్నుతిచేయు ♦ దారుణుండుఁ, బశువులను బట్టి క్రీడించు ♦ పాపశాలి.
క॥ ఒకబంతియందునున్ వం, టకమున భేదంబుఁజేయు ♦ టాటోటును బా
నొకవిస్తరి వేసుక తలఁ, కక తుడిచెడువాఁడు నరక ♦ గతులొందుఁ దొగిన్. 89
గీ॥ ఎపుడు దుర్దానములఁగొంచు♦ సేవపడక, కల్మషాత్ములకడఁ బ్రీతి♦గ్రహము సేయు
నట్టి బావఁడు నరిగొంచు ♦ నవనిఁగావ, లేని భూమీశ్వరుఁడును మ♦లీమసు లిల.

క॥ కలిమి కడుఁగలిగి పేదలఁ, దలఁపక తగినట్టి యీవిఁ ♦ దక్కినవారల్
బలమైన రుజను గడుశో, షిలు పేదకు మందు లిడని ♦ చెన్నటివైద్యుల్. 91

క॥ కూలుదురు నరకమునఁ గడుఁ, జేలుదురు భ్రష్టులగుచు ♦ బిట్టుగ నగ్నిన్
గాలుదురు తెలుపుఁగాంచక, సోలుదురు నితాంత భూరి ♦ శోకాతురులై. 92

— * బ్రహ్మఘ్నసమానులు * —

సీ॥ దప్పిఁ జెంది జలంబుఁ ♦ ద్రావఁగావచ్చు గో, జాతికి విఘ్నంబుఁ ♦ జల్పువాఁడు
వేదశాస్త్రముల ♦ వివేక మించుక లేక, కొంచక సభల దూ♦షించువాఁడు
కడు సందమున నొప్పు ♦ కన్నకూఁతును దగి, నట్టి భర్తకొసంగ ♦ నట్టివాఁడు
కుసుసంగరమ్మని ♦ గుణశాలియగు బ్రాహ్మ, ణునిఁ బిల్చి మరలఁ బో♦మ్మనెడువాఁడు
గీ॥ మతిఁను గోష్ఠవతంబుల ♦ మాన్యములను, బాడబునివృత్తి హరియించు ♦ వాఁడునంధ
పంగులబడ ద్రవిణములఁ ♦ బడయుఁవాఁడు, బ్రహ్మఘాతులుగాఁ జెప్ప ♦ బడుదురిలను.

గీ॥ చెలిమిఁ జేయుచు నహితంబు ♦ చేయునతఁడు, పిలిచియు విపాన్నమును దిని ♦ పించునతడు
కనుచు హింసను మాన్పని ♦ ఘాతుకుండు, నరకమునఁ బొక్కుచుండు న♦నారతంబు.

గీ॥ వీరలందఱు నొకవైపు ♦ వినుఁడు మీరు, మేలు చేసిన వారికి ♦ మీఱి కీడు
చేయువాఁడును నట్టులఁ ♦ జేయఁదలఁపు, చేయువాఁడును నొకవైపుఁ ♦ జేరగలరు.

క॥ పశులకలిమికిని సంతుకుఁ, బరుల మహోన్నత్వమునకుఁ ♦ బాయక మదిలో
మఱుఁగుచునుండెడి చెనఁటులు, చిరకాలము నరకబాధఁ ♦ జెందుదురు మునుల్!

సీ॥ భూదానమొనరించి ♦ భూమినీయక తామె, యనుభవించుచునున్న ♦ యట్టివారు
గోదానమొనరించి ♦ గోద్రవ్యమును దామె, యారగింపుచునున్న ♦ యట్టివారు
కన్యకాదాన మ♦క్కజఁ జేసి కూఁతును, నల్లున కంపని ♦ యట్టివారు
సత్రంబు లమరించి ♦ చాలఁగ నవ్వాని, యన్యుల కిచ్చుకొ ♦ న్నట్టివారు
గీ॥ జన్మములఁగా నగ్రుమనుమ వి♦స్తారధనము, నార్జన మొనర్చి యటు నల్ప ♦ నట్టివారు
విత్తముల నప్పఁగొని మొగ♦వేయువారు, చేరుదురు నరకార్తిని ♦ సిద్ధముగను.

గీ॥ ఆలుమగలును దలి ♦ దండ్రు లాత్మజాతు, లన్నదమ్ములు మిత్రులు ♦ నల్లెగురువు
శిష్యుఁడును వీరలకుఁగల ♦ చెలిమిఁ బాపి, కొంకక విరోధమును ♦ నొడఁగూర్చువారు

క॥ ఖలుదోసంబులు తనయెడఁ, గలిగియు వేఱొకరియందుఁ ♦ గలుగకయున్నన్
జలమునఁ బరులను దెగడెడు, పలుగాకులు దెలిపిగొనని ♦ పాపులు పుడమిన్.

గీ॥ పసులు మేఁతల పంటకు♦ప్పలను బరులఁ, యిండ్లఁ గాల్చెడువారు ద♦బ్బియకప్పు
పత్రముల సృష్టిచేసెడు ♦ వారు పరులఁ, జంపువా రొందుదురు నర♦కంపువసతి.

ఆ॥ అడవి నిరపరాధు♦లై యుండుప్రాణుల, హత్యసేయువాఁడు ♦ నాలఁగట్టి
పొలముదున్ను వాఁడు♦పొంకమొప్పఁగనెద్దు, నెక్కువాఁడునిరయ♦మేగఁగలరు.

క॥ అతికోపను లతిలోలుపు, లతికాముల లతిపిశునులు ♦ నతిగర్వులు నెం
దతివచనులు నతిభక్షులుఁ, గుతుకంబఱ యమునిశిక్ష♦కుఁ బాత్రింబుల్. 102

## —* న ర క ము లు *—

వ. ఇఁకను వారల కందఱ కవశ్యానుభోగ్యంబులగు నారకభేదంబుల నెఱింగించెద వినుండు. నిరయంబు లష్టావింశతిపరిమితంబులుగ విద్వాంసులు లెక్కవెట్టిరి. రౌరవంబు, మహారౌరవంబు, తామిస్రం, బంధతామిస్రంబు, కుంభీపాకంబు, కాలసూత్రం, బసిపత్రవనంబు, సూకరముఖం, బంధకూపంబు, కృమిభోజనంబు, కృమిభోజనంబు, తప్తవాలుకంబు, వజ్రకంటకంబు, శాల్మలియు వైతరణియుఁ, బూయోదంబును, విశసనంబును, లాలాభక్షణంబును, సారమేయాదనంబును, నవీచియు, నథశ్శిరంబును, క్షారకర్దమంబును, రక్షోగణంబును, శూలప్రోతంబును, దందశూకంబును, వటారోధంబును, మహాజ్వాలంబును, సూచీముఖంబును ననునవియు మఱియు నీయవి యొక్కొకటి దువిధంబులతో నొప్పి నూటనలుబది విధంబులై పరఁగు నిందు యాతనకిటులు పాపులఁబట్టి పలువిధంబుల బాధించి వేధించుచుందు రిట్టిపాపుల ఘోరదుఃఖంబులఁ బాపఁజాలు దానధర్మంబుల నెఱింగింతు వినుండు. 103

## —* పాపహరంబులగు దానధర్మములు *—

*సీ॥ ధేనుభూ తిలహేమాజ్య ♦ దివ్యవస్త్ర, ధాన్య గుడ రౌప్యలవణము♦లుద్భవిల్లన
బ్రాహ్మణులకీవలయు నివి ♦ పదియు మేటి, దానములు సర్వదోషని♦వారకములు.

గీ॥ మేక గేదెయు గొఱియయు♦మేలిదాసి, యీను దున్నట్టి యావును♦నిలయముఁ గన్నె
పసిఁడి యేనుఁగుగుఱ్ఱంబు♦బండినాగ, లియు ననడ్వాహమును గను♦నయముమీఱ.

క॥ పల్లకియును సెజ్జయునునిన్, బెల్లగు ధాన్యములు తిల్ప ♦ బృందముగలనౌ
నిల్లు పదియాఱు వీనిని, నుల్లసిలుచు నగ్రజనుల ♦ కొసఁగఁగవలయున్. 106

క॥ లలితోపానహపాదుక, లలరెడు ఛత్రింబునర్ఘ ♦ దామనుల కిడన్
విలసిలు యానంబులు లక్ష్ముల కిరవగు నిరవు గలుగు ♦ శుభచారిత్రల్!

వ. మఱియును.

---

* శ్లో॥ గోభూతిల హిరణ్యాజ్య । వాసోధాన్య గుడానిచ । రౌప్యం లవణమిత్యాహుః । దశదానాని కోవిదాః.

క॥ పీటలు రతనాల్ రజతము, నేటగు పరిజనుఁడును నవ ♦ నీతము ఫలము
ల్గాటపు దధి తాంబూలము, లాటంకముఁ దక్కి యొసఁగ ♦ నగు బాపలకున్.

వ. వెండియు నిఁకఁ దులాపురుషదానం బనన్యసాధారణం బటి యివి యననేల ?
యిష్టవస్తువు లన్నియును దానార్హంబు లవ్వాని యోజించి సమయానుసారంబు బరు
లకు నొసంగవలయును 109

ఉ॥ అన్నముచేతఁ బ్రాణిచయ ♦ మంతయు నాయువుఁ జెందియుండు నా
యన్నము లేనియప్డు విల ♦ యంబును జెందును గాన లోకమం
దన్నమె ప్రశస్తంబయి సు ♦ ఖావహమై కర మొప్పియుండు నా
యన్నము నిచ్చువారి బర ♦ మాత్మము మెచ్చు వదాన్యవర్యులన్. 110

వ. కావున

గీ॥ దానములలోన నుత్తమ ♦ దానమన్న, దానమిచ్చ్వానఁ గులము గో ♦ త్రంబుఁ గనక
యెల్లవారల కోదనం ♦ బీవలయును, సర్వసౌఖ్యంబు లిదియిచ్చు ♦ స్వర్గమిచ్చు.

చ॥ ఉదకము సర్వజంతువుల ♦ కొప్పుగ బ్రాపఁగఁ జెల్లుఁ దొట్లయం
దుదకము పోసియుంచ నది ♦ యొందెడు నాలు వృషంబు లింక నిం
పొదవ ననేక జంతుతతి ♦ యొందు జలంబును నట్టులౌట మీ
రిది మదిఁ బెంపెఱింగి సతి ♦ మెచ్చ నొనర్పుఁడు నీరదానముల్. 112

వ. ఇంకను.

క॥ తలిదండ్రులఁ గొలుచుట యొ, జ్జలఁ గొలుచుట నతిథి రిక్త ♦ జనులకు నన్నం
బులనిచ్చుట నడబావులఁ, గొలఁకులఁ జెరువులనుద్రవ్వి ♦ కూర్చు సుకృతమౌ.

క॥ చలిపందిరులను నిడఁ బూ, వులతోఁటలు ఫలకుజములు ♦ పొల్చెడు తోపు
ల్నిలిపి తెరువ నన్నసత్త్రము, లలరుచుఁ గూర్పంగ నాక ♦ మాతని కబ్బున్.

క॥ ఇలఁ బాఠశాలలును వా, చకమందిరములును బాట ♦ సత్త్రువులునున్
రకమగు భజనగృహంబు లు, త్సుకుఁడై కూర్చిన నభీష్ట ♦ సుఖముల నొందున్.

గీ॥ శర్వ గౌరీషడాస్య గ ♦ జముఖ వీర, భద్రకాళీ కాల ♦ భైరవాయ
తనములనుసంది గావిష్ణు ♦ ధామములును, దవతారాయతనములు ♦ దార్చుముదము

క॥ బాలురకుఁ జదువుఁ జెప్పుట, మోలిగ నన్నంబు బట్ట ♦ లొసఁగుటయు గడున్
వీలుగఁ బొత్తము లిచ్చుట, చాలఁగ సుకృతంబొసఁగు ♦ శర్మము లిచ్చున్.

గీ॥ మఱ్ఱి మామిడిమున్నగు ♦ మ్రాకులను బ, థమ్మునందు వరుసగ సం ♦ ధానమొనరఁ
జేయువాఁడును దపసును ♦ జేయువాఁడు, బొంకనట్టిఁడు శ్రేయంబుఁ ♦ బొందఁగలరు.

వ. ఈ చెప్పినవన్నియుఁ బాపహరంబులై యొప్పు నందు గోభూదానంబు లుత్తమో
త్తమంబులు; అందునుఁ గోదానమందు. 119

సీ॥ వెండిగిట్టలతోడఁ బ♦సిండికొమ్ములఁ, దోయిలోఁ గంచుపాత్రతో ♦ దూడతోడఁ
బటముతో గ్రాసములతోడఁ ♦ బాడిమొదవుఁ, దగినవిప్రునకీనతె ♦ ధనముతోడ.

క॥ అటులిచ్చిన నా ధేనువు, కుటిలమతిం జేసినట్టి ♦ ఘోరతరాంహః
పటలములనెల్లఁ గూలిచి, పటుసౌఖ్యములిచ్చు స్వర్గ ♦ పదములనిచ్చున్. 121

గీ॥ ఎన్నిరోమంబు లావుయం♦దెసఁగియుండు, నన్ని వత్సరములు నా♦కమందు బాత
చేరియుండును దరియింతు ♦ సిద్ధముగను, సప్తపురుషులవఱకు వం♦శంబునందు.

వ. ఇంక సర్వధర్మానుష్ఠానయోగ్యంబగు భూమండలంబు తెఱం గెఱుంగవలయు
నగుట నుపన్యసించెద నాలకింపుడు భూవలయంబునందు, జంబూ, ప్లక్ష, శాల్మలీ,
కుశ, క్రౌంచ, శాక, పుష్కరనామకంబులగు సప్తద్వీపంబులు లవణేక్షుసురా
సర్పిర్దధిక్షీరజలార్ణవశోభితంబులై యొసంగు. 123

## —* భూమి సప్తద్వీపములు *—

క॥ భూపద్మమధ్యజంబూ, ద్వీపము యోజనపు లక్ష ♦ వెడలుపు నటుతే
యూ పొడవును గలిగి కడుఁ, శ్రీపదమై యొప్పు లవణ ♦ సింధువృతంబై.

సీ॥ లలితముగ దీనిమధ్య ని♦లావృతంబు, వర్షమొప్పెసఁ దన్మధ్య ♦ వాసిమీఱు
మేరుశైలంబు ధారుణీ ♦ నీరజమునఁ, గర్ణికాకృతిఁ దనరుఁ బ్రాం♦శంబుగాఁగ.

వ. ఇక్కనకపర్వతంబు పదియాఱు యోజనంబు లధఃప్రదేశంబునఁ బ్రవేశమగను
భూమినుండి యెనుబదినాలుగు యోజనంబులు పొడవుగను నందు బదియూఱు
యోజనంబులు శిఖరంబులుగను జెలువొందియుండు నీక నిద్దానికి దక్షిణంబున
నిషధహేమకూట హిమాచలంబులును నుత్తరంబున నీలశ్వేతశృంగి పర్వతంబు
లును భాసిల్లియుండు. ఈయవి పదివేల యోజనంబుల పరిమితితో రత్నసంఘం
బులై యరుణప్రభలు గలిగి యొప్పొందు నీక నిలావృతవర్షంబుతోఁ గూడఁ
దొమ్మిది యగు భారతాదివర్షంబు లొక్కొక్కటి తొమ్మిదివేల విస్తారంబుతోఁ
గులశైలంబులతో నొప్పుచుండు. భారతవర్షము కింపురుషవర్షము హరివర్షము
కేతుమాలవర్షము భద్రవర్ష మిలావృతవర్షము రమ్యకవర్షము హిరణ్మయ
వర్షము కురువర్ష మనునవి. అందు మేరువునకు దక్షిణంబున భారత కింపురుష
హరివర్షంబులును నుత్తరంబున రమ్యక హిరణ్మయ కురువర్షంబులును మధ్యం
బున నిలావృతవర్షంబును దూర్పున భద్రాశ్వవర్షంబును బడమట కేతుమాల
వర్షంబును బరంగునీక నిట్లీ యా మేరువునకుఁ బూర్వాది చతుర్దిశలందు

మందర గంధమాదన విపుల సుపార్శ్వంబులను పర్వతంబులును దచ్ఛిఖరంబు
లందుఁ గదంబజంబూపిప్పలవట వృక్షంబు లొప్పియుండును. 127

క॥ జంబూవృక్షములందు గ, జంబులఁ దుల సేయునట్టి ♦ చక్కనిపండ్లో
జంబూఫలవిరాలి యవియుఁగ, జంబూనది యొదవెఁ దద్ర♦సంబున నచటన్. 128

గీ॥ ఆనదీతీరమున నున్న ♦ యఖిల జనులు
తోయముఁగ నానదీ స్వాదు ♦ తోయమును భృ
శముగ దోయిళులన్ ద్రావి ♦ యమృతరసముఁ
గాఁగఁ జాటించి మోదంబుఁ ♦ గాంతు రిగుల.

క॥ అది త్రావినవారలకెం, స్వేదవదు దుర్గంధము జర ♦ యును జెమటయు నుర్
బ్రిమలపు బిగి నింద్రియములు, మదికుత్సాహంబు లగ్గు ♦ మఱిమఱి గూర్చున్.

క॥ ఇందలి మృత్తికతోడన్, సుందర మదియొదవు పుగల ♦ కుం గొమ్మలకున్
గొండించుఁగాంతి నగలను, బొందించును హాటకమిడు న♦పూర్వతరముగాన్.

వ. ఇక మేరువునకుఁ బూర్వమునఁ జైత్రరథంబును దక్షిణంబున గంధమాదనంబును
బడమటి విభ్రాజంబును నుత్తరంబున నందనవనంబు నను వనంబులును అరు
ణోదంబు మహాభద్రంబు శీతోదంబు మానసంబు నను సరస్సులును బూర్వాదిగ
నొప్పుచుండు మఱియును శీతాంజనంబును కురంగంబును కురరంబును మాల్య
వంతంబునను శైలంబులు మేరువునకు బూర్వకేసరాచలంబులుగను, త్రికూట
శిశిరపతంగరుచకనిషధకపిలగిరులు దక్షిణకేసరాచలంబులుగను సినీవాసము కుసుం
భము, కపిలంబు నారదము నాగముమున్నగు నగంబులు పశ్చిమకేసరాచలంబులు
గను శంఖచూడ ఋషభహంస కాలంజర పర్వతంబు లుత్తరకేసరాచలంబులు
గను నొప్పుచుండు నిక మేరువుమీఁద మధ్యభాగంబందుఁ గనకమయంబగు
బ్రహ్మపురంబు పదునాల్గువేలయోజనంబులపరిమితితోఁ జెలువొందు.

గీ॥ ఈవిధి పురంబుసరుఁజుట్టు♦నెంతయేని, యష్టదిక్కులయం దేచి ♦ యష్టలోక
పాలకులపట్టణంబులు♦వి[illegible]మీఱు, దివ్యజనులందఱుందురు ♦ దీప్తినందు.

వ. మఱియు నిద్దానికి విష్ణుపదవినిష్క్రాంతయగు గంగానది సీతయని, యలకనంద
యని చక్షువని, భద్రయని నాల్గుపేరులతోఁ దూర్పునుండి నలుదెసల నానాశైల
వనస్థలుల నంటి యంబుధిఁ జేరు. 133

గీ॥ మేరుగిరిఁజుట్టుకొనియున్న ♦ శ్రేణిశోభి, దటులయందును నందనో ♦ ద్యానవనుల
దివ్యజను లప్సరస్సుద ♦ తీరతముల, సంతతంబు సుఖింతురు ♦ శంకదక్కి. 134

క॥ భారతవర్షం బిలకను దు, హారిగిరికి దక్షిణమున ♦ సందర్శమున కుద
గ్ఘాటశీర్షము తగుఁ బ్రదివ, భూరిసుఖంబులకునిద్ది ♦ మూలమయి తగున్. 135

నిరంతరంబు మేరుప్రదక్షిణంబు సేయుచు నహోరాత్రంబులఁ దనరఁజేయుచుండు. ఇందు దివ్యులు పద్మాసనుని బూజించుచు రుగ్జరా దుఃఖ రాగ ద్వేషాధర్మంబులు లేక పదివేలసంవత్సరంబులు జీవింతు రిట్లు సప్తద్వీపంబులతోఁ బర్వతంబులతో ధాత్రీమండలంబు పంచాశత్కోటివిస్తీర్ణంబై విరాజిల్లు నిట్లు భూగోళంబు తెలియం గలిగించితి నిఁక భగోళంబుఁ దెలియంగింతు వినుఁడు. 140

## —* భ గో ళ ము *—

క॥ ఇలపైని లక్షయోజన, ములపై రవిమండలంబు ♦ పొలుపెసఁగును స
వ్వలను బయి లక్షయోజన, ములమీఁదన్ జందురుండు ♦ మురుపుగనుండున్.

గీ॥ వెలయునటుపయి నొకపది ♦ వేలయోజ, నములపై ఋక్షములు దీప్త ♦ లమర నట్టి
తారకామండలముపైనిఁ ♦ దనరుబుధుఁడు, బుధునకూర్ధ్వంబునందుఁ గా ♦ వ్యుండు దనరు

క॥ ఆకావ్యున కూర్ధ్వంబున, నాకుజుఁ డుల్లసిలు నింక ♦ నంతకుమీఁదన్
శ్రీకరుఁడైన బృహస్పతి, జోకగఁ దనరారు సతతల ♦ శోభలు దనరన్. 143

గీ॥ అందుపైని శనైశ్చరుం ♦ డమరియుండు, నొనర నాతనిపై లక్ష ♦ యోజనములు
పైని సప్తర్షిమండలి ♦ పరిఢవిల్లు. నందుపై లక్షయోజనా ♦ యామమందు. 144

క॥ ధ్రువుఁ డుండు నాతనికిఁపై, రవికాంతుల నీసడించు ♦ రమ్యతరమహా
భువనము చెలువొందు నజో, ద్భవులగు సనకాదులందు ♦ భాసిల్లుదు రోగిన్.

వ. ఆపైని జనలోకంబు వెలయు నందుపై రాజు లుల్లసిల్లుచుండు రప్పైని దపో లోకం బలరు నందుఁ దపస్వు లుందు రటుపైఁ గనుదప్పున బ్రహ్మలోకం బుండు నద్ది భూలోకంబున కెనిమిదికోట్ల యోజనంబులపైనలరు. 146

గీ॥ అందు బ్రహ్మణితోఁ జతు ♦ రాననుండు, వేదఘోషంబు వెలయఁగ ♦ నెమ్మినుండు
కుదురుగా నట కెన్మిది ♦ కోట్లయోజ, నములపైనుండు వైకుంఠ ♦ నగరభూమి.

క॥ అందున నిందిరతో సర, విందాక్షుఁడు పార్షదౌఘ ♦ బృందంబులతో
డం దనరియుండు నచ్చోటు, నుందును చెలువొంద [illegible].

వ. అచ్చోటికిఁ బదియారుకోట్ల యోజనంబులపైని మహోత్కైలాసం బుండు. అద్దాని పైని వేఱొండు లేదు. 149

గీ॥ ఇందు బాలేందుమౌళి మ ♦ హేశ్వరుండు, అమ్మహేశ్వరితో సత ♦ మ్మలరుచుండు
కోట్లకొలఁదిగఁ బ్రమథులు ♦ గూర్మిసేవ, లాచరించుచునుందురు ♦ హర్షమెసఁగ.

వ. ఇఁక నందు ముక్తిత్రయంబునొందిన మాహేశ్వరులు సంతతం బీశ్వరుల సాన్నిధ్యంబందుండి యువ్వారిఁ గొలుచుచుండు రద్దానికి సమీపంబున గోలోకంబందు ఆలఁ బాలించుచు రాధాసనాథుండు కృష్ణుండు వసించి నిచ్చలు గోక్షీ

రంబులఁ దెచ్చి మహేశ్వరుని కర్పించి యర్చించి మహేశ్వరానుగ్రహంబుఁ బడయుచుండును. నిది భగోళస్వరూపం బిఁకను మహీతలంబున కర్వాక్ప్రదేశంబగు పాతాళంబుఁగూర్చి చెప్పెద వినుండు. 151

——* పాతాళములు *——

క॥ వసుమతి కధఃస్థలంబున, నెసఁగును బాతాళ మట ను♦పేంద్రునియంశం
బసమునఁ నురగేంద్రుఁడు తల,ల సుమంబులవలె జగంబు♦లనే దాల్చుమునుల్!

గీ॥ మణివితతిరంజితాయత♦ఫణిసహస్రములఁ దనలసంయుత శ్వేత♦భూధ్రమట్లు
శేషుఁడశేషుఁ డనుండు స♦శేషసుగుణభూషితుండయి పాతాళ♦భూమియందు.

క॥ మఱియును బడిగెలబారుల, విరిదండలఁ జాలఁదాల్చి ♦ విష్ణుపదీవి
స్ఫురితరజతాద్రిఁ బోలుచుఁ, గరములరెండు దండశూక♦ఘనుఁ డచ్చోటన్. 154

గీ॥ పొంకమగు వెన్నెలడితీవలఁ♦బోలి మెఱయు, నాగకన్యలు గొలువ నా♦నందముసను
బ్రహ్మదేవుని యనుమతిఁ♦బట్టి యెపుడు, భువనముల నెల్లఁ దలలను♦మోయుచుండు.

క॥ కడుభయదమగు విషాగ్నిన్, గడుకొని బుసకొట్టుచుండుఁ ♦ గడూరతనయుం
డడఁగుచుఁ గల్పాంతంబుల, వెడలిచి యవ్విసము భువన♦వితతిన్ గాల్చున్. 156

వ. మఱియు.

గీ॥ మహితఘూర్ణితనేత్రుఁడై ♦ మహితుఁడాతఁ, డెప్పుడే నావలించిన♦నీయిలాత
లంబు కాననశైల♦లములతోడఁ, జలన మొందెడుఁ బ్రజ లెంతో♦యులుకుఁజెంద.

వ. ఇఁకనీ పాతాళంబులు పదివేల యోజనంబుల విస్తారంబుతోఁ గ్రిందుగఁ గ్రిందుగ, నతల వితల సుతల రసాతల తలాతల మహాతల పాతాళంబులను పేరులతో నేడు లోకంబులుండును. 158

క॥ ఈయమవి దర్శనీయములు, నాయతములు హేమభూము♦లతిసుఖదంబుల్
సాయక యుండు వసించెడు, నాయసురదానవశ్రేణ్యులు పన♦గాశనజాతుల్. 159

క॥ గాఁడిటనుఁ దపనుఁడును శశి, రాఁడిటకు గ్రహంబు లుడులు♦ రావిఁక నెప్పుడున్
బోడిమిని మిఱుఁగ మణులే, జాడను వెలుఁగును దనర్చు ♦ సంబర మొసవన్.

వ. మఱియు నందు

క॥ వనములు పుంస్కోకిలరుతి, ఘనములు కాసారములు వి♦కచపద్మ సుజీ
వనములు శాశ్వతయౌవన, ధనవతు లందంబు మించు ♦ తన్వీశ్రేష్ఠల్

గీ॥ భక్ష్యభోజ్యాన్న పానముల్♦బహువిధములు, జాళువాపట్టువస్త్రముల్♦సౌరభమున
నొప్పు లేపనములు తావి♦పుష్పములును, రవలసొమ్ములు నింటింట♦రాసులొప్పు.

వ. మఱియు వీణావేణుమృదంగసంగీతనాదంబు లెంతేనియు సంతసం బొసంగ సిద్ధ
పూరుషులు దానవులు కాద్రిసేయు లచ్చట సుఖంబు లనుభవించుచుందురిట్లధో
లోకంబుల స్వరూపంబు నేర్పడఁ జెప్పితి నిఁక నెల్లగ్రంథంబులందు స్త్రీరక్షణం
బవసరంబు. స్త్రీరక్షణం బొనర్పకొనకున్న సర్వంబు చెడి సంకరంబొనర్చెద
రట్లు గావున ముందుమ్ముందు వారల మనంబెఱుంగుట కర్జంబగుట నద్దాని నేఁటఁబ
లతు వినుండు. 163

క॥ నారదుఁ డొక్కపు డచ్చర, యా రామను బంచచూడ ♦ నరుగమ్మునరన్
జేరి యడిగె స్త్రీమానస, చారిత్రంబును నెఱుంగ ♦ చక్కటి సంతిన్. 164

—* పంచచూడ స్త్రీస్వభావము నారదమునికిఁ జెప్పుట *—

గీ॥ పంచచూడయుఁ గేల్మోడ్చి ♦ పలికెనిట్లు, మునికి దేవర! నేను ♦ బోట్లనై యె
టులవచింపుదుఁ బొలఁతుల ♦ తలఁపుపోలుప్ర, నాయమగునొక్కో! యట్టి దం ♦ పంబునాకు.

చ॥ అనవుడు మౌని యిట్లనియె ♦ నచ్చరలేమ! నాతిమిన్న! బొం
కును వచియింప దోసమగుఁ ♦ గూడ దటుల్ నిజమానసస్వభావమున్
వినిచిన నేర మెట్లొనరు? ♦ వేగ మె చెప్పుము నీముఖంబునన్
వినఁగఁ దలంచినాఁడ నిటు ♦ వెగ్గలమైన కుతూహలంబునన్. 166

క॥ అనుటయు నారదమౌనికి, వినయమ్మున స్త్రీల తెఱఁగు ♦ వినిపింప మన
మ్మునఁబూని చారుహాసిని, యనియె నిటుల్ చెప్పుదువిను మ ♦ హాత్మ! ముదమునన్.

గీ॥ మంచికులమునఁ బొడమిన ♦ మానినులును, రూపవతులును నాథుని ♦ ప్రాపుగలుగు
వార లుచితంపుమర్యాద ♦ మీఱుదురె బ, స్త్రీలయందలిదోసంబు ♦ శిష్టచరిత!

క॥ విను ముదిదకన్నలోకం, బునఁ బాపపుఁబోఁకలేదు ♦ మునికులతిలకా!
కనఁగ సకలాఘములకున్, వనితయె మూలం బరసిన ♦ వాఁడవు నీవున్. 169

గీ॥ చేడియలు దమ్మువాంఛించి ♦ సేవఁజేయు, వారిఁ గొలఁదులుదిరిగనివ ♦ వారిఁగలసి
క్రీడసేయుదు రొకదరు ♦ కిల్బిషములు, కించుకేనియు నరయరు మా ♦ నీంద్ర! మదిని.

చ॥ నెఱపునసేవి వంగడపుఁ ♦ జేవమి గౌరవ మొందదేని బల్
సిరిఁ గనిదోని సాధుమది ♦ చేష్టలనంచనిదోని మానసీ
తెఱవలు గాముకాత్మలయి ♦ తెంపున నెవ్వనినేని గాంచినన్
మరగి సుఖంబు రిందు నను ♦ మాన మొకించుక లేదు సంయమీ! 171

క॥ మగనియు బావల మఱఁదుల, బుగులునునున్ బరిజనములు ♦ బుగులున మదికిం
దగుపురుషులు సేకూరమి, మగువలు మగనికడనుందురు ♦ నుతియాప్తమొయిగా.

క॥ వీరికిఁ జోరకాసిది యెం, దారయఁగా నొసర దగ్గ ♦ ననను నేఱెన్
మీఱి చనుచుందు రేపున, జారునిఁ జేరంగఁ దాప ♦ సకులవతంసా! 173

సీ॥ ఎడపక యొకనెల ♦ నెడమహస్తంబు కం, పంబును నొకతీరు ♦ నడచెనేని
దవడలున్ గొంతుకం♦తయును దడిన్ మాలి, మించువైఖరిని శో♦షించెనేని
తన నీడయందు మ♦స్తకము గన్పట్టక, దురుసున మొండెంబు ♦ దోచెనేని
కాకమేనియు విహం♦గంబేని యలకపో, తంబేని దలపొక్కి ♦ తనరెనేని

గీ॥ కారణము లేక మాక్షిక ♦ గణము దన్నుఁ, జేరి పరివేష్టనంబున ♦ నిల్చెనేని
అట్టి మనుజున్కు నొకనెల ♦ యందె జముని, ప్రోలికేగంగలండు డిందు ♦ బొందు లేదు.

గీ॥ పట్టపగటను నుల్కాభి ♦ పాతనంబు, నడికిరేయిని నింద్రధ ♦ నుస్సుఁ జూచె
నేని వాఁడాఱు నెలలలో ♦ నినతనూజ, సన్నిధికిఁ జేరు లేదింక ♦ సందియంబు.

వ. మఱియు నింకను ఛాయాపురుష స్వరూపంబుఁ గూర్చి చెప్పెదను వినుము. 178

—— * ఛాయాపురుష దర్శన ఫలభేదములు * ——

క॥ ఇనునైనను శీతలర, శ్మినినైనను వెనుకఁ జేసి ♦ సితపటధరుఁడై
మనమున దైవముఁ దలఁచుచుఁ, దనఛాయను జూడవలయు ♦ ఛాయాధరిరో!

వ. అందు శిరోవిహీనంబైన నాఱుమాసంబులలో మృతిఁజెందు. 189

గీ॥ ధవళమైనను నాఛాయ ♦ ధర్మమొందుఁ, గృష్ణమైనను నాఛాయ ♦ కల్మషంబు
శోణమైనను బందిలోఁ ♦ జొచ్చుఁ బీత, మైనఁ గలహంబు వాటిలు ♦ వనరుహారి!

చ॥ మఱి విభుఁ జూడఁగాఁ దనర ♦ మిత్రసుతుఁ డిష్టపుబంధువుల్ రిపుగం
బొఱిఁగిన శుద్ధ్యయంబు గటి ♦ యుగ్ గనుపట్టక యుండెనేనియుగ్
సుతుఁగను భార్య జంఘ లటు ♦ చొప్పడకున్న ధనంబు పోవుఁ జ
జరణములుగ్ గనన్ బడని ♦ చంపము నాన్ బరదేశమేగుచున్. 191

క॥ అనుటయుఁ బార్వతి శర్వున, కనియెను మరణంబుఁ దెలియ ♦ నట్టివినము చె
ల్పినయట్టులె సాంప్రతమున, ననఘా! మృతిఁగల్గు జాడ ♦ నాకనిఁ యిమ్మా!

క॥ అనుడున్ శంకరుఁ డగజకు, ననె దేవీ! సర్వజనహి♦తార్థినినై యి
ట్లనువుగ నడిగితి వింతయు, విను మింక నెఱిఁగింతు యోగ♦విద్యాగరిమన్.

వ. పృథివ్యప్తేజోవాయ్వాకాశంబులు పంచభూతంబులు లేతత్స్వరూపయోగంబు పాంచ
భౌతికంబగు శరీరంబు. అందాకాశంబు సర్వవ్యాపియై యుండు. సర్వం బాకాశ
మందు లయించు. 194

క॥ ఎద్దాని వియోగంబున, నొద్దిక భూతంబులెల్ల ♦ నొందెడు స్వపదం
బద్దాని సన్నిపాతము, నెద్దేవుఁడు స్థిరముగాఁగ ♦ నేర్పడఁ జెప్పన్. 195

వ. జ్ఞానులగువారు తపోమంత్రబలంబుల నిది యంతయు నెఱుంగుదురనినఁ బరదేవి
మహేశ్వరున కిట్లనియె.

గీ॥ దేవ! మును ఘోరరూపుఁ డా • దివ్యమూర్తి
కనుఁ గరాలుండు కాలుండు • గర్వమణఁగ
నీదు శూలహతిఁ జేసి • నిహతుఁడై మ
రల భవదనుగ్రహంబున • బ్రతుకుఁ గాంచె. 197

క॥ పొరిఁబొరి నిను సంస్తుతులన్, మఱిమఱి సంతోసపెట్టి • మరలఁ దనదియా
నురనగు నధికారముఁగొని, పొరిగొనుచుండెను యథేచ్ఛ • భూతవితతులన్.

వనమయూరము: అక్కటతన దేవర! ద•యామతి యొసంగన్
దిక్కటి మృతిన్ గొనెడు • దీనులను నెంతేఁ
జక్కఁగని చెప్ప మిఁక • సాయమగు మార్గం
బెక్కరణిఁ గాలుని జ•యింతురొ మహాత్మా!

——* మృత్యుంజయ యోగములు *——

వ. అనిన మహేశ్వరుండు,

గీ॥ ధ్యానపరులైన యోగు లె•ట్టాననేని, పంచతనుజెంద రిద్ధి ధ్రు•వంబు వారు
కాలునిన్ గెలుచుటకెందుఁ•జాలువారు, రమ్యతరగాత్రి! పర్వత • రాజపుత్రి!

వ. ఆయోగంబును జెప్పెద,

క॥ హిమకరవదనా! చెప్పెదు వి,నుము మేదురయోగవిధము•నున్ సులువుగభూ
తములైదు తద్గుణములును, నమరగ దేహంబు జనన•మగు నిలలోనన్. 201

గీ॥ ఆకసంబున వాయువా • యనిలముననను, నగ్ని యద్దాన నుదకంబు • లాజలములఁ
బృథివిజనియించువినుముని•భీతహారిణి, నయనరో!విలోమగతిన న్లి•లయముఁజెందు.

క॥ ఇల నైదు గుణంబులతో, సలిలము నాలుగుగుణముల • జ్వలనుడు మూటన్
జెలువుగ రెంట సమీరం, బలయంబర మొక గుణమున•నలరెడుసాధ్వీ! 230

వ. శబ్దస్పర్శరూపరసగంధంబులనెడు నీగుణంబులెపుడు భూతంబులఁ బాయునో నపు
డవ్వి విపన్నంబులగును. అందువలనఁ గాలజిగీషుండగు యోగిచే శబ్దాది గుణం
బులు స్వస్వకాలంబందుఁ జింతనీయంబులు.

క॥ దేవి! రహస్యముఁజెప్పెద, నీవిఁక నిద్దాని భక్తి • నిరతుఁడును గడున్
బావనుఁడు శ్రద్ధధానుం, డౌ వానికిఁ జెప్ప వలవ•దన్యున కెపుడున్. 305

గీ॥ రాత్రులందున దీప వి•రహితమైన, యంధకారమునన్ జను•లందఱును ని
దురను జెందుచునున్నప్పు•డరసి సెజ్జ, యందుఁగూర్చుండి సుశ్వాస•మమరుచుండ.

వ. యోగంబు సల్పవలయు నది యెఱింగింతు వినుము.

తుంకారమును బాగుగా నభ్యసింపవలయును. ఈ ప్రకారమభ్యసించినయెడల యోగి పాపంబులఁ బొందఁడు. యోగపరిపాకమొందిన మృత్యుజిత్తగును. ఈనవ విధముల ఫలితంబుఁ జెప్పెద నాలకింపుము.

సీ॥ ఘోషమొప్పనునాత్మ♦కున్ శుద్ధిదము రోగ, హరము వశ్యాకర్ష♦కరమునగుచు
కాంస్యధ్వనియుఁ బ్రాణి♦గతుల నిరోధించు, భూతంబులను గ్రహం♦బులను నెట్టు
సతి! శృంగరవ మభి♦చారికాత్రినజనో, చ్చాటనమారణ♦సాధకంబు
ఘంటానినాద మా♦కర్షణంబొనరించు, నైలింపసిద్ధ క♦న్యలకునేని

గీ॥ ఇఁకను వీణాక్వణనము ద♦వ్వొందునేని, బరఁగువానిఁ గనంజేయు♦వంశనినద
మఖిలతత్త్వ ప్రకాశసి♦ద్ధిని నమరఁజేయు, దుందుభిధ్వానము జరామృ♦తులను బాపు.

క॥ విను శంఖనాదమున భు, వనములనెల్లను జరించు♦వలతియగుఘనా
ఘనగర్జనమున నాపద, లను బాయు మతెట్టిదైన♦లలితాంగి! ధరణి. 220

వ. ఇఁకను.

ఆ॥ ఏకచిత్తమొంది♦యెంతయుబ్రహ్మరూ, పంబుగాఁదనర్చు♦భవ్యమైన
యనుపమంబునైన♦యల్లతుంకారంబు, విన నసాధ్యమొకఁడు♦వెలయఁ బొందు.

గీ॥ నాఁడె యతఁడు సర్వజ్ఞుఁ♦డుండనుఁడును, సర్వదర్శియునై యిఁక♦సర్వలోక
సంచారమున సంచరించు వి♦కారనములను, బొందఁడొక్కింతయుఁ నతఁడు♦శివసముండు.

వ. పరమేశ్వరీ! యిట్లు శబ్దబ్రహ్మస్వరూపంబుతో లెక్కింపంబడితి నీకేమి వినవలెంచెదవన నప్పరమేశ్వరి యిట్లనియె. దేవా! వాయుమార్గంబు ననుసరించి ప్రాణాయామంబొనర్చువాఁడు కాలుని జయింపఁగలఁడని రహస్యంబుగాని నెఱుంగఁ జెప్పుమన్న శంకరుండి ట్లనియె. 223

క॥ దేవి! చెప్పెద వినుమిఁక, పావనమగు యోగమార్గ♦ప్రాణాయామం
బేవాఁ డొకపూసార్థముఁ, బా విడుపక చేయు మిత్తి♦బాఁటఁగలఁడిలన్. 224

వ. పవనధారణంబున జ్ఞానవిజ్ఞానంబులు నుత్సాహమును బ్రవర్తించును. 225

గీ॥ ఎవఁడు పవనంబును జయించి♦యొసఁగు నట్టి, వాఁడు సర్వజగజ్జయ♦భాగ్యమొందు
నిల జరామృత్యువులను జ♦యించుఁ గాన, ధారణధ్యానపరుఁడయి♦తనరవలయు.

గీ॥ యోగహరుఁడు భస్త్రిక♦లోన గాలి, నెట్లునిండించి తన మను♦వెసఁగఁజేసి
కొను నట్లె యోగియగువాఁడు♦కూర్మి మీఱ, పవనధారణమభ్యసిం♦పంగవలయు.

గీ॥ వ్యాహృతిపురస్సరముగ గా♦యత్రిమనువు, రహిశిరసుతోడనాయత♦ప్రాణుఁడగుచు
మూఁడుమారులుదా జపం♦బునొనర్ప, నలెందదేకాత్ముఁడగుచుఁబు♦వ్వారుఁబోఁడి!

ఆ॥ వాయవీయతత్త్వ • పరయోగ మీయది, పరమయోగిజనుల • భాగ్యలక్ష్మి
గ్రహము లర్కశశులు • గ్రచ్చఱ మరలుదు, రెపుడు మరలఁ డతివ! • యీసుయోగి.

క॥ నూతేండ్లు విమలతరకుశ, నీరముఁ గ్రోలుచుఁ దపించు • నేర్పరికిఁ గడున్
జేరెడు సుకృతఫలం బది, చేరుఁ బవనధారణంబుఁ • జెందెడు కృతికిన్.

వ. వెండియు నెవఁడు మాంద్యముఁ బాసి యేకాంతమందుఁ బ్రాణాయామం బొనర్చునో యవ్వాఁడు ముసలితనమును రోగంబును మిత్తిని గెల్చి వాయుగమనంబున ఖేచరత్వ మొందును మఱియు సిద్ధరూపంబుఁ జెంది కాంతిని మేధను బరాక్రమంబును శౌర్యంబును గాడ్పుతోఁ దుల్యంబగు గమనంబును సుఖంబుగఁ బొందు నింకఁ బెక్కులేల? యే బాపఁ డుదయమున లేచి ప్రాణాయామం బొనరించునో యవ్వాఁడు బ్రహ్మలోకంబును జెందు నిందు సందియంబు లేదిట్లు వాయుసిద్ధినిఁ జెప్పితి నింకఁ దేజంబువల్ల నగుదానిన్ జెప్పెదు వినుము. జనులెల్ల నిద్రించియున్నపుడు గాలియు లేని యంధకారంబందు సుఖాసనంబునఁ గూర్చుండి భ్రూమధ్యమందుఁ బ్రకాశించు వహ్నిజ్యోతినిఁ జూడవలయు నిది భ్రూచరీముద్రాయోగము. మఱియుఁ జేతివ్రేళ్ళతోఁ గన్నుల నించుక పీడించి సగము ముహూర్తమేక ధ్యానపరుఁడై వెలుంగు జ్యోతినిఁ జూడఁదగుఁ దెల్లనై యెఱ్ఱనై నల్లనై చిత్రవర్ణమై యొప్పు నిది ఖేచరీముద్రాయోగము. 231

గీ॥ కనుబొమలమధ్యయం దలి • కంబునందుఁ, బరఁగు బాలార్కతేజోవి • భాసురమగు
జ్యోతిఁ గనుచున్న పురుషుఁడు • సురుచిరేష్ట, గాత్రమును జెందు నిఁకఁ బర • కాయ మొందు.

వ. మఱియు నణిమాదిసంపన్నుండై దూరదర్శన దూరశ్రవణజ్ఞానవంతుండై బహురూపధారణసామర్థ్యంబును ఖేచరతాసిద్ధినిఁ బొందు నిఁక వేదాధ్యయనసంపన్నులును నానాశాస్త్రవిశారదులును నగువారు సతతము పూర్వకర్మవశంబున మోహంబుఁ బాయలేరు, 233

గీ॥ కనుచుఁ గనలేరు వినుచును • వినఁగలేరు, పాపమోహితులై యంధ • బధిరులట్లు
తమమునకుదాలనున్న య • త్తపవనస్థ, నామహాపురుషునిఁ దెలి • యంగఁ జెల్లు.

ఆ॥ విను సహస్రశీర్షుఁ • డును సహస్రాక్షుఁడు, నున్ సహస్రపదుఁడు • నునయి యొప్పు
నల పురుషుఁడు విశ్వ • మందు దశాంగుల, సీమ నావరించి • చెన్నుమీఱు. 235

వ॥ ఇఁక భూతములలో నాలవదగు నుదకభూతంబున నగు సామర్థ్యంబును జెప్పెదను వినుము. నియతమనస్కుండై యోగి సుఖాసనంబునఁ గూర్చుండి సమున్నతశరీరుండై కూర్పఁబడిన కరపుటములుగలవాఁడై చంచువునుఁ బోలిన ముఖంబున మెలమెల్లగ గాడ్పుఁ బీల్చుచుఁ దాలుమూలంబులనుండి జీవదాయకములై స్రవించు నుదకంబులఁ గ్రోలుచుండవలయు నవి శీతలంబు లమృతజలంబు లిట్లు పీసి

నిత్యంబు గ్రోలువాఁడు ముక్తినిఁ జెందుఁ డాకలి దప్పుల గెల్చి మహాతేజస్కుఁడై దివ్యకాయుండగును మఱియును. 236

గీ॥ ఏన్గువంటిబలంబు హ♦రీంద్రుపట్టి, వేగము సుపర్ణువంటి మేల్ ♦ వీక్షణంబు
గలిగి కృష్ణకచములొప్పి ♦ పొలుచు దేవ, గురునిభుండయి దివ్యవ♦త్సరశతంబు.

వ. ఇఁకను నొకవిధంబుఁ జెప్పెదనువినుము రహస్యము. యోగియగువాఁడు నాలుకను దవడలనువంచి కొంచెముకాలముంచవలయు నట్లైనఁ గ్రమమున లంబికాయోగమును జెందును. అటుమీఁదఁ బ్రసరించు చల్లని జలంబును సుధనుబోలెఁ ద్రాఁగినయెడల నమరత్వమును జెందును. ఇట్లు తపోవ్రత నియమయోగౌషధములచే ధర్మవిదులును నయవినయయుతులగువారు ముక్తిని గెలువవలయు నిట్లు నీవడిగినవానిఁ దెల్పితినని శివుం డుమతోఁ జెప్పెనని సూతుండు మునుల కెఱింగించిన నవ్వ్యాసు మహాత్మా! మన్వంతరంబులను దద్వంశంబుల నెఱింగింపు మనుటయు సూతుం డిట్లనియె. 238

## ప్రతిసర్గము - మన్వంతరంబులు - వంశములు - తదనుచరితములు

క॥ ధ్రువుని సమున్నతపదవీ, నివేశితు నెఱుంగఁ జెప్ప ♦ నే? మును మీకున్
సువిహితుఁ డాతఁడు పెక్కేం, డ్లవనిన్ బాలించె విబుధు ♦ లందఱు మెచ్చన్.

క॥ ఆ విభునకు సుతు లిద్దఱు, పావనులగు శ్లిష్టి భవ్య ♦ భాసురనాముల్
శ్రీ వెలయఁగఁ బుష్టికి సుతు, లావిర్భావంబుఁ జెంది ♦ రైదుగురు తగన్. 240

వ. రిపుఁడు రిపుంజయుండు విప్రుఁడు వృకలుఁడు వృషతేజుండు ననువారు. 241

క॥ సుగుచిరమహాసం డుత్తముఁ, డురుగుణనిధియైన నాతఁ ♦ డొక సుహ్యాదుచే
దురమునఁ జంపంబడె నా, పరితాపంబున జననియుఁ ♦ బంచతనొందెన్. 242

వ. ధ్రువపౌత్రు లైదుగురలో జ్యేష్ఠుఁడగు రిపునకుఁ బుష్కరిణియందు సర్వతేజుండను సుతుండు పొడమె నవ్వానికిఁ జాక్షుష మనువు జన్మించె ఆ మనువునకు నడ్వలయందుఁ బురువు, మానసము, శతద్యుమ్నుఁడు, తపస్వి, సత్యజిత్తు, కవి, అగ్నిష్టోమాతిరాత్రులు, అతిమన్యువు, సుయశుఁడు ననువారు పదిమంది కొమరులు జన్మించిరి. అందుఁ బురువున కాగ్నేయియందు దాఱుగురు కొమరు లంగుఁడు, సుమనుఁడు, ఖ్యాతి, క్రతు వాంగీరసుఁడు, గయుఁడు ననువారు జన్మించి రందు నంగునకు సునీథ యను ధర్మపత్నియందు దుష్టచేష్టుండగు వేనుండు పొడమె.

క॥ తనయుని చెడునడతలకున్, మనమునఁ గడు రోసి యంగ♦మనుజవిభుఁడు గా
వనుబడి యెందున నేనియుఁ, జనియెను జిత్తం బొకింత ♦ శాంతిన్ జెందన్. 244

వ. అనంతరము.

గీ॥ రాజుగాఁ దనరిన వేనుఁ◆డోజఁ దప్పి, చెడ్డచేఁతలఁ బ్రజల హిం◆సించుచుండ
దివ్యమును లందఱును జేరి◆తేఁకు వెసఁగ, నుగ్రులై చంపి రవ్వాని ◆ హుంకరించి.

వ. అటుమీఁద మునీశ్వరప్రార్థనచేతను నరాజకంబగు లోకంబుఁ గాంచియును దద్దుః
ఖంబుఁ బాపగోరి దివ్యమును లవ్వేనునికుడిభుజంబును మథింప నందు ధన్వియుం
గవచియు సూర్యతేజస్వియు నారాయణావతారంబగు పృథుఁడు జనించె. 246

క॥ ఆతఁడు గడుధార్మికుఁడై, భూతలమును నేలెఁగడిమి ◆ బోలుపొప్పఁగవి
ఖ్యాతితంబగు తేజము, ఖ్యాతియునర్థ గ్రమ్మికొనఁగఁ ◆ గరిమనురక్షిన్. 247

వ. మఱియు.

గీ॥ రాజసూయాహ్వయమహాధ్వ◆రం బొనర్చి, నట్టి యుష్టలలో నీటఁ ◆ దగగ్రగణ్యుఁ
డశ్వమేధశతంబుల ◆ నమరఁజేసె, నర్చియను భార్యతోఁ గూడి ◆ సౌఖ్యమంది.

వ. అమ్మహీనాథున కర్చి యందు విజితాశ్వుఁడు, హర్యశ్వుఁడను వారలిద్దఱుపుత్రు
లుద్భవించిరి. ఆవిజితాశ్వునకు శిఖండిని యందుఁ బ్రాచీనబర్హి యను వాఁడుపుట్టె.
ఆతండు సముద్రరాజసుతయగు శతధృతియనుకన్యన్ బెండ్లాడె. ఆపెకు బహు
యజ్ఞకరుండగు ప్రాచీనబర్హివలనఁ బదిమందిసుతులు జన్మించిరి. ప్రాచేతసులనఁ
బడు నవ్వారు పితృాజ్ఞచే సాముద్రోదకంబందుఁజొచ్చి జపంబు జపించుచు శివ
ధ్యానపరాయణులై పదివేలేండ్లు తపించిరంతఁ బ్రాచీనబర్హి యుష్ట్రమిందుచు నర
క్ష్యమాణయగు పృథివియందుఁ బ్రజాక్షయంబయ్యె నది కాంచి యంతకుమున్న
దపఃఫలంబుఁ జెందియున్న ప్రాచేతసులు నిజరాజధానిఁ జేరఁ బుడమియందలి
వృక్షంబులెల్లఁ బెచ్చుపెరిఁగి మార్గంబులను నిరోధించి బ్రతిబంధములఁగాంచి
యవ్వాని దహింపఁబూని ముఖమునుండి యగ్నిమారుతులఁ బుట్టించి సర్వవనంబులఁ
గాల్చుచున్నఁ జూచి కొంతవడికి సోముఁడు వారిని నాదరించి యిట్లనియె. 249

ఉ॥ కాల్పకుఁడింక భూజములఁ ◆ గానన మీయెడ దగ్ధమయ్యె నిం
దల్పతరంబులౌ ద్రుమము ◆ లాయెడ నాయెడ నున్నవిట్టి వి
స్వల్పములైనవాని నిఁక ◆ సాఁకఁదలంపుఁడు మన్యువేగముఁ
మల్పుఁడు వేగ మామకకు ◆ మారిక యిందు వసించుఁ గాంచుఁడీ! 250

క॥ ఆకన్నియ నర్చస్వినిఁ, మీఁకదియగు ధర్మపత్ని ◆ మీరారఁగఁ జానిఁ
జేకొని వివాహమొందుఁడు, లోకగ నాదక్షుఁడొప్పు ◆ సుతుఁడై పోలుచున్.

క॥ పదిమంది కొక్క లాలగు, నిది యొకతుక యని మనమున ◆ నెంచంబోకుం
డిది దైవచోదితంబై, యొదవిన దన వారలట్టు ◆ లొడఁబడి పేర్మిన్. 252

ఆ॥ వృక్షజాతయైన ◆ వెలఁదిని వార్షినిఁ, బెండ్లియాడిరంతఁ ◆ బేర్మిదనర
వారి కాపెయందుఁ ◆ బ్రభవించె దక్షుండు, చాక్షుషాఖ్యమనువు ◆ సమయమందు.

వ. అతండు ప్రజాసర్గరతుండై మానసికసృష్టిన్ బూర్వ నయ్యాది వృద్ధిగామిన్ జేసి బ్రహ్మచోదితుండై మిథునమిథునధర్మంబునఁ బ్రజావృద్ధిఁ బొనరింప నెంచి పరమేష్ఠిసమానుఁడగు నసిక్ని యనుదానిన్ బెండ్లాడియున్నంత నామెయందు. 254

క॥ ఆ దక్షుని కఱువదిగురు పైదలులు జనించి రధిక ♦ భాసురచరితల్
సౌదామనీప్రకాశలు, మేదుంతర శేముషీక ♦ మహితలు గడున్.

ఉ॥ వారలలోన ధర్మునకుఁ ♦ బద్గురఁ జంద్రున కిర్వదేడ్వురన్
ధీయుతుఁడౌ కశ్యపాఖ్యున కు ♦ ధీమణికిన్ బదుమూఁడు రంగిర
స్సూనునకున్ గృశాశ్వునకు ♦ సొంపుగ భూతున కిద్ద ఱిద్దఱిన్
గోరి యరిష్టనేమికినిఁ ♦ గూఁతుల నల్వుర నిచ్చెఁ బ్రీతిమై. 256

వ. ధర్ముని భార్యలగు పదుగురు – భానువు, లంబ, కకుప్పు, జామి, విశ్వ, సాధ్య, మరుత్వతి, వసువు, ముహూర్త, సంకల్ప యను వార లందు భానువునందు సుతుండై ఋషభుండను పేరిమిని నవ్వాని కింద్రసేనుండు జన్మించె లంబయందు విద్యోతుండును ఘోషంబు లుద్భవిల్లె. కకుప్పునందు సంకటుండుపుట్టెను నవ్వానికిఁ గీకటుండు జనింప వానికి దుర్గాభిమానులగు దేవతలు జన్మించిరి. జామికి దుర్గాధిష్ఠానదేవతలు జన్మించిరి. వానికి స్వర్గుఁడు నందియునుం బుట్టిరి. విశ్వయందు విశ్వేదేవులు పొడమిరి. సాధ్యయందు సాధ్యులు జన్మించిరి. మరుత్వతియందు మరుత్వంతుఁడు (ఇంద్రుఁడు) జయంతుఁడునను వా రుద్భవించిరి. జయంతుండు విష్ణువగు నుపేంద్రుండు. ఆ వసువు నం దయుఁడు ధ్రువుఁడు సోముఁడు ధరుఁ డనిలుఁ డనలుఁడు ప్రత్యూషుఁడు ప్రభాసుఁడు నను వారష్టవసువు లుత్పన్నులైరి. అందయునకు వైతండుండు శాంతుఁడు మునియనువారు కొమరులై పుట్టిరి. ధ్రువుండనువానికి కాలుండును సోమునకు వర్చుండును నవ్వానికి వర్చస్వియు ధరునకు ద్రవిణుండను వాఁడును, అనిలునకుఁ బురోజవుం డవిజ్ఞాతగతియు ననువారును నగ్నికి శరస్తంబమందుఁ గుమారుండు జన్మించుడు నాతని శాఖలందు శాఖుండు విశాఖుండును బృష్ఠమందు నైగమేయుండును జన్మించిరి. ప్రత్యూషునకు ఋషియను దేవలుండు నవ్వానికి క్షమావంతులు మనీషులు ప్రజ్ఞానంతులు పొడమిరి. ప్రభాసునకు విశ్వకర్మ జనియించె. ఆ విశ్వకర్మకు మనువు జన్మించె. ముహూర్తయందు మహూర్తులను దేవగణంబులును సంకల్పజుఁడగు కాముఁడునుం బొడమిరి. భూతునకును రూపయనునామె యందు రైవతాజభవభీమవామోగ్రవృషాకప్యజైకపాదహిర్బుధ్న్యబహురూపమహాత్ములను నేకాదశరుద్రులును రుద్రపారిషదులగు భూతగణంబులు నుత్పన్నంబులయ్యె. నింకఁ గశ్యపున కదితి దితి సురస అరిష్ట యిల దను సురభి వినత చేల తామ్ర క్రోధవశ కద్రువు ముని యను పొలఁతులు పదుముగ్గురు భార్యలైరి వారియం దదితికి వైవస్వత మన్వంతరంబునం దింద్రోపేంద్రులును

వినతయం దరుణ గరుత్మంతులును సురసయందును ననేక శిరోమండితంబులగు
సర్పశ్రేష్ఠములు జన్మించె నాసర్పశ్రేష్ఠులలోఁ బ్రధానులు – శేషుఁడు, వాసుకి,
తక్షకుఁడు, ఐరావతుఁడు, మహాపద్ముఁడు, కర్కోటకుడు, ధనంజయుఁడు, ధృత
రాష్ట్రుఁడు, కుహాసుఁడు, పుష్పదంతుఁడు, దుర్ముఖుఁడు, ఖరరోముఁడు మున్నగు
వారు. ఇఁకను క్రోధవశకును గద్రువకుఁగూడ సిద్ధ సర్పంబులు పుట్టె సురభికి
గోమహిషంబులును నిలకు లతావృక్షంబులు తృణజాతులు మున్నగునవి.
యక్షిణికి సాహారులు తేఁబడినుండి దివ్యులును మునియును నాకై కచ్చురలును
చేలమను కాసిక జక్కులు రక్కసులును బొడమి రియ్యది కశ్యపసంతానం
బిడ్డలచే జగంబెల్ల నిండెనిఁక 265

క॥ చంద్రునిఁ జిగనదిదోష్టురు, సుందరులను జేకొనియు శ్వశురుశాపమునన్
గుందుచు నల్పోత్కకాంతిల, యుందు నపత్యంబుఁ జెందఁ ♦ డయ్యెను మానుల్ !

వ. ఇఁక నిందుదారయగు తారయందుఁ జందురునకు జన్మించిన బుధుండు వంశకరుం
డయ్యె. వాఁడును గృతాశ్వుం డర్చియును నాపెయందు ధూమ్రకేశుని ధిషణ
యందు దేవలునిఁ గనె ననిన మార్కండేయుడు మహాత్మా! మన్వంతరంబుల నెఱింగిం
పుఁడనిన మార్కండేయుఁడిట్లనియె. స్వాయంభువుఁడు స్వారోచిషుం డుత్తముఁడు తాప
సుఁడు రైవతుండు చాక్షుషుఁడు ననువా రతీతమనువులు వర్తమానమనువు
వైవస్వతుండు, వాఁడియునను సావర్ణి, రౌచ్యకమనువు, బ్రహ్మసావర్ణి, ధర్మసా
వర్ణి, రుద్రసావర్ణి, దేవసావర్ణి, యింద్రసావర్ణియను మనువులు ముందఱ
రాఁగలవారలు. వీరలందఱు పదునాలుగురు వైవస్వతమన్వంతరమం దీమనువున
కిక్ష్వాకువు నభగుఁడు ధృష్టుఁడు శర్యాతి నరిష్యంతుండు, నాభాగుఁడు, దిష్టుఁడు,
కరూశకుఁడు, పృషధ్రుఁడు, వసుమంతుఁడనువారు పదుగురు పుత్త్రులు – ఆదిత్య
వసురుద్ర విశ్వేదేవమరుద్గణములు దేవతలు – పురందరుండను వాఁ డింద్రుండు,
కశ్యపాత్రి వసిష్ఠవిశ్వామిత్రగౌతమజమదగ్ని భరద్వాజులు సప్తర్షులు. కాశ్యపుం
డగు వామనుండు విష్ణుం డట్టులే యతీతమన్వంతరంబులందు నాగామిమన్వంతరం
బులందు, ఋషీంద్రదేవమనుపుత్త్రులు తత్తాదృశు లొప్పువారిఁక రాఁగల సావర్ణి
మనూద్భవంబు నెఱింగింతు వినుండు.

## —* సావర్ణిమనుజననము *—

చ॥ అతులతపోనిధానులు మ ♦ హాత్ముకు లారయుఁ డాత్వ్యుఁ డావివ
స్వతునకు సంజ్ఞనాఁగ నొక ♦ చాన సధర్మిణి యుండె నాపెకున్
సుతులు జనించి రిద్దఱు య ♦ శోధను లమ్మనువున్ యముండునున్
సుతయు నొకర్తు కాయమున ♦ శోభితనిర్ఝరిణీవతంసమున్. 268

వ. కుమారా! క్రిములు నీపాదంబందలి క్రొవ్వించుక హరించి పుడమిఁ జొచ్చు దాన
నీకు నపాయశాపంబు చరితార్థంబగు. సత్యవాదివగు నీకిం దరిష్టంబును నష్టంబును
బొడమదని చెప్పి సత్వరంబున సతిన్ జేరి యిట్లనియె. 280

ఉ॥ కోమలి! నీవు నాయెడలఁ ♦ గూరిమిచేయుచునుందు వెంతయున్
నీమది నిర్మలం బిపుడు ♦ నీవు కుమారు నిటుల్ శపింపఁగా
నేమనసొందె సందియము ♦ నచ్చికతో నెఱింగింపు సర్వముం
దామరసాక్షిరో! యిఁకను ♦ దైవముసాక్షిగ నచ్చుమానుచున్. 281

ఆ॥ చెప్పరున్న నిపుడె ♦ శిక్షింతుననఁ నాపె, బెదరి సంజ్ఞ నీదు ♦ వేడికోపఁ
జాల కిట్లు నన్ను ♦ జన్మింపఁగాఁ జేసి, నీదుసేవలోనఁ ♦ బాదుకొలిపి. 282

క॥ తరలెను బుట్టింటికి నా, తెఱఁగిది యన నాతఁడరసి ♦ తెలివయెడల నే
దురితము లేదనుకొని స, త్వరమున యోగవతి సంజ్ఞ♦వసతి నెఱుంగన్.

—* అశ్వినీదేవతల జననము *—

క॥ కురుకాననములలో నొ,క్కరితయు గోడిగయునై ని♦కామతపంబుం
గురుకొనిచేసెడు సాధ్విని, బరికించి మనమున నార్తి ♦ వడివేగమువన్ 284

క॥ ఘోటకమై సకిలింపుచు, ఘోటిన్ జేరంగఁబోయి ♦ కూరిమిఁగదియం
బాటించి పరుఁడో యనునగ, దాఁటుచునుండంగ నినుఁడు♦దన్నుఁదెలుపుచున్.

క॥ హేమలచేఁబుడు పెనుకొన, మోహారత్నంబు సంజ్ఞ♦ద్యుమణీయె దను న
న్వేషించి వచ్చె ననుచు మ,నీష నెఱిఁగినంతఁ దరణి ♦ నెక్కొని బడబన్. 286

సీ॥ క్రీడసేయఁగ జనియించి♦రీడు లేని, చక్కఁదనమున కిక్కలై♦చారుమూర్తు
లాశ్వినేయులు భాస్వంతుఁ♦డంతనాత్మ, తనువుఁగొనసంజ్ఞయున్నిజ♦తనువుఁ జెందె.

వ. అంత లోకబాంధవుం డపత్యకళత్రంబులఁగొని స్వీయమందిరముఁజేరి భార్యా
ద్వయంబుతోఁ బుత్త్రషట్కంబుతోఁ బుత్త్రీద్వయంబుతో సుఖంబుండె నీ
భాస్కర పుత్త్రులలో జ్యేష్ఠుండగు మనువె యీవర్తమాన వైవస్వతమనువు. ద్వితీ
యుండగు యముండు ధర్మనిబద్ధుండై ధర్మరాజనఁ బరఁగి జీవులకుఁ బుణ్యపాపం
బుల ననుభవింపఁజేయు నధికారంబున నియుక్తుండయ్యెఁ దత్సోదరియగు యమున
పుణ్యనదీవతంసంబై స్వీయోదక స్నానపానంబులఁజేసి సకలదురిత ప్రశమని
యయ్యె. ఇఁకఁద్రుతీయపుత్రుండగు సావర్ణి యనువాఁడు రాఁబోవు మనువై యెసం
గఁగలఁడిప్డు మేరుశిఖరంబునందుఁ దపించుచున్నవాఁడు. శనైశ్చరుండు శివున్
గొల్చి తత్ప్రసాదంబున నవగ్రహంబులలో నొకగ్రహంబై బృహస్పతి మండ
లంబుకన్న నూర్ధ్వభాగంబందు వసించెఁ దపతియనుకన్యను సంవరణుండను రాజర్షి
వరించి పెండ్లాడెనిఁక నాశ్వినేయులు స్వర్వైద్యులై తనరిరంత వైవస్వతమనువు.

## —* వైవస్వతమను వంశము *—

క॥ చిరకాలము సంతతిలే, కరసు వశిష్ఠునిపనుపున ♦ యజ్ఞముసేయున్
గరమరుదుగ నిలయను కూఁతురు జన్మింపంగ నపలి ♦ దుఃఖిసుగమనువున్. 289

గీ॥ దేశిక వశిష్ఠుఁజేరి య ♦ త్తెఱఁగుఁ దెల్పి, కూఁతురేటికిఁ బుట్టెనో ♦ తెల్పి? యనిన మ
హాత్ముఁడాలించెరసి తావ ♦ కాత్మపల్కి, కూఁతురుఁ గోరుట నాపుడు ♦ గానోత వెల్చె.

వ. దాస గన్యక జనియించె నైన దీని నా తపోబలంబునఁ బురుషునఁ జేసెదనని యట్లు
సాధించి పురుషునొనర్చిన నతండు సుద్యుమ్నుఁడను పేరఁ బరఁగుచు వర్ధిల్ల నంత
మనువు గోమరుని బట్టాభిషిక్తుఁ జేసిన నతండు. 291

క॥ లీలమెయి నొక్కనాఁడు భటాళియుఁ గరితురగవితతి ♦ యులరఁగ మృగయా
కేళీరతుఁడై ధరణీ, పాలుం డటవీస్థలికిని ♦ బయనము చేసెన్. 292

వ. అట్లు వెడలి మేరుపర్వతాగ్రారణ్యంబుఁ జేరియందు.

మ॥ పులులన్ దుప్పుల నెల్లుబంటుల వనీ ♦ భూదారరాజిన్ సివం
గుల సింగంబుల నేదుపందుల గడున్ ♦ గుట్టల్ నరెన్ గూల్చి శౌ
పిలి దూపన్గొని నీటికై వెదకి రా ♦ జీవాకరం బొందు న
ప్పులఁగన్పట్టినఁజేరి రాజసుతుఁ డ ♦ ప్పల్ గోరితెసం తేనియున్. 294

క॥ తోడను వచ్చినవారలు, గూడను గంభీరవరము ♦ గుఱ్ఱజుబాసులున్
బోడిగఁదావఁగ దొర యొక, యాఁడుదియయ్యెను జనంబు ♦ లంగనలేరి సాన్.

క॥ గోడిగ యయ్యెను గుఱ్ఱము, పీడయు నెఱ వగ్గలింప ♦ విపసగల న
చ్చేడియలెల్లరునున్ గడుఁ, బోడిమిచెడి మొలఁగెరంత ♦ పోగులు దుసగలన్.

ఆ॥ అనిన శౌనకుఁడు మ ♦ హాత్మ! యట్టిటిక, నాఁడువారిరిర ♦ అట్లురత్న
మెట్టులయ్యె ఘోటి ♦ మెఱిగింపుమీ యన, సూతుఁడిట్లు సెప్పె ♦ సద్వ్యముపవ.

మ॥ ఒకనాఁ డీశ్వరుఁ డార్యతో సచటఁ గా ♦ మోద్రేకయుక్తుఁ డై మాహా
త్ముకుఁడై కేళి యొనర్చుచుండుడు ముని ♦ స్తోమంబు లాస్థలీ
నికటంబున్ దఱియంగవచ్చిన భవా ♦ నీదేవి లజ్జించెఁ త
రక దవ్వోగిరి తాపసేంద్రులు నగా ♦ రణ్యంబు వేఱొక్కచోన్. 298

గీ॥ అంత శంకరుఁ డాత్మ ప్రి ♦ యానురంజ, నార్థమైప్రాస్కులో నివ్వ ♦ నాగ్రభూమిఁ
బురుషు లెవ్వరు చేరనఁ ♦ బొలఁతులగుదు, రంచు శపియించె నద్దాన ♦ నబలలైరి.

వ. అంత రాచపూఁబోఁడి నెచ్చెలులంగూడుకొని చింతతో నవ్వనాంతరంబులఁ
దిరుగుచుండుడు దైవేచ్ఛచే రాజనందనుండగు బుధుండచ్చోటుఁజేరి యచ్చ
పలలోచనన్ గనుకనిన్ గాంచి. 800

ఉ॥ బంగరుబొంగరంబులన ♦ భాసిలునట్టి మెఱుంగుగుబ్బదో
యిం గనుతోప్పు చూపుల న ♦ హించి యలంచెడి వాలుఁగన్నులన్
రంగగుభృంగమాలయన ♦ రాజిలుపెన్నెఱివేణియందమున్
హంసగఁజూచి రాజసుతుఁ ♦ డార్తత నచ్చపలాక్షి డాసినన్, 301

క॥ అక్కలికిఁయు సక్కాంతుని, సక్కజముగఁగాంచి మగని ♦ యలమటకుఁ గడున్
జిక్కి యసువనితినిఁ జూచినఁ, గ్రొక్కన నాతండు చేర్చెఁ ♦ గలికిఁ రతులన్. 302

—*పురూరవశ్చక్రవర్తి జననము*—

గీ॥ తోడి నె పురూరవుఁడుపుట్టెఁ♦దోయజాక్షి, కంత యక్కాంతయు వసిష్ఠు♦ నంతరంగ
మందుఁ జింతింపవిచ్చేసి♦యమ్మహాత్ముఁ, డరసి తద్విధమెల్లఁ బా♦యనికరుణను.

క॥ శివునిఁ ముని గడుఁగొలిచిన, నవిరళకృపఁ దఱియవచ్చి ♦ యభవుఁడు వరమే
మి నలరెఁ గోరుమన మునిని, ప్రసన్నుఁడు సుద్యుమ్నుపుంస్త్వ ♦ భావమునడిగెన్.

చ॥ అరసి శివుండు శాపగతి ♦ నమ్మునియందలి కూర్మిపేర్మి న
ప్పైఁటిననుఁ బూరుషున్ సలుప ♦ ధీరత నాతఁడు పుత్రులతోడుతన్
బురమున కేగి పత్నితోడఁ ♦ బొందికతోఁ గుణధుర్యులైనము
వ్వురసు సుతులన్ గనెన్ మనుల ♦ పూన్కికి సిద్ధులు గల్గుటబ్రిమే! 305

వ. ఉత్కళుండును గయుండును విమలుండునను పుత్రులు జన్మించిన సుద్యు
మ్నుం డవ్వారిని బెంచి వారలం దుత్కలున నుత్కలదేశంబులను గయునకుఁ
దూర్పు దేశంబును విమలునకుఁ బశ్చిమదేశంబు నొసంగి ప్రతిష్ఠానపురంబుఁ
బురూరవునకిచ్చి యంతఁవసోగ్రత్తు తాను వనంబునకేగినంత మనువు మరల
పుత్రార్థముగ్రమై శతాబ్దంబులు తపంబొనరించిన నిక్ష్వాకుఁడును శిబి నభగుండు
ధృష్టుండు శర్యాతి నరిష్యంతుండు కరూషుండు నృగుండు పృషధ్రుండు కవియను
వారలు పదుగురు పుత్రులు జన్మించిరందు నభగునకు నాభాగుండుపొడమె.
నాభాగునకంబరీషుండు జన్మించె నాతనికి విరూపుండనువాఁ డతనికిఁ బృషదశ్వుం
డును నాతనికి రథీతరుండును జన్మించిన నందు రథీతరునకు సంతానంబు లేకున్న
నంగిరసుండను బ్రాహ్మణునివలన క్షేత్రంబందు బుత్రులంగనుటయు నవ్వారు
రథీతరగోత్రులై పరఁగి రిట ధృష్టుని సంతానంబును దార్ష్టంబను వంశంబై
బ్రాహ్మణులంబయ్యెనిఁక శర్యాతికి. 306

క॥ ఆనర్త్తుండను సుతుఁడు గ, లానిధియు సుకన్యయ [redacted] ♦ లలితసుతయునున్
మానుగ నుద్భవమొందిరి, మానిన్ బెండ్లాడె [redacted] ♦మారియుఁ జ్యవనున్.

గీ॥ ముదుకమునిఁ బెండ్లియాడియు♦ముదిత మేలి, శీల[redacted] నశ్వినులసాయ♦మోలిఁబడసి
విభునిసుందరుఁదరుణుఁగా♦వించి మేటి, భోగవ[redacted]ంది యలరెను♦బూవుఁబోఁడి.

## —* వైవస్వతమను వంశము *—

క॥ చిరకాలము సంతతిలే, కరసి వశిష్ఠునిపనుపున • యజ్ఞము సేయన్
గరమరుదుగ నిలయను కూఁతురు జన్మింపంగ నడలి • దుఃఖితముగ మనువున్. 289

గీ॥ దేశిక వశిష్ఠుఁ జేరి య • త్తెఱఁగుఁ దెల్పి, కూఁతు రేటికిఁ బుట్టెనో • కో? యనన్ మ
హాత్ముఁడాతం డరసి తావ • కాత్మపత్ని, కూఁతుఁ గోరుట నాతీరు • హోత వేల్చె.

వ. దాన గన్యక జనియించె నైన దీని నా తపోబలంబునఁ బురుషున్ జేసెదనని యట్లు
సాధించి పురుషునొనర్చిన నతండు సుద్యుమ్నుఁడను పేరఁ బరఁగుచు వర్ధిల్ల నంత
మనువు గొమరుని బట్టాభిషిక్తుఁ జేసిన నతండు. 291

క॥ లీలమెయి నొక్కనాఁడు భటాళియుఁ గరితురగవితతి • యులరఁగ మృగయా
కేళీరతుఁడై ధరణిఁ, పాలుం డటవీస్థలికినిఁ • బయనము చేసెన్. 292

వ. అట్లు వెడలి మేరుపర్వతాగ్రారణ్యంబుఁ జేరియందు.

మ॥ పులులన్ దుప్పుల నెల్గుబంటుల వనీ • భూదారరాజిన్ సివం
గుల సింగంబుల నేదుపందుల గడున్ • గుట్టల్ వడెన్ గూల్చి శో
షిలి దూపన్గొని నీటికై వెదకి రా • జీవాకరం బొండు ద
వ్వులఁ గన్పట్టినఁ జేరి రాజసుతుఁ డ • వ్వాల్ గ్రోలె నెంతేనియున్. 294

క॥ తోడను వచ్చినవారలు, గూడను గంఖాణవరము • గూడ జలములన్
బోడిగఁ ద్రావఁగ దొర యొక, యూఁడుదియయ్యెను జనంబు • లాండ్రై రి వెస౯.

క॥ గోడిగ యయ్యెను గుఱ్ఱము, పీడయు వెఱ వగ్గలింప • విపినస్థలి న
చ్చేడియలెల్లరునున్ గడుఁ, బోడిమి చెడి మెలఁగి రెంతొ • పొగులుచు వగల౯.

ఆ॥ అనిన శౌనకుఁడు మ • హాత్మ! యట్లేటికి, నాఁడువారలైరి • అశ్వరత్న
మెట్టులయ్యె ఘోటి • యెఱిఁగింపుమీ యన, సూతుఁడిట్లు సెప్పెఁ • జోద్యమొదవ.

మ॥ ఒకనాఁ డీశ్వరుఁ డార్యతో నచటఁ గా • మోద్రేకయుక్తిన్ మహా
త్మకుఁడై కేళి యొనర్పుచుండుడు ముని • స్తోమంబు లాసుస్థలీ
నికటంబున్ దఱియంగవచ్చిన భవా • నీదేవి లజ్జించెఁ జే
రక దవ్వేగిరి తాపసేంద్రులు నగా • రణ్యంబు వేఱొక్కచోన్. 298

గీ॥ అంత శంకరుఁ డాత్మప్రి • యానురంజ, నార్థమై పూన్కితో నివ్వ • నాగ్రభూమిఁ
బురుషు లెవ్వరు చేరనఁ • బొలఁతులగుదు, రంచు శపియించె నద్దాన • నబలలైరి.

వ. అంత రాచపూఁబోఁడి నెచ్చెలులంగూడుకొని చింతతో నవ్వనాంతరంబులఁ
దిరుగుచుండుడు దైవేచ్ఛచే రాజనందనుండగు బుధుండచ్చోటుఁ జేరి యచ్చ
పలలోచన౯ గనుకని౯ గాంచి, 300

ఉ॥ బంగరుబొంగరంబులన ♦ భాసిలునట్టి మెఱుంగుగుబ్బదో
యిం గరుకొప్పు చూపుల న♦హించి యలంచెడి వాలుఁగన్నులన్
రంగసుభృంగమాలయున ♦ రాజిలుపెన్నెఱివేణియందమున్
హంసగఁజూచి రాజసుతుఁ ♦ డార్తత నచ్చపలాక్షి డాసినన్, 301

క॥ అక్కలికియు నక్కాంతుని, నక్కజముగఁ గాంచి మనసి ♦ యలమటకుఁ గడున్
జిక్కి యనుమతినిఁ జూపినఁ, గ్రక్కున నాతండు దేల్చెఁ ♦ గలికిన్ రతులన్. 302

—* పురూరవశ్చక్రవర్తి జననము *—

గీ॥ తోడనె పురూరవుఁడు పుట్టెఁ♦దోయజాక్షి, కంత యక్కాంతయు వసిష్ఠు♦ నంతరంగ
మందుఁ జింతింపవిచ్చేసి♦యమ్మహాత్ముఁ, డరసి తద్విధమెల్లఁ బా♦యనికరుణను.

క॥ శివునిన్ ముని గడుఁగొలిచిన, నవిరళకృపఁ దఱియవచ్చి ♦ యభవుఁడు వరమే
మి నలతో కోరుమన ముని, ప్రవరుఁడు సుద్యుమ్నపుంస్త్వ ♦ భావమునడిగెన్.

చ॥ అరసి శివుండు శాపగతి ♦ నమ్మునియందలి కూర్మిపేర్మి న
త్తెఱవను బూరుషున్ సలుప ♦ ధీరత నాతఁడు పుత్త్రితోడుతన్
బురమున కేగి పత్నియెడఁ ♦ బొందికతో గుణధుర్యులైనము
వ్వురు సుతులన్ గనెన్ మునుల ♦ పూన్కికి సిద్ధులు గల్గుటబ్రిమే! 305

వ. అట్లుత్కలుండును గయుండును విమలుండునను పుత్త్రులు జన్మించిన సుద్యుమ్నుం డవ్వారిని బెంచి వారలం దుత్కలున కుత్కలదేశంబులను గయునకుఁ దూర్పు దేశంబును విమలునకుఁ బశ్చిమదేశంబు నొసంగి ప్రతిష్ఠానపురంబుఁ బురూరవునకిచ్చి యంతఁదపోర్థియై తాను వనంబున కేగినంత మనువు మరల పుత్త్రకాముండై శతాబ్దంబులు దపంబొనరించిన నిక్ష్వాకుఁడును శిబి నభగుండు ధృష్టుండు శర్యాతి నరిష్యంతుండు కరూషుండు నృగుండు పృషధ్రుండు కవియను వారలు పదుగురు పుత్రులు జన్మించిరందు నభగునకు నాభాగుండుపొడమె. నాభాగునకంబరీషుండు జన్మించె నాతనికి విరూపుండనువాఁ డతనికిఁ బృషదశ్వుండును నాతనికి రథీతరుండును జన్మించిన నందు రథీతరునకు సంతానంబు లేకున్న నంగిరసుండను బ్రాహ్మణునివలన స్వక్షేత్రంబందుఁబుత్త్రులంగనుటయు నవ్వారు రథీతరగోత్రులై పరఁగి రిఁక ధృష్టుని సంతానంబును దార్ష్టంబను వంశంబై బ్రహ్మకులంబయ్యెనిఁక శర్యాతికి. 306

క॥ ఆనర్తుండను సుతుఁడు గ, లానిధియు సుకన్యయనెడు ♦ లలితసుతయునున్
మానుగ నుద్భవమొందిరి, మానిన్ బెండ్లాడె నక్క♦మారియుఁ జ్యవనున్.

గీ॥ ముదుకమునిఁ బెండ్లియాడియు♦ముదిత మేలి, శీలమున నశ్వినులసాయ♦మోలిఁబడసి
విభునిసుందరుఁదరుణుఁగా♦వించి మేటి, భోగములఁ బొంది యలరెను♦బూవుఁబోఁడి.

కం॥ ఆనర్తసుతుఁడు రైవతుఁ, డానర్తాఖ్యమగు దేశ ♦ మందుం గడుఁ జె
ల్వౌ నగరి కుశస్థలినిన్, దా నిర్మాణంబుచేసి ♦ తనరెనట రహిన్. 309

వ. అవ్వానికిఁ గకుద్మి మున్నగువారు నూర్గురుసుతు లుద్భవించి రందుఁ గకుద్మి యను వానికి రేవతియను కన్యారత్నంబు లక్ష్మియట్లు జన్మించిన నవ్వాఁ డాయెకు మగని నడుగుటకై యామెన్ దోడ్కొని బ్రహ్మలోకంబున కేగి యా హిరణ్యగర్భునడిగిన నాతండు మందహాసంబొనర్చి యిట్లనియె. 310

ఉ॥ నీ విటఁ జేరినంత నవ ♦ నీవర! నీదగు బంధులెల్లరున్
నీవనుకొన్న రాసుతులు ♦ నీల్గిరి నీదగు రాజధానియున్
గావలులైన రక్కసులు ♦ గ్రిచ్చఱఁ బాడొనరించినార లా
శ్రీవిభుఁడైన కృష్ణుఁడటఁ ♦ జెల్వుగఁ గట్టెను ద్వారకాపురిన్. 311

చ॥ ఇరువదియేడుద్వాపరము ♦ లిప్పటికిం జనె నీవుచేర నిం
దిరువదియెన్మిదౌయుగ మ ♦ హీనతరవ్రత! ద్వాపరంబిదే
జరుగుచునున్న దిప్డుచని ♦ చయ్యన శ్రీబలరామమూర్తికిన్
గరితనొసంగు మట్లయినఁ ♦ గాంక్షితముల్ సమకూరు నిండుగాన్. 312

వ. అనినఁ దన్నిమేషంబున బ్రహ్మచోదితుండైవచ్చి యక్కన్నెన్ బలభద్రమూర్తికిచ్చి పెండ్లిచేసెనిఁకఁ బృషధ్రుండనువాఁడు గురునిచే గోరక్షణంబున నియోగింపఁబడి యొకచీఁకటియద్దమరేయి వడిగ వానగురియుచుండ నొక్క శార్దూలంబువచ్చి కదుపునొకంటిం బట్టరానది యెఱిఁగి యఱచిన నతండు ఖడ్గపాణియైవచ్చి కటికిచీఁకటినరయక బెబ్బులియని యావుతలన్ ద్రుంచె నంతఁబులియు నలుకొంది పఱచెనంత నతం డుషస్సునఁ దెగి పడియున్న మొదవున్ గాంచి దుఃఖితుండై యున్నసమయంబున గురుండెఱింగి తారసించి యిట్లనియె.

సీ॥ ఓరి! యనవహితాత్మక! ♦ యోరిపాపి!, సురభిఁ దెగఁదున్మి తిట్టుల ♦ సూటిదప్పి
నీయఘంబిఁక సురుఁగదు ♦ నీకు రాజ్య, లబ్ధిలేదిఁకఁ జను వృష ♦ లత్వమొంది. 314

వ. అనుటయు నతండజ్ఞానకృతదోషంబు హరించునట్లు మరల గురునిచే ననుగ్రహంబుపడసి పెద్దకాలం బడవియందుఁ దపించి నిర్మలుండై శివానుగ్రహంబున మోక్షంబుఁ బడసె నిఁక నృగుండనువాఁడును నజ్ఞానంబున గోదానవ్యత్యయంబునఁ జేసి కృకలాసంబై పెద్దకాలంబుఁ గడపి కృష్ణునిచే నద్దురితంబుఁ బాసి యుత్తమలోకంబుఁ జెందె. కరూశుండనువానికిఁ గారూశులను తనయులు జన్మించి యుత్తరంబుననున్న కరూశదేశంబునకు రక్షకులైరి పరిష్యంతుండను వానికిఁ జిత్రసేనుండను పుత్త్రుండు జన్మించె నవ్వానివంశంబున నగ్నివేశుండనువాఁడు జన్మించి మహర్షియయ్యె నాతని సంతతివారు బ్రాహ్మణులైరి.

క॥ కడఁగొట్టు మానవుండిఁక, గడుఁబుణ్యుఁడు కవిసమాఖ్య ♦ గనినట్టిఁడు దాఁ
బుడమిని భోగంబులఁబడి, పడసె శివానుగ్రహమును ♦ బరమపదంబున్. 316

క॥ ఇల నిక్ష్వాకునృపునకు సుతులు నూర్గురు వారిలోన ♦ దోర్బలధుర్యుల్
విలసితయశులు వికుక్షి ముఖ్యులుగాఁ గలవారు మిగుల ♦ దంటలుకడిమిన్.

వ. ఆవికుక్షి పురంజయుఁడనియు నింద్రవాహుండనియుఁ గకుత్స్థుండనియుఁ బేరొంది పెక్కురు రక్కసులం జదిపి వేల్పులఁ బ్రోచె నయ్యనఘునకుఁ బృథుండను సుతుండు పొడమె నాతనికి జంద్రుండనువాఁడును నాతనికి యువనాశ్వుండును నాతనికి శావస్తియనువాఁడు జన్మించి శావస్తియను పట్టణంబుఁగట్టె. ఇఁక నాశావస్తికిఁ గువలయాశ్వుండు జనించె నాతండు మునిప్రార్థనచేఁ బుత్త్రశతంబుతో ననికివెడలి ధుంధుండను మహాశూరుండగు దానవుని బొలియించె మఱియు సంగరంబం దా రాజోత్తముని పుత్త్రులలో ముగ్వురుదక్కఁ దక్కిన వారు మృతులైరి. మిగిలినవారు దృఢాశ్వుండు గపిలాశ్వుండు భద్రాశ్వుండు ననువారు. దృఢాశ్వునకు హర్యశ్వుండును నవ్వానికిఁ గుంభుఁడును వానికిఁ గృతాశ్వుండును వానికి సేనజిత్తనువాఁడును నవ్వానికి యువనాశ్వుండు జన్మించి యనపత్యుండై మహర్షులయనుమతితో నింద్రేష్టి నొనరించి యద్దమరాతిరి పిపాసతోఁ గలశంబందలి మంత్రోదకంబుఁద్రావె దానఁజూలేర్పడ గర్భంబుఁ జించుకొని మాంధాతయను చక్రవర్తి జన్మించె నింద్రప్రసాదంబున యువనాశ్వుండంతముఁ జెందక జీవించె. మాంధాతయు దిగ్విజయంబు చేసి శశిబిందుఁడనువాని కూతున్ బెండ్లాడి యామెయందు ముగ్వురు కొడుకులను నేఁబదిమంది కన్నెలనుగని యక్కన్నెల సౌభరియను మునికిచ్చి పెండ్లి చేసె మాంధాతపుత్త్రులు పురుకుత్సుం డంబరీషుండు ముచికుందుఁ డనువారు. అంబరీషునకు యువనాశ్వుండాతనికి హారితుండుపుట్టె అంబరీష యువనాశ్వ హారితులు మాంధాతృగోత్రంబునఁ బ్రవరులు. ఇఁకఁబురుకుత్సుం డనువాఁడు నర్మదయను నాగకన్యకన్ బెండ్లాడి యామె యందుఁ ద్రసదశ్వుం డనువానిఁ బుట్టించె నవ్వాని కనరణ్యుండు పొడమె వానిసంతతియందుఁ ద్రిశంకుండు జన్మించె. 318

గీ॥ గురునిశాపవశంబునఁ ♦ గూలి యంత్య, జత్వమొంది త్రిశంకుండు ♦ చటులతేజుఁ
డైన కౌశికుదయనొంది ♦ యాకసమున, నుండె నెంతయు దీప్తులు ♦ దండికొనఁగ.

వ. ఆతనిపుత్త్రుండు లోకోత్తరుండగు హరిశ్చంద్రుం డాయనకు రోహితుండను పుత్త్రుండు నవ్వానికి హారితుం డతనికిఁ జంపనాముండగు సుతుం డుద్భవించి చంప యను పట్టణంబుఁ గట్టె నాచంపుని సంతతియందుఁ గ్రమంబుగా బాహుకుండు జన్మించి దైవప్రాతికూల్యంబున శత్రులగు హైహయులచేఁ బరాజితుండై. 320

గీ॥ ఎండకన్నును వానకన్నెఱుఁగనట్టి, పొలతులనుదోడుకొని వేగ ♦ భూరిగహన
తలముఁజొచ్చియటను నౌర్వ♦తాపసేంద్రు, నాశ్రమముఁజేరియుండెభ♦యంబుఁదక్కి
గీ॥ అరసి యేయెండ కాగోడు ♦ గంచునెంచి, భక్తి మెయిఁ దాపసేంద్రుని ♦ పాదసేవ
నంబుఁజేయుచునుండి కొ♦న్నాళ్ళమీఁదఁ, గాలధర్మంబుఁజెందఁ ద♦త్కాంతలపుడు,
వ. చిచ్చురకంబూనుడు సందొక్కదాని నంతర్వత్నిగా నెఱింగి యౌర్వుం డాఁపె
నాపె నమ్మానిని చూలొందియున్నపు డోర్వక సవతులు గరళంబుఁ దినిపించి
రద్దాన నాపెయు గర్భస్థపిండంబును నీశ్వరేచ్ఛచే మరణింపక మనిరి. 323
ఆ॥ మంచితారయందు♦మంచిలగ్నమునందు, నైదుగ్రహము లుచ్చ♦యందునుండ
సగరచక్రవర్తి♦జన్మించెఁ గరములోఁ, గూడ శత్రుకోటి ♦ గుండెలవియ. 324

——* సగరచక్రవర్తి చరిత్రము *——

క॥ మునివరుఁడను నౌర్వుండా, జనపతితనయునకు జాత ♦ సంస్కారములన్
బొనరిచి వేదత్రితయం, బును నాగ్నేయాస్త్ర మొసఁగెఁ ♦ బూర్ణతరకృపన్. 325
వ. ఇఁకనా రాజపుత్త్రుండు గరంబుతో జనించుటఁజేసి సగరుండనాఁ బరఁగి మహా
శూరుండై.
చ॥ కడఁగి రిపూత్కరంబులను ♦ గార్ముకధారల నస్త్రవహ్నిచే
సుడియఁగఁజేసి హైహయులఁ ♦ జొప్పడఁగించి స్వకీయరాజ్యమున్
బడసి శకాధిరాజులను ♦ పారదులన్ యవనాధినేతలన్
జెడుఁగుల గెల్చి పట్టి కడు ♦ శిక్షయొనర్చెఁ బ్రతాపమేర్పడన్. 327
క॥ ఆనృపునకు సతులిద్దఱ, నూనవ్రత లిద్ధమతులు ♦ యోగ్యచరిత్రా
ధీనలు కేశిని సుమతి య, నానొప్పెడువారు వికచ ♦ నాళీకముఖుల్. 328
క॥ వారలలోఁ గేశినికిఁ గు, మారుఁడొకండు వొలిచె నస♦మంజసుఁడనఁగా
ధీరులు పెక్కురుతనయులు, శూరులు జన్మించిరల్ల ♦ సుమతికిఁ గడిమిన్. 329
క॥ అసమంజసుఁడను వాఁడిల, నసమంజసుఁడై ప్రజలకు ♦ ననిశము బాధల్
విసువక కూర్చుచునుండినఁ, గసితో నృపుఁ డడవి కనిపెఁ ♦ గన్నకుమారున్.
వ. ఆయసమంజసపుత్త్రుండు.
క॥ నీతియుతుఁ డంశుమంతుం, డాతతభుజవిక్రముఁడు మ♦హాబాహుం డా
ఖ్యాతుఁడు శూరాగ్రణులం, దాతని మెచ్చెదరు పౌరు♦లందఱు లోకమునన్. 331
వ. సుమతీ పుత్త్రులఱువదివేలవారు శూరులై యొరుల లెక్కసేయక యుక్కు
తునియులై యెక్కుడు గరువంబుతో నిక్కుచుండి రంత సగరుం డశ్వమేధ దీక్షి
తుండై మఖాశ్వంబు వెంట రక్షార్థంబు గొడుకులన్ బనిచిన. 332

క॥ జనపదములఁ బట్టణముల, వనపదముల మందలందుఁ ♦ బర్వతములయం
దనువుగ నాహయము చరిం, చెను దన్ను సగరజులరసి ♦ చెంతల వెలయన్. 333

వ. అంత.

గీ॥ నారదుని చోదనన్ జేసి ♦ నాకవిభుఁడు, హయముఁ గొనిపోయి తగఁ గపి ♦ లాశ్రమంబు
ముందటన్ గట్టివేసెను ♦ మోసపోయి, హరినిఁ గోల్పడి సాగరు ♦ లాతురులయి. 334

క॥ పురమును బురమును గిరినిన్, గిరిని వనంబును వనంబుఁ ♦ గ్లేశమనక వే
తిరుగుచు వెదకుచునుండిరి, తురగం బెచ్చోటనుగాని ♦ దోఁపకయుండెన్.

గీ॥ అంత వారలు భూవల ♦ యాంతరాళ, మంతటను శోధన మొనర్చి ♦ హయము నెందుఁ
గనక వ్యాకులచిత్తులై ♦ కడఁదివగను, బుట్టలనుఁ ద్రవ్వుకొనుచు ద ♦ వ్వులకుఁ జనిరి.

క॥ ఏపుట్ట నెట్టిశేషుఁడో?, రాపొనరింపంగఁ జనునె? ♦ రాజసుతులు దో
ర్శ్రీపరవశులై యరయక, యీ పగిదిగఁ బృథివిఁ ద్రవ్వి ♦ యరయుచునుండన్.

గీ॥ ఒక్కచోఁ బూరిమేయుచు ♦ నున్న యశ్వ
రత్నమును గని చాలహ ♦ ర్షంబుఁ జెంది
ఎవ్వఁడొకొ? వాజిఁ ద్రుచ్చిలి ♦ యిందుఁ జేర్చె
వానిఁ దెగటార్చవలదె యీ ♦ వ్వాఁడుగాని. 338

చ॥ అనుకొని వారలంద అర ♦ యన్ గపిలర్షి మహాత్ముఁడుండు పా
వనుఁ డగుపట్టె నంత వడిఁ ♦ బార్థివసూనులు క్రొవ్వుమీఱి మా
నిని గని యోరి! నిల్వుమిఁక ♦ నీవు మఖాశ్వము ముచ్చిలించి యిం
దనువుగ దాఁచికొంటివె? దు ♦ రాత్మ! యెఱుంగక సాగరావళిన్. 339

—* సగరసుతులు కపిలకోపాగ్నిచే బూదియగుట *—

క॥ అనియిటు లహంకరించిన, విని యమ్ముని హుంకరించె ♦ వేగ సగరజుల్
మునుకొని దహింపఁబడి యం, తనె భస్మంబైరి తమదు ♦ దర్పముతోడన్. 340

గీ॥ జన్మమునుగాని జన్మపుం ♦ జక్కిగాని, యెఱుఁగక మహాతపంబున ♦ నెసఁగు కపిల
సంయమునిఁ దాఁకి సురిగిరి ♦ సాదు శేగె, నేవి తల పాలమునఁగాని ♦ నిలువదనరె!

చ॥ కొమరులు రాకయుండుటయు ♦ ఘోటక మాసరిహద్దు నెందు నా
గమనము సేయకుండుటయుఁ ♦ గన్గొని యాసగరప్రభుండు జ
న్నము నెడ దీక్షితుండగుట ♦ నందననందను నంశుమంతు క్షి
ప్రముగ హయంబు జాడఁగనఁ ♦ బంచెను బావనదీప్తిసంచయున్. 342

గీ॥ అంత నతఁడును వసుమతి ♦ నంతఁదిరిగి, గర్తములదూరి యందందుఁ ♦ గలయఁ జూడ
నొక్కచోఁ గానుపట్టెఁ న ♦ శ్వోత్తమంబు, దానిడగ్గఱఁ గనుపట్టెఁ ♦ దాపసుండు.

చ॥ కని మునివర్యుపాదముల ♦ గ్రక్కున వ్రాలిన సమ్మహాత్ముఁడా
తనికి సమస్తమున్ దెలిపి ♦ తా హయరత్నమునిచ్చి పంపఁగా
ననరుచు నాతఁడున్ హయముఁ ♦ బట్టుకపోయియుఁ దాతకిచ్చి తా
వినిచెఁ దదీయపుత్త్రికుల ♦ వృత్తము నగ్రజులవెల్లి గొల్చుచున్. 344

గీ॥ ఘోరమగు వాక్యముల తేఁడు ♦ కూలిపడి క
డున్ గడున్ దుఃఖమునను మి♦డుక్కుచు మఖంబుఁ
గల్పవిధితోడ సంపూర్తి♦గా నొనర్చి
యవబృథముఁ జెందె భూప్రజ ♦ లంత మెచ్చ. 345

చ॥ మునికినుకన్ గరంగిన య♦మోఘులఁ బుత్త్రిల నుద్ధరింపఁ బా
వనియగు స్వర్ధునిన్ భువికిఁ ♦ బాఱఁగఁ జేయుఁ డటంచు నారదుం
డనఘుఁడు సెప్పిపోయె నిఁక ♦ నట్టులొనర్పఁగఁ జాల కెట్టులో
వనరుచు రాజ్యమేలి త్రిది♦వంబున కేగె నృపుండు పేర్మినై.

గీ॥ అంశుమంతుండు ప్రభుఁడయి♦యవని నేలి, ఘనభుజు దిలీపుఁడను నొక♦తనయుఁ బడసి
రాజ్యమున వానినిల్పి య♦రణ్యమునకుఁ, దపసుఁ జేయఁగఁ జనియె ను♦దారమతిని.

వ. అంత.

క॥ భూపుండై చెల్వమరు ది, లీపుడు ధర్మిష్ఠుఁ డును బ♦లిష్ఠుఁడునై నన్
బాపఘ్నమైన గంగను, భూవదవినిఁ జేర్పలేక ♦ పొగలెన్ మదిలోన్ 348

ఉ॥ ఆనృపవర్యపుత్త్రిఁడు మ♦హాబలుఁ డిద్ధపరాక్రముండు నా
నావరపాలశేఖరఘ♦నద్యుతిరంజితపాదపద్ముఁడున్
మానిజనప్రియుండును స♦మంచితకీర్తియునౌ భగీరథుం
డానరనాథశాసనము ♦ నంది నృపాసనమెక్కి యుక్కునన్ 349

## —* భగీరథుడు పుడమికి గంగను దెచ్చుట *—

వ. ప్రపితామహులపాటు విని యవ్వారల నుద్ధరించుటకై దేవగంగావతరణంబుఁ గోరుపఁబూని హిమశైలారణ్యంబునకేగి యందు దేవగంగఁ గూర్చి తపించిన నాయమ పొడసూపి యభిమతంబడుగు మనుడు దివినుండి తన్ను ధరిత్రి నవతరణంబుసేయుమన్న నా త్రిభువనపావని యిట్లనియె. 350

చ॥ హరుని భజింపు మాయనఘుఁ ♦ డాశ్రితసౌఖ్యకరుండు నన్ను శం
కరుఁడు వినాగ నొండొకఁడు ♦ కౌశలిమై ధరియింపలేఁ డిటుల్
ధరణికిఁ జేరవచ్చిన వృ♦థాయగు నీకు ఫలంబుగల్గ ది
త్తెఱఁగునఁ బాతిపోదు బలి♦ధిష్ణ్యముఁ బన్నగలోక ముద్ధతిన్. 351

క॥ అని యంతర్ధానం బొం,ధునీవతంసంబు సేయఁ♦దోడనె శివునిన్
మనమున నిల్పి భగీరథుఁ, డనువుగఁ దపసున్ బొనర్చె♦హాయనము విధిన్. 352

సీ॥ అంత బాలేందుమౌళి ప్ర♦త్యక్షమొంది, యాభగీరథునకు ననె♦హాసముమ్యో
గంగను ధరించి నీకొసం♦గఁగల నిష్ఠ, నీదుప్రపితామహులఘంబు♦నిస్తరింప.

—* గంగావతరణము *—

క॥ అని మందాకినిఁ దలఁపుడు, ఘనవేగముతోడ నాకె ♦ కనుపడి శివునిన్
గాని పాతాళముఁ జేరుట,కును దలఁప శివుఁడు కపర్ద♦కుహారమున ధునిన్. 354

గీ॥ వేగఁ జేరిచి బంధించి♦బిందువొకటి, నృపునకొసఁగఁగ ధారయై♦నగడి ధంధ
ణాధణాధణధణధణ♦నాదములను, బెక్కు సేయుచు నురువడి♦యుక్కుమీఱె. 355

క॥ కలహంసగతులతోడను, సలలితముగ గంగ వెడలఁ ♦ జక్కఁగ నృపుఁడా
నెలతలదొరకును గంగకుఁ, బలుతీఱు నుతులనుసల్పి ♦ వాహిని కనియెన్.

క॥ గంగా! మాకలుషము లడఁ,గంగాఁ బొనరింపు మమ్మ!♦కారుణ్యమెసం
గంగా నీసరిధుని కలు,గంగా వినమెందు నిజము ♦ కంజాతముఖీ! 357

క॥ గంగా గంగా యనుచు మ,దిం గడు నిను దలఁచిరేని ♦ దేహు లఘములన్
భంగింతురు నాకముకే, గంగలరీనుడినిఁ గల్గ ♦ గలుగదు గంగా! 358

గీ॥ అని రథం బెక్కి యానృపుఁ♦డరుగుచుండఁ, దోడనే గంగయును సము♦త్తుంగభంగ
రంగదున్నతమీనతి♦మింగిలాహి, చక్రచక్రాంగచక్రాభి♦నందితయయి. 359

చ॥ చనిచని కాపిలాశ్రమముఁ ♦ జక్కఁగ జేరఁగఁబోయి యందులన్
మునివరకోపదగ్ధుల స♦మున్నతులన్ సగరాత్మపుత్త్రులన్
ఘనజలపూతులన్ సలిపి ♦ గ్రచ్చఱ నాకముఁ జేరఁబంపి జీ
వననిధిఁ జెందె దివ్యముని♦వర్గ మనర్గళభంగిఁ బాడఁగన్. 360

వ. మఱియు భగీరథానీతయగుట భాగీరథియనియుఁ ద్రోవలో జహ్నుముని గృహీతయై తత్కర్ణంబునుండి మరల స్రవించుటంజేసి జాహ్నవియనియు నిట్లనేకాహ్వయంబుల ధరించియలరె మఱియు నీగంగావతరణచరిత్రం బెవ్వరేని చదివిన వినిన నవ్వారైహికాముష్మిక సుఖంబులొందెదరిక.

ఆ॥ అల భగీరథునకు ♦ నాత్మజుండు శ్రుతుండు, పొడమె వానివంశ♦ము నెడల బుతు
పర్ణుఁ డుద్భవించె♦వానికినిన్ సుదా,సుండు పుట్టె మిగుల♦శుభ్రయశుఁడు 362

వ. అవ్వానివంగసంబున ఖట్వాంగచక్రవర్తియుదయించె నాతనికి దీర్ఘబాహుండును వానికి రఘుండును రఘునకుఁ బృథుశ్రవుండును నాతని కజుండును నతనికి దశరథుండును జనియించి రాదశరథునకుఁ గౌసల్యాకైకేయీసుమిత్రలను భార్యాత్రి

యంబునందు శాంతయనుగన్యయును. శ్రీవిష్ణుతత్త్వంబు నాల్గువిధంబులై రామ భరత లక్ష్మణ శత్రుఘ్నులనువారలు నవతరించి రాశాంతను ఋష్యశృంగుండు పెండ్లియాడెనిక రామచంద్రుండు. 363

క॥ శివువిల్లువిఱిచి జానకి, నవనీజను బెండ్లియాడె ♦ ననుజన్ములు మాం
డవి నూర్మిళ శ్రుతకీర్తిని, సువిహితగతిఁ జేకొనిరి వ♦సుంధర మెచ్చన్. 364

వ. మఱియు నా రామచంద్రుండు పితౄజ్ఞాపాలనార్థంబు రాజ్యంబుఁ బాసి జటావల్కలంబుల ధరించి సీతాలక్ష్మణసమేతుండై దండకారణ్యంబుఁ జేరి పదునాలు గేండ్లందు వసించె నింకను. 365

సీ॥ గాధిజసవనంబుఁ ♦ గావఁగాఁబోయి సు, బాహుదైత్యునిఁజంపె ♦ బాహుశక్తి
బదునాల్గు వేలపైఁ ♦ బదునాల్గురను జన, స్థానంబునఁ జంపె ♦ దానవులను
ఆవిరాధుని గబం ♦ ధాసురు వనపథ, మందువధించెఁ బే ♦ రైనకడిమి
వాలినిసమయించి ♦ వనధివారధిఁగట్టి, పఙ్క్తికంఠుసబాంధ ♦ వముగఁ గడపె

గీ॥ రామనాథుఁ బ్రతిష్ఠించె ♦ రాణగదుర, నశ్వమేధంబుఁ బొనరించె ♦ నతులదీప్తిఁ
బదియు వేలేండ్లు భూమిని ♦ బాలనంబు, చేసె శ్రీరామచంద్రుండు ♦ వాసిమీఱ.

వ. అని చెప్పుటయు శౌనకాదులాకర్ణించి, మహాత్మా! మానసంబులు తృప్తినొందవు శ్రీరామచరిత్రంబించుక విస్తరించి యానుపూర్విగ వక్కాణింపుమని యర్థింపుటయు. ఆశ్వాసాంతము.

క॥ కాళీశశిశేఖరపద, నాళీకార్చాధ్యహృదయ ♦ నళినవిరాజ
త్కాళీశారాధ్యానుజ, వ్యాళేశ్వరహారతత్త్వ♦వశ! లక్ష్మాంబా!

గద్య. ఇది శ్రీబుధజనవిధేయ ముదిగొండ నాగవీరేశ్వరనామధేయ
ప్రణీతంబైన శివపురాణంబందలి యుమాఖండంబునఁ
బ్రథమాశ్వాసము సర్వము సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ





శ్రీ శివాభ్యాన్నమః

# శ్రీ శివపురాణము

## ఉమా ఖండము

### ద్వితీయాశ్వాసము.



శ్రీ ముదిగొండ కులార్ణవ
సోమా! సోమేశ్వలింగ ♦ శోభితపూజా
కామా! కామాదిరిపు
స్తోమజయోద్దామ! దామసురుచిరకీర్తి!

వ. అవధరింపు మక్కథకుండు శౌనకాది మహామునుల కిట్లనియె.

## —* రామాయణ చరితము *—

చ॥ విశదయశోభిశోభితుఁడు ♦ విశ్వమహోన్నతసారవిక్రమ
ప్రశమితసర్వదిగ్వలయ ♦ ,సార్థివవీర వరప్రతాపుఁడా
దశరథరాజసత్తముఁ డు ♦ దారపవిత్రచరిత్రభూషితుం
డశనిధరాభవైభవర ♦ మాస్పదుఁ డుండె నయోధ్య శోభిలన్.

గీ॥ ఆ ధరాపాలకునకు జా ♦ యాత్రయంబు
వెలసె గౌసల్య కైకేయి ♦ యలసుమిత్రి
యనఁగఁ దనయులు శ్రీరాముఁ ♦ డును భరతుఁడు
లక్ష్మణుండు శత్రుఘ్నుఁ డా ♦ లలనలకును. 2

క॥ శ్రీనారాయణ తేజం, బా నలువురుగా విభక్త ♦ మై తనరెను సు
శ్రీనిధి యం దగ్రజుఁడు ప్ర, ధానుండై యనితరప్ర ♦ తాపుఁ డయి తగెన్. 3

గీ॥ రామలక్ష్మణులకు నిద్ద ♦ అకును జెలిమి, యెడ తెగకయుండు నెప్పట్ల♦నేని యట్లె
భరతశత్రుఘ్నులకు మైత్రి ♦ పరగుచున్న, నంద అందఱియెడల సౌ ♦ హార్ద్రపరులు.

సీ॥ అఖిలజనమునకు ♦ హర్షంబొసంగును, శ్రీరామముఖసర ♦ సీరుహంబు
కడుభయార్తుల కేని ♦ నడలు పోకడఁబెట్టు, శ్రీరామసదయదృ ♦ ష్టిప్రసార
మెట్టికూరుల కేని ♦ హెచ్చౌ వెఱపుఁ గూర్చు, శ్రీరామవిక్రమో ♦ దారగరిమ
ప్రబలసంతాపత ♦ ప్తజనంబు నలరించు, శ్రీరామవాక్సుధా ♦ సారధార

గీ॥ మహితసహకారపరిపాక ♦ మధురమధుర, నవనవరసంబు శ్రీరామ ♦ నామధేయ
మతులవిజ్ఞానభాగ్యమా ♦ గ్రావలంబ, నంబు శ్రీరామపరమపు ♦ ణ్యచరితంబు.

క॥ అని విజ్ఞవరులు మనముల, ఘనముగ నభినుతిని సల్పఁ ♦ గా గాధిసుతుం
డనఘుం డంతనె దశరథ, జనపాలుని జేరి యడిగెఁ ♦ జనువున నిటులన్. 6

చ॥ తనయుల రామలక్ష్మణుల ♦ ధన్యపరాక్రమశాలురన్ యశో
ధననిధి! పంపు మత్సవన ♦ ధర్మము నిర్వహణం బొనర్ప! వే
గనె కొని పోదు వీరలు జ ♦ గన్నుతదివ్యధనుఃకలాభిమం
డను లిఁక యాతుధాననిధ ♦ నమ్మునఁగూర్చి ఘటింత్రు జన్నమున్. 7

చ॥ అన జననాథుఁ డాత్మమున ♦ నక్కజమున్ భయమున్ వహించి యి
ట్లనె మునిచంద్ర! మత్తనయు ♦ లర్భకు లుద్ధతదైత్యమర్దనం
బున కుపయుక్తులౌదురె? స ♦ మున్నతసారశరాసనంబుఁ జే
కొని వనిఁ జేరి రక్కసులఁ ♦ గూల్చెద నేనె మఖంబు నెగ్గఁగాన్. 8

గీ॥ అనుడు నగి తాపసేంద్రుఁ డా ♦ తని మనమున. బుగు లడంచి కుమారుల ♦ భూరిశక్తిఁ
దెలిపి యంగీకృతిన్ జెంది ♦ ధీరులైన, రామలక్ష్మణులఁ గొని య ♦ రణ్యభూమి. 9

గీ॥ చేరి నడుచుచుఁ జిత్రవి ♦ చిత్రకథల, నలరఁజేయుచు బల నతి ♦ బల యనెండు
విద్యల నొసంగి స్వాశ్రమ ♦ విపిననికట, మొందరాఁబథమందుఁ దా ♦ నొక్క యసురి.

క॥ తాటకి యనునది జనముల, వేటాడెడునద్ది వారి ♦ వేఁ గని యెదురన్
మేటియగు మౌని యనుమతి, వ్రేటున వధియించె రామ ♦ విభుఁ డద్దానిన్. 11

మ॥ పరితోషంబును జెంది రామునకు న ♦ వ్వాచంయమీంద్రుండు స
త్వర ముద్యత్తరబాణజాలమును దీ ♦ వ్యజ్జృంభకాస్త్రంబులన్
వరుణాస్త్రంబనిలానలాస్త్రములునా ♦ బ్రహ్మాస్త్రమున్ మున్నుగా
నరుదౌ నస్త్రము లిచ్చి తెల్పెను దదీ ♦ యాంధానసంహారముల్. 12

వ. అంత నచ్చోటనుండి.

మ॥ నికటోర్విన్ జెలువొందు స్వాశ్రమము నెం ♦ తేఁ బ్రీతి సావిత్రపు
త్రికులన్ జేరిచి యజ్ఞవిఘ్నకరదై ♦ త్యస్తోమసంహారనై
ష్ఠిక లౌనట్లు విధించి యంత మునిరో ♦ చిష్మంతుఁ డొందెన్ వ్రతం
బకలంకాత్మముతోడఁ గాంచుచు మఖం ♦ బం దుండి రాజాసుతుల్.

గీ॥ జన్న మకుతోభయంబుగా♦జరుగుచుండె, నంతఁ బిశితాశు లరుదెంచి♦యద్ది కాంచి
కినిసి విఘ్నదధానులై ♦ కేరి చదలఁ, జేరి కురిసిరి నెత్తురుఁ ♦ జీము నందు. 14

## —* శ్రీరాముఁడు మారీచుని సముద్రమునఁ జేర్చి సుబాహుని జంపుట *—

మ॥ మునులెల్లన్ జలితాత్ములై యపుడు సం ♦ బోధింప శ్రీరాము డం
తనె మారీచుఁ బ్రభంజనాస్త్రమున హీ ♦ నప్రజ్ఞుఁ గావించి య
వ్వనధిన్ గూలఁగ నేసె భాసురబృహ ♦ ద్భాస్వస్త్రధారన్ వధిం
చెను దుర్వ్యూహు సుబాహుఁ దత్పరిజన ♦ శ్రేణిన్ నిమేషంబులోన్.

సీ॥ అంతరాయంబు లెల్లని ♦ ట్లంతరింప
మునులు నిర్భీకులై ముదం ♦ బున మఖంబుఁ
బూర్తిచేసిరి కౌశిక ♦ మునియు రామ
లక్ష్మణులఁ దోడుకొని మిథి ♦ లకుఁ జనుటకై. 16

గీ॥ తలఁచి పయనంబు సల్ప న ♦ ధ్వంబునందు, గౌతమమహర్షి పత్ని రా♦ ఘవపదాబ్జ
రజము సోఁకినతోడనే♦ప్రకృతిఁ జెంది, పూజనం బొనరించె రా♦మునకు భక్తి. 17

క॥ మునియును దాశరథులు న, వ్వనినుండి యహల్య నాపె ♦ పతిసన్నిధికిన్
బనిచి మిథిలాపురికిఁ జనిఁ, గొనిరి విదేహాతిథేయ ♦ గురుతరపూజన్ 18

గీ॥ బ్రహ్మఋషి సీతకును రామ♦భద్రునకు వి, వాహ మొనరింప నెంచి వి♦దేహరాజ
మౌళిరచితోరునియమాభి♦మతమనమున, నతని కిట్లనె హర్షభ♦రాత్మ మెసఁగ.

ఉ॥ చూపుము శైవచాపము వి ♦ శుద్ధచరిత్ర! వికర్తనాన్వయుం
డీ పురుషోత్తముండు భవ ♦ దీప్సితమున్ నెరవేర్చి నీదు క
న్యాపరిదత్తభర్మసుమ ♦ హారము నొంది వరించు నా సతిన్
నీ పరితాప మింకను జ ♦ సించు శుభప్రకరాయతీగతుల్. 20

క॥ నీ సఖుఁడగు దశరథునకుఁ, గౌసల్యకు సుతుఁడు శౌర్య ♦ ఘనుఁ డీ రాముం
డా సౌమిత్రులలో న, గ్రేసరుఁ డీ లక్ష్మణుం డ ♦ రిందముఁడు నృపా! 21

వ. అనుటయు మిథిలానాథుం డొక్కించుక సంశయించి తాపసేంద్రున కిట్లనియె. 22

చ॥ దినదిన మెందరో పృథుల♦దీర్ఘభుజుల్ బలశాలు లిద్ధపా
వనతరతేజులైన నృప♦వర్యులునున్ దనుజేంద్రులున్ మహీ
జను వరియింప వచ్చి శివ♦చాపము నెత్తఁగ లేక నొచ్చి సి
గ్గును గొని పోదు రార్య! తమ♦గొప్పతనం బది తప్పిపోవఁగన్. 23

వ. అందును.

సీ॥ అఖిలజనమునకు ♦ హర్షంబొసంగును, శ్రీరామముఖసర ♦ సీరుహంబు
కడుభయోత్తుల కేని ♦ నడలు పోకడఁబెట్టు, శ్రీరామసదయదృ ♦ ష్టిప్రసార
మెట్టిశూరుల కేని ♦ హెచ్చౌవెఱపుఁ గూర్పు, శ్రీరామవిక్రమో ♦ దారగరిమ
ప్రబలసంతాపత ♦ ప్తజనంబు నలరించు, శ్రీరామవాక్సుధా ♦ సారధార
గీ॥ మహితసహకారపరిపాక ♦ మధురమధుర, నవనవరసంబు శ్రీరామ ♦ నామధేయ
మతులవిజ్ఞానభాగ్యమా ♦ ర్గావలంబ, నంబు శ్రీరామపరమపు ♦ ణ్యచరితంబు.
క॥ అని విజ్ఞవరులు మనముల, ఘనముగ నభినుతిని సల్పఁ ♦ గా గాధిసుతుం
డనఘుం డంతనె దశరథ, జనపాలుని జేరి యడిగెఁ ♦ జనువున నిట్టులన్. 6
చ॥ తనయుల రామలక్ష్మణుల ♦ ధన్యపరాక్రమజైత్రులన్ యశో
ధననిధి! పంపు మత్సవన ♦ ధర్మము నిర్వహణంబొనర్ప! వే
గనె కొని పోదు వీరలు జ ♦ గన్నుతదివ్యధనుఃకలాభిమం
డను లిఁక యాతుధాననిధ ♦ న మ్మొనఁగూర్చి ఘటింత్రు జన్నమున్. 7
చ॥ అన జననాథుఁ డాత్మమున ♦ నక్కజమున్ భయమున్ వహించి యి
ట్లనె మునిచంద్ర! మత్తనయు ♦ లర్భకు లుద్ధతదైత్యమర్దనం
బున కుపయుక్తులౌదురె? స ♦ మున్నతసారశరాసనంబుఁ జే
కొని వనిఁ జేరి రక్కసులఁ ♦ గూల్చెద నేనె మఖంబు నెగ్గఁగాన్. 8
గీ॥ అనుడు నగి తాపసేంద్రుఁ డా ♦ తని మనమున, బుగు లడంచి కుమారుల ♦ భూరిశక్తిఁ
దెలిపి యంగీకృతిన్ జెంది ♦ ధీరులైన, రామలక్ష్మణులఁ గొని య ♦ రణ్యభూమి. 9
గీ॥ చేరి నడుచుచుఁ జిత్రవి ♦ చిత్రకథల, నలరఁజేయుచు బల నతి ♦ బల యనెడు
విద్యల నొసంగి స్వాశ్రమ ♦ విపిననికట, మొందరాఁబథమందుఁ దా ♦ నొక్క యసురి.
క॥ తాటకి యనునది జనముల, వేటాడెడునద్ది వారి ♦ వేఁ గని యెదురన్
మేటియగు మాని యనుమతి, వ్రేటున వధియించె రామ ♦ విభుఁ డద్దానిన్. 11
మ॥ పరితోషంబును జెంది రామునకు స ♦ ర్వాచంయమీంద్రుండు స
త్వర ముద్యత్తరబాణజాలమును దీ ♦ వ్యజ్జృంభకాస్త్రంబులన్
వరుణాస్త్రంబనిలానలాస్త్రములునా ♦ బ్రహ్మాస్త్రమున్ మున్న గా
నరుదా నస్త్రము లిచ్చి తెల్పెను దదీ ♦ యాధానసంహారముల్. 12
వ. అంత నచ్చోటనుండి.
మ॥ నికటోర్వీన్ జెలువొందు స్వాశ్రమము నెం ♦ తేఁ బ్రీతి సావిత్రపు
త్రికులన్ జేరిచి యజ్ఞవిఘ్నకరదై ♦ త్యస్తోమసంహారనై
ష్ఠికు లౌనట్లు విధించి యంత మునిరో ♦ చిష్మంతుఁ డొందెన్ వ్రతం
బకలంకాత్మముతోడఁ గాంచుచు మఖం ♦ బం దుండి రారాసుతుల్.

గీ॥ జన్న మకుతోభయంబుగా♦జరుగుచుండె, నంతఁ బిశితాశు లరుదెంచి♦యద్ది కాంచి
కినిసి విఘ్నాదధానులై ♦ కేరి చదలఁ, జేరి కురిసిరి నెత్తురుఁ ♦ జీము నందు. 14

## —* శ్రీరాముఁడు మారీచుని సముద్రమునఁ జేర్చి సుబాహుని జంపుట *—

మ॥ మునులెల్లన్ జలితాత్ములై యపుడు సం ♦ బోధింప శ్రీరాము డం
తనె మారీచుఁ బ్రభంజనాస్త్రమున హీ ♦ నప్రజ్ఞుఁ గావించి య
వ్వనధిన్ గూలఁగ నేసె భాసురబృహ ♦ ద్భాన్వస్త్రధారన్ వధిం
చెను దుర్వ్యాహు సుబాహుఁ దత్పరిజన ♦ శ్రేణిన్ నిమేషంబులోన్.

గీ॥ అంతరాయంబు లెల్ల ని ♦ ట్లంతరింప
మునులు నిర్భీకులై ముదం ♦ బున మఖంబుఁ
బూర్తిచేసిరి కౌశిక ♦ మునియు రామ
లక్ష్మణులఁ దోడుకొని మిథి ♦ లకుఁ జనుటకు. 16

గీ॥ తలఁచి పయనంబు సల్ప న ♦ ధ్వంబునందు, గౌతమమహర్షి పత్ని రా♦ ఘవపదాబ్జ
రజము సోఁకినతోడనే♦ప్రకృతిఁ జెంది, పూజనం బొనరించె రా♦మునకు భక్తి. 17

క॥ మునియును దాశరథులు న, ధ్వనినుండి యహల్య నాపె ♦ పతిసన్నిధికిన్
బనిచి మిథిలాపురికిఁ జనిఁ, గొనిరి విదేహాతిథేయ ♦ గురుతరపూజన్ 18

గీ॥ బ్రహ్మఋషి సీతకును రామ♦భద్రునకు వి, వాహ మొనరింప నెంచి వి♦దేహరాజ
మౌళిరచితోరునియమాభి♦మతమనమున, నతని కిట్లనె హర్షభ♦ రాత్మ మెసఁగ.

ఉ॥ చూపుము శైవచాపము వి ♦ శుద్ధచరిత్ర! వికర్తనాన్వయుం
డీ పురుషోత్తముండు భవ ♦ దీప్సితమున్ నెరవేర్చి నీదు క
న్యాపరిదత్తధర్మసుమ ♦ హారము నొంది వరించు నా సతిన్
నీ పరితాప మింకను జ ♦ సించు శుభప్రకరాయతీగతుల్. 20

క॥ నీ సఖుఁడగు దశరథునకుఁ, గౌసల్యకు సుతుఁడు శౌర్య ♦ ఘనుఁ డీ రాముం
డా సౌమిత్రులలో న, గ్రేసరుఁ డీ లక్ష్మణుం డ ♦ రిందముఁడు నృపా! 21

వ. అనుటయు మిథిలానాథుం డొక్కించుక సంశయించి తాపసేంద్రున కిట్లనియె. 22

చ॥ దినదిన మెందరో పృథుల♦దీర్ఘభుజుల్ బలశాలు లిద్ధఘ
నతరతేజులైన నృప♦వర్యులునున్ దనుజేంద్రులున్ మహీ
జను వరియింప వచ్చి శివ♦చాపము నెత్తఁగ లేక నొచ్చి సి
గ్గును గొని పోదు రార్య! తమ♦గొప్పతనం బది తప్పిపోవఁగన్. 23

వ. అందును.

ఉ॥ బాలురు వీరు కోమలవి♦భాస్వరకాంతిసహస్రకోటులన్
మేలిమిసంతసం బొసఁగు ♦ మేనులజానగుతీరు విల్లుగో
సేల మహాత్మ! యా దశర♦థేంద్రుడు నా చెలికాఁడు వీరికిన్
బోలదు రుద్రచాపమును ♦ మోపొనరింపఁగ నాలకింపుమా! 24

వ. అనుడు విని మందహాసంబుచేసి యా బ్రహ్మర్షి సంక్రందనుండు రాజర్షి యగు సీరధ్వజున కిట్లనియె. 25

ఉ॥ ఏటికి సంశయించెద వ♦హీనతరాజ! మహీజ జానకీ
హాటకమూర్తి యీ రఘుకు♦లాబ్ధిశశాంకునకై జనించె ము
మ్మాటికి నమ్ము మీతఁ డస♦మానమహామహిమోజ్జ్వలుండు విల్
నేటుగ నెక్కుపెట్టి వడి♦నీ తనయన్ గ్రహియించుఁ గాంచుమా! 26

ఆ॥ అని నుడువుడు జనకుఁ♦డా చాపమును జూపె, రాముఁ డద్ది లాఁగ♦భీమధనువు
రెండు తునుక లయ్యె♦నిండు వేడుక సీత, విరులసరము రాము ♦ నరుత నేసె. 27

—* సీతాకల్యాణము *—

వ॥ జనకుఁ డుప్పొంగి గాధేయానతి దశరథభూమీంద్రుని వైభవంబున రప్పించి తదనుమతి శ్రీరామునకు మహీజాతయగు సీతను లక్ష్మణున కాత్మజాతయగు నూర్మిళను భరతశత్రుఘ్నులకు నిజానుజతనూజలగు మాండవీ శ్రుతకీర్తులను గ్రమంబుగ నిచ్చి యుద్వాహంబు చేయనొడంగి యందు శ్రీరామహస్తంబునందు సజలధారంబుగ సీతాహస్తం బునిచి యిట్లనియె. 28

గీ॥ ఇది మదీయదుహిత సీత♦యనకులీన!, భార్యగా నిచ్చితిని నీకుఁ♦బడయు మట్లు
భద్రమగు నీకు నిక్కొమ్మ♦పాణిపల్ల, వమును గ్రహియింపు పాణి సం♦బరముమీఱ.

వ. అని కన్యాదానంబుచేసి తక్కినకన్యలకుఁ గూడ పూర్వోక్తభంగిఁ గన్యాదానంబుల నెరవేర్చి వివాహంబుల నిర్వహించి బహుతరపారిబర్హంబుల నొసంగి యయోధ్య కనిపె నంత మధ్యేమార్గంబున భార్గవముని యెదుర్కొని యుగ్రంపశ్యుండై సామర్షంబుగ సన్నికర్షంబొంది దాశరథి కిట్లనియె. 30

మ॥ వడి మాహేశ్వరచాపమున్ విఱిచి యా ♦ వైదేహిఁ బెండ్లాడి యి
ప్పుడమిన్ నాసరిలేరు ధీరు లని బల్ ♦ ప్రోద్వృత్తరాహమ్మతిన్
దుడుకున్ జెయ్యెను జూపి తౌర! యిఁక నీ ♦ దోశ్శక్తిఁ గన్గొందు న
ప్పాడె మాటొందెన భార్గవాగ్రకరవి ♦ స్ఫూర్జత్కుఠారచ్ఛవుల్. 31

గీ॥ అనుడు రాముఁడు మ్రొక్కి భ♦క్త్యతిశయమ్ర, మోదవినయాదధానోక్తి♦పుంజమంజు
కలన వారింప నుడుగని ♦ కతన గెలిచెఁ, దపసి మెచ్చి యాశీస్సిడి♦తఱలె వనికి. 32

వ. అనంతరం బవ్వీర లయోధ్యన్ జేరి సుఖంబుగ నున్నంతఁ గొలఁది దినంబుల మీఁద మేదినీనాథుండు భరతుని దన్మాతులాభ్యర్థితుండై శత్రుఘ్నునితోఁ గైకయరాజధాని కనిపె నాపైని. 33

మ॥ ధరణీపాలకుఁ డగ్రపుత్త్రుని ఘనో ♦ ద్యద్బాహువిక్రాంతికిన్
వరసాద్గుణ్యవిభూతికిన్ మురిసి భా ♦ స్వద్వంశసామ్రాజ్య వి
స్తరభారంబు వహింప నష్టుఁడని యా ♦ త్మప్రేయులన్ మంత్రులన్
గురులన్ యోజనచేసి మారుతపుబా ♦ గున్ జూచి భూరిచ్ఛుఁడై. 34

మ॥ పురిఁగైసేయఁగఁ బంచి రాముననుజున్ ♦ భూజాతయున్ దివ్యగం
ధరసాభ్యంజనసేకధర్మవరి ♦ ధానస్నారకస్తూరికా
గరుదీవ్యత్తిలకాంగరాగమకుట ♦ గ్రైవేయముక్తావళీ
తరళాద్యాభరణప్రసాధనము ల ♦ త్యంతంబు గూర్పించియున్. 35

క॥ గురుని వశిష్ఠుని మంగళ, పరికరములతోడ సచివ ♦ బాంధవహితనా
గరముఖ్యులఁ దనయులనున్, ధరణిజ నాస్థాని కనిపి ♦ దర్పం బెసఁగన్. 36

క॥ తానును రయమునఁ గైకే, యీనిలయముఁ జేరి యా మృ ♦ గేక్షణతోడన్
ధీనిధులు కడమరాణుల, తో నాస్థానికిఁ జనన్ గు ♦ తూహలి యగుచున్. 37

సీ॥ తదపరోధముఁ జేర నం ♦ తకును మున్నె, జఱభి దుర్గంధయైన మం ♦ థరయనెడు
దాసి బోధఁగైకేయి యెం ♦ తయునుగినుక, మీఱికోపగృహమ్మును ♦ జేరియుండె.

చ॥ అరసి నరేశ్వరుండు దయి ♦ తాంతికభూమికిఁ జేరి యోసి! యీ
తెఱగది యేమి? హేతువిఁకఁ ♦ దెల్పు మనంగఁ గురంగనేత్ర శం
బరపథమం దొసంగిన భ ♦ వద్వరయుగ్మము నాత్మమందు సం
స్మరణమొనర్చి వేగ నిడి ♦ సత్యవచస్కుఁడవై పరంగుమా! 39

సీ॥ రాముఁ బదునాలుగేడు ల ♦ రణ్యభూమి, నుండఁ బంపుటయొండు వే ♦ ఱొండుసకల
వసుమతీమండలికి నెల్ల ♦ భరతుని యువ, రాజు సేయుట యినకుల ♦ రాజవర్య!

క॥ అనుడు నడలి భూనాథుం, డనుకంపార్థియయి రాము ♦ నటవీస్థలికిన్
బనుపగ మానుము వేఱొకఁ, డనుపుగఁ గోరుము దయామ ♦ యాత్మం బెసంగన్.

ఉ॥ రాముడు నాదుప్రాణములు ♦ రాజముఖీ! విను మల్లరాముఁ డీ
గ్రామము రాష్ట్రమున్ విడిచి ♦ కానకుఁజెందిన డిందు జీవితం
బేమియు సందియం బొసర ♦ దింతకు నోర్చెదవేని భర్తృహిం
సామహనీయమూర్తి వయి ♦ శాశ్వతమేలుమ! యీవె మేదినిన్.

వ. ఇవ్విధంబుగ

సీ॥ ఎంత వేడిన నైన మ ♦ దేభయాన
యదయయై పట్టువదలక ♦ యదియె కోర
నృపతి యుద్విగ్నుఁడై ఘోర ♦ విపులదుఃఖ
హతి భువిన్ బడియెను మూర్ఛ ♦ తాల్మిఁ డగుచు. 43

ఉ॥ అంతనె రాముఁ డవ్విధము ♦ నంత నెఱింగి సభన్ దొరంగి కా
సంతయుఁ జింతసేయకయె ♦ యాత్మపితన్ వడిఁ జేరి కాననా
భ్యంతర మేగువాఁడ నని ♦ యంబల కట్టులె చెప్పి యాన చు
ద్దెంతయుఁ బూన్కిఁ జేసెను మ ♦ హీజయు లక్ష్మణుండు తోడు రాన్.

వ. కుమారోన్నతికై యిష్టదేవార్చనఁ బొనర్చుచున్న కౌసల్యయుఁ దదనుసారిణి
యైన సుమిత్రయు నవ్వైపరీత్యంబంతయు నాలసి యత్యంతంబువగచి దుఃఖం
బాపుకొనలేక యందు రామజనని రాముం బట్టుకొని యిట్లనియె. 45

మ॥ కొడుకా! యేటికి పుట్టుకొంటివి యే ♦ గొడ్డైన యీలాటియా
రడికిన్ భాజన మానె నిన్నును గన ♦ ద్రాజీవమృద్వంగి యీ
పడుచున్ నట్టడవిన్ దిగన్ బరపి యీ ♦ పాపిష్ఠమ్ముప్రాణముల్
గుడువన్ జాల నిఁకన్ దయన్ బరపి నన్ ♦ గొంపొమ్ము నీతోడుతన్. 46

చ॥ అటు లొనరింపకున్న నిను ♦ నక్కట! కొల్పడి జీవితంబు నే
నిట ధరియించి యుందునె భ ♦ రింతునె నీవనవాసదుఃఖమున్
గుటిలయుఁ గ్రూరయౌ సవతిఁ ♦ గొల్చెదునే నిముసంబులోన ను
త్కటగతిఁ బ్రాణముల్ సురుగుఁ ♦ దప్పదు నీ మదిలో నెఱుంగుమా!

వ. అనిన రామచంద్రుండు తల్లి కిట్లనియె.

చ॥ వలవ దటుల్ దలంపకుము ♦ వాసవసన్నిభుఁ డుత్తముం డక
శ్మలచరితుండు నీ విభుఁడు ♦ మా జనకుం డిటు మా యరణ్యపుం
జలనము నీవియోగమును ♦ సైతము నోర్వఁగఁ జాలఁ డమ్మ! య
గ్గలముగు దుఃఖ మొంది విడఁ ♦ గాఁగలఁ డీతనువున్ రయంబునన్. 48

చ॥ పతి శరణంబు దైవ మిలఁ ♦ బాటలగంధుల కమ్మరో! తదు
న్నతపరిసేవనంబె యగు ♦ నాయము హేయముతద్విరుద్ధ మా
నతి యిడు పోయినచ్చెదఁ బ్రి ♦ యామములన్ బొనరించెదన్ గృపా
తతకుశలోక్తిగీతి శత ♦ ధా యొనరింపు! వహింపు మోరిమిన్. 49

ఆ॥ అనిన యంత నామె ♦ యాత్మంబు దిటమొందఁ, జేసి యనియె నినుఁడు ♦ శీతరశ్మి
భూతపంచకంబు ♦ భూతనాథుఁడు మిమ్ముఁ, గాఁచుచుండ్రు శివము ♦ గాతఁబథము.

వ. అపుడు సుమిత్రాదేవియు నెట్టకేలకుఁ గొందలం బణచికొని లక్ష్మణునిఁ జూచి యిట్లనుశాసించె. 51

గీ॥ రాము దశరథుఁ గాఁగ ధ ♦ రాతనయను
నన్ను గా నమ్మహాకాన ♦ నంబు నీయ
యోధ్యఁ గా హృదయంబున ♦ నూహసేయు
మయ్య! యిఁకఁ బోయి రమ్ము! సౌ ♦ ఖ్య మగునట్లు. 52

—* శ్రీరాముఁడు సీతాలక్ష్మణులతో నరణ్యమున కేగుట *—

వ. అంత వార లయోధ్యనుండి నిర్గమించి యటవీప్రదేశంబుఁ జేరుటయు.

క॥ పౌరులు పెక్కురు వెంబడి, రా రాతిరి వారి నిద్దు ♦ రను గూరిచి తా
మా రేయిఁ బయన మొందిరి, యారణ్యముఁజేరి తఱిసి ♦ రా యమరధునిన్. 54

గీ॥ భవజటామండలాంతర ♦ పతితపూత, వారివాహినియైన ది ♦ వ్యధుని స్నాన
మాడి యచట వసించు గు ♦ హాభిధానుఁ, డైన వ్యాధునిచే దాటి ♦ రా స్రవంతి.

వ. అంత భరద్వాజాశ్రమంబుఁ జేరి యవ్వారి సేవించి తదీయనిర్దేశాను సరణిఁ జిత్ర
కూటాచలప్రాంతంబుఁ జేరి 56

చ॥ మునిజనసేవితంబును స ♦ మున్నతసుందరకందరోరుపా
వనవనవాహినీతటవి ♦ భాసితదివ్యఫలద్రుమావళీ
కనదురుమాకందరస ♦ గంధసుగంధలతావితాన కా
ననఘనమండలంబు నగు ♦ నాగపదంబును గాంచి వేడ్కమై. 57

వ. అందు.

గీ॥ పర్ణశాలను నొక్కఁడే ♦ర్పఱచుకొని వ, సించి రిఁకను నయోధ్య శో ♦ కించుచున్న
దశరథనృపాలవర్యుండు ♦ తనయవిరహ, దుస్సహాగ్నిసంతప్తుఁడై ♦ దారఁగెఁదనువు.

ఉ॥ పౌరులు మంత్రులున్ భటులఁ ♦ బంచి తగన్ భరతున్ గనిష్ఠుతోఁ
జేరఁగఁ దెచ్చి సర్వమును ♦ జెప్పఁగ నప్పుడె రామసోదరుం
డోరువలేక మంథరను ♦ నుత్పథయౌ జననిన్ వధింపఁగా
భూరికృపాణమెత్తఁ గృపఁ ♦ బూని వశిష్ఠుఁడు మాన్పె నుద్ధతిన్. 59

వ. మఱియు భరతుం డాగ్రహంబున నిజజననిన్ బరికించి తత్రాపతికూల్యహింసా
కృత్యంబుల కెంతేని దుఃఖించి యిట్లు నిరసింపుచు ననియె. 60

ఉ॥ ఏమని నిన్ను రాఘవుఁ డ ♦ శోకించుక యేవములేక లేకి! శ్రీ
రాముని సీతనున్ నడియ ♦ రణ్యము లక్ష్మణుతోడఁ ద్రోచి నీ
స్వామిని మ్రింగి దుర్యశముఁ ♦ జక్కఁగ దిక్కుల నింపి తిట్లకీ
భూమిని నాకొసంగెదవె ♦ పో యది నెత్తిని నీవె కొట్టుకో. 61

వ. అని యంత.

చ॥ జనకున కౌర్ధ్వదైహికముఁ ♦ జక్కఁగ సల్పి దుకూలరత్నకాం
చనమణిభూషణంబులను ♦ సర్వముఁ బోవిడి వల్కలంబులన్
గొని ధరియించి వాజిరథ♦కుంజరయోధచయంబుతోడ స
జ్జనహితనాగరప్రముఖ ♦ చక్రముతోడ గమించి కానకున్. 62

గీ॥ చిత్రకూటాచలముఁజేరి ♦ శ్రీరఘువరు, జాడ లరయుచుఁ దఱిసి వి ♦ షాదవేగ
భరితుఁడై భరతుఁడు రామ♦పదములందుఁ, బడివడిన్ దెల్పె దశరథ♦స్వర్గమనము

వ. శ్రీరామలక్ష్మణులు వైదేహియు నత్యంతంబు వగచి దశరథున కుత్తరక్రియలు
నిర్వర్తించి రట మీఁద. 64

చ॥ భరతుఁడు రామచంద్రపద ♦ పద్మములన్ బడి యేను దీర్ఘ దు
ష్కరవిపినవ్రతంబు నిఁక ♦ సత్వర మీవు మహీజ లక్ష్మణుం
డురుకరుణానిధాన! పుర ♦ మొంది యఖండవసుంధరాస్థలిన్
నిరుపమలీలఁ బాలన మ ♦ నిందితరీతి నొనర్పఁ గాఁ దగున్. 65

చ॥ పదుగురు చుట్టి తిట్ట నిది ♦ పాపపథం బనుకోక లోభమున్
మదిఁ గొని నాదుతల్లి జన ♦ మాన్యునిఁ బుణ్యుని నిన్నుఁ గానకున్
వదలి పతిన్ వధించినది ♦ వాస్తవ మన్నిరయంబు నొందు న
య్యదయ యిఁకేల నామనవి ♦ నారసి వేగ నయోధ్యఁ జేరుమా! 66

చ॥ శునకము సింహపీఠమునఁ ♦ జేరినకైవడి నీదు పీఠమున్
వెను గన కెక్కువాఁడనె! ప ♦ విత్రిత యర్హత నెంచి చూడనే
దినకరవంశభూషణ! మ ♦ దిన్ గురితించి ననున్ క్షమించి నీ
ధనమును రాజ్యమున్ గొని ము ♦ దమ్మున నేలవె మమ్ము నందఱన్. 67

వ. అని వేఁడుటయు.

చ॥ అనుజునిఁ బ్రేమచేసి వర ♦ మట్టిది కాదని తాతపాదునిన్
దినకరవంశమండనుని ♦ దేవసమానుని సత్యనిష్ఠునిన్
మనమున నెంచుమంచుఁ బతి♦ మాలె రఘూద్వహుఁ డంతఁదమ్ముఁడున్
విని రఘునాథపాదుకల ♦ వేఁగొని రాష్ట్రముఁ జేరి ధీరుఁడై. 68

గీ॥ పాదుకల సింహపీఠంబు ♦ పై సమర్చి, పూజయొనరించి తా నంది♦పురమునందు
వాస మొనరించి భూపరి ♦ పాలనంబు, సేయుచుండెను భూరిసౌ♦శీల్యమునను. 69

వ. ఇఁక నిందుసీతారామలక్ష్మణు లాకాంతారాంతరంబు నుండి విప్రకృష్టాటవీయి
యానులై ప్రయాణం బొనరించి 70

చ॥ ఒక వనభూమి నుండి మఱి ♦ యొక్కవనస్థలి కేఁగుచున్ మహో
త్సుకమతి వన్యపుష్పఫల ♦ తోయము లొందుచు సత్తపోధన
ప్రకరసమర్పితాతిథిస ♦ పర్యలఁ జెందుచు నల్ల యుజ్జ్వలో
దకకణభుగ్ఘనీతటని ♦ ధానఘనావని దండకావనిన్॥ 71

గీ॥ అగ్రమందు రఘుశ్రేష్ఠుఁ ♦ డవల సీత, వెనుక సౌమిత్రి నడుచుచు♦విపినపదముఁ
జేరుచుండవిరాధుఁడన్ ♦ జెనఁటిదైత్యుఁ, డోకఁడు పరికించి నిబిడద♦ర్పోద్ధతుఁడయి.

## —* శ్రీరాముఁడు విరాధుని వధించుట *—

చ॥ ఎదురుగ వచ్చి మైథిలిని ♦ నేత్రైర నెత్తి నిజోరుపీఠిపైఁ
జదురుగఁజేర్చి రాము నను ♦ జన్మునిఁ జూచి కఠోరవాక్తతిన్
బెదరు ఘటింపఁజేయు నరి ♦ భీషణుఁ డారఘువంశవర్ధనుం
డుదితరుషాధితప్తుఁ డయి ♦ యుద్ధతదానవు గిట్టె వేట్రునన్ 73

గీ॥ వాని మతిఁగాంచి వసుమతీ♦శ్వభ్రమందుఁ, గూల్చి శరభంగమౌనిని♦ గొలిచికుంభ
సంభవాశ్రమమును జేరి♦చాల మురిసి, భక్తిఁబూజించి కొనె శుభ♦వాదములను.

క॥ మఱియు నగస్త్యసమర్పిత, పురుహూతధనుశ్శరప్ర♦ముఖములఁగొని భా
స్వరసుస్వరశుకపికచయు, తరువాటినిఁ బంచవటినిఁ ♦ దఱిసి యట రహిన్. 75

గీ॥ లక్ష్మణరచితపర్ణశా ♦ లాస్థలిన్ వ, సించి జనకజతో సుఖ ♦ శ్రీ లెసంగ
మునిచయస్తూయమానుఁడై ♦ యినకులపతి, గడపెను బదేండ్లు దినదశ♦కంబుపగిది.

వ. అంతఁ గొంతకాలంబు జరిగినమీఁద నొక్కనాఁడు.

చ॥ అసురి యొకర్తు శూర్పణఖ ♦ యంచుఁ బ్రతీతి వహించినట్టి దా
యసమవనాంతరస్థలి వి ♦ హారముసేయుచు రాఘవాశ్రమా
వనధసమీప మొంది రఘు ♦ వల్లభు నల్లనఁ జూచి యంత నే
కుసుమశరార్తచిత్తయయి ♦ క్రొవ్వున డాసి వచించె నిట్టులన్. 77

ఉ॥ కాముఁడవో వసంతుఁడవొ ♦ కానకుఁ జెందిన చందురుండవో
శ్యామలకోమలాంగ! నిను ♦ జక్కఁ గనుంగొని మెచ్చి వచ్చితిన్
నీమనసార భోగము ల ♦ నేకవిధంబుల నొందు మిందు నీ
భామినితోడ నేమిపని ♦ భావజకేళుల నేన తన్పెదన్. 78

క॥ కుసుమశరభోగముల నన్, గుసిపెట్టుము నీకుఁ దగిన ♦ క్రొంబోలఁతిని నీ
ముసలివిసుగేల విడు సం, తసమున్ బొనరింతు నీకు ♦ సకలవిధములన్. 79

శా॥ నీ యుల్లంబున కెట్లు మెచ్చెదవునో ♦ నే నట్టు లూహించి యా
యా యుంపైన వనప్రదేశముల నా ♦ యా రమ్యనేపథ్యలీ
లాయోగం బలరంగ సంగభవగా ♦ ఢానందకేళీప్రభో
గాయత్తున్ బొనరింతుఁ దీర్తును మనో ♦ జానూననానారుజల్. 80

శా॥ ఒచ్చెం బన్నది లేదు నాయెదుట నీ ♦ కుల్లాసమున్ గూర్తు నా
హెచ్చున్ గన్గొని నీవ మెచ్చెదవు ముం ♦ దేలా! ప్రగల్భోక్తులీ
విచ్చంబాఱిన కమ్మపూఁబొదల బల్ ♦ విందొప్పఁ గ్రీడింపుమా!
యుచ్చైచ్ఛ్రీనిఁ బరిత్యజింపకుము నీ ♦ కొందించు నిష్టార్థముల్. 81

వ. అనినంత శ్రీరాముఁడు సహేలుండై యనుజునిజూపి యతండొంటిగనున్నవాఁడా
తనిదండనుండెదనమ్మ పొమ్మనిన దానవియు ననుమతించి లక్ష్మణున్ జేరఁజని
నిజాభిమతంబెఱింగించుటయు నాతండభిముఖుండుగాకుండుటకుఁ గినిసి రాముఁద
ఱిసి పృథుల జిహ్వన్ సాచి మైథిలిన్ మ్రింగఁబోవుచున్నంత దాశరథి యడ్డపడి
తమ్మున కిట్లనియె. 82

క॥ నీచులతోఁ బరియాచక, మేచక్కిన్ గూడదరయు ♦ మీాయసురి నసిన్
జూచి వెడలింపుమన నతఁ, డాచెన్నఁటికర్ణనాస ♦ లసిఁగోసె వెసన్. 83

ఉ॥ శోణితవృష్టు లెంతయు వ ♦ సుంధర ముంపఁగ మాంసఖండపా
షాణతతుల్ గడున్ గురియ ♦ సాధ్వసశోకమహోరుపార్తిని
ర్వాణగభీరగర్జనవి ♦ రావము లాశలఁ దూట్లుపుచ్చ దు
ర్వాణులఁ గూయుచున్ జనియె ♦ రక్కసి గ్రక్కునఁ బాసి వారలన్. 84

మ॥ ఖరుఁడున్ సోదరుఁ జేరి యేడ్చుచుఁ గడున్ ♦ గంపంబు దాస్రింబు దు
ర్భరదుఃఖంబు గలంప నిట్లనేఁ బ్రవీ ♦ రా! నీదు తోఁబుట్టునై
సరయెవ్వారలు లేక యుండు నిను నీ ♦ చస్వాంతులా మర్త్యు లి
క్కరణిన్ శిక్షయొనర్చి రోర్చెదవె వై ♦ కల్యంబు నీక్షింపుచున్. 85

చ॥ సముచితవల్కలాంబరవ ♦ సానులు సారసనేత్రు లిద్దఱు
త్తమబలవిక్రమోన్నతు లు ♦ దారధనుశ్శరఖడ్గశోభితుల్
రమణి యొకర్తు కీగహన ♦ రాజి విహారముసేయుచున్ బ్రమో
దమున వసించియుండి రిఁక ♦ దర్పముతో నను గోసి రిట్టులన్. 86

ఉ॥ నీవును దక్కసోదరు ల ♦ నిందితశక్తి జఘాంసులై వెసన్
గావలువైన యన్నరులఁ ♦ గామినితోడ వధించి వచ్చి నా
కీ వగఁబాపుఁ డట్లయిన ♦ నే నిఁకఁ దద్రుధిరాంబుపాన మిం
పావహిలంగఁ జేసి ముద ♦ మందెదఁ బొందెద రీవు కీర్తులన్. 87

చ॥ అనుటయు నాతఁ డాగ్రహప • రాయణుఁడై పదునాల్గువేలపై
నని బదునాల్గురా దనుజ • నిస్తులయోధులతోడఁ దమ్ములన్
గొని పృథివీపదం బదరఁ • గోసలజాసుతుఁ జేరి సింహగ
ర్జన మొనరించి పిల్చె సమ • రం బొనరింపఁగ రమ్మటం చొగిన్. 88

—* శ్రీరాముఁడు ఖరదూషణాదిరాక్షసులను జంపుట *—

చ॥ కని విని రాముఁ డా దనుజ • కాండమునన్ బొడిసేయ నెంచి భూ
తనయను గాఁచుచుండు మని • తమ్ముని నుంచి ధనుస్సహాయుఁడై
చని వనభూజరాజి దవ • జాలశిఖావళి ప్రజ్వరిల్లి కా
ల్చినయటు లా నిశాచరుల • చేవయడంచి వధించె నమ్ములన్. 89

ఉ॥ దానవి యంతఁ గన్గొని ని • తాంతదురుద్ధరదుఃఖమగ్నయై
దీనతఁ జెందియున్ బగను • దీర్పఁగఁ బూని రయంబునన్ జన
స్థానమునాగఁ బేర్వడిన • దారుణకానన మప్డు వీడి లం
కానిలయంబుఁ జేరె క్షణ • కాలములోన నె దాఁటి యంబుధిన్. 90

గీ॥ రావణాస్థానమున కార్త • రావరోద, నములతోఁ జని మ్రొక్కి త • నదువికృతిని
జూపి శ్రీరాముచే నాత్మ • సోదరులు ఖ, రాదు రెల్లరు మరణించి • రనుచుఁ దెలిపి.

క॥ ఆ రామలక్ష్మణులభుజ, సార మపారంబు రామ • చంద్రునిసతి బల్
దీరిచిన పసిఁడిబొమ్మ యు, నా రహిఁదగుసొగసు నెఱుఁగ • నా తరమగునే! 92

క॥ మీలో! కనుదోయి లకో, రీలో! చనుజంట మరుసి • రిన్ దనరినమేల్
డాలో! నూగా రిభతుం, డాలో! తొడ లట్టిచెలిఁ బ • డయుట సులువాకో. 93

క॥ పలుకులు పులఖండంబుల, పలకమ్మను జిఱుతనగవు • వేయేటి కిరన్
నిలువఁగ నీడెన్నఁడు వె, న్నెలచలువపుతళుకుబెళుకు • నేటగుసిగ్గున్. 94

ఉ॥ కాదది యప్సరోరమణి • కాదది నిర్జరనీరజాక్షియున్
గాదది భోగిరాజకల • కంఠియుఁ గా దసురాబ్జగంధియున్
గాదది మానవేందుముఖి • కల్కిని వాఁ డెటనొందెనో ధరన్
నీకుకళత్రమైన నది • నే ముద మొందనె మిన్ను ముట్టుచున్. 95

ఉ॥ నంత కళంకమున్ గానని • శుభ్రమరీచి యొకప్పు డేని ర
వ్వంతయు మోడ్పుచెందని సు • వర్ణ వినూతనపద్మరాజ మె
న్నెంతకు వెల్తిగాని యమృ • తేద్ధమణీఘుటి యా మిటారి నీ
కంతటికాంత రాణి యగు • నంతకుఁ జింతకు నంతమున్నదే? 96

ఉ॥ ఆ యరవిందగంధి విను ♦ మా శతపత్త్రవిశాలనేత్రి ఆ
కాయజమోహనాస్త్ర మల ♦ కమ్రపికస్వరసుస్వరోక్తి ఆ
ఆయతకేశపాశ యతు ♦ లాద్భుతబాహుపరాక్రమాంచితుం
డై యలరారునీకుఁ జెలి ♦ యైవిలసిల్లిన భాగ్య మెంతయో. 97

ఉ॥ దానిని నీకుఁ జేర్చుటకుఁ ♦ దద్వనభూమికిఁ జేరి లాఁగ రా
మానుజుఁ డుగ్రుఁడై యసిని ♦ నంతముచేసెను కర్ణనాసలన్
గానఁగలేక నా వ్యథను ♦ గాదిలిసోదరు లాఖరాదు ల
న్యాసరుషార్తిమై యెదుర ♦ నుక్కఱఁజంపెను రాముఁ డందఱన్. 98

గీ॥ ఆ జనస్థాన మంత శూ♦న్యాసురమయి, వెలసె నిస్సీఁకమీఁద భా♦విగతి యెదియొ
విన్నవించితి నా గోడు♦విజితవైరి!, బలియుఁడవు నీవు నేఁ జెప్పఁ♦గలనె నీకు. 99

ఉ॥ ఆ చెలియల్ వచించిన య ♦ నర్థములన్ విని యాపెమోముపైఁ
జూచి వ్రణంబులన్ మనుజ ♦ సూదనుఁ డాగ్రహవేగ మొంది సీ
తాచతురేక్షణానుగత♦తర్షము హర్షము నొంది నీచ మా
రీచునిఁ దోడఁ దోడ్కొని స ♦ రిత్పతి దాటి నృపాలుపాలికిన్. 100

గీ॥ చేరి మారీచు నొక్కబం ♦ గారులేడిఁ, జేసి రామాశ్రమమునకుఁ♦జేర్ప నదియు
సీతకగుపడి నడువ భూ♦జాత దానిఁ, బట్టి యిమ్మన శ్రీరామ♦భద్రుఁ డంత. 101

మ॥ శరచాపంబులు దాల్చి హేమమృగికై ♦ శశ్వత్తదన్వేషణం
బరుడై తోపఁగ దవ్వుఁ జేరి యట బ్ర ♦ హ్మాస్త్రంబు యోజించి వే
సె రహిన్ దాన నిశాచరుండు సమసెన్ ♦ స్వీయాకృతిన్ జెంది సో
దర! హా సీత! యటంచు గూయుచు వినన్ ♦ దద్రావ ముర్వీజయున్. 102

వ. అంత జానకీదేవి

ఉ॥ అప్పుడె లక్ష్మణున్ బిలిచి ♦ యన్నను జేరు మదేమొ సంకటం
బుప్పతిలంగఁ దోచె నన ♦ నొప్పకయుండుడుఁ గాంచి యాతనిన్
దప్పులు వల్కి పంపె నిఁక ♦ ద వ్వతఁ డొందినమీఁద రావణుం
డొప్పదలిర్ప భిక్షుతను ♦ వొంది హరిస్మరణంబు సేయుచున్. 103

వ. సీతావాసంబును దారసించినంత

## —* రావణుఁడు సీతన్ గొనిపోవుట. *—

ఉ॥ స్నాతకుఁ డన్న నూహఁ గొని ♦ జానకి వానికిఁ బిల్చి భిక్షమున్
బ్రీతి నొసంగఁ బో నతఁడు ♦ భీషణరూపముఁ జూపి భూమిజన్
జేతులనెత్తి పుష్పకముఁ ♦ జేరిచి యభ్రపదంబు నొందెఁ ద
న్నాతఁడు గొన్చుఁ బోవుటది ♦ యారసి జానకి శోకమొందుచున్. 104

ఉ॥ నా యనుతాప మట్లు తగు ♦ నా యను దేవరు నొవ్వఁ బల్కు బా
నా యను రాముఁ జూడఁ గల ♦ నా యను రావె మహాకృపానిధా
నా యను దుష్టదైత్యదమ ♦ నా యను నాశ్రితజీవితప్రదా
నా యను సర్వదుఃఖశమ ♦ నా యను మాటికి దుఃఖితాత్మయై. 105

వ. అంత రావణుఁ జూచి రోజుచు నిట్లనియె.

చ॥ తగదిది రాక్షసేంద్ర! పర ♦ దారఁ బతివ్రతమైనదానిఁ గ
మగఁడు మఱంది దూరగమ ♦ నంబున కేగుట నొంటిదాని నీ
పగిదిగ దొంగలించి కొని ♦ పాఱుట చేటగు వేగ నన్నిఁకన్
దిగవిడి రాముఁ జేర్పు మిఁక ♦ ధీరుఁ డతండు క్షమించి కాఁచు నిన్. 106

వ. ఇట్లు చెప్పిన నాలింపకయుండుటఁ గాంచి విలపించుచు నెలుంగెత్తి యిట్లు మొఱ
వెట్టుకొనియె. 107

సీ॥ ధరణిజాతను దుష్ట♦దైత్యుండు గొనిపోవు, చుండెఁ గావరె దివ్య♦యోధులార!
సీరధ్వజకుమారిఁ ♦ జెనఁటిరక్కసి కొని, చనుచుండె మనుపరే ♦ మునులు మీరు
దశరథాగ్రస్నుష ♦ దనుజుం డొడిసి యిట్లు, దరలె నారయరె గం♦ధర్వులార!
శ్రీరామచంద్రుని ♦ చెలువను బలలాశి, చెఱగొనెఁ బ్రోవరే ♦ సిద్ధులార!

గీ॥ గరుడులార! విద్యాధరా ♦ గ్రసరులార!, యక్షులార! ధర్మైకాధ్వ♦పక్షులార!
వేగిరమె చేరి నన్ విడి♦పింపరయ్య!, కనికరము సెందుఁడయ్య! వం♦దనమొనర్తు.

వ. ఆ యార్తస్వరం బాలించి పక్షీంద్రుండగు జటాయువు వాకసంబునకెగసి రావణున
కడ్డుపడిన నతఁడు కృపాణంబుఁ బెఱికి యవ్వాని యొఱుకల నఱికి పుడమిపయిఁ
బడవైచి. 109

సీ॥ కడలి దాఁటి జవమున ల♦ఙ్కాపురంబుఁ, జెంది యందు నశోకవి♦చిత్రవాటి
యందుఁ జేరిచి రాక్షసీ♦బృందమధ్య, సీత బొగలఁగఁ జెఱనుంచెఁ♦జేటుఁ గనక.

శా॥ మారీచున్ వధియించి స్వావసథభూ ♦ మార్గంబునన్ వచ్చునా
శ్రీరాముఁ గని లక్ష్మణుం డఖిలమున్ ♦ జెప్పంగ హాసీత! హా
హా రక్షోహృతవైతివా! యనుచు నా ♦ ర్తారావముల్ సల్పుచున్
ధీరుండై మృతినొందుచున్ బలికెఁ బ ♦ క్షిశ్రేష్ఠుఁ డిబ్బంగిగాన్. 111

ఉ॥ తావకధర్మపత్నిని మ ♦ దంబున రావణదైత్యుఁ డుగ్రపం
కావిలచిత్తుఁడై కొని ర ♦ యమ్మునఁ బుష్పక మెక్కిపోయె నే
వే వినువీథి నడ్డుపడి ♦ వీక దురం బొనరించినాఁడ దు
ర్భావుఁడు ఱెక్కలన్ దునిమి ♦ వైచెను ప్రాణము లుత్క్రమింపఁగన్. 112

వ. అని యనంతరంబె వీరశయ్యాశయానుండగు నవ్విహంగేంద్రుం డసువులఁ బాసిన శ్రీరామచంద్రుండు వగచి యాతని కగ్నిసంస్కారంబు లొనరించి సీతాశూన్యంబైన యుటజావాసంబుఁ బాసి యత్యంతంబు వలవించుచు సీతాన్వేషణంబునకై సానుజుండై దక్షిణాధ్వంబు ననుసరించి నడుచుచుండెను. 113

## —— * శ్రీరాముఁడు కబంధుని వధించుట * ——

గీ॥ కాన నంతఁ గబంధుఁడన్ ♦ గర్బురుండు, వికృతుఁడు బుభుక్షు డాయ వే ♦ వేగ వాని
బాహువులఁద్రుంచి పావక ♦ జ్వాలఁగాల్చి, రతఁడు శాపవిముక్తి ది ♦ వ్యాధ్వ మెగసె.

వ. మఱియు నతండు రావణుండు సీతను గొనిపోయి లంకయందుంచెననియు నిచ్చటికనతిదూరంబునఁ బంపాసరోవరంబు పార్శ్వంబందు ఋష్యమూకాద్రియందు సుగ్రీవుండను కపికులనాథుం డాంజనేయునితో వసించి యున్నాఁడనియు నగ్రజునిచే నితం డపహృతదారుండై యుండుట మీర లాతనికి సాహాయ్యం బొనర్చిన నతండు కృతజ్ఞుండై సీతాన్వేషణ రావణసంహరణం బందుఁ దిరుగ సాయం బొనరింపఁ గలఁడనియు నుడివి యదృశ్యుఁ డనియె నంత రామలక్ష్మణులు పంపాసరోవరంబుఁ జేరి యందలి రామణీయకంబు భూమిజా విరహదుఃఖంబు నత్యంతంబినుమడింపఁజేయుడు రాఘవుం డనుజున కిట్లనియె.

చ॥ స్ఫురదురుమాకరందకస ♦ భూషితభాసితపద్మషండసం
చరదతిమాత్రకూజితపి ♦ చండిలమానసవాసచక్రిసుం
దర మగు నీసరోవరము ♦ దండ వసింపఁగఁ జెల్ల దుర్విజా
విరహాభరంబు దుర్భరము ♦ వేగ మఱొండగు చోటుఁ జేర్పుమా, 115

వ. అని మఱియు నుద్విగ్నుండై సీతను దలంచి.

ఉ॥ జానకి! యెందుఁ జేరితివి ♦ జానగు నీనగుమోముఁ జూడకే
ప్రాణములన్ భరింపఁగ ను ♦ పాయముదోపదు డాయరాదె! నా
పై ననురక్తి భక్తి గల ♦ పావనమూర్తిని నిన్ను నట్టర
ణ్యానినిఁ గోలుపోయిన ఖ ♦ లాత్మునిఁగానెదవా! కృపామయీ! 116

వ. అనుచు సరోవరంబుఁ బరికించి.

సుగంధి వృత్తము
నీరజంబ! చూచినావె ♦ నీరజాతలోచనన్
సారసంబ! చూపరాదె! ♦ సారసానుయాననున్
చారుచక్రివాకి! చూపు ♦ చారుచక్రిసుస్తనిన్
మీరలెల్లఁ బ్రేమమెంచి ♦ మేలుఁగూర్పు డీమెడన్, 117

సీ॥ రాజీవముల నెట్లు ♦ రహి నిరీక్షింతు నా, రాజీవగంధి పా♦ర్శ్వమున లేక
నవమృణాళములఁగా♦నఁగ నోర్వఁగలనెట్లు, నవమృణాలభుజయం♦డను మెలఁగక
కలహంసగతులెట్లు ♦ గదసి వీక్షించెదఁ, గలహంసయానసం ♦ గతి నడువక
చక్రిదంపతులరా♦జసు మెట్లు కన్గొందుఁ, జక్రిస్తనీయోగ ♦ సరణిఁ గానక
గీ॥ భ్రమరమాలాభిగీతసం♦శ్రవణ మెట్లు, భ్రమరమాలాంశుధమ్మిల్ల ♦పథ మెనయక
యీ యెడ వసింపఁజాల వే♦తేఁప కేని, పంప! పంపఁదలం పను♦కంప నింపి.

వ. అని యనంతరంబే ప్రయాణంబుచేసి యచ్చటికి సన్నికృష్టంబును నానావిధపుష్ప ఫలవృక్షవిలసితంబును నగు ఋష్యమూకాచలంబుఁజేరి రక్షస్తర్జనార్థంబు గుణ ధ్వనిఁ బొనరింపుచు నడుచుచుండుడు. 119

ఉ॥ పావనమైన యక్కుధర♦భాగమునం దల వాలిభీతి సు
గ్రీవుఁడు తత్సహోదరుఁ డో♦గిన్ నివసింపుచు నాంజనేయుతో
భీవహమైన రాఘవుల♦విండ్లరొదన్ విని వాలిమిత్రులే
భూవిభులో నను న్గడుపఁ ♦ బూనికచే నిఁక వచ్చి రం చనన్॥ 120

చ॥ సచివుఁడు వాయునందనుఁడు ♦ జంకకుమంచు నచించి యంతఁ దా
నచకితవృత్తి నొక్కయతి♦యై నృపవీరులఁ జేరి తెచ్చి యం
దుచితగతిన్ నిజేశితను ♦ సుగ్రికరాన్వయమూర్తి కద్దసం
కుచితసఖిత్వ మేర్పఱచెఁ ♦ గూరిమిఁజేకొని వార లంతటన్ 121

క॥ అన్యోన్యోదంతంబుల, నన్యోన్యం బెఱిఁగికొని మ♦హాదరపూర్వం
బన్యోన్యసాహ్యములఁ దా,మన్యోన్యము సేయఁ బ్రతిన♦లాడికొని రటన్. 122

వ॥ అంత రాఘవుండు సుగ్రీవవిశ్వాసార్థం బందు దుందుభిశరీరోత్పాదనంబును సప్త సాలభేదనంబును బొనరించుటను జూచి సంతుష్టాంతరంగుఁడైన ప్లవంగేశ్వరున కిట్లనియె. 123

చ॥ సరవిగ విన్ను దివ్యబల♦శాలిని వాలిని సంహరించెదన్
గురుతరవానరప్రముఖ♦కోటికి నిన్నొనరించెదన్ బ్రభున్
మురిపముమీఱ నీదు విరిఁ♦బోఁడిని జెంది యనంతసౌఖ్యముల్
దిరముగఁజెందు దగ్రజునిఁ ♦ దెమ్మికఁ బొమ్మి కపీశ్వరేశ్వరా! 124

## —* శ్రీరాముడు వాలిఁజంపుట *—

గీ॥ అని ప్రబోధించి వాలి నా♦హ్వానపఱచి, భానుజుని కంఠమందుఁ బు♦ష్పసృజంబు
వైచి గురుతొందె యొకదివ్య♦బాణరాజ, మేసె వాలిపైఁ బ్రాణంబు♦లెగిరి చనఁగ.

వ. వాలియు నిర్గతంబులగుచున్న ప్రాణంబుల నాగి రాముఁ బరికించి యిట్లనియె. 126

మ॥ అకటా యేటికి రాజవై యిటుల న♦న్యాయంపు హేయంపు ప
స్థకు లోనైతివి ధీరు లెన్నుదురె? దు♦స్తంత్రంబు నాతోడఁ జి
వ్వకు రాఁ జాలకపోతి వాయతతరు♦ప్రచ్ఛన్నగాత్రుండవై
యకలంకున్ నను జంపినాఁడవు మహా♦హత్యాప్రకారంబునన్. 127

వ: అనుటయు విని రామభద్రుం డిట్లనియె.

ఉ॥ కాదిది హత్య వాలి! విను ♦ కాననజంతువ వౌటఁ బొంచి వ్యా
పాదము సేయుటే తగవు ♦ బల్మి మఱుందలిపొందు చేసి నీ
గాదిలితమ్ము నుగ్రగిరి♦కానన భూమికిఁ ద్రోచినాఁడ వి
ట్లా దురితంబు సైపనగు♦నా! తగునా యది రాచవారికిన్. 128

వ. అని నుడివి యంగదుని యువరాజున్ జేయుదునని కందుఁ బాపి యభయ మిచ్చుటయు వాలి సంతసించి యసువులఁ బాసె నంతఁ దారాంగదాదులు తక్కుంగల వానర ప్రముఖులు విచ్చేసి వారలును సుగ్రీవుండును తడవు ప్రొద్దు విలపించి రంత మహేంద్రతనయుని యౌర్ధ్వదైహికక్రియానంతరం బందు రఘునాథుండు సుగ్రీవునకుఁ గపిరాజ్యపట్టాభిషేకం బొనర్చి కపిరాజవంశకరీరుండగు నంగదునకు యౌవరాజ్యపట్టం బిచ్చి తాననుజునితో మాల్యవద్గిరి నివసించె నంత.

మ॥ ఒకనాఁ డా శివతోఁ గిశోరశశిరే♦ఖోద్యత్కిరీటుండు సే
వకవర్యుల్ ప్రమథామరోత్తములు దీ♦వ్యద్భక్తిఁ సేవింప బు
ష్పక మౌత్సుక్యముతోడ నెక్కి జగతీ♦భాగంబులన్ గాంచుచున్
వికలాత్ముండయియున్న రాము నచటన్ ♦ వీక్షించి తా నిట్లనెన్. 130

ఉ॥ ఈ రఘురాముఁ డర్యమకు♦లేందుఁ డలంఘితదివ్యవిక్రమో
దారుఁడు ధీరుఁ డార్తజన♦తాపవిభంజనుఁ డాత్మవేది వి
స్తారవివేకకోశనిధి ♦ దానవరాట్టగు పఙ్క్తికంఠుచే
దారను గోలుపోయి యిటుఁ ♦ దల్లడమొందెడుఁ జూఁడు సుందరీ! 131

గీ॥ అనుచు హసితం బొనర్చి యి♦ట్లాదిదేవి, యనియె వేదసమేడ! యి♦ట్లాలికొఱకు
తప్పుఁడగుటేడ! దేవర! ♦ తత్జ్ఞులైన, వారలీతీరుగాంతురే ♦ వగలదగల. 132

వ. అనుచు భగవానుండు మరల నిట్లనియె.

గీ॥ ఎట్టివేత్తలకేనియు ♦ నింపుదనరు, పత్నియెడలను మఱియు న♦పత్య మెడలఁ
దగుల మణఁగకయుండు నెం♦తయును నైనఁ, బామరులకును వీరికి ♦ వారయుండు.

వ. అందునను శ్రీరామచంద్రుం డనన్యసామాన్యవిజ్ఞానధనుం డంతర్ముఖుండనుటయు నఖిలాండేశ్వరి యిట్లనియె. 134

గీ॥ వార యెట్టిదిదేవ! నీ♦వ కనుఁగొనుము, సాంప్రతంబందె యీరాజ♦చంద్రు చంద
మేన్ బరీక్షింతుననియాళి♦నిగురుబోణి, జయయనెడుదానిఁబిలిచితద్♦క్షణమునందు.

వ. సీతాదేవ్యాకృతినొసంగి శ్రీరామునిజూపి తదంతికభూమిన్ బుష్పాపచయం బొనర్పుచుండుమని పంచిననామెయు నట్లొనర్చుచుండుడు రఘునాథుండు పరికించి. 136

గీ॥ అఖిలలోక విధానుఁడా♦యభవమూర్తి, సకలజగదేకమాతృక♦శాంకరియును
వేచియున్నారు నీకయి♦వేగ నటకుఁ, బయనమొనరింపు మ్రొక్కెద♦జయ! మదంబ!

వ. అని నమస్కరించినంత నాయుమ మహాదేవిఁజేరి యవ్విధంబుఁ దెలిపిన నంబిక యాశ్చర్యంబొంది శ్రీరాముని యౌన్నత్యంబునకు మెచ్చి ప్రశంసించె నంత మహేశ్వరుం డచిరకాలంబుననే శ్రీరాముఁడు రావణుఁ బరిమార్చి సీతఁ దోడ్కొని వచ్చునని యార్యతో నొడివి యటనుండి తిరుగఁ బరివారంబులతోఁ బుష్పకం బెక్కి కదలి కైలాసగిరిఁ జేరె. 138

గీ॥ కపికులేశ్వరుఁడంత నే♦కాంతభూమిఁ, జేరి తారాప్రముఖభామి♦నీరతములఁ
దవిలి మధుపానమదమునఁ♦బవలు రేయి, భేదమరయక యెంతయుఁ♦బ్రీతినుండె.

గీ॥ నాల్గునెలలట్లుగడిపి యం♦తకును వాన, రప్రవరు యోజఁగాంచక♦రామనృపతి
లక్ష్మణునిబన్పుడు నతండు♦ప్లవగవరుని, జూచియతిశయకోపవి♦స్ఫూర్జితుఁడయి.

ఉ॥ ఏమిది మర్కటేంద్ర! కృత♦మెంచక రాముని విస్మరించి యు
ద్దామమదంబునన్ జెలఁగి♦చారలతో విహరించుచుంటి వి
స్థా మహనీయసాయమును♦నారయ వేని నిజాగ్రజన్మునిన్
రామశరంబు చేర్చును స♦రాసరి వేసరి యోజసేయుమా! 141

వ. అనుడు విని తార కాతరయై సుగ్రీవానుమతితో ముందుగ సౌమిత్రిఁ దారసించి
మ్రొక్కి యిట్లనియె. 142

ఉ॥ దేవర! వానరుండితఁడు♦దీనతఁజేకొని యన్నభీతిఁ బె
ల్లాసగ నిల్లునాలును స♦మస్తముఁబాసి యొకండు ఋష్యమూ
కావనినుండె నిష్ఠ భవ♦దగ్రజు సాహ్యముతోడ సర్వమున్
గ్గై వసమూడు భోగములఁ♦గామనుఁడై కొనుచుండెఁ గస్త్రమై. 143

ఉ॥ వినవితండు సత్యపథ♦మందె చరించెడు వాఁడుగాని యె
ద్దేనియుఁ గాపథంబుఁజొర♦నెంచఁడు మేటి కృతజ్ఞమూర్తి నీ
యానయొనర్చు విన్నఁక ర♦యంబునఁ బ్రత్యుపకారమెంతయున్
మానుము సందియంబు నస♦మానపరాక్రమశౌర్యభూషణా! 144

వ. అనుచుండ సుగ్రీవుండు ప్రహ్వీభూతుండై తటిసి మ్రొక్కి రామానుజున కిట్లనియె.

మ॥ అకటా యేటికి రాజవై యిటుల న♦న్యాయంపు హేయంపు వ
ర్తను లోనైతివి ధీరు లెన్నుదురె? దు♦స్తంత్రంబు నాతోడఁ జి
వ్వకు రాఁ జాలకపోతి వాయతతరు♦ప్రచ్ఛన్నగాత్రుండవై
యకలంకున్ నను జంపినాఁడవు మహా♦హత్యాప్రకారంబునన్. 127

వ. అనుటయు విని రామభద్రుం డిట్లనియె.

ఉ॥ కాదిది హత్య వాలి! విను ♦ కాననజంతువ వేటఁ బొంచి వ్యా
పాదము సేయుటే తగవు ♦ బల్మి మఱందలి పొందుచేసి నీ
గాదిలితమ్ము సుగ్రిగిరి♦కానన భూమికిఁ దోఁచినాఁడ వి
ట్లా దురితంబు సైపనగు♦నా! తగునా యది రాచవారికిన్. 128

వ. అని నుడివి యంగదుని యువరాజున్ జేయుదునని కందుఁబాపి యభయ మిచ్చు
టయు వాలి సంతసించి యసువులఁ బాసె నంతఁ దారాంగదాదులు తక్కుంగల
వానర ప్రముఖులు విచ్చేసి వారలును సుగ్రీవుండును తడవుప్రొద్దు విలపించి
రంత మహేంద్రతనయుని యౌర్ధ్వదైహికక్రియానంతరం బందు రఘునాథుండు
సుగ్రీవునకుఁ గపిరాజ్యపట్టాభిషేకం బొనర్చి కపిరాజవంశకరీరుండగు నంగదునకు
యౌవరాజ్యపట్టం బిచ్చి తాననుజునితో మాల్యవద్గిరి నివసించెనంత.

మ॥ ఒకనాఁడా శివతోఁ గిశోరశశిరే♦ఖోద్యత్కిరీటుండు సే
వకవర్యుల్ ప్రమథామరోత్తములు దీ♦వ్యద్భక్తి సేవింప బు
ష్పక మాత్మైక్యముతోడ నెక్కి జగతీ♦భాగంబులన్ గాంచుచున్
వికలాత్ముండయియున్న రాము నచటన్ ♦ వీక్షించి తా నిట్లనెన్. 130

ఉ॥ ఈ రఘురాముఁ డర్యమకు♦లేందుఁ డలంఘితదివ్యవిక్రమో
దారుఁడు ధీరుఁ డార్తజన♦తాపవిభంజనుఁ డాత్మవేది వి
స్తారవివేకకోశనిధి ♦ దానవరాట్టగు పఙ్క్తికంఠుచే
దారను గోలుపోయి యిటఁ ♦ దల్లడమొందెడుఁ జూఁడు సుందరీ! 131

గీ॥ అనుడు హసితంబొనర్చి యి♦ట్లాదిదేవి, యనియె వేదనమేడ! యి♦ట్లాలికొఱకు
తప్తుఁడగుటేడ! దేవర! ♦ తజ్జ్ఞుఁడైన, వారలీతీపఁ గాంతురే ♦ వగలదగల. 132

వ. అనుడు భగవానుండు మరల నిట్లనియె.

గీ॥ ఎట్టివేత్తలకేనియు ♦ నింపుదనరు, పత్నియెడలను మఱియు న♦పత్యమెడలఁ
దగుల మణఁగకయుండు నెం♦తయును నైనఁ, బామరులకును వీరికి ♦ వారయుండు.

వ. అందునను శ్రీరామచంద్రుం డనన్యసామాన్యవిజ్ఞానధనుం డంతర్ముఖుండనుటయు
నఖిలాండేశ్వరి యిట్లనియె. 134

గీ॥ తార యెట్టిదిగేవ! నీ ♦ వ కనుగొనుము, సాంప్రతంబందె యీరాజ ♦ చంద్రు చంద
మేన్ బరీక్షింతుననియాళి ♦ నిగురుబోణి, జయయ నేడు దానిఁబిలిచితద్ ♦ క్షణమునందు.

వ. సీతాదేవ్యాకృతినొసంగి శ్రీరాముని జూపి తదంతికభూమిన్ బుష్పాపచయం బొన
ర్చుచుండుమని పంచిననాపెయు నట్లొనర్చుచుండుట రఘునాథుండు పరికించి. 136

గీ॥ అఖిలలోక నిదానుఁడా ♦ యభవమూర్తి, సకలజగదేకమాతృక ♦ శాంకరియును
వేచియున్నారు నీకయి ♦ వేగ నటకుఁ, బయన మొనరింపు మ్రొక్కెద ♦ జయ! మదంబ!

వ. అని నమస్కరించినంత నాయమ మహాదేవిఁ జేరి యవ్విధంబుఁ దెలిపిన నంబిక
యాశ్చర్యంబొంది శ్రీరాముని యౌన్నత్యంబునకు మెచ్చి ప్రశంసించె నంత మహే
శ్వరుం డచిరకాలంబుననే శ్రీరాముఁడు రావణుఁ బరిమార్చి సీతఁ దోడ్కొని
వచ్చునని యార్యతో నొడివి యటనుండి తిరుగఁ బరివారంబులతోఁ బుష్పకం బెక్కి
కదలి కైలాసగిరిఁ జేరె. 138

గీ॥ కపికులేశ్వరుఁడంత నే ♦ కాంతభూమిఁ, జేరి తారాప్రముఖభామి ♦ నీరతములఁ
దవిలి మధుపానమదమునఁ ♦ బవలు రేయి, భేదమరయక యెంతయుఁ ♦ బ్రీతినుండె.

గీ॥ నాల్గునెలలట్లుగడిపి యం ♦ తకును వాన, రప్రవరు యోజఁగాంచక ♦ రామనృపతి
లక్ష్మణునిబన్పుడు నతండు ♦ ప్లవగవరుని, జూచియతిశయకోపవి ♦ స్ఫూర్జితుఁడయి.

ఉ॥ ఏమిది మర్కటేంద్ర! కృత ♦ మెంచక రాముని విస్మరించి యు
ద్దామమదంబునన్ జెలఁగి ♦ దారలతో విహరించుచుంటి వి
స్తామహనీయసాయమును ♦ నారయవేని నిజాగ్రజన్మునిన్
రామశరంబు చేర్చును స ♦ రాసరి వేసరి యోజసేయుమా! 141

వ. అనుడు విని తార కాతరయై సుగ్రీవానుమతితో ముందుగ సౌమిత్రిఁ దారసించి
మ్రొక్కి యిట్లనియె. 142

ఉ॥ దేవర! వానరుండితఁడు ♦ దీనతఁ జేకొని యన్నభీతిఁ బె
ల్లావగ నిల్లునాలును స ♦ మస్తముఁ బాసి యొకండు ఋష్యమూ
కావనినుండె నిష్ట భవ ♦ దగ్రజు సాహ్యముతోడ సర్వమున్
గైవసమాడు భోగములఁ ♦ గామనుఁడై కొనుచుండెఁ గస్తిమై. 143

ఉ॥ ఐననితండు సత్యపథ ♦ మందె చరించెడు వాఁడుగాని యె
న్నేనియుఁ గాపథంబుఁ జొర ♦ నెంచఁడు మేటి కృతజ్ఞమూర్తి నీ
యానననొనర్చు విస్మృతి ర ♦ యంబునఁ బ్రత్యుపకార మెంతయున్
మానుము సందియంబు నస ♦ మానపరాక్రమశౌర్యభూషణా! 144

వ. అనుచుండ సుగ్రీవుండు ప్రహ్వీభూతుండై తఱిసి మ్రొక్కి రామానుజున కిట్లనియె.

ఉ॥ భూమిసుతాగవేషణను ♦ బూని హరీంద్రులఁ బంచితిన్ దిశా
స్తోమము నెల్లఁ గాంచుటకుఁ ♦ దోడనె వచ్చెద రింక వారు సా
ధ్వీమణి సీత నారసి ర ♦ విప్రభ! యల్కఁ దొలంగు మేను శ్రీ
రాముని విస్మరింతునొకొ ♦ ప్రాణములర్థము లామహాత్ము వే. 146

గీ॥ అని రయమ్మునఁ గదలి రా♦మానుజన్ము, తోడ రామునిఁ జేరి మై♦దుదినములకుఁ
గపులు సీతామహాదేవిఁ ♦ గాంచివచ్చు, వారని యమర్చుచుండెను♦భూరిసేన.

వ. అంతకుమున్ను సుగ్రీవాజ్ఞచే సీతామార్గమాణులై యరిగిన ప్లవంగప్రవరులు వైదేహి నెందునుగానక సముద్రతీరంబుఁ జేరి పరితపించుచుండ సంపాతియను విహంగేశ్వరుండు జానకీదేవిని రావణాసురుండీమార్గంబునఁ గొనిపోయి లంకయందుఁ జెరనుంచెనని ప్రబోధించె. 148

క॥ ఆవిూఁదఁ బక్షికంఠుని, చే మూషితమైన యట్టి ♦ సీతను వెదుకం
గా మారుతతనయుడు తా, రామార్గము నెగసె దివిజ♦రాజి యలరఁగాన్. 149

—* హనుమంతుఁడు సముద్రముదాటి లంకకేగుట *—

ఉ॥ ఆకసమందునుండియె ప్ర ♦ యాణముసేయుచుఁ జండమారుతా
స్తోకగతిన్ దినార్ధమునఁ ♦ దోయధి దాటి నిశాటవీరల
శ్లోకమనీయకర్బురవి ♦ చిత్రనివాసవసుంధరాంకల
ఙ్కాకటకంబుఁ జేరె వడిఁ ♦ గాండనిధిన్ బడఁద్రోచి సింహికన్. 150

గీ॥ సాయమగునంతకు సువేల ♦ శైలమందుఁ, గడపఁదలఁచి యటన్ జేరి♦కాంచుచుండ
భాస్కరుండంత శ్రీరామ♦భద్రకార్య. మరసి యపరాశఁ జేరఁగ ♦ నరుగుచుండె.

గీ॥ కాలపురుషుం డపూర్వాది ♦ క్రాంతి కెలమి, నతులభాస్కరశోణర♦త్నాంగుళీయ
కమును బంపినయట్టి పై♦ఖరినినంత, ఖరఖరుఁడుచేరె నపరాద్రి ♦ గహ్వరమును.

క॥ ఆకాంతయు నొకరత్నము, శ్రీకమనీయమును బతికిఁ ♦ జేర్పఁ బనిచినఁ
ట్లాకసమునందుఁ జంద్రుఁ డ, నాకులుఁ పై చేరి వెలిగె ♦ నమితద్యుతితోన్. 153

గీ॥ అంత హనుమంతుఁ డెంతయు ♦ హరుస మొంది
కలయఁగని యల్పమూర్తియై ♦ గవను నెగసి
దాఁటి చనుచుండ లక్ష్మిణి ♦ దటిసి యెదుర
దాని మదమార్చి యటుపైని ♦ దఱలె మరల. 154

---

టిప్పణి : ఆశాకుఖుఁడై - అశ్వారూఢుఁడై కందుతేనివాఁడై -

ఉ॥ సందుల గొందులన్ మఱియుఁ ♦ స్ఫాటికహాటక సౌధవీథులం
దైందవరత్ననిర్మిత గృ ♦ హాంతరభూములఁ బానశాలలన్
సుందరకేళికాభవన ♦ శోభితనిష్కుటకోటులందు న
స్పందమనీషఁ గాంచియును ♦ నందుఱ నెందును సీతఁగానమిన్. 155

వ. మఱియుఁ బ్రదేశాంతరంబుల కేగి యందు.

క॥ చదుకములందలి మేడలఁ, గుదురగు గోపురవిహార♦కుట్టిమముల సొం
పొదవెడు నర్తనశాలల, గదుల వెదకి వెదకి కనక ♦ కాతరుఁ డగుచున్. 156

చ॥ పదఁపడి రాక్షసాగ్రణుల ♦ వాసగృహంబుల నెల్లఁ జూచి దు
ర్మదుఁడగు రావణాసురుని ♦ మందిర మంతయుఁ గాంచి కేళికా
సదనమునందుఁ దళ్కునక♦శయ్యను రావణుసందిటన్ రహిన్
నిదురను జెందుచున్న నవ♦నీరజనేత్రిను గాంచి భీతుఁడై. 157

వ. తనలో

ఉ॥ మేలిపసిండిపూలమరి ♦ మీఱినపల్వయుఁ గుప్పసంబునున్
జాల సువాసనల్ విసరు ♦ చన్గవున్నరజఃపరంపరల్
గ్రోలిన మద్యపుంజవులఁ ♦ గుప్పెడు కప్రపువీటికమ్మనల్
కేళివిహారగోష్ఠి నెఱేఁ♦గింపుచు నున్నది యొక్కతీరుగన్. 158

ఉ॥ ఈ రమణీవతంసము ది♦నేంద్రకులోద్వహుసాధ్వి యౌనె? కా
నేరదు దీనిచంద మిది ♦ నే గ్రహియింపనె? రామదేవి యి
ట్లాఱడిదుష్టదైత్యుని వి♦హారము లొందునె? యిద్ది వీని దే
వేరి యథార్థ మల్ల పృథి♦వీసుత నెచ్చట దాచియుంచెనో. 159

చ॥ అనుకొని యా గృహంబు విడి ♦ యంతనె పట్టణవప్రి మెక్కి ద
వ్వున ఘనసాలనీలరుచి♦పుంజసురంజితదివ్యమార్గమౌ
వనపద ముండు టారసి జ♦వమ్మున నచ్చటఁ జేరుచుండఁగాఁ
దనకుడినేత్రమున్ భుజము ♦ తద్దయు స్పందన మొందఁ బ్రీతుడై. 160

—* హనుమంతుఁడు సీతాదేవిన్ జూచుట *—

గీ॥ వేగఁ దఱిసి యశోకద్రు♦వితతి వాటి, నెల్ల గాలించి చూచి యొ♦క్కెడను శింశు
పాతరుచ్ఛాయయెడ బహు♦యాతుధాన, వనితలలయించు భామినం♦దనుగనియె.

చ॥ ఇనకులనాయకుండు దన ♦ కెంతయుఁ జెప్పిన దివ్యరూపపా
వనకమనీయలక్షణవి♦భాస్వరరేఖల నొప్పుదాని నా
ధుని విరహార్తిదుఃఖమునఁ ♦ దూలుచు మజ్జనభోజనాదులన్
గొనక కృశించి సంతతముఁ ♦ గుందుచు నున్న విదేహనందనన్. 162

ఉ॥ పాయక రామ రామ యని ♦ పల్కు సతమ్మును బల్కుదాని నీ
లాయతకేశపాశమున ♦ నాఱడిపంకము వొల్చుదానినిన్
గాయము కట్టుపుట్టములు ♦ గాసిలి మాసినదాని సుప్రభన్
శ్రీయనఁజాలుదానిని ♦ హరిప్రియసుం డటఁగాంచెఁ బ్రేమ్మనై. 163

చ॥ కని ముద మొంది తర్కమునఁ ♦ గాదని యౌనని కొంతసేపు వా
దన మొనరించి యంత వసు♦ధాసుత యే యని నిశ్చయించి రా
మునకును నాపెఁ జూపఁ మది న♦మ్మోయని తత్తరపుప్పితాగ్రిమం
దొనరఁగ నుండి వేళఁ గను♦చుండెను భూమిజదర్శనార్థియై. 164

క॥ ఇనుఁ డేగుదెంచుముందఱ, ఘనతరశోకాబ్జబాహు♦కాండంబుల న
ధ్వను గై సేయఁగఁ దీర్చిన, యనువుగఁ దూర్పున నరుణమ♦హాద్యుతి యొదవెన్.

గీ॥ ప్రబలదోషాకరుం డాత్మ♦భాగ్య మెల్లఁ, బాసి సంద్రంబునన్ బడఁ♦బఱుగు పెట్టె
కలువ లార్తితోఁ దలవంచు♦కొల మమరె, నళిని వల్లభగోష్ఠి నా♦నంద మొందె.

మ॥ ఘనమం దేహదనూజరాజిని జగ♦త్కల్యాణలిప్తాముదం
బున నాత్మీయకరంబులన్ జదివి త♦ద్భూరిస్రవద్రక్తసా
రనితాంతార్తశరీరుఁ డైనకతనన్ ♦ రక్తాకృతిన్ బ్రాగ్గిరిన్
దనరెన్ దివ్యులు గొల్వఁగాఁద్రిజగతీ♦బాంధవ్యుఁ డవ్వారిగాన్. 167

గీ॥ అట్లు భానుఁడు చేర ద♦ శాస్యుఁ డచటి, కేగుదెంచి రఘూద్వహు ♦ నింతిఁ డాసి
సంకుచితగాత్రియై యున్న♦చంద మరసి, యిట్టులనెఁ బాపభీతి యొ♦క్కింత మాని.

ఉ॥ ఏటికి నన్ను జూచి యిటు ♦ లెంతయు నీదు మెఱుంగుచున్నవన్
మాటొనరింతు వాత్మమున ♦ మానుము వంత మొకింత వంతయున్
హాటకకేతకీదళని♦భాంగి ! జగన్నుతదివ్యమూర్తి ! యా
రాటముఁ బాసి నాదగుని♦రమ్మునఁ జేరుము బిగ్గకౌఁగిటన్. 169

ఉ॥ మాసినచీరతోడఁ గడు ♦ మాసిన వేణిభరంబుతోడ బల్
గాసిలి రేల్ పవల్ నిదుర ♦ గ్రాసముఁ బాసి యిటుల్ గృశింపఁగా
వాసియొకో ! కనద్వికచ♦వారిజలోచన ! తేరిచూడుమా !
రోసముమానుమా ! పదస ♦ రోజములొత్తెద నాజ్ఞ సేయుమా.

చ॥ చతురుఁడఁ గామశాస్త్రమునఁ ♦ జాలినవాఁడ సమస్తలోకసం
స్తుతుఁడ మహేంద్రుఁడాదిగల ♦ శూరుల నెల్ల జయించి తద్ధన
ప్రతతులఁ గొల్లగొన్న బల ♦ వంతుఁడఁ గాంతుఁడ దివ్యభామినీ
స్మితతరదృక్సమార్చితుఁడఁ ♦ బ్రేముడి నీమదిఁ గల్గ దేలొకో. 171

చ॥ సురుచిరదివ్యవస్త్రములు ♦ శోభనకాంచన రత్న భూషలున్
సురభిళచందనం బగరు ♦ శుద్ధసుగంధసుమస్రజంబులున్
బరిమళమాధురీభరిత♦పానము లుత్తమహేమతల్పముల్
స్ఫురదురుహర్మ్యరాజములు ♦ సుందరి ! యొందిరిరంసఁజేయుమా !

ఉ॥ నీదగు లేశజవ్వనము ♦ నీ మురిపెంపుకజాని మేనిసో
కే దివినున్న యచ్చరల ♦ నిమ్మహి నెమ్మనుజేశకాంతలం
దేది ? పసిండిబొమ్మ ! గమ ♦ నింపుము హొంపిరిబోవనీకు నీ
లేఁ దరుణంపుప్రాయము బ♦లేయనిపింపఁగఁ జాలు నందముల్. 173

గీ॥ నాగనాసోరు ! తెచ్చితి ♦ నాకలోక, సుందరస్త్రీలఁ బాతాళ ♦ మందిరాభి
రామల భుజంగమాపత్య♦రమణిమణులఁ. జేసెదను నిను రాణినా♦చెలులకెల్ల. 174

ఉ॥ రాముని౯ జేరనెంచెదవు ♦ రాఁగలఁడే యతఁ డెప్పుడేని యీ
భూమికి భూమిపుత్త్రి ! యిటు౯ ♦ బొంకముదప్పి తలంచె దేటి కీ
భీమమహార్ణవం బిదియె ♦ పెట్టనికోట మదీయలంక కు
ద్దామరణారిమండలవి ♦ దారణశౌండులు నాదుసైనికుల్. 175

గీ॥ చీరవసనుఁడు వనవాసి ♦ చెలువ ! రాముఁ, డేనొ కాంచనపరిధాన♦హృద్యరత్న
భూషణుండను భూర్భువ♦ర్ముఖ్యసకల, లోకనాథుఁడఁ గనుగొమ్ము ♦ లోలనయన !

ఉ॥ సాగరతీరసన్నిహిత♦చారువనద్రుమషండమండలిన్
బాగగుమాగధీలతల ♦ వందిరుల౯ మధురాన్నపానది
వ్యాగరుచందనోరుమణి ♦ హారవిభూషణరాజి నొంది నా
తోఁ గుతుకంబుమీఱఁగ ర ♦ తుల్ బొనరింపుము రమ్ము ! కోమలీ !

గీ॥ సోఁకుమూకలదొర యిట్లు ♦ సుమశరార్తిఁ, బదరిన దురుక్తులను విని♦యదరిచెదరి
తృణము ముందిడి చూచుచు♦ దీమసంబు, మీఱ రాఘవదేవి యీ♦తీరుఁబల్కె.

ఉ॥ మరలుపు చేత మీఱెడల ♦ మంచిదికాదిది మువ్వనచ్చు నీ
గరితలయందుఁ దీర్చుకొను ♦ కామము నేను పతివ్రతన్ బ్రిభా
కరకులరామ నా నృపతి ♦ భామనిషైన విదేహపుత్రికన్
బరసతి నాత్మమం దెఱుఁగు ♦ పావనధర్మనిబంధనంబులన్. 179

ఉ॥ నీ సతులందుఁ బావనత ♦ నీ వెటుగోరెదొ యన్యకాంతలం
దాసరినే తలంపు హృద ♦ యంబున నన్యపథంబుఁ బాయుమా !
నీ సిరి నీ పురిన్ మఱియు ♦ నీదునపత్యము నీ కులంబునున్
దోసముతో దహింపకుము ♦ తోయపు నానుడి విన్ము రూషిగన్. 180

క॥ నీకును సమానలై తగు, నీకులసతులందు సతము ♦ నీవొందు మన
న్యాకాంక్ష సతినుభోగము, లీకరణిఁ దొలఁగఁబాయ ♦ నీనీసిరులన్. 181

శా॥ నీవొక్కండవు పాపకారివగుచున్ ♦ నీయందఱన్ జంపఁగా
నీ వాసంబగులంక రత్నమయి వ ♦ గ్నిన్ గాల్పఁగా నీవునున్
జావంగా మదిలోఁదలంపకు మిఁకా ♦ జాడన్ విడన్ బూనుమా!
శ్రీ వర్ధిల్లఁగ నన్నుఁజేర్పుము! జయ ♦ శ్రీరాము నారామునిన్. 182

చ॥ అతఁడు దయామయుండు శర ♦ ణాగతవత్సలుఁ డాశ్యుఁ డుత్తమో
చితహితధర్మసంగతుఁడు ♦ జీవిత మాత్మఁ దలంతువేని యి
ష్టితరము మాని నన్నిటకు ♦ నెట్టులఁదెచ్చితో యట్లె వేగ నా
పతికడఁజేర్చి యాఘనుని ♦ పావములొంది మతండు గాచు నిన్. 183

క॥ రాముఁడు వదాన్యజగదభి, రాముఁడు రక్షిప్రకరవి ♦ రాముఁడు మాశ్రీ
రాముడు సుజనహితాత్మా, రాముఁడు దెలియు మిపుడేని ♦ రావణ! మదిలోన్.

ఉ॥ నేనిఁక నీకు లోభపడి ♦ నీసిరి కుప్పిళులూరి లోఁగఁగా
ధ్యానముసేయ నెంచకు మ ♦ హాస్కరుతోడనె యుండు చాయ యె
ట్లేనియుఁ బాయదంచెఱుఁగు ♦ మిాళ్యుఁడు రాముని చెట్టఁబట్టి వే
ఱేని భుజంబు నేన మన ♦ కెట్టులఁబట్టెదనో తలంపవా! 186

సీ॥ గంధసింధుర రాజభో♦గములఁ దనియు, నాక రేణువు సూకరం ♦ బభిలషింపఁ
గలియునే యెపుడేని నీ ♦ కరణి నాకు, నీకుఁగల యంతరంబు గ ♦ ణింపు మదిని.

ఆ॥ చేతఁజిక్కినట్టి ♦ చెలువయంచనుకోకు, మదిఁగరంగునవెడు ♦ మాటఁబోకు
దిక్కుమొక్కులేని ♦ దీనగాదీసీత, కలఁడు రాఘవుండు ♦ కొంటెఁ దెఱుఁగు!

వ. అంత వసుమతీతనయ వినువుతో సైరింపరాని యాగ్రహాభరంబుతో మఱియు
నిట్లనియె. రాక్షసరాజా! వినుము వినుము. 188

ఉ॥ చెప్పితి ధర్మసూక్తులను ♦ జేడ్పడఁబోకుము పాపలాత్మమై
దెప్పరమైనసంకట మి ♦ దే చనుదెంచెను గాచికొమ్ము నీ
వప్పులతేనికొల్పు నిఁక ♦ నా ధననాథునిగట్టు నొందినన్
దప్పక తెచ్చిత్రుంచు దిన♦నాథకులోద్వహదివ్యబాణముల్. 189

గీ॥ నీదు శౌర్యంబు చెట్టెక్కు ♦ నీవు మిత్తి, నోటఁ జిక్కఁగలాఁడ వే♦నును విపత్తిఁ
గడచిగట్టెక్కఁగలనిఁకఁ♦గలనికాఁప్ర, చండుఁడిదెవచ్చునడి రాఘ♦వుండుఘనుఁడు.

గీ॥ అనియిటులఁ దన్నులెక్కింప♦కతులపరుష, వచనములనాడిన రఘుప్ర♦వరుని సతిని
గాంచికోపించి తలఁద్రుంప♦ఖడ్గమెత్తు, ధాన్యమాలిని యనురాణి ♦ తఱిసి విభుని.

క॥ ప్రియులు పలువురు గలుగ న, ప్రియవాదిని యీపెకోరకు ♦ పెనుకువ యేలా!
ప్రియవచనం బొరసి య, ప్రియమున్ బొనరింపఁబోకు ♦ మబల సఘంబొ. 192

మ॥ కమనీయాకృతు లెందఱో దనుజరా ♦ ట్కన్యామణుల్ నీకుఁజే
తము లర్పించి యభీష్టభోగములఁ నొం ♦ దన్ రారొ మందోదరీ
కమలపత్రేక్షణ యేను మున్నగుభవ ♦ త్కాంతాతతుల్ లేరొ ప
ఙ్క్తిముఖేంద్రా! ధరణీజ శాస్తి విడుమా! ♦ క్షేమించి మేలెంచుమా! 193

వ. అని తనయేలికసాని యడ్డగించుటయు నుడిగి నైశ్రవణుండు జనకరాజనందనన్
గాంచి. 194

గీ॥ అలుకఁ బాయుము రాఘవు ♦ నందలిమదిఁ, ద్రిప్పు మపనోదన మొనర్పు ♦ దీర్ఘతరవి
యోగదుఃఖంబునిఁక మాస ♦ యుగ్మకాల, మిచ్చితినిగడు వాపైని ♦ వచ్చువాఁడ.

క॥ అప్పటికేనియు నను నీ, వొప్పి విభునిగాఁగ సెజ్జ ♦ నొందిన మేల్ కా
కిప్పటివలె నిటువాగిన, తప్పక భక్షింత్రు నిన్ను ♦ దరుణీ! యసురల్. 196

వ. ఇట్లు పలికి యందుఁ గావలియుండి జానకీదేవిన్ గాఁచుచున్న దానవీ జనంబులఁ
గాంచి. 197

గీ॥ అందములబంతి మురిపంబు ♦ లమరుదాంతి, యనుచు నే గంపెడాసతో ♦ నర్థిఁ దెచ్చి
యుంచితినియిందు నేటీరు ♦ నొప్పఁబల్కి, యేనిఁగై వసమొందింపుఁ ♦ డిందుముఖిని.

వ. అని యనుశాసించి దనుజనాథుం డెట్టకేలకు సపరివారుండై నగరికిఁబోయె. 199

క॥ వాని గమనంబుపయి న, వ్వాని నిదేశమున దాన ♦ వస్త్రీ లురవౌ
పూనిక నిర్బంధోక్తుల, జానకి నదలించుచున్న ♦ సమయము నందున్. 200

వ. ఆ పలలాశనస్త్రైణమండలిలో నొకర్తుకయై కాచుచునున్న యట్టి.

గీ॥ త్రిజటయనునది డగ్గఱి ♦ దేవవైరి, నారులనుజూచి యుడుగుఁడు ♦ నాదు స్వప్న
మందు శ్రీరాముఁడిటఁ జేరి ♦ యసురకులము, మలిపికొనిచనె భూమిజ ♦ న్మనురయమున.

వ. నాదుకల కల్లగాదు నిక్కమయగు.

ఉ॥ కావున మీర లాగడ మిఁ ♦ కన్ విడి యీమెయెడన్ బ్రపన్నలై
సేవలఁ జేయఁజెల్లు నిది ♦ సిద్ధము రాముఁడు రాఁగలం డిటన్
గావలులైన రక్కసులు ♦ గాంచెద రంతము మీర లిసిఁకన్
భావములందుఁ బాయుఁడు శు ♦ భంబగుమార్గ ముదాహరించితిన్. 202

క॥ అనుటయుఁ దుటూరులించుక, మనముల నలుకొంది నిదుర ♦ మైకమున నెడం
జని తూగుడును బిరుందనె, హనుమానుఁడు కుజము డిగ్గి ♦ హరుసముతోడన్.

గీ॥ సీతకు నమస్కరించి తా♦శిరము వంచి, యంజలియొనర్చి నిలిచి యి♦ట్లనియెఁదల్లి!
దినకరకులాబ్ధచంద్రుఁడౌ శ్రీరామ♦చంద్రుని పురంధ్రి!, స్వస్తినీకు విదేహరా♦జన్యపుత్త్రి! 204

క॥ అనుటయు వైదేహియు నా, ననపద్మం బెత్తి చూచి ♦ నక్తంచరుఁ డీ
యనువునఁ డిరుంగవచ్చెనొ, యనుననుమానమును నాత్మ♦మందుఁగొనుటయున్,

వ. అంజనీతనయుఁ డారసి తల్లీ! సందేహింపకుము రామపాదములానయని రామ
లక్ష్మణుల కుశలోదంతంబును వాలినిగ్రహసుగ్రీవస్నేహంబులును దన్ను వెదక
టకై నలుదిక్కుల వానరులఁ బంచుటయును భాగ్యవశంబునఁ దన్నుదానిపుడు
చూచుటయును మున్నగునవి చెప్పి విశ్వాసం బొదవఁగ మఱియు నాయమ
కిట్లనియె. 206

చ॥ రవికులనాథుఁ డల్ల రఘు ♦ రాముడు నీలపయోదవర్ణుఁ డా
హవకుశలారిభంజన స ♦ మర్థదృఢాయతబాహుయుగ్మకుం
డవిరళతేజుఁ డప్రతిముఁ ♦ డమ్మరొ! లక్ష్మణుఁ డచ్ఛహేమమూ
ర్తి వనజనేత్రి! యగ్రజున♦రిందగు నించుక కేమి వారకున్. 207

సీ॥ నీ వియోగంబొంది ♦ నీభర్త విరహాగ్ని, కీలలఁగ్రాగి శు♦ష్కించె నమ్మ!
సౌమిత్రియును రాము♦చందంబుఁ గాంచుచుఁ, గడుదుఃఖితుండయి ♦ యడలెనమ్మ!
వార లిర్వురు హరి♦ప్రభుని సేనలతోడఁ, ద్వరితంబె యిచటికి ♦ వత్తురమ్మ!
రఘుపతి రాక్షస♦రాజును వధియించి, నిన్నుఁ దోడ్కొనిపోవు ♦ నిక్క మమ్మ!

గీ॥ కొలఁదికాలంబు నోపికఁ ♦ గొని మనోర, థముల నెల్లను సానుబం♦ధముగ నొందు
మమ్మ! నా నుడులను మది♦నమ్ము మమ్మ, జనకరాజన్యతనయ! వి♦స్తారసునయ!

వ. అని మఱియు నభిజ్ఞానార్థంబు శ్రీరామదత్తాంగుళీయకంబు సమర్పించి సందియం
బుందీఱిచి యాయమసందేశంబునకై వేచియున్న నమ్మహాసాధ్వి యుంగరంబుఁ
జేకొని కన్నులఁగప్పికొని శిరంబునందిడుకొని హామాశ్రీస్పందనంబుఁ బరికించి
వానరవీరుని యాథార్థ్యం బరసి మురిసి బాష్పంబుల నుత్తరీయంబుఁ దడుపుచు
నిట్లనియె హరివర్యా! 209

చ॥ ఒకనెలదాక ప్రాణముల ♦ నోపిక నెట్లొ భరింతు దీనర
క్షకు దయమానమానసుఁ బ్ర♦చండభుజాహతదుష్టదానవున్
బ్రకటితశౌర్యధుర్యు రఘు♦వర్యు నిజానుజుతోడఁ దెచ్చి వం
చకుఁడగు రావణాసురునిఁ ♦ జంపఁగఁ జేసి హరింపు నావ్యథన్. 210

క॥ ఆపై విలంబ మోర్వఁగ, నోపఁజుమీ నిజము నిధన♦మొందెద రామ
క్ష్మాపతియనుగ్రహము నీ, యాపత్కృతిన్ నమ్మియుంటి♦నంత కనువులన్. 211

వ. అనినఁ బవమానసూనుం డిట్లనియె.

క॥ అన్నాఁ డిదె వచ్చెదనని, యన్నాఁడు వధింతు రావణా♦సురు నని తా
నన్నాఁ డడలకుమని కా, దన్నాఁ డిఁకఁ దడవు నాథుఁ ♦ డారయు తల్లీ! 212

గీ॥ అని శిరోరత్న మానవాల్ ♦ హనుమనికిడి
భ్రాత! భవదధ్వగతి శివ ♦ తాతియగుతఁ
బోయి రమ్మని సెలవిచ్చె ♦ భూమితనయ
హరివరుఁడు మ్రొక్కి హరుసించి ♦ యంత వెడలి. 213

వ. తనయాగమనం బసురనాథునకుఁ దెలిపి యవ్వానితోఁ గొండొక భాషింపఁదలఁచి యశోకవనభూజంబుల నెల్ల నిర్మూలించుటయు వనపాలకు లెదురింప వారల బిలుకుమార్చుటయును రావణుం డెఱింగి యెనుబదివేల సైనికులతోఁ దన తనయుఁ డగు నక్షునిఁ బంపినంత మహాబలనందనుం డాక్షణంబున బృహత్పాషాణంబుల మహావృక్షంబులఁ బ్రయోగించి వారల నంత మొందించె నంత. 214

గీ॥ నైఋతాధీశ్వరుండు దం♦తములఁ బటప, టధ్వని నొనర్చి వేగ జ్యే♦ష్టసుతు నింద్ర
జిత్తు ననుపుడు నతఁడు దో♦శ్శ్రీలుఁడు హరి, వరుని బ్రహ్మాస్త్రమున నాత్మ♦వశునిఁ జేసె.

క॥ హరివరుఁ డరవిందోదరు, వరమునఁ దాఁ బట్టుపడని♦వాఁ డైనను నా
శరనాథుఁ డైన దశకం, ధరుతో భాషింపఁ గడఁగి ♦ తగులము నొందెన్. 216

గీ॥ శక్రజిత్తంత రావణ♦సన్నిధాన, మునకుఁ గపిఁ జేర్ప నా వలీ♦ముఖుఁడు పఙ్క్తి
కంఠసింహాసనంబున♦కన్న నున్న, తముగ వాలముచుట్టి య♦ద్దాని నెక్కె. 217

వ. అసురనాథుం డవ్వానిఁ జూచి యక్కజపడి యిట్లనియె

క॥ ఎవ్వఁడవు నీవు కపి! యిం, దెవ్వగఁ జేరితివి! వాస ♦ మెచ్చో టిఁక నా
పువ్వులవనిఁ గూలిచి సుతు, నవ్వనపాలురను జదిపి ♦ తలు కేటి కిటుల్. 218

వ. అనుటయు విని యనిలనందనుం డాసోకుల యెకిమీనిన్ బరికించి యిట్లనియె. 219

మ॥ రఘువీరున్ రణధీరు దవ్వులకుఁ జే♦రన్ బంచి తత్సోదరున్
లఘుతంత్రంబునఁ బాపి భూమితనయన్ ♦ లావణ్యధుర్యన్ మహీ
మఘవత్సాధ్వి ననన్యరక్షిత నధ ♦ మా! తెచ్చి తిచ్చోటి కా
యఘమున్ బాప నచింప వచ్చితిని రా ♦ మాజ్ఞన్ హరీద్వంశ్యుఁడన్. 220

క॥ కాంచితి నశోకవని నివ, సించిన భూజాత నంతఁ ♦ జెలఁగి తరులఁ గూ
లించితి నీబలముల మ, ర్దించితిఁ ద్రుంచితిని నక్షు ♦ దితిజప్రముఖా! 221

వ. ఇఁకను బ్రస్తుతం బందు నీకుఁ బ్రబోధింప వచ్చిన నాదు హితోక్తుల నాకర్ణింపుము. 222

చ॥ ఎఱిఁగిరొ యెఱ్ఱకుండిరొ మ ♦ హేశ్వరపత్నిని దొంగలించి నీ
పురమునఁ జేర్చుకుంటి వీఁకఁ ♦ బోవిడి దుష్టపథంబు మైథిలిన్
దిరుగ నృపాలుఁ జేర్చి విను ♦ తిన్ బొనరించి క్షమింపఁగోరుమీ
చిర మనువుల్ ధరింతు వీఁకఁ ♦ జేటగు వేఱొక బాటఁ బోయినన్. 223

ఉ॥ పిల్లలు జెల్లలున్ మిగులఁ ♦ బెంపువహించి రహింపఁ బెండ్లముల్
కొల్లగఁ దెచ్చి చేకొనిన ♦ కొత్తహారంగు మెఱుంగు గుబ్బెతల్
పెల్లుగ హావభావములఁ ♦ బేర్మిఁ దలిర్పఁగఁ జేయు హాయి రం
జిల్లఁ జిరంబు సౌఖ్యములఁ ♦ జెందు మలందురఁ బోక నీ వీఁకన్.

వ. మఱియు లోకాతిక్రాంతవిక్రముఁడగు శ్రీరామచంద్రునిఁ జక్కఁగ
నీ వెఱుంగకున్న నే నొక్కింతఁ జెప్పెదను వినుము. 225

సీ॥ క్షాత్రవీర్యార్జను ♦ గడపిన భృగురాము, సవలీల గెలిచిన ♦ యాజసికుఁడు
ఆ సుబాహు విరాధు ♦ నల్ల మారీచుఁ గ, బంధుఁ జంపినయట్టి ♦ ప్రౌఢబలుఁడు
ఖరదూషణాదివి ♦ క్రాంతరక్షఃకోటి, నెల్ల హరించిన ♦ యీడ్యమూర్తి
నిను గ్రుమిఁబోలెఁ బ♦ట్టినవాలి నొకబాణ, మునఁ గూల్చినట్టి య♦ద్భుతభుజుండు
గీ॥ అట్టి వీరాధినాథుని ♦ యట్టి దిట్ట, నట్టి దినకరవంశదు ♦ గ్ధాబ్ధిచంద్రు
నిప్పటికినేని నాబోధ♦ నెఱిఁగి మెలఁగు, మురక యసురులఁ గోల్పోక ♦సురవరేంద్ర !

చ॥ అనుడు దశాస్యుఁ డాగ్రహప ♦ రాయణుఁడై కపినిన్ వధింపుఁ డం
చనుచరకోటి కాజ్ఞ నిడ ♦ నాతనిభ్రాత విభీషణుండు దూ
తను వధియించు టెం దనుచి ♦ తంబు తృణంబులఁజుట్టి వాల మం
దనలముఁ జేర్చి కాల్పుఁ డది ♦ యర్హతరం బగుదండనం బగున్
క॥ అని సెలవొసఁగిన నంతనె, దనుజులు తృణవస్త్రఖండ ♦ తతిఁ గపిపుచ్ఛం
బునఁ జుట్టి తైల మాజ్యం, బును బోసి దహించి విడిరి ♦ భూరితరోర్వ్యన్. 228
గీ॥ అంతనాజాడఁ దెలియఁగ ♦ నవనిజాత, చింతయొనరించి యగ్ని నొ♦క్కింతఁదలఁచి
వేడె హనుమకుఁజల్లనై ♦ వెలయుమవహ్ని!, నేఁ బతివ్రతనగుదునే♦నిన్ దయాళు !

## —* లంకాదహనము *—

వ. అని ధ్యానించినంత నగ్నిదేవుండు పావనిన్ గాల్పక చందనశీతలుండై యమరిన
ననిలనందనుం డానందించి నిజలాంగూలాంగారజ్వాలానిక్షేపంబున లఙ్కాపట్టణం
బెల్ల రగిల్చి దహియించి యశోకవనంబునకేగి జానకీదేవిన్ గాంచి మ్రొక్కి
సెలవొంది మున్నిటిపాఁటి జాంబవత్ప్రముఖులఁ గలిసికొని మ్రొక్కి ప్రత్యూహం
బుల కెడమీక తా నంబుధి తరణంబొనర్చిన యనంతరంబ లంకాపురిన్ బ్రవేశిం

చుటయు రావణాంతఃపురంబుతో నగరంబునంతయు శోధించి యశోకవని
కేగుటయు నందు భాగ్యవశంబున సీతాసందర్శనంబు సేయుటయుఁ జెప్పుచు.

సీ॥ రాకాసితలయుల న ♦ నేకాకృతులఁ దర్జ, మానమై కడు నల ♦ మరెడు సాధ్వి
ఘనమేఘమండలీ ♦ క్రాంతయౌ శశిరేఖ, వడువునఁ దేజ మే♦ర్పడని రమణి
దుస్తరంబైనట్టి ♦ దుఃఖసముద్రంబు, నొందియీఁపఁగలేక ♦ కుందు తన్వి
బలదర్పితుండైన ♦ పఙ్క్తికంఠుఁ దలంచి, మాటిమాటికి భయం♦పడెడు నబల

గీ॥ కడుమలినమైన వల్వయు ♦ నొడలు వేణి, యొప్పమానిని నిదురను ♦ దప్పి నాక
లిని నెఱుంగని ధీరను ♦ ననవరతము, రాముఁ జేక్ష దలఁచునట్టి ♦ రామసతిని.

గీ॥ కాంచి సాష్టాంగపడి నమ్ర♦కంబు దోప, రామదూతుఁడ నని యుంగ♦రంబొసంగి
ఆనవాలడ్గి పడసి తా ♦ ననురనాథు, నగరిఁ గాల్చి యిటకు వచ్చి♦నాఁడ ననియె.

వ. అందఱితోడ నానందంబున నంత వెడలి మాల్యవద్గిరిఁ జేరి సుగ్రీవాది సంసేవితు
లైన దాశరథులకు మ్రొక్కి శ్రీరామునితో నిట్లనియె.

ఉ॥ చూచితి సీత నాతతవి♦శుద్ధమహాస్కరభాసమానగో
త్రా! చిరతాపకోరువిర ♦ హార్తిసుదుస్సహదుఃఖితన్ హిమా
నీచయపీడ్యమానవళి ♦ నీగతి రాజిలు పుణ్యమూర్తి సం
కోచము మాను మిద్ది కను ♦ గొన్ము సతీధృతదివ్యరత్నమున్. 234

గీ॥ రామనీయక మంతయుఁ♦ గరగిపోయె, మిగులఁ గృశియించెఁ దనులత♦పగలు రేలు
మజ్జనాహారనిద్రల ♦ మానియున్న, దబల నీపయి నునిచి స♦ర్వాత్మ మధిప! 235

చ॥ తడవిఁక నోర్వఁజాలదు ని ♦ తాంతము దుఃఖపరీతచిత్తయై
యడలుచు నున్న దొక్కక్షణ ♦ మబ్దమువోలెఁ దలంచు మానమేన్
గడుపఁగలేదు యానము నిఁ ♦ కన్ వడిఁ జేసి పలాశనాథుఁ గ్రొ
వ్వడచి వధించి దేవిచెఱ ♦ కంతము సేయుము దేవ! మ్రొక్కెదన్.

క॥ ఒత్తిడి సేయుచు నుండిరి, మత్తులు రాత్రిందివంబు ♦ మనుజాదను లా
యుత్తమను వేగిరము దం, డెత్తు మిదే యుదను తడవిఁ ♦ కేల? మహాత్మా!

క॥ వచ్చునని వేగ నొడయఁడు, మెచ్చునని ముదంబు దనకు ♦ హెచ్చ్యుండిఁకఁ దాఁ
జచ్చునని రావణుఁడు నన్, మెచ్చుననియు నాథుఁ డంటి♦మేలుగను విభూ! 238

వ॥ అని చూడారత్నంబు సమర్పించి యచ్చటి వృత్తాంతవిశేషంబు లశేషంబుగ
యాథాతథ్యంబుగ నెఱింగించుటయు దాశరథి దుఃఖాశ్రులనించి రత్నంబుఁ
జేకొని కన్నులఁ గప్పికొని హనుమంతు నాలింగనంబొనర్చె. సౌమిత్రియు సుగ్రీ
వాంగదప్రముఖులు హర్షించి హనుమంతుఁ బ్రశంసించి రంత రామచంద్రుం
డచ్చటి దైత్యులతీరు లడుగుటయుఁ బావని యిట్లనియె. 239

గీ॥ చదువు శౌర్యంబు ధైర్యంబు♦సాహసంబు, బలము సిరియుర వల రక్ష♦సులకునిక్కను
దయయు దాక్షిణ్యమును సత్య♦తత్పరతయు, దేవ! నిప్పచ్చరం బిప్డు♦దెలియుమదిని.

వ. అనుటయు నంత.

ఉ॥ వానరభుకోటిబల ♦ వంతుల నేజి గ్రహించి మేటి యా
సేనను గూర్చి భానుజుఁడు ♦ శీఘ్రమె యంగదజాంబవన్మరు
త్సూను సుషేణనీలనళ ♦ ధూర్వహులన్ గొని రామచంద్రునిన్
సానుజుఁ గొల్చుచున్ సలిపె ♦ యానము యామ్యదిశాభిగాములై. 241

క॥ సాగరతీరముఁ జేరి మ, హాగలతాకుంజపుంజ ♦ లాచ్ఛాంబుసరి
త్పూగము మహేంద్రశైలం, బేగి యటన్ విడిసి రాహ♦వేచ్ఛాపరులై. 242

గీ॥ కాలరులచే నది యెఱింగి♦ కర్బురేంద్రుఁ, డసిక్రీ గడగుచు వలదు సీ♦తను రఘుపతి
కిమ్మని విభీషణుఁ డనుడు ♦ నీరసమున, నందలించిన నతిఁ డనె ♦ నగుడ నిట్లు.

సీ॥ పుంఖానుపుంఖంబు ♦ బొదలు రాఘవబాణ, జాలంబులకు నోర్వఁ♦జాల వన్న!
అతనికి నెనయగు ♦ నాలన్ముఖుఁతోడ, సమర మొందుటయు దు♦స్సాధ్య మన్న!
పారదారికభోగ ♦ పరతంత్రత యదెల్ల, నెఱుఁగు మధఃపాత ♦ హేతు వన్న!
రక్షోవిలాసినీ ♦ రాజితో రమమాణ, వృత్తిపై సుఖముల ♦ వెలయు మన్న!

గీ॥ నిన్నుఁ బుట్టినజన మెల్ల ♦ నీవునున్ సు, రక్షితముగాఁగ మనుట క♦ర్జంబు గాన
నరసి యిట్లు వచించితి♦నన్న! దాని, యాభిముఖ్యం బెఱుఁగుమన్న!♦యాత్మనందు.

గీ॥ శక్తిధరునకు సబ్రహ్మ♦చారియైన, భార్గవున కోటుఁగూర్చిన ♦ బల్లిదుండు
ఘనుఁడు శ్రీరాముఁ డవ్వానిఁ♦గడఁగిదురముఁ, సేయఁగా లేమురయుముస♦సీతనిమ్ము!

వ. అనుటయు నసురేంద్రుండు గినిసి హితం బరయక విభీషణుఁ జంపఁ గడంగుచు
నాతని కిట్లనియె. 246

సీ॥ పఙ్క్తికంధరుబాహు♦బల మెఱుంగక యిట్లు, పలుకుట యనుచిత ♦ పథముగా దె
బట్టుమార్గముఁ బట్టి ♦ పరిత్యక్తలను వదా, వదగతి నెన్న నే♦వంబు గాదె
ఇది నింద్య మదనింద్య ♦ మని వచించుట యెల్ల, భీరులయద్ధ్వంబు♦తీరు గాదె
దానవాంగనలు బృం♦దారకస్త్రీలు భూ, జాతపదముఁ బోలఁ ♦ జాలువారె

గీ॥ తెగి యిటుల నొవ్వఁబల్కి బల్♦నిగుడుచున్న, నిన్ను రక్షింప నెవ్వరు♦నేర్తురో య
రయుము! మిటకుఁ దెమ్ము కనెద వ♦రాతివర్గ, గామి! రావణహస్తము♦డ్గప్రహతిని.

వ. అని సెగలుపొగలునిగుడఁ గాలకూటంబుఁ గ్రక్కుచు నిట్లు తర్జించి భర్జించి
యుక్కెత్తుగాఁ గౌక్షేయకంబుఁ గాంచునంతలో విభీషణుండు భీతుండై తత్క్షణం
బున. 248

క॥ అనుచరచతుష్టయముతోఁ, దనయగ్రజుఁ బాసి కడలి ♦ దాటి రఘుపతిన్
గని శరణముఁ గోరుటయును, నినకులపతి యభయమొసఁగి ♦ యెంతయుఁ గరుణన్.

వ. పుణ్యజనేంద్రున కన్నిమేషంబున లఙ్కారాజ్యపట్టాభిషేకం బొనరించి పఙ్క్తికంధరబలస్వరూపంబు తెలియంగఁ గోరుడు విభీషణుండు రామున కిట్లనియె, 250

చ॥ అనిమిషదైత్యమర్త్యపవ ♦ నాశనవీరుల నొంచినట్టివాఁ
డనితరశౌర్యధుర్యవిభ ♦ వాతిశయంబునఁ బొల్చువాఁడు బ్ర
హ్మను నలరుద్రునిన్ గొలిచి ♦ యద్భుతదివ్యవరంబులన్ గడున్
గొనినఘనుండు రావణుఁ డ ♦ కుంఠితవిక్రముఁ డెందు భూవరా! 251

వ. మఱియు నాతనికంధరాప్రదేశంబునం దమృతఘటంబు గలదుగావున మస్తంబులు విచ్ఛేదించినను గూడ మగుడ నావిర్భవించు నొక్క బ్రహ్మాస్త్రంబున నయ్యావి యంతమొందు నిఁక నాతనికి యపాయసొప్పదనుండు. 252

చ॥ అతిబలుఁ డున్నతాయతభు ♦ జాంతసుఁ డుగ్రకరాళవక్త్రుఁడు
ద్ధతపరిపంథివీరసము ♦ దారరణాంతకుఁ డిద్ధమూర్తి య
ప్రతిముఁడు కుంభకర్ణుఁ డని ♦ వార్యపరాక్రముఁ డగ్రజాత్మసం
గతుఁ డిఁక వానితోఁ దురము ♦ కష్టతరంబు నరేశచంద్రమా! 253

వ. ఇఁక రావణజ్యేష్ఠపుత్త్రుండు,

మ॥ శతమన్యున్ ధృతసైన్యు సల్పిన మహా ♦ చండప్రతాపుండు శం
సితదర్పుండు నికుంభిలావ్రతుఁడు రా ♦ శీభూతతేజస్కుఁ డం
చితదివ్యాస్త్రనిధాన ముత్తమరణ ♦ శ్రేణీపురోగామి యా
ర్జితసత్త్వుం డలమేఘనాదుఁడు ధరి ♦ త్రీపాలచూడామణీ! 254

వ. ఉక్కివుండగు వీనితోఁ బోరు మిక్కిలి వెక్కసంబగు వెండియుఁ దక్కినరావణో యులును బవరంబునం దుక్కుతునియులు. 255

క॥ మఱియుఁ బ్రహస్తుండు మహో, దరుఁడు విరూపాక్షవజ్ర ♦ దంష్ట్రప్రముఖుల్
పరచక్రమర్దనులు త, ద్వరూథినీపతులు రామ ♦ భద్ర! యనేకుల్. 256

వ. ఐనను వినుము.

ఉ॥ రావణ కుంభకర్ణులిఁక ♦ రామ! భవచ్ఛరపాతు లౌదు రా
రావణి నింద్రజిత్వరుని ♦ శ్రాంత వధించును లక్ష్మణుండు సు
గ్రీవహనూమదంగదులు ♦ కీశవరేణ్యులు తక్కినట్టి దు
ర్భావులఁ దచ్చమూపతులఁ ♦ బట్టి వధింతురు చింత మానుమా!

వ. అనుటయు శ్రీరామలక్ష్మణులు వలీముఖఋక్షవీరులు సంతసించిరంత రామచం
ద్రుండు మహోర్మిమాలాశోభితంబై యగాధంబగు సాగరంబుఁబరికించి మహేశ్వర
సాహాయ్యంబులేక యకూపారంబుఁదరింప దుర్లభంబనియెంచి స్నాతుండై. 258

గీ॥ కంధితటిఁ బార్థివేశలింగ ప్రతిష్ఠ, *సల్పి యర్చించి శంభుప్రసాద మొంది
కడలి నొప్పించి సేతువుగట్టి దాఁటెఁ, గపిబలంబులతోడ రాఘవుఁడు గడిమి.

గీ॥ వృక్షచరబలములతో సువేలకూట, మందుఁ జేరి రఘూద్వహుండు సైన్య
మొక్క మొగ్గరముగఁ బన్ని యోధనాథు, లను విభాగించె రక్షణంబనువుమీఱ.

చ॥ హరివరు లంత విక్రమపరాయణులై రజనీచరాధిరా
ట్పురమును ముట్టడించి ఘనభూధరగండశిలాభివర్షణో
ద్ధురతరకేళి రక్కసులఁ ద్రుళ్ళడగించి వధించుచుండ సం
గరమొనరింపఁ బంపె దశకంఠుఁ డకుంఠితయోధవర్యులన్. 261

వ॥ అందుమహోదరవికూపాక్షధూమ్రాక్ష వజ్రదంష్ట్రాకంపనవిద్యున్మాలి ప్రహస్త
ప్రముఖులు తుములసమరంబున మర్కటసైన్యంబుల దైన్య మొందించి మ్రం
దించుటయు వలీముఖశ్రేష్ఠు లగు సుగ్రీవహనూమదంగదనీలసుషేణాది యోధు
లును ఘోరవిభీషణంబైన విభీషణుండును నెదుర్కొని రక్కసులనిక్కుఁబాపి
యంత మొందించి రంత. 262

ఉ॥ రావణదైత్యుఁ డాగ్రహాభరాత్మకుఁడై త్రిదశేంద్రజిత్వర
శ్రీసహు మేఘనాదుఁ దనజ్యేష్ఠకుమారు సమీకధీరు యు
ద్ధావని కంపె నాతఁ డురగాస్త్రము నేసి నరేంద్రపుత్త్రులన్
పావని నర్కజప్రముఖ వానరులన్ ఘనబంధనంబునన్. 263

ఆ॥ కట్టివేసి దివి కేఁగసి చేరెలంకకు, యాతుధానవిభుఁడు హరుసమొందె
నంత వైనతేయుఁ డా యనీకిని జెంది, సర్పాలకును బాపె సర్పబాధ. 364

ఆ॥ ఆ మఱునటియహమునందు జీమూతనా, దుండు మరల రణముఁదొడరి రోష
రయముతోడ వేసె బ్రహ్మాస్త్రమది వాయు, సూనుఋక్షపతుల జోలి మాలి.

---

* శివపురాణే కోటిరుద్రసంహితాయాం త్రింశాధ్యాయే

శ్రీరామః— శ్లో॥ పునశ్చ ప్రార్థయామాస సాంజలి ర్నతమస్తకః - త్వయా స్థేయ మిహ స్వామిన్ లోకానాం పావనాయచ పరేషా ముపకారార్థం యది తుష్టోసి శంకర! సూతః ఇ త్యుక్తస్తు శివ స్తత్ర లింగరూపోభవ త్తదా రామేశ్వరశ్చ నామ్నావై ప్రసిద్ధో జగతీతలే రామస్తు తత్ప్రసాదేన సింధు ముత్తీర్య చాంజసా రావణాదీన్ నిహత్యాశు రాక్షసాన్ ప్రాప తాం ప్రియాం.

క॥ తక్కినవారల నందఱఁ, జక్కడఁచి దినేంద్రవంశ♦చంద్రుల మదికిన్
మిక్కిలి వెఱపున్ గూర్చెడు, నక్కాకుత్స్థేంద్రుఁ డనియె♦ననుజునితోడన్. 266

గీ॥ ఆశరుఁడు వేసె బ్రహ్మాస్త్ర♦మద్ది మనల
నిట్టు వేధించుచుండె నీ♦విపుడు ధైర్య
మొనసి యుండుమనుచుఁ దాను♦గనులుమూసె
నగ్రజుని ననురోధించె♦ననుజుఁ డపుడు. 267

సుగంధి వృత్తము
అంత జాంబవంతుఁ డెంతొ♦యల్గి యాంజనేయుతోఁ
జింతమాని మంచుకొండఁ♦జేరి జీవవల్లరిన్
సంతరించి తెచ్చి వాని♦సౌరభం బొసంగుమా!
వింతగా నృపుల్ గపుల్ను♦వీడువారు మూర్ఛలన్.

వ. అని ప్రబోధించినంత నాంజనేయుండు మహారయంబున సంజీవినీ లతలన్ దెచ్చి యాఘ్రాణింపఁ జేసినయంతనే రామలక్ష్మణులు సకల వానరవీరులు తద్‌క్షణంబున మూర్ఛన్ బాసి తెలివొంది రామీఁద మేఘనాదుండు. 269

గీ॥ మాయసీతను నాయాంజ♦నేయు నెదుట, శిరసుఁ దెగ వేయుటయు వృత్త♦చరవరుండు
వెఱచి విలపింపఁగా నవ్వి♦భీషణుండ, తథ్యమని చెప్పి యుడిపె నా♦దైన్యమెల్ల. 270

వ. మఱియు రావణప్రేరితయై. 271

క॥ విద్యుజ్జిహ్వాయనా నొక, ప్రద్యోతితమాయ యసుర♦బాణాగ్రమునన్
సద్యోభిన్నంబై తగు, ప్రద్యోతనకులతిలకుశి♦రసుఁ దెచ్చి వడిన్. 272

మత్తకోకిల॥ సీతముందఱ వేయ నంతనె♦క్షిప్ర మాయను చూచి దుః
ఖాతితాడితయై రయంబున♦హా విభూ! యని కూయిడన్
ఘాతుకాగ్రణియైన రావణ♦కార్య మీయది తల్లి! స
త్యేతరం బిది నమ్ము మంచని♦యెన్ విభీషణపుత్త్రి దా. 273

వ. అట్లు త్రిజట యథార్థంబుఁ దెలిపి వైదేహీహృదయతాపంబుఁ బాపె నమ్మఱునాఁడు రావణుండు కుంభకర్ణునకు స్వాపంబుఁ బాపి రప్పించి తనయవస్థన్ దెలిపి సాయం బపేక్షింపుడు నాతం డిట్లనియె. 274

చ॥ ఎది హిత మంచుఁ జెప్పెను న♦యేంగితవేది విభీషణుండు నీ
కదియె హితంబు దాశరథి♦కర్పణసేయుము మైథిలిన్ గుణా
స్పద! మదిరాయతేక్షణలు♦భాసురవృత్తసమున్నతస్తనుల్
వదలక నిన్ను గొల్చెదరు♦పల్వురు వారలతో సుఖింపుమా! 275

వ॥ అట్లు సేయవేని.

ఆ॥ సీత లంకకెల్ల ♦ చిచ్చు రగుల్కొల్పు, నగ్గిసెగలమూక ♦ యతివధాక
నాగుఁబాముపడగ ♦ నాలుకమైఁదీగ, కాళరాత్రి యద్ది ♦ గడుపు మనల. 276

వ. అని చెప్పుటయు నంత జనకజాసమాగమోత్సవసమారంభసంభావనాపైశున్య పరాయణుండగు రావణుం డా వచనంబులఁ జెవిఁబెట్టక యనాదరించి యాతని కిట్లనియె. 277

ఉ॥ శూరుఁడవంచు శాత్రవని♦షూదనముం బొనరింపఁ జాలువేల్
ధీరుఁడవంచు నాకుఁ గల ♦ దీమస మీవ యటంచు నెంచి నిన్
భూరితరోద్యమంబునఁ బ్రబోధముఁగూరిచి సాహ్యామడ్గ నీ
తీరుగ భీరువృత్త ముప♦దేశము చేసెద వేల సోదరా ! 278

—* శ్రీరాముఁడు కుంభకర్ణుని జంపుట *—

చ॥ అన నతఁ డగ్రజన్మమన♦మారసి కాలము దాపరించె నీ
తనికిని సీతనిన్ జెనయు♦తక్కువవారల కంచు నెంచి యా
త్మను దృఢముం బొనర్చి రణ♦ధారుణిఁ జేరి హరీంద్రసేన నం
తను గబళించుచుండఁ గని ♦ దాశరథుండు వధించె నాతనిన్॥ 279

వ. అంత నింద్రజిత్తు నికుంభిలాప్రతానుష్ఠానం బొనర్చి రామలక్ష్మణులతో వానర సేన నంత నంతెమొందింపఁ గడంగి యట్లొనర్పన్ బూనుడు విభీషణుం డెఱింగి హరివీరులచే నద్దాని భగ్నంబుసేయించుటయుఁ గ్రుద్ధుండై నాలుకలుచాచుకొని వచ్చునాగుఁబాము చందంబున. 280

ఆ॥ మరల నింద్రజిత్తు ♦ దుర మొంది లక్ష్మణున్, గవియు నతఁడు లెక్కఁ♦గనక కినుకఁ
జెంది దివ్యశరని♦శితధార దైత్యుని, శిరసుఁ ద్రుంచె దివిని♦విరులు గురిసె. 281

చ॥ దశముఖుఁ డంత దుఃఖ♦పరితప్తతరాత్మకుఁడై కడున్ వడిన్
నిశితకృపాణచాపశర♦నిష్ఠురశస్త్రులఁ దాల్చి సేనతో
దిశలు గలంగ వచ్చి కపి♦ధీరుల నెల్లర దాఁటి ధాటిమై
యశనిసహస్రశక్తిఁ బ్రబల♦మావహశక్తిని గొట్టె లక్ష్మణున్. 282

క॥ ఘనతరశక్తిప్రహారణ, మున రామానుజుఁడు నొచ్చి♦మూసెఁ గనులు గ
న్గొని రఘునాథుఁడు వసరెను, మనమందలి దీమసంబు ♦ మాటునడంగన్. 283

గీ॥ తండ్రి! సౌమిత్రి! తెఱువు క♦న్దమ్మి యొక్క, మాట తెగకుండుఁగాత స♦మస్తమిద్ది
భానుకులభాగ్య మీరాము♦ప్రాణమల్ల, యూర్మిళాగళ మాంగల్య♦మూర్జితంబు.

క॥ ఏ దేశముఁ జేరిన సతు, లేదేశముఁ జేరఁజుట్ట ♦ లేర్పడుదు రటన్
సాధరుఁడై తనరెడు తన, సోదరుఁడిక వేఱుచోటఁ ♦ జూపట్టఁడెటన్. 285

చ॥ నగరును రాష్ట్రమున్ విడిన ♦ నాఁడును ఘోరమహాటవీస్థలిన్
దగఁగొని కందమూలములఁ ♦ దద్దయుఁ గడ్పెడునాఁడు తండ్రి స్వ
ర్గగతిని విన్ననాఁడును ధ ♦ రాసుత సీతను బాసినట్టినాఁ
డగడును జెంద నిన్నుగని ♦ యక్కట యిట్టెటు లోర్తుఁ దమ్ముఁడా! 286

వ. అని యిట్లు విలపించుచుండుడు దివ్యభిషలరుదెంచి చామీకరకాంతి సందోహబంధురంబైన లక్ష్మణ ముఖారవిందంబుఁ బరికించి రామున కిట్లనిరి.

చ॥ వగవకు మయ్య! లక్ష్మణుఁడు ♦ పంచత నొందఁగలేదు నిక్కమా
పగిదిగ రావణాసురవి ♦ భాసురశక్తిహతిన్ విసంజ్ఞుఁడై
మొగిచెఁ గనుల్ తుషారగిరి ♦ మూర్ధమహౌషధరాజిఁ దెచ్చి యా
శుగతనయుండు మూర్కొనుపఁ ♦ జూడుము లక్ష్మణుఁడొందు సంస్మృతిన్.

వ. అని యట్లొనరింపఁజేసిన యంత లక్ష్మణుండు ప్రబుద్ధుండై రాహుముక్తుఁడై వాతృకుఁ బురడింపుచు నన్నను గన్గొనిన రామచంద్రుండు సంతుష్టుండై తమ్మునిఁ గాగలించుకొనియె నమ్మఱునాఁడు. 289

ఉ॥ రావణుఁ డుద్ధతాత్ముఁడయి ♦ రాము నెదుర్కొని ఘోరతీక్ష్ణబా
ణావళిఁ గుమ్మరింపుడు న ♦ హస్కరవంశవిభూషణుండు హా
సావృతనేత్రపద్ముఁ డయి ♦ యాశరనాయకుఁ దేఱిచూచి పెం
పావహిలంగ నిట్లనియె ♦ నచ్ఛమధుస్రవదూర్జితోక్తులన్. 290

ఉ॥ ధాత కొగిన్ బ్రపౌత్రుఁడవు ♦ దక్షుఁడ వెల్లశ్రుతిప్రబంధసం
ఘాతమునందు వైరిజన ♦ ఘస్మరతాయతవిక్రమాఢ్యవి
ఖ్యాతుఁడ విట్టి నీవు మదిఁ ♦ గశ్మలకృత్య మెఱుంగ వేలొకో
ఘాతుక! చూఁడు చూడు మిదె ♦ గన్పడు దత్ఫలమంత నేఁడిటన్. 291

వ. ఇఁకను వినుము.

ఉ॥ నేఁడిటనుండి జీవితము ♦ నిల్పి మఱెచ్చటి కేగలేవిఁకన్
నాఁ డొనరింపఁజేసిన కృ ♦ ణమ్ము మనమ్మునఁ జింతసేయు మీ
నాఁ డొనరింపు మట్టివి వి ♦ నాశముసేయును రాఘవాస్త్రముల్
వాఁడిఁబెనంగు సంగరముఁ ♦ బాయక డాయక తుచ్ఛమార్గముల్. 292

వ. అనుటయు దశగ్రీవుం డిట్లనియె.

చ॥ నిజము ప్రపౌత్రుఁడన్ వినుము ♦ నీరజగర్భున కర్థనాయకా
నుజుఁడ సమస్తనిర్జరుల ♦ నున్ నరకిన్నరపన్నగాసుర
వ్రజముల నొంచినాఁడ నిఁక ♦ వారక చారణులెల్ల రెప్డు నా
విజయముఁ గూర్చి పాడెదరు ♦ వెక్కస మెంచక చేరితీవనిన్. 293

తరళ॥ చదివినాఁడను విన్ము రాఘవ! ♦ సర్వవేదచయంబులన్
బొదలఁజేసితి వానికెంతయుఁ ♦ బొందికొప్పఁగ నంకముల్
పదనుదప్పక దర్శనంబుల ♦ పారమొందినవాఁడ నె
ట్టిదియు లేదొక సుంత దక్కువ ♦ శివిఁగన్గొను మీవునున్. 294

వ. మఱియుఁ బరదారాపరిగ్రహంబు హేయ్యంబనుటయందిట్టుల వినుము. 295

క॥ రత్నంబులు రమణీజన, రత్నంబులు శూరవరక ♦ రగ్రాహ్యంబుల్
నూత్నముగాదిత్తెఱఁగు ప్రి, యత్నంబున సీతఁగొంటి ♦ నవల కనిపి నిన్. 296

వ. ఇఁక సాంప్రతము సాంపరాయంబందు నీక విజయంబయ్యేడు నందువేని వినుము.

మ॥ కడుకిం్రపన్ గనుపట్టునట్టిఁడొకఁడున్ ♦ గన్పట్టు నొక్కప్పుడె
క్కుడుగా నుచ్చపదస్థుఁడై యటులనే ♦ గొప్పైనపీఠంబునన్
బెడగొప్పన్ వసియించునాతఁడును ♦ బల్ బీర్వోయి నీచైస్థలిన్
బడి కాన్పించెడు నేటికారయఁగ నీ ♦ పాిబల్యదౌర్బల్యముల్. 298

క॥ పుట్టినవారలు గిట్టుట, గిట్టినదేహియును బుట్టోరిగిన్ జెందుటయున్
దిట్టమె దీనిన్ గూరిచి, యెట్టివిచారంబు సేయ ♦ రెఱఁగిన వారల్. 299

వ. కావున నిపుడు యుద్ధంబు సేయుమనుడు రాఘవుండు గినిసి యిట్లనియె. 300

క॥ చపలుఁడ! "వినాశకాలే, విపరీతమతి"యనునట్టి ♦ విధమున నీ వి
ట్లపథంబుఁ జెందితివి క,స్మిపుడె సమీపించె భయద ♦ హింసాగతి దా. 301

చ॥ అని యసమానరోషవిక్ర ♦ తాననుఁడై పటుదీప్తబాణముల్
దనుజవరేణ్యునంగములు ♦ దల్లడిలన్ పడి నేసె నాతఁడున్
గనలి యనేక శాతశర ♦ కాండములన్ రఘువీరు నేసె న
య్యనువున వీరియాహవ మ ♦ నల్ప మకల్పము గాఁగ రాజిలెన్. 302

వ. ఇట్లు దినత్రియంబుఁ బోరినంత

## —* శ్రీరాముఁడు రావణాసురుని సంహరించుట *—

మ॥ హరిదశ్వాన్వయతల్లజుం డలిగి బ్ర ♦ హ్మాస్త్రాభ్యుపేతంబు వి
స్ఫురదగ్నిప్రతిమాన మొక్కశరమున్ ♦ బ్రోద్యద్గతిన్ రావణా
సురుపై వైచె శరంబులున్ బదియునున్ ♦ జూరయ్యె దైత్యాధిరా
ద్వరుఁ డస్తంగతుఁ డయ్యెఁ బుష్పవితతుల్ ♦ వర్షించి రా నిర్జరుల్. 303

వ. అనుచరు లెల్లఁ బాఱి దిశాంతరంబుల కేగి రంత మందోదరీ ధాన్యమాలిన్యాద్య
వరోధజనమును విభీషణుండును రావణకళేబరంబుఁ జుట్టి మిన్నుముట్ట విలపించుడు
రాఘవుండు విభీషణున్ జేరఁబిలిచి తత్సమయసముచితకర్మంబుల నాచరింపఁజేసి

యనంతరంబున వానరులకు వైదేహిఁ దెచ్చుట కనుశాసించుటయు వారలంతన
యశోకవనిఁ జేరి. 304

చ॥ ఘనతరహానిదాఘమునఁ ♦ గ్రాఁగి కృపీటధరోదయాప్తికై
వనరుచునున్న యట్టియల ♦ బర్హిణియట్లనురుప్రతప్తయై
ఘనుఁడగునాత్మనాథుసము ♦ ఖమ్ముఁ గరమ్మొదఁగోరుచున్న పా
వనతరమూర్తి జానకిని ♦ వానరవీరులుగాంచి యున్నతిన్. 305

వ. ముందుగ నాంజనేయుండును వెంబడి సుగ్రీవాంగదులు మున్నగువారు చేరి
యాదేవికి నమస్కరించి రావణసంహారంబును శ్రీరామవిజయంబును దెలిపి సత్వ
రంబాయమను శ్రీరామసన్నిధానంబును జేర్చి యామహారాజున కెఱింగించు
టయు దాశరథి మైథిలిఁ బరికించి పేరలుక నిట్లనియె. 306

చ॥ చెఱవిడిపించితిన్ దనుజ ♦ చేవనడంచి వధించితిన్ బ్రభా
కరకులవిక్రమశ్రియ మ ♦ ఖండమహీవలయంబు నొందె నీ
హరివరు లాంజనేయుఁ డను ♦ రాధిపమౌళి విభీషణుండునున్
బరపినసౌఖ్యమెంతయును ♦ భాసిలె నప్రతిమప్రకారమై. 307

శా॥ నీకై యత్నముసేయలేదిది మదిన్ ♦ నిక్కంబు భావింపు మ
స్తోకంబౌ నరివంచనన్ గడపితిన్ ♦ శుద్ధుండనై కీర్తిరహిన్
నీకిష్టంబగుచోటి కేగు పురుషున్ ♦ నీయిచ్ఛచొప్పొందు మే
చీకాకున్ బడఁబోకు పొమ్ము ♦ పని కించిత్తేని లేదీయెడన్. 308

ఉ॥ ఎప్పుడు నిన్ను నెత్తికొని ♦ హెచ్చుగఁ బుష్పకమెక్కి రావణుం
డిప్పురిఁ జేర్చి యాత్మమది ♦ కింపగు పూవులతోటనుంచెనో
యప్పుడె తీఱె నంతయుఁ ద్రి ♦ పాకర మన్యవధంబు కామనుం
డొప్పరికించునే కలయ ♦ కొప్పుగ నిప్పటిదాక నార్తతన్. 309

చ॥ అనవిని యంత వేగ జన ♦ కాత్మజ దల్లడమొంది కూలి ల
జ్జను గడురోసమున్ వగపు ♦ జాలవెఱంపును జెంది యశ్రులన్
గనుగవ రాల్చుచున్ విభునిఁ ♦ గాంచి మొగంబొకకొంత వంచి మె
ల్లన నిటుబల్కె దైవము ద ♦ లంచి కలంచెడు మానసంబునన్. 310

మ॥ అకటా నన్నిటులాడఁగూడునె! మహా ♦ త్మా! కోవిదేంద్రుండవై
సకలంబారసినట్టి ఱేఁడవయి నా ♦ సర్వాత్మమందెప్డు ని
న్నొకనిన్ గాక మఱొక్కనిన్ దలఁతునే ♦ యుర్వీప్రదేశంబు మీ
దికిఁ జేరన్ జనినన్ నభంబును ధరి ♦ త్రీమండలిన్ వ్రాలినన్. 311

గీ॥ పల్లెవాఁడొక్కఁడేపున్నెఁ ♦ బల్లెపడుచు, తోడఁ బదరినయట్టు లి ♦ ట్లాడఁదగునె
సర్వమెఱుఁగఁగఁ జాలిన ♦ జాణవింత, యెఱుఁగవే! దేవ! భామక ♦ హృదయసరణి.

ఉ॥ నీ వటునమ్మవేని ధర ♦ ణీవర! యారయు పంచభూతముల్
గోవులు సూర్యచంద్రులును ♦ గోవిదు లష్టదిగీశు లెంతయున్
నే వెనుజూడ కాత్మమున ♦ నేరమి నెంచిననన్ను నీక్షణం
జే విగతాసుఁ జేయుదురు ♦ పేరిమిదక్కి యుదగ్రమూర్తులై. 313

క॥ నను రావణుం డిటకుఁ దె, చ్చినతఱి నాగాత్రమునకుఁ ♦ జెడుగని స్పర్శం
బనుచితమైనను లేశం, బును లేదాత్మాఘమద్ది ♦ పొసఁగె విధివిధిన్. 314

చ॥ అనినను సందియంబు విడ ♦ కట్టులెయుండిన నాత్మనాధు నం
తనె పరికించి యుస్సురని ♦ తాప మణంచి మఱందిఁ గాంచి చ
క్కనఁ జితినిర్గ బొనర్చు మిఁక ♦ జాగొనరింపకు వేగ నగ్ని నీ
తనువును గాల్చి శుద్ధనగు ♦ దానఁ బనేమియులేదు లక్ష్మణా! 315

వ. అనుటయు రామచంద్రుఁ డట్లొనర్పుటకు సౌమిత్రికి సన్నచేయుటయు నతండు
సేయునదిలేక యట్లుగూర్చుడు సీతామహాదేవి శ్రీరామునకుఁ బ్రదక్షిణంబొన
రించి గోవులకును దేవులకును బ్రణామంబులాచరించి కరంబులు మోడ్చి
యిట్లనియె. 316

క॥ మనసున వాక్కునఁ గర్మం, బున రామునిదక్క యన్య ♦ మును దలఁప విభుం
డనుమానమొందె నాపయి, ననఘా! పాలింపు సర్వ ♦ మరసి హుతాశా! 317

గీ॥ అని వడిఁ బావకజ్వాల ♦ యందు దుముక, నంతనే దేవముఖుఁడు దా ♦ నదరి నొదిగి
సాధ్వి కత్యంతచందన ♦ సారశిశిరుఁ, డగుచు తాము నిరూపించి ♦ యనియె నిట్లు.

చ॥ అనఘమనీష! యిట్లు వసు ♦ ధాత్మజ నాడఁగఁ జెల్లునే సతీ
జనతిలకంబు శ్లాఘ్యతర ♦ సాధుచరిత్ర పవిత్ర యీ మెయుం
దనుచితమున్నదే యమరు ♦ లబ్జభవుం డభవుండుమున్ను నా
యనిమిషు లేగుదెంచిరిదె ♦ యాయమశీల మువన్యసింపగన్. 319

వ. అనంతరంబ పద్మసంభవుండును బరమేశ్వరుండును సకలామరబృందగోష్ఠితో
మహేంద్రుండును విమానంబులెక్కి తారసించిరందు విధాత యిట్లనియె. 320

చ॥ పరమపతివ్రతామణిని ♦ బామరుఁడట్టులఁ బల్కి తగ్నులం
బఱుక నుపేక్షచేసితివి ♦ యొప్పునె? చెప్పుము రామచంద్ర! నీ
చరితమెఱుంగవైతి వల ♦ చక్రధరుండగు విష్ణువీ విఁకీ
సురుచిరగాత్రి శ్రీరమణి ♦ చుమ్మలుమాన్పి సతిన్ గ్రహింపుమా!

క॥ అనుటయు రాఘవుఁడటఁ జే, రిన బృందారకుల కెంద ♦ రికి వందనముల్
బొనరించి యిట్టులనియెను, గనదురుమకరందసార ♦ కమనీయోక్తిన్ 322

ఉ॥ ఎఱుఁగుదు జానకీహృదయ ♦ మిద్ధమటంచు మహాత్ములార ! యి
త్తఱి నిటుసల్పనేని చెను ♦ తప్పఁదలంచి జనంబులెల్లవార్
దురుసుగ నిందలాడుదురు ♦ త్రోతురు పాపపుగోత నీపె స
చ్చరితమె తన్నుఁగాఁచునని ♦ సల్పితి నిట్టు లుపేక్ష నీయెడన్. 323

ఆ॥ అనిన నంత నగ్ని ♦ యమ్మహాసాధ్విని, జనకరాజసుతను ♦ జారుమూర్తిఁ
దెచ్చి రామచంద్రు ♦ దివ్యాంకపీఠిపై, నునిచె జయజయోక్తు ♦ లొనరితనర. 324

వ. అంత మహేశ్వరుండు రామునకిట్లనియె.

ఉ॥ తామరసాక్ష ! దివ్యజన♦తా పరితాపముదీఱ రావణున్
గామమదున్ వధించితివి ♦ కౌశల మాశలఁబర్వఁ బావన
శ్రీమహనీయమూర్తి నిఁక ♦ సీతను జేకొని సాకు పృథ్వి నిం
దే మహితుండు నీజనకుఁ ♦ డీతఁడె చూచి ప్రపత్తి సల్పుమా !

క॥ అని దశరథనృపుఁ జూపుట, యును దాశరథియును సీత ♦ యును లక్ష్మణుఁడున్
ఘనభక్తిఁ జేరి మ్రొక్కిరి, తనయుల జానకిని జూచి ♦ తా నృపుఁడంతన్. 326

వ. రామునిగ్రుచ్చి కౌగిటన్ జేర్చి శిరంబాఘ్రాణించి పరమానందంబునొంది యిట్టు లనియె. 327

చ॥ కొడుక ! తరించినాఁడ నవి ♦ కుంఠితశౌర్య నమోఘవీర్య నిన్
బడసినయట్టి పుణ్యమున ♦ భాగ్యమునొందె దినేశవంశ మీ
పడుచు విదేహరాజసుత ♦ పావన మెంతయునేని లక్ష్మణుం
డుడుగక నిన్ను గొల్చుటను ♦ నుజ్జ్వలుఁడయ్యె జగంబు పేర్కొనన్. 328

వ. అనంతరంబ లక్ష్మణుని నక్కునన్ జేర్చుకొని ముద్దుచేసి కోడలిననునయించి రాఘవవంశవర్ధనం బొనరింపుమని యాశీర్వదించి దివ్యసముచ్చయంబుతో దివికేగె నంత శ్రీరామచంద్రుండు సీతామహాదేవిన్ బరిగ్రహించి విభీషణునకు లంకారాజ్య పట్టాభిషేకంబుఁ గావించి తత్క్షణంబున విభీషణునితోఁ గపియూథంబుతో సీతాలక్ష్మణసమేతుండై పుష్పకంబెక్కి యబ్ధిన్ దాఁటి జానకీదేవికిట్లనియె.

గీ॥ ఇచట ముక్కొనరించె మ♦హేశ్వరుండు, అమ్మహాదేవుఁడు ప్రసాద♦మబ్జనయన !
సేతుబంధంబునానిది ♦ ఖ్యాత మఖిల, పాతకహరంబు త్రైలోక్య ♦ పావనంబు.

వ. అని పుష్పకావరోహణం బొనర్చి యప్పు డప్పుణ్యప్రదేశంబునఁ బౌలస్త్యహత్యా పరిహారార్థంబుగా మరల శివలింగప్రతిష్ఠన్ జేయ నెంచి లింగానయనార్థంబు మరుత్పుత్రున్ బంచి యర్చనాపరికరంబుల నెల్ల సమకూర్చుకొని బ్రహ్మమునిమండల

పరివృతుండై సుముహూర్తంబు ప్రత్యాసన్నంబగుట వీక్షించి పావన్యాగమ
నంబుఁగాంచక నిశ్చలసంకల్పుండై. 331

## —* శ్రీరామలింగ ప్రతిష్ఠ *—

గీ॥ సైకతంబున లింగంబుఁ ♦ జక్క-చేసి, సన్మునీంద్రాభినందిత ♦ సమయమందు
దాశరథి శివలింగ సం ♦ స్థాపనంబు, సలిపి పూజించె నిజనామ ♦ మలరి వెలఁగ*.

వ. తదనంతరంబున శివలింగంబును మోచికొని రోజుచు వచ్చి యచ్చటివృత్తం
బంతఁ బరికించి విస్మపోయి యస్వస్థచిత్తుండై సామీరి మీఁజి కినియుడు శ్రీరామ
చంద్రుండు తదానీత లింగంబునుగూడ శ్రీరామేశ్వరలింగంబు పార్శ్వంబందుఁ
బ్రతిష్ఠించి విశ్వేశ్వరలింగంబని యాహ్వాయంబొనర్చి యద్దాని కగ్రపూజ్యత్వం
బేర్పఱచి మారుతిఁ సంతుష్టుని బొనరించి యంత మునిజనాశీర్వచనంబులతోఁ
బుష్పకారోహణం బొనర్చి. 333

గీ॥ నిముసమున ఋష్యమూకాద్రి ♦ని దఁటిసి యట, జనకజానుమతిఁ గపీ♦శాన రాజ్ఞు
లైన తారాదులను వ్యోమ♦యాన మెక్క-, చేసి వేగఁ బ్రయాణంబు♦చేసియంత.

వ॥ నిమేషాంతరంబున భరద్వాజాశ్రమంబుఁ జేరి యవ్వారి సేవించి యాంజనేయుని
భరతునియెద్దకు స్వాగమనం బెఱింగించి రమ్మని యిట్లు చెప్పిపంచె. 335

ఉ॥ తల్లులకెల్ల జోతలను ♦ దమ్ములకిట్టర కాశిషంబులన్
జెల్లుగఁ జేసినాఁడ నను ♦ బెన్మిటిఁబాసి తపించు నూర్మిళఁ
మెల్లగ సేదదేరు మను ♦ మే లను దక్కి-నతమ్ములాండ్రకుఁ
జల్లగ నెల్లపౌరులకు ♦ సంతసమున్ వచియింపు పావనీ ! 336

## —* శ్రీరామపట్టాభిషేకము *—

వ. అంత హనుమంతుం డట్లెఱింగించి వచ్చె ననంతరంబు భరతుండు రామాగమ
నంబు విన్నంత మురిసి సత్వరం బయోధ్యనలంకరించి మాతృజనంబును వధూ
జనంబుం దోడ్కొ-ని శత్రుఘ్నునితో బంధుమిత్రామాత్యపౌరపరివారవర్గంబులతో
వచ్చి యగ్రజపాదారవిందంబుల కభివాదనం బొనర్చిన శ్రీరామచంద్రుండు
తమ్ముల నాలింగనంబుచేసికొని తల్లులకు నమస్క-రించి యాశీస్సులొందె నమ్మఱు
నాఁడు నందిగ్రామంబున సీతాలక్ష్మణులు జటావిసర్జనాభ్యంజనస్నానంబు
లొనర్చి యలంకృతులై నంత వశిష్ఠుండు వామదేవాది ఋషులతోఁ గూడి

* పద్మపురాణే - శ్లో॥ సేతుమధ్యే మహాతీర్థే గంధమాదనపర్వతే । కల్యాణమూర్తి శ్రీరామః స్వయం
దశరథాత్మజః । నిహత్య రావణంపూర్వం తత్పాపవినివృత్తయే । లింగం
సంస్థాపయామాస స్వనామ్నా లోకనాయకం.

శ్రీరామచంద్రుని స్తంబేరమాగ్రేసరంబు నెక్కించి యయోధ్యాస్థానికిఁ జేరిచి సింహాసనాసీనుం జేసి చతుస్సాగరతీర్థంబుల నభిషేకించి బ్రహ్మనిర్మితంబును మన్వాదిపవిత్రశిరోమండితంబు నగు వజ్రకిరీటంబు ఫాలి నలంకరించి ముఖంబున హిరణ్యపట్టంబుఁ గట్టి యాశీర్వదించె 337

సీ॥ పట్టాభిషిక్తుఁడై ♦ భానుకులునకుఁ దెల్లనిగొడుగు శత్రుఘ్నుఁ ♦ డొనరఁబట్టె
ఇరుపార్శ్వములయందు ♦ భరతుండు లక్ష్మణుం, డానందపారవ♦శ్యమున నిలిచి
రల విభీషణుఁడును ♦ హరికులేశ్వరుఁడును, జామరసేవను ♦ సల్పుచుండి
రమరనాయకచోది♦తానిలుండు సువర్ణ, పద్మమాలను రఘు♦పతికి వైచె.

గీ॥ పాడి రున్నతి గంధర్వు♦లాడి రచ్చ, రలు ప్రసూనంబులను నిలిం♦పులు గురిసిరి
జానకీకంఠమునఁ జంద్ర♦చారుదీప్తి, ఘనము మౌక్తికహార మే♦సెను విభుండు.

గీ॥ సీతయును నాథుననుమతిఁ ♦ జెంది దాని, నాంజనేయున కొసఁగెను♦హర్ష మెసఁగ
దాన నెంతయు నానంద♦మూని పవన, తనయుఁ డా దేవికిని రఘు♦పతికి మ్రొక్కె.

ఉ॥ రామనృపాలుఁ డప్డు కపి♦రాట్టున కంగదకీశ ర్తకుల్
బ్రేమ మెయిన్ సువర్ణమణి ♦ విస్ఫురదుత్తమభూష లిచ్చెను
ద్దామధనంబులన్ నగలఁ ♦ దక్కినమర్కటకోటి కిచ్చె గో
త్రామరవర్గముల్ దనియ ♦ నాలను రత్నము లిచ్చె హెచ్చుగన్. 340

వ. కతిపయదినంబులు శ్రీరాముని సేవింపుచు నయోధ్యయందుండి సంతసించి యంత రామానుజ్ఞఁ గొని యాంజనేయుండు దక్క తక్కినకపిభల్లూకవర్యు లందఱును విభీషణుండును నాత్మనివేశనంబుల కేగిరి. శ్రీరామచంద్రుండును సకలజనానందంబుగ వసుమతిన్ బాలింపుచుఁ దమ్ములఁ బ్రేమింపుచు గురుజనంబుల సేవింపుచు జానకీదేవియందుఁ గుశలవులను బుత్త్రద్వయంబును బడసె. 341

—* ఫలశ్రుతి *—

క॥ శ్రీరామచంద్రచరితము, నామోదమునన్ జదివిన ♦ నాలించినన్
శ్రీరామభద్రుఁ డర్మిలి, వారలకు శుభంబు లిచ్చు ♦ వాంఛలు దీర్చున్. 342

క॥ రామునిఁ బోలినపురుషుఁడు, భూమిజనున్ బోలినట్టి ♦ పుణ్యయువతియున్
సౌమిత్రిభరతులను బోల్, ధీమాన్యులు హనుమఁ బోలు ♦ దిట్టలు గలరే! 343

వ. ఆ కుశున కతిథియను పుత్త్రుండు జన్మించె నవ్వాని వంశంబున ననేకులు రాజన్యశ్రేష్ఠు లుదయించి రీయది మహనీయంబగు దివాకరవంశచరితంబిఁకఁ జంద్రవంశంబు నెఱింగింతు వినుండు. 344

## —* చంద్రవంశము *—

చ॥ చినతనమందు దేశికుని ♦ చెల్వను దారను జంద్రుఁ డొందుటన్
గనదురుకాంతిమండలుఁ డ♦ఖండయశుండు బుధుండు పుట్టె నం
దనుఁడు పురూరవుం డిల యె♦డన్ బొడమెన్ శశిసూతి కూర్వశీ
వనరుహనేత్రి కాతనికిఁ ♦ బల్వురు పుత్త్రులు పుట్టి రిమ్ముగన్. 345

వ. ఆయువు శ్రుతాయువు సత్యాయువు జయంతుఁడు విజయుండు ననువారు. అందాయువునకు నహుషుండును, క్షత్రవృద్ధుండును రజియును రంభుండును ననువారు పుట్టిరి. అందు నహుషునకు యతియు యయాతియు సంయాతియు నాయాతియు వియాతియు గుంతియు ననునార్గురు కొడుకులు జన్మించిరి. వారిలో యయాతి పట్టాభిషిక్తుండై శుక్రతనూజయగు దేవయానను వృషపర్వసుత యగుశర్మిష్ఠను వివాహంబై వారియందు యదుదుర్వసుద్రుహ్యానుపూరు లనువారిఁ బుత్త్రులఁబడసె.

క॥ వారలలోనన్ బూరుఁడు, ధీరుండై తండ్రియనుమ♦తిని భూవిభుఁడై
శూరుండై దిగ్విజయముఁ, గూరిచి భూవలయమేలెఁ ♦ గుశలత యలరన్. 347

వ. అట్టిపూరుని సంతానపరంపరయందు దుష్యంతుండు పుట్టె. ఆ దుష్యంతునకు శకుంతలయందు భరతుండుజన్మించె. ఆ భరతునకుఁ గైకేయియందు హుతమన్యుఁడు పుట్టె నవ్వానికజామీఢుండును వానికి సంవరణుండు జన్మించిసూర్యతనూజయగు తపతిన్ బెండ్లాండి యామెయందుఁ గురుండను సుతున్ బడసె. వాఁడు కురుక్షేత్రంబునిర్మించె నాకురుని వంశంబునఁ గ్రమంబుగ దేవాపిశంతనబాహ్లీకులు జన్మింప నందు శంతనుండు రాజయ్యె ఆశంతనునకు గంగాదేవియందు భీష్ముండును సత్యవతియందు విచిత్రవీర్యచిత్రాంగదులను వారునుజన్మించిరి, భీష్ముండు బ్రహ్మచారివ్రతమును ధరించుటను సాత్యవతేయు లనపత్యులై నశించుటనుజేసి వ్యాసుండు వారి క్షేత్రంబులందు ధృతరాష్ట్రపాండులన్ గనియె. ధార్తరాష్ట్రులు నూర్వురుపైశున్యంబు నొంది చెడుఁగులగుటఁ బాండుకుమారులవ్వారిఁ గురుక్షేత్రంబున యుద్ధముజేసి సమయించి రం దర్జునున కభిమన్యుండును నాతనికిఁ బరిక్షిత్తయ్యనఘునకు జనమేజయుండును నవ్వానికి శతానీకశంఖులును గలిగిరి శతానీకునకు నశ్వమేధవంతుండను పుత్త్రుండు జన్మించె నవ్వానివంశంబున ననేకులు పొడమి రిందుఁ బురూరవుపుత్త్రులగు శ్రుతాయువు మున్నగువారల వంశపరంపరయందు దివోదాసుండు మున్నగువారలు పొడమి రందుఁగొందఱు బ్రాహ్మణజాతిన్ జెందిరిఁక యయాతిపుత్త్రుండగు యదుఁడను వాని వంగడంబున శ్రీమన్నారాయణుండు కృష్ణుండై యనంతుండు బలరాముఁడై యవతరించి దుష్టజనమారణంబొనర్చి ధర్మరక్షణం బొనరించి రీయది చంద్రవంశచరిత్రం బిఁకేమి

వినఁదలంతు రసనవ్యారలు మహాత్మా! వేదవిభాగంబుఁజేసి యష్టాదశపురాణంబు
లను భారతేతిహాసంబును రచించిన శ్రీకృష్ణద్వైపాయనుజన్మంబుతీ రెఱింగింపు
మనుడు సూతుండిట్లనియె. 348

## —* వ్యా స జ న్మ ము *—

చ॥ ఘనుఁడు వశిష్ఠపౌత్రుఁడు జ • గద్వినుతుం డల శక్తిపుత్త్రునిసం
దనుఁ డనవద్యతాపసధ • నప్రచయుండు పరాశరుండనా
మునిపతి తీర్థసేవనముఁ • బూని రహిన్ యమునాతటిన్ నిషా
దునిఁగని వేగఁ బిల్చి నను • దోడ్కొని యావలి రేవుఁ జేర్పుమా.  349

క॥ వాఁడును బోసేయుచుఁ బూఁ, బోఁడిని దనకూఁతుఁ జూచి • పుత్త్రిక! నీవీ
యీడేనయుని మేటిమునిని, నోడను దాటింపు మవలి • యొడ్డుకు ననుడున్. 350

క॥ అదియును నట్టులనే యని, ముదమునఁ గల యెక్కఁ జేసి • ముని నవ్వలిగ
ట్టుదరికిఁ జేరుచుచుండఁగ, ముదితను బరికించి దివ్య•ముని పరవశుఁడై. 351

చ॥ ముసిముసి నవ్వులొల్కు మొగ•మున్ జెవులందెడు కన్నుదోయి పెం
పెసఁగు మెఱుంగురంగుల వ•హించిన యంసపుగుబ్బజంట నీ
రసమయి తోఁచు సన్నడుము • రాణదలిర్పఁగ లేఁతపాదయుపుం
బసలఁ బసందులన్ దొలుకు • భామనుజూచి స్మరాతురుఁడై. 352

గీ॥ నావ దరిఁజేరినంత నె • నాతిఁజేర, చేయిఁబట్టిన నయ్యోది • సిగ్గుఁజెంది
ఏమియిది దేవరా! యన•నెఱుకచేసెఁ, దనదుహృదయంబుఁబోలఁతికిఁ•దాపసుండు.

వ. అంత నయ్యోది యింకనుసిగ్గుతోఁ దలవంచుకొని యమ్మునివరేణ్యున కిట్లనియె.

ఉ॥ బోయకులంబుదాన, విను • భూసుర! చేపలకంపు నామొడల్
హేయముగాదె? నీకిది ము•నీంద్రుఁడ వెంతయుఁ బావనుండవున్
నాయమె? యిట్టి నీచకుల • నారులతో మరుకేళి సేయఁగా
నీయెదకెట్లు దోఁచెనొకో? • నేర్పునఁగాంచుము ముందువెన్కలన్. 355

ఉ॥ అందును నేను గన్నెను మ•హాత్మక! తల్లియుఁ దండ్రియుం గలా
రందరు గాంచుచుండి రిట • సంగజకేళిని నిన్నుఁజెందఁగా
ముందఱ నన్నుఁ గైకొనెడు • పూరుషుఁ డుండునె? తల్లిదండ్రులున్
దొందరసేయరే? యొరులు • దూఱుదురంచుఁ దలంపరే? గురూ! 356

తరల॥ అనినఁ దాపసుఁ డిట్లువల్కెల • తాంగి! విన్మిఁక నీయొడల్
ఘనసుగంధపరంపరావృతిఁ • గాంచు నీవిఁక రాజసం
దనవు నిక్కము బోయదన్ నుడి • తప్పు చూడుము కన్నెచొ
ప్పును నడంగదు చూడరెవ్వరు • పొంకమౌ హిమముప్పెదున్. 357

చ॥ సురతముసేయు వేగముగ ♦ సుందరిరో! యిఁక నన్నుఁగూడి న
చ్చరలను లేఁత జవ్వనపుఁ ♦ జానలఁ బల్వురఁ జూచియుంటి నె
వ్వరుసున నేని నామనము ♦ బద్ధముగాకయె యుండె నేఁడు తొం
దరపడుచుండె నీయెడలఁ ♦ దప్పని దైవగతుల్ మరల్పఁగాన్. 358

క॥ కనకఘటప్రతిభటనూ, తనపీనస్తనయుగమున ♦ దట్టపు నాలిం
గనమొసఁగి రతులఁదన్పుము, కనదిందీవరసుగంధి! ♦ గరువమ్మునరక. 359

సీ॥ నీవు యోజనగంధివై ♦ నెగడఁగలవు, తనయుఁడుజనించు సత్తపో♦ధనుఁడు ఘనుఁడు
రాణివగుదువు రాజాధి♦రాజు నిన్నుఁ, బడయుఁదడవేల చే♦సెదు? పద్మగంధి!

గీ॥ అనిన నది దేహసౌగంధ్య ♦ మమరుటయును
మంచు గడుఁ గ్రమ్మి తనవారు ♦ మఱుఁగగుటయు
నరసి మునినిఁ దపోధను ♦ నెఱిఁగి మాఱు
పలుకుటకు నోడి రతికిష్ట ♦ పడియె మునికి. 361

ఉ॥ అంతనె మానిచెల్వఁగొని ♦ యయ్యమునాతటమందునున్ గడున్
సంతసమొప్పఁ బుష్పశర ♦ సంగరభంగులఁ దృప్తిదీరఁగా
నెంతయుఁ గ్రీడసల్పి చనె ♦ నీశ్యుఁడు వ్యాసమహామునీంద్రుఁ డ
శ్రాంతతపోధనుం డొదవె ♦ సారసనేత్రసమానుఁ డున్నతిన్. 392

క॥ కుడిచేతఁ గమండలువును, నెడమదియగు చేత దండ ♦ మెసఁగంగ జడ
ల్గడుఁదనరఁ గృష్ణతనుఁడై, పొడమి జననిపాదములకు ♦ మ్రొక్కి యిటులనెన్.

క॥ ఎప్పుడు పనిగలిగిన నీ, వప్పుడె ననుఁ దలఁపవలయు ♦ నాక్షణముననే
నొప్పుగ వచ్చియు నాపని, తప్పక నెఱవేర్చువాఁడ ♦ తల్లిరో! విన్మా! 364

క॥ అనియనుమతిఁగొని వేగమె, చనియెను వ్యాసుండు తపసు ♦ సాధింపఁగ నం
తనె తర్ణకంబువిడి యో, జనగంధియుఁగుండెనెద ♦ విచారంబెరయున్.

వ. సుతునియాకారంబును సద్గుణసౌష్ఠవంబును దలంచుచు మరల నోడయెక్కి యవ్వలిగట్టునందున్న తల్లిదండ్రులయొద్ద కరిగె నంత వ్యాసుండు యమునా ద్వీపంబందుఁ బుట్టుట ద్వైపాయనుం డనియు నల్లనివాఁ డౌట కృష్ణద్వైపాయనుం డనియును వేదవిభాగంబు నొనర్చువాఁడౌట వేదవ్యాసుం డనియుఁ బేరులఁ జెంది ముందుగఁ దీర్థరాజంబగు ప్రయాగంబు నొంది యందునుండి నైమిశంబుఁ గురుక్షేత్రంబు హరిద్వారంబు నుజ్జయిని నయోధ్యను మధురను ద్వారకాపురి నమరావతిని సరస్వతిని సింధుసంగమమును గంగా సాగరసంగమమును త్ర్యంబకంబును సప్తగోదావరీతటంబును గాలంజరంబును బ్రభాసంబును గేదారంబును బదరీవనంబును ఓంకార క్షేత్రంబును బురుషోత్తమంబును గోకర్ణంబును

లగుటఁ వర్ణవ్యాప్తంబులు. వర్ణంబులు (అక్షరంబులు) భువనంబులందు వెలయుట భువనవ్యాప్తంబులు భువనములును నండమునకంతర్బహిస్సులందుఁ గ్రమముగఁ గారణములగు తత్త్వములచే వ్యాప్తంబులగుటఁ దత్త్వవ్యాప్తంబులు. భువనంబు లండాంతస్స్థితంబులు, పురాణప్రసిద్ధంబులు. తత్త్వంబులు సాంఖ్యయోగప్రసిద్ధంబులు. ఆ తత్త్వంబులు శివశాస్త్రప్రసిద్ధంబులునై యున్నవి కలలచేత వ్యాప్తంబులు. కలలు పరమైనప్రకృతియొక్క పంచధా పరిణామంబులు. నివృత్తి ప్రతిష్ఠతులు. షడధ్వలలో నవిభక్తయగుపరాశక్తిచే నివియైదును వ్యాప్తంబులు. వ్యాపిక పరాశక్తియగు నీక నీపరాశక్తియు శివతత్త్వమునుండి వెలసినదాట.

గీ॥ శక్తిప్రభృతిపృథివ్యంత ♦ సకలతత్త్వ, సముదయంబిది శివతత్త్వ ♦ జనితమగును
అరయుఁడొకమృత్తుచేత ♦ గుంభాదిసర్వ, పరికరంబులు పుడమినే ♦ బ్బొడమునట్లు

వ. కావున నీ షడధ్వములచేత శివతత్త్వంబు వ్యాప్యంబు. ఈ పంచతత్త్వపరిశోధనంబునఁ దద్వ్యాపికయగు శక్తియే వ్యాపికయగుచున్నది. నివృత్తిచేత రుద్రపర్యంతమండంబు స్థితి శోధింపఁబడుచున్నది. ప్రతిష్ఠచేతఁ దదూర్ధ్వం బవ్యక్తగోచరంబగువఱకును విద్యచేతఁ దదూర్ధ్వంబు విద్యేశ్వరాధిగను శాంతిచేఁ దదూర్ధ్వమును శాంత్యతీతచే నధ్వాంతమందు విశుద్ధియు శోధింపఁబడుచున్నది. ఏశాంత్యతీతను బరప్రకృతియోగంబునఁ బరమంబగు వ్యోమయని పరమార్థజ్ఞులు చెప్పుచున్నారో. ఇవి పంచతత్త్వములు, వీనిచే జగంబంతయు వ్యాప్తమైనది. సాధకులచే నిదియే సర్వము చూడఁదగినది. 318

మత్తకోకిల॥ ఎవ్వఁడధ్వవిధానమిట్టుల ♦ నెఱిఁగెంతయు శుద్ధిఁదా
నివ్వటిల్లఁగఁజేయ నెంచునొ ♦ నిందితుం డది చెందలేఁ
డెవ్విధంబుగ శక్తిపాతము♦పీష్ఠయోగము లేక తా
నివ్వసుంధర తత్త్వతత్త్వము ♦ లెల్లఁ దద్గతి శుద్ధులౌ. 306

సీ॥ శక్తియనశివాజ్ఞ ♦ చిద్రూప పరమేశి, యెద్దానశివుఁడొందు ♦ నీయఖిలము
దానిచేతవికార ♦ మూనఁడాయఖిలేశు, డదియునాశివునందు ♦ నడఁగియుండు
లేదుబంధంబును ♦ లేదుమోక్షంబును, బరమశివునకునె ♦ ప్పట్లనేని
బంధమోక్షవిధాత్రి ♦ బహుభాగ్యపరశక్తి, అవ్యభిచారిణి ♦ హరునకిద్ది.

గీ॥ అగుసమానధర్మిణియునా ♦ యావిశేష, భావములచేత నీ పెచేఁ♦బరమశివుఁడు
గృహియగునుదద్విధంబుగ♦గృహిణియగును, శక్తిశివుచేత జగముత♦త్సంతతియగు.

వ. కావున.

గీ॥ ఆశివుఁడు కర్తకరణమా♦యాదిదేవి, వారలకు భేదమద్వయ ♦ వస్థితంబు
శివుఁడు తానొక్కరుఁడెయిట్లు♦ద్వివిధముగను, స్త్రీపురుష భావమునఁనుండు♦సిద్ధమిద్ది

క॥ శివునకు సమవాయినియై, శివవెలయు నభిన్నయగుచుఁ ♦ జిదూ౯పిణితా
రవియందుఁబ్రభ తెఱంగున, వ్యవస్థితి యిదనిరి కతిపయ♦బుధవశేణ్యుల్. 322
ఆ॥ అందుచేశివుండె♦యఖిలమునకు హేతు,వామహేశ్వరియుఁద♦దాజ్ఞ యాపె
చేతఁబ్రేరిత యయి♦చెలఁగునిట్టులశైవి, మూలప్రకృతిమాయ ♦ భూరిమాయ.
క॥ త్రిగుణయయిమూడు విధములఁ, దగుకార్య విభేదములను ♦ తానషడధ్వల్
జగము రచించునెఱుంగుఁడు, జగమిది వాగర్థమయము ♦ షడ్విధమధ్వ 324
వ. ఇట్లు షడధ్వరూపంబగు జగంబునెఱుంగుఁడిద్దాని విస్తరంబశేషంబు శాస్త్ర జాతంబెఱింగించు ననుడు మునులుసంతుష్టులై దేవా! మున్నుపమన్యు మునీంద్రుండు శ్రీకృష్ణునకు శైవదీక్షయొసంగిన పిదప శివతత్త్వరహస్యంబఖిలంబును జెప్పెనని వినుదుము. 325
గీ॥ ఎట్టులుపమన్యుమౌని మ♦హేశతత్త్వ, మాహరికిఁజెప్పె నెఱిఁగింపు♦మయ్యమాకు
పాశుపతమగు జ్ఞానమే♦వగిదినుండు, శివుఁడు పశుపతియెటులయ్యె♦సేవ్యమూర్తి!
వ. యనియడిగిరని సూతుండుచెప్పిన శౌనకాదు లాపలియుదంతంబుఁజెప్పుమనుటయు.
క॥ కుసుమశరాంతకపూజా, ప్రసక్తబసవార్యసహజ! ♦ బహుశిష్యసము
ల్లసదర్చనాభిరామా! ఘనసరోరుహా! బుధజనాభి♦గీతచరిత్రా! 328

గద్య. ఇది శ్రీ బుధజనవిధేయ ముదిగొండ నాగవీరేశ్వరనామధేయ
ప్రణీతంబైన శివపురాణంబందలి వాయువీయఖండంబునందు
ప్రథమాశ్వాసము సర్వము సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ





శ్రీ శివాభ్యాన్నమః

# శ్రీ శివపురాణము

## వాయవీయ ఖండము

### ద్వితీయాశ్వాసము



శివలింగసమర్చా
కౌశల్యాయతసమూర్తి! ఘనకారుణ్యా
వేశమనోవర్తి! యా
త్మేశ మహావ్రతవిధానహిత! లక్ష్మ్యంబా!

వ. అవధరింపు మక్కథకుండు శౌనకాదుల కిట్లనియె నంత మహాబలుండు నైమిశ
మునులకు వక్ష్యమాణ ప్రకారంబుగఁ జెప్పఁదొడంగె. 2

గీ॥ ప్రబలసంసారచక్ర విభ్రమణ హేతు,వునకు గౌరీఘన స్తనాభోగలిప్త
సురభికస్తూరిగంధ విస్ఫురితవక్షు,నకును బ్రహ్మాండ విభునకు నతులొనర్తు. 3

వ. అనియిట్లు మంగళంబొనరించి యిట్లనియె.

క॥ మును శ్రీకంఠుఁడు మందర,మను పర్వతశిఖరమందు నార్యకుఁ దాఁజె
ప్పిన పాశుపత జ్ఞానం,బును కృష్ణునకెఱుఁగఁజెప్పె మునివరుఁ డెలమిన్. 4

క॥ అదిమీకెఱుఁగఁగఁ జెప్పెద, సదయున నుపమన్యుమునికి జలజాక్షుఁడు వం
దనమునొనరించి ప్రశ్రియ, మునని ట్టులఁబల్కె వినుఁడు మునికుల తిలకుల్!

చ॥ మునికుల సార్వభౌమ! మును ముగ్ధశశాంకధరుండు భూమి భృ
త్తనయకు నాదిశక్తికి ముదంబున మందరశైలమందుఁ జె
ల్పిన ఘనమౌ విభూతియును వేద్య ముపాశుపతంబు జ్ఞానమి
ష్టనువుగఁ దెల్పునాకు వితతాయతదుఃఖతమంబు లింకఁగన్. 6

వ. అనుటయు మునీంద్రుండు సంతుష్టుండై మనంబందు మహాదేవీమహాదేవులకుఁ
బ్రణమిల్లి యిట్లనియె.

—* ఉపమన్యుముని శ్రీకృష్ణునకు శివమహత్త్వంబుఁ జెప్పుట *—

గీ॥ కమలజాదులు స్థావరాం♦తములు శర్వ, నకుఁ బశువులై పరంగుదు♦రీశమహేశుఁ
డతఁడు పతియగుట వీనికి♦నఖిలజగము, లందుఁ బశుపతియను నాఖ్య♦నందికొనియె.

మ॥ మలమాయాదిక పాశజాలముల సం♦బంధించు పశ్వావళిన్
గలయన్ జూచి ప్రపత్తిమైఁ గొలుచు భ♦క్తశ్రేణికిన్ మోక్షమున్
సలుపున్ లీలగ శర్వుఁడిత్యాదియునున్ ♦ నాల్గైన తత్త్వంబులే
బలమౌ జీవనిబంధనంబులును నన్ ♦ బాశంబులై యొప్పెడున్. 9

గీ॥ ఇట్టి పాశంబులను నా మ♦హేశ్వరుండు, బ్రహ్మ మొదలు గ స్తంబంబు♦వఱకుఁ గలుగు
పశుల బంధించి చేయించు♦స్వకముకార్య, మనవరతమిది తెలియు ప♦ద్మాక్ష ! నీవు

క॥ ఇఁక నమ్మహేశునానతిఁ, బ్రకృతియుఁ బురుషోచితమతిఁ ♦ బ్రసవించును మా
రక నదహంకృతి నదియుఁ బ,దొకఁడగు నింద్రియనిచయము♦ను త్పాదించున్ 11

గీ॥ మఱియుఁ దన్మాత్రపంచకం♦బు రహిసల్పు, నల్ల తన్మాత్రలొనరించు ♦ నభవునాజ్ఞ
నానుపూర్విగఁ దామెయా♦యఖిలభూరి, భూతముల నవ్విబ్రహ్మాది♦ములరచించు.

వ. ఇఁక.

ఆ॥ బుద్ధి నిశ్చయమును ♦ బొనరించు నాయహం,కృతి యహమ్మతిని నొ♦గిన్ రచించు
చిత్తమెపుడు భావ ♦ సిద్ధినిగూర్చు సం, కల్పములనుసల్పుఁ ♦ గాదె మనము 14

సీ॥ వేర్వేరుశబ్దాది ♦ విషయములఁగొను శ్రో,త్రాదీంద్రియములు ♦ శర్వాజ్ఞచేత
అటులె వాగాదీంద్రి ♦ యములీశ్వరాజ్ఞచేఁ, దమతనుకర్మంబ ♦ లమరఁ జేయు
శబ్దాదికంబులు ♦ శంభ్వాజ్ఞ గ్రహియింపఁ, బడు వచనాది స♦ల్పబడునట్లె
ఆకాశము శివాజ్ఞ ♦ నవకాశమిడునట్లె, బహిరంతరంబులఁ ♦ బవనుఁడొనరు

గీ॥ ఆహరుని యాజ్ఞచేతహు♦తాశనుండు, హవ్యము సుపర్వులకును గ♦వ్యాశులకును
గవ్యము వహించి యొసఁగు పా♦కంబుమున్న, గాఁగలుగువానిసల్పుసు♦ఖంబుగాను.

చ॥ సలిలము లీశ్వరాజ్ఞ మెయిఁ♦జక్కఁగ జీవనమున్ రచించు నీ
యిలయు జగంబు మోయుఁ బర♦మేశ్వరునానతి శేషుఁడట్లెని
శ్చలుఁడయి సర్వలోకముల ♦ సంతతమున్ వహియించుచుండు నా
బలరిపుముఖ్యులా శివుని ♦ పన్పున నేలుదు రెల్లలోకముల్. 15

గీ॥ హరుని శాసనమునఁ జతు♦రాననుండు, జగములసృజించు హరియుర♦క్షణమొనర్చు
నట్లె రుద్రుండు సమయించు♦నఖిలభువన, జాలములనెల్లఁ దెలియుము♦జలజనయన!

వ. మఱియును

క॥ కాలమురచించుజగములఁ, గాలమె యవ్వానిఁబెంచుఁ ♦ గాలమెత్రుంచున్
కాలమె సర్వముఁగూర్చును, గాలహరునిశాసనమునఁ ♦ గాంచుముకృష్ణా! 17

క॥ దివిభానుఁడు వెల్గుచు శాం, భవశాసనమునఁ బ్రబోధ ♦ వర్షము నొసఁగున్
గువలయబాంధవుఁడట్లే, కువలయసస్యములఁ బెంచుఁ♦గూర్చున్ ముదమున్ 18

వ. మఱియు నాదిత్యులు వసువులురుద్రులాశ్వినులు మరుత్తులు ఋషులు సిద్ధులు గంధర్వయక్షరక్షో విద్యాధరగణంబు లప్సరోగణంబులు కిన్నరులు నరులు పన్నగవ్రాతంబులు పశుపక్షికీటవ్రాతంబులు నదులు సముద్రంబులువారిధరంబులు జ్యోతిర్విమానంబులు శైలంబులు వృక్షలతాగుల్మంబులతోఁ గూడిన కాననంబులు జలచరోత్కరంతో నమరిన సరోవరంబులు సాంగవేదంబులు శాస్త్రంబులు మంత్రంబులు సోమయజ్ఞాదులు కాలాగ్ని ముఖ్యంబులును శివాంతంబులు నగు భువనంబుల సంఖ్యాకంబులగుబ్రహ్మాండంబు లవ్వానియావరణంబులు భూత భవిష్యద్వర్తమానకాలంబులు మఱియుఁ గాలభేదంబులు కళాదులు నిఁకనీ జగంబందుఁ గన్పడునట్టిదియు వినఁబడునట్టిదియు స్థిరమైనట్టిదియుఁ జరమైనట్టిదియు చిద్విశిష్టంబు నచిద్విశిష్టంబునైన యత్కించిత్పదార్థమది సర్వంబును శివాధిష్ఠితంబుగ నెఱుంగవలయును. 19

— * శ్రీకృష్ణున కుపమన్యుముని పంచబ్రహ్మతత్త్వంబుఁ జెప్పుట * —

గీ॥ అరయు! శ్రీకృష్ణ! శివపర ♦ మాత్మ నిజతనువుల నీజగమంతయు♦నున్ జరాచ
రంబు వ్యాప్తంబుగాను స♦ర్వమగుజగము, నామహేశుం డధిష్ఠించె♦నాత్మతనుల.

క॥ ఆవిభునకుఁ బరశివునకుఁ, నావిష్కృతమూర్తులెఱుఁగు ♦ మరవిందభవుం
డావిష్ణుండును రుద్రుం, డావిశ్వేశ్వర సదాశి♦వాహ్వయులు హరీ! 21

గీ॥ పంచబ్రహ్మసమాఖ్యముల్ ♦ పరమశివత
నువులు మఱియైదుగలవు వి♦నుము క్రమముగ
అల్ల ఈశానపురుషంబు ♦ లాయఘోర
వామసద్యోజములు నాగ ♦ వాసుదేవ! 22

క॥ అందీశానతనువు మొద, టందనరు గరిష్ఠమగుచు ♦ రవణిల్లెడు నిం
కందాబ్రకృతికి భోక్త య, నందగు క్షేత్రజ్ఞునందు ♦ నధ్యక్షించున్. 23

గీ॥ భువననాథు తత్పురుషాఖ్య ♦ మూర్తి భోగ్య
మును గుణాశ్రయాత్మకమునై ♦ పొదలుచున్న
యట్టి యవ్యక్తమందుఁ దా ♦ నధివసించు
దేవకీసతి గర్భశు♦క్తిఫలమూర్తి! 24

సీ॥ భోగిభూషునఘోరాఖ్య♦మూర్తి మిగుల
పూజ్య ధర్మాదికాష్టాంగ ♦ బుద్ధితత్త్వ
మును నధిష్ఠించియుండుఁ బెం ♦ పౌనర నరయు
యదుకులక్షీరసింధుహి♦మాంశుమూర్తి! 25

గీ॥ ఆ మహాదేవు వామదే♦వాఖ్యమూర్తి, యలయహంకారమందుఁదా ♦ నధివసించి
యుండునని వేదవిద్వదు♦ద్దండులందు, రిట్లెఱుంగుము నీమది♦నిద్ధహృదయ! 26

గీ॥ అమితవర్చస్కుఁడైన దే♦వాధినాథు, నల్లసద్యోజ నామధే♦యమగు మూర్తి
మానసంబునధిష్ఠించి ♦ జానుమీఱుఁ, దెలియుదురు మతిమంతులో♦తీరుకృష్ణ! 27

గీ॥ శ్రుతులకునువాక్కులకు శబ్ద♦తతికిగగన, మునకునున్ విభువీశాన♦మూర్తి యనుచు
ద్వక్కునకుఁ బాణికిన్ స్పర్శ♦వాయువులకు, నేతగాఁ దత్పురుషమూర్తి♦నీ వెఱుఁగుము.

గీ॥ అక్షిపదరూపములకును ♦ నగ్నికిని న, ఘోరమూర్తి యధిష్ఠాత ♦ గోపమూర్తి!.
రసనకుఁ బాయువునకును♦రసమునకుద, మునకు నావామదేవాఖ్య♦మూర్తి ప్రభువు.

గీ॥ ఘ్రాణమునకు నుపస్థకు ♦ గంధమునకు, భూమికిని నీశ సద్యోజ♦మూర్తి తాన
ఈశ్వరియగు నెఱుంగుమీ♦యేను శివుని, మూర్తు లర్చనీయంబులు♦బుధులకెల్ల.

—* ఉపమన్యుఁడు శ్రీకృష్ణున కష్టమూర్తితత్త్వం బెఱింగించుట *—

క॥ ఇఁకఁ గూడ శివుని మూర్త్య, ష్టకమయమీ సర్వవిశ్వ ♦ సముదాయంబా
సకలేశునందె జగము ల, వికలంబుగనుండు సూత్ర ♦ వేష్టితమణులై. 31

వ. శర్వుండు భవుండు రుద్రుం డుగ్రుండు భీముండు పశుపతి యీశానుండు మహా
దేవుండు ననువార లష్టమూర్తులుగ విశ్రుతులు. భూమ్యుదకాగ్ని మరుదాకాశ
క్షేత్రజ్ఞరవిచంద్రులు మహేశ్వరుని శర్వాదిమూర్తులచే నధిష్ఠితులు. 32

క॥ వినుము చరాచరవిశ్వం, బునునంత ధరించు పృథివి ♦ పురుషోత్తమ! శం
భుని యలశర్వునిమూర్తియె, యనియామ్నాయముల నిశ్చ♦యంబిదియరయన్.

గీ॥ జగములకు జీవనంబైన ♦ సలిలమెల్ల, శివుని భవమూర్తిగా నెంచు ♦ శ్రీసహాయ!
జగము బహిరంతరంబులఁ♦జక్కనిండి, యలరు తేజము శివునిరు♦ద్రాఖ్యమూర్తి.

క॥ కదలింపుచు విశ్వంబును, గదలుచు ధరియించుచుండు ♦ గంధవహుండు శ
క్తిదయితుని యుగ్రమూర్తిగ, యదువంశోద్భూతమౌక్తి♦కా! యరయుమదిన్.

గీ॥ సర్వమున కవకాశంబొ ♦ సఁగుచు సర్వ, మందు వ్యాపించియును భూత♦బృందభేది
కయయి రాజిల్లుచుండునా♦కసము హరుని, భీమమూర్తిగఁ దెలియుము♦బిసరుహాక్ష!

క॥ సర్వాత్మాధిష్ఠాతయు, సర్వక్షేత్రతలవర్తి ♦ చక్కనరయుమా!
శర్వుని పశుపతి మూర్తియె, సర్వపశుల పాశములను ♦ సంఛేదించున్. 37

గీ॥ దివ్యమూర్తి జగములకుఁ♦దెల్పుదీప్తి, జక్కనిదు రవి శివుని యీ♦శానమూర్తి
అఖిలవిశ్వంబునకునునా♦ప్యాయ మొసఁగు, శశిమహాదేవమూర్తియే♦శౌరియరయు!
గీ॥ ఇట్లు మూర్త్యష్టకంబున ♦ నీజగములు, సర్వములునిండి వెలసెడు ♦ శంకరుండు
ఆ శివునిఁగొల్వ జగముల♦కమరువృద్ధి, శాఖిమూలసేకంబున ♦ శాఖలెసఁగు. 39
క॥ సర్వాభయప్రదానము, శర్వానుగ్రహణమును ♦ బ్రశస్తచరిత్రా!
సర్వోపకారకరణము, శర్వార్చనమనుచుఁ దెలియు ♦ స్వాంతములోనన్. 40
గీ॥ పితకుఁ బుత్త్రపౌత్త్రాది సం♦ప్రీతియెటులఁ, బ్రీతికరమౌ యటుల్ జగ♦త్ప్రీతిశివునిఁ
బ్రీతుఁ జేయు నెవ్వని కేని ♦ బీడసేయ, శంకరునకగుఁ బీడ సం♦శయము లేదు. 41
వ. అని యుపదేశించిన విని మరలఁ బురుషోత్తముఁ డిట్లడిగె.
క॥ దేవా! మూర్త్యష్టకమున, నీవిశ్వము సర్వమిట్టు ♦ లీశ్వరమయమై
తా వెలయఁగ స్త్రీపురుష, భావాత్మంబెట్లు హేతు♦భావము నొందెన్. 43
వ. అని యడుగుడు గురుం డిట్లనియె.

—* శివశక్తి సమాన ధర్మకథనము *—

క॥ శక్తి మహాదేవి యెయ్యిఁక, శక్తియుతుఁడు శివుఁడు దేవ♦చక్రేశ్వరుఁడా
శక్తి శివభూతిలేశమె, నక్తంచరహర! జగద్గ ♦ ణం బఖిలమునన్. 44
గీ॥ అరయు మొక్కింత చిద్రూప♦మైన వస్తు, వట్ల చిద్రూపమొక్కింత♦యైనవస్తు
వదియు శుద్ధమశుద్ధము♦నపరమును బరమును శివశక్తిమయము స♦ర్వమిది చక్రి!
గీ॥ శౌరి! చిచ్ఛక్తి మెదియచి♦చ్ఛక్తియుతము, నగుచు సంసృతినొందున♦య్యది యెశుద్ధ
మది యె యపరంబు తదితరం♦బైనయద్ది, పరమనుచు నీవెఱుంగుము ♦ భావమందు.
గీ॥ చిదచిదాత్మకమీద్వయి ♦ శ్రీకళత్ర! శివునియొక్కయు శివయొక్క♦శ్రీఘనంప్ర
స్వాత్మ్యముగను దదీయని♦సర్గజముగ, దెలియు మంతరంగంబునఁ♦ దేటపడును.
క॥ వశమగు విశ్వము శివులకు, వశులు శివుల్గారు విశ్వ ♦ వలయమునకటుల్
కుశల! జగమీశితవ్యము, విశదంబిది తెలియు శివులు ♦ విశ్వేశానుల్. 48
క॥ శివుఁడెట్లో శివ యట్లే, శివయెట్లో శివుఁడునట్లె ♦ సిద్ధంబిదియా
కువలయ రాజ్యాముదులకు, నవిరళ యోగంబెకాక ♦ యంతరమెట్లో. 49
గీ॥ చంద్రిక వినాగ మెరయఁడు ♦ చందురుండు
శివుఁడు శక్తివినాయున్న ♦ శ్రీలఁగవఁడు
ప్రభవినా భానుఁ డెపుడు సం ♦ భవము నొందఁ
డా ప్రభయు భానుని వినాగ ♦ నమరదరయ. 50
వ. ఇట్లు శక్తి శక్తిమంతుల సంస్థితి పరస్పరాపేక్షంబై యొనరుచుండు. 51

క॥ శక్తి శివుఁ బాసియొనరదు, శక్తిని బాసి శివుఁడొనరఁ ♦ జాలఁడు వినుమా
శక్తుఁడగు శివుఁడు శక్తిని, భుక్తిని ముక్తినిడు భక్త ♦ పుంజంబులకున్. 52

గీ॥ ఆద్యపర చిన్మయియును శి♦వాశ్రియయును,ఆశివానుగుణయును శి♦వానుధర్మ
యనుబ్రిసద్ధర్మిణియునయి♦యొప్పుశక్తి, విశ్వమునొనర్చునుశివేచ్ఛ♦వివిధగతుల.

—* శక్తిమయ జగద్వర్ణనము *—

గీ॥ అట్టి మూలప్రకృతి మాయ♦యైన శక్తి, త్రిగుణయై త్రివిధంబుగఁ ♦ దేజరిల్లు
నాపెచేతనె యీవిశ్వ♦మంతనిండు, నాపెచే విశ్వమిది విప ♦ ర్యస్తమగును. 54

గీ॥ తానయేకవిధయు ద్వివి♦ధయును త్రివిధ, దశవిధయు శతవిధ శత♦దశవిధయును
నగుచుఁ బెక్కురుశక్తులై ♦వ్యవహరించు, విశ్వమందిట్లు దెలియు సం♦విన్మయాత్మ!

గీ॥ ఆదిసర్గమందాశక్తి ♦ యలశివేచ్ఛఁ, బరమశివతత్త్వమందైక్య ♦ భావమొంది
విస్ఫురించుచునుండు బల్ ♦విందుమీఱఁ, దిలలయందెట్లు తైలంబు ♦ తేజరిలునో.

గీ॥ శక్తిమంతునిచే శక్తి ♦ జనితమైన, ఆక్రియాశక్తి విక్షోభ ♦ మందనంత
నాదము సముద్భవంబయ్యె♦నాదమునను, బిందువాబిందువున నుద్భ♦వించెశివుఁడు.

క॥ ఆయతనులుచే మహేశ్వరుఁ, డాయనచే శుద్ధవిద్య ♦ యది జన్మించెన్
ఆయనువాక్కులకీశ్వరి, యై యలవాగీశరాజ్ఞి ♦ యై చెలువొందెన్. 58

వ, ఆ వాగీశ్వరియే వర్ణస్వరూపంబుచేత మాతృకయని వ్యవహరింపఁబడును.

గీ॥ అంత విను యదునాథ! య ♦ నంతయోగ
మునను నమ్మాయ దాఁ గాల ♦ మును గలను ని
యతిని విద్యను రాగంబు ♦ నాక్రమమునఁ
బూరుషులను నిర్మించెబల్ ♦ పొంకముగను. 60

గీ॥ తిరుగ నామాయచేతనే ♦ త్రిగుణరూప, మైన యవ్యక్తమొదవె న♦ద్దానఁద్రిగుణ
ములు విభక్తంబులై జగం♦బునను సత్త్వ,మును రజంబుతమంబునాఁ♦దనరెనిండి.

గీ॥ క్షోభ్యమాణత్రిగుణముల ♦ గుణపతులయి, బ్రహ్మవిష్ణురుద్రాఖ్యులు ♦ పరఁగిరంత
నాత్రిమూర్తులువారిచే♦నమ్మహత్తు, మున్నుగలతత్త్వములుగ్రమ♦మ్ముగనుబొడమె.

వ. శివాజ్ఞచే నవ్వానిచేత నసంఖ్యాకంబులగు నండపిండంబులుద్భవించె. అవ్వి చక్ర వర్తులగు ననంతాది విద్యేశ్వరులచే నధిష్ఠితంబులై యుండు. ఇఁక శరీరాంతర భేదంబున స్థూలసూక్ష్మంబులననుసరించి నానారూపలగు శక్తులయొక్క భేదంబులు కీర్తితంబులయ్యె. త్రిమూర్తులందాశక్తి త్రిశక్తిస్వరూపిణియగు. సర్వ విశ్వంబు శక్త్యాత్మకంబు శక్తిభరితంబు. దేహంబెట్లు లంతరాత్మతో వెలయునట్లే ఈ స్థావరజంగమంబగు నఖిలజగంబు శక్తిమయంబుగ నెఱుంగుము. పరమాత్మ కలచే నీ పరమశక్తి నిరూపింపఁబడినది. 63

గీ॥ ఈశ్వరేచ్ఛానుయాయిని • యిదియెపరమ, శక్తి యిద్దిచరాచర • జగమునెల్లం
జక్కనిచ్ఛాక్రియాజ్ఞాన•శక్తులనెడు, నాత్మశక్తులచేఁజేయు • నబ్జనాభ! 64

గీ॥ శక్తిమంతుఁడీశ్వరుఁడు వి•శ్వంబునెల్ల, నిండియుండునుదా నెప్డు • నీరజాక్ష!
ఇద్దియిట్టులనిట్టుకా • దద్దియనెడు, నదియెశివుని యిచ్ఛాశక్తి • యదెనియంతి,

గీ॥ జ్ఞానశక్తియై తత్కార్య•సాధకములు, కరణకారణములును జొ•క్కమగుబుద్ధి
ఇఁక(గ్రియాశక్తి యాప్రితం•బెట్టులట్లు, జగమునన్ సర్వకార్యముల్ •సరగఁదీర్చు.

గీ॥ పరిసవధర్మిణిశక్తి యా•సకలజగము, నిట్లువిరచించు శివుఁడుదా • నిట్లుశక్తి
యోగమునశక్తిమంతుఁడై •యొప్పువిశ్వ, మిట్లుశైవంబుశాక్తమై•యొసఁగువినుము.

క॥ తలిదండ్రిలేకకొమరుఁడు, పోలుచునె విశ్వమున శివశి•వుఁడును వినాతా
వెలయునెటుల్ చరమచరమ, ఖిలవిశ్వము నీవెఱుఁగుము • గిరిశీకృష్ణా! 68

——* పార్వతీపరమేశ్వరాత్మక స్త్రీపుంస స్వరూప నిరూపణము *——

క॥ స్త్రీపుంసప్రభవంబును, స్త్రీపుంసాత్మకముస్నైన • త్రిభువనమెల్లన్
స్త్రీపుంసాధిష్ఠితమును, స్త్రీపుంస విభూతియనుచుఁ • దెలియుము కృష్ణా! 69

క॥ పరమాత్మ శివుఁడుశివయును, బరమాత్మ శివుఁడుసదా శి•వప్రధనమరున్
హరి! శివతానవమనోన్మని, యరయుమహేశ్వరుఁడు శివుఁడె•యలమాయశివె.

సీ॥ రుద్రుఁడుశివుఁడుదా • రుద్రాణిశివయగు, హరి శివుం డా శివ•యగునులక్ష్మి
బ్రహ్మయేశివమూర్తి • బ్రహ్మాణిశివతానె, భానుండుశివుఁడు శి•వయెప్రభయగు
ఇంద్రుండుశివుఁడుదా • నింద్రాణియగుశివ, అగ్నిశివుండుస్వా • హాయెశివయగు
యముఁడెల్లశివుఁడు త•దవరోధమేశి,క్రవ్యాది శివుఁడు త•త్కాంతశివయె

గీ॥ వరుణుఁడుశివుండు వరుణాని • యరయుశివయె
గంధవహుఁడుశివుండు త•త్కాంత శివయె
రాజరాజుశివుండు త • ద్రాజ్ఞి శివయె
శివుఁడె యీశానుఁడాతని • చెలువశివయె. 71

క॥ శివుఁడేసోముఁడురోహిణి, శివయెయనంతుండుశివుఁడు • శివతత్సతియా
శివుఁడెల్ల పూరుషులుదా, శివయే భువనములలోని • స్త్రీలెల్లహరీ! 72

క॥ విషయంబాపరమేశ్వరి, విషయి మహేశ్వరుఁడు క్షేత్ర•వితతి శివయగున్
విషహరుఁడాక్షేత్రజ్ఞుఁడు, విషజాతనయన! యెఱుంగు • విదితమిదిమదిన్. 73

క॥ ద్రష్టవ్యవస్తువులునున్, స్ప్రష్టవ్యపదార్థములును • బరమేశ్వరియే
ద్రష్టయునున్ మఱియునిఁకా, స్ప్రష్టయుఁ బరమేశ్వరుండె • జలజాతాక్షా! 74

గీ॥ అరయుప్రాణస్థితియఖిలం•బాశివాని, ప్రాణమాశివుఁ డుత్ఫుల్ల•పద్మనేత్ర!
శబ్దజాలంబుసర్వమా•శంభురాజ్ఞి, అర్థమఖిలంబుదెలియు చం • ద్రార్ధమౌళి. 75

—* జగదంతర్భూత శివ విభూతి *—

వ. ఇఁక విశ్వమందలి పదార్థంబులలోని శక్తియుఁదేజంబు సర్వంబు మహేశ్వరీ మహేశ్వరులుగఁ దెలియుము. జగంబందుఁ బుణ్యంబైనదియుఁ బవిత్రంబైనదియు మంగళంబైనదియునగు నెల్లనుమామహేశ్వర తేజంబుగ నెఱుంగుము. మఱియు శ్రావ్యమంతవ్యబోధవ్యంబులు మున్నగునవి మహేశ్వరిగను శ్రోత్రయు మంతయు బోధయు మున్నగునట్టేఁడు మహేశ్వరుఁడుగ నెఱుంగుము. 76

క॥ శివ తా నిశ శంకరుఁడే, పవ లాకాశంబుశివుఁడు ♦ వసుమతిశివ సిం
ధువుశివుఁడు వేలయేశివ, భవుఁడుమహావృక్ష మాభ ♦ వానిలతయగున్. 77

క॥ దీపశిఖయెట్లుగృహమును, దీపింపఁగఁజేయునో య ♦ దేవిధమొప్పన్
దీపింపఁజేయుబూర్ణం, బౌపరమేశ్వరుల తేజ ♦ మఖిలజగంబున్. 78

క॥ సర్వాకారాత్మకులును, సర్వశ్రేయస్సమృద్ధి ♦ సంధాయకులౌ
శర్వుఁడుశర్వాణియునన్, సర్వజగత్పూజ్యులనుచు ♦ శౌరి! యరయుమా! 79

గీ॥ ఇట్లునాపరిజ్ఞశోలదిమ ♦ హేశ్వరులయు, ధార్థమగునాత్మవిధ ముప ♦ న్యాసమొనరఁ
జేసినాఁడనునీకిప్డు ♦ శివుల యాత్మ, వైభవంబింతయేకాద ♦ వాచ్యమరయు. 80

గీ॥ చెప్పఁటకుశక్యమెటులగు ♦ శివులయాత్మ, విభవముమహాపురుషమనో ♦ వీధులకుబ
హిర్గతంబయియేయుండు ♦ నీశ్వరైక, చిత్తులకనన్యులకు ♦ నదిచేతమొందు. 81

గీ॥ అట్లుతక్కినవారికే ♦ ప్పట్లనంద, దందిననునట్లుగాదు ప ♦ ద్మాక్ష! యిదియుఁ
బ్రాకృతివిభూతియిఁకనున ♦ ప్రాకృతియొప, రంబుగుహ్యంబుగుహ్యవి ♦ ద్రాజధనము.

గీ॥ మరలునెద్దానవాక్కులు ♦ మానసంబు, తోడనింద్రియవర్గంబు ♦ తోడఁగూడ
అద్దియప్రాకృతియుఁ బార ♦ మాత్మికయును, నైనయట్టివిభూతి శు ♦ ద్ధాత్మ! తెలియు.

క॥ అదియేపరమపుధామం, బదియేపరమమగుగతియు ♦ నదియేపరమా
స్పదమగుపరశివవిభవం, బదినొందయుంతురియోగు ♦ లాజితచిత్తుల్. 84

క॥ సంసారాశీవిషవిష, హింసాహరణౌషధము మ ♦ హేశవిభవమా
శంసార్హమెఱిఁగినట్టేఁడు, కంసాంతక! నెఱపదెట్టి ♦ కారణములచే. 85

గీ॥ ఇట్లుతెంగించితిని పరమేశ్వ ♦ రులయు, ధార్థమాత్మనిధమునీ ♦ వస్సుఁడవుమ
హేశ్వరాత్యంతభక్తుఁడ ♦ వెఱిఁగిమదిని, నీవునన్ దెల్పకు మభక్త ♦ నికరమునకు.

క॥ తెలిపెదు నెడనిలుబోలున, ఖలులకుభక్తులకు బోధఁ ♦ గావింపుము! యో
గ్యులకిది యుపదేశంబును, సలిపిననతఁడొందుశర్వ ♦ సాయుజ్యంబున్. 87

క॥ ఇది తెలియలేరుపశుల, జ్ఞులుపాశబలంబుఁజేసి ♦ సూత్మ్నమరయకే
యదునందన! శివునొక్కని, బనుగురుపదివిధములుగను ♦ వచియింతురొగిన్. 88

## —* శివధృత నానారూప వర్ణనము *—

గీ॥ హరి! పరబ్రహ్మరూపంబు♦పరమునపర, మగవిలసిలు ననాద్యంత♦మగు(దనరు(బ
రమని భూతేంద్రియాంతఃక♦రణప్రధాన, విషయరూపంబవరమని♦విశదముగను.

వ. పరమగు పరబ్రహ్మరూపంబు చిదాత్మకంబనాద్యంతంబు "బృహత్త్వాత్ బృంహణత్వాత్ పరం" బని విజ్ఞులు నిశ్చయించిరి. పరమపదంబగు నీరెండును బ్రహ్మణః పతియగు పరమేశ్వరునిరూపంబులే. 90

క॥ ఇ(కనునవిద్యావిద్యా, త్మకు(డీశ్వరు(డని కతిపయ ♦ తజ్జ్ఞులనుదు రీ
సకలప్రాణులువిద్యయు, సకలాచేతన మవిద్య ♦ శౌరి! యరయుమా! 91

వ. విద్యా విద్యాత్మకమగు విశ్వంబంతయు విశ్వగురునిరూపంబుగా విజ్ఞులు సెప్పుదురు విశ్వంబంతయు నీశ్వరునికి వశంబై యుండుటను—ఇ(క.

గీ॥ భ్రాంతివిద్యయు(బరమును ♦ బరమశివుని, రూపమంచువచింతురు ♦ రూఢి మెఱియ
అర్థముల నయథాబుద్ధి♦యగును భ్రాంతి, విద్యయొయథార్థసంవిత్తి♦వినుముకుంద!

వ. ఇ(క వికల్పరహితంబైనది పరంబుగా నెఱుంగుము. తదాజ్ఞాధిష్ఠితంబై జగంబు వెలయుటచేత మఱియును గొందఱీశ్వరుని సదసద్రూపు(డనియును సదసత్పతియని యును జెప్పుచున్నారు. ?4

గీ॥ సత్యమున సాధువందును♦సత్పురుషులు, పరగ సచ్ఛబ్దమునువాడు♦దురు తదితర
మందసచ్ఛబ్దమును నెప్డు ♦ వ్యాహరింతు, రిట్టి సదసజ్జగంబు మ♦హేశమూర్తి! 95

వ. ఇందుచే సదసద్రూపు(డనియు నిట్లే సదసజ్జగంబునకు( బతియౌట సదసత్పతి యును జెప్పుచున్నారు. 96

క॥ అవ్యక్తమునుసమష్టిగ, నావ్యక్తమువ్యష్టిగా(గ ♦ ననుశాసింతా
యవ్యక్తవ్యక్తములా, యవ్యయునకురూపములు త♦దాత్మానుస్మృతిన్. 97

వ. మఱియు నిద్దానికి శివుండేకారణంబగుట( గారణార్థవిదులు శివుని సమష్టివ్యష్టి కారణంబనియును జెప్పుచున్నారు. 99

గీ॥ అనెదరుప్రధానపూరుష ♦ వ్యక్తకాల, రూపు(డని మఱికొందఱా ♦ రుక్మభుజుని
బ్రకృతియె ప్రధానమగును తత్ ♦ జ్ఞు(డల్ల, పురుషు(డా వ్యక్తమిట్లాది ♦ మూడుచూ(డు.

వ. కాలము కార్యప్రపంచమునకు( బరిణామకారణము. ఈయన్నింటికీశ్వరు(డును ధాతయు( బ్రవర్తననివర్తకు(డును నావిర్భావతిరోభావహేతుండును నజుండును నగు వా(డొక్క(ండు పరమేశ్వరుండేయగుట( బ్రధానపూరుష వ్యక్తకాలస్వరూపు(డని యనుచున్నారు. మఱికొందఱు విరాట్టగు హిరణ్యగర్భుండనియు వేఱొక్క(రంతర్యామియనియును జెప్పుచున్నారిట్లనేకప్రకారంబుల నూహించివచింపుచు( బరమేశ్వరుని యాథాత్మ్యంబు నిశ్చయింపలేకున్నారు. 100

## —* శివప్రభావ ప్రతిపాదనము *—

గీ॥ కలుగ దాణవబంధంబు ♦ కార్మబంధ, మింకను మాయీయ బంధము ♦ ప్రకృతిబంధ
మల్ల బౌద్ధమౌ బంధము ♦ హంకృతిజము, బంధమును లేవు శివునకే ♦ బంధములును.

క॥ కాలముఁ గలయును విద్యయు, నీలగ్రీవునకు లేవు ♦ నియతియు రాగం
బేలాటి వగయు మఱియుఁ, నేలిప్సయు లేదు తెలియు ♦ మీ శునకుహరీ. 102

గీ॥ కనుము! సత్కర్మమును నస ♦ త్కర్మమును ద,దీయము విపాకమౌ మహా ♦ దేవునకిఁక
లేవు సుఖదుఃఖములు నట్లె ♦ లేవు తత్ఫలములు లే వెట్టి కాలభో ♦ గములు కృష్ణ! 103

క॥ హరి! శివునకుఁ గర్తయును, గరణంబును లేదు మొదలు ♦ గలుగదు తుదియున్
మఱి బాంధవుండు నుండం, డరియును విభుఁడును సముండు ♦ నధికుండరయన్. 104

క॥ జననము మరణము శివునకు, నొనరదు విధియును నిషేధ ♦ మొనరదు బంధం
బును మోక్షంబును నొనరదిఁ, కొనరద కల్యాణమెదియు ♦ నూహింపు మిటుల్. 106

వ. పరమశివుండగుట సకలకల్యాణంబులు స్వతస్సిద్ధంబులై యుండు.

మత్తకోకిల॥ ఈశితవ్యము నీ ప్రపంచము ♦ నెంతయేని ముదంబుతో
నీశులై చెలువొందు శక్తుల ♦ నెప్పుఁ గూడి యనాదియౌ
నీశుఁ డచ్యుత భావుఁ డొక్కరు ♦ డీసమస్తము నిండి ల
క్ష్మీశ! పాలనసేయుచుండు గ్ర ♦ హింపు! స్థాణుసమాఖ్యుడై. 107

గీ॥ పరశివాధిష్ఠితంబు వి ♦ శ్వంబు సకల, జంగమస్థావరంబిది ♦ శర్వరూప
మనుచు నెవ్వఁ డెఱుంగునో ♦ జనుఁడతండు, మోహమును జెందఁ డెప్పట్లఁ ♦ బురుషతిలక.

చ॥ పురుషుఁడు రుద్రుఁ డీశ్వరుఁడు ♦ భోగివిభూషణుఁ డద్రిజేశుడున్
బరుఁడు పినాకపాణి వృష ♦ వాహనుఁడున్ భగవానుఁ డాద్యుఁ డా
యరుణుఁడు కృష్ణపింగలుఁడ ♦ నంతుఁడు సౌమ్యుఁడు ఘోరమూర్తియ
క్షరుఁడు హిరణ్యకేశుఁడును ♦ స్వర్ణభుజుండు శివుండు చూడుమా. 109

క॥ ఆ పురుషవిశేషుండును, నాపరమశివుండు నంత ♦ కాంతకుఁడును సౌ
నాపరమ పరముఁ డీస,ర్వోపరివర్తి యని యెఱుఁగు ♦ మున్నతచరితా. 110

శా॥ వాలాగ్రకృతిమాత్రుఁడై వెలయు హృ ♦ త్పద్మంబు మధ్యంబునం
బాలోకేశ్వరుఁ డా జగన్మయుఁడు ప ♦ ద్మాక్షుండు తాముగ్రుండునున్
నీలగ్రీవుఁడునై చరించు నితఁడే ♦ నిత్యుండు భావంబునం
దీలీలాధరు నీహరున్ దెలియలే ♦ వేలాటి మోహంబులున్. 111

వ. ప్రతిసర్గప్రసూతులును గాలావచ్ఛేదవర్తులునగు బ్రహ్మలకెల్ల నీతఁడే యామ్నా
యపాఠంబు నుపదేశించు. మఱియు గాలావచ్ఛేదయుక్తులగు గురులకెల్ల నీతండే
గురుఁడీశ్వరుండు కాలావచ్ఛేదవర్జితుండు. 112

॥ అతనిసిద్ధిస్వాభావికి ♦ యతనిశక్తి, దెలియుసర్వాతిశాయిని ♦ దివ్యమూర్తి !
అప్రతిమముజ్ఞానంబు దే♦హంబునిత్య, మును విశుద్ధమైశ్వర్యమో♦యనితరంబు.

॥ మఱియుఁ దేజమువీర్యం, బరయుప్రభానంబుక్షమయు ♦ నలకరుణయునుఁ
సరిలేనివనుచుమనమున, నెఱుఁగుముశివునందుసతత ♦ మిద్ధవిచారా ! 114

॥ అనఘ ! పరిపూర్ణుఁడా శ,ర్వునకీసర్గాదులనునె ♦ పుడు నెట్టిప్రయో
జనమది లేదన్నియునో, పసులకితెరులఁగలకృపయె ♦ ఫలమరయంగన్. 115

॥ అట్టిదేవుండుశివవర ♦ మాత్మయతని, వాచకముప్రణవంబు శి♦వభవరుద్ర
శబ్దములలోనమిగులు వా♦చకముప్రణవ, మాప్రణవజపమున నెక్కు♦డగునుసిద్ధి.

॥ అక్కుతనఁజెప్పుదురుబుధు, లక్కమలచంద్రధరుని ♦ నఖిలగురుని దా
మొక్కయక్కరవువేల్పని, యొక్కటి శబ్దార్థములని ♦ యూహింపుమిటుల్. 117

వ. ఈప్రణవంబునకు నాల్గుమాత్రలలరు అకారంబు ఉకారంబు మకారంబు నాదంబు అకారంబుమహాబీజంబు రజంబు స్రష్టయగు చతుర్ముఖుండు ఉకారంబు సత్త్వగుణంబు ప్రకృతి యోని పాలయిత విష్ణుండు మకారంబుపురుషుండుబీజంబు తమస్సుసంహారకుఁడుహరుండు నాదముపరమపురుషుండీశ్వరుండు నిర్గుణుండు నిష్క్రియుండుశివుండు ఇట్లీశ్వరుండు మూఁడుమాత్రలచేతఁ ద్రివిధంబుగఁ బ్రతిపాదించి యర్ధమాత్రముచేత స్వకీయంబగు శివాత్మమును బోధించుచున్నాఁడు. అకారము ఋగ్వేదంబుగ ఉకారంబు యజుర్వేదంబుగ మకారంబు సామవేదంబుగ నాదంబాథర్వణవేదంబుగఁ జెప్పఁబడినది. 118

ఉ॥ ఎవ్వఁడుసర్వభావముల ♦ నీశ్వరునందుఁబ్రపన్నుఁడో దృఢం
బవ్విభునామహేశ్వరున ♦ యత్నముగాఁబడయంగఁ జాలువాఁ
డెవ్వఁడుశంకరున్ గవి మ♦హేశ్వరు నెఱుఁడో బద్ధపాశుఁడై
యవ్వెడ గుగ్రదుఃఖభవ ♦ మందు భ్రమించును జక్రనేమినై. 119

క॥ ఎవఁడుగను రుక్మవర్ణుని, గవినిజగత్కారుబ్రహ్మ ♦ కారణుఁబురుషున్
సువిదితుఁడావిద్వాంసుఁడు, భవములనెడఁబాసిచెందుఁ ♦ బరమపదంబున్. 120

గీ॥ ఆవిరూపాక్షుశక్తిస్వా ♦ భావికియును, విద్య విశ్వవిలక్షణ ♦ వివిధరూప
ములనుబెక్కులనొంది యం♦భోజబంధు, భాయనన్ దగిభాసిల్లు ♦ బద్మనయన !

గీ॥ అట్టిశక్తికిశక్తుల ♦ నంతలుందు, రిచ్ఛజ్ఞానంబుక్రియయు నా♦నెసఁగువార
లల్లమాయాదికలునుహ ♦ వ్యవహునందు, విస్ఫులింగంబులట్టుల ♦ విశ్వమందు.

క॥ పురుషులుసదాశివాద్యులు, మఱియునువిద్యేశ్వరాది ♦ మహితులునట్లే
॥రమలరుదురవ్వారికి, బరాత్పరయుప్రకృతి శక్తి ♦ భాసిలుసతమున్. 123

గీ॥ వినుము! మహదాదితత్త్వంబు♦లును నజాది
మూర్తులును నవ్యమును సర్వ♦మునునుశక్తి
కార్యమాశంక లేదు సూ♦క్ష్మయుఁబ్రబోధ
రూప సర్వగయానంద♦రూప యాపె. 124

క॥ శివుఁడరయుశక్తిమంతుఁడు, శివుఁడిఁక వేద్యమగు నెప్డు ♦ శివవిద్యయగుకా
శివయే శ్రుతియును స్మృతియును, శివయే ప్రజ్ఞయునునాజ్ఞ ♦ శివస్థితిధృతియున్.

చ॥ శివుఁడిటు సర్వకర్తయయి ♦ చెన్నెసలారునో విశ్వకోటికా
శివయును సర్వకర్త్రియయి ♦ చెన్నెసలారునటుల్ సతంబిఁకీ
కపకు వియుక్తియుండదు సు ♦ గంధము పద్మముఁ బాయనట్లు స
త్కవి నమృతో క్తిపీడనిప్ర ♦ కారమెఱుంగు! రమామనోహరా! 126

గీ॥ ప్రకృతియలమాయ జీవుఁడు♦వికృతియట్లు, సర్వమగుసదసత్తులా ♦ శక్తితతము
లామహాదేవిమాయమో♦హమ్మునఁగూర్చు, మోక్షమిడు లీలచేసర్వ♦భువనములకు.

వ. సర్వేశుండీపెతోఁగూడి సప్తవింశత్ప్రకారంబుగ విశ్వంబువ్యాపించియుండు నాతని
వలన మోక్షంబుప్రవర్తిల్లు. మున్నొకప్పుడు ముముక్షులగుకొందఱు మునులు
బ్రహ్మమునుగూర్చి సంశయావిష్టహృదయులై యిట్లు విమర్శించిరి. 128

— * ఉపమన్యుఁడు కృష్ణునకు జగత్కారకునిగూర్చి చెప్పుట * —

గీ॥ ఎద్ది కారణమగుబ్రహ్మ♦మెందువలన, బుట్టినారమిఁ కెద్దానఁ ♦ బోషితులము
ఎందునున్నారమిట్టుల ♦ నీసుఖ తది,తరములందు వర్తింతుము ♦ తవిలిసతము.

గీ॥ కాలమొ స్వభావమొకొ ♦ యక్కడిఁదినియతి
యో యదృచ్ఛయో భూతంబు♦లో ప్రకృతియొ
పురుషుఁడో వీనిసంయోగ♦మో యరయఁగఁ
గారణము తాను జడము లె♦క్కడనుగాని. 130

క॥ పూరుషుఁడు సుఖియుదుఃఖియు,గారణమగునొక్క విభుఁడు♦గానియతఁడిటుల్
సారెకుఁ బరస్పరంబు వి,చారణ యొనరించి ధ్యాన ♦ సంగతినంతన్. 131

గీ॥ అపుడు నూచిరి మునులు దే♦వాత్మశక్తి, నీశ్వరినిఁ ద్రిగుణంబుల♦నెంతయునుని
గూఢమగుదానిఁ బాశంబుఁ♦గుశలగతినిఁ, ద్రెంచుదాని వివేకంబుఁ♦బెంచుదాని.

గీ॥ ఆపెచే భిన్నపాశులై ♦ యచ్ఛదృష్టి, సర్వకారణకారణు ♦ శక్తిమంతు
నమ్మహాదేవుఁ బొడఁగని♦రప్రమేయు, నేకతేజమై యెల్లెడ♦నెసఁగువాని. 133

వ. అద్దేవుని ప్రసాదయోగంబునఁ బరమంబగు యోగంబునను దృఢంబగు భక్తి
యోగంబునను దివ్యపదంబు నొందిరందున. 134

గీ॥ అతనిసిద్ధిస్వాభావికి • యతనిశక్తి, దెలియుసర్వాతిశాయిని • దివ్యమూర్తి !
అప్రతిమమజ్ఞానంబు దే•హంబునిత్య, మును విశుద్ధమైశ్వర్యమో•యనితరంబు.

క॥ మఱియుఁ దేజమువీర్యం, బరయుప్రభావంబుక్షమయు • నలకరుణయునుఁ
సరిలేనివనుచుమనమున, నెఱుఁగుముశివునందుసతత • మిద్ధవిచారా ! 114

క॥ అనఘ ! పరిపూర్ణుఁడా శ,ర్వునకీసద్గాదులను నె • పుడు నెట్టిప్రయో
జనమదిలేదన్నియును నో, పనులకితరులఁగలకృపయె • ఫలమరయంగన్. 115

గీ॥ అట్టిదేవుండుశివపర • మాత్మయతని, వాచకముప్రణవంబు శి•వభవరుద్ర
శబ్దములలోనమిగులు వా•చకముప్రణవ, మాప్రణవజపమున నెక్కు•డగునుసిద్ధి.

క॥ అక్కతనఁజెప్పుదురుబుధు, లక్కమలచంద్రధరుని • నఖిలగురుని దా
మొక్కయక్కరపువేల్పని, యొక్కటి శబ్దార్థములని • యూహింపుమిటుల్. 117

వ. ఈప్రణవంబునకు నాల్గుమాత్రలలరు అకారంబు ఉకారంబు మకారంబు నాదంబు అకారంబుమహాబీజంబు రజంబు స్రష్టయగు చతుర్ముఖుండు ఉకారంబు సత్త్వ గుణంబు ప్రకృతి యోని పాలయిత విష్ణుండు మకారంబుపురుషుండుబీజంబు తమస్సుసంహారకుఁడుహరుండు నాదముపరమపురుషుండీశ్వరుండు నిర్గుణుండు నిష్క్రియుండుశివుండు ఇట్లీశ్వరుండు మూడుమాత్రలచేతఁ ద్రివిధంబుగఁ బ్రతి పాదించి యర్ధమాత్రముచేత స్వకీయంబగు శివాత్మమును బోధించుచున్నాఁడు. అకారము ఋగ్వేదంబుగ ఉకారంబు యజుర్వేదంబుగ మకారంబు సామవేదం బుగ నాదంబాథర్వణవేదంబుగఁ జెప్పఁబడినది. 118

ఉ॥ ఎవ్వఁడుసర్వభావముల • నీశ్వరునందుఁబ్రపన్నుఁడో దృఢం
బవ్విభునామహేశ్వరున • యత్నముగాఁబడయంగఁ జాలువాఁ
డెవ్వఁడుశంకరున్గవి మ•హేశ్వరునెన్నఁడొ బద్ధపాశుఁడై
యవ్వడ గుగ్రదుఃఖభవ • మందు భ్రమించును జక్రనేమినై. 119

క॥ ఎవఁడుగను రుక్మవర్ణునిఁ, గవినిజగత్కారుబ్రహ్మ • కారణుఁబురుషున్
సువిదితుఁడావిద్వాంసుఁడు, భవములనెడఁబాసిచెందుఁ • బరమపదంబున్. 120

గీ॥ అవిరూపాత్ముశక్తిస్వా • భావికియును, విద్య విశ్వవిలక్షణ • వివిధరూప
ములను బెక్కులనొంది యం•భోజబంధు, భాయనన్దగిభాసిల్లు • బద్మనయన !

గీ॥ అట్టిశక్తికిశక్తుల • నంతలుండు, రిచ్ఛజ్ఞానంబుక్రియయు నా•నెసఁగువార
లల్ల మాయాదికలునుమహ • వ్యవహునందు, విస్ఫులింగంబులట్టుల • విశ్వమందు.

క॥ పురుషులుసదాశివాద్యులు, మఱియునువిద్యేశ్వరాది • మహితులునట్లే
శరమలరుదురవ్వారికి, బరాత్పరయుప్రకృతి శక్తి • భాసిలుసతమున్. 123

గీ॥ వినుము! మహదాదితత్త్వంబు♦లును నజాది
మూర్తులును నవ్యమును సర్వ ♦ మునునుశక్తి
కార్యమాశంకలేదు సూ♦క్ష్మయుఁబ్రబోధ
రూప సర్వగయానంద♦రూప యాప. 124

క॥ శివుఁడరయుశక్తిమంతుఁడు, శివుఁడిఁకవేద్యమగునెప్డు ♦ శివవిద్యయగుఁ
శివయేశ్రుతియును స్మృతియును, శివయేప్రజ్ఞయునునాజ్ఞ ♦ శివస్థితిధృతియున్.

చ॥ శివుఁడెటు సర్వకర్త యయి ♦ చెన్నెసలారునో విశ్వకోటికా
శివయును సర్వకర్త్రియయి ♦ చెన్నెసలారునటుల్ సతంబిఁకీ
శవకు వియుక్తియుండదు సు ♦ గంధము పద్మముఁ బాయనట్టు స
త్కవి నమృతోక్తిపీడనిప్ర ♦ కారమెఱుంగు! రమామనోహరా! 126

గీ॥ ప్రకృతియులమాయ జీవుఁడు♦వికృతియట్లు, సర్వమగుసదసత్తులా ♦ శక్తితతము
లామహాదేవిమాయమో♦హమ్ముఁగూర్చు,మోక్షమిడు లీలచేసర్వ♦భువనములకు.

వ. సర్వేశుండీపెతోఁగూడి సప్తవింశత్ప్రకారంబుగ విశ్వంబువ్యాపించియుండు నాతని
వలన మోక్షంబుప్రవర్తిల్లు. మున్నొకప్పుడు ముముక్షులగుకొందఱు మునులు
బ్రహ్మమునుగూర్చి సంశయావిష్టహృదయులై యిట్లు విమర్శించిరి. 128

— * ఉపమన్యుఁడు కృష్ణునకు జగత్కారకునిగూర్చి చెప్పుట * —

గీ॥ ఎద్ది కారణమగుబ్రహ్మ♦మెందువలన, బుట్టినారముఁ కెద్దానఁ ♦ బోషితులము
ఎందునున్నారమిట్టుల ♦ నీసుఖ తదితరములందు వర్తింతుము ♦ తవిలిసతము.

గీ॥ కాలమొ స్వభావమొక్కొ య♦క్కడిఁదినియతి
యో యదృచ్ఛయో భూతంబు♦లో ప్రకృతియొ
పురుషుఁడో వీనిసంయోగ♦మో యరయఁగఁ
గారణము లౌనె జడము లె♦క్కడనుగాని. 130

క॥ పూరుషుఁడు సుఖియుదుఃఖియు,గారణమగునొక్కొ విభుఁడు♦గానియతఁడిటుల్
సారెకుఁ బరస్పరంబు వి,చారణ యొనరించి ధ్యాన ♦ సంగతినంతన్. 131

గీ॥ అపుడు నూచిరి మునులు దే♦వాత్మశక్తి, నీశ్వరినిఁ ద్రిగుణంబుల♦నెంతయునుని
గూఢమగుదానిఁ బాశంబుఁ♦గుశలగతినిఁ, ద్రెంచుదాని వివేకంబుఁ♦బెంచుదాని.

గీ॥ ఆపెచే భిన్నపాశులై ♦ యచ్ఛదృష్టి, సర్వకారణకారణు ♦ శక్తిమంతు
నమ్మహాదేవుఁ బొడఁగని♦రప్రమేయు, నేకతేజమై యొల్లెడ♦నెసఁగువాని. 133

వ. అద్దేవుని ప్రసాదయోగంబునఁ బరమంబగు యోగంబునను దృఢంబగు భక్తి
యోగంబునను దివ్యపదంబు నొందిరందున. 134

గీ॥ అట్టి చిచ్ఛక్తితోఁ గూడ♦నమ్మహేశు, నెవఁడెఱిఁగి హృదయంబున♦నెప్డుఁ జూచు
అట్టి వానికి శాశ్వత♦మైన శాంతి, యమరు నితరులకమర ద♦ట్లరయుమెదను.

గీ॥ విప్రయోగంబు శక్తితో♦వెలయ దెపుడు, శక్తిమంతుండు శివునకే♦చందమునను
ఈ ద్వయంబు ప్రసాదంబు♦నెలమిఁ జెంది, కరతలస్థితముగ ముక్తిఁ♦గాంచుజనుఁడు.

వ. మోక్షమందు జ్ఞానకర్మంబులక్రమంబు వివక్షింపఁబడలేదు. ఇకఁ నెట్టివాఁడుగాని పరమేశ్వరప్రసాదంబునొందెనేని నిస్సంశయంబుగ ముక్తుండగును. ఆప్రసాదంబు భక్తిచేతను భక్తి శివప్రసాదంబుచేతను జనియించుననియు ఈప్రసాదభక్తులు రెండును బరస్పరము కార్యకారణభావంబునొందుననియుఁ జెప్పెదు రనేకజన్మంబులందు శ్రౌతస్మార్తానువర్తులును విరక్తులగు ప్రబుద్ధులయెడ మహేశ్వరుండు ప్రసన్నుఁడగుననియు ఆయన ప్రసాదంబున భక్తిపొడముననియు నది వృద్ధినొంది క్రమమ్ముగ సర్వపాశంబులనుండి మోక్షంబొనరించుననియు నుపమన్యుమహామునీంద్రుండు చెప్పినవిని శ్రీకృష్ణుండు మరల యిట్లథరించె. 137

క॥ దేవా! వినఁదలఁతు మహా, దేవోక్తము వేదసార♦దీపిత మాత్మ
శ్రీవిజ్ఞానము నిజభ,క్తావళికిన్ ముక్తిజనక ♦ మగునద్దానిన్. 138

గీ॥ భక్తిలేనట్టివారి క♦ప్రాజ్ఞులకును, గోచరముగాని దెంతయు ♦ గూఢమైన
దా శ్రుతితదంగములనుసాం♦ఖ్యమునసుద్ధృ,తంబయినదానిఁ దెల్పుము♦తాపసేంద్ర.

—* ఉపమన్యుముని శ్రీకృష్ణునకుఁ దెల్పిన ఆత్మజ్ఞానము *—

క॥ అనుడు నుపమన్యుఁడిట్లనె, వినుమికఁ దెల్పెదను సర్వ♦వేదోక్తము శ
ర్వునిచేఁ బరిభాషితమును, ఘనము ననాయాసమోక్ష♦కారణము హరీ! 140

మ॥ మును నవ్యక్తమునుండి శర్వుఁడు జగ♦మ్ముల్ సృష్టిచేయంగ నీ
హను మున్ముందుగ దేవపూర్వు నలబ్ర♦హ్మన్ బ్రీతిఁ బుట్టించె న
ఘనుఁడున్ దండ్రిని సర్వకారణునిఁ దాఁ♦గాంచెన్ మహాదేవు నం
తనె రుద్రుండు సృజింపు విశ్వమని వే♦దంబుల్ సమర్పింపుడున్. 141

గీ॥ అతఁడు జగముసృజించి వ♦ర్ణాశ్రమవ్య, వస్థవేత్త్రలు చేసెస♦వంబుకొఱకు
సోము నెడలించె నాతని♦చోప్పునన్ ధ,రాగ్ని రవిసురరాడ్యజ్ఞ ♦ హరులమరిరి.

క॥ వారందఱు వేగంబుగ, శ్రీరుద్రాధ్యాయగీతి ♦ శివుని నుతింపన్
భూరికరుణాలుఁడై య,వ్వారలముందఱను దోఁచె♦వైభవమలరన్. 143

గీ॥ అంత లీలార్థమై యమ్మ♦హాత్ముఁడప్డు, వారిజ్ఞానంబును హరింప♦వారలపుడు
నీవెవండవనుచు మోహ♦విస్మితులయి, యడుగసురలకు రుద్రుఁడి♦ట్లనియె వేగ.

గీ॥ నేనొకండనె పూర్వుండ♦నేనె తొలుత,నుండియుండితి నిప్పుడు♦నుంటి నుండఁ
గలను నాకంటె నన్యుఁడొ♦క్కండు లేఁడు, నేనెనడిపెద జగముల♦నెమ్మిఁగనుచు.

ఆ॥ ఇట్లు చెప్పి రుద్రుఁ♦డెలమినంతర్హితిఁ, జెందె నంత సురలు ♦ చేవదక్క
పరమశివునిఁ గనక♦భక్తితోడ నథర్వ, శిరసుతోడ నుతులు ♦ చేసిరంత. 146

క॥ వారల ననుగ్రహింప ను, మారమణుఁడు దేవితోడ♦మూర్త్యుల యెదుటన్
భూరికరుణాహృదయుఁడై, చేరఁగ నవ్వారుగాంచి ♦ చెలఁగి ప్రణతులై. 147

గీ॥ పరమశక్తి యెడమపక్క♦భాసిలంగ, సిద్ధులా పాశుపతు లోలి ♦ సేవసల్ప
యోగులకు నెదఁ గన్పడు♦చుండువాని, శివునిఁజూచి నుతుల్ పెక్కు♦చేసిరంత.

వ. పరమేశ్వరుండును గృపచే నవ్వారిన్ గాంచి సంతుష్టుండనైతి ననుడు దివ్యజను
లాదరంబున నిట్లడిగిరి. 149

గీ॥ దేవ! నీకపచితి యెట్లు♦దీర్చవలయు, నెవనికర్చ్యయం దధికార♦మేర్పడునొ య
ర్ఘార్హమంతయు మాకిప్పు♦డానతిమ్ము,నుడు శివుం డల్పహాసంబు♦నుంబొనర్చి. 150

— * శివుఁడు దేవతలకు సూర్యాత్మక నిజతనువుఁ జూపుట * —

క॥ దేవినిఁ గని యంత మహా, దేవుఁడు సూర్యాత్మకంబు ♦ దివ్యతనువు స
ద్భావంబునఁ జూపుటయున్, దేవతలంతయునుజూచి ♦ తేఁకువ మెఱయన్. 151

గీ॥ ఘోరమునుసకలాశ్చర్య♦గుణయుతమును,సర్వతేజోమయంబును♦ శక్తియుతము
అష్టభుజము చతుర్వక్త్ర♦మద్భుతమును, నర్ధనారీకమునుగాంచి♦హారుసమొంది.

క॥ తెలిసి దివాకరుదేవునిఁ, గలువలరాజైన దేవిఁ ♦ గనుగొని భువనం
బులు తన్మయములుగాఁగని, సలిలము నర్ఘ్యమునుబట్టి ♦ సల్పి రిటు నుతుల్.153

క॥ సింధూరవర్ణునకు సం,క్రందనగోవిందధాతృ♦కారణునకునున్
సుందరసుమండలున కర, విందధరున కబ్జనేత్ర♦విలసితునకునున్. 154

క॥ కనకమణిభూషణునకును, ఘనరవిరూపునకు నాది♦కారణునకు వి
ష్ణునకును బ్రహ్మకునున్ రు, ద్రున కార్యాసహితునకు ను♦తులివె శివునకున్.

గీ॥ రత్నపూర్ణాంబు ససువర్ణ♦రసము సకుశ
సుమమును సుకుంకు మార్ఘ్యంబు ♦ సుప్రశస్త
మును సహేమపాత్రంబును♦మోదమెసఁగఁ
గొను మొసంగెద మర్ఘ్యమున్ ♦ గోశతాంగ ! 156

వ. అని ప్రార్థించి పరమపురుషున కర్ఘ్యంబు లొసఁగిరి.

గీ॥ ఇట్టు లినమండలంబున ♦ నింపుమీఱ, శివుని నవధానమునఁ బూజ ♦ చేసి యెవ్వఁ
డర్ఘ్యమిచ్చునొ కాలత్రి♦యంబునందు, వాని కిలదుర్లభము లేదు♦వడయుముక్తి.

వ. మఱియును.

క॥ ఈస్తుతి నెవ్వం డేనిం బ్రశ, స్తమతిన్ జపముసేయు • జదువుచునుండున్
నిస్తులవిభవములొందును, స్వస్తిన్ జేకొను నతండు • సత్యమిదియగున్. 159

—* తిరోహితశాస్త్రప్రతిష్ఠ *—

వ. అంత మండలాంతర్గతుండగు హరుండు సర్వాగమోత్తరంబగు శాస్త్రంబు నొసంగిన నందుం బూజాధికారంబు ద్విజాతుల కని యెఱింగి మహేశ్వరుని సెలవొంది బృందారకు లందఱు యథాగతంబుగం జనిరంతం బెద్దకాలంబున కాశాస్త్రంబు తిరోధానంబగుడు నొకప్పుడు మహేశ్వరిచే సంబోధితుండై శివుండు మరల సర్వాగమోత్తరంబగుశాస్త్రంబు ననువదించె నద్దిబ్రహ్మను మతినాచే నగస్త్యునిచే దధీచి మున్నగువారిచే స్వయంబుగ శివావతారంబుల చేతను లోకంబునం బ్రవర్తితంబయ్యె. 160

చ॥ అనవుడుం గృష్ణుండిట్లనె ష•డాననసన్నిభ! జ్ఞానమూర్తి! నీ
వనయము శిష్యపాశహర•ణాఖ్యుడ వీశ్వరతత్త్వయోగచిం
తనుండవు నీముఖాబ్జశివ • తత్త్వసుధారసధార లాని తృ
ప్తినిం గొనజాలకుంటి నిటు • దెల్పుము శార్వవిభూతి నింకనున్. 161

గీ॥ మును జగన్మాత శర్వాంక•మున వసించి, లోకనిశ్శ్రేయసం బెంచి•లోకగురుని
శివుని నేమి ప్రశ్నించెనో•శివకునాథుం, డేమి తెల్పెనో యెఱింగింపు•మిపు డుదయను.

వ. అనిన నుపమన్యుం డిట్లనియె. 162

—* ఉపమన్యుండు కృష్ణునకు ముఖ్యాంశంబును జెప్పుట *—

చ॥ విను యదువంశమౌక్తికమ! • విశ్వగురుండు హరుండు మందరా
ద్రిని నొక చారుకందరస • రిత్తటదివ్యవనస్థలిన్ జగ
జ్జననియుం దా విహారమును • సల్పుచు నెచ్చెలి దెచ్చినట్టి నూ
తనవికచప్రసూనదళ • దామములన్ గయిసేయుంగా నుమన్. 163

గీ॥ తనదు తొడ నెక్కంజేసి ని•తాంతకౌతు,కమున క్రీడం గ్రైసేసి • కడిందిహర్ష
మొప్పనున్నతఱిన్ దేవి•యొప్పమీఱ,విభుని లోకోపకృతి కిటుల్ •వేగ నడిగె.

గీ॥ దేనిచే వశమయ్యెదు • దేవదేవ!, అల్పశక్తులు నకృతాత్ము•లైన యట్టి
మానవులకీవు వచియింపు•మా! కరంబు, నాదు చిత్తంబు పొంగనా•నందమునను.

వ. అనియడిగిన మహేశ్వరికి మహేశ్వరుండాదరంబున నిట్లనియె. 166

గీ॥ కాను వశ్యుండ నెపుడును•గర్మమునను, జపమునన్ దపమునను వి•జ్ఞానమునను
నన్యమున దేనిచేనిఁక • నవధరింపు, భక్తిచేతను వశమౌదు • భక్తతతికి. 167

గీ॥ భక్తి యెక్కుడుగలిగినం•బణంతి! మౌని, సులకువశమౌదు బ్రేమతోం• జూడంబడుదు
మాటలాడుదు ముట్టుదు•మఱియు నెంత, యేనిబ్రియ మొనరింపుదు•నిగురుంబోండి!

క॥ దానన్ బడయఁగ వలయు న,నూనంబగు భక్తిభువి న♦నున్ గోరెడున
మ్మానవులు వర్ణయుక్తులు, మానిని! ధర్మాభివృద్ధి ♦ మనుమురుదీనన్. 169

సీ॥ భామ! వర్ణాశ్రమాచార♦పరులకే యొ,సంగు నచ్చంపుభక్తి హా♦సంగదన్య
జనులకిది మామకాజ్ఞచే♦వనజభవుఁడు, వారలకుఁగూర్చుచుండును♦వైభవముగ

వ. మఱియు వర్ణాశ్రమధర్మంబుగూడ నాచే నుత్పాదింపఁబడి చతుర్ముఖునిచేఁ బ్రవ
ర్తింపఁజేయఁబడినదాట నన్నుఁ గోరువారెల్ల నియతితో వర్ణాశ్రమధర్మంబు
ననుష్ఠింపవలయును. అట్టి వర్ణధర్మానుష్ఠాతలకే మదీయభక్తిజ్ఞానంబులం
దధికారం బన్యులకులేదు. 171

ఆ॥ అందుఁజేసి మామ♦కాజ్ఞానువర్తులై, వర్ణధర్మనిరతి ♦ వాసిమీఱ
భక్తిఁజెంది పాప♦పాశంబులను బాసి, నన్నుఁజేరవలయు ♦ నలిననేత్రి! 172

వ. ఇఁక ద్రైవర్ణ్యసంజాతులుగాక తక్కినవారలుగూడ వేదోక్తవిధానంబులేకయే
నిర్మలహృదయంబున విశుద్ధభక్తిన్ జెంది దృఢభక్తులై నన్నుసేవించిరేని సత్యం
బుగ మత్ప్రసాదంబునొందుదురిందు సందియంబులేదు. అజ్ఞుఁడును నమాయికుఁ
డునగువాని కొదవుభక్తి నిశ్చలయగు ననియిట్లుచెప్పినంత నమ్మహేశ్వరి సంతు
ష్టయై దేవా! జనంబులందలి నీదుభక్తినెఱుంగుటకుఁ దగులక్షణంబులను నీవొ
నర్చినట్టి వర్ణాశ్రమధర్మనిబంధనంబుల నెఱింగింపుమని ప్రార్థించిన మహేశ్వరుం
డిట్లనియె. 173

గీ॥ విను! మదర్పితచిత్తులై♦తనరు నమ్మ,హాత్ములఁగలట్టి గురుతుల♦నన్నియిపుడు
బుధులులెక్కించిరవియష్ట♦విధములనుచు, వానిదెల్పెదనిట్లు భ♦వాని! నీకు. 174

సీ॥ నాదుభక్తజనంబులం♦దలి ప్రపత్తి, నాసమర్చనమతి యర్చ♦నము స్మరణము
నాకొఱకుఁదగుకృషి నాక♦థాకుతుకము, స్వరదృగంగవికృతి జీవ♦చర్యయివియె.

క॥ ఇవిచిహ్నంబులరయు మ, ష్టవిధంబులు భక్తికది♦జాతరో! జగమం
దెవనియెడనుండునోయీ, యువి వాఁడేపూజ్యుఁడునుమ♦దాకారుడునౌ. 176

సీ॥ పత్రపుష్పఫలాంబుల ♦ భక్తితోడ, నెనఁడునాకొసఁగునొవాని ♦ కెపుడునేను
గన్పడుచునుందు.వాఁడును♦గన్పడుచునె,యుండునాకును దెలియుస♦మున్నతాత్మ!

వ. ఇఁక వర్ణాశ్రమధర్మనిబంధనంబిట్లు తెలియు మందు బ్రాహ్మణులకు. 178

సీ॥ స్నానము త్రికాలముల నగ్ని ♦ చర్య శర్వ
లింగపూజయు శివభావ ♦ ముం గరుణయు
దానము నహింస ముదము స♦త్యంబు హ్రీయు
యోగ మధ్యయనము బోధ♦యును మఱియును. 179

సీ॥ బ్రహ్మచర్యముసత్కథా♦శ్రవణముతప, ముముక్షుమయు శౌచమునుశిఖా♦పుణ్యతంతు
ధృతియునుత్తరీయోష్ణీష♦ధృతయుభస్మ, ధారణంబక్షశివలింగ ♦ ధారణంబు. 180

క॥ మఱియు నిషిద్ధత్యాగం, బురువుగఁ బర్వములనర్చ ♦ యును సల్పవలెన్
వాఁడువొప్పనన్నదానం, బరవిందనయన! యొనర్ప ♦ నగు సారయుమా! 181

వ. ఇఁకనుమిక్కిలి నిషిద్ధంబులైన భోజనంబుల నత్యంతంబు వర్జింపవలయు నిట్లు వినుము. 182

గీ॥ అరసివిడవలె నానాకి ♦ యాన్నములను, నల్లె పర్యుషితాన్న శా ♦ ద్ధాన్నములను
యావకాన్నమునికను మ ♦ ద్యమునుమద్య, గంధనైవేద్యములను న ♦ గ్రికులజుండు

వ. ఈధర్మంబులు బ్రాహ్మణసామాన్యోపాదేయంబులిఁకనిందు గృహస్థులగువారలకు ధర్మపత్నీగమనంబు యుక్తంబు. బ్రహ్మచారివానప్రస్థయతులు స్త్రీపరాఙ్ముఖులైయుండవలయును, మఱియు దివాభిక్షాన్నంబు రాత్రియందుపవాసంబు నీబ్రహ్మచారివానప్రస్థయతులకుచితంబిఁక వీరిధర్మంబులు. 184

క॥ క్షమయునుశాంతియు సంతోషమునున్ సత్యంబు బ్రహ్మ ♦ చర్యము వైరా
గ్యము నస్తేయము మఱి జ్ఞానము భసితపుసేవ వర్జ ♦ నము సంగమునన్. 185

వ. ఇఁక క్షత్రియులకు.

సీ॥ సర్వవర్ణములకు ♦ సంరక్షణంబును, సమరమందున శత్రు ♦ జనవధంబు
దుష్టసత్త్వములకు ♦ దుష్టులకునుశాత, నంబు నెల్ల జనంబు ♦ నమ్మకునికి
కాలమందు స్వకీయ ♦ కాంతావిహారంబు, సైన్యరక్షణమున ♦ శ్రాంతముగను
కోశరక్షణ మనా ♦ క్రోశమన్యులయెడ, బంధుసుమ్రాజ్జన ♦ పాలనంబు

గీ॥ అనుదినము చారవిదితవృ ♦ త్తాంతవేద, నంబు శస్త్రాస్త్రచయధార ♦ ణంబుసతము
భసితకంచుకధారణం ♦ బసితవేణి!, క్షత్త్రియులకెల్లనిది ధర్మ ♦ సంగ్రహంబు. 186

వ. మఱియును.

గీ॥ తగదు క్షత్త్రికులజుల క ♦ ధ్యాపనంబు, యాజనంబు ప్రతిగ్రహం ♦ బబ్జనదన!
వైశ్యులకుఁగూడ తగదివ్వి ♦ వాడుసల్ప, వలయుబేహారమునుగృషి ♦ పశులరక్ష.

వ. ఇఁకఁ జతుర్థకులజులగూర్చి

క॥ సర్వోపకరణనిర్మితి, సర్వభవన నిర్మితియును ♦ సమ్యఙ్మతిమై
సర్వావననిర్మితియునుఁ, హార్పఁగసల్పుటయె యుచిత ♦ మంబ్రిజులకిలన్. 188

వ. ఇఁక స్త్రీజనంబులకు

క॥ పతియేగురుఁడునుదైవము, పతిసేవయె పరమహితము ♦ భామలకెందున్
పతియేముఖ్యంబన్నిటఁ, బతిఁబాసిన లేదిహంబు ♦ పర మువిదలకున్. 189

వ. పతియనుజ్ఞనిచ్చిన దేవతారాధనంబుసేయవలయు లేకయున్న మానవలయునిఁక నెతంతుస్త్రీధర్మంబులు వినుము. 190

గీ॥ బ్రహ్మచర్యంబుస్నానంబు♦భసితలేప, నమును శాంతియువకానంబు♦క్షమయునక్త
భక్తిపర్వోపవాసంబు ♦ భూశయనము, నాదుధ్యానజపంబులు♦నాసమర్చ. 191

వ. ఇఁక నెల్లవారలక్ష్మత నెఱింగి మదీయ మంత్రజపధ్యానంబులను లింగపూజనంబున భోగమోక్షంబుల నొందవలయునని మహేశ్వరుండు చెప్పినంత మహేశ్వరిసంతుష్టయై భక్తిభావంబునఁ బరమేశ్వరునుపాసించెననిన శ్రీకృష్ణుండుమురిసి నమస్కరించి దేవా! సర్వవిద్యాధిరాజంబును బ్రహ్మవిద్యాపట్టభద్రంబునగు శ్రీ షడక్షరీ విద్యయొక్క స్వరూపంబు నుపాసనావిధానంబు నెఱింగింపుమనుటయును గురుండిట్లనియె, 192

గీ॥ అశివుఁడుశివు౯ యజింపన♦నర్హుఁడగును,శివుఁడయిశివార్చనంబుఁదాఁ♦జేయవలయు
*నట్లుగావునదీక్షాత్ర♦యంబుగురుని, చేతఁబడసి యుపాసింపఁ ♦ జెల్లుశివుని. 193

వ. మఱియుగురుండు శిష్యునియోగ్యతనారసి షడధ్వశుద్ధి౯ బొనరించి శివదీక్షల నొసంగవలయును. ఆషడధ్వశుద్ధిక్రమం బెఱిగింతువినుము. 194

క॥ కలలైదు నివృత్త్యాదులు, జలజాక్ష! కలాధ్వయనుచుఁ ♦ జక్క నెఱుఁగు! పైఁ
గలయైదధ్వములైదగు, కలల౯ వ్యాప్తములుగాఁగఁ ♦ గనుమల్లమదిన్. 195

గీ॥ వినుము శివతత్త్వమాదిగాఁ ♦ బృథివివఱకుఁ
నమరుతత్త్వంబు నిఱ్వాది ♦ యారు చెప్పఁ
బడియెఁ దత్త్వాధ్వమాధార ♦ ప్రభృతియున్మ
నాంతమఱువది భువనాధ్వ ♦ మింతఁ దెలియు! 196

గీ॥ అక్షరములేఁబదియును వ♦ర్ణాధ్వమిఁకను, పదములాసుప్తిఙంతముల్ ♦ ప్రాబలుకుల
కవయవములై యమరుచుఁబ♦దాధ్వమనఁగఁ, బరగెనారయుయాదవ♦పట్టభద్ర!

వ. ఇఁక సప్తకోటి మహామంత్రంబులు మంత్రాధ్వమనఁబడియె. 198

గీ॥ తత్త్వనాథుండుశివుఁడు త♦త్త్వంబులందు, గణనఁజెందనియట్టుల ♦ గణనచెంద
దెఱుగుమంత్రనాయకమును♦సిద్ధపరమ, విద్యయగుశివమంత్రంబు♦విమలహృదయ!

వ. ఇఁకనీషడధ్వములందుఁ గలాధ్వంబు వ్యాపకంబనియుఁ దక్కిన పంచాధ్వంబులు వ్యాప్యంబులనియుఁ దెలియుము. ఇట్లు దెలియనివాఁడు షడధ్వశోధనంబున కనర్హుండు. మఱియు నీషడధ్వములస్వరూపం బెఱుంగనివానికందు వ్యాప్యవ్యాపకభావం బెఱుంగఁబడదు. కావున ముందుగ షడధ్వస్వరూపంబును ఆపైని తద్వ్యాప్యవ్యాపకత్వమునెఱింగి యనంతరము షడధ్వశోధన మొనర్పవలయును.

గీ॥ శ్రీషడక్షరమంత్రప్ర♦సిద్ధవిధివి, ధానమెఱిఁగించెద విను దై♦త్యఘ్న! యిఁకను
మంత్రమూర్తియాశ్రీగురు♦మహితచరణ, నళినములఁబూజచేసియా♦నందమతిని.

---

* వేధాదీక్ష క్రియాదీక్ష మంత్రదీక్ష ఈదీక్షలకుపదీక్ష లిఱువదియొకటి.

గీ॥ ఆదియందునమః పద ♦ మంతమున శి,వాయ యనుపదమిది మంత్రి ♦ వర్ణసరణి
ఇదియె పంచాక్షరీమను ♦ విందు ముందు, తారమమరషడక్షరి ♦ తానయగును.

క॥ గాయత్రీచ్ఛందంబును, నాయతబ్రహ్మఋషికంబు ♦ నలశివదైవం
బై యలరుప్రణవబీజం, బై యార్యాశక్త్యభవ మ ♦ హాకీలకమై. 203

గీ॥ తనుమహూర్మినివృత్తికై ♦ ఘనతరంపు, షట్స్థలబ్రహ్మనిర్వాణ ♦ సౌఖ్యసంప
దాప్తికై శ్రీషడక్షరా♦యతమ్మనుజప, మేనొనర్చెదననివల్కి ♦ పూనినియతి.

గీ॥ అవహితమనస్కుఁడై కర♦న్యాసమును గ్ర,మముగ నంగన్యాసమును నీ♦మంత్రవర్ణ
ములను నొక్కొకఁడను చును♦సలిపియంత, గురుని మనువునుధ్యానింపఁ♦గూడునిట్లు.

గీ॥ ఆశివాగ్ని బీజనకును ♦ హారునకుఁబర,మాత్మ కోమంత మంత్రికూ♦పాంచితునకు
మూలపంచాక్షర స్వరూ♦పునకు శివున,కిదె నమస్సని జోతల♦నిడఁగవలయు. 206

గీ॥ పరగనోంకార వదనంబు♦వాయకార, బాహుయుగ్మంబును శికార♦భాసమాన
మధ్యమును నమకారస♦మంచితాఘ్రి, యుగమునై యొప్పు పంచాక్ష♦రోరువిద్య.

గీ॥ తారయుక్తయు లింగ రూ♦పోరుతరయు, శివమహామంత్రివాదిని♦శివనిధాన
మద్వపుఃప్రతిష్ఠితమై య♦మరనుగాత, ననుచుఁదలఁచి యుపాస్తిసే♦యంగవలయు.

గీ॥ షట్స్థలబ్రహ్మరూపిణి! షట్స్థలప్ర,సాదపరమసుఖప్రద! జనని! శుభద
శ్రీషడక్షరమను దేవి! సిద్ధవిద్య, నీకగు నమశ్శతంబులు ♦ చేకొనుకృప.

వ॥ ఇట్లనుజ్ఞనొంది ప్రత్యహంబిరువదియొక్క వేయి యారువందలు షడక్షరీ జపం
బొనర్పవలయును శక్తిచాల నివారును దీక్షితలేనివారును, నఱువదియొక్కవంద
యేని జపించవలయును పూజాసమయంబు నందొక్క సహస్రంబుగాని యాఱు
శతంబులుగాని యధమము త్రిశతంబుగాని జపింపవలయును. 210

గీ॥ ప్రణవమర్థంబు నాదివ♦ర్ణద్వయంబు, యాంతవర్ణత్రయంబును ♦ నగుసమష్టి
ఒక్క వాక్యంబుగామది ♦ నూహసేయు, మనఘ! వికసితపద్మదళాక్ష! నీవు. 211

గీ॥ అర్థరూపమైనట్టి వి♦ద్యయెపరయగు, వర్ణరూపయె పశ్యంతి ♦ పదసమాకృ
తియగుమధ్యమ వాక్యరూ♦పయెయెఱుఁగుము,వైఖరియటంచునిభ్భంగి♦వాసుదేవ!

గీ॥ అర్థము మనోభవంబగు ♦ నక్షరంబు, దృగ్భవంబగు పదమిఁక ♦ వాగ్భవంబు
వాక్యము నపుర్భవంబిట్లు ♦ భాసిలెడును, మనసుదృగ్వాగ్వపుస్సులు♦ మహితతేజ!

గీ॥ మననలక్షణమైయొప్పు ♦ మనమువినుము, దృక్కగువిలోకనాకృతి♦వాక్కువచన
లక్షణయగువపుస్సు త♦లంపఁ బాలు,దంతజిహ్వోష్ఠయోగ వి♦ధంబెఱుఁగుము.

వ. ఇట్లీబ్రహ్మవిద్య మానసియుఁ జాక్షుషియు జాప్యయు వాచకియునై పరాపశ్యంతీ
మధ్యమావైఖరులనుచుఁ గ్రమముగ వ్యవహరింపఁబడును. 215

వ. ఇఁక మంత్రార్థంబు

క॥ ఓమనఁగా బ్రహ్మంబగు, నోమనసర్వప్రపంచ ♦ మోమనుచులలిన్
వేమాఱు బాడుసామము, లోమనఁగనుమామహేశు ♦ లూహింపుమిః

గీ॥ ఆనమఃపదమగునుమ♦యల్ల శివప, దంబుశివుఁడయశ్వబ్దంబు ♦ తదుభయైక
యోగమిఁకసోమతత్త్వమిా♦యుత్తమమును, రాజసిద్ధార్థమిది యదు♦రాజతిలక!

క॥ లింగముశివుఁడిఁక, నుమయే యంగంబిద్దానఁజేరి ♦ యభవుఁడు సోమా
ఖ్యంగరిమ నెసఁగునిట్టులె, ఱుంగుముహృదయంబునన్ ♦ గరుత్మద్గమనా! 218

వ. ఇఁక నిమ్మనురాజంబునకుఁ బురశ్చరణప్రకారంబు వినుము. 219

గీ॥ ఆరులక్షలుజపముఁను ♦ నఱువదియగు, వేలుతర్పణమును నాఱు♦వేలుహోమ
మాఱునూఱులుశంభు భ♦క్తాగ్రణులకు, భోజనంబిడవలయును♦ బూన్కి మెఱయ.

గీ॥ శక్తిచాలనిచో నొక ♦ షష్టికేని, నాఱుగురికేని జగ్ధిస ♦ మర్పణంబు
చేయవలయు మహాత్మలౌ ♦ శిష్టజనుల, కట్లునున్ జాలకున్నను ♦ నరయుమిట్లు.

గీ॥ అరసిమట్స్థలబ్రహ్మ స♦మాకృతియు ష, డంగలింగసంయుక్తుఁడై ♦యమరునట్టి
సిద్ధమూర్తినినొక్కనిఁ ♦ జేరఁబిలిచి, స్వర్ణపటగంధపుష్పభూ ♦ షణములొసఁగి
భోజనంబిడికొలిచినఁ ♦ బూర్తియగును, మనుపురశ్చరణం బస♦మానగతుల.

వ. ఇఁక నీపంచాక్షరీమహావిద్య ప్రసారవశంబున భిన్నభిన్నరూపంబుగ అష్టావింశత్యుత్తర శతనామంబులతో అష్టావింశత్యుత్తర శతవిధంబై యుపాసకులకు సర్వవిధార్థసిద్ధులనొసంగువాని స్వరూపంబులఁ బంచాక్షరీకల్పంబునం దెఱుంగుము. మఱియు నిమ్మహావిద్యకు శివాస్త్రంబును పాశుపతాస్త్రంబును బ్రహ్మాస్త్రంబు క్షురికాస్త్రంబు వ్యోమాస్త్రంబఘోరాస్త్రంబు మున్నగునవి యంగవిద్యలుగ నారయుమనిన శ్రీకృష్ణుండు సంతుష్టుండై మహాత్మా! సర్వైహికాముష్మిక ఫలదాయకంబగు శివపూజాక్రమంబు నుపదేశింపుమనుటయు నుపమన్యుడిట్లనియె.

చ॥ శివుఁడిక లింగమారయుము ♦ శ్రీవనితాప్రియ! లింగపీఠమా
శివయగు లింగపూజనము ♦ చేనుభయార్చన సంఘటిల్లు నా
భవునికినిన్ భవానికిని ♦ భాస్వరదేహము లింగ మెల్లరౌ
దివిజులు లింగపూజను వి♦ధిన్ బొనరింతు రనారతంబునున్. 244

వ. ఈలింగార్చనంబాభ్యంతరంబు బాహ్యంబని ద్వివిధంబు అందాభ్యంతరంబును యోగులగువారొనరింతురు. బాహ్యార్చనంబిఁకఁ బంచసూత్రఘటితంబులగు బాణస్ఫాటికాదిలింగంబులను శిరోముఖ్యాంగంబులందు ధరించి శైవాగ్రణులు పూజింతురు మఱికొందఱిట్టిలింగంబులను బరివారంబులతోఁ బీఠమందమర్చి యర్చింతురిఁకను కొందఱు పార్థివలింగంబుల నొనర్చి యర్చించి యంతంబున నుత్సృగ

క॥ శివభావులు శివకరులును, శివవిజ్ఞానామృతాంబు ♦ సేవులుమఱియుళ్
శివసంస్కృతులగుగణరాట్, దివిజచమూపతులుమాకు ♦ దీర్తురుముదముల్.

గీ॥ మందరతుషారశైలోప ♦ మానతనుఁడు, ధవళసుందరతరకకు ♦ ద్మంతుఁడిద్ధుఁ
డీశ్వరధ్వజవాహనుం ♦ డీశనిభుఁడు, నందికేశుఁడొసఁగుతనా ♦ నందములను

——*. అష్టత్రింశత్కలావిశిష్టత *——

వ. ఇఁక శుద్ధస్ఫటికసంకాశంబును మూర్ధాభిమానంబును శాంతంబును శాంత్యతీతా త్మకంబును స్వస్థలస్థితంబును పంచాక్షరాంతిమబీజంబును గలాపంచకయుతంబును శక్తివిశిష్టంబగు నీశానాఖ్యపదబ్రహ్మంబును బాలసూర్యప్రతీకాశంబును బూర్వ వక్త్రాభిమానంబును శాంత్యాత్మకంబును మరుత్సంస్థంబును దురీయశివబీజంబును జతుష్కలంబును బూర్వదిఙ్మండితంబును శక్తివిశిష్టంబగు తత్పురుష పరమ బ్రహ్మంబును అంజనాద్రిప్రతీకాశంబును దక్షిణవక్త్రంబును ఘోరవిగ్రహం బును విద్యాపదయుతంబను వహ్నిమండలమధ్యస్థంబను దృతీయశివబీజంబును. అష్టకలాన్వితంబను శక్తివిశిష్టంబగు నఘోరపరబ్రహ్మంబును కుజ్కుమక్షోద సఙ్కాశంబ నుత్తరవక్త్రంబను బ్రతిష్ఠాపద (కలా) ప్రతిష్ఠితంబు నుదకమండల మధ్యస్థంబును ద్వితీయశివబీజంబును దగ్రయోదశకలాసమన్వితంబును శక్తివిశిష్టం బునగు వామదేవపరబ్రహ్మంబును శంఖకుందేందుధవళంబును పశ్చిమవక్త్రంబును సౌమ్యలక్షణంబును నివృత్తిపదనిష్ఠంబును పృథివీసమవస్థితంబును బ్రథమశివబీజం బును కలాష్టకయుతంబును శక్తివిశిష్టంబునునగు సద్యోజాతపరబ్రహ్మంబును నాచేఁ దత్తత్ప్రదేశంబులందర్శింపఁబడిన వీయవియును. బంచావరణస్థదేవతలును నాకుఁ బ్రార్థితంబు నొసంగుదురుగాతయని యిట్లు ప్రస్తుతింపవలయునని యుపమన్యు మునీంద్రుండు చెప్పిన విని శ్రీకృష్ణుండు సంతుష్టుండై మఱియును శివలింగతత్త్వం బను బూజాయోగరహస్యంబులనడిగి తెలిసికొని కృతార్థుండయ్యెనని వాయు దేవుండు మునులకుఁదెల్పి యంతర్హితుండయ్యెనంత. మఱునాఁటి ప్రభాతంబునఁ దపోధనులగు నానైమిశీయఋషులు సత్రాంతంబున నవభృథంబునొనర్పఁ బ్రస న్నస్వాదుసలిలయగు సరస్వతీనదిన్ జేరి యందు శివంబులగు తజ్జలంబులస్నాన మాడి దేవాదితర్పణంబులొనర్చి పూర్వవృత్తాంతంబును స్మరించి వారణాసికేగిరి.

గీ॥ అందు నుత్తరవాహిని♦యైన గంగ, మునుకలొనరించియల యవి♦ముక్తనాథ
లింగమును విధినర్చించి♦లీలమరలు, చుండ నచ్చోట నొకతేజ♦ముద్భవించె. 246

క॥ ఆతేజ మర్కకోటి, వ్రాతప్రతిమానమగుచు ♦ వరుసగ రోదః
స్థితంబై కరమలరుడుఁ, గౌతుకమున మునులు మహాము♦గాంచుచునుండన్.

గీ॥ పాశుపతులగు సిద్ధులు♦పరమమునులు, భస్మసంఛన్నతనులు త♦పస్వు లట్టి
తేజమునవచ్చి చేరి యం♦దే విలీను, లైరియ త్తేజ మటుమీఁద♦నంతరించె. 248

క॥ అదిగని నైమిశవనమునఁ, బొదలెడు నమ్మునివరులు ప్ర♦భూతాశ్చర్యం
బొదవఁగ నిది యేమని యజ, సదనమునకు మేరువనికిఁ♦జనిరి రయమునన్. 249

—* నారదుఁడు తుంబురునితో సామ్యంబుఁ బడయుట *—

క॥ ఇంతకుమున్నే పవనుం, డెంతయు వేగముగ నటకు♦నేగి విధికిఁ గా
లాంతకతత్త్వము మునులకు, నంతయుఁ జెప్పితిని సత్ర♦మవసితమయ్యెన్. 250

గీ॥ నీదు సెల వొనరించితి ♦ నిగమవంద్య!, యనుచు విజ్ఞప్తి యొనరించి♦యబ్జభవుని
యానతిఁ గొని నిజపురి♦కరిగె నంత, బ్రహ్మ యాస్థాని కేగ సు♦రలు గొలువఁగ.

గీ॥ అందుఁ దుంబురుతోఁ గల♦హాశనర్షి, గానమున స్పర్ధ సేయుచుఁ♦గడిఁది పూన్కి-
నాఁడు తనశక్తిఁ జూపింప♦వేఁడుటయు వి,రించి యియ్యకొనియెను జే♦కెరి పలువురు.

వ. గంధర్వు లప్సరోజనంబులు గీతవాదిత్రకుశలులగువారు చేరి రా సమయంబున సభాప్రదేశంబు మిక్కుటంబుగ నిండియున్న కతంబున ద్వాస్థజనులు నైమిశారణ్యమునుల నడ్డగించుటఁ జేసి యవ్వారు సభాలయంబుఁ బ్రవేశింపలేక తత్పార్శ్వంబునఁ గూరుచుండి యుండిరంత. 253

గీ॥ నారదుం డాటితేటి గా♦నమున నాఁడు, తుంబురునితోడఁ బాఁడులఁ♦దూఁగె నపుడు
బ్రహ్మదేవుండు మెచ్చి నా♦రద మునికినిఁ, దుంబురున కనపాయస♦ఖ్యంబుఁ గూర్చె

వ. అంత నారదుండును.

క॥ కైలాసపర్వతంబున, శైలాదిమునీంద్రునకును ♦ శంభునకును వీ
ణాలలితకౌశలంబును, జాలఁగఁ జూపింప గీత♦చతురుల తోడన్. 255

వ. తుంబురుఁ దోడ్కొని బిరబిరఁ జనుచుండ నైమిశమునులు డాసి బ్రహ్మసభాప్రవేశంబు నర్థింపుడు నతండు బ్రహ్మకెఱిఁగించి యాస్థానముఁ జేర్చెదనని దౌవారికులకుఁ జెప్పి చనుటయు వార లట్లొనర్ప నమ్మునులు బ్రహ్మన్ జేరి సాష్టాంగ మొంది నిలిచిన నలువయు నవ్వారల కుశలం బడిగి యిట్లనియె. 256

గీ॥ మీసమాచారమంతయు♦ నాసదాగ,తి ముఖమున నింతకు మున్నె ♦ తెలిసికొంటి
నతఁడు మీసముఖముఁ బాసి♦యవల కేగి, నంత మీఁదియుదంతంబు ♦ నంతఁ జెపుడు.

వ. అనుటయు మను లవబృథావసానంబున వారణాసి కేగుటయు నందు గంగాస్నానం బొనరించి దేవప్రతిష్ఠితంబులగు శివలింగంబుల దర్శించుటయు నవిముక్తేశ్వరలింగంబు నర్చించుటయును నాకాశంబున మహాతేజం బొకఁడు గన్పట్టుటయు నందుఁ బాశుపతసిద్ధమునులు చేరి తిరోధానంబు నొందుటయు నద్దాని యాథాత్మ్యంబు దెలియకుండుటయు నటుమీఁదఁ దమ సన్నిధానంబున కరుగుదెంచుటయును జెప్పి ప్రణమిల్లిన విని చతుర్ముఖుండు శిరఃకంపం బొనరించి గంభీరవాక్కుల నిట్లనియె. 258

ఉ॥ దాఁకొని వారలట్లు నియ ♦ తమ్ముగ సత్రమునందు శంకరున్
లోకగురున్ భజించితిరి ♦ లోలతఁ దక్కి మునీంద్రతల్లజుల్ !
మీకిది భావిసూచకము ♦ మీరలు గన్గొనినట్టి తేజమా
శ్రీకరుఁడౌ మహేశ్వరుఁడు ♦ చెందుదు రీరలు తత్ప్రసాదమున్. 259

గీ॥ అట్టిసమయమునగ్గతి ♦ సభనకృపను, మీరలిక దక్షిణంబగు ♦ మేరుశిఖర
మునకుఁ జేరుఁడు మామక ♦ పుత్త్రుఁడౌస, సత్కుమారుండ చటనుండు ♦ నందికొఱకు.

—* బ్రహ్మ సనత్కుమారుని శాపమోక్షము తెఱఁగు చెప్పుట *—

చ॥ శివుఁడును మున్ను నాకొమరుఁ ♦ జేరఁగవచ్చినఁ జూచి నాతనూ
భవుఁడు భ్రమంబుఁ జెంది గరు ♦ వంబున వందనపూజనాదికా
ర్హవిధుల సల్పకున్నఁగని ♦ యక్కట తండ్రుఁడు గిన్కమేటిలా
టైవయి చరింపుమిందని క ♦ ఠిందెరయుంబున శాపమిచ్చెఁడున్. 261

గీ॥ పుత్రుఁడు క్రిమేళకంబయి ♦ పొగలుచుండ, నే మహాదేవు ♦ సంబను నిష్ఠఁగొలిచి
నందినిన్ బుజ్జగించి నా ♦ నందనునకు, నుష్ట్రతను బాపితి స్వమూర్తి ♦ నొందెనతఁడు

ఉ॥ అత్తఱి దేవదేవుఁడు మ ♦ హాదృతి నందినిఁ జూచిపల్కె ధీ
రోత్తమ! బ్రహ్మపుత్త్రుఁడితఁ ♦ డుల్లమునన్ ననుఁబోల్చ లేక కిం
చిత్తుపరాకుఁజెంది యిటు ♦ శిక్షితుఁడయ్యెనిఁకన్ మదీయ భా
స్వత్తరతత్త్వమున్ దెలుపు ♦ చక్కని శిష్యుఁడునీకుఁ జేకుఱున్. 263

గీ॥ ఇట్లు నందికిఁజెప్పె మ ♦ హేశ్వరుండు, నందియును జిత్తమందు నా ♦ నందమొంది
విభుని యాజ్ఞతలన్ దాల్చి ♦ వేగనిటకు, రాఁగడఁగియుండెనీలోన ♦ వేగమీరు. 264

గీ॥ నాదుసెలవున నందిప్ర ♦ సాదమొంద, నందుఁ దపియించుచున్న నా ♦ నందనుఁడుస
నత్కుమారుని కడకేగి ♦ నందికేశ, బోధలను వినుఁడిఁక మీఁద ♦ మునితిలకులు! 265

—* నైమిశమునులు స్కందసరోవరంబుఁ జేరుట *—

వ. దానమీకచిరంబుగ శివప్రసాదంబు సమకూరుననుటయు నవ్వారలు సుమేరుదక్షిణంబందలి కుమారశిఖరమ్మునఁ దనరు నమృతాచ్ఛస్వాదుశిశిరాగాధజలపూరకంబును సర్వర్తుస్ఫుటకుసుమమంజరీరంజితానేకతరువాటికాచ్ఛాదితాఖిలదిఙ్ముఖంబును, పరితస్సంఘటితాయతవిభాస్వరస్ఫాటికోపలవేదీవిరాజితంబును స్థూలనీలశిలామయసుఖావతరణారోహావిలసితంబును గాంచనారవిందసంచయానేకకుముదేందీవరసుందరంబును, తరంగదుత్తుంగాభంగతరంగసంశోభితంబునునగు స్కందసరోవరంబుఁగాంచి యందు. 266

సీ॥ ఒకచోటమునుఁగుచు • నొకచోటఁ దేలెడు, గజయూథపతులన • క్కజముగనుచు
నొకచోటఁ బెద్దావ • నొందిబల్ పరువుల, బరతెంచు లేళ్ళ యా • తురతిఁగనుచు
నొకచోటఁ దటమున • నుత్ఖాతకేళుల, నొనరించు వృషముల • యొప్పుఁగనుచు
నొకచోట నుదకంబు • నొందియచ్చటినుండి, వెడలెడు సెమ్ముల • వేడ్కఁగనుచు
గీ॥ నొక్కచోనవగాహంబు • లొంది దేవ, మునిపితలతర్పణము సేయు • మునులగనుచు
నొక్కచోనంచపిండుల • నొక్కచోటఁ, గోకములమూఁకఁ గనుచుబల్ • కుతుకమునను

వ. అన్వేషింపుచుఁ జని సరోవరోత్తరతీరంబందుఁ గల్పవృక్షంబునీడను వజ్రమయ వేదియందు మృదులంబగు మృగచర్మంబందుఁ గూర్చుండియుండిన వాని నప్పుడే సమాధినుండి బహిర్గతుండయినవాని యోగీంద్రులగు పలువురు మునీంద్రులచే సేవింపఁబడుచున్న వానిఁ గుమారాకారుని సనత్కుమారమునినిఁ గన్గొని ప్రణతులై తత్ప్రశ్నంబుననుసరించి తమ వచ్చినకతంబుఁ జెప్పుచున్నంత నాకసంబునందు దివ్యలలనాగానవాదిత్రలతో భానుసన్నిభంబగునొకవిమానంబు దోఁచి యందు గణేశ్వరబృందంబులతోఁ బరివేష్టితుఁడై సేవింపఁబడుచున్న సుకీర్తిప్రాణవల్లభుం డపరహారుండు పొడసూపిన సనత్కుమారుండెదుర్కొని జోతఁగావించి సముచితార్చనలఁ బ్రీతుఁజేసి దోయిలొగ్గి షట్కులీయులగు నైమిశమునులు బ్రహ్మానుజ్ఞఁ జేఁ దమయనుగ్రహార్హులై వచ్చిరని చూపిన నద్దేవుండు సనత్కుమారునినుడు లాలకించి దృష్టిపాతమాత్రంబున మునులపాశంబులఁ ద్రెంపివేసి యైశ్వరంబగు శివజ్ఞాన యోగంబు సనత్కుమారునితోఁగూడ మునులకొసంగి జపధ్యానములతోఁ దిరుగ శివసన్నిధానంబున కేగెననుడు శౌనకాదిమునులు సూతున్ గాంచి మహాత్మా! నందికేశుండు సనత్కుమారునకును షట్కులీయమునులకుఁ జెప్పిన శివ జ్ఞానయోగంబందలి ముఖ్యసారంబు మా కెఱింగింపుమనిన సూతుండిట్లనియె. 268

—* నందికేశుఁడు చెప్పిన ముఖ్యసారము లింగధారణము *—

గీ॥ వినుఁడు జ్ఞానసారంబును • విమలమును బవిత్రమునునగు శివలింగ • వితతధార
ణముఁ గుఱించి వచించెను • నందికేశుఁ, డెఱుఁగుఁడీ యదిమీరు మా • నీంద్రులార!
గీ॥ భ్రమరసంగతిఁ గీటంబు • భ్రమరమైన, కరణి శివలింగసంగతిఁ • గాంచి జీవుఁ
డభవుఁడగు నిట్లు శ్రుతిచెప్పు • హరివిరించి, ముఖులుశివలింగధారణం • బునుబడసిరి.
క॥ మఱియున్ గౌతమముఖముని, వరులును దిక్పాలకులును • వాసిగఁ బాణిన్
శిరమునఁ బవిత్రమనుచును, హరువుగ శివలింగమొంది • రరయుఁడు తపసుల్! 271
వ. ఆ లింగధారణంబునందును.
గీ॥ స్ఫాటికంబును బాణంబుఁ • జంద్రకాంత, మయమునుఁ దినమణికాంత • మయము హేమ
రౌప్యకృతమును శ్రీగిరి • గ్రావకృతము, నైన లింగంబు ధరియింప • నగును మునులు.
వ. తక్కినవి పూజనీయంబులుగావు. మఱియును.

